‘తెనుఁగులెంక’ తుమ్మల

# సమగ్ర సాహిత్యము – 1

బాపూజీ

# ఆత్మకథ

ప్రచురణ

తుమ్మల శతజయంతి ఉత్సవ సంఘము

గుంటూరు

బాపూజీ **ఆత్మకథ**
తెనుఁగులెంక తుమ్మల సీతారామమూర్తి

**తుమ్మల శతజయంతి ప్రచురణ**
24 డిసెంబరు, 2001



మూల్యము : **రూ. 100/-**

ప్రతులకు :

1. **డా॥ కొండబోలు బసవపున్నయ్య**
   1, నలందానగర్, రింగ్‌రోడ్
   గుంటూరు
   ఫోన్ - 350461

2. **తుమ్మల శ్రీనివాసమూర్తి**
   విద్యానగర్, నిడుబ్రోలు - 522 124
   ఫోన్ - 46567

3. **తుమ్మల నారాయణ**
   305, స్వగృహ మోతీ అపార్ట్‌మెంట్స్
   మోతీనగర్, హైదరాబాద్ - 18
   ఫోన్ - 3834437

ముద్రణ :

**శ్రీలక్ష్మి ప్రెస్**
14/2 అరండల్‌పేట, గుంటూరు
ఫోన్ - 230643

# తుమ్మల శతజయంతి ఉత్సవ సంఘము

## గుంటూరు

గౌరవాధ్యక్షులు

**శ్రీ వై.వి. రావు**

పార్లమెంటు సభ్యులు

అధ్యక్షులు

**డా॥ కొండబోలు బసవపున్నయ్య**

ఉపాధ్యక్షులు

**శ్రీ పోలిసెట్టి ఏకనాథగుప్త**

**శ్రీ పొన్నెకంటి హనుమంతరావు**

కార్యదర్శి

**శ్రీ కాకరపర్తి వెంకటేశ్వర్లు**

కోశాధికారి

**శ్రీ పాలడుగు లక్ష్మణరావు**

కన్వీనర్

**డా॥ ముద్దన హనుమంతరావు**

తెనుఁగులెంక తుమ్మల

# సమగ్ర సాహిత్యము

మొదటి సంపుటము ప్రచురణకు

**భూరి విరాళము లొసగిన**

వదాన్య శేఖరులు

## శ్రీ చేబ్రోలు హనుమయ్య

**గుంటూరు**

**కీ.శే. శ్రీ కామేపల్లి వెంకట్రామయ్య గారి**

**జ్ఞాపకార్థం, వారి కుమారుడు**

## డాక్టర్ కామేపల్లి రత్నబాబు

**గుంటూరు**

# శతజయంతి సమర్పణ

తిక్కన పలుకుబడులను పుణికిపుచ్చుకొని తెనుఁగుదనమును రంగరించిన తమ కవితలో గాంధీయమును వెలయించి ధన్యజీవులైనవారు తెనుఁగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు జీవితమంతయు నైతికములయిన విలువలకే మీదుకట్టిన మహనీయుఁ డాయన రాష్ట్రసిద్ధి కొఱకు రక్తమ్ము గార్చిన గాంధికవి బడలి బడలి తల్లి బాసకూడెము సేసిన దేశికవి, మేడిబట్టి నాగలి దున్నిన కర్షక కవి

అమరజ్యోతి యగు గాంధీ సంపూర్ణ జీవితచరిత్రను మహావీరకావ్యాలుగా తీర్చిదిద్ది మహాత్ముని ఆస్థానకవి యని పేరొంది, సిసలైన గాంధీ అనుయాయిగా బ్రతుకును పండించుకొనిన మహనీయులు తుమ్మల వారు. చక్కని చిక్కని తెనుఁగుదనపు గుట్టు తెలిసి, నుడికారమునకు మారుపేరైనది తుమ్మలవారి సాహిత్యము. తెలుగుసీమ పల్లెపట్టులు కన్నులకు గట్టినట్లు చిత్రించిన మేటి కైసరులు వారు. మాతృభాషాభిమానము, ఆంధ్రరాష్ట్రాభిమానము వీరి కావ్యములకు జీవగఱ్ఱలు. జీవితము వేఱు, కవిత్వము వేఱు అని వారేనాడును భావింపలేదు నీతిని ఊతగా గొని బ్రతికిన వారికి మాత్రమే తమ కృతులను అంకితమొనర్చి కృతార్థులైనారు

మేనెంత నలగినను, తమ మనుగడ లోకసేవనమ్మున కొసంగి, నవ్య భవ్య కవితా సృష్టి ద్వారా సామాజిక కల్యాణము కామించిన తుమ్మలవారి శతజయంతి ఉత్సవమును (25-12-2001) పురస్కరించుకొని వారి సమగ్ర సాహిత్యమును సంపుటములుగా ప్రచురింపదలపెట్టినాము ఈ బృహత్కార్యము వ్యయసాధ్యము. అయినను గుంటూరు నగరమునను, ఆంధ్రదేశమందంతటను గల సహృదయశేఖరులు తెనుఁగులెంకపై గల అపారమైన ఆదరాభిమానములతో భూరి విరాళములొసగి ఈ కార్యమును సఫలీకృతము చేసినారు.

వీరెల్లరకు మేము కృతజ్ఞతాంజలి ఘటించుచు తెనుఁగులెంక సమగ్రసాహిత్యమును ఆంధ్ర పాఠకుల కరకమలములందు అర్పించుచున్నాము.

ఇట్లు

**డా॥ కొండబోలు బసవపున్నయ్య**

అధ్యక్షులు

**తుమ్మల శతజయంతి ఉత్సవ సంఘము**

గుంటూరు

# కృతమెఱుక

తెనుఁగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి దాదాపు ఇరువదియైదు వేల పద్యములు విరచించినారని ప్రతీతి. అంత విస్తృతమైన తుమ్మలవారి సమగ్రసాహిత్యమును ప్రచురించుట అలఁతిపని కాదు. ఆత్మకథ, మహాత్మకథ అను మహావీరకావ్యములు వీరి రచనలలో సాఁబాలు నాక్రమించుచున్నవి. కనుక వానిని వేఱు వేఱు సంపుటములుగా ముద్రించితిమి

తుమ్మలవారి ఖండకావ్యములన్నిఁటిని మఱి రెండు సంపుటములుగా వింగడించి ప్రచురించితిమి. వారి కైతలోని క్రమవికాసము తేటపడుటకు వీలగు విధమున ఆ ఖండకావ్యములను కాలానుపూర్విగ కూర్చి వెలువరించితిమి. ఇట్లు వారి రచనలు మొత్తము నాలుగు సంపుటములుగ తేఱినవి. మొదటి సంపుటము – ఆత్మకథ, రెండవ సంపుటము – మహాత్మకథ, మూడవ సంపుటము – ఖండకావ్యములు, నాలుగవ సంపుటము – ఖండకావ్యములు

ప్రచురితములైన వారి తొలి రచనలలో 'నామదేవచరిత్రము' అను హరికథ లభింపలేదు. రామశతకము, రామలింగేశ్వరశతకము, మహాత్మాగాంధి తారావళి, రామకృష్ణస్మృతి, మాహేంద్ర జననము – అను గ్రంథముల నెట్లో సంపాదించి ఇందు చేర్చితిమి.

చక్కని చిక్కని తెనుఁగుదనము తొణికిసలాడు తుమ్మలవారి కవిత్వమును ముద్రించు పట్టున ప్రూఫ్ సరిచూచుట పండితజనైకసాధ్యము. ఈ మొదటి సంపుటమునకు ప్రూఫ్ సరిచూచిన శ్రీ సుఖవాసి మల్లికార్జునరాయశాస్త్రి గారికి కృతజ్ఞత వెల్లడించుచున్నాము.

ప్రచురణలో తమ అమూల్యమైన సలహాలనిచ్చి తోడ్పడిన సుప్రసిద్ధ విమర్శకులు శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు గారికి, శ్రీ సూర్యదేవర రవికుమార్ గారికి, విద్వత్కవులు శ్రీ యార్లగడ్డ వెంకటసుబ్బారావు గారికి, కవివతంసులు శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు గారికి, శ్రీ తుమ్మల శ్రీనివాసమూర్తి గారికి ధన్యవాదములర్పించుచున్నాము.

సంపాదకులు

గుంటూరు
24-12-2001

**పులిచెర్ల సుబ్బారావు**
**వెన్నిసెట్టి సింగారావు**

# తెనుఁగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి
# జీవితం - కృతులు

**జననము :**

25-12-1901, కావూరు, రేపల్లె తాలుకా, గుంటూరు జిల్లా;
తల్లిదండ్రులు చెంచమాంబా నారయ్యలు.

**కుటుంబము :**

1930లో శ్రీమతి అన్నపూర్ణమ్మతో వివాహము. ఒక కుమార్తె, నలుగురు కుమారులు.

**గురువులు :**

శ్రీయుతులు కావూరి శ్రీరాములు, జాస్తి సుబ్బయ్య, తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి, దువ్వూరి వేంకటరమణశాస్త్రి.

**విద్య :**

ఉభయభాషా ప్రవీణ (ప్రథమశ్రేణి), ఆంధ్రవిశ్వవిద్యాలయము - 1930.

**వృత్తి :**

సేద్యము, తరువాత అధ్యాపనము; 1924-29 తిలక్ జాతీయ పాఠశాల - కావూరు, 1930-57 గుంటూరు జిల్లా బోర్డునందలి దుగ్గిరాల, బాపట్ల, నిడుబ్రోలు, అప్పికట్ల - ఉన్నత పాఠశాలలు, 1920-30 కాంగ్రెసు సేవ, శిక్ష - 1922.

**అభిమాన విషయములు :**

గ్రామజీవనము, గాంధీతత్త్వము, సర్వోదయము, ఆంధ్రాభ్యుదయము, తిక్కన కవితామార్గము, చిన్నయసూరి సిద్ధాంతము.

## కృతులు

**గాంధీకావ్యాలు** - ఆత్మకథ, మహాత్మకథ, అమరజ్యోతి, సర్వోదయగానము, గాంధీగానము, మహాత్మాగాంధీతారావళి.

**రాష్ట్రకావ్యాలు** - రాష్ట్రగానము, ఉదయగానము.

**ఖండకావ్యాలు** - పఱిగపంట, పెద్దకాపు, శబల, పైరపంట, సమదర్శి, కదంబకైత, చక్కట్లు, దివ్యజ్యోతి.

**కథాకావ్యాలు** - ఆత్మార్పణము, ధర్మజ్యోతి.

**సామాజికకావ్యాలు** - ఎక్కట్లు, సందేశ సప్తశతి.

**స్వీయచరిత్ర కావ్యాలు** – నేను, నాకథలు, తపస్సిద్ధి.

**వేదాంతకావ్యాలు** – గీతాదర్శము, భజగోవిందం, లక్ష్మీనృసింహస్తోత్రము, హనుమాన్ చాలీసా.

**నీతికావ్యాలు** – తెనుఁగునీతి, నీతికుసుమము

**స్మృతికావ్యాలు** – రామకృష్ణస్మృతి.

**శతకములు** – పురాంతకశతకము, రామశతకము, రామలింగేశ్వరశతకము

**జంగంకథలు** – బిల్హణీయము.

**నాటకాలు** – గిరిజాపరిణయము, హనుమద్విజయము, మాహేంద్రజననము

**హరికథలు** – అన్నదాన మహాత్మ్యము, సాత్రాజితీ పరిణయము, నామదేవచరిత్రము.

**సమ్మానములు**

1949 నిడుబ్రోలులో – గజారోహణము, గండపెండేరము, కనకాభిషేకము, సువర్ణకంకణము 1960లో అఖిల భారత తెలుగు రచయితల మహాసభ సత్కారము 1967లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వ ప్రదానము. 1969లో కేంద్ర సాహిత్య అకాడమీ బహుమానము, ఆంధ్ర విశ్వవిద్యాలయము "కళాప్రపూర్ణ" బిరుదుతో సత్కారము 1985లో నాగార్జున విశ్వవిద్యాలయము "డాక్టర్ ఆఫ్ లెటర్స్ (డి.లిట్)" బిరుదుతో సత్కారము. విశాఖపట్టణములో సహస్రచంద్రదర్శన మహోత్సవము. నెల్లూరు, అప్పికట్ల, ముక్త్యాల, తెనాలి, గుడివాడ, మద్రాసు, గుంటూరు, విజయవాడ మొదలగు తావులలో. 1987లో గుంటూరు, విజయవాడ పట్టణాలలో భారత ఉత్సవాల సందర్భంగా ఘనసన్మానం.

**జయంతి మహోత్సవములు** : 1952 నుండి పెక్కుచోట్ల

**బిరుదులు** : ఇతరుల దృష్టిలో "అభినవ తిక్కన", తన దృష్టిలో "తెనుఁగులెంక"

**నిర్యాణము** : 21-3-1990 అప్పికట్ల, బాపట్ల తాలుకా, గుంటూరు జిల్లా.

# మనవి

నేను 1920 నుండియు నోపినంతవఱకు బాపూజీ యడుగు జాడలలోఁ బయనించుచుంటిని. నాఁటంగోలెఁ గ్రమవికాసము నందుచున్న నాసాహితీ సామర్థ్యములను మహాత్ముని యాశయములకే యంకితముచేసితిని. 'ఆత్మార్పణ' మను కావ్యమును ఖండకావ్యములు మఱికొన్నియు నేతదనుభూతి జనితముల యని నుడువందగు.

1927 లో నా మిత్రుఁడు శ్రీ పోలిసెట్టి ఆదినారాయణగుప్త యానాఁడు వెలువడుచున్న గాంధిగారి యాత్మకథను నా దృష్టికిఁ దెచ్చి 'దీనిని బద్యరూపమున రచియించి నీ కవితాశక్తిని సార్థకపఱుచుకొనుట లెస్సగదా'యని నన్నుఁ బ్రోత్సహించెను. అది నా తలకు మించిన పనియని యప్పటికి జంకితిని. కాని గుప్తవాక్కులు నామనస్సులో మాఱుమ్రోఁగుచునేయుండెను.

1932 అక్టోబరు రెండవతేది నా కాణయాచియగు 'కావూరు'లో మహాత్ముని జన్మ దినోత్సవమునఁ బాల్గొంటిని. ఆ పవిత్రదినముననే యీ రచనకు న న్నంతర్వాణి ప్రేరేపించెను. నాఁడే కావ్యమునకు శ్రీకారముచుట్టితిని. 7-2-34 తో మొదటిపాలు పూర్తి చేసితిని. కాని మహాత్మునివంటి వాఁ డాఁచి తూఁచి వ్రాసికొన్న యాత్మకథను బద్యరూపమునఁ దీర్చుట దుశ్శక మనిపించినది. ఒకవేళ నెట్లో కృతకృత్యుఁడనైన నను నా పడిన ప్రయాస మీ గద్యయుగమున లోకమున కెంతదనుక నుపకరించునా యని లోలోన మథనపడితిని. కలమాఁపితిని, సరియ, వ్రాసిన దాని నేమి చేయవలయును? 1936లో నచ్చొత్తించి ప్రజలయెదుట నిడితిని. తెలుఁగు నాఁడు నాకృషిని గడుంగడు మన్నించెను, శ్రీరామలింగారెడ్డిగారి వంటి విద్వద్విమర్శకు లయాచితముగా నాకృతిని బ్రశంసించుచు వ్రాసినలేఖ నానిరుత్సాహమును బటాపంచము చేసెను. వెంటవెంటనే ఆంధ్ర - మద్రాసు - అన్నామలై విశ్వవిద్యాలయము లీ కబ్బము నాదరించుటయు నాసంతృప్తికి హేతువయ్యెను. మఱియు 1939లో నెల్లూరి వర్ధమాన సమాజ పక్షమున మాన్యశ్రీ తిక్కవరపు రామిరెడ్డిగా రీకృతికి జరిపిన సత్కారముతో నా యానందము మిన్నుముట్టెను.

ఎట్లయిన నాత్మకథను సంపూర్తిచేయవలయునని యపుడు తీర్మానించుకొంటిని. కాని యనారోగ్యస్థితింబట్టి ముందడుగు వేయలేకపోయితిని.

ఇట్లుండఁగా 1942లో నా కప్పికట్లయందు జరిగిన సమ్మానము నా కర్తవ్యమును గంటి యెదుటఁ బెట్టెను.

అపుడే మన్మిత్రులు శ్రీ నారు నాగనార్యకవిగారు వచ్చి యేది యెట్లున్నను నీవు బాపూచరిత్ర సాగించుట యవశ్యకర్తవ్యమని నొక్కిచెప్పుటయ కాక మరల నారంభము చేయించి మఱీ వెళ్ళిరి. పట్టుదలతోఁ దొమ్మిదినెలలు పనిచేసితిని, దాదాపు రెండవ మూఁడవ భాగములు ముగిసెను. అంతలో జగమెఱింగిన తెగులుగొంట నైతిని, రచన మూలఁబడెను.

కాలము గడచుచున్నది మూఁడు నాల్గేండ్ల మీఁదట శరీరమించుక చక్కఁబడియెను దీనికిఁ దోడు 1949 లో 'నిడుఁద్రోలు' నందఖిలాంధ్ర ప్రజాపక్షమున నా కవితా సరస్వతి కపూర్వ సమ్మానములు కనకాభిషేకాదులు జరుగుటతో నే నేనుఁగు నెక్కితిని ఆనాఁడు 'గౌరవ మిచ్చి పుచ్చుకొనఁగాఁదగినట్టిదియౌట' నీకృతిని బాపూజీ నమ్మినబంటునకు ఎర్నేని సుబ్రహ్మణ్యము గారి కా నిండుకొల్వులో నుడుగర కావించి కృతార్థుఁడ నైతిని పదంపడి శేషించిన గ్రంథముం దీర్ప నడుము కట్టితిని. స్వాతంత్ర్య పర్వమగు 26–1–51 తో నొద్దెక్కితిని. 2–10–32 మొదలిడిన యీ కావ్యమున కీనాఁటికి శాంతిపాఠము జరిగెను ఈ చేఁత కింత దీర్ఘకాలము చెల్లినను నిందు నా శ్రమించిన దినములు 554 మాత్రము

ఈ కృతి సంపూర్తి కింత విలంబనము జరుగుటలో నేను గొంత బాధపడినను దానికి మించిన యానందమును సైత మిపు డనుభవించుచున్నాఁడను మొదటి యూఁపులోనే యిది ముగిసినచోఁ గాలక్రమమునఁ బెరిఁగిన నా కవితా సంస్కారమున కిందుఁ దావుండెడిది కాదుగదా! నా కృతులన్నింట నుత్తమము, పవిత్రము నైన యీ కావ్యము నా సారస్వతానుభూతికి, నా తెనుఁగుఁదనమునకు మూదలగా రూపెత్తుట నాభాగ్యమని తలంతును.

ఈ నా రచనకు నాదరువైనకృతి పూజనీయులు వేలూరి శివరామశాస్త్రిగా రనువదించిన యాత్మకథ. ఇతరభాషానువాదములు కొంతవట్టు నాకుపకరించినను శ్రీ శాస్త్రిగారికే మిగుల ఋణపడితిని. వారికి వినయ పూర్వక ధన్యవాదము లర్పించుకొనుట నా కనిష్ఠ కర్తవ్యము.

ఇఁక మాననీయులు, విద్వత్సార్వభౌములు కట్టమంచిరామలింగారెడ్డిగారు – వీరి యాదరాభిమానములు నాపాలివి కానినాఁ డీ కృతి యిట్లు సర్వాంగీణ శోభతో వెలువడునది కాదేమొ!

అది నా యదృష్టము – వీరు 5–2–51 పీఠికను బంపిరి. 12–2–51 తమ ఛాయాపటము నంపిరి.

అది నా దురదృష్టము– వీన నాకుఁ గల్గిన యుల్లాస రేఖలు చివురుదొడుగుచుండఁగనే వీరు దివంగతులైరి. నా కెనలేని వేదనఁగూర్చిరి. సుఖదుఃఖాదికద్వంద్వము లెంత బలీయములు!

రెడ్డిగారు పరిపూర్ణులు. సమగ్రాకృతివహించిన నాకృతింజూడమి వీరి కొక కొఱంతకాదు, ఆ నష్టియంతయు నాయది.

ఎందఱెందఱో మిత్రులు నా కనేకవిధములఁ గావించిన తోడ్పాటుతో నే నీ సముద్రము నీఁదఁగల్గితిని. వారి కందఱకును గృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుకొందును.

విశ్వశ్రేయమున కీ నా యలంతికాన్క బాసటయై తెనుఁగుతల్లి కొక పూజాపుష్పమై నన్ను ధన్యుని గావించుఁగాక!

అప్పికట్ల
1–3–51

వినీతుఁడు
తుమ్మల సీతారామమూర్తి చౌదరి

# తిలకరచన

భాషతో సమన్వయించిగాని భావ ముండదు భావమును భాషయు నిరంతర సంయుక్తములు. కవి కాళిదా సన్నట్లు సర్వదా సమ్మిళితములు "వాగర్థా వివ సంపృక్తౌ"- మఱియు నొకవిశేషము, ఒకప్పుడు స్వచ్ఛందముగా ప్రభవిల్లిన భావమును కాలాంతరమున వేఱువిధమైన భాషచే ప్రదర్శింపఁ బూనుట యవివేకము. అవి నిరంతరైక్యమును జెందిన యేకప్రకృతి. పునశ్చరణ సాధ్యమే కాని వేఱుపదముల చేతను వేఱువిధముల చేతను బ్రయోగింప సాధ్యము కాదు. అనఁగా అదిమమును అఖండమును నైన స్వారస్యము చెడనిరీతిని.

తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు 1936వ సంవత్సరమున మహాత్ముఁడైన గాంధిగారి స్వీయచరిత్రమును తెనుఁగునఁ బద్యరూపమునఁ గొంతభాగమును బరివర్తించి ప్రచురించిరి. నేఁడా మహనీయచరిత్రమును పూరించియున్నారు ఈ సంపూర్ణమైన గ్రంధమునకు పీఠిక వ్రాయవలసినదిగ నన్ను కోరిరి. ఇట్టి కోరిక లాజ్ఞలతో సమానములు, విషయము లోకోత్తరము. కవిత్వము అప్రతిమానము. కావున సమర్థత చాలకున్నను ఉల్లంఘింప నేరక యంగీకరింప వలసినవాఁడ నైతిని.

ఇరువదవ శతాబ్దపు టాదిని ఉత్తమశ్రేణికిఁ జెందిన యాంగ్లగ్రంధకారులలో మార్లీప్రభువుగా రొక్కరు. వారి యాదేశ మే మనఁగా ఇట్టిసందర్భములందు మొట్ట మొదట స్ఫురించిన భావములనే ఆ భాషలోనే తెలుపుటయ సరియైన పద్ధతి యని. ఆ భాషాభావములకు తర్జుమాలను సృష్టించుట అకృత్రిమత్వమునకును పరిపూర్ణసరసత్వమునకును భంగ మాపాదించుట. కావున పూర్వము వ్రాసిన నా యామోదలేఖలు పత్రములు మొదలైనవానినుండి వాక్యములను సంగ్రహించి యీ పీఠికను గూర్చి కవియొక్క కంఠమునకుఁ బుష్పహారముగ సమర్పింతును. అనుగ్రహించి కైకొందురు గాక!

1937వ యేప్రిల్ నెల రెండవ తేదిని అప్పటికిఁ బ్రచురింపబడిన ఆత్మకథాభాగము చదివి తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి కీరీతిని వ్రాసినాఁడను

"తమచే రచియింపఁబడిన 'ఆత్మకథను' జదివి ఆశ్చర్యమును ఆనందమును జెందితిని. విషయము గాంధిమహాత్ముని స్వీయచరిత్రము. లోకారాధ్య మైనది. సర్వజనాదరణీయమును సేవ్యమును. తమ శైలి యించుమించు ఆంధ్ర మహాభారత ప్రతిబింబము. ఇంతకంటె నెక్కువగాఁ జెప్పుటకు సాధ్యముకాదు. అవసరమును లేదు.

పూర్వమట్లు నేను ప్రకృతము తఱచుగ గ్రంధములఁజదువుటలేదు. కాలము కఱవు. శక్తియు తఱుగుడు స్థితిలో వ్రాలినది. అవధానము నానా ముఖములఁ బ్రవర్తిల్ల జేసితి నేని ముఖ్య కార్యములకు ముప్పు వాటిల్లును. కానఁ బంపిన పుస్తకముల నన్నింటిని జదువుట నాకు

సులభముగాని గుణముగాని కానేరదు. అ ట్లున్నప్పటికిని మీ గ్రంథము – దానియొక్క ఆకర్షణ శక్తి చేత – నన్ను వదలనిచ్చినది కాదు. చదివి యానందించునట్లు చేసినది

మీరు ధన్యులరు మాతృభాషయొక్క సుకృతముల ఫల మనఁదగిన కావ్యమును, పూజనీయ మైన విషయశోభితమును తదనుగుణమైన రీతిని వ్రాసి స్థిరయశస్సు గాంచిన కవులని మిమ్ము ఆయాచితముగఁ బ్రశంసించి నా కుతూహలమును తమకు నివేదించుచున్నాను ”

1949వ సంవత్సరమున వీరికి ఆంధ్రులు కనకాభిషేకాది సమ్మానములు చేసి తమ కృతజ్ఞతను సార్థకపఱుచుకొని కృతకృత్యులైరి. ఆ మహోత్సవమునకు అధ్యక్షుఁడనై ప్రసంగింపవలసిన భాగ్యము, భారము నాయదిగా నుండెను కాని కాయమునకు సంబంధించిన కారణములచేత ఈయశస్సు నాకు లభింపదాయె. అయినను నాయందు వారికిని ఆంధ్రులకును గల అవ్యాజాభి మానముచేత నాయుపన్యాసమైనను బంపవలసినదని కోరి, దానిని అధ్యక్షోపన్యాసమని స్వీకరించి ప్రకటించిరి. ఆ ప్రకటనను ఈ పీఠికయందు పొందించుటకంటె నితరవిధముల నా భావములను ప్రచురముచేయలేను అనఁగా న్యూనత లేనివిధమున.

“శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారియెడ నాకు గౌరవాభిమానము లెక్కువ వారియొక్క కృతిని గాంధీగారి యాత్మకథను జదివినప్పుడు నాకుఁగల్గిన యానాందాశ్చర్యములకు మేరలేదు. అప్పుడు వారితో నాకుఁ బరిచయము సున్న. వారిపేరైన విన్నవాఁడను గాను. అయిననేమి? ‘నిక్కమైన మంచినీలము” చూపు తోడన హృదయము నాకర్షించును. స్వయంప్రకాశమున్నచోట దూతికలేల? ఒకరు చెప్పి చూపవలయునా? “కనులుండినఁ గాంత సొగసు కనఁబడదొక్కో” అట్టివస్తువుల యెడను, వ్యక్తులయెడను మెప్పు స్వయంభవము.

గాంధీగారి యాత్మకథను జదివినవెంటనే శ్రీ చౌదరిగారికి నాయొక్క మహదామోదమును దెలుపుచు లేఖ వ్రాసితిని. వా రడిగికాదు. ఒకరి ప్రేరణ మీఁదఁగాదు. అనివార్యమైన స్వేచ్ఛమై.

నాఁటినుండి నేఁటివఱకు వారికవిత్వమునెడ నాకు నుండు గౌరవభావమును, దానినుండి నేఁబడయు హృదయాహ్లాదమును దినదిన ప్రవర్ధమానము లగుచున్నవి. పరిమితిలేదు. అమితత్వదోషమును లేదు. కొనసాగుచున్నదిగాని కొననంటలేదు.

నిజమైన కవిత్వముయొక్క గుణములలో నిది యొకటి. ఎన్నిమార్లు చదివినను విసుగుపుట్టదు. క్రొత్తక్రొత్త రసములు స్ఫురించును. ఎంతదినిన నాఁకలి తీఱదు. రోయింపు పుట్టదు. ఇంకను దినఁగోరుదుము.

వీరి గ్రంథములయందెల్ల నాత్మకథ యగ్రగణ్యము. తక్కినయవి సామాన్యములు కావు. కాని వానియందలి విషయములు గాంధీగారిజీవితముతోఁ దులఁదూఁగఁజాలినంత గొప్పవికావని నాయభిప్రాయము. శైలికిఁ దగినట్లు విషయ ముండవలయును, లేనిచో నది పదాడంబర ప్రకటన మగును. విషయమునకుఁదగినట్లు శైలి యుండవలయును. లేనిచో జీవముండినను నాకృతిసౌందర్య ముండదు. రసవంతము కానేరదు. ఆకర్షింపదు. ఆత్మకథయందు రచన

మనోహరము  గాథ లోకోత్తరము. ఇంత ప్రశస్తముగ రెండును దక్కినగ్రంథములలో నలవడెనో లేదో నేను దృఢముగఁ జెప్పఁజాలను  దేశభక్తి, ఆంధ్రాభ్యుదయరక్తి, పితృపూజ – యివన్నియు మనజీవితమున నఖండములైన జ్యోతుల! వాని వెలుఁగుచే మనల నావరించియుండు తమము కొంతకుఁగొంత విరియును. అయినను వీనికిని మించిన యితివృత్తములు లేకపోలేదు. యావన్మానవుల యాత్మలను బరవశములఁజేసి హృదయము నగలించి మనసులకు నిశ్చైతన్య మొసంగెడు కావ్యములు, భారత రామాయణముల వంటివి పుట్టవా యిఁక ముందు? హైందవ భావనాశక్తి యడుగంటి యింకిపోలేదు. దేశమునకు స్వతంత్రపరిపాలనాభాగ్యము సంభవించినది. ఈ గొప్పదశకుఁ దగినట్టి వీరకావ్యములను వ్రాయఁజాలిన వారలలో సీతారామమూర్తి యున్నాఁడా? లేఁడా? ఉన్నాఁడని నానమ్మిక  నానమ్మిక వమ్ముచేయఁడనియు నావిశ్వాసము  సీతారామా! విశ్వాసఘాతుకుఁడవు కాకుము.

మనచౌదరి యతిప్రాసములకై భంగపాటు చెంది తలగోఁకికొనుచు బలాత్కార పద ప్రయోగములచేసి, యర్థము ననుసరించి పదములు వాడక, పదములఁబట్టి యర్థమును వంపులు పెట్టి వంగఁజేయు నీరసుఁడుగాఁడు  భావ మనర్గళముగఁ బ్రవహించుచందాన వ్రాయు మహనీయుఁడు, యతి పదాదియందేకాక మధ్యముననను గొనను వ్రాలును, ప్రాసమునకు, యతికినై పద్యముయొక్క నడక నిలిచి దాఁటవలసిన యిబ్బందిలేదు. అర్థమునుబట్టి పదములు, పదములలో లీనమైనరీతిని యతిప్రాసములు ననాయాసముగ, నప్రయత్నముగ, స్వచ్ఛందముగ వచ్చిచేరుచుండును. ఈ సిద్ధియందుఁ బ్రసిద్ధుఁడు తిక్కన, ఈ వర్గమునఁ దిక్కన్నతో సజాతీయుఁడైన వాఁడు మనచౌదరి. అనఁగా సరిసమానుఁడని యతిశయోక్తిఁ బలికి యపాయము దేను, ఆవర్గమున నగ్రాసనత్వము లేకున్నను ఆసనత్వము కలవాడఁని నామనవి.

నన్నయ సాంస్కృతిక దీర్ఘసమాసముల వెదచల్లినాఁడు భారతములో, కాని యవి యన్వయ సౌకర్యము నర్థసౌలభ్యమున సాధారణమైన పదములకంటె నేమాత్రము కఠినములు కావు. మఱి యవన్నియు శ్రావ్యములు; సరళములు; పామరులకు సయితము సులభవేద్యములు కాఁగలవి. మనచౌదరియు నిట్టిసమాసముల రచించుటయందును నిజముగ భారతీయుఁడ! నన్నయ యందుఁ బోలెఁ బేరునకు మాత్రము సాంస్కృతికములు; నిజమున కాంధ్రములు, కవితాకళలో నద్భుతానందముల సమకూర్చునంశములలో నిదియొకటి, ఎఱ్ఱనయుఁ దిక్కనయు నన్నయ్యకు నీడుజోడులే యీ మహత్తరశక్తిని వారువ్రాసిన దండలకు నర్థమగుటకొఱకు. అందఱమనసులు కరఁగుటకునై  ఆ సంప్రదాయము నుద్ధరించిన యాధునికుఁడు సీతారామమూర్తి"

ఇప్పుడు గాంధిగారి స్వీయచిత్రమును పూరించి ప్రకటింపనున్నారు మన తుమ్మల సీతారామ మూర్తి చౌదరిగారు. బ్రిటీష్ వారి పరిపాలనాయుగమునకంటె నిప్పుడింకను గొప్పగ దేశసేవ నిర్వర్తింపవలసిన బాధ్యత మనది. తప్పితిమా యిప్పుడు లభించిన స్వాతంత్ర్యము శాశ్వతముగా నిలువఁజాలదు. మనకు శత్రులోపము లేదు. ఎప్పుడు నుండఁబోదు. బహిశ్శత్రువులు వాకిటనే యున్నారు. అంతశ్శత్రువు లింటిలోనే యున్నారు. ప్రజలు క్షామపీడితులు. నిరుత్సాహమును

గల్గించు హేతువు లనేకము లున్నవి అధైర్యపడిన లాభము లేదు. ఐకమత్యమునకు, పరస్పరోప కారమునకు, దేశసేవకు, ధైర్యప్రకటనకు నిదియ సమయము, స్వరాజ్యము వచ్చిననాఁడె రాజ్యము యొక్క విస్తీర్ణత తగ్గవలసివచ్చెను. కష్టముచేత వచ్చినది స్వాతంత్ర్యము. నష్టముతోఁగూడ. ఇఁక మహోత్సాహములకు, మహనీయమైనకార్యదీక్షకుఁ బురికొల్పు గ్రంథములలో నీయాత్మకథకు మించినది ఈ దేశమున, ఈ కాలమున మఱియొండు లేదు సరస్వత్యారాధనతోడ దేశారాధన మును జేసి శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి ద్విగుణీకృత కృతకృత్యుఁ డైనాఁడు. మనకు రెండింతలు మేలు చేసినాఁడు. కావున వారియెడ మనకు కొండంత గౌరవము, కృతజ్ఞతయు నుండుట సహజము.

**తుమ్మల సీతారామమూర్తి మహాత్మునియొక్క ఆస్థానకవి. ఈ స్థానము శాశ్వతము.**

విశ్వవిద్యాలయము
మైసూరు-
5-2-1951

కట్టమంచిరామలింగారెడ్డి
అపరాధ్యక్షుఁడు



# లఘుటీక

అడితి – కమీషను

అడితి బొక్కసము – బ్యాంకు

అవరోధ మర్యాద – ఘోషాపద్ధతి

అవిరిపడవ – స్టీంలాంచి

ఉల్ల – నమీపస్థతం దెల్పునది

ఏను– సూర్యబింబము

కట్టు – కరినము, పూర్ణము

కామక– తప్పక

కుతి – లాలస

కుప్పవాఁడు – పాకీవాఁడు

కృతమెఱుఁగుట – కృతజ్ఞత

కెంగడలి – ఎఱ్ఱసముద్రము (రెడ్ సీ)

గావంచా – అంగవస్త్రము

గోడగది – అల్మారా

చంపు – చంపుట, హింస

జగాపాడిపట్లు – హైకోర్టు

దెక్కు – ఓడపైభాగము

తగవరి – న్యాయాధికారి

తగవాటరి<br>తగవాడువాఁడు } – ప్లీడరు

తీన్కరియా – 3/20 వంతు ప్రంట నూరక భూస్వామికిచ్చుపద్ధతి

తీర్పునెలవు – కోర్టు

ధర్మదాత – న్యాయాధికారి

నచ్చు – రుచించు

నాప – అసమర్ధుఁడు

నిత్యవృత్తము – దినచర్య

నుడితీర్పు – వ్యాకరణము

నెఱపాడిపట్టు – హైకోర్టు

పాడిపట్టు – కోర్టు

పాడిపల్కరి – వకీలు

ప్రెగడనము – మంత్రిత్వము (ఒజ్జనమువలె)

బృహన్నాళిక – ఫిరంగి

మకరార్కము – సంక్రాంతి

రాకరాముల పట్టిక – అటెండెన్సు రిజిస్టరు

లఘునాళిక – తుపాకి

వాణిజ్యకోశము – బ్యాంకి

శార్మణ్యము – జర్మనీ

శాస్త్రగురుపట్టము – ఎం.ఎ. డిగ్రీ

శివమూర్తి – శివలింగము

సవి – అని (ఇత్యర్థకము)

శాసనములంబట్టి దేశవాచియగు 'నాడు' 'నాఁడు' గావ్రాసితి.

నేటాలు, ఆఫ్రికా – ఇవి దక్షిణాఫ్రికాకును వాడితిని.

హిందువులు, హైందవులు – ఇవి భారతీయులకును వాడితిని

# విషయసూచిక

## మూడవ భాగము



## నాల్గవ భాగము



శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యం

# అర్చన

శా. ఈపూజాప్రసవంబు నందుకొనవోయీ! నూన్నృతాహింస లీ
రూపుం గైకొనివచ్చె నార్తజనతా రోచిష్ణుతా కాంక్షమై
బాపూజీ మనవేల్పు దీని నిచటన్ బండించె విశ్వప్రజా
పాపచ్ఛేదకమైన పంట యిది సుబ్రహ్మణ్య! నీపాలురా! 1

మ. అసదాచారులు శాత్రవుల్ పశుబలాహంకార మేపార నల్
దెసలం బేర్చిననాఁడు దేశికుని గాంధిన్ గూడి సత్యాగ్రహం
బసిగాఁగైకొని దండిరంగమున శౌర్యజ్యోతివై జాతిమా
నసమున్ దోఁచిన మేటిమానిసికి నన్నా! నీకు జోహారువుల్. 2

శా. ఏదో పొంగొకనాఁడు రేఁగి ప్రజకై యే వీసమో దయ్యువా
రీదేశంబున నెందఱో కలరుకానీ! జీవితంబెల్ల సే
వాదీక్షన్ నడిపించుపుణ్యులు కృపావారాన్నిధుల్ కానరా
రేదేశంబునఁ జూచినం బలువు రో యెర్నేని! యుష్మాదృశుల్. 3

ఉ. ఈచతురబ్ధిముద్రితమహిన్ మతిసేయవు, నాకభోగముల్
నాఁచికొనందలంప, వపునర్భవమొల్ల, వనంత దుఃఖ రే
ఖాచితమైన లోకము సుఖంపడఁ గోరుదు వెల్లకాల, మీ
నీ చరితమ్ము వెన్నెలలు నించెనురా! హరిదంతరంబులన్ 4

ఉ. మీ గుడివాడసీమ నిరమిత్రుని బుద్ధుని ధర్మదుందుభుల్
మ్రోఁగిననాఁడు నెవ్వగల మున్గినపేదల ముక్తికై సుఖ
త్యాగమొనర్చి చన్న శుచితాఖని భిక్షుకరా జొకండు ప్రే
మాగమమూర్తి వెండియు బయల్పడెరా భవదాకృతిం గృతీ! 5

శా. ఓ సత్యాగ్రహి! నీ జగద్ధితగుణవ్యూహమ్ము నాలించుచో
నీ సౌజన్యము గాంచుచో నెదఁదలో నిండారు నా సాధు సే
వాసంసక్తికి లోఁగి పావనకథావాసద్వచోవైభవం
బీ సత్కావ్యము నీకొసంగితిని నా యీకాన్క మన్నింపవే! 6

మ. ఎపుడో వెల్గులుసూచె దీనితొలుపా, లేదేవుఁడో యద్దమై
యపు డా సృష్టి నిరంకితమ్ము గనె ముద్రాగారముంజేరె నీ
కిపుడీ సత్కృతి నింతశిష్టసభలో నీఁగల్గు యోగంబు నా
కుపభోగ్యమ్ముగ నుండ నన్యతర మేదో యెట్లు సిద్ధంపదున్. 7

ఉ. ఈ జగమందు సత్యము, నహింసయు నిల్చిన యంతవట్టు రా
రాజులు, మన్మసిద్ధు లపరాజితవైభవులేలు నాంధ్ర భా
షాజనయిత్రి భారతము నిల్చి పొల్చిన యంతవట్టు నీ
పూజకునైన పుష్పమిది పోల్చును బిల్చు నుదాత్తశీలురన్. 8

గీ. విత్తమున్ గొల్చుకొన సమర్పించుగాఁని
విత్తముం గొల్చుకొనఁ గృతుల్ వెట్టఁడీతఁ
దుత్తలంపడకుము వీని కుపద నేమి
నుత్తలంపట యేల కవ్యుత్తములకు. 9

చ. అది పదిమంది మెచ్చు పథమా యనిచూదక సందుగొందులన్
బ్రదికెడివారి భాగ్యములు పండినవా సమలోష్ట కాంచనుల్
సదమల ధర్మసేవకులు సంపదకున్ వెలియై కృశించిరా
ముదిరిన మోహముల్ పరమ మూర్ఖులకున్ విదరాని దయ్యముల్. 10

ఉ. గౌరవ మిచ్చిపుచ్చుకొనఁగాఁ దగినట్టిది యాట లోక సే
వారుచిరాత్మ! నీకు ననవద్యునకున్ మునుమున్న మల్లికా
హారమువైచి కబ్బమిడి యా వెనుకం గనకాభిషేక స
త్కారము లందుకొందుఁ గవితా కమనీయతపఃఫలమ్ముగన్. 11

# కృత్యాది

ఉ. ఎవ్వనికొల్వు భద్రముల కెల్ల నిదాన, ముదారతామయుం
డెవ్వఁడు సర్వలోకముల నేలు మహఃపరిపూర్ణమూర్తిమై
నెవ్వఁడు వాఙ్మనఃక్రియల కేర్పడరానిమహాత్ముఁ, డాద్యుఁడై
యెవ్వఁడెసంగు, సత్యమన నెవ్వఁడు వాని భజింతు నిచ్చలున్. 1

శా. వీరుల్ త్యాగులు దేశభక్తులు జగద్విఖ్యాతకీర్తి ప్రభా
శ్రీరోచిష్ణులు బుద్ధ శంకర శివాజీ గాంధి గంగాధరా
న్సారీ ముఖ్యులు పుత్రు లేజననికిన్ జన్మించి ర గ్గౌరవా
ధారన్ భారతమాత నెంతుఁ జరితార్థత్వంబు నర్థించుచున్. 2

సీ. భారతంబును బల్కు పనిఁ బూని తిక్కన్న, పసిడిగంటము కేలఁ బట్టునాఁడు
వేదభాష్యముఁ జెప్పువేడ్క విద్యారణ్యుఁ, డోంకారమును వ్రాయుచున్ననాఁడు
దిగ్జయాపేక్ష సంధిల్ల రాయలు విజృం,భించి దుందుభి మొరయించునాఁడు
సంఘసంస్కరణ దీక్షాకంకణంబును, రెడ్డివేమన్న ధరించునాఁడు
తే. వారల కొసంగినట్టి దీవలన నిచ్చి, వారలం గన్నకంట నింపారఁగాంచి
యాదరింపఁగదమ్మ నిన్నాశ్రయించి, యంజలి ఘటించుచున్నాఁడ నాంధ్రజనని! 3

శా. ఏశక్తుల్ తనకున్ననేమి పురుషుం డెబ్బంగి రాణించు నీ
యాశీర్వాదబలంబు లేనియెడ నంబా! యుష్మదీయార్చనా
వైశారద్యము గోరువాఁ డితఁడు నీవాత్సల్యసంపత్తిలో
లేశం బీతని కిమ్ము పాలు; కవితాలీలారతీ! భారతీ! 4

ఉ. ఈవిధి నాంధ్రవాణి భజియింపఁగ నాకు నెవండు ముందరన్
ద్రోవలనెల్లఁజూపి కడుఁ దోడ్పడె నగ్గురువర్యు సాహితీ
శేవధిఁ దత్త్వవిన్నికరశేఖరు భూరియశోవిభాసి మా
బావనుగొల్తు "జాస్తి" కులపావనుఁ జల్లయసుబ్బయాఖ్యునిన్. 5

శా. ఏకశ్లోకరహస్యబోధనముచే నెవ్వాఁడుఁ శిష్యున్ సుధీ
లోకాగ్రేసరుఁ జేయు నవ్విబుధుఁ గొల్తున్ వేంకటప్పార్యు న
స్తోకశ్లోకమయూఖరాజదఖిలాశున్ రామగాథామృతా
ఖ్యాకగ్రంథమతల్లికాజనకు మద్గైర్వాణ భాషాగురున్. 6

తే. శబ్దశాస్త్రాది లక్షణ సంప్రదాయ, మెవ్వఁ దెఱిఁగించె నాకు నయ్యిద్ధచరితుఁ
ద్రస్తుతించెదఁ బుంభావపద్మజాత, రమణి దువ్వూరి వేంకటరమణశాస్త్రి. 7

సీ. కాళిదాసకవీంద్రు గణుతించి శబ్దశా,సను మెచ్చి నన్నెచోదని భజించి
మదిఁ బాల్కురికి సోముఁ గదియించి తిక్కయ,జ్వను వేఁడి శ్రీనాథు సన్నుతించి
మొల్ల కంజలిపట్టి మూర్తి సత్కవిఁగొల్చి, యల చేమకూరవెంకన్నఁ బొగడి
చిన్నయసూరి నర్చించి వీరేశలిం,గార్యు వేదముశాస్త్రి నభినుతించి
తే. ఘనులు తిర్పతివేంకటకవుల కెరఁగి, విశ్వనాథకులాధ్యు భావించి కట్ట
మంచి రామలింగారెడ్డిమహిమ నెంచి,తలఁతు సూతపురాణకర్తను జయేచ్ఛ. 8

శా. ఆతంకం బెడపడ్డ సాహితిని హృద్యంబై రసాధారమౌ
కైతన్నేరిచి పండితుల్ కవులు సుంకంబిచ్చి మన్నింప వి
ఖ్యాతిన్ సూరపనేని వంశమణియై కన్పట్టు మన్మిత్రునిన్
సీతారామకవిన్ దలంతు గుణరాశిన్ జౌటపల్ల్యాశ్రయున్. 9

క. అల్లల్ల నన్నుఁ దెల్పుచు, గిల్లుచుఁ గృతిపూర్తిఁగని సుఖించుట కెదలోఁ
బె ల్లారటపడు నా మే,నల్లున్ నరసార్యు మెత్తు నంచితచరితున్. 10

తే. పండితశ్రేణి వేలుపుబాసమీఁది, తగులమునఁ జేసి తెల్గును దెగడునాఁడు
మాతృభాషను మన్నించి మనిపి నట్టి, వారి కర్పింతు మన్నమోవాకశతము. 11

గీ. మధురతాపూర్ణ కావ్యనిర్మాణచణుఁడు, నేలవేల్పైననేమి చండాలుఁడైన
నేమి పూజ్యుండపో యతఁ డెల్లవారి, కప్పకవి యీర్ష్యమై నెదో సెప్పెఁగాని. 12

ఉ. ఇంచుక నేర్పులేక సుకవీంద్రులకున్ బ్రజలిచ్చు మన్ననల్
గాంచఁగ నోర్పులేక కలకాలము కుందుచు వేఁడియూర్పులన్
నించెదు కింకవీశులకు నేరము లెన్నక భావిజన్మమం
దంచితమైన కైత నిడవమ్మ! నమస్య లివే సరస్వతీ! 13

వ. ఇ ట్లిష్టదేవతానమస్కృతియు గురుస్తుతియుఁ బురాతనాద్యతన కవిపుంగవ బహూకృతియుఁ గుకవినిరాకృతియుం జలిపి విశ్వేశ్రేయోనిదానమగు నొక్క కబ్బము విరచింపఁ గృత నిశ్చయుండనై మున్ముందు శిష్టసంప్రదాయమ్మును గొనియాడి యించుక మద్వంశానువర్ణనం బొనర్తు. 14

క. ధాత్రిన్ వెలసెను బూతచ,రిత్రం బరివీరశౌర్యరింఖణహేతు
క్షాత్రం బౌదార్యరమా, మిత్రంబై రాచకొల మమేయప్రభలన్ 15

తే. అమ్మహాకులవృక్షరాజమ్మువలనఁ, బెక్కుశాఖలు రూపెత్తి పిక్కటిల్లఁ
దెలుఁగుదేశమ్మునకుఁ జాఁగి దీర్ఘమగుచుఁ, గమ్మయనుపేరికొమ్మ యందమ్ముగులికె. 16

సీ. కుటిలశాత్రవకోటి గుండియల్ విదళించి, కడిమి సూపినవారు కమ్మవారు
చతురబ్ధివలయిత క్షితినెల్లఁ బాలించి, గణుతికెక్కినవారు కమ్మవారు
పారతంత్ర్యము పటాపంచముసేయఁ గం,కణము గట్టినవారు కమ్మవారు
నిరతదానత్యాగ నిరతులై దీనార్థి,గణము నేలినవారు కమ్మవారు
తే. కవితలన్నేర్పు గన్నారు కమ్మవారు, ఘనయశంబును గొన్నారు కమ్మవారు
కలిమికి న్నెలవైనారు కమ్మవారు, కరము చాఁపకయున్నారు కమ్మవారు. 17

క. తెలుఁగుంబుడమికి వెలుఁగుం, గలిగించిన వీరు లోరుగంటి మహీనా
థులు శ్రీప్రతాపరుద్రా,దులు వెలసిరి కమ్మవంశతోయధివిధులై. 18

క. ఆకమ్మకులమ్మునయం, దాకాశధునీ సుధాకరానంతనిభ
శ్లోకుఁడు రిపుభీకర ధా,టీకుఁడొగిం బుట్టెఁ బేరు"టీకన్న"యనన్. 19

వ. అతండు "తుమ్మల"యను గృహనామంబునం బరఁగి 20

ఆ. పెమ్మసానికులుఁడు తిమ్మభుజానికి, గండికోటనేలు దండిమగని
కాప్తుఁడై యమాత్యుఁడై దళవాయియై, వన్నె కెక్కె సాటివారు మెచ్చ. 21

క. తజ్జన్మఫలం బనఁగా, సజ్జనసంభావ్యశీలసంపన్నిధియౌ
నొజ్జయ్యవొదమె నతనికి, విజ్జెను దత్కీర్తి సురగవిసమ్మితమై. 22

తే. అతనికిం గల్గె నయ్యవారప్పయనెడి, నందనుండు దయాధర్మ కందమగుట
నయ్యవా రయ్యె నెల్లర కమ్మహాత్ముఁ, డొజ్జకొడు కయ్యవారౌట యుచితమకద. 23

క. జనియించె నతని కన్నయ, కనదాచారుం డతండు గనె ముత్తయ్యన్
వినయాశ్రయుఁ డతనికి నా,త్తనయుఁడు రమణాభిధుండు తనయుండయ్యెన్. 24

క. ఆరమణయచౌదరి సా, ధ్వీరత్నము కిచ్చమాంబఁ బెండ్లాడి గుణా
ధారుని శూరుని బుధమం, దారుని శేషయ్యఁగనె ముదం బెసలారన్. 25

క. అతిమాత్ర పూత చరితాం, చితయగు సుబ్బమ్మవలన శేషార్యునకున్
సుతు లుదయించిరి వేంకట, పతి సీతారామనామ భాస్వరులగుచున్. 26

క. అం దగ్రజుండు శారద, కందపురందరక రీందుకర సురతటినీ
మందారహీరలవలీ, కుందసమాస్పందకీర్తిఁ గొని రాణించెన్. 27

క. భాసురగుణసంపద ల,క్ష్మీసతికిం దుల్యయగుచు మించు మహాల
క్ష్మీపతి కయ్యనఘుఁడు పతి,యైసల్పె గృహస్థధర్మ మార్యులు మెచ్చన్. 28

తే. సన్నుతాచార్యులైన తజ్జంపతులకుఁ, బ్రాగ్భవార్జితసుకృతమ్ముపంట యనఁగఁ
బుట్టి రిద్దఱుకొమరు లప్పుత్త్రులందుఁ, బెద్దయై బాపయాఖ్యుండు తద్దవెలసె. 29

క. తదనుజుఁడై కమ్మకులాం,బుధి శీతమయూఖుఁడై ప్రభూతమనీషా
స్పదుఁడై నైతికపదవీ, నదవీయసియైనబుద్ధి నారయ నెగడెన్. 30

సీ. నిత్యసత్యాలాపనియతిపై ననురక్తి,సెందినాఁడు జయంబు నందినాఁడు
పరవిత్త మది తృణప్రాయంబ యని విశ్వ,సించినాఁడు తిరస్కరించినాఁడు
దీనార్థిలోకమ్ముఁ దిలకించి కన్నీరు, కార్చినాఁ దండకుఁజేర్చినాఁడు
మొగమోట దిగఁద్రావి తగవుసెప్పెడినేర్పు, గాంచినాఁడు యశంబు పెంచినాఁడు
తే. కష్టమున్ సుఖమున్ దుల్యదృష్టితోడఁ, జూచినాఁడొకత్రాసులోఁదూఁచినాఁడు
నాఁడు నేఁడును బుధులు కొండాడు నడత, నివ్వటిల్లిన నారయ్య కెవ్వరీడు. 31

చ. చదువకయున్ననేమి బుధసత్తము లుబ్బఁగ నర్థభావసం
పద వికసింప భాగవతభారతముల్ వివరించు, హృద్యముల్
తదమలకావ్యపద్యములు ధారణ కగ్గముచేసి వేనవేల్
చదువు నతండు తచ్ఛ్రవణసాహితి దుశ్శక మెట్టివారికిన్. 32

క. గోవిందచరణసేవా, హేవాక నిరస్త దానవేశ్వరసుతుఁడై
జీవన్ముక్తుండై సుజ, నావళి కతఁ దొజ్జబంతియై హవణిల్లెన్. 33

ఆ. పున్నెములకొటారు నన్నపనేని వం, శాబ్ధిసోము లక్ష్మయార్యతనయ
చెంచమాంబ వినుతశీల గుణావాల, నారయాఖ్యు నింతియై రహించె. 34

శా. ఔదార్యం బది చెల్మికత్తెగ మగం దారాధ్య దైవమ్ముగాఁ
బేదల్ బిడ్డలుగా బుతో క్తి నగగాఁ బెంపొంది విద్వత్ప్రశం
సాధౌరేయము శాశ్వతం బుభయవంశఖ్యాతికిన్ దావలం
బై దీపించిన చెంచమాంబచరితం బాదర్శ మిల్లాంద్రకున్. 35

తే. ధన్యజీవనులైన తద్దంపతులకు, నగ్రసుతుఁడై జనించినాఁ దంకినీఁడు
పిమ్మటన్ బ్లవమార్గశీర్షమ్మునందుఁ, బుట్టితి నేను రెండవపట్టి నగుచు. 36

క. జనులెల్ల రామతింతురు, నను "సీతారామమూర్తి" నాఁ దగుపేరన్;
అనవద్యచరిత వనితా, జనతామణి యన్నపూర్ణ సతియగు నాకున్. 37

వ. ఇట్టి నేను గురుశుశ్రూషాదులఁ బరిలబ్ధంబైన విజ్ఞానము నూఁతఁగాఁగొని బాల్య ముందొట్టి కబ్బంబులు పెక్కులు నిర్మించియు నంతం దనివోక వెండియు నెద్దియే, నొక్క మహాకావ్యంబు రచియింప వేడ్కపడి 38

సీ. ఏపల్లె దీపించు రేపల్లెసీమలోఁ బాఁడిపంటల కాటపట్టనంగ
నేపల్లె నిజదేశహితకార్యనిరతులౌ, కాంగ్రెస్సుయోధులఁగని రహించు
నేపల్లె పరధర్మ మాఁపంగ నెలకొల్పె, జాతీయవిద్యానికేతనంబు
నేపల్లె గాంధీ దయాపూరసిక్తమై, యనవద్యమయ్యె నయ్యనఘురాక
తే. నెందు గాంధిశిలాస్తంభ మెత్తఁబడియె, నెచటఁ దుమ్మల బసవయ ప్రచురదాన
మానితంబైన "వినయాశ్రమంబు"వెలసె, మీరు నేపల్లె పేరు "కావూ"రనంగ. 39

వ. నా కాణయాచియైన తజ్జనపదంబున "విశ్వసందేశం"బను పవిత్రక్షేత్రమువం బరఁగు గాంధిశిలా స్తంభంపు టరఁగుపై నమ్మహాత్ముని చతుష్షష్టితమ జన్మదినోత్సవసమయము (1-10-32) నం దాసీనుండనై సమాహిత చిత్తంబున నితివృత్తముం గూర్చి యేకతం బాడు నవసరమ్మున 40

సీ. ఎవని పుట్టువు మహాకవిగేయవిఖ్యాతి, సంధించె హైందవసంఘమునకు
నెవని రూపంబులో రవణించె నద్వితీ, యంబు సనాతనం బార్ష తేజ
మెవని సేవాత్యాగసవనంబు భారత, మాతృదాస్యముఁ దూల్చు మంత్రమయ్యె
నెవని ధర్మంబు సర్వవసుంధరాప్రజా, సంతానమునకు మేల్బంతి యయ్యె.
తే. విశ్వమానవకల్యాణ విధివిధాత, యీతఁడే యంచు జయపెట్టె నెవని జగతి
యట్టి గుణకంధి గాంధిమహాత్ము చరిత, నాతలంపున మెఱసెఁ బుణ్యంబు విరిసె. 41

ఉ. అంతటఁ బెన్నిధింగనిన యర్థివలెం బులకాంకితుండనై
యెంతయుఁబొంగి గాంధిరచియించిన యాత్మకథన్ దెలుంగులో
మంతునకెక్కఁ బద్యమయమార్గమునన్ వచియింతునంచు నే
సంతనకట్టితిన్ జనని శారదకున్ గిడిగిళ్ళుపెట్టితిన్. 42

సీ. ఏసూరినో పేరినో సుబ్బినో నిల్పి, పచ్చిసింగారంబు పల్కుకంటె
హేతువాదమ్మున కింతనిల్వఁగలేక, బూతులబుంగలై జాతివైర
ములకు మతద్వేషముల కుపాధ్యాయులై, యౌదార్యమునకు దవ్వగుచు నీతి
రతుల కెంతయు రోఁత రాఁజేయునట్టి పు, రాణమ్ములన్ బూని వ్రాయుకంటెఁ
తే. గాసులకు దాసుఁడగుచు మ్రుక్కడిని బొగడి, కల్లకైతల నల్లుటకంటె నిట్టి
గుణగరిష్ఠుల దేశభక్తులచరిత్ర, చెప్పుట జగద్ధితంబైన చేఁత గాదె. 43

క. శివరామశాస్త్రి విద్వత్కవిసింహము దీని మధురగద్యాకృతిలో
సవరించెఁగదా యిప్పని, కవసరమేమీ యటంచు నాడకుఁ డార్యుల్. 44

ఉ. ఎల్లరు గద్యమే చదువ నిచ్చవహింపరు పద్యమన్న సం
థిల్లును వేడ్క పెక్కురకు; దెల్గుకవిత్వచరిత్రఁ జూచినన్
దొల్లిటినుండి పద్యపుఁగృతుల్ ప్రజలన్ దనియించి గౌరవా
భ్యుల్లసితంబులై వెలయుచున్న విధం బది తెల్లమయ్యెడిన్. 45

క. పద్యంబు సర్వకవితల, కాద్యంబై గానబద్ధమై శ్రుతిహితమై
హృద్యంబై నియతం బన,వద్యంబై లెస్స తోడువడు ధారణకున్. 46

క. "అనువాదంబకదా పో", మ్మని పెదవిన్ విఱువఁబోకుఁ; దయ్యది యసదౌ
పనిగా దందును బద్యం, బునఁబల్కుట దెప్పరంబు బుధుఁ డిదియెఱుఁగున్ 47

క. తెలుఁగునకు స్వస్తిసెప్పిన, తెలుఁగుకవిత్వంబు వల్కఁ దియ్యము నాకున్
గలుగద మా తిక్కన య, జ్వలు త్రొక్కిన త్రోవ కేను సమ్మతిపడెదన్. 48

ఆ. పుఱ్ఱెకొక్క బుద్ధి పుట్టు జిహ్వకునొక్క, రుచి జనించు నంట రూఢి యైన
సరసులెల్ల మెచ్చ మెఱయింతుఁ గవితలోఁ, గమ్మఁదనము మత్కులమ్మునవలె. 49

ఆ. తప్పులేని కైత సెప్పెదనని గుండె, పైని జేయివైచి పలుకఁజాలు
కవియెవండు బుధులు కారుణ్యమూర్తులై, యుంట నాటసాగుచుండుఁగాని. 50



# ప్రస్తావన

తే. నాలుగై దేఁడులకు మున్ను నాదుచెలిమి, కాంగ్రెయొత్తడిచే నాత్మకథ లిఖింపఁ
బూనిపదిపంక్తులనువ్రాయులోనజరుగఁ, దొడఁగెబొంబాయినగరాన దుండగములు. 1

క. ఈయంతరాయమున నా,వ్రాయసము నిరుద్ధమాయెఁ బదపడి మూరిం
బోయిన ఘటనల కతమున, నా యెరవడబందిగమున నడుగిడినాఁడన్. 2

గీ. అందు జయరామదాసమహాశయుండు, నపుడు గలఁ; డాతఁ డితరకార్యమ్ములెల్ల
నాఁపి తొలుతొల్త రచియింపుఁడాత్మచరిత, మని ననుంగోరె నాదర మగ్గలింప. 3

క. ఇది యదనుకాదు నాకిటఁ, జదువం దమిగలదు కొన్ని సద్గ్రంథము; ల
య్యది తీఱుదనుక నితరం, బెదియుం బొనరింపనేర నిద్ధచరిత్రా! 4

క. అని యతనికిఁ దెల్పితి; నాఁ,డొనగూడినశిక్ష యెల్లయును బందియలో
ననుభూతమైన నచటన, తనకథ తప్పక రచించి తనిసనియుందున్. 5

తే. కాని మత్పరనక్రియ కాకమున్న, దొరతనమువారు వెలికి నన్ ద్రోసివైచి
రేతదాతంకమునఁజేసి యీచరిత్ర, మయితికాదయ్యె నెరవాదయందుఁ బలుక. 6

వ. ఆనందస్వామి యీనాఁ డా హెచ్చరికం గదలవైచె – దక్షిణాఫ్రికా సత్యాగ్రహచరిత్ర మే
నింతకుము న్నావిష్కరించియుంటిఁ – గాన నిపు డాత్మకథం గూర్చి నవజీవనపత్రికకుఁ
బంప నుబలాటపడితి – న ద్దానినెల్ల నొకయూఁపునంద సంతరించి గ్రంథాకృతిని వెల్వ
రించుట లగ్గని స్వామి వక్కాణించె – నట్లు సేయందగు వీలు నాకుం గఱవుకదా –
కావుటంజేసి యే నమ్మనీషిం గని 7

గీ. వారమున నొక్కఘట్టమ వ్రాయనేర్తు, బరువు లెన్నేనికల వెట్లు పరువులిడుదు
నెఱుఁగవో ప్రతిసప్తాహ మే నొకింత, వ్రాసి నవజీవనకు నంపవలయు ననుట. 8

గీ. ఈరచన మాత్మకథయైన నేమి యనుడు, నస్మదాశయ మానందుఁ దర్థ మనియె
నవలఁ గల మందుకొనుడు నయ్యది యెఱింగి, మిత్రుఁ డొకఁ డిట్లువల్కెఁ బవిత్రబుద్ధి. 9

తే. ఆత్మకథ నుగ్గడించుసాహస మదేల, యిట్టినడవడి ప్రాచ్యులం దెపుడు లేదు
వలతు రీబాట పడమటి వారు వారి, త్రోవ లీకొన్న కొందఱుతూర్పువారు. 10

వ. ఇది యుచితంబని తలంతురుగాక! – నేఁ దేమివాక్రువ్వనేర్తురు? 11

ఇది ధర్మమని మీర లిపుడు నమ్మినదాని, నెల్లి వర్జ్యమ్ముగా నెంచవచ్చు
నేఁటిసిద్ధాంతంబు పాటించి యొనరించు,పనుల రావచ్చు మార్పాటు రేపు
పెక్కండ్రు మీపల్కు నెక్కుడు మన్నించి, తమనడవళ్ళఁ దత్సమ్మతముగ
సవరించుకొనుచుంట సత్యమౌటను వార, లిద్దానఁ జెడుదారి కేగవచ్చు
నిట్టి హేతువులంబట్టి యిపుడు పూని, నాత్మకథ సంతరించుట నాఁపఁదగదె
యనుదు నప్పల్కు నౌరసి మన్మనమునందు,గొంతకొంత విచారించికొంటఁ వలసె. **12**

అయినను **13**

అస్మత్కథన పల్కునభిరుచి లేదునా, కెదపక యేను సూనృతముగుఱిచి
కడఁగి సల్పిన ప్రయోగంబులె నేఁడు బా,హిరపుచ్చఁ బూనితి, నీప్రయోగ
ములు నాదుజీవనమ్మున నిండియుంటచే, నవ్వానిఁ దెల్పిన నవియ మామ
కీనజీవనకథాకృతిని వహించు; నీ, రచనలోఁ బ్రత్యక్షరమ్మునందు

గీ. నాప్రయోగచరిత్రంబ నాటుకొన్నఁ, జేత యిది లెస్సయని విశ్వసింతు; జగము
నెదుట నీశోధనములెల్ల నిడితినేని, కొంతమేల్ దాని కౌనని యెంతునేను. **14**

వ. అది పొగడుకొంటయైన నగుఁగాక–మఱియు రాజకీయ రంగమున నాసల్పిన ప్రయోగముల నీదేశంబ యననేల నాగరకప్రపంచ మెల్ల నేఁ డెఱుంగు–వీని దెస నాచూపునంగల గౌరవ మత్యల్పమ–యివి నా కార్జించిపెట్టిన దగుటంజేసి 'మహాత్మ' బిరుదమున కాపాటివిలువయు నొసంగ – నా కిది పెక్కువిడుత లత్యంతసంతాపహేతు వాయె – దీన నే నుబ్బితబ్బిబ్బైన నిముస మొక్కటియు లేద – కానియాధ్యాత్మికరంగమునఁ గావించిన మత్ప్రయోగముల నావిష్కరించుట కే నెంతయు నుత్సహింతు – నివి యనన్యవిదితంబులు – వీనం జేసియ నాకు రాజకీయరంగమునఁ దగుపాటవం బొదవె – నీయవి సర్వథా యాధ్యాత్మికము లగునయేని వీని వివరించుట న్వినయము విస్తరిల్లుటకుఁ గాక త్రుళ్ళింతకుఁ దా వెక్కడ?
– మఱియు **15**

క. నా పూర్వజీవనము దెసఁ, జూపె న్నిగిడించి తఱచి చూచినకొలదిన్
జూపట్టఁ దొడంగెడి నా, లోపంబులె వేలు లక్షలుగఁ దెల్లములై. **16**

ఆ. ఆత్మదర్శనంబు నర్థించి పరమేశుఁ, జూడఁ దలఁచి ము క్తిసుఖము వలచి
చేసినాఁడ నెల్లచేఁతల నీముప్ప, దేండ్లనుండి దీక్ష యిగ్రుచుచుండ. **17**

క. ఇందులకే నామనుగడ, యందలి కర్జంబులెల్ల నా చరితము; ల
స్పందగతి రాజకీయము, లం దూఁకుటకైన నీతలంపులె కతముల్. **18**

గీ. మానిసికి నొక్కనికి సాధ్యమైనకృత్య, మెల్లరకు సాధ్య మగునని యేఁ దలంతు
నట్లగుట మత్ప్రయోగంబు లాచరింప, నైతి లాఁతివార లెఱుంగనట్టిరీతి. **19**

గీ. ఎల్లరకు నీప్రయోగముల్ తెల్లమగుట, కూడదని పల్కుచుందురు కొంద ఱిలను
గాని యిద్దాన నాధ్యాత్మికప్రభావ, మూన మగునంచు నే నించుకేని నమ్మ. 20

వ. తనకును దన్ను సృజించినవానికిని మాత్రమ వేద్యంబులగు నంశములు కొన్నియుండు - నవి యొండొరుల కెఱింగింపరాని వగుట తెల్లమ - నావెలువరించు ప్రయోగములు తాదృక్షములు కావు. కాని యవి యాధ్యాత్మికము - లొండె నైతికము - లేలనా మతసారము నీతి యనందగు - నీకృతిం బెద్దలయట్లు పిన్నలేని గ్రహింపఁదగు నంశంబుల చేరు - నేను వాని నావేశరహితము వినమ్రము నగు హృదయమ్ముతో నుడువ నేర్తునేని యితరసాధకుల పురోగమనమున కిం దించుక పాథేయము లభించు - వెండియు 21

సీ. మత్ప్రయోగములు సమగ్రతాబద్ధంబు, లని వచింపఁగఁజాల, నద్వితీయ
నైపుణి దీపింప నడుపు నిజప్రయో, గావళి *ప్రకృతి రహస్యవేది
యతఁడు తజ్జాతంబులగు మాఱుపాటులే, యంత్యసిద్ధాంతంబు లని వచింపఁ
దవ్వాని యాథార్థ్యమందు సందేహమ్ము తనకు లేకున్నను దాఁ దటస్థ
తే. భావమే పూనుఁగాని తత్పండితుం డ,హంత సూపింపఁ దొకవేళ నైన సుంత
మత్ప్రయోగంబులన్నియుఁ దత్ప్రయోగ, మార్గమున నుండుననుట సమంజసంబు. 22

తే. ననుఁగడుం బరికించుకొంటిని సమస్త,భావములఁ గూర్చి యవధానపటిమ వెలయఁ
దీవ్రపరిశోధన మొనర్చితిని సతంబు, నైన నివియె సిద్ధాంతంబు లనుట కొల్ల. 23

వ. ఏ నొకటి నొక్కి వక్కాణింతు - నా కివి సంపూర్ణసత్యములుగాఁ గన్పించు - నప్పటికిఁ జరమసిద్ధాంతములుగాఁ దోఁచు - నట్లు కానినాఁ డేను వీని నాదరువు గావించి యేపనియుం జేయనేర - నడుగడుగునం దిది గ్రాహ్య మిది యగ్రాహ్య మని నిర్ణయించుచు గ్రాహ్యంబు నాదరించితి - లాఁతిదానిం ద్రోసితి - నీచేఁత యెందనుక నాబుద్ధికి నంతరాత్మకుం దనివి నాపాదించు నందనుక నామూల సిద్ధాంతముల నంటిపట్టుకొని యుందు. 24

ఆ. తత్త్వముల వెలార్పఁ దలఁచితినేని యీ,కృతి రచింప నిచ్చగింపఁ గాని
వాని ననుసరించి వాటిల్లినట్టి కా,ర్యములచరితఁ దెల్ప నాసపడితి. 25

గీ. అట్లగుట నిల్పినాఁడ సత్యప్రయోగ,చరిత మనునామ మీసర్గజాలమునకు
వెండి సత్యభిన్నములని విశ్వసించు, బ్రహ్మచర్యాదులున్ దీని బలసియుండు. 26

వ. కాని సత్యంబ నాకు సర్వోత్కృష్టసిద్ధాంతము-దాన నితరసిద్ధాంతము లెన్నేని యిమిడియుండు - సత్యంబన వాక్సత్యమ కాదు - మతి భావసత్యము - సనాతనతత్త్వము - సాక్షాత్పరబ్రహ్మ

---

* సైన్టిస్టు.

– మీశ్వరున కసంఖ్యాక నిర్వచనము లుండె–నవి నన్ను భయవిస్మయంబులఁ దోఁగించు – నొక్కొక్క యెడ ముగ్ధం బొనరించుఁ – గాని యే నతఁడు సత్యస్వరూపుఁడనియ యారాధింతు – వానినింతదనుకఁ గననైతిఁ – గాని. 27

క. శోధించుచుంటి నే నీ,శోధనమున విడుతు నెల్లసుఖముల మఱి స
మ్మోదమున వేల్తు నేత, త్సాధనయజ్ఞమున నాదుసంహననంబున్. 28

వ. అయిన నెందనుక నీ పరిపూర్ణసత్యము నందఁజాల నందనుక నాబుద్ధికి గోచరించు సాలంబసత్యము నాశ్రయింపక తప్ప – దంతవఱ కీ సత్యమ నాకుఁ ద్రోవఁజూపు దివ్వెయై నన్నుఁగాపాడుకేడెమై యుండు–నీ తెరువునం బోక యసిధారావ్రతముం బోనిది – కాని న న్నదియ వేగిరమ్ముగా గంతవ్యస్థానమునకుఁ జేర్చు – నదియ నాకుసరళము – దాని నంటిపట్టుకొని పయనించుటంజేసి నా కొండంతతప్పు లణువులుగాఁదోఁచెడి – నేలయన నీదారి వనటలబారిం బడనీక న న్నేలె – నా కగపడు వెల్గుంబడి యేను ముందడుగు వైచితి – మత్పురోగమనమున సంపూర్ణసత్యమూర్తి యీశ్వరుని మేలిమెఱుఁగులు పెక్కుసా ర్లేను లీలగాఁ గంటి. 29

గీ. జగతి నీశ్వరుఁ డొకరుండె సత్యమనియుఁ, దక్కినట్టిది యెల్ల హుళక్కి యనియుఁ
నహరహంబును రేకెత్తు నస్మదీయ, చిత్తమునఁ బ్రత్యయంబు విచిత్రరీతి. 30

మం. ఆసమై నవజీవనాదిపత్రికల; బరియించుచున్న నాప్రజ లెల్లవారు
నేరీతి నామది నీనమ్మకంబు, కొనసాగెనో కనుగొందురుగాక
నాప్రయోగమ్ముల నాప్రత్యయముల, నవ్వారు పాలివారగుదురుగాక. 31

క. నా కగ్గమైనకార్యం, బేకుఱ్ఱనికైన సాధ్యమేయగు నంచున్
వాకొనఁ దగుకారణము ల, నేకంబులు నాఁడునాఁటి కెచ్చుచునుండెన్. 32

వ. సత్యాన్వేషణమునకు వలయు నుపకరణములం దెంతబెడిద ముందు నంత నవకమున్ వెలయు – నవి యహంయువున కసాధ్యములుగాఁ దోఁపవచ్చుఁ – గాని యమాయికుఁ డగు బాలునకు సుసాధములు – సత్యసాధకుఁ డణువుకంటె నణఁగి మణఁగి యుండం జను – మానిసియడుగు క్రిందం బడి యణు వడంగు – దానం ద్రొక్కుడువడఁ దగ్గ వానిఁగా సత్యశోధకుఁడు త న్నెఱుంగవలయు – నపుడ వానికి సత్యజ్యోతి యగపడు – నిది వసిష్ఠ విశ్వామిత్ర సంభాషణమునం దెల్లమి యగుఁ – గ్రైస్తవ మహమ్మదీయ ధర్మములు సైత మిద్దాని సమర్థించు – మఱియు. 33

తే. నా రచింపఁగబోవు గ్రంథమ్మునందు, నెచటనే నహంతాగంధ మించుకంత
సోఁకునటులైన మత్పరిశోధనమున, వెలితి కలదంచుఁ జదువరి తెలియుఁ గాక! 34

సీ. అట్టిచో నాకంటి కగపడు సత్యంపు, రుచి మరీచిక యంట యుచిత; ముర్వి
మాదృశుల్ పెక్కండ్రు మరణమ్ముపాలైన, నెల్లకాలము సత్యమిదియ జయము
గాంచి విరాజిల్లుఁగాక తప్పు లొనర్చు, నస్మాదృశున్ మర్త్య నరయుపట్ల
నెవ్వరే నొకవీసమేని సత్యమువిల్వ, నణఁపకుందురుగాక! యస్మదీయ
గీ. కృతి యిది ప్రమాణమని యెవ్వరేని నమ్మ,కుండెదరుగాక! మత్ప్రయోగోత్కరంబు
తెలివిడిగనెంచి ప్రజ స్వబుద్ధిని బలంబు, ననుసరించి ప్రయోగంబు లరయుఁగాక! 35

వ. ఈమేర కాత్మకథకుఁ జెందిన యదాహరణములు తప్పక తోడ్పడు నని నా నమ్మిక – యేలయన నాతప్పులను దాఁపక తక్కువచేయక చదువరుల కెఱుక సేయఁ దలంచితి – సత్యాగ్రహశాస్త్ర ప్రయోగముల నావిష్కరించుటయ కాని నామంచితనముం జాటుట నా కభిమతము కాదు – న న్నేను బరికించుతఱి సత్యంబువోలె బెట్టిదుండ నగుట కంగవింతు – నితరులుసైత మట్ల యుంటయును వలతుఁ – దదీయప్రమాణము ననుసరించి నాకొలది నెఱింగి సూరదాసున ట్లెలుఁగెత్తి. 36

ఆ. కలఁడె నన్ను దొరయఁగల కుటిలాత్ముండు, దుష్టజనుఁడు లౌల్యదూషితుండు
నెవఁ డొసంగె నాకు నిమ్మేని నతనిన, మఱవఁగల కృతఘ్నమౌళి నైతి. 37

వ. అని వక్కాణింతు – నేలయన 38

క. నాయూర్పుల కన్నింటికి, నాయకుఁ డెవఁ డెతని కేను నందనుఁడ జగ
ద్ధేయున కాపరమేశున, కాయయ్యకు నఖిలతాపహర్తకు నకటా! 39

తే. ఇందనుకఁ జాలదూరమునంద యుంటి, ననువిచారంబు రేపవల్ ననుఁ గలంచు
నిందులకు నావికారంబులే కతమ్ము,లని యెఱింగియు నాఁగలేనైతి వీని. 40

క. ఈపీఠిక నింతటితో, నాఁపెద వాస్తవికగాథ నవ్వలిసర్గన్
జేపట్టువాఁడఁ బారకు,లోపికమైఁ జదువుఁ డీప్రయోగచరిత్రన్. 41

సాబర్మత్యాశ్రమము
26-11-1925

మోహనదాస్ కరంచంద్ గాంధీ



# ఆ త్మ క థ

## ప్రథమ భాగము

## 1 జన్మాదికము

క. కలదుగదా! భరతోర్వీ, తిలకం బగు ఘూర్జరాఖ్యదేశము; దానన్
దులలేని పేరుపెంపులఁ, జెలువొందుం "గతియవాడు" సిరికిం గుదురై. 1

తే. అందు గాంధీకుటుంబమం దవతరించు, వైశ్య లాదిని జిల్లరవర్తకంబు
నాశ్రయించిరి కాని తదన్వయంబ, మంత్రితాసిద్ధి వెలసెఁ గ్రమక్రమమున. 2

ఉ. ఉత్తమచందుగాంధి యన నొప్పెడి నాదుపితామహుండు ధీ
మత్త రహింప మంత్రిపదమండితుఁడై యల "పోరుబంద"రం
దుత్తములెల్ల మెచ్చ నృపు నూర్జితభక్తిని గొల్చెఁ గాని దు
శ్చిత్తులకుట్రచే నతఁడుసేరె జునాఘడు కొల్వుసేఁతకున్. 3

క. ఆసంస్థాన ప్రభునకుఁ, జేసె జొహా రాతఁ డెడమచేత, నపుడు "నీ
కీసరణి చెల్లునా యిది, దోసముగాదంచుఁ బల్కుదురొకో సభ్యుల్". 4

తే. అని యొకఁడు పల్క దక్షిణహస్త మర్పి, తం బితఃపూర్వమందె బందరున కింక
లాఁతివెర వెద్ది నాకంచు నాతఁ డనియె, నిరుపమానం బహో! వాని నియమశుద్ధి. 5

క. ఆతని కైదవసుతుఁడై, పూతాత్ముఁడు నాదుతండ్రి పొడమె నతఁడు వి
ఖ్యాతమనీషాబలవి, జ్ఞాతాఖిలరాజ్యతంత్రచతురుం డయ్యెన్. 6

సీ. జనులెల్లరును గరంచందుగాంధి యటన్న, పేరఁ బిల్వ నతండు పెంపుమీఱి
నెఱపె నుద్యోగంబు నెఱమంత్రియై పోరు, బందరుసంస్థానమందు నిలిచి
క్రాలె రాజస్థానిక న్యాయసభయందు, సభ్యుఁడై సదమలాచారగరిమ
నది రాజులకును దదన్వవాయులకును, దగవు దిద్దంజాలు ధర్మసంస్థ

తే. రాజకోటకు వాంకనేర్ రాజ్యమునకుఁ, బ్రెగడయై కొంతకాలంబు నెగడి యతఁడు
కాలగతి నందువఱ కుపకారవేత, నంబు గొనె రాజకోటభూనాథువలన. 7

తే. అతఁడు భార్యావియోగాప్తికతనఁ బెండ్లి,యాడె నాలుగుమార్లు; గుణాఢ్యకుం దు
రీయజాయకుఁ బుత్త్రలీబాయి కేను, బ్రభవమందితిఁ గడగొట్టుపట్టి నగుచు. 8

తే. అమలసత్యవ్రతుండు కులాభిమాని, శూరుఁ దౌదార్యమూర్తి నిస్తులితధర్మ
రతుఁడు లంచం బెఱుంగనినుతగుణాఢ్యుఁ, డన జగతిఁ గీర్తికెక్కె నాయనుఁగుఁదండ్రి. 9

తే. నలువదేఁడులు కడచన్ననాఁ డతండు, సిద్ధపడె నాలుగవభార్యఁ జెట్టపట్ట
నట్లగుటఁ గొంతవిషయపరాయణత్వ, మంటుకొనియుండె నాతని కంట తగడె. 10

సీ. రాజకోట సహాయ రాజకీయప్రతి,నిధి యొకం డొకమాఱు నిజనరేంద్రుఁ
దూలనాడఁదొడంగ దోస మియ్యది యంచు, నాతండ్రి వారించి నీతు లాడ
నాగ్రహమంది యయ్యధికారి "పొరపాటు, మన్నింపుఁ డని బతిమాలు"మనిన
నతఁ డియ్యకొనక బంధితుఁడయ్యె నటులయ్యు, లొంగకుండుటకు వెఱంగు నంది
తే. ప్రతినిధి మదీయజనకనిర్బంధశిక్షఁ, దొలఁచె వ్రీడాభరం బెదం గలఁచివైవ
నల్లవో! యేమి సెప్పెద నాదుతండ్రి, మాననీయసంస్థానాభిమానగరిమ. 11

క. ధనసంచయేచ్ఛ సుంతయుఁ, గనిపింపదు నాదుతండ్రికడ నట్లగుటన్
దినఁ దొడుగ మాకు శేషిం,చిన దెంతయు నలఁతియంచుఁ జెప్పన్వలయున్. 12

క. చదు వల్పమైన నాతఁడు, కుదిరిన లోకానుభూతి గొప్పదియగుటన్
విదళించె గట్టిచిక్కులఁ, జదు రేర్పడ వేలకొలఁది జనముల నేలెన్. 13

చ. మతమునయం దతండు బహుమాత్రము శిక్షణ మందఁడయ్యెఁ గా
ని తఱచు కోవెల ల్గని మనీషు లొనర్చు మతప్రసంగముల్
సతతము నాలకించి సువిచార మొనర్చుటఁజేసి యందుఁ బాం
డితి గడియించె గీతను బఠించె నతం డల వార్ధకంబునన్. 14

క. చిత్తమ్మున మజ్జననియు, నుత్తమసతి యన్న భావ మొదవెను నాకున్
బత్తియుఁ బ్రపత్తియును రే, కెత్తఁగ నగ్గరిత దేవు నెపుడుం దలఁచున్. 15

క. ఆయమ్మ దేవతార్చన, సేయక బోనంబు నెపుడుఁ జేయద మఱియున్
బాయక విష్ణ్వాలయమున, కేయెడనే ననుదినంబు నేగుచునుండున్. 16

వ. నాయెఱిఁగినంతవట్టు చాతుర్మాస్యము నామె విడువదయ్యె-నయ్యమ్మ కఠిన దీక్షా రక్షితంబులగు వ్రతంబులు సతంబు నిరంతరాయముగా నాచరించు - నెట్టి యిక్కట్టు ముట్టడించినను దాఁబట్టిన నోము నుజ్జగించుట మజ్జనని యెఱుంగని కర్జంబు - చాంద్రాయణము నెఱపుతఱి నాకెకుఁ దెవులు సోఁకుటయు నయ్యామయమ్మున కామె

నేమంబు నేమాత్రయుం జెఱుప నయితిఁగామియు నెఱుంగుదు - రెండుమూఁడు కఠినోపవాసమ్ము లా సాధ్వీమతల్లికకు నల్లేరుపై బండినడకంబోని - వామెకుఁ జాతుర్మాస్య లయం దేకభుక్తంబ నియమ - మంతం దనివోక యొక దాన నయ్యమ్మ వాసరోపవాసంబు నాసించెఁ - గొండొకదాన భానుఁడు పొడసూపెనఁ గాని భోనంబు ముట్ట నను కట్టడిఁ జేసికొనె - నపుడు నాసైదోడులం గూడి వేఁడివెలుఁగు కాన నయ్యెనని మాయమ్మకు న్వినుచుట కేను మిన్నువానికంబుపైఁ గన్ను నిలిపియుండువాఁడ - నడిజడికారునం బ్రాయికంబుగా నంబుజ బాంధవుఁడు కంటంబడమి యెల్లరకుం దెల్లంబ యాకస్మికంబుగా లోకబాంధవుఁడు దర్శనం బొసఁగుడు నే మొక్కగంతునం బోయి య య్యుదంత మమ్మకు నివేదించువార - మా సుశీల పరుగుపరుగున వచ్చు నీలోఁపన భాస్కరుఁడు మేఘచ్ఛన్నుఁ డగుడు నామె "పోనిండు నేఁడు నాయారగించుట భగవానున కసమ్మతము కాఁబోలు"నని వెడుకమై నాసి యింటిపనులఁ జక్కదిద్ద నరుగు - వెండియు **17**

క. కానంబడు వ్యవహార, జ్ఞానము మాతల్లియం దఖండమ్ముగ సం
స్థానస్థవిశేషంబు ల, నూనముగాఁ దెలియు నామె కుశమతి యగుటన్. **18**

ఉ. అంతిపురంబునం గల కులాంగన లెల్లరు నామెతెల్వి క
త్యంతము సంతసింతు రపుడప్పుడు బాల్యముచల్వ నేను నా
చెంతకుఁ దల్లివెంటఁబడి చేరితి నాజనయిత్రికిన్ ధరా
కాంతునితల్లికిన్ జరుగు కమ్మనిముచ్చట గుర్తు నేఁటికిన్. **19**

తే. రత్న రుచి హస్తి పంకజారాతి సంఖ్య, నలరు క్రైస్తవశకనిబద్ధాబ్దమందు
దశమమాసద్వితీయమై తనరునాఁట, జననమందినవాఁడ నీ దంపతులకు. **20**

సీ. ప్రభవమందిన పోరుబందరుపురమంద, నాకుఱ్ఱతనమెల్ల నడిచిపోయెఁ
బల్లెకూటమునకుఁ బంపిన దృశ్యంబు, కన్నులఁ గట్టిన ట్లున్న దిపుడు
నెక్కము ల్వల్లించు టెంతేని చిక్కయ్యె, నెంతపాడినఁ దలకెక్కవయ్యెఁ
దోడివిద్యార్థులతోఁ గూడి నాఁడు మా,యొజ్జల దూషించు టొకటితప్ప

తే. నభ్యసించిన దిసుమంతయైన నేఁడు, కానరాదయ్యె నిటులైనకతనఁజేసి
నాకు నిశితబుద్ధియు ధారణాబలంబుఁ, బూజ్యమని సెప్ప టెంతయుఁ బోలకున్నె. **21**



# 2 బాల్యము

తే. బందరు దివాణమున మంత్రిపదము వీడి, న్యాయసభయందు సభ్యమర్యాద వడసి
నాకు నేడేండ్లవయ సున్ననాఁడు చేరె, రాజకోటకు నాతండ్రి తేజు వెలయ. 1

తే. అతఁడు న న్నప్పురంబునం దలరునొక్క, ప్రాథమికపాఠశాలకుఁ బంపె నందు
నాపఠించిన విద్య నెన్నంగఁదగు వి,శేష మొండేనిలేద యోజించిచూడ. 2

వ. అంతఁ గ్రమక్రమంబున నే నున్నతపాఠశాలకుం జేరితి - నప్పటికి నాకుఁ బండ్రెండేఁ
డుల యీడుండు - నక్కాలంబున 3

క. బొంకాడి యెఱుఁగ నెన్నఁడు, జంకుదు సి గ్గెక్కుడగుట సంఘముఁగదియన్
బొంకపుఁబొత్తమ్ములుగా, కింకెవ్వరు లేరు నాకు నించిన మిత్రుల్. 4

ఆ. ప్రక్కనున్నవాని పలకను దిలకించి, నకలువ్రాయు టెఱుఁగ నొకదినంబు
గురుఁడు దీని మప్ప దొరఁకొనెఁ గానినే, లొంగనైతి నిట్టి దొంగపనికి. 5

ఆ. ఇట్టిదుర్గుణంబు లెన్నేని తద్గురు, నంటియుంట వింటిఁ గంటిఁగాని
యతనిదెస మదీయమగు వినయంబు తాఁ, జిన్నమంతయేని చెదరదయ్యె. 6

క. గురువుల యాదేశంబుల, శిరమున ధరియింతుఁగాని చిత్తమ్మునఁ ద
చ్చరితంబులఁ దర్కించుట, యెఱుంగ నేనాఁడు నాకు నిది సాజమగున్. 7

ఆ. కన్నుఁబ్రాము టెఱుఁగ నెన్నండు నొజ్జల, నీతిమాలి గురులచేత నొక్క
మాటపడుట నాదు మతమునకున్ దవ్వు, పట్టువడియె నాకు నిట్టి నడత. 8

వ. కావుటంజేసి లాఁతిపొత్తంబుల దెసకుఁ జిత్తముంజననీక పాఠ్యగ్రంథముల నిరంతరము
వల్లించువాఁడ - నిట్లయ్యు నొక్కతఱి మజ్జనక సంపాదితంబు పితృభక్తిబోధకంబు నగు
శ్రవణచరిత్రం బను నాటకంబుపై నాకన్ను పడియె - నంత నద్దానిఁ దుదముట్ట నవధానంబు
మెయిం జదివితి-నయ్యవసరంబునంద బొమ్మలాటకాండ్రు కొందఱు మామందిరమునకు
వచ్చి 9

క. నేత్రోత్సవకరములఁ బలు, చిత్రంబులఁ జూపి రందుఁ జీఁకుముసళ్ళన్
మాత్రపితలఁ గావడి నిడి, యాత్రకుఁ గొనిపోవు శ్రవణునాకృతిఁ గంటిన్. 10

క. ఈ చిత్తరు వాపొత్తము, నాచిత్తమునందు పెద్ద నాటుకొనియె సా
రాచారుఁ డక్కుమారుఁడు, తోఁచెను నా కొజ్జబంతితో నెన యగుచున్. 11

చ. అతఁడు కథావశిష్టుఁడయినట్టితఱిన్ దలిదండ్రు లార్తిమై
సుతుని దలంచుచుం గడుపు చుమ్మలువాఱఁగ నేడ్చుగీత మ

చ్యుతమయి నా స్మృతి న్నిలిచె శోకము పైకొనుమాడ్కి నన్నుఁదత్
కృతికరఁగించె దాని గురుఁడిచ్చిన జంత్రముమీఁదఁ బాడితిన్. 12

మ. సరిగా నత్తరుణంబునం దల హరిశ్చంద్రావనీపాల స
చ్చరితం బాడిరినట్టువుల్; సరభసోత్సాహంబు దీపింప మ
ద్గురునాజ్ఞం గొని దానిఁ గంటి; నది గింగుర్వెట్టెడిన్ శ్రోత్రగ
హ్వరమం దిప్పటికేని; దోఁచె నది నాభావంబు నువ్వెత్తుగన్. 13

ఆ. ఆప్రదర్శనంబు ననిశంబుఁ దిలకింప, నిచ్చ వొడమెఁ గాని యెన్నిసార్లు
జనకుఁ డాజ్ఞ నిచ్చు స్వాతంత్ర్య మేపాటి, కలదు నాకు దానిఁగాంచు టెట్లు. 14

తే. అని తలఁచి వేఱొకం డుపాయంబు లేమి, నాహృదయరంగమంద తన్నాటకంబుఁ
గోటిమార్లు ప్రదర్శించికొంటి నేన, నిరుపమానందసామ్రాజ్యనేత నగుచు. 15

క. నిత్యంబు హరిశ్చంద్ర, స్తుత్యపథం బూని గుణనిధుల్ జయపెట్టన్
సత్యంబు పల్కి జను లౌ,న్నత్యముఁ గనరాదె యని మనంబున నెంతున్. 16

క. ఆ యనఘునిగతి సత్యముఁ, బాయక తద్ధర్మమూర్తిభంగి విపత్తుల్
మాయించు టొ ప్పనునభి, ప్రాయము నన్నావరించె బంధుర మగుచున్. 17

క. ప్రత్యక్షరంబుఁ దత్కథ, సత్యము సత్యం బటంచు స్వాంతములోనన్
బ్రత్యయము గల్గె నలజడి, యత్యంతం బగుఁ దలంచునంతన దానిన్. 18

మం. ఇపుదు లోకజ్ఞాన మెచ్చిన కొలఁదిఁ, దర్కించి తర్కించి తలఁచినకొలఁదిఁ
జరిత కందఁడు హరిశ్చంద్రుఁ డటంచుఁ, దోరంబుగా నాకుఁ దోఁచుచున్నయది
శ్రవణుండు నల హరిశ్చంద్రభూవిభుఁడుఁ, జింతింపఁ దనకు సజీవసత్యముల
తన్నాటకంబు లిత్తఱిఁ బఠించినను, వెనుకటివలె నే ద్రవింతు నిక్కువము. 19



## 3 బాల్యవివాహము

ఆ. ఈ వివాహఘట్ట మావిష్కరింపక, మఱుఁగు సేఁత నాదు మదికి నింపు;
కాని దీన నిట్టి గరళంపుముద్దల, మెక్కవలయు నేను బెక్కుమార్లు. 1

క. పొగడఁదగుకతల నిటఁ బలు,వగల న్గొనియాడి చెడ్డవాని న్విడ వీ
లగునే నిజమున కే నూ,డిగముం బొనరింతు నేని డిందనిబత్తిన్. 2

క. పదుమూఁడువత్సరంబుల, యదనన్ నాపెండ్లి జరిగె నని తప్పమునం
గదియించుట సంతాపా,స్పదమగు విధి యయ్యె నెపుడుఁ దల్చుచు నింకన్. 3

వ. నేఁడు నాకాపుగడకు నగ్గంబై నాఁటినాయీఁడుగల్ల వెల్గొందు కుట్టలం జూచు తటి నావివాహ వృత్తాంతము తలఁపునం బాఱ నాదుర్దశ కెంతయుఁ జింతిల్లి యేతదనర్థంబునకు దవ్వైన యవ్వారి నవ్వారిగాఁ గొనియాడు చుండుఁ - గొండిక నాఁట జ్జరిగిన నాపెండిలి న్సమర్థింప నెట్టి నైతిక విధియుం గానరాదయ్యె - వెండియు 4

సీ. కత్తియవాడులోఁ గలవు ప్రధానంబు, పెండిలియనుపేర రెండు విధులు
తొలుతొల్తఁ బిల్లల తలిదండ్రు లుద్వాహమునకునై కావించికొనెడి నియమ
మాద్యసంస్కార, మయ్యది దురతిక్రమం, బగుఁ; గాని పెండిలి ముగియులోనఁ
గుఱ్ఱవాఁ డసువులఁ గోల్పోయినఁ గుమారి, వైధవ్యదుర్దశావశ్య కాద
తే. తఱచుగా నీప్రధానగాథల నెఱుంగు, పిల్ల లుందరు; నా కిట్టి వింత తంతు
ముగిసెనఁట మూఁడు మార్లందు మొదటిపాప, బిడ్డ లేసందుగొట్టియో యెగిరిరంట. 5

తే. నాతృతీయప్రధానంబునాఁటి కేడు,వత్సరమ్ముల వయ సున్నవాఁడఁగాని
దానిఁగూరిచి నాతోడఁ దల్లిదండ్రు, లెఱుక గావించిరో లేదొ గుఱుతు సున్న. 6

సీ. మువ్వుర మన్నదమ్ముల మేము; జరిగె నిం,తకుమున్న పెద్దయన్నకును బెండ్లి
నాద్వితీయాగ్రజునకును నాపెదతండ్రి, సుతునకు నాకు నౌత్సుక్య మలర
నొకముహూర్తమునంద యుద్వాహ మొనరింప, నిశ్చితమయ్యె; నీ నిర్ణయమున
మా మంచిచెడ్డల మది నెంచఁ బనిలేదు, మాసమ్మతియు నసమ్మతియు నరయు
తే. నక్కఱయ లేదు పెద్దల; కందు వారి, కానుకూల్యము నల్పవ్యయంబు నొదవు
టొక్కటే చాలు నిరతంబు నూహసేయ, రెంత సాహస మీకర్జ మెంచి చూడ. 7

క. హైందవసంసారమ్ముల,యందు వివాహంబటన్న నంతంతలతో
దం దీఱ దిచ్చువారలు, నందెదువా రడఁగిపోదు రక్కార్యమునన్. 8

క. అర్థమ్మును గాలమ్ము ని,రర్థకముగ వెచ్చపెట్టి యాడంబరముల్
వర్ధిల్లఁజేయ నుభయులు, వ్యర్థస్పర్ధాసమాశ్రయతఁ గాంతు రహో! 9

క. విందుల వింతల మేళము,లం దాళమ్ములను బట్టలం బాఁతల నె
న్నందగు నగనాణెమ్ములఁ, గ్రందుగ సమకూర్తు రహమికల్ చెలరేఁగన్. 10

ఉ. శ్రోతలు మేల్ బలారె! యనుచు న్దలలూఁపిన నిస్సియంచు బల్
రోఁతవెలార్చినం గనక ఱొప్పుచు గొంతులు చీలునట్లు సం
గీతము పాడి రోగములకింకరులై పొరుగిండ్లవారికిన్
యాతన దెచ్చిపెట్టెద రహర్నిశము న్మతికొంద తిత్తతిన్. 11

క. కిమ్మనక భరింతురు పా,ర్శ్వమ్ములఁ గలవార లీ యసహ్యమ్మును వా
రు మ్మొం దీ యల్లరి నా,గమ్మును గావింపవలయుఁ గావున నవురా! 12

తే. వెచ్చమా తగ్గు విభవమా హెచ్చవచ్చు, ననుచు మాపెద్దవా రెల్ల రరసి యరసి
యేకవారంబ యీపీడనెల్లఁ బాఱఁ,ద్రోల నెంచిరి చెలులు బంధుగులు మెచ్చ. 13

వ. అదియుంగాక మజ్జనకుండును దదగ్రజుండును జరాభార పీడితులగుటయు, వారు నెఱ
వేర్పందగిన శుభారంభంబు లింతకు వెలిగా నన్యంబులు కానరామియు, ముదిమిబ్రది
మియం దెల్లరకుఁ దమపిల్లల ముద్దుముచ్చటలం దిలకించు నుబలాటంబు వొదముట
సాజంబగుటయు, మా వివాహంబు లొక్కమాఱు నడుచుటకుఁ గారణంబులయ్యెఁ –
బూర్వోక్తప్రకారంబున వైవాహికకృత్యంబులు దిద్దం గతిపయమాసమ్ములు చెల్లె – నీసందడిఁ
గాంచి నే నాగామి విశేషమ్ములఁ బసివట్టి 14

ఆ. ఆట లాడికొందు నప్పిల్లతోఁ గూడి, యందలంబు లెక్కి విందుఁ బాట
మంచిదుస్తులన్ ధరించి కులుకుచుందు, ననుచు నుబ్బినాఁడ నగ్గలముగ. 15

ఆ. రాజకోట విడిచి రంగదానందతు, రంగమంబు నెక్కి చెంగలించి
యగ్రజన్ముఁ గూడి యరిగితి మామాతృ, భూమియైన తత్ *సుదామపురికి. 16

సీ. ఒకయయ్యచెంత సేవకుఁడౌట మాతండ్రి, కలవిగాదయ్యె మ మ్మనుగమింప
నెట్టెటో సెలవు నొక్కింత నార్జించి తాఁ, బయనమయ్యెను బోరుబందరునకు
దారిలో శకటంబు తలక్రిందులై కూల, నతని మేనెల్ల నుగ్గయ్యె నకట!
క్షతగాత్రుఁడైన మజ్జనకుఁ జూచినయంత, మాసంబరంబెల్ల నోసరిల్లె
ఆ. నిట్టిచెట్ట మమ్ము ముట్టడివైచిన, నాఁగదయ్యెఁ బరిణయప్రయత్న
మేను బెండ్లివేడ్కలోన మునింగి చిం,తింపనైతిఁ దండ్రితీపుమోపు. 17

క. తలిదండ్రులదెస నాకుం, గల దెంతయు భక్తి; దానికంటె లవంబున్
వెలితిపడఁబోదు భోగం, బులపైఁ గల రక్తి; యుక్తముగ నూహింపన్. 18

ఆ. ఇంక నెఱుఁగనైతి నే సుఖమంతయు, నీఁగి కన్నవారి కెల్లవగలఁ
దగుసపర్య సేఁత ధర్మువు లన్నింటఁ, బ్రథమగణ్య మన్నపాడి తెలఁగు. 19

తే. మామకీనంబు నింద్యమై మలయుభోగ, తృష్ణకున్ బుద్ధి సెప్ప వర్తిల్లె నొకటి
యదిమనశ్శల్యమై నాఁడుమొదలు నన్నుఁ, గరము వేధించు ముందు తత్కథ వచింతు. 20

క. ఓరీ! కోటియుపాయము, లారసి పన్నెదవుగాక! యకలంకంబౌ
వైరాగ్యము లేకుండిన, నేరవు త్యాగంబు వదయ నీ వెన్నఁటికిన్. 21

* పోరుబందరు

వ. అని నిష్కలానందుఁడు రచించిన గీతంబును బాడునప్పుడు వినునప్పుడుం దలఁపునం బాఱి తద్దుర్విషయంబు నన్ను లజ్జావశుం జేయుచుండు - నది యట్లుండె. 22

క. నలఁగియు గాయమ్ములతోఁ, గలఁగియు నగుమోము వెట్టి కావించెను బెం
డిలితంతునెల్ల జనకుం, దల దృశ్యము కనులఁ గట్టినట్టుల యుండున్. 23

తే. చిఱుతప్రాయంబునం బెండ్లి సేయుకతన, మజ్జనకు నిట్లు తీవ్రవిమర్శ సేయ
సాహసింతు నటంచు నాఁ డూహపడితి, నోటు? సకలంబు నా కపు డొప్పియుండె. 24

ఆ. పెండ్లియరుగు నెక్కి పిల్లయు నేనుఁ గూ,ర్చున్న తెఱఁగు నాఁడు సన్నెకల్లు
త్రొక్కినట్టిజాడ మక్కువఁబాసెమ్ము, గ్రోలు లీల మఱపుపాలఁ బడదు. 25

క. మా యాలుమగలు సంసృతి, సేయన్ దొరఁకొన్నభంగి చిత్రమువోలెన్
నాయెట్టయెదుట నున్కిం, బాయక యీనాఁటికేని భాసిలుచుండున్. 26

సీ. ఆ తొలిరేయి నోహో! తూర్పుపడమరల్, గుర్తింప నేరని కుఱ్ఱజంట
మొనసి సంసారసముద్రగర్భమ్మునం, దు నమాంతముగ నొక్కదూఁకు దూఁకె
నారేయికర్తవ్యమంతయు నాకు మా, వదినె బోధించెఁ బావనగుణాఢ్య
నాకొమ్మ కెవ్వ రా పోకడ ల్నప్పిరో, యిసుమంతయేని నా కెఱుకపడద
ఆ. యెఱుఁగ వేఁడనైతి నెన్నఁడు ముందైనఁ, గోరవలయునన్న కోర్కి లేదు
మాకు సిగ్గు నిరుపమాన, మన్యోన్యము, భావలోకసిద్ధి యబ్బ దెపుడు. 27

క. అమ్మగువతోడ నే నిఁక, నెమ్మెయి మాటాడు టొదవు నెయ్యది వక్త
వ్యమ్ము వధూనీసాహో, య్యమ్ము న్ననుఁ జేర్పదయ్యె నతిదూరంబున్. 28

వ. అప్పట్ల నిక్కముగా నెట్టి శిక్షయు నక్కఱకు రానేర - దద్దానితో నొకింతయే నావశ్యకము లేకుండఁజేయఁ బురాభవసంస్కారంబు లెంతయు సమర్థంబులు - కావుటంజేసి కాలక్రమంబున మాకుఁ బరిచయము వర్ధిల్లి శంకాతంకంబు లెఱుఁగని సల్లాపములు బలియఁ జొచ్చె. 29

తే. హెచ్చులొచ్చులు లేక మాయీడు తుల్య,మైన నేమాయె నించుకయేని మసల
కేను జాగింప దొరఁకొంటి నింతిమీఁద, దొర యెఱుంగని గరువంపుదొరతనంబు. 30



# 4 యాజమాన్యము

శా. నాకుం బెండిలియైనకాలమున నానానీతులంగూర్చి సు
శ్లోకుల్ వ్రాసెడు పత్రికల్ వెలసి వచ్చున్ స్వల్పమూల్యంబునన్
సాకల్యంబుగ వాని నేఁ జదివితిన్ సంప్రాప్తమైనప్పు డం
దేకస్త్రీవ్రతచర్య ధర్మములలో నెచ్చంచుఁ బల్కంబడెన్. 1

క. అది ముద్రవోలె నామది, నదికెన్మతి సత్యదాస్య మస్మద్వ్రతమై
కుదురుకొనియుండుటన్ బర,సుదతీస్నేహము నభఃప్రసూనమ నాకున్. 2

వ. వెండియు నేకపత్నీవ్రతంబును ద్యజించుటయు నవ్వయసునందు నా కసాధ్యంబయైన
నవ్విచారంబు నా కొండు చెట్టకుం గతమయ్యె - నెట్లన 3

తే. ఏకపత్నీవ్రతంబు నేనిట్లు నెఱప, నానెలంత పాతివ్రత్య మూనవలదె
యని తలంచితి నియ్యూహ మట్టె పెరిఁగి, యువిదపై నాకు సందియం బొదవఁజేసె. 4

క. ఆయమచిత్తం బెఱుఁగఁగ, నాయధికారంబు నేర్పునంజూపితి దో
షాయత్తచరిత్రఁగ మ,జ్జాయను శంకింపఁదగిన సదిలేకున్నన్. 5

క. నాక న్నంతయు నచ్చెలి, పోకడపై నుండు నెల్లపుడు; సందేహ
వ్యాకులితచిత్తులకు నే,లా కావలెఁ గార్యకారణాన్వయ మిస్ప! 6

క. ఇరుగిండ్లకుఁ బొరుగిండ్లకు, నరుగం దగ దస్మదాజ్ఞ నందక నీ వం
చఱలేకయ శాసించితి, గరిత; నిదియ బీజమయ్యెఁ గలహంబునకున్. 7

చ. ఇది యొక బందియై వెలసె నింతికి, నిట్టికడిందికర్జముల్
ముదితసహింపదయ్యెఁ, దనముచ్చట హెచ్చినచోటికేగ నా
ముదలఁదొలంగె, నట్లగుట ముమ్మరమయ్యె మదీయకోప, మా
సుదతిస్వతంత్రతాగరిమ సుస్థిరమయ్యె, నిఁకేమి సెప్పుదున్. 8

వ. నాఁడు క్రొంగ్రొత్త కాఁపురంబులు గడపు మాకు నొండొరుల ముచ్చటలు నిప్పచ్చరం
బయ్యె. 9

ఆ. నిక్క మరయ నాదు నిర్బంధచర్యల, సరకుగొనక తలఁపుజాడఁ బట్టి
పొలఁతి మెలఁగు టెట్లు పోలని చేఁతయొ, నురక నెఱపఁదగునె దొరతనంబు. 10

క. ఊరేగింపులఁ జూడకు, పేరంటంబులకుఁ బోకు ప్రేముడికత్తెన్
దారుకొనఁబోకు గుడికిం, జేరకు మను చట్ట మే సుశీల భరించున్. 11

క. నాసతి నే శాసించిన, నాసతి నా కానయిచ్చు టర్హంబకదా
యీసత్యమ్ము నెఱుంగక, చేసితి మగపెత్తనంబు చేడియమీఁదన్. 12

వ. చదువరులు మాజీవితంబెల్ల నిట్టి సందడికయ్యంబులకు వియ్యంబు సూపెనని యూహింప కుం(డుగాక-నిష్కలంకమగు పేర్మియ లేమయెడ నావిధించు నిర్బంధమునకు మూలంబు - నాయిల్లాలి నెల్లపొలఁతులకు నొజ్జబంతిం జేయవలయు నను నాస నాకు మిక్కుటంబు - కాన. 13

ఆ. నిప్పువంటి నడత నేరిచి నాకన్న, దెల్ల నెఱిఁగి పనుల నిచ్చలందు
నాకు వేఱుగాక నారాణి రాణింప, వలయు నన్న కోర్కి బలిసె నాకు. 14

సీ. కస్తూరిబాయి కీ కాంక్ష యున్నదొ లేదొ, యించుక యేని నే నెఱుఁగనైతి
బ్రాలైన నెఱుఁగ దవ్వనిత, మాయామర్మ,వతిగాదు, స్వాతంత్ర్యవాంఛఁ బెంచు
నభినివేశం బున్నయతివ మితాలాప, చదువులేమికినై విచారపడదు
చదువుకై నాసల్పుజతనంబు గని యైన, విద్యాభిలాష చూపింపఁబోదు
తే. నాకుమాత్రమ తద్వాంఛ ననయఁజాగె, నాకెయే నాదుప్రేమకిల్లె తనర్చెఁ
గాన నమ్మానినియు నవ్విధాన నన్నుఁ, జూడవలెనన్న కోర్కి నన్వేదదయ్యె. 15

క. మా కన్యోన్యప్రేమము, లేకున్నను నిత్యనిర్వ్యలీకప్రణయం
బేకాశనైన నుంటన్, నాకోరికి తీవ్రవేదనకు ద వ్వయ్యెన్. 16

సీ. భార్యానురాగం బపారమై నెలకొంట, బడినైన నాకదే గొడవరేఁగి
దినకరుం దపరాంబుధిని బ్రుంగు టెప్పుడో, కాసంతచీఁకటి క్రమ్ము టెపుడొ
యదరి లేజవరాలికడ వ్రాలు టెప్పుడో, మించుఁబోఁడిని గుస్తరించు టెపుడొ
చెలువచిన్నారిచూపులఁ గాంచు టెప్పుడో, జిలిబిలిసరసముల్ చిమ్ము టెపుడొ
తే. యని నలంగితి దుర్భరమావియోగ, మవసరం బున్న లేకున్న నవియు నివియుఁ
గల్లవొల్లులు వల్కి వాల్గంటి కేను, తెప్పవడనీయ నద్దమరేయివఱకు. 17

తే. మితి యెఱుంగక యిటు పొలమేర దాఁటి, మూరిఁబోయిన నాలౌల్యమునకు దోడు
నాకుఁ గర్తవ్యకాంక్షయు లేకయున్న, నెట్టిచెట్టకు నగ్గమై యేద్తునొక్కొ. 18

పం. బికారినై దురంతరోగపీడ (స్రుక్కి యుందునో
యకాలమృత్యుఘోరవక్త్రమందుఁ జిక్కియుందునో
యిఁకెట్టిసంచరచ్ఛవత్వ మేపుసూపఁగాఁ బ్రపం
చకం బిసీ యటంచు రోయ స్రగ్గిమ్రగ్గి యుందునో. 19

వ. కాని ప్రతిదినంబును గాల్యకృత్యములు విధిగా నిర్వహించుటయు స్వప్నమందేని దబ్బఱ లాడకుంటయు నాముఖ్యవ్రతంబులు - కాన నన్నుఁ బెక్కుమాఱు లీరెండవ నియమంబ యుద్ధరించె - నది యట్లుండె. 20

తే. పొదలె సుత్కంఠ భార్యకుం జదువు నేర్ప, నేమిలాభంబు భోగేచ్ఛ యించుకేని
కాలము నను గ్రహింప దక్కమలనేత్ర, కిచ్చయా లేదు నెఱవేర్చు టెట్లు దీని. **21**

క. పైపెచ్చు రాత్రులం దే,నీపని సాగింపవలయు నెవ్విధిఁ బెద్దల్
దాపున మాటాడుదు నే, నోపఁగదా వారిచెంత నుంటకు నైనన్. **22**

తే. నాఁడు నేఁడును గత్తియవాడునందు, నువిద కవరోధ మర్యాద యున్నకతన
జవ్వనంబునఁ గస్తూరి చదువుజతన, మక్కఱకు రాక మివుల వమ్మయ్యెనకట. **23**

తే. ఆదరించిన కామాంధ మంతరించి, నుంత యెఱుక సమీపించు నంతలోన
లోకయాత్రా సమారంభ లోలబుద్ధి, వొదమి యవకాశ మింతేని వదయనైతి. **24**

క. గురుకడఁ జదివించుటకై, నెఱపిన జతనంబు సెడియె నెలంత తుదకు ను
త్తరము లిఖించుటకును గు,జ్జరాతిపొత్తంబుఁ జదువ శక్తి గడించెన్. **25**

క. ఆ యున్మత్తప్రేమకు, నీయకొనక యుందునేని యీనాఁడు సుధీ
గేయంబగు వైదుష్యం; బాయమకుం గుదిరియుండు నని యూహింతున్. **26**

క. అమె కపుడున్న విద్యా, వైముఖ్యముఁ బాసి యుండువాఁడ విశుద్ధ
ప్రేమకు నజయ్యకార్యం, బీమహి లేదంచుఁ దలఁతు నేఁ జిత్తమునన్. **27**

క. లాలసబారిం బడు న,న్నేలె నొకం డంటిఁ దొల్లి; యింకను నుడువన్
బోలిన విశేష మున్నది, యాలింపుఁడు విన్నవింతు నద్దాని నిటన్. **28**

క. నమ్మించెను బలుదృష్టాం, తమ్ములు న; న్నెవఁడు విమలతరనిష్ఠా యో
గమ్ము విడువం దతని దై, వమ్ము కటాక్షించుఁ దుది కవశ్యం బనుచున్. **29**

వ. ఎట్టులన హిందూసంఘమునం దతిబాల్యవివాహదురాచారం బున్నను, దాన జనించు నుపద్రవంబుఁ గొంతవట్టు తొలఁగింప జననీజనకులు నూతనవధూవరులకుం దఱచు వియోగంబ సమకూర్తు - రయ్యాచారంబు మాయందును బ్రయుక్తంబయ్యెఁ - బరిణయానంతరము చెల్లిన వత్సరంబు లైదింట మా జంట కూడియున్న కాలంబు మూఁడేండ్లకు న్మించనేరదు - మా కలయికయం దైదాఱు మాసమ్ములు నిండియు నిండకమున్న పుట్టినింటివారు కస్తూరిబాయి కాహ్వానమంపెడివా - రప్పిలుపు లప్పుడు నాకుఁ దీవ్రవేదనాజనకం బులై యుండెడివి - కాని మా యాలుమగల నవియ బ్రదికించె ననుట నిక్కువంబు - వెండియు **30**

ఆ. చదువుకొఱకు నేను బదునెన్మిదవయేఁటఁ, జేరినాఁడ నాంగ్లసీమ కదియ
మాకు దీర్ఘవిరహ మంత్రమై నేర్పె వి,యోగసహనశక్తి నుభయులకును. **31**

ఆ. ఇంగలాండు విడిచి యింటికిఁ జేరిన, పిదప నైన మాకుఁ గుదురదాయె
నాఱునెలలకొలఁది మీఱినకాలంబు, విషయసౌఖ్య మనుభవించు వీలు. 32

వ. ఏలనా నక్కాలమునం దాసులోని దారంబువోలె రాజకోటకున్ బొంబాయికిఁ దఱచు
పేరెమ్ములువాఱుట నాకుఁ దప్పనిపనియయ్యె. 33

ఆ. అవల దక్షిణంపు టాఫ్రికా పయనంబు, కూడివచ్చె దానితోడ నాకు
విషయసౌఖ్యవార్ధి వీచీపరంపరా, హతులఁ గడచు భాగ్య మగ్గపడియె. 34



# 5 ఉన్నతవిద్యాభ్యాసము

తే. పరిణయమునాఁటి కున్నతపాఠశాలఁ, జేరితి నటంచు మున్నె భాషించియుంటి
నేను నాయన్నలిద్దఱు దానియంద, చదువుచున్నార మయ్యవసరమునందు. 1

క. రెండవయన్నకు నాకున్, బెండిలితో నొక్కయేఁటివిద్య నశించెన్
వెండియు నయ్యగ్రజుఁ డె,న్నండును విద్యాలయంబునకుఁ జనఁడయ్యెన్. 2

క. హైందవసంసారమ్ముల, యం దెందఱు కుఱ్ఱవార లకటా నేఁడీ
చందంపు దుర్దశ న్వగఁ, బొందుచునున్నారొ దైవమునకే తెలియున్. 3

వ. మదీయవిద్యావ్యాసంగము మాత్రము తదనంతరము నిరంతరాయముగాఁ జాగుచుండెఁ
- బాఠశాలయందు మందబుద్ధి యను మచ్చ నాకు లేదయ్యె - నొజ్జలకు నాదెసఁ గూర్మి
మిక్కుటంబు - వారు నావిద్యాశీలంబులఁ గూర్చి తలిదండ్రులకుఁ బంపు కిల్లాకు నందెన్నఁ
డును జెడ్డవ్రాఁత కానంబడదాయె - నంతియ కాక యే నాయాయి కక్ష్యలయం దదృష్ట
వశంబునంజేసి బహుమానమ్ముల విద్యార్థి వేతనమ్ములఁ బడయఁగల్గితి - నాబుద్ధివైశద్యము
పట్ల నాకుఁ దృప్తి లేకుంట నిట్టి సమ్మానంబులు ప్రాప్తించు తఱి నబ్బురపడుచుండు
వాఁడ - నిట్లుండియు 4

క. శీలమ్మునయం దన్యుఁడు, వ్రేలుమడఁచి చూప నెట్టివీలును గలుగం
జాలని లీలఁ గడుంగడు, మేలుకొని చరింతుఁ బ్రతినిమేషమునందున్. 5

క. నలుసంత దోసఁగు పొసఁగిన, జలజల నా కశ్రుజలము జాల్కొను నిఁక నొ
జ్జలు నను శిక్షార్హునిగాఁ, దలఁచినతఱిఁ గల్గుసిల్గు తరమే నుడువన్. 6

ఆ. ఒక్కమాఱు నన్ను నొజ్జలు దండింప, నపుడు శిక్ష కదలనైతిఁ గాని
దండ్యమైనయంత తప్పుసల్పితినంచుఁ, బ్రజ తలంచు ననియ పనవినాఁడ. 7

క. ఒండగు తరగతియందో, రెండవ తరగతినొ యిది జరిగె నిట్టిద వే
తొం దేదవతరగతియం, దుండినతఱి జరిగె నప్పు డొజ్జలలోనన్. 8

వ. ప్రధానమై గిమీ యనునతండు వెలయు - నయ్యయ్యవారు 9

క. అంతేవాసులదెసఁ దా, నెంతే నాదరముసూపు నెల్లప్పుడు; గా
సంతయు నేమము దాఁటఁడు, మంతు గనిన శిక్షకుండు మాబడిలోనన్. 10

క. ఆయన మాకు శరీర, వ్యాయామంబును గ్రికెట్టునాట విధించెన్
నాయిచ్చ వీని మెచ్చదు, వాయని బిడియంబు గల్గువాఁడను గానన్. 11

వ. మఱియు దేహపరిశ్రమంబునకును జదువునకును సంబంధ మావంతయు గానరాదని యత్తఱి నాకొక దురభిప్రాయం బత్తియుండెఁ - గాని విద్యావిధానమునందు మానసికశిక్ష కెంత ప్రాధాన్యముండు నంత శారీరకశిక్షకును వలయు నను నర్థంబు నేఁ దెఱఁగితి - నది యట్లుండె. 12

క. అందందుఁ బచ్చబయళుల, యందుఁ గదున్దవ్వు నడుచు టది యుత్తమమం
చుందెలిసి నిత్యజీవిత, మందుఁ బ్రయోగించినాఁడ న మ్మరియాదన్. 13

వ. దానంజేసి పాఠశాలయందలి వ్యాయామంబు వదలుట నా కనర్థదాయకము గాదయ్యె - నడకయు నాకు వలయు దేహదార్ఢ్యమును బ్రసాదించె - మఱియు 14

క. మాయయ్యకుఁ బరిచర్యలు, సేయుతలం పెక్కు డగుటచేతన దేహ
వ్యాయామ వాంఛ తొలఁగం, ద్రోయవలసివచ్చె నాకు దుర్వారముగన్. 15

క. విడుదల గంటం గొట్టుడు, బడి విడి శరవేగ మదరఁ బర్వెత్తి కదుం
గదు బత్తిం బరిచర్యలు, నడుపుదుఁ దండ్రికి ముదమ్మునాట్యము సేయన్. 16

ఆ. అయ్యకూడిగంబు నాచరించెడిపట్ల, నన్ను నడ్డగించుచున్నదాని
వదలనిం దటంటి వ్యాయామ శిక్షను, వినఁడ గురుఁడు నాదు విన్నపంబు. 17

ఆ. మందవాసరమ్ము మాపటి వేళ నా,కపుడు తప్పదాయె నాటలాట
దాపరించె నొక్కతఱి ఘోరజీమూత, పటలకబళితాభ్ర భాగమగుచు. 18

తే. చెంతలేదయ్యె గడియార, మంతుపట్ట, దాయెఁ గాలంబు, కనుఁబ్రామె నబ్దనిచయ
మట్టె బడిఁజేర నందొక పిట్టయేని, గంటఁబడదయ్యె నపరాధ మంటుకొనియె. 19

వ. మఱుసటిదినంబునఁ బ్రధానాధ్యాపకుఁడు రాకరాముల పట్టికం బరికించి యోయీ నిన్నటి సాయంసమయమునం దీ వేల రావైతి వని నన్నడుగ నేఁ గలరూపెల్ల వెల్లడించితి - నతఁడు మద్వచనంబు విశ్వసింపక నాకార్థికశిక్షగా రెండణాలు విధించె - నయ్యవసరమునం దేను 20

క. వచ్చెఁగదా కల్లరి యను, పచ్చ యటం చదలు సెంది మద్గురువునకున్
నచ్చునటు లేమి పల్కుదు, నిచ్చో నాచరణయోగ్య మెయ్యది నాకున్. 21

క. అని వగచి సత్యమును న,మ్మినవాఁ డెవఁడేని ప్రతినిమేషంబుఁ బరా
కునకుం గరంబు దవ్వై, యునికి వలయు నం చెఱింగి యూఱటగంటిన్. 22

క. చదువుతఱి నేమఱిల్లుట, కిదియే మొదలయ్యెఁ దుదయు నిదియే యయ్యెన్
బదపడి నిక్క మెఱుంగుట, సదయుండై గురుఁడు సొమ్మొసఁగి మన్నించెన్. 23

తే. అంత నాతండ్రికోర్కిపై నయ్యవారు, సెలవొసంగిరి వ్యాయామశిక్ష విడువ
నాకు నీపనిపై నిచ్చ లేకయున్న, నష్ట మింతేని రాదయ్యె నడకయుంట. 24

వ. కాని వ్రాయసము చదువునం దొకపాలు కాఁజాల దనువెడఁగుఁదన మొందు నా కప్పుడుండుటంజేసి యద్దాన నా కొదవిన కీడు మిక్కుటంబు - పిమ్మట దానిందొలఁగింప నాపడిన పాట్లెల్ల వమ్మయ్యె - నందందుఁ గొందఱ యందముచిందువ్రాలం గాంచినతఱి నాకు లజ్జపైకొని పశ్చాత్తాప మనుభూతమయ్యె - జిఱుతప్రాయంబు నాఁటి యీలోటు సవరింప నావల నా వశంబుకాదయ్యె - వంకరటింకరవ్రాఁత యసమగ్రమగు విద్యకు గుర్తని యే నూహింతు. 25

ఆ. ముద్దుగుల్కు నాణిముత్యాలపోలిక, వ్రాలు వ్రాయ నేర్చ వదయుకొఱకు
నన్నుఁజూచి యెల్ల పిన్నలు శ్రద్ధవ,హింత్రుగాక కదు రహింత్రుగాక. 26

వ. అది యట్లుండె. 27

సీ. పేరుకొంటినిగదా! పెండ్లిసంబరముతోఁ, దుదముట్టె నొకయేఁటి చదు వటంచు
నీ లోటు సవరింప నాలోచన మొనర్చి, పైతరగతికి నన్ బంపి రొజ్జ
లరయేటితోఁ దృతీయమ్ము పూర్తియొనర్చి, పిదప నాల్గవకక్ష్యఁ గుదురుకొంటి
నద్దానఁ బారంబులం దనేకంబు ల, ధ్యాపనం బొనరింతు రాంగ్లమంద
తే. యగుట నుక్కిరిబిక్కిరి యయ్యె నాకు, నింతపేరాస వలదంచుఁ జింతచేసి
వెండియుఁ దృతీయకక్ష్యకే వెడల నిచ్చ,పడియు నవమానభీతి వెల్వడకయుంటి. 28

క. అదిగాక మత్పరిశ్రమ, మది నమ్మికదా గురుండు మాఱిచె న న్ని
ట్లిది యెన్నక వెన్నిచ్చినఁ, దదీయహృదయంబు నొవదా పలువగలన్. 29

వ. అని భయంపడి నాల్గవతరగతియంద నిలిచితి - నందు బోధించు రేఖాగణితము నా బుద్ధి కందక న న్నెంతయు నలయించెఁ - గాని క్రమక్రమంబునఁ బదిపండ్రెండు పాఠములు ముగియుదు దాన నాకభిరుచి యెక్కుడయ్యెఁ - బ్రయత్నసాధ్యములు గాని ప్రాప్యంబు లుండనేరవు కదా యని నేనప్పుడెఱింగితి - మరియు 30

ఉ. ఎంతయు నాసతోడ వరియించిన సంస్కృతభాష నాకు నా
వంతయు లొంగదయ్యె నదియట్టిద నిత్యము కంఠపాఠమున్
జింతన యున్నఁగాని యది చిక్కద! యాఱవకక్ష్య కేగి గ
త్యంతరమెద్ది యంచు భయమంది కదుంగదుఁ దల్లడిల్లితిన్. **31**

తే. సాటివారలు పారసీ చాల సులభ, మగ్గురుఁడు కుఱ్ఱవాండ్రఁబెల్లాదరించు
ననుచు మెత్తురుగాన నయ్యది తలంచి, సంస్కృతాధ్యయనమునకు స్వస్తిచెప్పి. **32**

మం. పారసీకక్ష్యలోపలఁ గూరుచుండ, నది సూచి నాసంస్కృతాధ్యాపకుండు
కదుఁ గొందలం బంది కలఁగి యావెన్క, ననుఁ బిల్వఁబంచి యెంతయు నాదరించి
యింతవెఱ్ఱి వటంచు నెపుడు ని న్నెఱుఁగఁ, గర్తవ్య మెద్దియో గ్రహియింపవైతి
నీ జాతి పే రేమి నీమతం బేది, నీకులం బెయ్యది నీతండ్రి యెవ్వఁ
డించుక తలపోయుమీ చిత్తమందు, నీజాతి కెల్ల వన్నియ నిచ్చుభాష
నీ మతాధారమై నెగడినభాష, చదువక విడుతువో సంస్కృతభాష
చిక్కుగా నున్న నాచెంతకు రమ్ము, చక్కఁగా బోధింతు సంతోష మదరఁ
గష్టంబు కలదంచుఁ గలగుందు వదకు, చదివినకొలఁది నుత్సాహంబు హెచ్చు. **33**

క. అనవుడు సిగ్గిల్లితి న,య్యనఘుని వాత్సల్య పూర మవిలంఘ్యంబై
వెనువెంటన పార్సీ చదు,వును మానితిఁ జనితి వేలుపుంబల్కునకున్. **34**

ఆ. ఇపుడు నామనంబు కృష్ణశంకరసూరి, సలిపినట్టి మేలు సంస్మరించు
నపుడు సంస్కృతంబు నాపాటియేని ప,ఠించు టెంతొ యుపకరించె నాకు. **35**

వ. అయ్యాధారమునంజేసి మనశాస్త్రార్థముల నించుక యెఱింగి సంతసించుచున్నాఁడ - నందుఁ గూలంకషంబగు పాండిత్యము లేమికి నా కెంతయు విచారంబు వొడము - హైందవ బాలికా బాలకు లెల్లరు గీర్వాణభాషను దప్పక నేర్వవలయునని నాయాశయమ్ము - మఱియు భారతదేశమునం దున్నతవిద్యావిధానంబున దేశభాషయు హిందీ సంస్కృతంబులుం బారసియు నరబ్బియు నాంగ్లమ్మును బార్యము లగునట్లొనర్చుట యవశ్యాచరణీయమని నాతలంపు - మఱియు **36**

తే. ఇన్ని బాసలఁ బరియించు టెట్లటంచు, జంకఁ బనియుండ దొక్కభాషను సమగ్ర
పాండితి గడించినం బెఱబాసలెల్లఁ, గరతలామలకంబులౌఁ గాదె మనకు. **37**

క. పరభాషఁ జరిత్రాదులఁ, గఱచెడి దురవస్థ చనినఁ గదు సులభం బి
త్తెఱఁగునఁ బఠించు; టది ని,ర్భరమగు నుత్సాహమునకుఁ బాదై వెలయున్. **38**



# 6 దుర్వార్త-1

తే. కొలఁదిమంది సఖుల్ బడిఁ గలరు నాకు, నెన్నఁదగినట్టివార లం దిరువు రుందు
రం దొకనిచెల్మి కొన్నాళ్ల కంతరించె, దాన నానేర మించుకంతైనఁ గాన. 1

ఉ. రెండవవానిమైత్రి విపరీతఫలంబు నొసంగి యాత్మకున్
బుందయిపోయె, సంస్కరణబుద్ధి నొనర్చితి వానిచెల్మి, నా
తండు మదగ్రజన్ముఁడును దద్దయు మిత్రులు, వానిలోపముల్
కొండొక నేనెఱింగియును గోరితి నాతనితోడి నెయ్యమున్. 2

వ. అతఁడు నమ్మఁదగినవాఁ డనునభిప్రాయము నా కుంటయు దీనికిమూలంబు - మా సంగాతముం దిలకించి "యీదుస్సహవాసంబు నీకేల"యని మాపెద్దలు నన్నెచ్చరించుడు వారి యానతిం దలఁదాల్చుటయ నాస్వభావం బైనను "మీతలంపు సహేతుకంబ - కాని యతనిం జక్కదిద్దుటయ నాయొనర్చు చెలిమికిం గత - మతండు తనలోపంబుల సవరించు కొన్న నెన్నిక కెక్కంగలఁడు - మీవిచారంబు దూరంబు సేయుఁ-"డని వారికి నచ్చఁజల్కి యథాపూర్వముంటి. 3

క. పదపడి యయ్యది ఘోరా, పదలకుఁ గుదురయ్యె నంతుపట్టెఁ బ్రమాదం
బదియెల్ల; నెల్ల మీఱుట, చదురే సంస్కరణకార్య సరణులనైనన్. 4

వ. నిక్కపుంజెల్మి యాత్మీయము నాఁదగు - నదిలోకమునందరిది - సమశీలుర మైత్రియు రాణించు - నిల్చు - నెచ్చెలుల గుణదోషము లొఁడొరులపైఁ బ్రాఁకుట తప్పదందు - నగుటంజేసి నెయ్యమున సంస్కరణమునకు గల యవకాశమించుక యనఁ జెల్లు - మాన వుఁడు మంచికంటెమున్న చెడ్డ నిచ్చగించుఁ - గాన నతిమైత్రి వలదని నాతలంపు - భగవన్మైత్రిగలవాఁ డేకాకిగానుండవలయు - నొండె లోకమెల్లం దనమిత్రమగునట్లు యత్నింపవలయు - నీ నావిచార మనుచితముకావచ్చుఁ గాని గాఢస్నేహముపొంటె నా కావించిన కృషియంతయు నాఱడివోయె. 5

క. ఆతనికిన్ నాకును సం,గాతం బభివృద్ధినందు కాలమ్మున నో
హో! తరఁగవోలె నెల్లర, చేతమ్ముల సంస్క్రియేచ్ఛ చెలఁగుచునుండెన్. 6

వ. అయ్యవసరంబున నాచెలిమికాఁ డొకనాఁడు నన్నుఁ జేరి 7

క. వింతు నొక వార్త, యొజ్జలు, మంతనమునఁ గల్లు త్రావి మాంసము నాహా
రింతురు కొందఱు నావుడు, వింతయుఁ జింతయును నాకు వెగ్గలమయ్యెన్. 8

వ. అంత నిట్టి యభోజ్యస్వీకరణంబునకుఁ గతం బెద్ది యని నే నుడువుడు నతండిట్లనియె. 9

సీ. పలలంబుఁ దినమి దౌర్బల్య మపారమై, యేఁజెల్ల! మనజాతి యేపుమాసె
మాంసభుక్కులుగాన మనపైని జోదన, దీయుచున్నా రాంగిలేయు లిప్పు
దెఱుఁగవే నాచేవ నెఱచి మెక్కుటఁ జేసి, లభియించె నా కిట్టి లావుకలిమి
పొలసుదిండులమేనఁ బుట్టనేరవు సుమీ, రోఁతఁ బుట్టించు కుర్పులుఁ గణంతు
ఆ. లరయ వెత్తిపప్పులై మనయొజ్జలు, మాంసభక్షణంబు మరగిరోటు
కంద నమలు మీవు కన్పడు నద్దాని, మహిమ నీకు రిత్తమాట లేల. **10**

క. అని పల్కి నన్ను మాంసా, శనుఁ జేయ నతండు పెక్కుసారులు యత్నిం
చెను సోదాహరణమ్ముగ, వినిపించెఁ దదీయవాదవిషయము లెల్లన్. **11**

తే. అంతకుం బూర్వమంద నాయగ్రజుండు, వీని పన్నినవలఁ జిక్కెఁగాన నతఁడు
నాదుచెలికాని వాదంబునకును బ్రక్క, తాళమును వైచి తత్సమర్థనముచేసె. **12**

క. వారిద్దఱున్ ద్రఢిష్ఠులు, ధీరులు బలవంతులగుచు దీపింతురు దు
ర్వారగతిం జరియింతురు, వారణ మశకాంతరంబు వారికి నాకున్. **13**

వ. అందు నానెచ్చెలికాఁడు **14**

సీ. ఎంత దవ్వైనఁ బర్వెత్తు వేసట లేక, బాణవేగమున భూభాగ మద్రువ
నెత్తు దూఁకుటయందు నెడవు లంఘించుటన్, దలపోయ నతని కతండ సాటి
యెన్ని దెబ్బలనైన వెన్నీక భరియించు, నాటలన్నింట జయంబు గాంచు
నతనినిర్వక్రపరాక్రమక్రమముఁ గ,న్గొన్నయంత వితాకు గొంటి నేను
తే. బిదప నీపాటిజెట్టినై పొదలవలయు, నన్న యభిలాష నాకు మెండయ్యె నపుడు
జతన మొనరింప నిదియు దుస్సాధ మగునె, యనెడు విశ్వాస ముదయించె నాత్మయందు. **15**

ఆ. మఱియు వలసినంత పిఱికితనంబు నా,కుండె దయ్యమనిన నురగమనిన
ద్రుచ్చు లనిన నడలు ముమ్మరమై నన్నుఁ, దల్లడిల్లఁ జేయు నెల్లగతుల. **16**

సీ. చీఁకటి యన్నచో నా కెంతయును భీతి, నిశల ముంగిలి దాఁటనేర నెపుడు
నొకవంకఁ జోరు లింకొకచక్కటిం బాము, లొండొక్కదెస బూచిపిండు నిండి
న న్గబళింపనున్న విధానఁ గన్పట్టుఁ, గావున నే నంధకారమందుఁ
బవ్వళించుట యసంభవము శయ్యామంది,రంబున దీపంబు గ్రాలవలయు
తే. నాభయంబుల నీజవ్వనంబునందుఁ, జెంత నిదురించు నింతికిఁ జెప్పు టెట్లు
ధీరత న్నను మించు నత్తెఱవ మిన్న,యని యెఱుంగుదుఁ గాన న న్నలము లజ్జ. **17**

క. చెలికాఁ డెఱుంగు నాకుం, గల భీరుత్వంబు నతఁడు గాముల నమ్మన్
జిలువల నాడించెద దొం,గలఁ దోలెద నే నటంచుఁ గడిమి న్దెలుపున్. **18**

వ. ఈ సాహసంబునకెల్ల నామిషాహారంబు నిదానంబని నుడువం బనిలేదు - మఱియుఁ
దత్కాలంబున విద్యార్థు లెల్లరు నుల్లాసంబుమెయి నర్మదకవి రచియించిన 19

తే. ఆంగిలేయుని జూడురా! హైందవులను, నాపలను జేసి కులుకుచున్నాఁడు నేఁడు
హేతువు నెఱుంగుదే యతం డెఱచిదిండి, యైదుమూరలపొడ వుండు నట్టికతన. 20

వ. అను గీతముం బాడుచుండు వా-రియ్యది తన కర్తవ్యము నెల్ల నిర్వహించి ధన్యతఁ
గాంచె - దీనికి నేనుం గైవసమైతి. 21

ఆ. క్రవ్యభక్షణంబు కర్తవ్య మనియు న, న్నది బలాఢ్యుఁ జేయు ననియు దాని
నెల్లవారుఁ దిన్నఁ దెల్లవారిం దోల, వచ్చు ననియుఁ దలఁపు లెచ్చె నాకు. 22

క. అరసియరసి లగ్న మొకం, డెఱచిన్ భుజియింప నిశ్చయించితి నదియున్
బెఱ లెఱుఁగకుండు సరణిన్, జరుగవలయు వైష్ణవంబు నామత మగుటన్. 23

సీ. అందు నాతలిదండ్రు లచ్చంపువైష్ణవుల్, గుడి కెల్లనాఁడు నేగుదురు విధిగ
మానాఁడికన్ జైనమతము పైకొనియుండు, నెల్లచో నది రాజ్య మేలుచుండు
జైన వైష్ణవ మత సంప్రదాయమ్ములఁ, బలలంబు పేరైనఁ బలుకఁబోల
దేదేశమందైన నేమతంబుననైన, మాంసనిషేధ మామాత్ర లేద
తే. యస్మదీయకుటుంబమం దలరుచున్న, సంస్క్రియారూప మిట్లుండ సాహసించి
నంజుడుందిను టెట్లంచు నాయెదంద, హెచ్చెను భయంబు తర్కముల్ పెచ్చుమీఱె. 24

క. జననీజనకులయెడ నా, కనూనమగు భక్తి యున్నయది; మత్పలలా
శనవృత్తాంతము విన్నం, తన వారలు చత్తురనియు నాకున్ దెలియున్. 25

తే. అపుడు సత్యాభిరతియు నన్నంటియుంటఁ, బలలభక్షణమునకు లోపడ్డనాఁడు
గల్లలనుబల్కి పితరులఁ గన్నుఁబ్రామ, నదుముగట్టవలయునంచు నాకుఁదెలియు. 26

వ. నాదృష్టి యంతయు సంస్కారదీక్షపైఁ దిరపడియుంట వీని సరకుసేయనైతి - బలవిక్రమంబు
లందగోరియ యే నిమ్మాంసభక్షణము నాసించితిఁగాని జిహ్వాచాపల్యమునఁ గాదనుట
నిక్కువంబు. 27

తే. చెలిమికాండ్రును నేను నిప్పొలసు మెక్కి, తెల్లవారల నోడించి దేశమాత
బన్నములనెల్లఁ దొలగింపవచ్చు నన్న, యిచ్ఛయే దీని సేవింప హేతువయ్యె. 28

వ. ఈ సంస్కరణపుందిక్క యిట్లు న న్నంధునిఁ జేయుటం జేసి 29

తే. తల్లిదండ్రులయెఱుకకు దవ్వొనర్చి, యిది రహస్యంబుగా నుంచు టించుకేని
సత్యదూరంబు గాదని స్వాంతమందు, విశ్వసించితి దేశాభివృద్ధిఁ గోరి. 30



# 7 దుర్వార్త–2

తే. వచ్చె నిర్ణీతదివస మెవ్వనితరంబు, నాఁటినాయున్కినెల్ల వర్ణన మొనర్ప
నొక్కదెస సంప్రక్రియోత్సాహముబ్బుచుండె, నొక్కదెస దొంగపనికి సిగ్గొదవుచుండె. 1

ఆ. ఏకతంబుఁ గోరి యేఁజెలికానితో, నెనసి వెదకి యొక్కయేటిదరికిఁ
జేరి కంటి నాదుజీవితమున మొట్ట, మొదలుగాఁగఁ బొలసుముక్క లచట. 2

సీ. కల్లురొట్టెయు నందుఁ గలదెయ్యదియు నాకు, రుచియింపదయ్యె బల్రోఁతపుట్టె
బెడిదమై తోలుకైవడి నుండె మాంస మ,ద్దాని మెక్కుట యసాధ్యంబ యయ్యె
నోకరింత జనించి డోఁకు వచ్చుటఁజేసి, పరిహరించితిని దద్భక్షణంబు
నారేయి నాకు నావంత నిద్దుర లేక, దుస్స్వప్నములు పెక్కు దొదరి కలఁచెఁ

ఆ. గన్ను మూఁతవడుదు గర్భమునందు "మే,మే" యటంచు నొక్కమేఁక యఱచు
నంత భయము వచ్చు సంతాపమా హెచ్చు, నాయవస్థ యిట్టు లాయె నపుడు. 3

వ. అయినను మాంసభక్షణంబు మాను టెట్లని యూహించి వెండియు రెండింతలు ధైర్యంబుఁ
దెచ్చుకొనుచుంటి – నంత 4

క. మఱునాఁటినుండి నెయ్యుఁడు, తరసంబును జేర్చి పలువిధమ్ముల వంటల్
కరము చవిపుట్టునట్టులు, విరచింపఁ దొడంగెఁ బాకవిద్యాప్రౌఢిన్. 5

ఉ. ఈయెర పాఱె రొట్టెపయి నేవముజాఱెను మేఁకఁగూర్చి య
య్యో యనిపల్వరించు టెటులో పరువెత్తెఁ గరంబు రుచ్యమై
పాయనికోర్కెఁబెంచెఁ బలపాకము లీకరణిన్ గతించెఁ బో
హోయనమొక్కఁ డీ చెయిద మన్య్ఱ లెఱుంగ రొకించుకంతయున్. 6

తే. అపరిమితమూల్యసంప్రాప్య మైనకతన, మాంసభక్షణ మిరుమూఁడుమార్ల జరిగె
నాకడ ధనంబులేకున్న నన్నుఁ జెఱుప, వలయు వెచ్చంబు నోర్చె సావాసకాఁడు. 7

ఆ. వానికేని సొమ్ము వచ్చెడు నవకాశ, మల్పమగుట విందు లప్పుడపుడు
నూటి కొక్కనాఁడు కోటికి నొక్కనాఁ, డారగించుచుండువార మేము. 8

తే. పొలసుమెక్కిననాఁ డన్నముం ద్యజింతు, నింక నద్దానితోఁ బని యేమి నాకు
నమ్మ ప్రొల్మాలి తేమని యడుగఁ దిండి, యఱుగలేదయ్యెనని నెపంబాడువాఁడ. 9

క. ముందరకాళ్ళకు నే నిటు, బందంబులు వేయుతతి నపారం బగు చిం
తం దగిలి తల్లికే క,ల్లం దెలుపుచు నుంటి "నన్నలా" యని వగతున్. 10

క. ఇదితెలిసెనేని పితరుల, హృదయమ్ములు వగులు నంచు నెఱుఁగుదుఁ గానన్
మది కియ్యది గాలంబై, తుదలేని విచారజలధిఁ దోఁగించె ననున్. 11

మం. మాంసభక్షణమును మరగి యద్దాని, హైందవులం దెల్ల వ్యాపింపఁజేసి
పరజాతి యేల్బడి భరతోర్వినుండి, పాఱఁద్రోలుట మేలిపనియైన నిట్లు
తల్లిదండ్రుల కసత్యములు సెప్పుటయుఁ, గడఁగి వారల నిట్లు కన్నుఁబ్రాముటయు
నెఱచి మానుటకంటె నెగ్గగుం గాన, నవ్వారిబొందిలోఁ బ్రాణంబు లుండ
నామిషంబును మెక్కు టది కానిచేఁత, తదనంతరము నిరాతంకపద్ధతిని
జాటుమాటులు లేక సాగింపవచ్చు, నంతియ కాని యయ్యద నబ్బుదనుక
మాంసంబు దిన నంచు మది నిశ్చయించి, యనుఁగున కివ్విషయంబెల్ల వినిచి
తిరుగ నంజూదుతిండిదెసకుఁ బోనైతి. 12

వ. తమబిడ్డ లిద్దఱు పొలసుదిండు లైన వార్త మా జననీ జనకుల కెన్నఁడును శ్రుతిగోచరము గాదయ్యె – వారితోఁ గల్ల లాడఁ జన దన్న సద్విచారము వొదముటంజేసియ నేను మాంసభక్షణము విడిచితిఁ – గాని నాచెలికానిపొందుమాత్ర ముజ్జగింపనైతి – లాఁతివారలఁ జక్కదిద్దవలయు నన్న యుబలాటంబ నా కెంతయుఁ జెట్టఁగూర్చె – దీని నెఱుఁగువివేకంబు నా కపు డణుమాత్రము లేదయ్యె. 13

ఆ. దైవవశతఁజేసి యావంతలోపలఁ, దొలఁగెఁ గాని వానిచెలిమి నన్నుఁ
ద్రోసి యుండు నకట దుర్వ్యభిచార కూ,పంబునందుఁ బాపభవనమందు. 14

చ. అతఁ డొకనాఁడు నన్ను వెలయాలి గృహమ్మును జేర్చి యెల్ల ప
ద్ధతులను మప్పి లోపలికిఁ దాఁ బనిచెన్ దురితోగ్రదేవతా
శితతరదంష్ట్రికల్ నడుమఁ జిక్కితిఁగాని మదీయదుష్కృతి
ప్రతిఘటనం బొనర్చి భగవానుఁడు నన్మనిపెన్ గృపామతిన్. 15

సీ. ఆపాపకందర మం దేమి సెప్పుదుఁ, గన్నులఁ జీఁకటున్ గ్రమ్ముకొనియె
మందునకే నొక్కమాట వెల్వడదయ్యెఁ, జెమరుచే నొడలెల్లఁ జెమ్మగిల్లెఁ
గంపమ్ము హెచ్చె నగ్గలమయ్యె గగ్గోలు, సెజ్జపై బోగపుంజెలువ కెలన
నధివసించితిఁగాని యంకిళ్ళు బిగువయ్యె, నాకొమ్మ తడ వోర్వలేక తిట్టి
తే. నెట్టివాకిలి సూపె నప్పట్టునందు, వచ్చె నాపుంస్త్వమున కయో మచ్చ యనుచు
సిగ్గువడి తల్లి! వసుమతీ! శీఘ్రముగను, దారి నొసఁగుము నా కంచుఁ దల్లడిలితి. 16

క. అటులయ్యును న న్నీయు,త్కటదుర్దశనుండి తొలఁచి కాచిన ఘటనా
ఘటనావిశారదునకున్, బటుభక్తిన్ మ్రొక్కుచుంటిఁ బరమేశునకున్. 17

ఆ. దాపరించె నాపదలు మఱి నాల్గు నా, బ్రతుకునందు; వాని నతకరింపఁ
బౌరుషంబుకంటె భాగ్యంబ తద్దయుఁ, దోడుపడియె మేలు కూడునట్లు. **18**

వ. న్యాయైకదృష్టిని విమర్శించిన నివియెల్లఁ దప్పిదమ్ములయగు - నేల యన నిందు విషయా సక్తికిఁ గొఱంత కానరాదు - తలఁపు సేఁతలు రెండును గుణదోషంబుల సమప్రాధాన్యంబు వహించుఁగదా! - కాని లౌకికదృష్టిం గేవలక్రియల యెన్నికకు వచ్చుఁ - గాన నీచూపునఁ జూచునపుడు మాత్రము నేను నిర్దోషినయ్యెద - నయ్యదియట్లుండె. **19**

మం. భగవదనుగ్రహబల ముండునేని, గర్తలొ వారికిఁ గారయితలకుఁ
దలఁగుఁ జెట్ట లొకొక్క తతియందుఁ గొన్ని, తలఁగినపిమ్మటం దగినవివేక
మొదవుదు మానవుఁ దుల్లంబునందుఁ దనకు, రాఁగల కీడు దప్పించినట్టి
సర్వేశుదయను సంస్మరణంబు సేయు, నరుఁడు విశ్వప్రయత్నం బొనర్చియును
వికృతికిం బాలౌట విశ్రుతం బెందు, నట్టుల యీశ్వరుఁ దద్దమై దాని
మరలించి ప్రోచుట మనకుఁ దెల్లంబ! యియ్యది సకలంబు నెట్లు సిద్ధించు?
జనునకు నేపాటి స్వాతంత్ర్య ముండుఁ, బరతంత్రదశ యెంతవఱ కంటియుండుఁ
బౌరుషం బది యెంతవట్టు ఫలించు? నీశ్వరానుగ్రహం బెట్టిచోఁ గలుగు?
నివ్విషయంబెల్ల నేనాఁటికైన, నూహకు నందఁబో దుర్వి నెవ్వనికి. **20**

వ. ఇఁకఁ బ్రకృతాంశమునం జొత్తము - నాయనుఁగు నన్నిట్టి దుర్దశకుఁ బాల్పఱిచినను నే నతని దుస్సహవాసంబు నింకను విడనైతి - నాతనిదెస నాయూహింపని లోపములఁ గొన్నింటిఁ బ్రత్యక్షముగ వీక్షించుదనుకఁ దత్సాహచర్యంబునంజేసి నా సల్పిన దుష్కార్యంబులు మఱికొన్ని గలవు - వానిం గాలోచితమ్ముగా మున్ముందు వివరింతు - నందొకటి మాత్ర మిపుడ యావిష్కార్యమగుట నప్పనికిం గడఁగెద. **21**

తే. పొలఁతుకకు నాకు నెడఁదలఁ బొరపు వుట్ట, నితనిపొత్తొకహేతువై వెతలఁ గుడిపె
మగువదెసనాకుఁ గామానుమానములుస,మంబులై యుండునంటిఁ బూర్వంబునంద. **22**

క. అ య్యనుమానాగ్నిని నా, నెయ్యుఁడు దరికొల్పె నతఁడు నిజ మాడు నటం
చెయ్యెడఁ దలంతుఁ గానన్, దొయ్యలికిం గూర్చినాఁడ దుర్భరహింసన్. **23**

క. ఈరీతివెతల హైందవ, నారీమణిగాక లాఁతినాతి భరింపన్
నేర దటు లౌటఁజేసి క్ష, మారూపం బని తలంతు మది నమ్మగువన్. **24**

వ. ధర్మపత్ని నిట్లు బాధించిన నన్ను నేనెన్నఁడు న్మన్నించుకొననైతి - నట్లు గావించుటయు నా కసాధ్యమగు కృత్యంబ - మఱియు **25**

ఆ. హేతు వింత లేకయే సంశయించినఁ, దొలఁగవచ్చు బంటు కొలువునుండి
సుతుఁడు తండ్రిమొగము సూడకపోవచ్చు, ననుఁగు చెలిమి వీడి యరుగవచ్చు. **26**

తే. కాని నిష్కారణంబుగా గరిత విభుని, చేత శంకితయై యేమి సేయనేర్చు
నకట! యటుగాక తా సంశయంబువడియు, మగనిదెసఁ జూపలే దెట్టితెగువనేని. 27

ఆ. దొడ్డయింటివారిబిడ్డ హైందవకాంత, రచ్చ కెక్కి పెండ్లియుచ్చు ద్రెంపఁ
గడఁగ, దాశ్రయంబు కా దాపెకుం జట్ట, మకట యోర్వరాని దాకెసిల్లు. 28

క. ఇట్టు దురవస్థ లంటం, గట్టితి నవివేకవశతఁ గాంతకు నే నా
కట్టిఁడిచేఁతల నకటా, యెట్టులు మఱవంగలాఁద నీజన్మమునన్. 29

సీ. సవిశేషముగ నహింస నెఱింగినంతని, య్యనుమానభూతంబు ననుఁ దొఱంగె
బ్రహ్మచర్యప్రభావంబు నప్పు డెఱింగి, ఘటదాసి కాదు పో! కాంతమగని
కని, సహచారిణి యని, సహధర్మిణి, యని, భర్తృకష్టసౌఖ్యంబులందు
నాపెకుఁ బా లున్న దని, స్వతంత్రతయందు, నాలుమగల్ తుల్యు లనియుఁ దెలిసి

ఆ. కొనితి నాఁటిమొఱకుఁదనముఁ గారిన్యంబు, నంధమైత్రి నిప్పు డరసికొన్న
నలుక హెచ్చు, దుఃఖ మాఁగదు లజ్జయుఁ, జిందులాడు నేమి సెప్పువాఁడ. 30



## 8 దొంగతనము – ప్రాయశ్చిత్తము

క. ఏ నెఱచి మెక్కునపుడును, దానికి మును కొన్నికొన్ని తప్పుంజెయువుల్
నానెఱపినట్టి వున్నవి, వాని న్వివరించి పలుక వలతును దీనన్. 1

క. చుట్టను ద్రావుటకై నా, చుట్టం బొకరుండు నేనుఁ జూచితి మొకనాఁ
డెట్టిఫలంబును దానన్, బట్టువడంజాల దన్న పాడి నెఱిఁగియున్. 2

వ. ఈయభ్యాసంబు మాపితృవ్యునకుం గల – దతఁడు ధూమపానమొనర్చుటం జూడ మాకును
సిగరెట్లతో నలఁతియలంతి మొయిళ్ళ నిర్మింప నుత్సాహంబువొడమె నంత నేము 3

క. కొనుటకు రొక్కము లేమిన్, బినతండిరి కాల్చి పీల్చి విడిచినచుట్టల్-
తునుకల నేఱి రహస్య, మ్మునఁ గాల్పఁ దొడంగితిమి ప్రమోదము హెచ్చన్. 4

తే. ఇచ్చవచ్చినవేళలందెల్ల మాకుఁ, జిక్కవయ్యె నయ్యెంగిలిముక్కలైనఁ
జిక్కినన్ బొగ హెచ్చువచ్చెడిదిగామి, ఫలముసున్నయయ్యెను వ్రతభంగమైన. 5

తే. అట్లగుట సేవకులసొమ్ము ననువుమీఱ, ముచ్చిలించి బీడీలను దెచ్చి కాల్పఁ
గడఁగితిమి కాని పెద్దలకంటి కెడము, సేయు టెంతయు నిబ్బందియాయె వాని. 6

తే. కడచె నొకకొంతకాల మిక్కరణి నంత, నలఁతియలఁతిరంధ్రమ్ముల నలరుకొన్ని
కాడలం గాల్చితిమి కాని కలుగదయ్యె, నందు సంతృప్తిమాకు నావంతయేని? 7

తే. అంత మా యస్వతంత్రత నరసి వగచి, యేటి కీ బ్రదు కెన్నినా ళ్ళిట్టు లేద్వఁ
గల మిసీ యని యూహించి కట్టకడకు, నాత్మహత్యయె కర్తవ్య మని తెగించి. 8

క. ఉమ్మెత్తవిత్తులందు వి, సమ్ముండు నటం చెఱింగి సవిధస్థార
ణ్యమ్మునకుం జని తద్బీ, జమ్ముల నార్జించి సందెజాము కదియుదున్. 9

క. చేరితి మల్లల్లన కే,దారేశ్వరుగుడికి భక్తితాత్పర్యములన్
గోరి భజించితి మా దు,ర్గారమణుని దీపధూప కైంకర్యములన్. 10

వ. తదనంతర మొక మాఱుమూలకుఁ జని రెండు మూఁడు గింజలం గొఱుకుడు 11

తే. వెంటనే చంపునొక్కొ యీ విత్తనంబు, తడవు యాతన గూర్చుచోఁ దాళుటెట్లు
చచ్చిపోయినచో నేమి వచ్చు ఫలము, పారతంత్ర్యముతో నైన బ్రతుకఁదగదె. 12

క. అను నూహ లగ్గలంబై, తునిమె ధృతిన్ మృతి యటన్న దుర్భరమగుచున్
బెనఁగొనె భయంబు కంపం, బనూనమై మమ్ముఁ గలఁచె నలమెం జెమటల్. 13

ఆ. అంతఁ జిత్తశాంతి నందఁదలంచి నా, విందుఁ గూడి రామమందిరమున
కరిగినాఁడ నందు సావధానమ్ముగా, శ్రీనివాసుభజనఁ జేసినాఁడ. 14

తే. తన్నుఁదాఁ జంపుకొనుటన్నఁదలఁపువోలెఁ, గడుఁ జులుకనైనకార్యంబు గాదటంచు
నాకు నమ్మిక యేర్పడె నాఁటఁగోలె, నెవఁడు వరియించు మరణంబునిచ్చతోడ. 15

సీ. అతి సుత యెవ్వఁడే నాత్మహత్య యొనర్చు, కొందు నే నని పల్క నుండనేర
దావంతలక్ష్యమే నప్పల్కుపైని నా, కయ్యది యనుభూత మైనకతనఁ
గీడులో మే లన్న జాడ నాజతనంబు, సిగరెట్ల కొకనమస్కృతి యొనర్ప
సాయంపడియె ధూమపాయితావాంఛ నా, కవ్వల నుదయింపదయ్యె మఱియు
తే. నది కడుంగడు హేయ మైనట్టిచేఁత, రోగముల కాలవాల మనాగరకము
దానికై యింత కుతియేల దైవమా! జ,నంబులకటంచునే నబ్బురంబువడుదు. 16

వ. ఇఁకఁ బ్రకృతమ్మునకు వత్తము – ధూమపానార్థము నా యొనర్చిన యీ ధన చౌర్యము
నాపదుమూఁడవయేఁటఁ బ్రవర్తిల్లె – నవ్వల రెండేండ్లు కడచుడు 17

క. నాసోదరుఁ డొకఁడు దుర, భ్యాసమ్ములఁ జిక్కి ఋణముపాలయి మివులన్
గాసివడ నేను నాతఁడు, నీసేగిం గడచుమార్గ మెయ్యదియంచున్. 18

ఆ. అరసి తుట్టతుదకు నాతనిచేతి బం, గారుమురుగు సుంత కత్తిరింప
నిశ్చయించి వెంటనే పని ముగియించి, తీర్చితిమి ఋణంబు మార్చి దాని. 19

తే. అవల నీచేఁతపై రోఁత యావహిల్లఁ, దగదు తగ దిఁక నిట్టివర్తన మటంచు
నిశ్చయించి నే గురున కీ నింద్యవార్తఁ, దెలిపి మన్నింపుఁ డని వేఁడఁదలఁచికొంటి. 20

తే. జనకుఁ డీమాట విన్న రోషంబు నంది, తిట్టికొట్టు నటన్న సందియములేదు
సుతుల నాతఁడు వాత్సల్యశూన్యుఁ డగుచుఁ, బట్టి బాధించి యెఱుఁగఁ డెప్పట్లనైన. 21

క. ఇక్కథ విని యుల్లంబు చి,వుక్కురు మన నాతఁ డెంత వొగులునొ యను బీ
తొక్కండ నన్నుఁ బెనఁగొనె, నక్కట నాధైర్యసార మంతట నడఁగెన్. 22

వ. ఐన నియ్యపరాధము జనకునకు నివేదించినఁగాని చిత్తశుద్ధి సిద్ధింప దని యెట్టకేలకు
సాహసంపడియు నివ్విషయంబుఁ బితృసమ్ముఖమున వా విచ్చి పలుకనోడి 23

క. ఒకచిన్న కాగితముపై, సకలంబు లిఖించి మదపచారంబున కిం
చుకయు న్వగవక తగు శి, క్షకూర్పవే! తండ్రి! యింకఁ జౌర్యము సలుపన్. 24

ఆ. అనియు నందు వ్రాసి యాకమ్మ నాపాద, మస్తకంబుఁ గంపమగ్నమై త
నర్ప నర్పణం బొనర్చితి మంచము, పట్టియున్న జనకు పాణిసీమ. 25

ఉ. అంత నతండు లేఖము సమస్తముఁ గన్గొని యాణిముత్తెపుం
దొంతరకైవడిన్ విడిచెఁ దోడన యశ్రుకణంబు, లేమి వి
న్పింతుఁ, దదంబుపూరములు నిండి తొలంకఁ గరస్థలేఖ, నొ
క్కింతవిచారముద్ర ధరియించెగురుండు నిమీలితాక్షుఁడై. 26

క. పిదప నతం దప్పత్రముఁ, జిద్రుపలు గావించె నతని చిత్తమ్మునయం
దొదవినవేదనఁ గన్గొని, తుదలేని విచారజలధిఁ దోఁగితి నేనున్. 27

క. అదృశ్యము మఱపునకున్, రా దేనాఁటికిని; జిత్రరచనావిద్యా
వైదుష్యము నా కుండిన,చో దానిన్ దిద్ది తీర్చి చూపెడివాఁడన్. 28

సీ. పితృపాదలోచనచ్యుతవిశుద్ధప్రేమ, రసపూర్ణ బాష్పధారాస్రవంతి
పూత మ్మొనర్చె నాచేతమ్ము నొర మత్కలుషపంకమునెల్లఁ గడిగివైచె
నాప్రేమమాహాత్మ్య మనుభవించినవాని, కొక్కనికే వేద్య మూహసేయ
ననురాగబాణోపహతి చవిసూచిన, వానికే తెలియు నద్దానిమహిమ

తే. మనిగదా మాన్యులు కవీంద్రు లాడి రిదియు, నా కహింసాప్రబోధమై నన్ను మేలు
కొలిపె నానాఁడు పుత్త్రవత్సలతకంటె, నన్య మెద్దియుఁ గానరాదయ్యె దీన. 29

వ. నేఁడు మాత్ర మదికేవల మహింసయని సువ్యక్తమయ్యె - నేనాఁడది విశ్వంబు నెల్లఁ దన
కౌఁగిటికిం జేర్చు నానాఁడ తదీయ సంస్పర్శము నందిన ప్రతి వస్తువునకు న్మేలిమార్పు
వాటిల్లు - దాని శక్తికి మేరలేదని వాక్రుత్తు. 30

మం. తండ్రి యిత్తతి నింత తాలిమి సూపు, నని యెంచనైతి నత్యాశ్చర్యజనక
మై వన్నెకెక్కిన యతనిసైరణకుఁ, జర్చింప నాదు దోషపరిగ్రహంబ
కారణమై నాకుఁ గన్పించుచుండు, నీ నేర మింకఁ జేయ నిదె బుద్ధి వచ్చె
నని బాసచేసి నిజాపరాధంబు, దండనగావింపఁ దగు నధికారి
ముం దొప్పుకొనుటయే మొదటిపాచితము, నే నిట్టికార్యంబు నెఱపుటంజేసి
యితని మన్గడపట్ల నిఁక భయంబుండ, దని నన్నుఁగూర్చి నాయయ్య భావించె
నాతఁడు మఱియు నాయందున్న ముద్దు, తద్ధగావించెఁ బెద్దయు సంతసించె. **31**



# 9 పితృనిర్యాణము - నామహోవమానము

క. పదునాఱేఁడుల వయసు,న్నది నా కీనాఁడు; నేఁడు నాతండ్రి వ్యధా
పదమునకు భగందర మను, గదమునకుం జిక్కెఁ బూర్వకర్మమువలనన్. **1**

సీ. నాతల్లియును నేను భ్రాఁతబం టొకరుండు, నయ్యకుఁ బ్రథమగణ్యంబ యైన
యూడిగంబును సల్పుచుండెడివార మం, దే నౌషధంబుల నిచ్చుచుంట
మందులు నూఱుట మఱి కట్టు కట్టుట, మున్నగు నూడియమ్ముల నొనర్తు
నెల్లరాత్రులఁ దండ్రి కేఁ బాదసంవాహ, నక్రియ నిచ్చమై నడిపి యిఁకను
తే. జాలునని వార లానయొసంగినపుడొ, నిదురకుం జిక్కునప్పుడో వదలువాడ
నయనుగొల్చుటయన నాకుఁ బ్రియతమంబు, నాకునొకనాఁడునిందుఁ బరాకులేదు. **2**

తే. నిత్యకృత్యంబులకుఁ జెల్ల నిలువ యుండు, సమయమును బారశాలకు జనకసేవ
కును విభాగించి యెపుడేని గురుఁడు ముదల,నిచ్చుచో మాపట వయాళి కేగువాఁడ. **3**

క. ఆ సమయందే సరిగా, నాసతికిం జూలు నిలిచె నా కవ్విషయం
బీసమయమ్మునఁ దలఁచిన, వే సిగ్గు జనించు రెండువిధముల దళమై. **4**

వ. నేను విద్యార్థినయ్యు బ్రహ్మచర్యమునకుఁ దిలోదకంబులు సమర్పించుటయు నాధర్మమగు విద్యావ్యాసంగము కంటెను బైపెచ్చు చిన్ననాఁటినుండియు శ్రవణునిశీలము నా కాదర్శ మగుట నాపరమధర్మంబైన పితృసపర్యకంటెను మిక్కుటముగా భోగములకుఁ గొలువు సల్పుటయు నయ్యిరుతెఱంగుల లజ్జకుఁ గారణంబులయ్యె - నక్కాలంబున **5**

క. కరములు జనకుని పదపం, కరుహంబుల నుండ సెజ్జగదిపై నెద తాఁ
గర మాస నిలుచు భాస్కర, కరతాపం బడఁగు టాదిగ నిసీ తనకున్. **6**

క. మత మాయుర్వేదము నం, చితలోకజ్ఞానము న్నిషేధించుతతిన్
గతి దప్పి లతాంగీసం, గతికిం గుతుకంబు సూపఁ గడఁగితి నకటా. 7

క. తన సేవనుండి జనకుఁడు, నను వీడుటకై నిరీక్షణము సల్పుచు న
ప్పని దీఱుడు నుప్పొంగుచుఁ, జనువాఁడం బడుకగదికి శరవేగమునన్. 8

సీ. అపుడ పితృవ్యాధి యగ్గలం బగుచుండె, జరిగె నానాఁటఁ బెక్కురచికిత్స
యవల నాంగ్లేయవైద్యము ప్రయుక్తంబయ్యె, గుణ మించుకేని చేకూరదయ్యె
నింక శస్త్రచికిత్సయే శరణ్యం బని, తలఁచి బొంబాయి పత్తనము సేరి
కోఁతవైద్యమునందు ఖ్యాతి గాంచిన భిష,క్శేఖరు నాశ్రయించితిమి కాని

తే. "వలదు వల దీచికిత్స యీవయసునం" ద,టంచు మాయింటి వెజ్జువారించె నతఁడు
గట్టివాఁ డౌట నాతనిపట్టు గెలువ, మఱలివచ్చితి మింటికి మఱుదినంబు. 9

ఆ. మాకుటుంబవైద్యుఁ డీకొన్నచోఁ దండ్రి, పుండు, బాధ తొలఁగియుండుఁగాని
యీశ్వరేచ్ఛ భిన్న మెవనికి మరణంబు, తతియు వేళ మేలివెరవు దోఁచు. 10

క. పదపడి మజ్జనకునకున్, ముదిరెను వ్రణబాధ దేహమును శుష్కించెన్
బ్రదుకుపయి శంక వొడమెను, జెదరెను ధైర్యంబు పలుకుఁజేవయు సడలెన్. 11

ఆ. పడుకయంద యెల్లపనులు ముగించు దు,స్థితిజనించెఁ గాని చిట్టచివర
గడియవఱకు నాతఁ డొడఁబడకుండె న,క్కార్యమునకు నెంతకష్టమైన. 12

వ. వైష్ణవమతమ్మున బహిశ్శుద్ధినిగూర్చి కట్టుచట్టంబు లుంటయ దీనికిఁ గారణం - బట్టి శుచియు వాంఛనీయంబ - కాని 13

సీ. అణుమాత్రమును రోగి యాయాస మందక, పాన్పు మాలిన్యంబుపాలు గాక
పరిశుద్ధి కావంతకొఱంత వాటిల్లక, యుండుచందంబునఁ బండియున్న
శయనంబునంద మజ్జనకృత్య మాదియౌ, నక్కఱలం దీర్చునట్టివెరవు
బోధించె భారతభూమికి నాంగ్లేయ, వైద్యశాస్త్రం బిట్టి వర్ణనీయ

తే. శుద్ధి వైష్ణవమతధర్మసూత్రకోటి, యందు నంతర్గతంబుగా నలరుచుండుఁ
గాని నాతండ్రి సలుపు నిక్కరినచర్య, నెంతయును వింత వొడమ నగ్గింతునపుడు. 14

మధ్యా. బెడిదంబగు తెవులు రేఁగి పెనఁగొనఁ దనయన్న యిట్లు
కదలేని యిడుమలం గుడుచుకథ విని నా పిన్నతండ్రి
యడలొంది పోర్బందరుపురి నప్పుడ తా వీడనాడి
వడివడిపయనంబు లదర వచ్చెను దత్సేవ సలుప. 15

తే. అన్న సెజ్జకుఁ బజ్జ నాపిన్నతండ్రి, కోర్కిమెయిఁ బవల్ నాల్గుజా ల్గూరుచుండి
రేయి మమ్ములనెల్ల నిద్రింపనంపి, యత్తమిల్లుచు నుండు నమ్మెత్తకెలన. 16

తే. ఇంతలోఁ గాళరాత్రి తా నేగుదెంచె, నిదియ పో కర్మచంద్రున కిజ్జగానఁ
దుట్టతుదిరే యటం చూహ తట్టదయ్యె, మా కనారతమై భీతిమాత్ర ముండె. 17

క. అది నిసిఁ బండ్రెండవగడె కదిసినసమయంబు తండ్రికా ళ్లొత్తుచు నే
నెదిరించు నిదురతోడం, గదనం బొనరించుచుంటిఁ గడిమి వెలుంగన్. 18

తే. నాయవస్థను దిలకించి నాపితృవ్యుఁ, డే నిచట నుండుఁ బవళింపు మీవు వెడలి
యని వచించుడు నానందమున మునింగి, సెజ్జగది కొక్కపెట్టునఁ జేరినాఁడ. 19

క. పాపము! నిద్రావశయై, నాపైదలి శయ్య నుండె నవలా నపుడే
లేపితి నే నట నుండఁగ, నేపగిదింగూర్కు నామృగేక్షణ నిశలన్. 20

ఆ. అవలఁ గడచిపోయె నైదాఱు నిముసంబు, లంత భృత్యుఁ డొక్కఁ దరుగుదెంచి
చాల జబ్బులోన జనకుఁ డున్నాఁడు, లెం,దనుచుఁ బల్కెఁ దలుపు నట్టె తట్టి. 21

ఆ. చాల జబ్బులోన జనకుఁ డున్నాఁ డని, మున్నె తెలియుఁగానఁ దన్నిమేష
మందుఁ "జాలజ" బ్బటం చన నర్థవి, శేషమొందు తోఁచెఁ జిత్తమందు. 22

తే. అంత నే సెజ్జపై నుండి యపుడ దూఁకి, యెట్టు లున్నది జనకునకేమి జరిగె
ననవుడు నెలుంగు రాల్పడనాతఁడయ్య,గారు మనలోకమును వీడినార లనియె. 23

సీ. దుర్భరదుర్దాంతదుఃఖంబు లజ్జయు, మూరిఁబోవుచు నన్ను ముట్టడింప
నంతట గురుఁ డుండునట్టిపట్టున కేగి, యుసుఱువాసిన తండ్రియొదలిఁ గాంచి
కామాంధకారంబు కనులఁ గప్పకయున్నఁ, బశువృత్తి కేను లోపడకయున్నఁ
దుదినిమేషంబునందును బితృమరణవే,దనఁ బాలు వడసియుందునుగదా య
తే. టంచుఁ జింతించినాఁడ నే నయ్యకాళ్ళు, పట్టుచుండ నతండు నాపాణియంద
జీవ మూడ్చియుండునుగాని చిన్నతండ్రి, కైవసంబయ్యె నట్టిభాగ్యంబు తుదకు. 24

క. అతఁ డగ్రజుఁదెస నెప్పుడు, నతులంబగు భక్తి సూపు నట్టిఁడు గానన్
జతపడె నయ్యనఘునకీ, గతి నంతిమసేవ సల్పఁగల భాగ్య మహో. 25

తే. మరణవేదన కెంతయు న్మలసిమలసి, నిలువ దియ్యెడ లిఁక నంచుఁ దెలిసిగురుఁడు
సైఁగఁజేసి కలమ్మును గాగితమ్ము, నందికొని సిద్ధమొనరింపుఁ డని లిఖించె. 26

క. తనసందిటఁ గల తాయె,త్తును గుత్తుక నున్న హైమతులసీదామం
బును దీసివైచె నవ్వలి, క్షణమున లేఁడయ్యె నతఁడు జగమం దకటా. 27

తే. ఒక్కదెసఁ దండ్రి యమబాధఁద్రుక్కుచుండ, నొక్కదెసనేమరుల్గొంటినువిదపైని
మాయు రేయిది మాయని మచ్చయగుచు, నన్ను బాధించుచుండు ననారతంబు. 28

సీ. మూఁడగునధ్యాయమును సంతరించుచు, మున్ను సూచించిన బన్న మిదియ
మెలఁకువమై నేను మెలఁగంగఁ దగువేళ, విషయసక్తుండనై వెలయుకతన
మాతరపితలపై మహనీయమగు భక్తి, నాకుండినను దాని నడుపుకొఱకు
జంకుగొంకులు లేక సర్వస్వ మర్పింపఁ, జాలియుండిన నది చాల వెలితి
తే. వడియ యున్న దటంచు నేర్పడియె నిట్టి, నేర మేనాఁటికేని మన్నింపరాని
దగుట నేనేకపత్నీవ్రతావలంబి, నయ్యుఁ గామాంధుఁడనటంచునాత్మనెంతు. 29

వ. పెద్దకాలము శ్రమించియుఁ బెక్కుగండములం గడచియు నీలోపంబు రూపుమాపఁ గల్గితి - వెండియు 30

ఆ. నరముఁబోనికూన నాచాన కిత్తరు, ణానఁ బుట్టి మూఁడునాల్గునాళ్ల
కసువులను దొఱఁగె నంతియ కాక వే,ఱొండు భంగి జరుగునోటు వగవ. 31

వ. నా తెలివిడి గుర్తించి పరిణీతు లెల్లరుం గన్ను దెఱతురు గాక! 32



# 10 మతములలో స్వల్పప్రవేశము

క. ఆఱవయేఁ డాదిగఁ బదు, నాఱవయబ్దంబుదనుక నటు విద్యావ్యా
పారమ్ము నెఱపి పెక్కులు, నేరిచితి న్విషయముల మనీషుల కరుణన్. 1

వ. కాని మతసంబంధిప్రబోధంబు నాకిసుమంతయేని పాఠశాలయందు లభింపదయ్యె - నద్దానిఁ గూర్చి నా పరిసరమ్ముల నించించుక యెఱుఁగుచుంటి - మతంబన నాత్మసాక్షాత్కారంబని యొండె నాత్మజ్ఞానం బనియొండె నా యాశయమ్ము. 2

ఆ. ఏను వైష్ణవుండఁ గాన విష్ణ్వాలయ, మునకుఁ బెక్కుమార్లు చనెడివాఁడఁ
గాని దాన నిచ్చ కల్గద! కదు నస,హ్యంబు వొడమె దానిదంబ మరయ. 3

క. అట నీతివిరుద్ధము లగు, ఘటన ల్గల వనియుఁ దెలిసెఁ గావున నే న
చ్చటు ద్రొక్కుట విరమించితి, నిటు దేవాలయము నాకు నించకపోయెన్. 4

తే. అట్లగుట నాకు విష్ణ్వాలయంబువలనఁ, బట్టువడినట్టి లగ్గు కన్పట్టదయ్యెఁ
గాని కోవెల నాకు నీలేని దాని, నొసఁగె మాయింట వసియించుముసలిదాది. 5

తే. అమ్మగువ రంభ యను పేర నలరుచుండుఁ గరము వాత్సల్యమున నన్ను గారవించు
నాకెపై నాకు విశ్వాస మగ్గలంబు, విస్మృతికి రాదు నేఁడు నవ్వేలఁదిచరిత. 6

క. భూత ప్రేతము లన నేఁ, గాతరతం జెందుచుంటఁ గని తత్సతి నీ
భీతిన్ బోకార్పఁగ వి, ఖ్యాతం బగు రామనామ మౌషధ మనియెన్. 7

క. అనవుడు నాభయబాధం, దునుమాడ జపంబు సేయఁదొడఁగితి నతిపా
వనరామనామమంత్రం, బనూనవిశ్వాసపూర్ణ మగుచిత్తమునన్. 8

వ. అయ్యది పెద్దకాలంబుమాత్రము కొనసాగదయ్యె - నట్లయ్యు లేఁబాయమ్మున మన్మానస క్షేత్రము నాశ్రయించిన యవ్విత్తనము రిత్త కాదయ్యె - నీనాఁడు రామనామంబు నా కప్రతిహతం బగు నోషధి యగుటకు నాఁడు మా రంభ నాటిన బీజంబ కతంబు నాఁ దగు. 9

సీ. అపుడ రామచరిత్ర నతిభక్తిఁ బఠియించు, ఘనుఁడు నాపెదతండ్రితనయుఁ డొకఁడు
నా చిన్నయన్నకు నాకును నేర్పించె, రామరక్షాస్తోత్ర మేము దానిఁ
గంఠస్థ మొనరించి కడఁకమై మజ్జన, పర మెల్ల రేపులం బఠనసేయఁ
బూనితి మిప్పాన్కి పోరుబందరు వీడి, యల రాజకోటయం దడుగు మోపు
ఆ. సరికి సడలె దీనిఁ జలుపుటయందుఁ బ్ర, త్యయము కుదురకున్న నాదినుండి
భ్రాతృగౌరవంబుఁ బ్రస్ఫుటోచ్చారణా, హంకృతియుఁ గతంబు లగుచు వచ్చె. 10

క. బందరులో మజ్జనకుఁడు, మందుం దినువేళ నెల్ల మాపుల నమృత
స్యందిని రామచరిత్ర న, మందానందానుభూతిమై వినుచుండున్. 11

తే. రాణఁగన్న లాధామహారాజ సూరి, రామచరణారవింద చింతామరంద
పానపరిమత్తచిత్తుఁ దప్పట్టునందు, వక్త యయ్యె బిల్వేశ్వరావాసవాసి. 12

మం. అతఁడు కుష్ఠవ్యాధి కగ్గమై తొల్లి, యౌషధసేవనం బాసింపఁబోక
బిల్వేశనిర్మాల్యబిల్వపత్రముల, గాయంబులకుఁ గట్టి కడుభక్తితోడ
రాత్రిందివమ్ము శ్రీరామనామంబు, జపియించి దుర్వ్యాధిజయ మందె నంట;
యిది నిజంబో కాదొ యెటులైన నేమి, నాకు నిచ్చరితపై నమ్మకం బొదవె. 13

క. మృదుమధురస్వరసంపద, పొదల నతం డతులభక్తిపూరితుఁడై చౌ
పదముల ద్విపదలఁ బాడుచుఁ, బదార్థముం దెల్పు హర్షపరవశుఁ డగుచున్. 14

తే. అతనితో పాటు శ్రోతృసంతతియు నొదలు, మఱచు నవ్వినుకలియె రామాయణంబు
మీఁదఁ గల్గించెనాకు నత్యాదరంబుఁ, బదియుమూఁడేఁడు లుండు నప్పటివయస్సు. 15

తే. భక్తిపూరిత కావ్యప్రపంచమందు, దివ్యకవితాకళాసముద్దీపితంబు
తులసిదాసకృతంబు నిస్తులితమంచు, విశ్వసింతు నిపుడు రామవిభుచరిత్ర. 16

వ. తదనంతర మేము కతిపయమాసమ్ములకు రాజకోటకుఁ జేరితి - మందు హరివాసరములం
దెల్ల భాగవతశ్రావణమ్ము ప్రవర్తిల్లుటంజేసి తదాకర్ణనకుతూహలాయత్తచిత్తుండనై యే నప్పు
డప్పు డప్పురాణగోష్ఠికిం జనితిఁ - గాని పౌరాణికుఁడు రచ్చకు మెచ్చువొడము వడువున
వాక్రుచ్చువాఁడు గాఁడయ్యె - నవ్వోత్తమ బత్తికిఁ దావలంబని యిత్తఱి నెఱింగినాఁడ -
నద్దాని నాతల్లి బాసం జదివి పారవశ్యఁబు నందితి - వెండియు 17

క. వారణనగరమ్మున ము,వ్వారము లే నుపవసించువడి *నంతర్వా
ణీరత్న మదనమోహనుఁ, దారమణీయార్ధకల్ప నాగారమునన్. 18

క. భాగవతంబున నయ్యయి, భాగంబుల వినిచి న న్నపారం బగు ము
త్సాగరమునఁ దోఁగించె మ,నోగతసంతాపరాశి నుగ్గొనరించెన్. 19

సీ. అత్తఱి మదనమోహనుఁబోని భక్తావ, తంసంబు భాగవతమును జిన్న
తనమంద వినిపింప వినఁగల భాగ్యమ్ము, గల్గిన నాకు నక్కాలమంద
యద్దానిపై గాట మగు నాదరంబు సి,ద్ధించుఁగదా యని యెంచినాఁడ
నపు డుద్భవించు శుభాశుభసంస్కార,ములు సుస్థిరంబులై నిలుచుఁగాన
ఆ. భాగవతమునట్టి భవ్యకావ్యంబుల, బాల్యదశను వినుటఁ బడయనైతి
నే! యటంచు నాకు నెల్లవేళల విచా,రంబు వొడము మానసంబునందు. 20

వ. అయినను. 21

తే. అఖిలమతసంప్రదాయమ్ములందు నాకుఁ, గుదిరె సమదృష్టి యలరాజకోటలోన
నందు హిందూమతమ్మునయందు మిపులఁ, బాదుకొనిపోయె నాదరభావగరిమ. 22

క. అచ్చట నాతలిదండ్రులు, నిచ్చలుఁ జనుచుండ్రు రామనిలయంబునకున్
జిచ్చుకనువేల్పుగుడికిం, బొచ్చెంబెడయైన బత్తి పొంపిరివోవన్. 23

క. నను వార లనుదినంబును, గొనిపోవుచు నుండువారు కోవెల కేనున్
జననీజనకులతోఁ బ్రా,ర్థనగీతులఁ బాడువాఁడఁ దద్దయు వేడ్కన్. 24

క. వెండియు జైనగురు ల్గురు, దండకు వేంచేసి పెక్కుధర్మంబులపై
మెండుగఁ జర్చల నెఱపుచు, నుండెడివా రపుడు శ్రోత లోహో యనఁగన్. 25

* వాణీనాం శాస్త్రవాచాం రత్నం వాణీరత్నం వేదాంతశాస్త్రమిత్యర్థః - అంతర్గతం వాణీరత్నం యస్యసః
అంతర్వాణీరత్నః ఔపనిషద జ్ఞానవానితి తాత్పర్యం

సీ. కలరు మత్పితకు మిత్రులు పెక్కురు మహమ్మ,దీయులు పార్సీలు ధీరమతులు
తమధర్మములఁగూర్చి తగురీతిఁ బలుమాఱు, వచియించుచుండెడివారు వారు
వినుచుండు నవధానమును బేర్మిపేర్మియు, వెలయ నాతండ్రి తద్విషయమెల్ల
నతని కేఁ బరిచర్య లాచరించుచునుంట, నాలించువాఁడ నయ్యాయిచర్చ
తే. లిట్టిలాభంబులన్నియు నెనసి మతము, లన్నిటం దుల్యగౌరవ మంకురింపఁ
జేసినవినాకు వృద్ధోపసేవనంబు, వలన సిద్ధింపఁజాలనిఫలము గలదె. 26

వ. అయ్యదన న్నా కొక క్రైస్తవమతపరిచయంబ శేషించియుండె - నత్తరుణమునం దేతన్మత
ప్రచారకులు కొంతఱు మాపాఠశాలచెంతకుఁ జేరి 27

క. హిందువుల వారివేల్పుల, నిందించుచుఁ బల్కుచుండ నే దెందమునం
దందుల కెంతయు నేవం, బందితిఁ దన్మతమునం దనాదర మొదవన్. 28

మం. అపుడ పేరందిన హైందవుఁ డొకఁడు, క్రైస్తవమతదీక్షఁ గైకొనె ననియు
నవల గోమాంస మాహారించుటయును, నింద్యమౌ మధుపాననియతిఁ గొంటయును
దనవేషభాషలఁ దలఁగించుటయును, నాతని కనివార్యమై యబ్బె ననియుఁ
గోటలం బేఁటల గోల హెచ్చయ్యె, నదివినుడుఁ జివుక్కు రనియె నామనసు. 29

తే. ఆఁబోలసుఁ దింట మద్యంబు నానుచుంట, వేసమునయందు బాసపై వెగటుగొంట
నెద్ది శాసించు నది మతంబే యటంచుఁ, దలఁచితిం గోపతాపము ల్కలఁతపెట్ట. 30

క. ఈనడుమంత్రపుఁగ్రైస్తవుఁ, దేనెరసో పరిగణించి హిందూమతవి
జ్ఞానమ్ముల నిందింపఁగఁ, బూనినవాఁ డనియుఁ గర్ణపుటములఁ దాఁకెన్. 31

వ. ఇప్పరిస్థితులెల్లఁ గ్రైస్తవమతంబుపై నాకు రోఁతఁబుట్టింప హేతువు లయ్యెఁ - దక్కిన
మతమ్ములందు నాకుఁ దుల్యాదరంబు వొడమెనని నొడివినంతమాత్ర నీశ్వరునియందుఁ
దిరంబులగు శ్రద్ధాభక్తులు జనియించె ననంబోలదు - వెండియు 32

తే. మనురచితధర్మశాస్త్రంబు జనకపుస్త, కాలయస్థంబు గన్గొంటి నపుడు దానఁ
దనరు సృష్ట్యాదిచర్యలఁ దఱచిచూడ, నీశ్వరునిమీఁది నాశ్రద్ధ హెచ్చదయ్యె. 33

క. ఇంచుక నాస్తిక్యముఁ బ్రా, ప్తించెను నా కపుడు నామదిం గల శంకల్
వించితిఁ జదువరి యని పే, ర్గాంచిన పినతండ్రిపట్టికడఁ దగు భంగిన్. 34

తే. అతఁడు నాసందియమ్ముల నడఁపఁబోక, తగవు నీకిట్టిప్రశ్న లిత్తరుణమందు
వయసు హెచ్చినవేళ సర్వంబునీక, యెఱుకపడుఁజుమ్ముపొమ్మంచుఁ గఱదలాడ. 35

ఆ. మిన్నకుంటిఁగాని నన్నుఁ బీడించుట, మానదయ్యెఁ దదనుమానరాశి
మఱియుఁ జోద్యమయ్యె మనువు భోజ్యాభోజ్య, విధులు నిర్ణయించువిధముఁగన్న. 36

వ. అందు లోకాచారవిరుద్ధముగా మాంసభక్షణము నంగీకరించు ధర్మసూత్రములు కొన్ని కానంబడియెఁ గాని **37**

తే. విద్యయు వివేకశక్తియు వృద్ధియైన, నీడు ముదిరిన, ననుభూతి యెక్కుడైన
నపుడ యీసంశయములెల్ల నడఁగిపోవు,నని తలఁచి యూరకుంటి నయ్యవసరమున. **38**

ఆ. ఇట్టు లపుడు మను వహింసాప్రబోధ మొ, నర్పకుంట మున్ను నాయొనర్చు
తరసభక్షణంబు తద్ధర్మశాస్త్రస, మ్మతమ కా యటంచు మదికిఁ దోఁచె. **39**

తే. సర్ప మత్కుణ ముఖ జంతుసముదయంబు, హతమొనర్చుట నీతిసమ్మతమ యంచుఁ
దోఁచుటం గొన్నినల్లులఁబీచమడఁచి, నాఁడ నక్కటిక న్వీడనాడి యపుడు. **40**

వ. ఐనను జగత్తునకు నీతి మూల మనియు నద్దానికి సత్యంబు మొదటి యాదరు వనియు నాయుల్లమున దృఢవిశ్వాసంబు పాదుకొనియె – గాన సత్యంబ నాకు వలయు నర్థంబు – దాని గొప్పతనము నిరంతరము నాదృష్టిం బుష్టినందు – వెండియు సత్యముం గూర్చి నా కావించు లక్షణంబును విస్తరిల్లెడి – నదియునుంగాక **41**

సీ. సలిలంబు నీకు నీఁగలిగినవానికి, నిష్టమృష్టాన్నంబు నిడఁగదయ్య
కేల్మోడ్పు నిడువానికిన్ భక్తిసంయుక్తిఁ, జాఁగిలి జోహారు సలుపవయ్య
తృణకణం బేని నీ కిచ్చుపుణ్యాత్మున, కపరంజినాణె మీయంగదయ్య
కడగండ్ల నీకుఁ దోడ్పడెడివానికి నీశ, రీరమేఁ గోసి యర్పింపవయ్య
తే. యిచ్చుచోనొండుదశగుణంబిచ్చుటొప్పుఁ, గీడు గూర్చిన మేలు గల్గించుటుఅవు
చిత్తవాక్కర్మశుద్ధిమైఁజేయు వీని, నెవ్వఁ డాతండ గెల్చుఁబో! యిజ్జగంబు. **42**

తే. అనెడు గుజరాతినీతిపద్యం బొకండు, నామనంబునఁ దద్దయు నాటుకొనియె
నందుఁ గీ డొనర్చిన మేలునాచరింపు, మన్న సూక్తి జీవనసూత్రమయ్యె నాకు. **43**



# 11 సీమకుఁ బ్రయాణసన్నాహము

క. పదునెన్మిదివందలయె, న్బదియేడవయేఁట జయము వడసితి నే నిం
పొదవఁ బ్రవేశపరీక్షను, బిదపఁ గళాశాల కేగఁ బ్రియపడినాఁడన్. **1**

వ. అంత భావనగరమ్మునఁ గల శ్యామలదాసకళాశాలకుఁ జేరి యందుఁ జదువం దొడఁగితిఁ – గాని యచ్చటి యుపన్యాసములు తల కెక్కమి నాకు నుక్కిరి బిక్కిరి యయ్యె – నిందు నాచార్యులలోపము రవంతయుఁ గానరాదు – వారి కెంతేని ప్రసిద్ధిగలదు – నా

కసుగాయతనంబ దీనికెల్ల నిదానంబు నాఁజెల్లు - నిట్లు బహుప్రయాసమ్మునఁ గాలంబు నీడ్చుచు నర్ధవార్షికవిశ్రాంతిదినమ్ములు గడప నింటికిం బోయితి - నయ్యవసరంబున మాకుటుంబమునకుఁ బ్రాఁజెలికాఁడును హితుఁడును విప్రుండును జదువరియు లౌకిక జ్ఞానపూర్ణుఁడునగు మావుజీదవే యనునతఁడొకనాఁడు మా నెలవునకు వచ్చె - నితనిని మేము జోషి యనియుం బిల్చువారము. 2

తే. అతఁడు నాతల్లితోడఁ బెద్దన్నతోడ, మాకుశలవార్తలం గూర్చి మాటలాడు
వేళ నాకళాశాలాప్రవేశ మెఱిఁగి, యిట్టు వచియించె నాదర ముట్టిపడఁగ. 3

మ. తలక్రిందయ్యెను గాల మిప్డు తగువిద్యల్ నేర్వలేకున్న మీ
రలు మీపూర్వులకై వడిం బెగడలై రాజేంద్రులందన్ని యు
జ్జ్వలకీర్తిం గనఁజాల రీతఁ దయినన్ సద్విద్య నార్జించి వా
రలవాసి న్నిలఁబెట్టు చందమున మీరల్ యత్నముంజేయుఁడీ. 4

సీ. ఇతఁడు పట్టపరీక్షఁ గృతకృత్యుఁ డగుట కిం,కను నాలుగైదేండ్లు గడవవలయు
నపుడైన నొకచిన్న యధికారముం ద్రిక్కఁ,బెగ్గడపదవి నార్జింపఁజాలఁ
డెన్నినాళ్లో పట్టు మన్నందనుండు కే,వలరామువలె న్యాయవాది యగుట
కానాఁటి కెందఱో న్యాయవాదు లమాత్యతాసిద్ధికై ప్రయత్నం బొనర్తు
తే. ర ట్లగుట వీని సీమకు నంపు టొప్పు, నచట బారిష్ట రగు టనాయాస మందు
రింటికిం జేరవచ్చు మూఁడేండ్లలోన, వెచ్చమున కొకనాల్గైదువేలు చాలు. 5

తే. పిలిచియిత్తురు బారిష్టరుల కమాత్య,పదవి నెందేని ధారణీపతులు పేర్మిఁ
దడవుసేయక మోహనదాసునంపుఁ, డాంగ్లభూమికి నాహర్ష మతిశయిల్ల. 6

తే. మత్సుతున కచ్చటం బెక్కుమంది నెయ్యు,రున్నవారు ప్రసిద్ధిని గన్నవారు
వారి కతఁ డిచ్చు నెఱుకకై వలయు కమ్మ, లితని కిబ్బంది కలుగదొక్కింతయేని. 7

క. అతఁడి ట్లని నే నాతని, హితమ్ము నీకొన్నయట్ల యెంచి కృపాము
ద్రితదృష్టి నన్నుఁ గన్గొని, కుతూహలము లేదె సీమకుం జన నీకున్. 8

తే. అనుడు నుప్పొంగి సంతోషవనధిఁ బ్రుంగి, యింతకంటెను స్పృహణీయ మెద్దికలదు
సిద్ధముగ నుంటి నింగ్లాండు చేరి చదువ, నెంత రయముగ నంపిన నంత లగ్గు. 9

వ. అని పల్కి త్వరితమ్ముగాఁ బరీక్షలయం దాటితేఱుట కష్టసాధ్యము - కాన వైద్యశాస్త్రముపై నామనంబు తవిలియున్నది - దానిం జదువ సమ్మతింతురే యని నేను వారిం గోరుడు మదగ్రజుఁ డిట్లనియె. 10

మం. ఎఱుఁగవే మనతండ్రి యెన్నేనిమార్లు, వైద్యం బటన్న నేవంబును గనుట
మనకోవ వైష్ణవమతమునం దుంట, మనకుఁ బీన్గులఁగోఁత మర్యాదయగునె
యని వార లపుడప్పు డాడుచు నుంట, నిన్నుఁ గూర్చియె సుమీ నిక్కంబు నరయ
న్యాయశాస్త్రంబు నీ వభ్యసించుటయ, జనకపాదులకు నిష్టంబైన చేఁత. 11

తే. అనుడు జోషియు నప్పల్కు లనువదించి, యితరశాస్త్రంబులం గోర్కె యేల నీకు
న్యాయశాస్త్రంబ నిన్ను జేగీయమాన, చరితుఁ గావించు మదుపదేశంబు వినుమ. 12

వ. ఇట్లు బోధించి యప్పాఱుదు మాయమ్మకడ సెలవునంది నిజనివాసమునకుం జనియె
నంత 13

సీ. ఆశాలతాజాల మస్మన్మనోవీధి, నల్లిబిల్లిగ నట్టె యల్లుకొనుడు
నిర్మింపఁ బూనితి నిరుపమశిల్పసం, పదపెంపు దీపింప బయలిమేడ
లర్థంబు తగినంత యలవడు టెట్లొకో, ఖండాంతరముల కేకాకిఁ జేసి
యీతమ్ముఁగుట్టి నేరీతిఁ బంపుదు నొకో, యనుచింత మున్గె నాయగ్రజుండు
ఆ. నన్ను విడువలేక నాతల్లి నిర్మల, ప్రేమమూర్తి యార్తిఁ బెల్లువగచి
మద్విదేశయాత్ర మానింప నొకయుక్తి, పన్ని యిట్టు లనియె నన్నుఁ గూర్చి. 14

క. అన్నా కలఁడు గదా మీ, పిన్నయ్య కుటుంబమునకుఁ బెద్ద యతఁడు ము
న్మ న్నిందుఁ దదంగీకృతి, గొన్నన్ మన మెల్ల నరసికొందము పిదపన్. 15

వ. నావుడు నాయన్న యిట్లనియె. 16

సీ. పరికింపఁ బోరుబందరు నరేంద్రునిచెంత, మన కించుకంత స్వామ్యంబు గలదు
నేఁ దచ్చటం గార్యనిర్వాహక పదంబు, నందు లేలీ యనునతఁడు వెలయు
నతనికి మనపట్ల నాదరం బధికంబు, మఱియుఁ బితృవ్యు నమ్మాననీయుఁ
డెంతేని మన్నించు నిపుడు నీవిద్యకై, యొదయఁడు కొంతసా మ్మొసఁగునట్టు
తే. లతఁడు తోడ్పడవచ్చు నం చనుదు నాకు, నచ్చె నప్పల్కు లుత్సాహ మెచ్చిపోయె
నపుడ పయనంబు గట్టి నాల్గైదునాళ్ళ, కేగితిని బందరున కొంటె నెక్కి స్రుక్కి. 17

ఆ. అంతఁ బిన్నతండ్రిచెంతకుఁ జేరి సా,ష్టాంగవందనంబు నాచరించి
విషయమెల్ల విన్నవించుదు శ్రద్ధమై, నరసి యాతఁ డిట్టు లానతిచ్చె. 18

తే. భారతీయుఁడు నిజమతాచారసరణి, విడువ కింగ్లాండునం దుంట కదు నసాధ్య
మేమిభేదము గాన్పించు నిపుడు వెలయు, నల్లబారిష్టరునకును దెల్లదొరకు. 19

క. అతఁ దశనమ్ముదెస విధి, ప్రతిషేధము లుఱఁదు ధూమపానంబు ననా
రతముగఁ గావించును సి,బ్బితి మాలి ధరించు నాంగ్లవేషము నిస్సీ. 20

వ. మనకుటుంబ మిట్టిమనుగడకు దూరమైయుంట యెంతయు నుచితంబు–మఱియు 21

తే. అచిరకాలమునం దీర్ఘయాత్రకేగ, నుంటి నే నిఁకఁ బెక్కునా ళ్ళుంట కల్ల
కాటికిం గాళ్ళు సాఁచి యేకరణిఁ గదలి, పయన మంగీకరింతు నిప్పట్టునందు. 22

తే. ఐన నీపోక కే విఘ్న మాచరింప, నొల్ల నిత్తఱి నీకు నీతల్లి యొసఁగు
సమ్మతియె ముఖ్య మామె కిష్టంబ యైన, నీవు గ్రక్కునఁ బొగయోడ నెక్కవోయి. 23

క. ఏ నడ్డ మాడ నని య,మ్మానినికి న్విన్నవింపుమా తత్సతి నీ
కాన యొసంగిన నేనుం, బూని శుభాశిషము లొలఁగి పుచ్చెదఁ జుమ్మా. 24

సీ. అనవుడు నుప్పొంగి యంతియ చాలు నో,యనఘ! మజ్జనయిత్రి యాజ్ఞ వడయ
నిఁక యత్న మొనరింతు నింకను మీ రొక్క, సాయ మొనర్పుఁ డీసమయమందు
నాసీమపయనంబునకు లేలి దొర కొంత, యార్థికసాహాయ్య మాచరించు
గతిఁ బరిచయపత్ర మతనిపేర నొకండు, దయసేయుఁ డో పిన్నతండ్రి! యనిన
ఆ. నే లిఖించు టెట్లు నీవ విన్నప మొన, రించుకొ మ్మతండు మంచివాఁడ
మనకుటుంబ మన్న మన్నన సూపు సా,యం బొనర్పవచ్చు నర్హభంగి. 25

వ. అని పల్కి యతడు నన్ను మిన్నకయ పంపె – నీపాటిమేలొనర్ప నాపితృవ్యుఁ డేల నిరాక రించెనో చెప్పఁజాలఁ – గాని తాను దూష్యం బని విశ్వసించు ఖండాంతర ప్రయాణమునకుఁ బ్రత్యక్షసాహాయ్య మాచరించుట యుచితంబు గాదని యతఁడు వెన్నాడి యుండు నని నాతలంపు. 26

క. అంతట నే లేలీ దొర, చెంతకుఁ జని వంగివంగి చేసి ప్రణామం
బెంతయు మెలఁకువఁ బూని హృ,దంతర్గతవాంఛితంబు నాతనితోడన్. 27

తే. మనవిసేయుడు నే మణుమాత్రమేని, దోడుపడ మిష్ట పట్టభద్రుండ వైన
వెనుక మముఁ జూడరమ్ము పొమ్మనియె నాతఁ, డట్టె నిల్వున నీఱైతి నపుడు నేను. 28

ఆ. ఆస లెల్ల నిట్లు వీసరవోవ న,చ్చోటు వాసి రాజకోట సొచ్చి
జోషికి న్మదగ్రజునకును దల్లికిఁ, దెలిపితిం బ్రయాణఫలిత మెల్ల. 29

క. అత్తఱి జోషి ననుం గని, చిత్తమ్మునఁ దత్తరమ్ము సెందక యెం దే
విత్తమ్ము నప్పుగాఁ గొని, యుత్తమకార్యంబు దీని నొనరుచు టొప్పున్. 30

క. నావుడు ఋణంబు వ్రణము గదా! వల దీచేఁత యస్మదర్థాంగి విభూ
షావిసర మమ్మి పదమటి, దీవికిఁ బోఁదగదె యంచుఁ దెలిపితి నేనున్. 31

తే. అంతదూరంబు వో నేటి కనుజ! నాదు, సర్వశక్తులఁ జూపి విశ్వప్రయత్న
మాచరించి సిద్ధ మొనర్తు నర్థ మని స,మగ్ర మగు పేర్మిఁ బలికె మదగ్రజుండు. 32

తే. అతఁడు ప్రేమించు నన్నుఁ దా సుతునివోలె, నతనియౌదార్యసంపత్తి కవధి సున్న
యతనియెడ నాకు నిస్సీమమైన భక్తి, యతనిదెస నాకు విశ్వాస మగ్గలంబు. 33

సీ. మజ్జనయిత్రికి మాత్ర మాశాస్యంబు, కాదయ్యె నింకను నాదుపయన
మాంగ్లదేశమ్మున కరిగినగోవాళ్లు, భ్రష్టు లయ్యెద రెల్లవగల నంచు
నామె కొక్కఁడు సెప్పె నంజక గోమాంస, మారగింతు ర టంచు నాదె నొకఁడు
మదిర ద్రావక యున్న బ్రదుకలే రనె నొకం, డేమేమొ బోధించె నింక నొకరుఁ
తే. డిట్టికత లామెచిత్తము నట్టె కలఁత,పెట్ట నాయమ్మ పట్టి! నీ వెట్టు లెల్ల
చెట్టలకుఁ బుట్టినిల్లైన సీమ నుందు, విట్టలం బగుకీర్తి నట్టేటఁ గలిపి. 34

క. అని నన్నుఁ బృచ్ఛ సేయుడు, జననీ! నీ కేల యిట్టిశంకలు ఋజువ
ర్తన మించు కేనియు న్విడ,నని శపథ మొనర్తు నమ్మవా నాపలుకుల్. 35

క. ఏదే నపాయ మున్నన్,గా దని వారించుఁ గాని కామక పొమ్మం
చాదేశింతురె మనగురు, పాదు లొడంబడుదు రొక్కొ భ్రాతలు సెపుమా. 36

ఉ. నావుడుఁదల్లిపల్కుఁబ్రియనందన! నీహృదయంబు దూష్యపుం
ద్రోవలఁద్రొక్కదం చెఱుఁగుదుంజుమి నే; నటులయ్యు దూరపుం
దీవుల నున్నవేళ దురతిక్రమమై పరధర్మ మంటి ని
న్నేవిధినీడ్చునో! చెడుగునెంచి శుభంబు గణించుటొప్పగున్. 37

వ. ఇప్పట్లఁ గింకర్తవ్యతామూఢనై యే నున్నదాన – నా సందియమ్ముల బేచరజీస్వామికి విన్న వింతుఁగాక – యని పల్కి మత్కులజుండును జైనసాధువు నై మాక్షేమంబు నిచ్చలు నిచ్చగించు నక్కర్మందిం జేరి తన భావమ్ముల నెల్ల వెల్లడింప నతఁడు నాపోకకు ననుకూలుండై యామె కిట్లనియె. 38

తే. సత్యశీలుఁడితండు సంశయము లేదు, కాన నిత్తఱి మూఁడు వాగ్దానములను
వీనివలన గ్రహించి యవ్వెనుక సీమ, కంపఁ దగు నట్టు లైన భయంబురాదు. 39

వ. ఇట్లు పల్కి నాచేత 40

తే. మాంసముసుమెక్క మద్యంబుమరగనొల్ల, నంగననుదాఁకననియతండపుడు మూఁడు
బాసలాడించె నవ్వల నాసవిత్రి, సమ్మతింజూపె మత్ప్రయాణమ్ముపట్ల. 41

సీ. పదపడి నాసీమపయనంపుముచ్చటల్, తెల్ల మయ్యెను వీట నెల్లరకును
నను వీడుకొల్ప నున్నతపాఠశాలలో, నడిచెను సమ్మేళనం బొకండు
తత్సభ న్నాదుకృతజ్ఞత సూచింపఁ, గూర్చితిఁ గొన్నిపల్కులు శ్రమించి
చదువఁ బూనినయంతఁ దుదలేనిభయము న,గ్గల మైన కంపమ్ము నలముకొనియె
తే. నవల నెయ్యము దియ్యమ్ము నతిశయిల్లఁ, బెద్ద లొసఁగెడి దీవనల్ పెక్కు వడసి
యాదరంబున నగ్రజుఁ డనుగమింపఁ, బయనముం గట్టినాఁడ బొంబాయిపురికి. 49



# 12 జాతిబహిష్కారము

సీ. అస్మజ్జననిపన్పు నంది దీవన పొంది, పసిబిడ్డ నెడఁబాసి పడఁతి విడిచి
నవనవోత్సాహంబు నటియింప బొంబాయి, నగరంబునకుఁ జేరినాఁడ నేను
దత్రత్యులై మించు మిత్రు లియ్యది గ్రీష్మ, సమయంబు భారతజలధి యిప్పు
డల్లకల్లోలంబు నతిభయంకరము నై,యుండెడి హేమంత మొదవుదనుక
ఆ. సాగరప్రయాణ మాఁగుఁ డటంచు నా,యన్నతోడఁ బల్క నాతఁ డచటఁ
దనదు మిత్రునింట నను డించి మాబావ, కప్పగించె మత్ప్రయాణధనము. 1

వ. వెండియు నాకు వలయుసాయమెల్లఁ గావింపఁ దన నెచ్చెలులం గోరి తా రాజకోటకుఁ
జని తనకొల్వునం జేరె – నంత 2

ఆ. ప్రొద్దు వోవదయ్యె బొంబాయిలో నాకు, గడియ వత్సరంబుకరణిఁ దోఁచెఁ
బవలు రేయి సీమపయనంపుసుద్దులే, పలవరింత లాయెఁ బలువిధాల. 3

తే. ఇంతలో మత్కులంబువా రేను సీమ, కేగుటం గూర్చి చర్చించి యిది నిషిద్ధ
కృత్య మని యెంచి నన్ను బహిష్కరింప, నిశ్చయించిరి రోసంబు నిట్టవొడువ. 4

క. వా రందుల కొకరచ్చం, గూరిచి ననుఁ బిల్వ జంకుగొంకుల నెదకున్
దూర మ్మొనర్చి తత్సభఁ, జేరితి నత్తెగువ యెట్లు సిద్ధించినదో. 5

వ. పదంపడి మజ్జనకునకుఁ జెలికాఁడును మాకు నెడబందుగుఁడును మా"మోఢు" వైశ్య
కులంబునకుఁ బెద్దయు నగు సెట్టి నా కిట్లనియె. 6

మం. సీమకుం బయనంబు సేయంగ నీవు, నిశ్చయించితి వంచు నే మెతింగితిమి
మనకులక్రమసిద్ధమర్యాద నరయఁ, గడలిపై నేగుట కానికార్యంబు
నిజధర్మసంరక్ష నెఱపు టచ్చోట, దుశ్శకం బని చెప్పుదురు పెద్దలెల్ల
దొరలతోడం గూడి దుర్భోజనంబు, నారగించుట తప్ప దందు రద్దీవి
నిట్టిదుష్కార్యంబు నె ట్లాచరింతు, వుజ్జగింపుము నీదురుద్యోగబుద్ధి. 7

చ. అనవుడు సీమ కేగుట రవంతయు దూష్యముగాదు విద్దియన్
బనివడి యభ్యసించుటక పైనముఁగట్టితి నేను మాంసమున్
దిననని కల్లుద్రావనని దీక్షమెయి న్సమయం బొనర్చితిన్
జననిసమక్షమం; దదియ సాఁకు ననుం బరభూమి నెంతయున్. 8

మ. అని నేఁ బల్కిన సెట్టి యిట్టు లనెఁ గుఱ్ఱా! సీమకుం జేరినం
తన నీదీక్షలు నీప్రమాణములు నీధర్మంబులున్ జాఱు; నా
కును నీతండ్రికి నున్నతియ్యు మది నీకుం దెల్లమే కానఁ గై
కొనుమా మద్వచనంబు మేలుకొనుమా కొంచెమ్ము తర్కింపుమా. 9

వ. అనుటయు నే నతని కివ్విధిం బల్కితి. **10**

తే. ఆర్య! తత్స్నేహమెల్ల నా కవగతంబ, గురుసమానుల మీరు నా కరసిచూడ
నట్టి లయ్యును మన్నిర్ణయంబు, నిపుడు, విడువఁజాలను నా కొండువెరవు సున్న. **11**

తే. కలఁడు నాతంఁడ్రికిం జెలికాఁడు హితుఁడు, పండితుఁడు నై విరాజిల్లు పాఱుఁడొకఁడు
సమ్మతించె నతండు దోసమ్ము వీస, మేని లే దంచు నాసీమపైనమందు. **12**

ఆ. మఱియు నూలుకొనియె మన్మాత భ్రాతయు, నియ్యకొనియె ననుదు నింత యేల
సంఘశాసనంబు సమ్మతి నొదలఁ, దాల్పవా యటం చతండు కసరె. **13**

తే. అంత నాకిఁక లేదు గత్యంతరంబు, వీఁకమై నేను సీమకుఁ బోక మానఁ
గులమువారిపుడిందుఁ బాల్గొనుట తగదు, పట్టువిడి మీరలెఱుఁగు డీ పాడితెఱఁగు. **14**

క. అని నేనుత్తర మొసఁగుడు, మునిఁగి యతం దతులరోషమునఁ బలువగలన్
ననుఁ దిట్టుచుఁ గనుగొనలం, గనదగ్నికణంబు లురలఁ గన్గొనెఁ గొలువున్. **15**

ఆ. వీనిఁ గులమునుండి వెలిపెట్టితి న్నేఁడు, పూని యెట్టిసాయ మేని వీని
కాచరించువాని కపరాధశిక్ష స, పాదరూప్య మంచుఁ బనుపు నిడియె. **16**

సీ. అవ్వల నేను రవ్వంతేని జంకక, సెలవుఁ గైకొని పెద్దసెట్టిచెంత
బసఁ జేరి యేతత్సభావిశేషమ్ములు, విన్న వెన్నిచ్చునో యన్న యంచుఁ
జింతసేయుచు నుండు నంతలోఁ గులము బ, హిష్కరించును గాక యించుకేని
భయము సెందకు మీవు పయనంబు మానకు, మని కమ్మ నతఁ దంపె నది యదృష్ట
ఆ. మంత నాకు నెక్కు డయ్యె నారాట మిం, కేల జాల మనుచు నెంచుచుంటి
నపుడ సీమ కొక్కఁ డరుగుచున్నాఁడు బా,రిష్ట రగుట కని యెఱింగినాఁడ. **17**

తే. అంత నగ్రజునెయ్యుర కయ్యుదంత, మెఱుక సేయుదు విడువకు మిట్టితోదు
ననుచు వా రియ్యకొని రంత నవధిలేమిఁ, దంతియిచ్చితి నన్న కాతండు నొప్పె. **18**

క. పిమ్మట మాబావను సొ,మ్మి మ్మంటి నతండు కులబహిష్కరణత్రా
సమ్మునయందు మునింగి ధ,న మ్మొసఁగం జాల ననియె ననిచినచింతన్. **19**

వ. అంత నయ్యంతరాయమున కే నెంతయుఁ గలంగి మత్కుటుంబమిత్రు నొక్కని దాసి నా సీమపయమునకు వలయు రొక్కము నొసంగి యవ్వెన్క నద్దాని మాయన్న కడంగైకొనుఁ దని వేడ నయ్యయ్య నన్ను సంప్రాప్తవిత్తునిఁ జేయుటయ కాక తద్దయుఁ బ్రోత్సహించి నాజతనంబు నగ్గించి నాసమర్పించుకృతజ్ఞతం బడసె - నే నవ్వలఁ దగుధనము వెచ్చించి నౌకాప్రయాణ పత్రము విలిచి గ్రాసవాసముల సవరించుకొంటి - నంత నాకుఁదోడై వచ్చు జునాఘడు న్యాయవాది త్ర్యంబకరాయిమజముదా రుండుగదియంద మన్మిత్రులు

నా కొక సెజ్జ గైకొని నన్నతని కెఱుకపఱిచి యతఁడు నాయెడనొసంగునభయదానమ్ముఁ బరిగ్రహించి – రమ్మజముదారు వయోజ్ఞానములం బెద్దయైనవాఁ – డేను లోకానుభవమెఱుం గని యష్టాదశవర్షంబుల కసుగాయనై యుంటి – నివ్విధంబున. **20**

తే. వసు గజైశ్వర్య కుముదినీబంధు సంఖ్య, వసుధ నెసఁగు క్రైస్తవశకవత్సరమున
నవమమాసతురీయదినమ్మునందు, బయలువెడలితి నేను బొంబాయి విడిచి. **21**



# 13 తుదకు సీమ

తే. ఎల్లరకు నంబురాశిపై నేగువేళఁ, బొదమునోకరింతలు నాకుఁ బుట్టవయ్యెఁ
గాని యారాట మధికంబు కాఁదొడంగె, నల్లనల్లన గాలంబు సెల్లుకొలఁది. 1

సీ. పైకొనె మొగమాట నాకు సుగ్రాణంపు, టధికారితోడ మాటాడఁబోవ
నలవాటులేని కార్యం బౌట నాంగ్లేయ, భాష నే నొకపల్కుఁ బల్కఁజాల
నొక్కమజందారు త్రిక్క మాగదినున్న, తెరువరులెల్లరుం దెల్లదొరల
వారితోఁ బలుకాడ నేరనైతిని వారి, కొసఁగలేనైతిఁ బ్రత్యుత్తరంబు
ఆ. నలఁతివాక్యమేని వెలలించుటకు మున్ను, గొణఁగవలయు లోనఁ గొన్నిసారు
లేమిసెప్పువాఁడ నే నప్పు డుచ్చులోఁ, బడి తపించు పులుఁగు పగిది నుంటి. 2

సీ. భోజనశాలకుఁ బోదునా యన్నఁ గ,త్తులు గరిటెలు వాడువల నెఱుంగఁ
బొలసుపొత్తైదయైనభోజ్య మెయ్యది యంచు, నడుగుదునా యన్న నఱుకువుట్టుఁ
బదిమందితోఁ గూడి ముదమార నన్నంబు, భుజియింతునా యన్నఁ బొదము లజ్జ
యెల్లరయాచార మీకొందునా యన్నఁ, దల్లి కిచ్చినబాస తన్నుచుండు
తే. నిట్టిచిక్కులు పెక్కులు ముట్టడింప, నోడపై నెక్కుసమయానఁ గూడఁ దెచ్చి
కొన్నపండ్లను జిఱుదిండ్ల గొద నడంచు, కొనుచు నుంటిని గదియంద కూరుచుండి. 3

క. ఈ యడ్డంకులు త్ర్యంబక, రాయికి నిసుమంత కానరావయ్యె నతం
దేయెండకు నాగొడుగున్, వేయు దొరలఁ గూడి మాడి వేడుకఁ దిరుగున్. 4

వ. అతఁడు నాసిగ్గరితనంబు నుపలక్షించి. 5

సీ. ఇంత సి గ్గేల నీకెల్లరతోఁ గూడి, సల్లాప మొనరింప శంక యేల
న్యాయవాదిపదంబు నర్థించువారెల్ల, వాచాలురై యుంట వలయు మివుల
గుణదోషముల లెక్కగొనక సంభాషింపు, మవకాశ మొదవుచో నాంగ్లమంద
పెఱబాసలోఁ దప్పు దొరలకుండు విధాన, వచియించు టరిది యెవ్వారికైన

తే. ననుచు నన్నెచ్చరింప నయ్యదియు నాదు, వెఱపు నడఁగింపదయ్యె నిక్కరణినుండ
నక్కటికతోడ నాంగ్లేయుఁ డొక్కరుండు, తివిరి మాటలలోనికి దింపె నన్ను. 6

ఆ. ఎచటి కేగువాఁడ వెయ్యది కార్య మా, హార మెద్ది నీకు నద్దిరయ్య
యింత బిడియ మేల యేటి కీయరవాయి, రమ్ము సాపడంగ మమ్ముఁ గూడి. 7

వ. అని పల్కి యతఁ డామిషంబు ముట్టఁదగ దను నా కట్టడకుఁ బెద్ద నవ్వి కెంగడలి న్నేము
పయనంబు సేయుతతిఁ జెలికారంబు వెలయ నిట్లనియె. 8

ఆ. వినుము నీదుదీక్ష బిస్కే సముద్రంబుఁ, జేరనంతవట్టు చెల్లుఁ గాని
యవల నిల్వఁజాల దాంగ్లదేశమ్మున చలికి బ్రతుకఁ గలవె పొలసు విడిచి. 9

క. నావలె నిను సారాయిం, ద్రావుమనితి నోటు మద్ధితవచస్సును సం
భావించి మాంసముం దిని, జీవమ్ములు నిల్పుకొమ్ము చెడకుము కుఱ్ఱా. 10

వ. అనుటయు 11

క. మీ యుపదేశమ్మునకున్, వేయినతుల్ కాని యిల్లు విడిచెడివేళన్
మాయమ్మచెంత నామిష, మేయెడ భుజియింప నంచు నిచ్చితి బాసన్. 12

క. అప్పా! నంజుడు నమలక, తప్పనిచో సీమ కొక్కదండం బిడి నేఁ
జప్పున నింటికిఁ జేరుదు, నొప్పుకొన న్నాఁటిశపథ ముల్లంఘింపన్. 13

వ. ఇట్లు నే నతనికి విన్నవించితి. 14

సీ. ఇంతలో మానౌక యీఁగె బిస్కేవార్ధి, నపుడు మాంసాహార మంటఁ దగిన
యక్కఱ పొడసూపదయ్యె నించుకయేని, దాని కెంతయును సంతసము నంది
జనయిత్రివాంఛితం బనుసరించి తదాంగ్ల, మిత్రు నర్థించి యామిషము నార
గింపలే దితఁ డన్న కిల్లాకు వడసి కొ,న్నాళు లద్దానిఁ బ్రాణంబువోలె
ఆ. రక్షసేసి మాంసభక్షకులుం గొంద,ఱిట్లె సలుపుచుంట యెఱిఁగి పిదప
దానిమీఁదికాంక్షఁ దలఁగితి నాపల్కు, నమ్మనపు డదెట్లు నన్నుఁ బ్రోచు. 15

వ. ఇఁకఁ బ్రకృతమునకు న్వత్త - మంత మానౌకక్రమక్రమంబున లండనునగరమ్ము సేరుదు
నేనును త్ర్యంబకరాయియు విక్టోరియాభోజనశాలకేగి యందువిడిసితిమి - నే నంతకు
మున్న ప్రాణజీవన మెహతా, దలపతిరాంశుక్లా, రణజిత్‌సింహమహారాజు, దాదాభాయి
నౌరోజీలపేర మన్మిత్రు లొసంగిన పరిచయలేఖలఁ బట్టి భిషగ్వరుఁడగు మెహతాకు నా
రాక నెఱిఁగించుచుఁదంతిపంపితిఁ - గాన వెచ్చముం జూడ గుండియలు పగులసాగె -
నవ్వల మే మద్దానిఁ బరిత్యజించి కొండొక యద్దెగదిం జేరితి - మంత నాకు 16

ఆ. మనసునందు సతము మాతృదేశముపైని, దల్లిపైని బెంగ తద్దయయ్యె
నిదుర సన్నగిల్లె నిలయపరిస్థితుల్, తలంపునందుఁ జాతి కలఁతపెట్టె. 17

క. నాకదగం డ్లన్యునితో, వాకొనరానట్టివయ్యె వాకొన్న నెవం
డీకష్టంబుల డీకొని, పోకార్పంగలఁ డి వెట్లు పోవును దవ్వై. 18

మం. అచటియాచారాదు లన్నియు నాకు, సరిక్రొత్తవై పెల్లు సంకటపెట్టఁ
గడుజాగరూకతఁ గాలంబు గడపు, టనివార్య మయ్యె నయ్యదియును గాక
యాకుబువ్వప్రతిజ్ఞ నావంతయేని, పాయక దీక్షమైఁ బాలింప వలయు
నిఁకఁ దినుబండంబు లిష్టము ల్గావ,యటు నూయి యిటు గోయి యాయె నామనికి
యింగ్లండులో నుంట కే నేరనైతి, మాతృదేశమునకు మరలలేనైతి
నీ మూఁడువర్షంబు లెట్టెటో నిల్వు, మని ప్రబోధించె నాదగునంతరాత్మ. 19



# 14 నా యభిరుచి

క. మెహతా మఱియొక పరి మద్, గృహమున కేతెంచి తత్పరిస్థితుల నెఱిం
గి హసించి యిట్టినిలుకడ, స్పృహణీయము గా దటంచుఁ బెదవి న్విఱిచెన్. 1

వ. వెండియు నతండు 2

క. ఒంటరివై నీ వీగడి, నుంటన్ ఫల మేమి యేతదుర్విఁ కిఁ జదువుం
గొంటక వచ్చితి మైనను, గంటయు నక్కఱయె యిందుఁ గలనడవళ్లన్. 3

తే. ఎవ్వరికుటుంబమందైన నెనసి యున్నఁ, గాని చిక్కదు తత్పరిజ్ఞాన మెల్ల
నందు వర్తింపఁ దగునేర్పు నభ్యసింప, వలయు మున్ముందు హితులైనవారిఁ జేరి. 4

క. నాయనుఁ గొక్కండు కలం, డాయనకడ నిల్వు మిప్డు దని పల్కుడు నే
నీయకొని తద్గృహమునకుఁ, బోయితి నన్నతఁడు మిత్రుపోలికఁ జూచెన్. 5

ఆ. మఱియుఁ దెల్లవారిమర్యాద లెఱిఁగించి, యాంగ్లభాష మాటలాడఁ జేసి
జంకుగొంకు లెల్ల సవరించెఁ గాని, నా, కొంట దయ్యె నతనియింటివంట. 6

సీ. త్యాజ్యంబు లగుఁ గొన్నిభోజ్యముల్ చవిలేమి, నిష్టమైన పదార్థమేని మగుడ
నర్థింప సిగ్గు దా నడ్డమై కరము నన్, బాధింపఁ దొడఁగు నిప్పగిది ననుది
నం బుపవాసకల్పం బయ్యె మద్భుక్తి; యెఱచి మెక్కు మటంచు నెల్లనాఁడుఁ
జెలికాఁడు వాదంబు సేయుచు నుండు నా, దురవస్థఁ దిలకించి పరితపించి

ఆ. యవల నాప్రమాణ మతనికిఁ దెల్పి నే, మిన్నకుండువాఁడఁ గొన్నివాస
రమ్ము లిట్లు గడవ నమ్మిత్రునకును దు,ర్భరమయయ్యె నాదువర్తనంబు. 7

వ. ఒక్కనాఁ డతడు నన్గాంచి 8

తే. ఈవు మత్సోదరుండ వై తేని దతిమి, యుందు ని న్నెన్నఁడో శంక నందఁబోక
యిట్టివెడఁగుఁదనంబు నీ కెట్టు లొదవె, నవ్వరే బుద్ధిమంతు లీనడత విన్న. 9

తే. ఇచటియక్కఱ లించు కే నెఱుఁగ లేక, చదువుగంద మెఱుంగని జననిచెంత
నాచరించినబాసకై యడలె దేల, యెట్లు బాధించు నది దాని కేమివిలువ. 10

తే. అది ప్రమాణంబ కాదు న్యాయంబు ననుస,రించియును బాసగానది యెంచఁబడద
దానికిం గట్టువడుట యజ్ఞాన మిట్టి, పట్టుదల యున్న నిచట లాభంబు సున్న. 11

తే. మున్న నీ వామిషంబును దిన్నయట్లు, నిది రుచించినయట్లు నాదెదవు బళిరె
కోరి యక్కఱలేనిచో నారగించి, యున్నచో నొల్ల నందు వేమోయి వెఱ్ఱి! 12

క. ఇది నీదురదృష్టం బని, మది నెంచెద ననియె నేనుమాత్రము దీక్షన్
వదలుకొననైతి నించిన, పదార్థముల నిల్పుచుంటిఁ బ్రాణము నొదలన్. 13

క. ఎఱిచి స్గుతిచియ మా కి,ద్దఱకున్ దినదినము చర్చ తఱచుగ జరుగన్
దొరఁకొనె నాతని తర్కము, పెరుఁగుకొలఁది నేను బిఱ్ఱబిగియుచు నుందున్. 14

క. అనుదినమును రక్షణకై, వినుతించుచు నుంటి విశ్వవిభు నపు డదియున్
బనుపడుచు నుండె ని ప్వీఁ,క నొనర్పం బ్రత్యయంబ కారణ మయ్యెన్. 15

వ. అదియుం దొల్లి మాదాసి యగు రంభ గుప్పినబీజంబ – యిట్లుండ నొకనాఁడు నా చెలికాఁడు బెంథమను నతఁడు రచియించిన వస్తూపయోగసిద్ధాంతమను గ్రంథముం జదువ మొదలిడె – నందలిభాష నాకు దురవగాహం బగుట నతండ తద్విశేషంబుల నెల్ల నెఱుకసేయఁ దొడంగె – నంత నే నతని కిట్లంటి. 16

సీ. నెచ్చెలీ! నన్ను మన్నింపు నాకు నగమ్య, విషయంబు లిట్టి వామిషము దినుట
యావశ్యక మటంచు నంగీకరించెదఁ, గాని నాశపథంబు మాన నొల్ల
నద్దానిగుఱిచి వాదాడ వాదమునందు, ని న్నోర్వలే నంట నిక్కువంబు
మొఱ కనియో జగామొండివాఁ డనియొ భా,వించి న న్విడువు ముద్వేల మైన

ఆ. నెనరు సూపు నిన్ను నే మఱవంజాల, నస్మదీయసుఖము నభిలషించి
విడువ కిట్లు నీవు నొడువుచున్నాఁడ వం,చే నెఱుంగ నోటు హితవతంస. 17

ఆ. ఐన విడువనోప నూనినసమయంబు, బాస బాసయేకదా సతంబు
దాని నతకరింపఁ దగదు సుమా నీకు, నెఱుకవదనిధర్మ వెద్ది గలదు. **18**

క. ఇవ్విధిఁ బల్కుడు నెయ్యుఁడు, నివ్వెఱఁగుం జెంది బలిరె నీతో నిఁక నే
నివ్వాదం బొనరింపను, జువ్వె! భవన్నియమశుద్ధి సుశ్లాఘ మనెన్. **19**

క. అందుల కే నెంతయు ముద,మందితిఁ బలలంబుఁగూర్చి యతఁ దవ్వలఁ జ
ర్చం దెచ్చుట విడిచియు నెద,యందున్ నను గుఱిచి సేయు ననిశము చింతన్. **20**

ఆ. త్రావు నతఁడు చుట్ట సేవించు మద్యంబు, వాని నభ్యసింప వలయు ననఁడు
మఱియు వాని నెపుడు మరగకు మని నన్ను, హెచ్చరించు నెయ్య మచ్చుపడఁగ. **21**

క. ఆమిషమున్ దిన కుండిన, నామేను కృశించు ననియు నా కటులైనన్
సీమనివాసం బొంటక, బాముల నిడుననియు బెంగపడు నతఁ డెపుడున్. **22**

వ. ఇటు లమ్మిత్రునింట నా కొకమాసంబు సెల్లె – నతని మనికిపట్టు రిచ్మండులోఁ గలదు –
కాన లండనునకు వారమున కొండు రెండువారములకు మించి పోవనయితి కామి నత్తావున
కనతిదూరమునం దెయ్యే నొకసంసారమున నన్ను నిల్పు టావశ్యకం బని మెహతా, శుక్లా
లూహించి వెస్టుకెన్సింగ్టను నందొక యాంగ్ల హైందవకుటుంబమున నాకు వసతిఁ గల్గించి
– రయ్యింటి యామె విశ్వస్త – నా నియమ మాయమ్మకుం దెల్పి తదనుమతిఁ బడసి నే
నచ్చోట విడిసితి – నంత **23**

ఆ. రుచికి దూర మగుట నచటి యాహారంబు, నించదయ్యె నాకు నించుకేని
నిండి నాదులజ్జయుండె యధాపూర్వ, మిదుమ లడఁగవయ్యె నింతవట్టు. **24**

తే. ఆమెకుం గూఁతు లిద్ద ఱయ్యబల లార,గించుతఱి వలదని నివారించుకొలఁది
వేయుదురు నాకుఁ జెఱియొక వేఁడిరొట్టెఁ, దెలియరైరింక నొక రెండు వలయునంచు. **25**

క. మది కొదవె నిప్పటికి నె,మ్మది; విద్యాశ్రమము సక్రమంబుగ నింకన్
మొదలిడనైతిని బత్రిక, చదువం దొరఁకొంటి నొక్కసంగాతి యిడన్. **26**

క. ఒకగంట చాలు నప్పని,కిఁకఁ జాగించితిని నగర మెల్లను జూడన్
బ్రకటనఫలకంబుల నో,పికమైఁ గనుచుంటి సకలవీధులయందున్. **27**

వ. నాప్రయాస ఫలితముగా నొక్కవాడయందు శాకాహారవిపణి దృగ్గోచరం బగుదు నందుల
కెంతయుఁ బొంగి యద్దాని ముంగిట నమ్ము శాకాహారసిద్ధాంతమను గ్రంథమ్మును సాల్టు
విరచింతబును గొని లోనికిఁ జని రుచ్యములగు భోజ్యంబు లాప్యాయనంబుగ నారగించితి
– వెండియు **28**

సీ. ఆంగ్లదేశమ్మునం దడుగుమోపిన వెన్కఁ, గడుపారఁ గుడుచు టప్పుడ లభించె
నను(ఁ బ్రోవ భగవానుఁ డనురాగమున వచ్చి, నటులుండె నాశాల యరసి చూడ
సాల్టుపుస్తక మంతఁ జదివితిం దుదదాఁక, సంతసం బెంతే నొసంగె నద్ది
నాఁటినుండియు నే మనఃపూర్వకమ్ము శా,కాహారి నైతి నం చనఁగఁ జెల్లు
గీ. జననిసన్నిధి శపథంబు సలిపినట్టి, దినము నా కప్పు డానందజనకమయ్యె
నిర్విచారంబుగా సీమ నిల్వవచ్చు, నెన్నినాళ్లేని యను ధైర్య మెచ్చిపోయె. 29

తే. ఆప్రతిజ్ఞను సత్యంబు నాదరించి, యెఱచిఁ దాత్కాలికమ్ముగాఁ గొఱుకకున్న
భావికాలమునం దేను భయము విడిచి, సంతసమ్మునఁ బొల సారగింతుననియు. 30

క. హైందవు లెల్లరు నామిష,ముం దినఁగా వలయు ననియు మునుకొని సంఘం
బం దియ్యశనము వ్యాప్తిని, జెందం దగుబోధనమ్ము సేయుదు ననియున్. 31

తే. తొలుత నెంచితిఁగాని యత్తలఁపు దూర,మయ్యె నీనాఁడు నే నిపు డారగించు
నాకుబువ్వ జగమ్మునయందు వెల్లి,విరియఁ జేయుటయే నాకు వేడ్క యయ్యె. 32



## 15 ఆంగ్లవేషము

సీ. కొనలొత్తఁ దొడఁగె నాకుంబువ్వదెసనాకు, నానాఁటి కెడఁదలో నమ్మకంబు
చదువఁజాగితిని భోజనముఁ గూర్చి రచింపఁ బడినపొత్తముల సంబరము గదుర
బోధించె నవి క్రీస్తుమున్నుగుమహనీయు, లెల్ల శాకాహారులే యటంచుఁ
దెలిపె శాకాహారదీక్షితుల్ పూర్ణాయు,రారోగ్యసంపన్ను లగుదు రనియుఁ
తే. బిదప భోజ్యపరీక్ష నాబ్రదుకునందు, ముఖ్యమగు కృత్య మయ్యె మున్ముందు దీని
మొదలుపెట్టుట యారోగ్యమునక యైన, నవల ధర్మదృష్టియె హేతువయ్యె నిందు. 1

క. ఈపగిది నేను గాల,క్షేప మ్మొనరింప నాదు చెలికి మదన్న
వ్యాపారజనిత మగు సం,తాపము రూపడఁగదయ్యెఁ దా లవ మేనిన్. 2

సీ. ఆమిషాహారంబు నారగింపక యున్న, దేహపాటవ మొగి న్దెరలు ననియుఁ
దెల్లవారలఁ గూడి తిరుగక యున్నచో, జడబుద్ధినై యేను జెడుదు ననియు
నాకుబువ్వను మెచ్చునట్టిబ్రాఁతలఁ గన్న, విపరీతములు సంభవించు ననియు
నాహారపరిశోధనార్థినై మెలఁగుచో, భువి నిరర్థకుఁడనై పోదు ననియు
ఆ. నాతఁ డూహచేసి నాతత్త్వమును మార్ప, యుక్తి యొకటి పన్ని యొక్క రేయి
నాటకంబు సూడ నను రమ్మటం చన, నతనివెంట వేడ్క నరిగినాఁడ. 3

క. ఎరకొఱ కత్తఱి మునుముం, దిరువుర మొకపూఁటకూటియిలు సేరితి మ
య్యిరవు నరపాలభవనము, కరణి విరాజిల్లు శిల్పకళ కాశ్రయమై. 4

వ. అందు నాగరకు లనేకులు మెసవుచుందురు – గాన నటకు నన్నుం గొనిపోయిన నవినయ భయంబున్ జేసి భోజన మధ్యమున న్దే నెట్టిసందియములనేని వెలువరింపఁజాల నని నా మిత్రుఁ డూహించి యాపన్నుగడం బన్నె – నంతఁ బెక్కంద్ర నడుమ నే మొకబల్లముం దుపవిష్టుల మగుడుఁ బ్రథమభోజ్యంబుగా సూ పను పదార్థంబు మా కొసంగఁ బడియె – నయ్యది శాకాహార మగునో కాదో యను సంశయంబు నన్నుఁ బీడింప నద్దాని గుఱిచి నేస్తకాని నడుగనొల్లక మెల్లన వడ్డనసేయువాని జీరితి – నయ్యవసరంబున 5

క. అద్దాని నెఱిఁగి మిత్రుఁడు, గద్దించుచు నతనిఁ బిల్వఁ గత మే మన నేఁ
దద్దయు వెనుకాడుచుఁ గల, సుద్ది న్వినిపింప నతఁడు చుఱచుఱఁ గనుచున్. 6

తే. నిమిషమే నిట్టిసంఘాన నీవు నిలువ, నర్హుఁడవు గావు వలయుమర్యాద నెఱుఁగ
వేని వేవేగ నొండొక్క యెడకు నడిచి, కుడిచి వాకిట నారాకకొఱకు నిలుము. 7

ఆ. అనుడు సంతసించి యచ్చోటి నెడఁబాసి, పొంత నున్న యాకుబువ్వబసకు
దాసిచూడ వేళతప్పుట నది మూయఁ, బడియె నౌర నాయభాగ్యమహిమ. 8

ఆ. నాఁటిరేయి నాకుఁ బాటిల్లె నుపవాస, మంత నేము నాటకావలోక
నాభిలాషఁ జనితి మవ్వల నాతఁ డి,గ్గొదవ నెన్నఁడేని దడవఁడయ్యె. 9

ఆ. ఇదియు మాకుఁ దుట్టదుదిజగడము దీనఁ, బొడమదయ్యె నెట్టిపొరపు మాకు
నెయ్యుఁ డిట్లు సలుపఁ దియ్యంబ హేతువు, గాన వాని మిగుల గారవింతు. 10

వ. తలఁపుసేఁతల నా కెంతయంతర మున్నను నతఁడు నాహితుఁడగుటంజేసి సర్వదా వాని గౌరవించువాఁడ – నంత నే నామిషమును దృజించినను దక్కుంగల మర్యాదలం దాంగ్లేయ సంఘసంప్రదాయములు చక్కఁగా ననుసరింప నేర్తునని సంగడీనికిఁ దెల్లముసేయనెంచి మునుముందు వలయు దుస్తుల న్విలిచి వేషము సవరించి పాపట సంస్కరించి నాట్యమును బరాసుబాసను గఱచినం దప్ప నాగరకత పూర్ణతం జెందదని విని వ్యయప్రయాసముల కోర్చి యొక శిక్షాశాల నాశ్రయించి కొన్నినాళ్ళు నృత్యము నభ్యసించితి – నందలి తాళగతిం దెలియ నే నశక్తుండ నగుటఁ దత్సిద్ధికయి గోఁచిప్రాంతకొఱకుఁ గొండంత సంసార మున్నట్లు ఫిడేలు నభ్యసించు నవస్థ నాకుఁ బాటిల్లె – వెండియు వక్తృతాపద్ధతి నెఱుంగ నొండొక యొజ్జను సేవింపఁ దొడఁగితి – నగ్గురుఁడు బెల్లను నతండు గూర్చిన యాదర్శవక్త యను గ్రంథముం బఠనీయముగా నియమించె – నందలి యుపన్యాసము నొకదానిఁ జదువ దొరఁకొంటి – నింతలో నా బెల్ మహాశయుఁడు నాశ్రవఃకుహరమున ఘంటానాదము సల్పుడు నే మేలుకాంచి 11

మం. ఆ జీవితాంత మియ్యాంగ్లదేశమున, నే నుంట కల్ల యింకేల యీబెడఁద
యరుగుదెంచితిని విద్యార్థినై యిటకుఁ, దత్సమార్జనమె కర్తవ్యంబు నాకు. 12

తే. ఇటు విచారించి వైళంబ నటన గీత, వాగ్మితాభ్యాసముల కెల్ల స్వస్తి చెప్పి
గురుల మన్నింపుఁ డని పేర్మి మెఱయ వేఁడి, యవల నిక్కపు విద్యార్థి నైతి నేను. 13

తే. నృత్యగీతాదికాసక్తి రెండుమూఁడు, మాసములె నిల్చి పిదప నన్వాసెఁ గాని
వేసమునయందుఁబొడమిన వెఱ్ఱివలపు, విడువదయ్యెను బెక్కేండ్లు గడచుదనుక. 14



# 16 మార్పులు

తే. ఆటలకు లొంగి పాటల కాస చెంది, యిచ్చవచ్చినటుల్ చరియించినాఁడ
నంచుఁ బాఠకులార! మీ రెంచవలదు, తప్పుదారికిఁ జననైతి నప్పుడేని. 1

తే. ఏ నపుడు వెచ్చపెట్టిన యెల్లకాసు, నకు విసువులేక లెక్క వ్రాసికొనువాఁడ
ననుదినంబును శయనించునవసరమున, నిలువ సరిచూచుచుందు నిర్నిద్రమతిని. 2

వ. ఆయభ్యాసము నాకిప్పటికిం గలదు - పెక్కు మేళ్ళ కియ్యదినిదానం బయ్యె - లక్షల కొలఁది ధర్మాదాయము పలుతెఱంగుల వెచ్చించు నా కెన్నఁడేని యెట్టిలెక్క చిక్కులుం బొసఁగవయ్యె - నియ్యాచారము యువలెల్లరు గుర్తించి నిత్యజీవితంబునఁ బ్రయోగింతుర యేని వారలు న్నావలె శుభంబు లందనేర్తురు - మఱియు 3

క. వెచ్చపులెక్కల ననుదిన, మిచ్చమెయిన్ వ్రాయుకతన నే వ్యయము కడున్
హెచ్చెడి నని గుర్తించితిఁ, గ్రచ్చుఱ నెంచితిని సగముకర్చును మాన్పన్. 4

సీ. పదపడి పద్దులం బరిశీలనముసేయ, నగపడె బండిబాడిగలు మిగుల
మఱియు నే నొకకుటుంబమునందు నుంటచే, విందులవెచ్చము న్విస్తరిల్లె
నీవ్యయమ్ములఁ ద్యజియించుట సుకరంబు, కాదొకో యనుబుద్ధికల్గె నంత
నక్కుటుంబము వీడి యద్దెగదులె రెంటిఁ, గైకొనినాఁడ నగ్గదులు నాదు
ఆ. కర్జ మున్న యెడకుఁ గడుదాపునం దుంట, నటకుఁ గాలినడక నరుగుచుందుఁ
గాన దీన బాడిగలు తగ్గెఁ దీఱిక, హెచ్చె దేహదార్ఢ్య మినుమడించె. 5

మం.బారిస్టరు పరీక్ష పాఠ్యముల్ చదువ, సమయంబు కొంతయు సరిపోవుకతన
మిగిలినకాల మెమ్మెయిఁ బుచ్చు టొప్పు, ననుచింత యపుడున న్నలముటం జేసి
యాంగ్లభాషాజ్ఞాన మస దన్నవంత, యెంతయు న న్నెరియించుచుండుటయుఁ
బట్టభద్రుఁడ నైనపదపడి వచ్చి, ననుఁ జూడు మని లేలి నాఁడు పల్కుటయుఁ
దలపోసి యెద్దియేఁ దగినపరీక్ష, కింకొక్క దానికి నిక్కాలమెల్ల

నుపయోగపఱుచుట యుక్తం బటంచు, నెంచి మన్మిత్రున కియ్యూహఁ దెలుప
నిచ్చమై నతఁడు నీ కెల్ల చందముల, మెట్రిక్యులేషను మే లౌ పరీక్ష
యుత్తమపార్యంబు లున్నవి దానఁ, గల్గించుఁ దగినలోకజ్ఞానమద్ది
యలఁతివెచ్చము చాలు నద్దానిఁ జదువ, ననుడు నే వేడ్కమై నంగీకరించి
పరనీయ పుస్తకపట్టికం జూడ, దుస్సాధ మిది యంచుఁ దోఁచె వెండియును
దాన లాటినుభాషఁ దప్పక చదువ, వలయు నవ్వాణి యెవ్వడువున వచ్చు
నని యేను సంశయ మంద వయస్యుఁ, దేల నీ విటు సంశయింతు మిత్రంబ!
లాటి నెఱుంగ కేలాగున ఫలము, వడయం గలరు న్యాయవాదులౌవార
లబ్బాస నేర్చినయట్టివారలకు, న్యాయశాస్త్రం బర్థ మగును దెల్లముగ
మఱియు నద్దాన రోమన్ న్యాయశిక్ష, కొసఁగుప్రచ్ఛాపత్ర ముండెడిఁ జువ్వె
యయ్యది కైవసం బైనవారలకు, నాంగ్లంబు పాణితలామలకంబ
యని పల్కె నచ్చె నా కతనిబోధనము. 7

క. పిదపఁ బరీక్షాపరనము, మొదలిడి సమయంబు నొకనిముస మేని వృథా
వదలక చదివితిఁ గనువా, రదిరా! యని కంపితోత్తమాంగులు కాఁగన్. 8

వ. ఇతఃపూర్వంబ పరాసుబాసతో నాకుఁ గొంతపరిచయము కలదు – కాన దాని నాధునిక భాషకు మాఱుగా స్వీకరించితి – నప్పటికిఁ బరీక్ష కైదుమాసముల మేరయుండె – నింత యల్పకాలమునంద యిట్టినూత్నభాషల నితరవిషయమ్ములఁ దెలియఁ దగినబుద్ధిబలంబు నాకుఁ గఱవగుటఁ బరీక్షయం దోటమి యొదవె – లాటినులోఁ దగునంకములు రామి యియ్యనర్థమునకు మూలం బాయె – నంత 9

క. అపజయమునకు నిరుత్సాహపడక మగుడం బరీక్ష కత్యంతాస
క్తిపరీతచిత్తమునఁ బూని పఠింపం దొడఁగినాఁడ నెయ్యురు మెచ్చన్. 10

తే. హెచ్చిపోయెఁ బరీక్షలవెచ్చ మపుడు, దాని సవరించుకొఱకు నిత్యవ్యయంబు
మరలఁ గొండొక తగ్గింప మదిఁ దలంచి, యొక్కగదియంద కాఁపురముంటి నొదిఁగి. 11

ఆ. పూఁటకూటియింటిబోనము వర్జించి, సంతరించుకొంటి సొంతవంట
నట్లుచేఁత నేఁబదఱువది రూప్యముల్, కలిసివచ్చె మాసకాలమునకు. 12

సీ. మితమైన వెచ్చంబుమెయి దంబ మెఱుఁగని, బ్రతుకు సాగించుటకతన మిగుల
నవకాశ మొదవె నా కపుడు విద్యల నేర్వ, దాన రెండవమాఱు తత్పరీక్ష
విజయంబు గల్గె నివ్విధి మితవ్యయ మూని, యుంట నేఁ గడగండ్లఁ గంటి నంచుఁ
బాఠకజను లూహపడకుండ్రుగావుత, మది నాదు లోవెలిబ్రదుకులకును
ఆ. గలుగఁజేసెఁ బొత్తు ఘటియించె రాబడి, కగ్గమైనవెచ్చ మతులసత్య
మయముఁజేసె నాదుమనుగడ నిర్భరా, నందసాగరమున నన్నుఁ దోఁచె. 13



# 17 భక్ష్య పరిశీలనము

క. పరిశోధనమ్ము నెఱపన్, దొరఁకొన్నకొలంది నాకుఁ దోఁచెను బహిరం
తరధర్మము లింకను సం,స్మరణ మ్మొనరింపఁ దగు దశ స్థల వనుచున్. 1

ఆ. కాఁపురంబునందుఁ గర్భులయందు సం,స్మరణముం బొనర్పఁ గడఁగినపుడ
పూనినాఁడ నేను భోజ్యంబులందును, వలయునట్టి మాఱుపుల నొనర్ప. 2

సీ. అవగతమయ్యె నా కాకుబువ్వను మెచ్చు, గ్రంథము ల్గూర్చిన ప్రాజ్ఞులెల్లఁ
బ్రకృతిశాస్త్రవిరుద్ధపద్ధతు ల్విడనాడి, యారోగ్యలక్షణం బనుసరించి
మతధర్మమును సమంచితబుద్ధి మన్నించి, చేఁతకు ననువైన రీతు లెఱిఁగి
లోఁతుగాఁ జర్చించియే తమపొత్తముల్, విరచించినా రన్నవిషయ మపుడు
ఆ. ధరణి మానవుండు తక్కిన ప్రాణుల, కంటె వలఁతియైన కతన నతఁడు
చంపఁదగదు వాని సంరక్ష గావింప, వలయు నంచు వారు వ్రాసి రందు. 3

వ. అదియునుంగాక మనుజుఁడు లాఁతి మానిసికెట్లు తోడ్పడు నట్ల తక్కుంగల జంతులకు సైతము సాయంపడు టావశ్యకమనియు నరుండు మెసపుట మనుటక కాని జిహ్వాతృప్తికిం గాదనియు మానవున కతనిశరీర నిర్మాణంబు ననుసరించి చూడఁ బక్వాహారంబు త్యాజ్యం బనియు నాయుర్వేదముంబట్టి యూరుఁగాయ లుప్పుఁ బచ్చడులు తాలింపులు మున్నగు నవి వర్జ్యంబు లనియు నెల్లరకు నాకుబువ్వ చేరికలోని దనియుఁ జౌక యనియుఁ దద్గ్రంథ కర్తలు సవిమర్శము నిర్ణయించి – రియ్యంశములెల్ల నా యనుభూతికి లోనయ్యె – వెండియు వారిలోఁ బెక్కండ్రామిషము నండములం బయస్సును నిషేధించి తాము నట్ల ప్రవర్తిల్లిరి – వారి వ్రాఁతలు న న్నెంతయు నలరించె – నంత. 4

ఆ. ఆకుబోన మమ్ము నంగళ్ళలోన నీ, కట్టుపాట్ల నెల్ల గారవించు
ప్రజలఁ గలిసికొన్న వాఁడ నాయందుఁ బె,న్నాదరంబు సూపి రపుడు వారు. 5

సీ. నల్లవో! శాకాశనప్రచారకసంఘ,మును సీమ నొక్కండు దనరు వార
పత్రిక నొకదానిఁ బ్రచురించు నయ్యది, దాన సభ్యత్వంబుదక్కెనాకు
నల్పకాలమునంద యందితిఁ గార్యస,భాసభ్యతాగౌరవంబు నందు
దీక్షమై శాకభుక్తిని బాలనము సేయు,వారు పల్వురు మిత్రులైరి పిదప
ఆ. భక్ష్యవస్తువితతిఁ బరిశోధన మొనర్పఁ, బూని యపుడ మాతృభూమివలన
వచ్చినట్టినిలువపచ్చళ్ళఁ జిఱుదిండ్ల, మానినాఁడ నిచ్చ మాఱుకతన. 6

తే. మున్ను సంభార మన్నది సున్న యగుటఁ, జప్పఁగా నున్న బచ్చలిశాక మిపుడు
కమ్మఁగా నుంట నాలుకగాద చవికి, నాత్మయె ప్రధానమగురంగ మనుచుఁ దోఁచె. 7

వ. అయ్యవసరమునం దార్థికచింత నాయుల్లమునం బాదుకొనియుండె - నయ్యెడఁ గొందఱు టీ కాఫీ లారోగ్య నాశకంబు లని వానిం దృజించి కోకో ద్రావుచుంట యెఱిఁగి భుజించుట జీవయాత్రకు మాత్రంబ యని తలంచి నేను నట్ల చేయందొడంగితి - వెండియు 8

మం. శాకాన్నవిక్రయశాలకు నేగి, యిచ్చువచ్చిన వస్తు లెల్లను మెక్కి
విపరీతముగ సొమ్ము వెచ్చింపఁ బోక, పరిమితవ్యయదీక్షఁ బాటించు టాది
నిత్యంబు నాఱుపెన్నీల భక్ష్యముల, నియమంబుమైఁ గొని నే నారగింపఁ
గడఁగినవాఁడ నక్కాలానఁ బిండి, గల భక్ష్యముల ముట్టకయ కొన్నినాళ్ళు
కడపితి మఱికొంతకాలంబు రొట్టె, పండ్లు భుజించితిఁ బదపడి గ్రుడ్లు
జున్ను పా లారగించుట దొరఁకొంటి, గుర్తింపఁ దగిన ది క్కానశోధనంబు. 9

తే. అపుడు సంస్కర్తయొక్కరుఁడండముల భు,జించుచోఁ బెక్కుమేళ్లు ప్రాప్తించుననియు
నది యెఱచితిండిలోఁజేర దనియుఁ దెలుప, నచ్చె నాతనివాదంబు నాదుమదికి. 10

క. అంతట నండము జీవ, జ్జంతువు కానేర దంచు సామాన్యముగన్
స్వాంతమునయందుఁ దోచుదు, సంతసమున దాని మెక్కఁజాగినవాఁడన్. 11

వ. పరాకునం దొదరిన యిక్కుదుపును బదునైదుదివసంబులుమాత్రమ మెసవి యంత నియ్యది యకార్యమని యెఱింగితి - నామున్ను సల్పినశపథంబునకు నేఁడు నూతనార్థ వివరణ మొనర్చుట నీతికి విరుద్ధంబు - గ్రుడ్లను బలలంబులోనివ యని మజ్జననియభిప్రాయం బగుట నిక్కంబు - కాన నిబ్బాసయందలి పరమార్థంబు నామదికి గోచరించిన మఱు నిముసంబ యండములం దినుట మాని యాహారపరిశీలనమ్మును సైత ముజ్జగించితి - మఱియు 12

సీ. ఆంగ్లదేశమ్మునం దామిషంబును గూర్చి, కనుఁగొంటి మూఁడులక్షణము లొకటఁ
బశుపక్షిపలలంబ పలల మిమ్మతమువా, రైన శాకాహారు లండములను
జేపల నారగించెదరు వే ఱొకదాన, నెల్లప్రాణులమాంస మెఱచి; దీన
నారగింపఁగవచ్చు నండము లొండొక, దాన సర్వప్రాణితరస మండ

ఆ. ములును బాలు పెరుఁగు మున్నగునవియు గ,ణ్యములు మాంసగణమునందు, నట్టు
లగుట నాకుబువ్వయంగళ్ళఁ బెక్కు భ,క్ష్యముల గ్రుడ్డుకలియుననుచుఁదోఁచె. 13

తే. కావుటంజేసి యచటి భక్ష్యముల మెసవు, వేళలం దెల్ల నవ్వానిమూల మడిగి
యండములు చేరకున్న భోజ్యములు విలిచి, యారగించెడివాఁడ నే ననుదినంబు. 14

వ. దీనంజేసి యిష్టంబు లగు భక్ష్యములు పెక్కింటిని విడువ వలసెఁ - గాని నాయొనర్చిన బాసను దీక్షమై రక్షించుచుంట నియ్యది నా కసంతృప్తి గూర్పదయ్యె - మఱియు 15

తే. ఎంత తెల్లమై తనబాస యెసఁగుచున్న, నాత్మచరితావిరుద్ధమై యలరుపోల్కి
దానికి న్నూత్న నూతనార్థములు వెల్ల,డించెదరు కొంద తేత[త్ర]ప్రపంచమందు. 16

క. కల రిట్టివారు లక్షలు, గలవారలయందు లేమిగలవారలయం
దలస్వార్థప్రియతయ వా,రలకన్నులు గప్పు నద్దిరా యే మందున్. 17

తే. కొంకుజంకులు వీడి వా గ్గోదమీఁది, పిల్లివాటముగా విజ్ఞు లెల్ల రోయఁ
బలికి యాత్మవంచనమును జలిపికొని జ,గమ్ము దైవమ్ము వంచింపఁ గడఁగుచుంద్రు. 18

తే. బాసచేసినమనుజుఁ డబ్బాస నెవ్వఁ, డాచరింపఁగఁజేసె నయ్యతనియర్థ
మనుసరించుట సంశ్లాఘ్య మైనమార్గ, మని వచింతురు ధర్మజ్ఞు లైన బుధులు. 19

క. రెండర్థంబులకును వీ,లుండిన దుర్బలునినుడికి నొడఁబడఁ దగు నీ
రెండు తెఱంగులఁ దొఱఁగిన, నిందున్ బెనఁకువలు పొడినెతి పొడవడఁగున్. 20

వ. సత్యమునకుం గొల్వుసల్పువాఁడు మొదటిమార్గంబు ద్రొక్కుటయ వాంఛించు-నాతఁడు నూతన వ్యాఖ్యానముల కొఱకు సూరిజనమ్ముల నెన్నఁడు నారాధింప నొల్లఁడు - పలలముం గూర్చి యుత్తమసరణి ననుసరించి చూడ నాతల్లి యూహించిన లక్షణంబ నాకు శిరోధార్యంబు - కాని యన్యం బవశ్యపరిహార్యంబ - వెండియు 21

మం. నాసల్పు పరిశోధనమ్ము సర్వమ్ము, నార్థికదృష్టి నయ్యారోగ్యదృష్టి
ననుసరించియు సాగె నాంగ్లదేశమున, నవ్వల నిక్కార్య మాత్రికాయందు
నాచరించితిని ధర్మైక మౌ దృష్టి, ముందు వాక్రుత్తు నమ్ముచ్చట నెల్ల
నెటులైన దీనికి నింగ్లాండునంద, జరిగె బీజావాపసంస్కార మెల్ల. 22

ఆ. మాంసభక్షణంబ మంచి దటంచు నేఁ, బెక్కునాళ్ళు నమ్మి పిదప శాక
భోక్తనైతిఁ గానఁ బూర్ణాభిమానంబు, పొడమె నాకు నాకుబువ్వపట్ల. 23

తే. తదవులంబట్టి యొక్కమతమ్మునందు, వెలయునాతనికంటె నవీనముగను
దానిఁ బూనినవాని కద్దాన మివుల, నాదరము కల్గునంట సత్యమ్ము గాదె. 24

వ. ఏత దభిమానఫలితమ్ముగా నావసించు పేఁటయం దే నొక శాకాహారిగోష్ఠి నెలకొల్పి దానికి శాకాహారపత్రికాసంపాదకు లగు నోల్డుఫీల్డుగారి నధ్యక్షులఁ జేసి నేఁ గార్యదర్శిపదవి స్వీకరించితి-నయ్యది కొంతకాలము శ్లాఘనీయమ్ముగాఁ జాగియు నే నవ్వాద వీడి వేఱొక్క దెసకుం బోవుట వాటిల్లుటంజేసి కతిపయమాసమ్ములలోన పొడవడంగె-నైనను 25

తే. వినయపూరిత మిప్పాటి యనుభవంబ, కొన్ని సంఘముల న్నెలకొల్పి వాని
వ్యాపనీయమ్ము లొనరింప నర్హమైన, చాకచక్యము నాకు నొసంగఁ గల్గె. 26



# 18 బిడియము నాడాలు

సీ. శాకభోజనసమాజమునందు నేఁ గార్య, సంఘసభ్యుఁడనై యొసంగుకతన
వెడలుచుందురు సమావేశము లన్నిటి, కైన మౌనంబు నా కచటఁ దప్ప
దధ్యక్షుఁ డిది కూడ దని పెక్కుసార్లు నన్, మమత దీపింపఁ దా మందలించెఁ
గొలువులో మాటాడవలయునన్కోర్కి నా, కెంతయుఁ గల దైన నేమిలాభ
ఆ. ముల్లమందుఁ బొడము నూహమ్ములం దగు, నట్టి బాసయందుఁ బెట్టఁజాల
మొదలుకొన్న విషయమును దప్పి యప్రకృ,తాంశచర్చలోని కరుగువాఁడ. 1

ఆ. కడచె నిట్లు కొంతకాల మవ్వల నొక్కసారి ముఖ్యవిషయచర్చ యొకఁడు
దాపరించె సమితిఁ; దత్సభయందుఁ బా,ల్గొనమి ధర్మదూరమనుచుఁ దోఁచె. 2

క. రచ్చకు నేగియు భావం,బచ్చుపదువిధాన మాటలాడక యిస్సీ
యొచ్చెముగ మూఁగసమ్మతి, నిచ్చుట భీరుత్వ మంచు నెంచితి నెడఁదన్. 3

వ. తత్సభకు నయోవ్యాపారిసంఘనాయకుఁ డగు హిల్సను నతఁ డధ్యక్షుఁ - డాతఁడు నీతివాదియనం దగు - నాయన యొనర్చు నార్థికసాహాయ్యంబుపైన తత్సంఘ మాధారపడి యుండె - సామాజికులు పెక్కం డ్రతనికనుసన్నల మెలఁగుచుందు - రాకుబువ్వదెస నిండుగారవంబుగల యల్లిన్స నను నతఁడుం బాలకసంఘమున వెలయు - నపుడ యంకురించిన సంతాననిరోధోద్యమం బతని కభిమానపాత్రమగుడు నతఁ డద్దానిఁగూర్చి కార్మికులకు బోధింపఁ దొడఁగె - నిట్టి యాచారంబు నీతిద్రుమంబునకు వేరుపుర్వుంబోని దని హిల్సుతలంపు - శాకాహార సమాజము నైతికసేవ సయిత మాచరింపవలయు నని యతని యాశయము - కాన విపరీత భావభరితుడగు నల్లిన్సను తత్సంఘమునం దుంట చెట్టకుఁ బట్టుఁగొమ్మని యయ్యధ్యక్షునిభావంబు - కావుటంజేసి యల్లిన్సనుసభ్యతను రద్దు పఱుపవలయునను నిర్ణయము సభం బ్రతిపాదిత మయ్యె - నంత 4

తే. తద్విచారంబు నాదుచిత్తమును దిగువ, మంచిచెడ్డల నే విమర్శించి కనుదు
జన్మశాసనవాదియాశయము లెల్ల, నత్యుపద్రవకారు లటంచుఁ దోఁచె. 5

తే. హిల్సు తా నీతివాదియై యొసఁగుకతన, నాతఁ డల్లిన్సనునకుఁ బ్రత్యర్థియగుట
ధర్మమని తోఁచె నాతఁ డౌదార్యభరితుఁ, డగుట మన్నింతు నతని నేనగ్గలముగ. 6

మం. బనను నీతియం దాశయభేద, మున్నంతమాత్రాన నొకనిసభ్యతను
రద్దు సేయుట నీతిరహితకృత్యంబ, యని బోధచేసె నాదగునంతరాత్మ
సంఘమ్ములక్ష్యంబు శాకభోజనము, నెరయుటకై ప్రయత్నించుటే కాని
యింకెట్టినయమార్గమేని విస్తృతము, గావింపఁ బూనుట కా దట్టు లగుట
నీతింగుఱిచి యెట్టినియమంబు లున్న, శాకభక్షణమును జల్పువా రెల్ల
నర్హు లేతత్సంఘమం దిమ్ముకొనఁగ, ననుచు భావించితి నంతరంగమున. 7

తే. సాంఘికులు కొంద తేతదంశమునఁ దగవు, నెంచి నాతోడ నేకీభవించి రైన
నేన యిమ్మాఱు మాటాడ నెంచినాఁడఁ, గాని కఱవయ్యెఁ దాల్మి తత్కాలమందు. 8

వ. కావున నాపల్కనెంచినపల్కుల నెల్ల నొకపత్రముపై లిఖించికొని సభకుఁ జేరి యదియుం బఠింపఁజాలక రచ్చపెద్దకు దాని నందిచ్చుదు నతఁడొకసభ్యునిచే దానిని జదివించె - నంత నల్లిన్సనుపక్షంబునక యోటమి వాటిల్లెఁ - బ్రథమప్రయత్నము నంద నా కపజయంబు సిద్ధించె - నైనను నాయాశయము ధర్మంబకదా యనుతనివి నా కెంతయుఁ గల్గెఁ - దద నంతరము నేను నా సభ్యతం ద్యజించినయ ట్లించుక జ్ఞప్తికలదు - సీమయం దున్నకాల మెల్ల నిట్టిప్రీడాభరముతోన కడచె - నీలజ్జ సభలయంద కాక చెలికాండ్ర మనికిపట్టులందును నన్నుఁ బీడించు - వెండియు 9

తే. వెంటనరు నాఁ జెలంగెడివీటి కొక్క, నాఁడు త్ర్యంబకరాయితోఁ గూడి చనితి
నచట మ మ్మొకసభలోన నాకుబువ్వఁ, గూర్చి భాషింపుఁ దని చెలుల్ గోరి రపుడు. 10

తే. వ్రాసితి న్నేను దగు నుపన్యాస మొండు, దాని సభలోనఁ జదువంగఁ బూనునంతఁ
గంపముదయించెఁ జెమ్మటల్ క్రమ్మెఁ గనులు, పచ్చఁబడె నాకు గాద్గద్య మెచ్చిపోయె. 11

క. పదపడి తత్పత్రముఁ గొని, చదివె మజుందా; రతండుఁ జవు లుట్టిపడన్
మృదుతామాధుర్యగుణా, స్పదఫక్కి నుపన్యసించెఁ బ్రత్యేకముగన్. 12

క. మొరయించి రంత సభ్యులు, కరతాళమ్ముల ముదం బఖండమ్ముగ; న
త్తఱి నేమి సెప్పుదు ననున్, వరియించెను లజ్జ దుర్నివారం బగుచున్. 13

సీ. అవల విద్యాభ్యాస మది పూర్తి గావించి, మాతృదేశమునకు మఱలువేళ
నాకుదిండిని మెక్కునట్టినెయ్యుర కెల్ల, విందుఁ జేసితి; నాంగ్లవిషయమందు
నాటపాటలతోడ నార్భాటములతోడ, వాఙ్ముఖంబులతోడ వఱలు నద్ది
పాశ్చాత్య లోకవిద్యపగిది నేతత్క్రియన్, గౌరవించుచునుంద్రు; నాయొనర్చు
ఆ. నలఁతివిందునందుఁ గలవు వినోదముల్, దాన మత్కృతజ్ఞతను వెలార్ప
మొదలుకొంటిఁగాని మొదటివాక్యమ్ముపై, వెడల దయ్యె నొక్కనుడియు నదిర! 14

తే. ఎల్లరకు నుల్లము ల్గదుఁ బల్లవింప, హాస్యరస మూర నే మాటలాడ నెంచి
సంతసమ్మున వావిచ్చునంతలోన, యాస లడుగంట నెగతాళి కగ్గమైతి. 15

ఆ. తుదకుఁ "దాము కరుణతోడుత వేంచేసి, నందులకు ననేక వందనంబు"
లనుచుఁ గ్రుంచివైచి యవ్వల నవమాన, భార మదరఁ గూలఁబడినవాఁడ. 16

మం. ననుఁబాయదయ్యె నెన్నండు నీలజ్జ, యదఁగె నయ్యది దక్షిణాఫ్రికాఁ గొంత
యంతియ కాక నే నవిలంబితముగ, భాషింపలేనైతిఁ బదుగురలోన

నప్పుడప్పుడు గేలి నందుటే తప్పు, నీసిగ్గుచేత నా కెట్టిలోపంబు
సమకూరదయ్యె నీ సంకోచ మపుడు, కడుఁ గొందలమ్మును గల్గించెఁ గాని
యానందదాయకం బయ్యె నాకిపుడు, మితశబ్దములు వాడు మెలఁకువ దీనఁ
గుదిరె వెండియుఁ గోరుకుల నడ్డగింపఁ, గలబలం బధికంబుగా నేరుపడియె
నర్థశూన్యం బైనయట్టిశబ్దంబు, నే నెన్నఁడున్ వచియింప లిఖింప
నని పల్కనేర్తు భయం బింతలేక నాపల్కులో లేఖనమ్ములో నెపుడు
దోస మొక్కటియేని దొరలిన ట్లెఱుఁగ నీరీతి దురవస్థ లెన్నియో తొలఁగె
సదుపయుక్తంబయ్యె సమయం బదెల్ల, నిజమునకుం గొల్వు నెఱపునాతనికి
నావశ్యకంబు మౌనాశ్రయం బనుచు, నెఱిఁగించె నాకు నెంతే ననుభూతి
యెఱిఁగియే నెఱుఁగకయే నప్పు దప్పు, డతిశయోక్తికిఁ బూని యందు నిక్కమ్ముఁ
గప్పిపుచ్చుచు నుంద్రు గద పెక్కుమంది, యిదినశింపఁగ మౌన మెంతయున్ వలయు
నర్థశూన్యంబు లైనట్టిశబ్దములఁ, బలుకఁ డెన్నఁడు మితభాషియౌ నరుఁడు
పరిషత్తులందు నుపన్యసించుటకు, గ్రుక్కిళ్లుమ్రింగుచు గోష్ఠినాయకుల
నవకాశ మొసఁగుఁ డయ్యా! కొంచె మనుచు, వేఢించువారలు వెలితి యైనట్టి
సమితి కాన్పించునే సామాన్యదశల, నెట్టకేలకు నాజ్ఞ నెనసినవక్త
ప్రాయికమ్ముగఁ గాలపరిమితి న్మీఱు, వెండియు వ్యవధికై విజ్ఞప్తి సేయు
నాన తీకున్నను నట్లె మాటాడు, సమయమ్ము వ్యర్థమ్ము సలుపుటే కాక
యితఁ డొనర్చెడి జగద్ధిత మింక నెద్ది, నాబిడియంబపో నాకు డా లయ్యె
ననుఁ బరిపక్వం బొనర్చె నాసిగ్గె, చెలియయ్యె సత్యసంసేవ నాకదియ. **17**



## 19 అసత్య వ్రణము

తే. ఆంగ్ల దేశమ్మునందు విద్యార్థిమాత్రు, లెల్లరును బ్రహ్మచారు లై యెసఁగుచుంద్రు
చదువునకుఁ బెండిలికిని జుక్కెదు రటంచు, వార లుత్సాహపడరు వివాహమునకు. **1**

క. మున్ను మనసంఘ మెంతయు, నున్నిద్రదశన్ వెలుంగుచున్నప్పుడు వి
ద్య న్నేర్చువానిఁ బిల్చిరి, పన్నుగ నల బ్రహ్మచారి పదమున లోకుల్. **2**

క. దురదృష్టవశంబున ని,త్తరుణంబునయందు గోఁచిఁదాల్చుచుఁ గాఖాల్
గఱచెదుబుడుతల కకటా!, పరిణయములు సాగుచుండు భారతమందున్. **3**

వ. ఆంగ్లదేశమున బాల్యవివాహ మనుపదంబు నెఱిఁగినవా రొక్కరుం గానరామికి లజ్జవడి
నాఁ డానాఁడిక న్నివసించు హైందవవిద్యార్థులు పెక్కంద్రు పరిణీతులయ్యు నవివాహితుల
మనియ నుడువుచుండువార – లియ్యసత్యభాషణంబునకు వేఱొండు హేతువుం గలదు. **4**

క. తరుణులు పరిణీతులు, త,ద్ధరణి వివాహంబుగాని తరుణులతోడన్
బెరసి వసియింప నంగీ,కరింప రెవ్వారు నది యకార్యం బనుచున్. 5

సీ. తమకాంచపురముసేయు తావులం దాత్మీయ, పరిణయగాథలు బయలుపడిన
నాయిండ్ల లేజవరాండ్రతోడం గూడి, కులికెడి భాగ్యంబు కొఱంతవడెడి
నని విచారముసల్పి హైందవవిద్యార్థు, లియ్యసత్యము వల్కి నియ్యకొందు
రద్దీవి గోవాళ్లె యర్ధాంగులను నిర్ణయించుకోవలయు మే లెంచిచూచి
ఆ. దానం గన్యతల్లిదండ్రు లీచేంతల, కొప్పుకోలు సూపుచుందు రెండుం
గానరాదు ప్రాయికమ్ముగ నిట్టికూ,డికలయందు దోస మొకటియేని. 6

వ. కాన సీమయం దవివాహితు లగు యువతీయువకులు కూడిమాడి చెరలాడుట సాజంబ
యయ్యెం - గాని 7

క. భారతవిద్యార్థులు తెల,వారలకు నిసర్గ మగుచు వఱలెడు నియ్యా
చారమున కగ్గపడినన్, దీఱనిచెట్టలు జనించితీరక యున్నే. 8

క. వెస హైందవయువజను లీ,వ్యసనమునకుం జిక్కి కన్య లగు నాంగ్లబిస
ప్రసవాక్షులసంగతికై, యసత్యజీవనము జరుప నాసించి రహో! 9

ఆ. నావివాహ మయ్యె నందనుని న్ముద్దు, మురుపు లదర నెత్తి మురిసికొంటి
నైన నేమి నేను నవ్వాగురం జిక్కి, యచట బ్రహ్మచారినైతి నపుడు. 10

క. పాటిల్లద మోదము నా,కీటక్కరిబ్రతుకువలన నిసుమంతయు; నా
గాటంపులజ్జయే న,ట్టేటం బడనీక సాంకె నిత్తతి నన్నున్. 11

ఆ. నానచే ననూనమైన మౌనమ్ములో, నేను మునింగియుండ నెనరు వెలయు
లీల ముచ్చటించి లీల నాతోడ నే, యువతి కలసిమెలసి యుంట వలచు? 12

తే. వెంటనరు లోన నానిల్లునింటిమగువ, తనయ కన్యావతంస ముత్సాహ మదర
నతిథిజనమును వయ్యాళి కనుదినంబుం, బిలిచికొనిపోవు నాచార మలరుచుండు. 13

తే. అత్తరుణి నన్ను నొక్కనాం దంతికమున, బ్రకృతిసౌందర్యరాశియై పరిఢవిల్లు
కొండకుం గొనిపోవ నాకును వెఱంగు, వొడముకైవడి మున్నాడినడువందొడంగె. 14

వ. అయ్యువతి నాతోడ నయ్యాయివిషయంబుల ముచ్చటించుచు నన్ను వేవేగ లాగుకొనిపోవు
చుండె - నడుమనడుమ నొక్కొక్కమాఱు నే నెద్దియో వక్కాణించుచుం గడ కొననియో
కాదనియో బళిరా యనియో లెస్స యనియో మెల్లన పల్కుచుంటి - నజ్జవ్వని విహంగివోలె
తివ్వనం జనుచుండ వెండియు నిలు సేరు టెప్పటికో యని నేను తిచ్చవడం దొడంగితి -

నిత్తెఱంగున మే మగ్గిరిశిఖరంబు నారోహించి కొంతతడ వందు నిలిచి యంత నవరోహింప సాగితి – మత్తరుణమునం దయ్యబలారత్న మున్నత పాదుకాధారిణియయ్యు ధనుర్విముక్త నారాచంబువోలెఁ గ్రిందికి వచ్చుచుండ నే నసువుల నఱచేత నిడికొని తల్లడంపడుచుంటి – నంతియకాక యాకన్నియ నాకంగారు నెచటఁ గన్గొనునో యను సిగ్గు నామొగంబున జిందులుద్రొక్కుచుండె – నయ్యవసరంబున **15**

తే. వెనుదిరిగి నన్నుఁగాంచియవ్వెలఁది నవ్వి, యిట్లుర మ్మట్లుదిగు భయంబేల యాఁత గొనుము వలసిన న న్నటం చనుడు నేను, దొప్పదోఁగితి నవమానతోయరాశి. **16**

తే. ఒక్కచో బందియాడి వేఱొకట దేఁకి, కొన్ని తావులఁ గూర్చుండి కొట్టకొనకు నెటులొ ధన్యోస్మి యనుకొంచు నిలకు జేర, నెంతయుం గ్రేణిచేసె నయ్యింతినన్ను. **17**

వ. ఎల్లయెడల నిట్లు తప్పించుకొనుట సాధ్యము కానేరదు–దయామయుఁ డగు నీశ్వరుఁడు నా యీవ్రణంబును మాన్పఁ దలంచె – నెట్లన **18**

సీ. ఆరోగ్యనిలయమై యలరు "బ్రైటన్"నామ, జనపదంబున కొక్కసారి వెడలి
యన్నవిక్రయశాలయందలిభక్ష్యముల్–, వయినంబు "ఫ్రెంచి"లో వ్రాసియుంట
నబ్బాస రాకయే నతిముతిపడుచుండఁ, దత్రత్యవృద్ధవితంతు వోర్తు
నాయవస్థ నెఱింగి ననుఁ గూర్మిమైఁ బల్కరించి నీ వేటి కీరీతిఁ గలఁత

ఆ. పడెద వనఁ బరాసుబాస రాదయ్యె నా,కేను శాకభోక్త నిందు భోజ్య
మెద్దియో యెఱుంగ కిబ్బంగి గగ్గోలు,పాలఁ బడితి నంచుఁ బలికినాఁడ. **19**

క. అంతట నయ్యమ వివరణ, మంతయు నీ కెఱుకపఱుతు నని భోజ్యపదా
ర్థాంతరము లెల్లఁ దెల్పుడు, సంతస మెసలార నపుడు సాపడినాఁడన్. **20**

ఆ. ఇటుల మాకు మొదటియెఱుక పొసంగె న,య్యదియ నేస్తమయ్యె నంత నంత;
నవల సీమనున్న యన్నాళ్లు, నవ్వెన్కనైనఁ దొలఁగ దయ్యె నల్లచెలిమి. **21**

క. మఱి లండనునం గల తన, యిరవునకుం గుర్తుసెప్పి యెడయక ప్రతిభా
స్కరవాసరమున విందున, కరుదెమ్మని నన్నుఁ గోరె నయ్యమ పేర్మిన్. **22**

వ. అదియునుంగాక పండువు లాదిగాఁగల వేడుకదినంబు లొదవునపుడును న న్నాతిథ్యమున కాహ్వానింపసాగె – నేను నందులకుఁ గృతజ్ఞతమై నియ్యకొని యయ్యయి దినంబుల వెడలుచుంటి – నంత **23**

ఆ. విందులందు నాదుమందాక్షమును బాఱఁ,ద్రోలనెంచి యవ్వధూటి మంచి
కన్నియలకు నన్నుఁ గాన్పించి వారితో, ముచ్చటించు వీలు నిచ్చె నాకు. **24**

తే. సరససల్లాపముల నిట్లు నెఱపుకొఱకుఁ, గలదు ప్రత్యేకముగ నొక్కకన్నె యచట
నాపదుచుతోడ నేను మాటాడువేళ, వెదలు మమ్ముఁ దొఱంగి యావృద్ధనారి. 25

ఆ. పలుకుపొం దెఱింగి భాషింపఁ జాలమిఁ, గేరడంబు లాడనేరకున్కి
వ్యంగ్యభరితవాక్యభంగు లే నెఱుఁగమి, నించదయ్యె నాకు నిద్ధి తొలుత. 26

క. ఆవల నవ్వెలఁదుక తగు, త్రోవలు సూపింపఁ దత్కుతూహల మంతన్
దైవాఱె నెల్లవేళల, భావం బూడాటె నాదివారముకొఱకున్. 27

వ. ఇట్టు లప్పదుచుతోడి ముచ్చటల కిచ్చవడి యవకాశంబు వచ్చినపు డెల్ల నచ్చెలియ చెంతకుఁ జొచ్చుట కుత్సహించితి – నత్తఱి నమ్ముదుసలి యక్కన్నెదెస నా కెంతయు నాసగొలుప నారంభించుదు మమ్ముసంధింప నియ్యమ్మకెద్దియో యభిలాష ముండునని తలఁచి శంకా సాగరమునఁ గ్రుంకులిడి "కట్టా! యెట్టిచెట్టవాటిల్లె – మొట్టమొదటన నావివాహగాథం దెలిపికొన్న నిట్టిసమావేశము నీపె సంఘటింప కుండుఁగదా! – గతమునకు వగచినం గల్గు మేలెయ్యది – యింకనైనం ద్వరపడి యీనేరము సవరించుకొంట కర్తవ్యము – నిక్కంబు నివేదించుటయ నా కెల్లభంగుల నిపుడులెస్స – యని తలంచి యాయమ్మ కిట్లు కమ్మ పంపికొంటి. 28

క. అంబరొ! బ్రైటనులో మన,కుం బరిచయ మొదవు టాది కొమరునివలె న
న్నుం బ్రేమించితి వెల్లవి,ధంబుల నను సంస్కరింపఁ దలపోసి తహో. 29

తే. నాకు నిపుదు వివాహం బొనర్ప మీర, లెంచినార లటంచు నూహించుచుంటి
మీకు మది నట్టిముచ్చట లేకయున్నఁ, బూని కూర్తురె పదుచులపొందు నిట్లు. 30

క. మీకరుణ కే నసర్హుఁడ, నా కెపుడో పెండ్లి జరిగినది కర్ణంబుల్
పాకము దప్పకమునుపే, యీకథ మీ కెఱుకసేఁత హితమౌను గదా! 31

క. నాకుం బెండిలి యగుటయ, కాక కుమారుండు నొకడు కల్గెను ముందే
మీ కివ్విషయము దెల్పుట, నాకృత్యము కాని మానినాఁడను దానిన్. 32

తే. ఇచట భారతవిద్యార్థు లెల్లఁ దమకుఁ, బెండ్లికాలే దని వచించువిధము నెఱిఁగి
కల్లలాడితి నేను నక్కరణిఁ దొల్లి, యిప్పు డయ్యది యెగ్గటం చెఱుకపడియె. 33

ఆ. ఇంతదాఁక మీకు నివ్వార్తఁ దెలుపమి, కేను మివులఁ జింత నెనయుచుంటి
నైన నేఁడు నిక్కమాడుధైర్యము నీశుఁ,డొసఁగెఁగాన వేడ్క నొందుచుంటి. 34

ఆ. నీతిబాహ్యమైన చేఁతల నయ్యింతి, చెంత నింతవఱకు జేసియెఱుఁగ
నిం దసత్య మించుకేనియు లేద మ,న్నింపరొక్కొ నన్ను నెయ్య మలర. 35

మం. ఈలేఖముం బఠియించిన వెనుక, నోతల్లి! నేను మీ రొసఁగువిందునకుఁ
బాత్రుఁడఁ గానంచు భావింతురేని, యయ్యది నే దోస మని నిర్ణయింప
నిన్నాళ్ళనుండి నాయెడ మీరు సూపు, మమత నక్కటికంబు మఱచిపోనేర
నేనాఁటికిని వానిఋణ మీఁగఁజాల, నన్నిఁక మీవిందునకును బాత్రునిగ
నెంచెదరేని యే నెల్లచందముల, నప్పాత్రతం గొనియాడి సౌఖ్యంబు
లెప్పటివలె నంది యెంతు నద్దాని, భవదమలప్రేమభావాంక మనుచు. 36

వ. ఈప్రాయసంబు నీరీతి సంతరింప నే నెన్నిగంటలు తంటాలు వడితినో చదువరు లెఱుంగు దురుగాక! - యీరచన ముగియులోపల నెన్నిచిత్తు లవతరించెనో వేఱ చెప్పనేల - కాని యీవక్కణతో నాభార మెల్ల దూరమయ్యె - నయ్యమ్మ దానిం గన్నవెంటన యిట్లు ప్రత్యుత్త రంబు నంపె. 37

ఆ. చాటుమాటు విడిచి సకలంబు విశదంబు, గాఁగ నీవు పంపు కమ్మవచ్చెఁ
బడుచు నేను దానిఁ బొడఁగాంచి కడుపుబ్బు, నటులు నవ్వుకొంటి మయ్య గాంధి! 38

తే. నీ వచించినబొంకు మన్నింప నర్హ, మిపుడు నిజమాడి తది యెంతయేని లెస్స
వెనుకటివిధాన నినుఁ బిల్తు విందుకొఱకు, రమ్ము రేపటిభానువారమ్ము విడక. 39

ఆ. ఎదురుసూచుచుందు మేము నీకొఱకు నీ, పెండ్లిసుద్దు లెల్ల వెల్లడించి
మాకు నిండువేడ్క చేకూర్పు; మనచెల్మి, చెడదు దీనఁ బెక్కునుడువు లేల. 40

వ. ఏ నిట్టిలేఖకు నెంతయు సంతసించి యథాపూర్వ మా నారీమణిగారవంబును జూఱలాడు చుంటి - మఱియు 41

తే. పూని బొం కనుపుంటి నిప్పోల్కి మూల,ముట్టుగాఁ గత్తిరించితి; నట్టువెనుక
నాదుపెండిలిసుద్ది నెన్నండు నిక్కమాడుటకు నేను వెన్కముం దాడియెఱుఁగ. 42



## 20 మతపరిచితి

సీ. ఆంగ్లదేశమ్మునయందు నావసియించు, కాలమునం బెండ్లిగానివార
లన్నదమ్ములును దివ్యజ్ఞానసామాజి,కులు నగువార లిర్గురు వయస్యు
లబ్బిరి నాకు; వా "రార్నాల్డు"పండితు, గీతానువాదంబుఁ బ్రీతి వెలయఁ
జదువుచుఁ దమతోడఁ గదిసి వేలుపునుడిన్, దనరుగీతఁ బఠింప నన్నుఁ బిలిచి
ఆ. రేను దల్లిబాసనేని దానిం జదు,వమికిఁ గరము లజ్జఁ బల్లటిల్లి
సంగడీంద్రతోడ సంకోచ మడర నా, విషయమెల్ల నపుడు వించినాఁడ. 1

వ. అంత జేజేలబాసం గల నాచొఱవ కొంచియమని యెఱింగియు నయ్యాంగ్లానువాదంబు మూలమున కెందెందు వేఱయ్యె నయ్యది కనుంగొనంగల బలిమికిఁ గొఱంత లే దని యూహించి యచ్చెలికాంౘ్ర కవ్విషయము నెఱుకపఱిచి వారితో భగవద్గీతం బఠియింపఁ దొడఁగితి - నందలి 2

ఆ. సంతతముగ విషయచింతన గావించు, పూరుషునకు వానఁ బొడము సంగ మంకురించుఁ గామ మాసంగమునఁ జేసి, యామతిల్లు నలుక కామమునను. 3

ఆ. అలుకవలన మోహ మగ్గలమైపొల్చు, మోహమునను మఱపు మోహరించు మఱపు హెచ్చి హెచ్చి మతి నడఁ గారించు, మతినశించు కతన మడియునరుఁడు. 4

వ. అను పద్యములు నాచిత్తంబునఁ బాదుకొనియెఁ - దన్నినదము నాౘ్రశవఃకుహరంబుల నింబుగా నేఁడును రవళించెడి - నిగ్గీత విలువ యిదరాని పొత్తమను నమ్మిక నాకు నానాఁటికిం బొంపిరివోవుచున్నయది - తత్త్వజ్ఞానమున దీనికిఁ దులయగు ౘ్రగంథము వేఱొకం దేవాఙ్మయమునందును లేదని నాకు దృఢవిశ్వాసము గలదు - నా చిత్తము కలఁగంబాఱినపుడెల్ల నియ్యది యెనలేని మే లొనరించె - దీనికి నింగిలీసు బాస నెన్నియను వాదంబులేర్పడె వానినెల్లఁ బఠియించితి - నం దార్నాల్డు రచితంబ మేలుబంతియని నా యాశయము - నే నీనెయ్యురతో నియ్యుపనిషత్తుం జదివినను దీనినపుడు బాగుగఁ బఠించితి నని పలుకనోపఁ - దదనంతరమునం గతిపయవత్సరములు చెల్లిన వెన్క నియ్యది నా దైనందినపారాయణమునం జేరె - వెండియు 5

తే. సిద్ధమతియైన యార్నాల్డు బుద్ధుఁ గూర్చి, యాసియాజ్యోతి యనుపేర ౘ్రవాసినట్టి ౘ్రగంథముం బఠియించితిఁ గాంక్ష వెలయఁ, గరము నలరించె నప్పుస్తకంబు నన్ను. 6

సీ. మఱియు నచ్చెలు లొక్కమాఱు నన్ను బిసెంటు,నకు నెఱింగించి రన్నాతిమిన్న యర్థించెఁ దనదుదివ్యజ్ఞానసంఘమునందుఁ ౘ్రబవేశింపు మనుచు నన్ను నామతం బెఱుఁగనినాఁ దన్యమతము నె,వ్విధిని బూనుదు నంచు వినయ మొసఁగఁ జెప్పి తిరస్కరించితి నామెకోరిక, నవలఁ దద్ధితవాణి ననుసరించి

తే. తన్మతౘ్రగంథమును ౘ్రశద్ధఁ దాల్చి చదివి,నాఁడ నద్దానఁ దనకు హైన్దవమతమ్ము తత్త్వముం ౘ్రబకటించుౘ్రగంథముల నెల్లఁ,జదువ నభిలాష ముదయించె హృదయమందు. 7

వ. వెండియు నప్పఠనమునంజేసి ౘ్రకైస్తవమతబోద్ధలు హిందూమతము ౘ్రగుడ్డినమ్మికలకుఁ బుట్టి నిల్లని తెగడునగడు నిరాధారమని యెఱింగితి - నదియుంగాక 8

సీ. ఆకాలమునయంద శాకాన్నశాలలో, నుత్తమౘ్రకైస్తవుఁ డొక్కరుండు పరిచితుఁడై నాకు నెఱింగించె నాత్మీయ, మతమహిమంబు ౘ్రపేమమ్ముగదుర నలరాజకోటయందలి ౘ్రకైస్తవమతౘ్రప,వర్తకు ల్పానుదుర్వర్తనంబు నతని కే వినిచితి నందుల కాతండు, తద్దయుసిగ్గిల్లి తల్లడిల్లి

ఆ. యేసు శాకభోక్త నెన్నఁడు మద్యంబు, ముట్టి యెఱుఁగ; మాంసమును భుజించి
కల్లు పెల్లు ద్రావుక్రైస్తవు లెందఱో, జగతిఁ గలరు దీన శంకలేదు. 9

వ. అయినను 10

మం. మద్యమాంసంబుల మరగుఁ దటంచు, నెందును శాసించి యెఱుఁగదు బైబి
లద్దానిఁ బరియింపుఁ దంతయున్మీకు, నవగతం బగు నన నగు నంటి నేను
బిదప నతండు బైబి లొసంగెనాకు, శ్రద్ధమై నద్దానిఁ జదువ సాగితిని
దానిభాగంబు ప్రాఁతనిబంధనమ్ము, పఠియించుతఱి శిరోబాధ న న్నేఁచెఁ
గ్రొత్తనిబంధనకుం జెందుభాగ, మానందవారాశియం దోలలార్చె
నద్దాన విలసిల్లు నద్రిప్రవచన, మెన యగు గీత కం చేఁ దలంచితిని
ధర్మేతరంబు నధర్మంబుచేత, నిర్మూలముఁగ జేయనేర వీ వెపుడుఁ
జెనఁటియై నీకుఁడిచెంపపై నెవ్వఁ,డేని గొట్టినఁ జూపు మెడమచెంపయును
బలిమిమై నెవఁడేని పై వల్వఁ గొనిన, నంతరీయముసైత మాతని కొసఁగు
మనెడుసూక్తులు నన్ను నలరించె మిగుల, “సలిలంబు నీకు నీఁజాలినవాని
కిష్టమృష్టాన్నంబు నిడుమా” యటంచుఁ, బలికిన శ్యామలభట్టాఖ్యసుకవి
తల్లజుపద్యంబు తలఁపునం బాఱెఁ, దాదృశంబగునట్టి త్యాగంబ జగతి
మంచిమతం బని మది నమ్మినాఁడ. 11

వ. అంత నీ వ్యాసక్తి న న్నితరమతస్థాపకులచరిత్రము లెఱుఁగం ద్వరపెట్టుడుఁ గార్లయిలు రచియించిన ‘వీరులు – వీరపూజ’ యనుగ్రంథముం జదువఁదొడఁగి యందలి మహమ్మదు జీవనకథం బఠించి యతనిగొప్పతనంబును మగతనంబును దబిసితనంబును దెలిసికొంటి – నంతలోఁ బరీక్షలు చేరువయగుటంజేసి తత్పరనము నాఁపవలసివచ్చెఁ – గాని సర్వ మతమర్మముల నెఱుంగవలయు నని నిర్ణయము గావించుకొంటి – నత్తరుణంబున నాస్తిక మతతత్త్వంబు నెఱుంగఁ గోరి తత్సంబంధిగ్రంథము నొకదానిం జదివితిఁ – గాని నే నప్పటిక నాస్తికతామరుదేశముం గడచియుంట నయ్యది నాకు నింపదయ్యె – నపుడ వసంతాదేవి నిరీశ్వరవాదంబు విడిచి సేశ్వరవాదంబు నవలంబించె – నప్పరిణామము సైతము నాస్తికతయెడ నా కనాసక్తి కలుగఁ దొడయ్యె – నింకను గొన్ని కారణములు సాయపడుటంజేసి నా కమ్మతంబుదెస నసూయ వొడమె. 12



# 21 దిక్కులేనివారికి దేవుఁడే దిక్కు

వ. ఆర్ష మతంబుతోడను మహమ్మదీయ క్రైస్తవా ద్యన్యమతంబులతోడను నా కించుక పరిచయ మున్నను సంకటసమయములం దయ్యది న న్నుద్ధరింపఁజాలదని నాకుఁ దెలియదయ్యె - నిక్కట్టు లొదవినపుడు తనకు దేన రక్షణము గల్గు దానిఁగూర్చి మనుజున కపు డెఱుక యుండనేరదు - నాస్తికుఁడు తనవిపత్తు తొలఁగుటకు నిసర్గమ మూలంబనుఁ - దన్ను భగవానుఁడు మనిచె ననియు నందులకుఁ దన తత్త్వజ్ఞానమును, దపస్సాధనయు నొక హేతు వని యాస్తికుఁడు భావించు - నిట్లెల్లరుం దమయిచ్ఛవచ్చిన ట్లూహింప నడ్డులేదు - మానవుం డెపుడు తనసాధనాబలంబున కహంకరించు నపుడ తద్బలంబు నిర్మూలం బగునని యెఱుంగవలయు - నిట్టివేళల యందు శాస్త్రజ్ఞానముకంటె ననుభూతి పరమావ శ్యకము - కేవలశాస్త్రజ్ఞానము నిరర్థకం బనువిషయముం దొలుత సీమలోఁదెలిసికొంటిఁ - దత్పూర్వము వాటిల్లిన యాపదలనుండి యే నెట్లు బయటఁ బడితినో చిన్నవాఁడ నగుట నాకెఱుకవడదయ్యె - నేఁడన్నచో వింశతివర్షమ్ములవాఁడ - గార్హస్థ్య సౌఖ్యముం జక్కఁగా ననుభవించితిఁ - బైపెచ్చు బిడ్డతండ్రిని సైత మైతి - నిట్లు నే నాంగ్లావని న్వసించు తుదివత్సరమ్మున 1

తే. పోర్ట్సుమతు నాఁ జెలంగెడి పురమునందు, జరిగె శాకాన్నభోక్తలసభ యొకండు
దానిఁ దిలకింప నొకనేస్తకానిఁ గూడి, యేను వెడలితి వేడ్క నాహ్వానమంది. 2

తే. కదలికరవాఁక యగుటచేఁ గర్ణధారు,లుండి రవ్వీటఁ బెక్కు; రందున్నవాలుఁ
గంట్లు పెక్కండ్రువెలయాండ్రుకారుగాని, యించుకేనియుఁ జక్కటినెంచఁబోరు. 3

తే. అట్టిచానలతో నిండినట్టియింట, నిలిచితిమి మేము వైనమ్ము తెలియకునికి;
రాత్రిభోజన మైనతర్వాత మొదలు,పెట్టితిమి నెయ్యురం గూడి పేకరంతు. 4

సీ. తమయింటియతిథిబృందముతోడఁ జెలులు పే,కాడునాచార మయ్యాంగ్లభూమిఁ
దనరు; నయ్యాటలోఁ దప్పులేని ఛలోక్తు, లెలమిమైఁ బల్కెద రెల్లవారు
మేమున్నగీమునచాన లీనడవడిఁ, బాటించి మాతోడ నాటనాడఁ
దొడఁగి రయ్యది రెండుగడియల సాగె న,ప్పుడఁతు లంతట నీతిబాహ్యమైన
ఆ. వేడుకలకు మొదలువెట్టిరి బీభత్స,రసము వెల్లివిరిసె రచ్చలోన
నందుఁ బాలుగొనియె నక్కట! నామిత్రుఁ,డెఱుఁగనైతి నాతఁ డిట్టిఁడనుచు. 5

ఆ. ఇచ్ఛవడితి నేను నీముచ్చటల కయో,ముదురసాగె సరసములు కరమ్ము
పేకముక్కలవలఁ బెట్టునవస్థయు, సిద్ధమయ్యె నేమి సెప్పువాఁడ. 6

వ. ఇంతలో భగవానుఁడు నాసంగడీనియంతరంగమునఁ జేరుటంజేసి యతఁడు న న్నిట్లనియె. 7

తే. బళిరె! యాఘోరకలికి నీపాపమునకు,నకట! నీవును బానిస వగుదువోటు
వలదు వల దిందు నీ వుండవలదు వలదు, లెమ్ము లేలెమ్ము పొమ్ము పోపొమ్ము వెలికి. 8

క. అనవుడు లజ్జాంబుధిలో, మునిఁగితి నప్పనుపు మస్తమునఁ దాల్చితి నా
తని మది మెచ్చితిఁ బదపడి, జననికడ న్నొదువుబాస జ్ఞప్తికి వచ్చెన్. 9

వ. పదంపడి 10

క. ఊఁదనిఁబాడితి గడగడ, లాడితి నానిల్పుసజ్జ కరిగితి మృగయా
పీడకుఁ దప్పినహరిణము, జాడ న్నాగుండె లదరె జడిగొనెఁ జెమటల్. 11

ఆ. నాఁటిరేయి నిదుర నను డాయదాయె నా,యాత్మఁ బెక్కుచింత లలముకొనియె
నిదియె నాకు లాఁతియింతులపట్ల వి,కార మొదవ మొదటిసారి యాయె. 12

ఆ. అంత నెంతచెట్ట యయ్యె దైవంబ! యి,ప్డేమరిల్లి యున్న నెట్టులగునొ
యని తలంచి యింకనైనఁ బరాకును, దలఁగవలయు నంచుఁ దలఁచినాఁడ. 13

తే. అవల నిది వాసయోగ్య మైనట్టితావు, కాదు కాదని యెంచి సంగాతిఁ దొఱఁగి
నాఁటివఱువాత లేచి పైనంబుగట్టి, వీడనాడినవాఁడ నప్పాదువీడు. 14

మం. భగవానుఁ దపుడు న న్బాలించె ననుచు, లెస్సగాఁ దెలియంగలేనైతిఁ గాని
సకలకష్టములందు సాఁకె న న్నతఁడ, యిప్పు దవ్విషయంబు నెఱిఁగికొన్నాఁడ
నీపరిజ్ఞానమం దింకను నాకు, సంపూర్ణ మగునట్టి చతురత లేద
యనుభూతిచేఁ గాక యన్యమార్గమున, వేద్యంబు గాని దవ్విషయ మెవ్వనికి
నాధ్యాత్మికక్రియలందుఁ బెక్కింట, నల న్యాయవాదికృత్యంబునయందు
నైకసంస్థల నిల్పి నడుపుకాలమున, రాజకీయాఖిలారంభంబులందు
నేచి న న్నొదివినయిక్కట్ల నెల్లఁ, దొలఁగంగఁ ద్రోలి నిస్తులదయ న్నన్ను
నేలినజగదీశు నేలీల మఱతు, వెరవులు సకలంబు విఫల మైనపుడు
తోడున్నవారెల్లఁ దొలఁగినయప్పు, డవకాశ మంతయు నడఁగారినప్పు
డెట్టులో చేకూరు నీశ్వరుసాయ, మే ననుభుక్తిచే నెఱిఁగితి దీని. 15

వ. మఱియు స్తుత్యుపాసనాప్రార్థనము లంధవిశ్వాసములుగా – వన్నపానాదుల కంటె నయ్యవి కడుంగడు సత్యంబు – లవియ నిక్కంబులు – శేషంబు లెల్లం గల్ల – లనుట స్వభావోక్తికి దూరం బనరా – దియ్యుపాసన నుడికారపు సొంపుగాదు – దీనికి నాధారము చిత్తముగాని జిహ్వగాదు–కాన మానసికమాలిన్యమును భక్తిరసముచేఁ గడిగివైచికొన్నవార లప్పరమాత్మను బ్రాపింపఁ గల – రమ్మాలిన్యమును నిర్మూలింప మనఃపూర్వక మగు నుపాసనకంటె సమర్థమగు సాధన మితరంబు మృగ్యంబ – యది కడుంగడు విధేయతతో నెనసియుంట యెంతయు నావశ్యకంబు. 16

# 22 నారాయణహేమచంద్రుఁడు

క. భారతమునుండి యత్తఱి, నారాయణహేమచంద్ర నాముఁడు సీమం
జేరె నతఁడు రచయితయై, పే రందినవాఁ డటంచు వినియున్నాఁడన్. 1

సీ. ఆకారమున వేసమందు వాగ్ధోరణి, నొకవికారపురీతి నొప్పు నాతఁ
డతనితోఁ బరిచయమయ్యె నా కొకచోటఁ, బిలిచితి నతని నానిలుచుబసకు
నింగ్లీషు బోధింపుమీ! యని యతఁడు న,న్నర్థింప నీకొంటి నందులకును
మొదలిడితిం బాఠములు సెప్ప; వ్యాకృతి,జ్ఞాన మాతని కించుకేని లేద

తే. "బాలుఁ"డను దానిఁ గ్రియ యంచుఁ బలుకుఁ "జదివె"నన్నది విశేష్య మనిచెప్పు నతని దిద్దఁ
దరముకాదయ్యెఁదనకు; వ్యాకరణమిట్లు, రామి కతఁడెన్నఁడును విచారమ్ముపడఁడు. 2

వ. అతం డొకమతి నన్నుఁ గాంచి "మిమ్ముంబలె నే నెన్నఁడుం బారశాల కేగనైతి – నాయభి
ప్రాయము వెల్లడించు తఱి శబ్దశాస్త్రముతోడియక్కఱ నా కెన్నఁడుం బొడకట్టదయ్యె –
హిందీ మరాటీ బంగాళీబాసలం దేను గృతాభ్యాసుఁడ – మహర్షి దేవేంద్రనాథఠాకూరు
వ్రాసిన వంగకృతుల ననువదించి ఘూర్జరసోదరుల కొసఁగితి – నింకను బెక్కు సద్గ్రంథముల
లాఁతిబాసలనుండి యనువదించి గుజ్జరాతివారికి సమర్పింప నాకుఁ దలంపు గలదు –
మూలమునందలి భావమును దెచ్చుట మాత్రము నాయనువాద లక్ష్యము – లక్షణశిక్షా
దూరుఁడనై యేనెఱింగినబాసయే నాకుఁ బదివేలు – ప్రకృత మాంగ్లేయభాషఁ జదువఁ
దొడఁగితిఁ – బదసముదాయంబునర్థముఁ దెలిసికొంటయ నాకుఁగర్తవ్యము – కాలక్రమం
బునఁ బరాసు శార్మణ్యము మున్నగు బాసలసైత మభ్యసించి యే నాయాయి దేశములం
జూడనెంచితి – ననవుడు నే నతనిఁ గాంచి 3

తే. అమెరికాఖండమునకు మీరరుగరొక్కొ,యనుడు సంశయమేల యే నవ్వినూత్న
విశ్వవైభవ సౌందర్యవీక్షణంబు, సేయ కేరీతి భారతక్షితికిఁ జనుదు. 4

క. విత్తవిచారము నాదగు, చిత్తమ్మున లేదు నాదుచెలికాండ్రురు నా
పొత్తంబులు నా కొసఁగెదు, విత్తంబే చాలు నాదు వెచ్చమ్మునకున్. 5

క. దంబములతోడుత న్నా,కుం బనిలే దేను బొట్టకుం బట్టకు న
ల్పంబుగ వెచ్చింతు వినో,దంబునకుం బోక దవ్వుదవ్వుల నుందున్. 6

తే. ఏను మూఁడగు తరగతిలోని పయన, మాచరించుచునుందు రే పమెరికాకుఁ
బోవుచో "డెక్కు" మీఁదన పోదుఁజుమ్మి, రిత్తవెచ్చమ్ము నేల భరింప వలయు? 7

వ. అని యతండు మాఱువల్కె – నిట్టి మేలినడత హేమచంద్రునిసొత్తై వెలయు – వెండియుఁ
దత్ప్రవర్తనంబున కుద్ధియగు నుల్లమును మిడిసిపాటులేమియు నతనికి సవరింపని

రవణంబులై హావణిల్లుఁ – గాని తన సామర్థ్యముఁ గూర్చి యతనికి మితి మీఱిన విశ్వాసం బొకటి కలదు – మే మనుదినంబును గూడుచుండువార – మతఁడును శాకాహారంబ భుజియించు – మా కుభయులకుం బెక్కు చేష్టల సామ్యంబు దనరు – నిర్వ్యరము స్వయం పాకులమ – యొకనాఁ డతఁడు నాకతిథి యగు – న మ్మఱునాఁ డే నతనికి విందనయ్యేడి వాఁడఁ – బ్రాయికముగా మేమొకతావునంద యారగించుచుండువార – మిట్లుండ నయ్యవసరంబున **8**

తే. కార్మికులదెస నెంతేని కరుణసూపు, సుకృతి "మానింగు" కీర్తి యస్తోక మగుచు
లందనుపురంబునం దెల్ల నిండుకొనుదు, హేమచంద్రుం డతనిఁ జూడ నిచ్చగించె. **9**

ఆ. అతనిసాహసంబు నరసి మిత్రమ! మేలి,తరము వాఁ డతం డుదారచరితుఁ
డతనిఁ గాంచ శక్యమగునోటు మనబోఁటి, యలఁతి యలఁతివాంద్ర కంటి నేను. **10**

వ. అనుటయు నతం డిట్లనియె. **11**

మం. ఏల సందియ మందె దిటు నేస్తకాఁడ, తప్పక యతని సందర్శింపవచ్చు
వినుము దానికిఁ దగువెర వెఱిఁగింతు, నే గ్రంధకర్తనై యొసఁగినయట్లు
నతనియౌదార్యంబు నతనిశీలంబు, నాలించి కడు ముద మందినయట్లుఁ
గనులార నాతనిఁ గాంచి కృతజ్ఞ,తను వెల్లడింపఁగాఁ దలఁచినయట్లు
నాంగ్లభాష నెఱుంగనట్టి హేతువున, నిను దుబాసిఁగఁ దేర నే నెంచినట్లు
నతనికి నాపేర నంపుమా కమ్మ,యనవుడు నే నట్ల యాచరించితిని
విడువక మీరు రా వేఁడుచున్నాఁడ, ననుచుఁ బ్రత్యుత్తరమంపె "మానింగు"
హేమచంద్రునియత్న మిట్లు ఫలింప, నొదవె నాశ్చర్యం బనూనమైనాకు. **12**

వ. అంత నొకనాఁడు మే మమ్మహాశయుం జూడ బయలుదేరితి–మత్తఱిఁ దగు పటాటోపమ్ముతో నేనుంటిఁ – గాని చెలికాఁడు యథాపూర్వము తనవికృత వేషంబుఁ దొలఁగింపదయ్యె – నందులకే నించుక గేలిసేయుదు **13**

క. దంబముల మెచ్చెదరు పా,ఱుంబోతులు మీరు సత్పురుష లెప్పుడుఁ జి
త్తంబును మెత్తురు గాని ము,దం బందరు వేసమునకుఁ దళుకుంబసకున్. **14**

వ. అని యతండు వల్కెఁ – బదంపడి మే మమ్మానింగుభవనంబు సేరి యతని దర్శించి వాని సమర్పించు సత్కారములం బడసినవెన్క హేమచంద్రుఁ డతని యథోచితము గౌరవించి యాయనదీవనలం బడసె – నంత మేము మా మనికి పట్టులకుం జేరితి – మిట్లుండ నొక్కనాఁడు **15**

క. అరచట్టం దొడి కొకిబికి, పరిధానమ్మును ధరించి బారెఁడుగడ్డం
బరుదుగ నెసంగ నాబస, కరుదెంచెను మద్వయస్యుఁ డాంగ్లము నేర్వన్. **16**

సీ. అది క్రొత్తబస యౌట నయ్యింటిమగువ త,త్పూర్వము హేమచంద్రుని మొగంబు
నెఱుఁగదట్లౌట నయ్యింతి కవాటంబు, విచ్చునంతన బిట్టు వెఱపు నంది
సంభ్రమంబున నాదుసరసకుఁ బేరెమ్ము, వాఱుచు వచ్చి యెవ్వండొ వెడఁగు
నీకొఱ కేతెంచి వాకిట నున్నవాఁ,డనవుడు నంగణమ్మునకు నేగి
ఆ. హేమచంద్రువేస మీక్షించి తద్దయు, నక్కజంబువడితి నతఁడు వెఱ్ఱి
నవ్వు నవ్వసాగె నామిత్రునకు సహ,జంబు లిట్టిలక్షణంబు లరయ. 17

వ. అయ్యవసరమునం దేను నెచ్చెలీ! నీ యీ వేషంబుగాంచి వీథిలోని బాలురు గోలసేయక మానిరో యనుడు నతండు 18

ఆ. గోల చేసినారు గుంపులుగుంపులై, పిఱుఁద నడిచినారు పిల్ల లెల్ల
వారిదెసకు దృష్టి సారింపనైతి నే,నంత వెనుకవెనుక కదుగు లిడిరి. 19

వ. అని వాక్రుచ్చె - నిట్లతఁడు లండనునగరమునం గొంతకాలముండి యవ్వలఁ బరాసు నాఁటికిం జని యాదేశమునందలి బాసనేర్చి యందలి గ్రంథములఁ గొన్నింటి ననువదించి పదవడి పూర్వోక్తప్రకారమున నమెరికా కేగి తనకు సాజం బగు వేసముతోఁ దిరుగాడఁ దొడంగుడు నది యాసీమ ననాగరకవేషం బగుట సంయుక్తరాష్ట్రములందు నిర్బంధితుఁ డై యెట్టకేలకు విముక్తుఁ డయ్యె. 20



## 23 గొప్ప సంత

క. పదునెన్మిదివందల తొం,బదియగు వత్సరము క్రైస్తవశకమ్మునయం
దొదవినతఱిఁ బ్యారిసులో,న దొడ్డవస్తుప్రదర్శన మొకటి జరిగెన్. 1

ఆ. ఏను దానిఁ జూడ నేగితి దృశ్యముల్, పెక్కు లచటఁ గంటి నక్కజముగఁ
గాని కేవలం బయోనిర్మితంబు గో,పురము నింతవట్టు మఱవ నైతి. 2

క. పొడుగువెడల్పులు దక్కన్, నుడువంగాఁ దగినయట్టి నూత్నత కానం
బడదయ్యె నందు; దానన్, దొడరెడుసంతృప్తి యెట్టిదో కననైతిన్. 3

వ. దానిం దెగడినవారు పల్వురు గల - రందుఁ డాల్స్టాయి ప్రధమగణ్యుం - డతఁ డిది మానవుని యెఱుంగమికి నంగమచ్చం బనియు ధూమపానంబున మతిపోయిన మానుసు లిట్టిబయలిమేడల నిర్మింతు రనియుఁ బల్కె - వెండియు 4

క. నాగరకతయును స్వేచ్ఛయు, భోగపరాయణతయున్ బ్రభూతమ్ముగ న
చ్చోఁ గలదు కాని కోవెల,లోఁ గా లిడినంత నాత్మలో మార్పొదవున్. 5

వ. "వర్జిన్‌మేరీ" విగ్రహము నెదుట మోఁకతిల్లి జోహారు లర్పించువారి దాసినతతి నెవ్వనికి భయభక్తు లుప్పతిల్లకుండు – మోఁకతించుటయు వేఁడికోలును గ్రుడ్డి నమ్మికలు గావని నాయాశయంబు – మఱియు నా భక్తులు మోఁకారించుట నిరర్ధకపాషాణమునకా? తదర్థ మైన భగవానునకు – వా రిట్టి విగ్రహారాధనమున భగవన్మహిమను గుంచక పెంచుచున్నా రనియ నాతలంపు. 6



## 24 పట్టా పుట్టినది – కాని పిమ్మట ?

తే. న్యాయశాస్త్రంబు చదువంగ నాంగ్లభూమి, కేను వెడలితిఁ గాని యద్దానిగుఱిచి
యింతకు న్మున్ను వివరించియెఱుఁగనైతిఁ, దదృణభారంబు నిచ్చోటం దలఁగువాఁడ. 1

వ. బారిస్టరు పరీక్షకుఁ జదువు విద్యార్థికి నియతకాలపరిపాలనము బరీక్ష లొసఁగుటయు నను రెండు కట్టడలు గల – విప్పరీక్షకుఁ జదువవలసిన కాలము మూఁడేఁడు – లయ్యది యీరాఱుపాళ్ళుగా విభక్తమై యుండు – నందలి ప్రతిభాగమునందును విందు లిర్వదినాల్గు ప్రవర్తిల్లు – నం దధమ మాఱువిందులకైనను బరీక్షార్థి యేగునేని యతఁడు నియతకాల పరిపాలన మొనరించినట్ల యెన్నంబడు – వెండియు 2

సీ. తొలుతొల్తనియ్యామెతలయందు గురుశిష్యు,లొండొరుల్ భాషించుచుండు తెఱఁగు
వ్యాఖ్యానము లొనర్చు నాచారమును బ్రవర్తిల్లుచునుండెఁ దత్క్రియలవలనఁ
జదువుగోరెడివారు చదురు లౌనని ప్రశం,సించుపోల్కి నుపన్యసించు వెరవు
గణుతికెక్కిన లౌకికజ్ఞానమును దగు, నాణియమ్ము గడించి రాణసెందు
ఆ. వార, లేఁ బఠించువడి కవెల్లఁ దొలంగె, గురుఁడు శిష్యు విడిచి కూరుచుండెఁ
దత్ప్రయోజనంబు దవ్వయ్యె నదవడి, యొండె సాగివచ్చుచుండెఁ జెడక. 3

వ. పూర్వాచారపరాయణ మగు నాంగ్లదేశమున కయ్యది సహజలక్షణంబ – మఱియు 4

క. పలలాహారముతోడన్, బలుదినుసులమధువుతోడఁ బ్రాయికముగ విం
దులు సాగు, నందు నాకుం, గలదుగదా! రొట్టెముక్క కాలము గడపన్. 5

క. ఇటు విందులు గుడుచుటచే, నెటు బారిస్టరుపదంబ నెనయుదురో యి
ప్పటికిం దెలియద నా; క,ప్పటియున్ దత్పట్ట మంద వలచినవారల్. 6

తే. చదువవలసిన పొత్తముల్ చాల సులువు,లగుట బారిస్టరునకు హాస్యంపుఁబేరు
రెక్కొనియెఁ "దిండిపోతుబారిస్ట"రంచు, నెల్లరకు వానికందువ తెల్లమయ్యె. 7

వ. మఱియుఁ బార్యములకంటెఁ బరీక్షావిధానము సులభంబు - కావుటంజేసి విద్యార్థులు
వర్షత్రయంబున మాసత్రయము శ్రమంపడినఁ గృతార్థు లయ్యెడివారు - కాని నే నిట్టి
నామమాత్రవిజయమునం దనివిసెందక పరనీయముల సవిశేషముగాఁ జదువనెంచితి -
నట్లు సేయమి వంచన యని నాయాశయంబు - నే నింతకు మున్ను లాటిను నేర్చియుంటిఁ
- గాన "రోమన్" న్యాయశాస్త్రము నబ్బాసన చదివితి - నది యాఫ్రికా కేగినతఱి నా
కెంతయుం దోడుపడియె - నిట్లుశ్రమించి పరీక్షలో గెలుపొందితి - నంత 8

తే. కాశ్యపీ ధాతృ వసు నిశాకాంతసంఖ్యఁ, గ్రైస్తవశకాబ్దము వెలుంగుకాలమందు
షష్ఠమాసంపు దశమవాసరమునందు, బిరుదపట్టంబు నాకు లభించు టాయె. 9

వ. కాని యింతకష్టించినను న్యాయస్థానమునందు నోరువిప్పఁజాల నను నుత్తలపాటు
నాచిత్తమున హత్తుకొనె - నయ్యవస్థ వివరింప వేఱొం దధ్యాయము వలయు. 10



## 25 నా బెంగ

క. బారిస్టరుపట్టము చే,కూరుట సుకరంబ కాని కోర్టులలోనన్
బారిస్టరుగా రాజిలు,టారయ నెల్లరకు సాధ్య మయ్యెడి పనియా. 1

ఆ. మొదటినుండి తుట్టతుదిదాఁక నే ధర్మ,శాస్త్రసూత్రకోటి చదివినాఁడఁ
గాని రచ్చలందుఁ గమనీయఫక్కి వా,దించునట్టి వెరవు గాంచనైతి. 2

వ. లాఁతివారికి నొప్పమి రాకుండునట్లు నీవస్తువు నుపయోగించుకొ మ్మనునది యొక ధర్మ
వచనం - బిది తనవ్యాజ్యేగానికి లాభించుట కెట్లుపయోగింపవలయునో నాకెఱుకవడదాయె
- నేతత్సిద్ధాంతమునకుఁ జెందిన వివాదములఁ బఠించితిఁ - గాని యీ సూక్తి యుపయో
గించునను నమ్మిక నయ్యవి హత్తింపఁజాలవయ్యె - మఱియు 3

సీ. చదువనైతిని న్యాయశాస్త్రంబు భారత,దేశసంబంధిని లేశమైన
మనవిపత్రంబు నెమ్మయి సంతరింపంగ, వలయు నవ్వెర వింత తెలియనైతి
నడివాఁక సుడినీటఁ బడి తల్లడంపడు క్రైవడి నుంటి నక్కాలమందు
వింటిఁ గోర్టులలోని వీరవిహారంబు, సలుపుచుండు ఫిరోజిషా యటంచు
ఆ. నాంగ్లభూమి నెట్టు లతఁ డిట్టినేర్పు నా,ర్జించె నొక్కొయని విచిత్ర మంది
యతనిపగ్గె నాకు నబ్బ దీపుట్టువం, దిది యధార్థ మంచు నెంచికొంటి. 4

క. ఆపిదప న్యాయవాది, వ్యాపారము పొట్టకూటి నైనను నాకున్
జేపఱుపంగలదాయను, ద్వాపర మెసరేఁగి నన్ను దందడివెట్టెన్. 5

క. ఈసందియములు న్యాయా,భ్యాసం బొనరించుకాలమందే నను బల్
గాసిల్లఁజేయఁ దెల్పితి, నాసంగడికాంధ్ర కీమనస్తాపంబున్. 6

తే. అంత నాచింత నెఱిఁగి మేలరసి మిత్ర, మొక్కరుండు "దాదాభాయియొద్ద కేగి
యతనిహితబోధనము నందు మమ్మహాత్ముఁ,దాదరించును విద్యార్థి"నని వచించె. 7

సీ. ఆంగ్ల దేశమ్మున కరుగుకాలమ్మున నౌరోజిమహనీయునకు నొకండు
పరిచయలేఖ సంపాదించికొనిపోయి,తి నటంచుఁ దొలుతన తెల్పినాఁడ
నాకమ్మఁ బెక్కునా ళ్లైనపిమ్మట వెల్వ,రించితిఁ బురుషవరేణ్యు నతనిఁ
గనుఁగొన నెంతవాఁడను నేను? విద్యార్థి,జనులకష్టమ్ముల సౌఖ్యములను
ఆ. దెలియ సంఘమొండు నిలిపె నతండు త,త్సభల కెల్ల నేను జనుచునుందు
మఱియు నమ్మహాత్ముమాటాడురచ్చల, కరిగి సమ్మదంబు నందువాఁడ. 8

సీ. ఇటు లుండ నొక్కనాఁ డెట్టెటులో సాహ,సించి యమ్మేటి దర్శించి కాని
పించితి నక్కమ్మ; నంచితచరితుఁ డౌ, నౌరోజి పదపడి నన్ను మిగుల
నాదరించి మదీయ మగునుపదేశంబు, నావశ్యకం బగునప్పుడెల్ల
వచ్చి నీవు గ్రహింపవచ్చు నటంచు భా,షించెఁ బ్రేమరసంబు చిప్పిలంగ
ఆ. నట్టులయ్యుఁ దగినయక్కఱ లేనప్పు,డమ్మహాత్మునకు శ్రమమ్ము నొసఁగు
టనుచితమ్ము గాన నయ్యవకాశంబు, వలని లగ్గువడయ వలవనైతి. 9

తే. కావుటంజేసి నాచెల్మికాఁడు నీదు, చింత లన్నింటి నౌరోజిచెంత విన్న
వించుకొ మ్మన్నహితము నవ్వేళయందు, నియ్యకొనుటకు నేఁ దెగియింపనైతి. 10

వ. అంత నొకానొక నెయ్యునిహితవు ననుసరించి సుప్రసిద్ధాంగ్లేయన్యాయవాది యగు "ఫ్రెడరిక్ పిన్‌కటు" సన్నిధికింజని నాసందియములనెల్ల నతనితోడ విన్నవించితి – నయ్యుదార చరితుఁడు నన్నుఁ దననెచ్చెలింబోలె గారవించి 11

సీ. జగమునందు ఫిరోజిషా బదురుద్దీను, లను బోలుప్రతిభావిలాసు లెంద
ఱుందురు? తల్లడ మందకు సాధార, ణన్యాయవాదియై నడుచుపొంటె
నక్కఱలేదుసు మ్మెక్కుడునేర్పు;సా,మాన్యమైనట్టి ప్రామాణికతయు
నాసక్తియును జాలు నద్దాన విత్తంబు, గడియింపవచ్చుఁ బుష్కలముగాఁగఁ
తే. దగవు లన్నియుఁ జిక్కులం దగిలియుండఁ, బోవు పరనీయపుస్తకంబులను గాక
వింతపొత్తంబులను జదివితివె? వాని, పేరు లెట్టివియో వినిపింపవయ్య. 12

ఆ. అనుడు నాపరించు నలంతిపొత్తమ్ముల, నెఱుక చేసినంత నించుకంత
చప్పరించి మగుడ జాలిమై నాతఁడి,ట్లనియె మందమధురహాస మొలయ. 13

తే. తెల్లమయ్యెను నాకు నీ యుల్లమెల్ల, ననదుసూ! లౌకికజ్ఞాన మరయ నీకు
నదియపో! న్యాయవాదివై బ్రదుకనెంచు, నాతనికి జీవగఱ్ఱయై యలరుచుండు. **14**

సీ. ఔర! భారతదేశచారిత్ర మైన నీ, వెఱుఁగ వైతివి కదా యింతవట్టుఁ
దచ్చరిత్రము భారతమునఁ బుట్టినవాని, కరయ నవశ్యపార్యంబుగాదె
మొనమొన్న నీదేశమునఁ బ్రవర్తిల్లిన, సైనికవిప్లవచరితసైత
మయ్యరే! పరియింపవైతివి మఱి న్యాయ,వాది మర్త్యస్వభావ మ్మెఱుంగ
ఆ. వలయు మొగమువంక తిలకించి నరుఁ దెట్టి,వాఁడొ గుఱుతుపట్టవలయు నట్టి
మార్గమెల్ల నెఱుఁగ మౌఖికసాముద్రి,కమ్ముఁ జదువు టవసరమ్ము సుమ్ము. **15**

వ. అని యతఁడు నా కవశ్యపఠనీయములగు గ్రంథములపేళ్ళను వానిలభించు తావుల వ్రాసి యిచ్చి నన్ను వీడికొలిపె - నమ్మహనీయుని సల్పినమే లెన్నఁడు న్మఱవఁజాల - నతని ముందు నాసంక్షోభము పంచబంగాళ మయ్యెఁ - గానియదుగుఁ గదలించినంతన సాక్షాత్క రించె - నంతనిలుసేరి మఱునాఁడ సాముద్రిక గ్రంథముల న్వెలిచి చదివితిఁ - గాని నా కవి దురవగాహంబులయ్యె - నివ్విధంబున **16**

క. అల"పిన్కటు"హితవచనం,బులు నాకున్ ఫలము నీకపోయినను విని
ర్మలమై విలసిలు నాతని, చెలిమి కడుంగడు శుభంబు చేకుఱఁజేసెన్. **17**

క. మంచివకీలై ధన మా,ర్జించుటకు ఫిరోజిషాగరీయోమేధా
భ్యంచత్కౌశల మేటి క,టంచు నసామాన్యశక్తి యది యేలంచున్. **18**

తే. మఱియు సాధారణంపుఁబ్రామాణికతయు, నొడలు వంచి పనుల్‌దిద్దు నదవదికయు
న్యాయవాది కుండినఁ జాలు నని యతండు, వలుకుహితమందు నాకు విశ్వాసమొదవె. **19**

క. ఈలక్షణముల రెంటం, బాలుండినవాఁడ నగుటఁ బాదుకొనియె నా
శాలత మన్మానసమునఁ, దూలెను నాబెంగ దూరదూరమ్మునకున్. **20**

వ. ఇట్లుండునంత నాకు బిరుదబట్టము లభించె - నది ప్రాప్తించిన మఱునాఁడ బారిస్టరుల పట్టికలో నాపేరు చేర్పించుకొని తదనంతరదినమ్మున **21**

తే. చెలులవీడ్కోలు గైకొని సీమ విడిచి, యమ్మనాఁడికకుం బయనమ్ముగట్టి
యెలమి తొలఁకాడఁ బొగయోడనెక్కి వరుస, దాయవచ్చితి నేను బొంబాయిరేవు. **22**

క. రంగత్తుంగాభంగత,రంగాళిఁ జెలంగుచుండె రత్నాకరము
ప్పొంగుచు నే నావిరిపడ, వం గట్టెక్కితిని మిత్రవర్గము మెచ్చన్. **23**



# ఆత్మకథ

## ద్వితీయ భాగము

## 1 రాజచంద్రకవి

గీ. అర్ణవం బల్లకల్లోల మగుచునుంట, నాప్రయాణంబుసల్పిన నావలోని
మంది సకలంబు నలసటచెందెఁ గాని, యుబ్బుచున్నాఁడ నే నెట్టిదెబ్బ దినక. 1

గీ. అత్తఱిన్ గాలివాన పర్వెత్తుచుండ, నౌకపై నిల్వఁబడి దానిపోకలెల్లఁ
జూచుచు నఖండసంతోషవీచికా ప,రంపరల నూఁగుచుంటి ధైర్యంపుబలిమి. 2

వ. ఇది యిట్లుండ 3

సీ. ఆచారదాస్యమం దాఱితేఱిన కుల,వృద్ధులు నన్ బహివెట్టి యెట్టి
తీఱుము ల్గూర్తురో నేరుపులేనియే, నెట్లు రచ్చలలో జయించి జగతి
రాణింతునో సంస్కరణవాంఛితం బస్మ,దీయ మేరీతి సిద్ధించునో య
టన్నతలంపు లైక్యమునంది నాయంత,రంగమం దొక్కఝంఝానిలంబు
ఆ. నపుడ రేఁపెఁ గాని యదియును నాగుండె,నిబ్బరంబుఁ జెఱుపనేరదయ్యె
నంతలోనవచ్చె నగ్రజుఁ డోడరే,వునకు నన్నుఁ గలిసికొనుటపొంటె. 4

ఆ. మేటివెజ్జు సుకృతి మెహతాబలాత్కృతి,నతని కేము విందులైతి మపుడు
మున్ను సీమలోన మొలచినమాచెల్మి,తీవ మొగ్గదొడిగి తేజుసూపె. 5

ఆ. అమ్మ నెపుడుచూతునా యన్నయుబలాట,ముల్లమందు ముదురుచుండెఁ గాని
మేనిఁదొఱఁగె నాపె యే నాంగ్లదేశమ్ము, విడువకున్ననాఁడె విధివశాన. 6

క. ఉగ్రమగు నియ్యుదంతము,నగ్రజుఁ డే నోడదిగినయంతన వినిచెన్
శుగ్రేఖ లలమ ధర్మ,వ్యగ్రుఁడనై శౌచవిధుల నపుడు నెఱపితిన్. 7

క. ఈవార్త సీమ కంపిన,బావురుమని యేడ్చియేడ్చి పరభూముల నెం
తో వేదన గుడిచెద నని,భావించుట నన్న నేఁడు బాహిరపట్టెన్. 8

తే. తండ్రిచావుఁగన్న తరుణంబునందు నా,పడిననొవ్వుకంటె బెడిదమయ్యెఁ
దల్లిచావు విన్నతఱి నన్నుఁ గలఁచిన,వంత; యేల దానివర్ణనంబు. 9

ఉ. అమ్మనుజూచి పొంగి వినయమ్మునఁ గేలుమొగిడ్చి తల్లిరో!
నమ్ముము నా ప్రమాణములు నాఁటివి తప్పక యెన్నిబన్నముల్
పమ్మిననోర్చినాఁడ నని పల్కుట కువ్విళులూరి నా యభా
గ్యమ్మున నాసలెల్ల నడియాసలయ్యె చన వెచ్చనూర్చితిన్. 10

శా. నాకుం జిన్నటఁగోలె ముద్దుమెయి నానాధర్మముల్ నిర్మల
శ్లోకుల్ పోయినపోకడ ల్గఱపి నాలో నింతయాస్తిక్యమున్
రేకెత్తించినసాధుశీల జనయిత్రిం గొల్చి పాపాగ్ని కీ
లాకుల్యల్ తెగటార్పనైతి విధి యేలామాఱు నం చేడ్చితిన్. 11

గీ. నన్నుఁ గనినంతఁ బొడవుగైకొన్నకూర్మి,వోలె నెదురయి బిగ్గఁ గవుంగిలించి
జనని మన్మస్తవీథి మూర్కొనఁ గరంగి,సొగయనైతి నటంచుఁ బెన్వగలఁ బడితి. 12

క. అడ లెంతపాటకరించిన, గడిదాఁటఁగనీక బాష్పకణములసోనం
దడియక జీవన్మాతృకు, వదువున గంభీరభావవత్త మెఱసితిన్. 13

వ. నా కపుడు మెహతా పెక్కంద్రుమేటిమానుసులతో నెఱుకగల్గించె – నం దతని సైదోడగు
రేవాశంకరజగజ్జీవనుతో నేర్పడిననెయ్యంబు కొలఁదులువెట్టరాని – దతనిపెద్దన్న కల్లువాఁ
డగు రాజచంద్రకవితోడిపరిచితి నాకొదవుట యెన్నఁదగిన విషయం – బతండు లేజవ్వ
నమ్మునం దుండియు సుశీలుండని సుధీమణియని ముంజూపునంద నాకుఁ దోఁచె –
వెండియు 14

చ. అతఁడు శతావధానమున నాఱియుఁదేఱినప్రోఢ, ధారణా
చతురతయందు నాతనికి సాటి యతండ;తదీయధీసమ
గ్రతఁగన దంతముల్పులిసెఁ గాని కవీంద్రు నపారశాస్త్రపాం
డితికిఁ బవిత్రవర్తనపటిష్ఠత కాత్మవిచారదీక్షకున్. 15

గీ. కదు వలపుగొంటి నధ్యాత్మగౌరవంబు, వదయుటక వెచ్చపెట్టె జీవన మతండు
నగలబేహార మొకవంక నడుపుకొంచు, నమ్మహామహుఁడొకవంక హరి భజించు. 16

గీ. ఆటపాటల బాసట యగువిధానఁ, గమలనాభుని వీక్షింపఁ గంటివేని
దెగును భవబంధ మన్నగీతిని దలంచు, రేవగళ్లు ముక్తానందకృతి నతండు. 17

సీ. రతనాలముత్యాలరాసు లమ్ముచునున్న, నతని చిత్తము విష్ణునంద లెస్స
తవిలివర్తించు; నాదాయవ్యయమ్ముల, పుస్తకంబులతోడిపొత్తు విడువ
కాతనిమ్రోల వేదాంతవిద్యామర్మ, మెఱిఁగించుపొ త్త మేదే నొకండు
తేజరిల్లుఁ; దదీయదినచర్యయును దాని,విదద; బేరంపుసందడికిఁ దప్పి

గీ. నంత నీరెంట నొకదాని నాదరించు, నతనివెలిపుచ్చు నుత్తమకృతుల కెల్లఁ
దల్లియై వానిదినచర్య తనరు; బేర,గాఁడె యాతఁడు కేవలజ్ఞాని గాక. 18

మం. కొనువారితో నమ్ముకొనువారితోడఁ, దగఁ బల్కి వారలఁ దరలించినంత
నతఁ దౌపనిషదరహస్యముల్ తఱచి, నిత్యవృత్తమ్ములోనికిఁ జేర్చుచుండు;
నమలాత్ముఁ డితఁడు బేహారమ్మునడుమ, హరిచింత మున్గి దేహమ్మును మఱచి
నైకవారమ్ములు నాకంటఁ బడియెఁ; దనభంగి నెల్లభూతములఁ బాటించు
టేనాఁడు మఱవఁ డీ యిద్ధశీలుండు, నాతోడ వీనికి నలుసంతయేని
నక్కఱలేకున్న నతివేలమైన,పరిచితి నాకు నేర్పడె వీనితోడ
నితనియంగడికి నే నేగినవేళఁ, దత్త్వసంవాదంబు తప్ప వేఱొండు
మాటపుట్టదుగదా మానాల్కవలన, నాత్మవిచారమం దపు డెన్నఁదగిన
యనురక్తి లేనినా కతనివాక్రుచ్చు, పలుకె యంత్రంబాయెఁ; బదపడి యేను
బహుమతాచార్యప్రవచనముల్ వింటి, వెదకితి దేశికున్ వేఱుగా నొకని
రాజచంద్రున కుద్దిరాఁ జాలినట్టి, యుపదేష్ట కన్పింపఁ డొకఁడేని నాకు
హృదయమ్మునకుఁ దాఁకె నితనిబోధనము, లితనిమనీషయం దెచ్చె గౌరవము
ప్రామాణికుండుగా భావింతు నితనిఁ, బెదదారిలో నన్నుఁ బెట్టఁ డీతండు
హృదయపుంబాదులో నిమిడియున్నట్టి, భావము ల్నాకు నై ప్రకటించు నీతఁ
డీశ్వరతత్త్వంబు నెఱిఁగి యెఱుంగ, కల్లాడుపట్ల నా కాలంబ మితఁడ. 19

క. అతఁ డింతగొప్పవాఁ డని, మతి నమ్మితిఁగాని వాని మద్గురుఁగా హృ
చ్ఛతపత్రపీఠియం దు,ద్గతభక్తి న్నిలిపి కొల్వఁ దలకొననైతిన్. 20

క. ఆగద్దియ నీనాఁటికి, నేగురుఁడే నాక్రమించియెఱుఁగడ యిపుడున్
నాగురునికై గవేషణ, సాగించుచు నున్నవాఁడ శ్రద్ధాళువనై. 21

సీ. ఆచార్యుఁడే దైవమని మనధర్మంబు, గురున కొసంగిన గఱువతనము
నీకొండు; నొజ్జయే లేకున్న మఱుఁ గెఱుం, గుట కల్ల యనెడుపల్కును యథార్థ;
మక్కరంబులు నేర్పునతనికిఁ జదురెంత, లోపించినను బెద్దలోటువొడమ
నేరదు; బ్రహ్మవిద్యారహస్యము దెల్పు, నాచార్యుఁ దలఁతివాఁ డైననాఁడు
గీ. బండిదొర్లదు; జ్ఞానసంపత్ ప్రపూర్ణుఁ, డెవ్వఁ డాతండ గురుపదం బేలనర్హుఁ
డెఱుకవడచుటకై నరుఁ డెల్లనాఁడు, నుద్యమించుట తమకించు టుచితవృత్తి. 22

గీ. దొరకు శిష్యునకుం దగ్గగురుఁడు జగతి, నర్హతకొలంది యత్నంబు నాచరింపఁ
జెల్లుబడి యున్నవారపో యెల్లవారు, సిద్ధి దైవవశం బందు రిద్ధమతులు. 23

వ. ఇట్లు నేను రాజచంద్రుని మదీయహృదయరాజ్యంబున కొదయనిఁ గావించుకొన నైతిఁ - గాని యమ్మహామహుండు బహువారమ్ము లితికర్తవ్యతాజడునకు నాకుఁ దెరువుసూపి తద్దయుం దోడయ్యె - నితం దైంద్రియకసంబంధమునను రస్కిన్ టాల్‌స్టాయులు తమ రచనల చేతను నాయుల్లంబు కొల్లగొని నానడవడికిం దమ యడియాలంబు లుగ్గదువుగాఁ బ్రబ్బున ట్లొనరించి - రక్కఱపొసఁగినపట్ల వీరిం గొనియాడువాఁడ. 24



## 2 జీవయాత్ర

మం.బొంబాయి నిటు కొన్నిప్రొద్దులువుచ్చి,యస్మదీయము కాణయాచికి రాజ
కోటకు సవరించుకొంటిఁ బైనంబు,నాసీమపోక నిందాపాత్ర మనుచు
నానాఁడు రేఁగినయట్టి పెన్గోల,మాజాతి నింకను మడఁగిపోకుంట
నను నాసికకుఁ జేర్చి నాపెద్దయన్న,గౌతమీనదిని మత్కాయమ్ము దోఁచి
యవల నింటికి నేగి యన్వయప్రజకు,నుడుగరవోనివిం దొకఁ దేర్పరించె. 1

సీ. సంస్క్రియావాదులౌ జను లర్థిమై వచ్చి, విందారగించి దీవెనలొసంగి
ననుగారవించి మన్ననచేసిరి; సనాత, నాచారనిరతు లైనట్టివార
లడుగుఁబెట్టర; యిట్టియామెతలకుఁ బాచి,తమ్ముల కీయకో ల్తనకు నావ
యం తేని లేద; యిట్లయ్యు నగ్రజుదెస,నాకున్నభ క్తి యస్తోక మగుట
గీ. నతనిమాటను జవదాఁట కదియపరమ, మంత్రమనియెంచియమ్మహామహుఁడు పనిచి
నట్టెసల్పితి; నన్ వెలిపెట్టువారి, కరుణ కేనాఁడు జతనంబు నెఱపనైతి 2

క. వెలి నిట్లు సడ్డసేయక, వెలివై చినవారిఁ బగఱవిధిఁ జూడక వా
రలు నన్నెంతగ రోసిన, గలఁగక వినయంబ వారికడను మెఱసితిన్. 3

గీ. ఈబహిష్కారకరవాల మిట్టులుంట, నోగిరము కాదు నాకు నీరొసఁగుటకును
గుండెలేదయ్యె నాబందుగులకు; వారి,యింటికిం బోవుటయ మానుకొంటి నేను. 4

క. వారు పరోక్షమ్మున మముఁ,జేరుటకై యియ్యకోలుసేయుచు నున్నన్
గోరికపుట్టద నా కీ,ప్రారంభములందు దొంగబ్రతుకే లనుచున్. 5

గీ. జాగరూకతమై నిట్లు సంచరించు,నన్ను బాధింపమియ కాక యెన్నరాని
కూర్మినించిరి నాదెస న్గులమువారు,పట్టుమై మున్ను బహివెట్టినట్టివారు. 6

క. నాయుద్యమమ్ములకుఁ దగు,సాయమ్మును జల్పి; రీరసమ్మున వీరిం
ద్రోయుచు నొడ్డారించిన, నాయెడ నీలగ్గు పొసఁగునా యని తలఁతున్. 7

ఆ. వెలికిజంకి దాని వెలలింప సంస్కృతి, మెచ్చువారినెల్ల రెచ్చఁగొట్టి
పిచ్చిపనులుసేయఁ జొచ్చిన నను వీర,లెద్రిచి యెంతవట్టు పద్రుచువారొ. 8

వ. వెండియు నౌకావతరణంబుసేయుటయ తడవుగా నిర్విచారంబుమై మాతృదేశమ్మునఁ గ్రొద్దులుపుచ్చుటకుమా ఱీయల్లకల్లోలజీవనంబునగ్రుంగువడి యపేత ధర్ముండనై పెక్కు లూలామాలపు వేసమ్ములం గొనియాడి నాఁడిక వారి యాడికకుం గుదురై యుండు వాఁడ-నయ్యది యుట్లుండె. 9

క. ఇందనుక నాదుముచ్చట,కుం దగుదాంపత్యసుఖము కుదురద;నిరతం
బుం దవిలి నెరసు లరసెడి,చందం బది నన్ను విడువఁజాలద యింకన్. 10

క. దోషైకదృష్టినై యే,నీషత్సుఖ మనుభవించియెఱుఁగనపుడె నా
యోషిత సమస్తవిద్యా,భూషిత కావలయు నన్నబుద్ధి జనించెన్. 11

మం. జనియించినంతన సంబరం బేమి,వలపుమైకపుసుదుల్ వలగొన్నమగఁడు
పడఁతి కేచందానఁ బారము ల్గఱపు,నువిద కేమియు మప్పకున్న నేమాయెఁ
గటకటా జ్ఞానమ్ము కాసంతలేక,కస్తూరి కెన్నియో కడగండ్లనిడితి
నిష్కారణంబైన నేరమ్ముమోపి,యింతిని గన్నారియింటి కంపితిని
గొఱలేనియంగద ల్గుడిచినవెన్క,నాదోస మెఱిఁగి కాంతను దెచ్చుకొంటిఁ
దప్పు నావంతాయె దానికిఁ దగిన,శిక్షకుంబాలౌట చెలువ వంతాయె. 12

క. పదపడి మాబుదుతలకుం,జదువులలో సాములందుఁ జతురతగూర్పన్
మొదలిడి చరితార్థుఁడనై,పదురుం గొనియాటసేయు పంతులనైతిన్. 13

క. పసిబిడ్డలతో నెయ్యము,పసివారలతోడి యాటపాటలు నిత్య
వ్యసనంబులగుచు నాకొక,రసరాజ్యరమా ధురంధరత్వము గూర్చున్. 14

గీ. సీమ నెడబాసి యే నిల్లుచేరినంత, దొరలసదనంబునట్లు మాయిరవు పరిధ
విల్లు టుచితం బటంచు భావించి వలయు,చెలువమిదు వస్తుకోటి నార్జించె గురుఁడు. 15

క. తరతరముల చిఱుదిండులు,మరగితిఁ దేనీరు తద్ద మచ్చికవడితిన్
బరిపరిదుస్తులకుం దిగి దొరలన్ మఱపించి మురియఁదొడఁగితి మివులన్ 16

గీ. గడియగడియకు నూత్నోపకరణరాశి,వచ్చిపడుచుండె నింటి కవ్వారిగాఁగ
మొగలివాకిటఁ జౌదంతి నెగడెఁగాని,వచ్చుబడికంటె వెచ్చంబు హెచ్చిపోయె. 17

ఆ. ఉన్నతాధికార ముత్తమకీర్తి య,నంతవిత్త మే గడింతునంచు
నగ్రజుండు నమ్మి యాసలుపెంచి గే,హవ్యయమ్ము లిట్టు లదరఁజేసె. 18

చ. పరుఁ దెదిచేసినంత నిజభావము దావశిఖల్ వెలార్చుఁదా
నొరుదెస దానిఁజేయమి సముజ్జ్వలధర్మ మటన్నసూక్తి త
చరితకు జీవమౌట జనసంతతి నాతని కెంద తెందఱో
పరిచితు లున్నవారు మృదుభావులు విత్తవదగ్రగణ్యులున్ 19

ఆ. ఎల్లయెడలనున్న యీనెచ్చెలులసహ,కార మూఁది యచిరకాలమంద
యతఁడు వలసినన్నియభియోగము ల్గడి,యించి నాకొసంగ నెంచినాఁడు. 20

క. నా న్యాయవాదివృత్తి య,నన్యప్రాప్తముగ నడుచుననునమ్మిక న
మ్మాన్యుఁడు వెచ్చంబు నసా,మాన్యంబుగఁ బెంచె జంకుమాలినమదితోన్. 21

వ. అతండు నావృత్తివికాసమ్మునకు మున్ముందువలయు సన్నాహము లెన్నిగల వన్నియుఁ గావింపఁదొడంగెఁ గాని రాజకోటంబోని చిటిపొటివీట బల్లగట్టుటయన్న నాకు హాస్యాస్పదంబుగాఁ దోఁచె-నాబింక మిట్లున్నను దగవాదువానికి వలయు తెలివితేటలు నాకు దవ్వుదవ్వులన యుండె-నేఁడి యెట్లున్ననేమి వీనుమిగిలినన్యాయవాది కిచ్చు సొమ్ము కంటెఁ బదిమడుంగులు నా కొసంగవలయు-నభియోక్తల యందు నన్ను వలచుపాటి మోటువాఁడుంట యరిది-యెందే నొకఁడుండుఁగాక - నాయజ్ఞానమ్మున కహంతావంచనల చెలిమిఁ గూర్చియే నీలోకమ్మున కింకను ఋణంపడుటపోలునా యనితలంచునెడ నా యభ్యుదయమ్ము వలచుసుహృజ్జనంబు నన్నుఁగదిసి మిత్రమా నీవు బొంబాయికింజని యచటి నెఱపాడిపట్టున నించించుకయనుభూతి నార్జించుచు నాయాయి ధర్మశాస్త్రంబులు పఠించుచు హెచ్చుకుందాడక వచ్చిన యభిగ్రహమ్ములతోఁ దనివిసెందుచుఁ బ్రొద్దులుపుచ్చుట లగు గదా యనుడు నే నాహితోక్తి న్మెయికొని తన్నగరంబుసేరి 22

గీ. పొనరుపడు నద్దెయింటఁ గాఁపురము వెట్టి,వంటకై రవిశంకరాహ్వయు ధరాసు
పర్వు నియమించికొని వాని బానిసీని,కరణిఁగా కింటివానియ ట్లరయుచుంటి. 23

గీ. అతఁడు శివమూర్తిపైని దోయమ్ము క్రుమ్మ,రించిట్టుల యేనిపై నించునీరు
తనువు రుద్దఁడు జందెము న్దాఁకఁ దతని,వలువదాలు కాటుక కొక్కవాసి మేలు. 24

క. వేదమ్ము నెఱుఁగఁ డాతఁడు,లే దతనికి శాస్త్రమైత్రి లేశము నాచా
రాదులు తెలియవ తగువాఁ,డే దొరకెన్నాకు వంటయిలు దీర్చుటకున్ 25

వ. ఒక్కమరి నే నతనిం గని సగౌరవంబు సస్నేహంబు నగుభంగి 26

క. రవిశంకర! నీపాక,వ్యవసాయజ్ఞాన మల్ప మగుఁగాక ధరా
దివిజుండ వయ్యు సంధ్యా,దివిధుల్ నెఱవేర్ప విట్టిదియుఁ జెల్లునొకో. 27

ఆ. అనుడు నాకు సందెయన మేడిఁగ్గె కొంత,పాఱు వేల్మి పలుగు బ్రహ్మయజ్ఞ
మేమిసెప్పికొందు నే నిట్టిబ్రాహ్మణ,త్వంబు నూఁది యున్నవాఁడ నకట! 28

క. మీ(బ్రాయ్యిఁదుడిచి కుక్షి,వ్యాపారము దిద్దుచున్న వాఁడను దర్వీ
లోపమ్ము ఘటిల్లిననాఁ,డీపాణిం బలుగులేదె యీతని కనియెన్. 29

మం. పాచక క్రియలోనఁబాండితిలేని,యమ్మహీ దేవున కాచార్యకంబు
నలుపుచు వంటలో సగపాలు నేన,నెఱపి సాగించుచుంటిని జీవయాత్ర
పనితొందరలు లేనివాఁ డైననాకు,వంటసేఁతకు వీలు వలసినం తబ్బె
మర(బ్రాయ్యి గొని దొరల్మాడ్కికింజొచ్చి,శాకపాకము లేము సంతరించిమి
నాబానసీనికి నాకునుం బోలె,నెవ్వానితోఁ దింటకే నద్దులేమిఁ
గదుఁ జక్కఁగా గాఁడికలిసె మా కపుదు. 30

క. ఐనం గల దింటర మొకఁ,డే నెంతగ మొత్తుకొన్న నీతఁడు బొగ్గుం
బోనివసనంబు నూడ్చఁడు, బోనమ్మును మూయఁ డెట్టిభూమీసురుఁడో. 31

క. ఈతంటా లెటు లున్నను, జేతికి నేగానిరామిచే సెలవునకున్
భీతిలి పదిపక్షంబుల, కేతన్నగరంబు వాసి యేగుట వలసెన్. 32

వ. ఏ నిట్లు లోకయాత్రకు మొదల్కొని మేడిపండువోని న్యాయవాదివృత్తివలన నేవపడి ముం
దేమిసేయం దగునా యనుతలపోఁతకుం దిగి దిగులుకుదువం దొడంగితి. 33



# 3 తొలుతగవు

మం. బొంబాయిలోనఁ గాఁపురము సాగించి, హైందవన్యాయశాస్త్రాంభోధి నీఁద
నుత్సహించితి మిత్రుఁడుత్తమాచార,నిధి వీరచంద్రగాంధి సహాయుఁడయ్యె
నభియోగసంచయం బార్జించుపొంటెఁ, గష్టించుచుండె నగ్రజుఁడెల్లవిధుల
వీరచంద్రుదు జగద్విశ్రుతిం గన్న, యల తయాబ్జి ఫిరోజిషాదికన్యాయ
వాదుల ధీవైభవమ్ము నగ్గింప, విస్మయసాధ్వసావిష్టుండ నైతి
స్మృతిపార మది నాకు ఁజీకాకుగూర్చె,నాలుగై దేండ్లు క్రిందను మీఁదఁ బడక
మనవృత్తి నెవ్వాఁడు మాడ లార్జించెఁ,బుయిలోట వలదంచు బోధించె మిత్రుఁ
దానాఁటి కానాఁటి కదరె నెచ్చమ్ము,బల్ల గట్టితిఁగాని ప్రజ్ఞ లేదాయెఁ
బాడిపట్టున కేగి పల్కాదుటన్న, నెక్కదలేనిజం కేర్పదె న్మదికి
నత్తకొల్వున కప్పుడపుడె కాల్పెట్టు,కోదలనై గోదు గుదువంగ వలసె. 1

క. పడఁతియభియోగ మొక్కటి,నదుపుటకై తెగువచేసినాఁడను మొదటన్.
నడివానివేఁదులంచం,బిడ నీకొననైతి నొక్క యేగానియునున్ 2

క. అది యేకదినశ్రమమునఁ,దుదముట్టెడుతగవ చిక్కుతోడం బెనఁగొ
న్నదిగాద యట్టి పని క్రై,ముదమారన్ బుచ్చుకొంటి ముప్పదిరూకల్. 3

ఆ. వాదిగెల్పు వలచివచ్చిన యెలకాంద్ర,బట్టిచూడఁ దగినపట్టు వచ్చె
నిలిచి నోరువిప్పనిముసాన గుండియల్,పరువులెత్తెఁ జెమట వఱదపొడిచె. 4

క. కుమ్మరిసారెవిధాన శి,రమ్ము గడు స్సుబ్బటిల్లె రచ్చయు విసుమా
నమ్ముగఁ బరిభ్రమించెఁ బ,దమ్ము లిసీ రాల్ పదెం బదమ్ములయట్టుల్. 5

ఆ. ఎంతపెనఁగులాడి యేమేమిచేసిన,నొదవదయ్యె నోట నొక్కమాట
తగవుపల్కువారు తగవరియున్ నాఁడు,నన్నుఁ జూచి యెంత నవ్వినారొ. 6

ఉ. కుప్పనఁ గూరగాఁ బడి దిగుల్పడి దీల్పడి పూనుటేల నా
కొప్పనిచేఁత కంచు నభియోగినిఁ జేరి ధనం బభిగ్రహం
బప్పనచేసి నావలన నాగ్రహమందకు మంచువేఁడి యే
నప్పుడ కొంపఁజేరి త్రపయందు మునింగితిఁ బెద్దక్రుంగితిన్. 7

గీ. తగినసామర్థ్య మేర్పడుదనుక నిట్టి,పనులు వల దన్ననిర్ణయంబునకు వచ్చి
యాఫ్రికాఖండమున కేగునంతవట్టు,ముట్టుకొననైతి నభియోగ మెట్టిదేని. 8

క. ఈగతిఁ గావించుటలో,నాగొప్పతనంబు లే దనందగుఁ బాడై
పోఁ గోరకవడి నా కభి,యోగమ్ము నొసంగుమందుఁ దుర్విం గలఁడే 9

వ. కాని పోర్బందరుదొరతనమువారు తమ కరివెట్టనికతమ్మున నొకతురుష్కుని పొలము నగ్గపఱుచుకొంటంజేసి పేదఱిమి కాదరువగు నక్కాఁపువాఁడు పాడిపట్టున కర్పించుకొనుట కొకమనవిపత్రము వ్రాసియిందని నన్నుఁగోరె - నతని వాదున బిగువు లేబరమ్మని యెఱింగియు మజ్జనకునిపెద్దఱికం బూఁతగాఁగొని యమ్మలక నాబాసట నాసించుటంజేసి యాపనికిం దలయూఁపితి - దానిముద్రణ వ్యయం బతండ భరియించె - నారచించిన విన్నపంబుఁ గన్న నెయ్యురు తద్దయు నగ్గించి - రాపొగడ్త చే నిట్టి మొఱముక్కలు లిఖించుట కైనం జాలుదుఁగదా యను విశ్వాసమ్ము నాకొదవె - నియ్యది తథ్యంబ. 10

క. విత్తంబు నభిలషింపక,యిత్తెఱఁగున మొఱలు వ్రాఁత కేఁబూనినఁ గిం
చి త్తెసలిక నాకుండమి,సత్తెమయగుఁ గాని బండిసాగునె దీనన్. 11

ఆ. ఆంగ్లభాష నించుకంత గడించుట,నొజ్జనంబుమీఁది కొఱగెఁ జూపు
ప్రకటమయ్యె నష్ట యొకబడి కాంగ్లమ్ము, దెలుపునయ్యగారు వలయునంచు. 12

గీ. పరమసమ్మద మందియప్పారశాల, కంపుకొన్నాఁడ విన్నపం బాశుగతిని
మీరువిచ్చేయఁ గోరుచున్నార మంచు,గమ్మనంపెను విద్యాలయమ్ము పెద్ద 13

క. చనుదెంచిన నన్నుఁ గనుం,గొని మన్ననచేసి శాస్త్రగురుపట్టము లే
మి నినున్ విడుచుట తప్పని,పని యయ్యె నటంచు జాలిపడుచుం బలికెన్. 14

క. చల్లపడెఁ గాలుసేతులు,పుల్లవడె న్మొగము మూరిఁబోయినకోర్కుల్
పొల్లవడెనాకు; నన్నయు,డిల్లపడెన్ దీని విని కడిందివగపునన్ 15

క. ఈరాచవీట నెన్నా,ళ్లారాటంపడినఁ గూలియబ్బ దటంచుం
దీరు పొనరించుకొని యేఁగోరికవడినాఁడ రాజకోటకుఁ జేరన్ 16

గీ. నాదుసోదరుఁ దచ్చోట నడిమితరపుఁబాడిపల్కరియై యున్నవాఁడు గాన
మనవులన్ వ్రాఁత మున్నగుపను లతండు,నాకొసఁగునంచుఁదలపోసినాఁడ నపుడు. 17

వ. అందు మాకుటుంబ ముంటంజేసి దినవెచ్చమ్మును గొంత కూడివచ్చు నని యేకతంబాడి బొంబాయి నున్ననాపసికాఁపురమ్ము బండి కెక్కించితి - నయ్యది యట్టుండె - నే నవ్వీట నున్నతతి నెల్లనాఁడు జగాపాడిపట్టున కేగితిఁ - గాని దానంజేసి నాకబ్బినమేలు వీసమేని లేద-వాదరహస్యంబు లెఱుంగఁదగిన శేముషిబలంబునాపాల సున్న - యెన్నేనిమాఱు లభియోగతత్త్వంబ తెలిసికొననేరక కూరికితి - నిప్పనియందు నాకెందఱో భాగస్వాము లున్నకతన నాసిగ్గువ్రేఁగు చాలవట్టు తొలంగె - రానురాను న్యాయస్థానమ్మునఁ దూఁ గుటయు నొకయందం బని తలంచి సిగ్గుమాలినవాఁడ నైతి. 18

మం. ఇపుడేని బొంబాయి నెందఱో న్యాయ,వాదు లుండకపోరు పనిలేనివారు
హిత మొండువారికై యే వెల్వరింతు, ననుభూతిపూర్వకం బగుసుభాషితము
నాఁడు గిర్గాములోన వసించునేను, దగవుపట్టున కేగుతరుణమ్మునందు
శకటవ్యయంబు వీస మొనర్చి యెఱుఁగ,జగ మివతాళించు జడి క్రమ్ముఁగాక
చిచ్చు లూరెడునెండ చెలరేఁగుఁ గాక, నడిచిపోకయు రాక నాదీక్ష యయ్యెఁ
దొంబదినిముసాలతో నేగివచ్చి, తద్దయు వెచ్చమ్ము తగ్గించుకొంటి. 19

క. నాసఖు లామయములకున్, దాసత్వము సల్ప నేను దలవాల్పక యెం
తో సుఖముంటిని శ్రమ క,భ్యాసంపడువానిదెసకు వచ్చునె చీదల్. 20

క. రాబడి హెచ్చిననాఁడున్. నాబడి నే విడువ కట్ల నడిచెడివాఁడన్
నాబ్రతుకు నాఁటిసాదన, చేఁ బడసినలగ్గుకతనఁ జెలగెడి నిపుడున్. 21



# 4 మొదటి దెబ్బ

ఆ. న్యాయవాది యస్మదగ్రజుఁ డిచ్చుతో,ద్వాటుకతన రాజకోటలోన
నెలకుమూఁడునూర్లు నేఁగంటి రూప్యముల్,ప్రౌఢివెలయ విన్నపములు గూర్చి. 1

గీ. నడిమివానికి లంచంబు నిడ నటన్న,పట్టుదల రాజకోటలో వదలవలసె
నెంత యనివార్య మైన నే నిట్లుచేఁత,యాత్మవంచన గాకపో దని తలంతు. 2

మ. పదిరూక లిట్లు సంపాదించుకొనుచు,దనివోవుచున్న యీ తరుణమ్మునంద
గురుతరావజ్ఞకు స్గతియైతి నేను,బ్రదుకున కదియపో ప్రథమఘాతంబు
నధికారదూర్వహుం డగుతెల్లవాని,తత్త్వ మెట్లుండు నందనుక నేనెఱుగఁ
బోర్బందరుధరాధిపుఁడు కీర్తి శేషుఁ,డేలిక గాకము న్నీతనిపాల
నొజ్జయై ప్రగడయై యుండె మాయన్న,యితఁ డమ్మహీనేత కెదియొ దుర్నీతి
నేర్పినవాఁడంచు నిందుతుఁ దయ్యె,నయ్యభియోగ మందం దుండి తుదకు
నగపడె రాజకీయప్రతినిధికి,నన్నపైఁ గసిఁబూనె నాంగ్లేయుఁ డతఁడు
సీమలో వాఁడు నాచెల్మికాఁ డగుటఁ,దగుమాటలాడి యాతనిఁ దేర్పు మంచు
ననుఁ గూర్మిమైఁ గోరె నాసోదరుండు. 3

క. ఎందో యెపుడో పొసఁగినపొందిక యి ట్లొదవఁజేఁత పోలనిపనిగా
డెందమ్మునఁ దలఁచితి నా,చందం బది యగ్రజున కసమ్మతిఁ బెంచెన్. 4

క. అతని కెదురాడఁ జాలక,ప్రతినిధి మన్నింపఁ డంచు భావించియు నే
గితి వానికడకుఁ బంపిం,చితి దర్శన మొసఁగుఁ దన్నచీటిన్ దొలుతన్ 5

సీ. అనతివడసి యయ్యధికారికడ కేగి,యణఁకువఁజూపి నెయ్యమ్ముఁ దడవి
యుద్దిష్టమగుచేఁత కుద్యమించుడు వాని, మొగముపైఁ జుఱచుఱల్ మోసులెత్తె
నతనిలోచనవీధి నానాఁటినేస్త మిం,దులకా యటన్నపల్కులు పరించి
తిని గాని నాపాఠమును మాననైతి రోఁ,తకు జిక్కి కినిసి యాతండు నీదు
గీ. వాకు లిఁకఁ జాలుఁదీతిక మాకు నలఁతి,కూళ నీయన్న యిటఁజెప్పుకొనఁగ వలయు
మాట లుండినఁ దగుభంగిఁ దేటపఱుప,వచ్చు నతఁడంచు నుత్తరం బిచ్చెనాకు. 6

గీ. చాలు నిది నాదునోటికి స్వస్తిసెప్పు,కొంట కటులయ్యు నక్కఱ గ్రుడ్డిదగుట
నాగొడవ మాననైతి నుద్యోగిముందు, నదువుఁడిఁకమీ రని యతండు నొడువుదనుక. 7

గీ. విషయ శేషమ్ము వినుఁడంచు వేఁడుచున్న, నన్ను మన్నింప కతఁడు తీక్ష్ణతకుఁ జొచ్చి
సేవకుని బిల్చి వీరికిఁ ద్రోవఁజూపు,మనియె నపుడేని నాగోల నాఁప నైతి 8

వ. అంత నతనిలెంక నాయంసద్వయమ్ము నూఁది నన్ను వెడలనడఁచుడు దండతాడిత భుజంగ మంబునట్లు నే బుసలు గొట్టుచు “నన్ను మీబానిసీనిచేఁ ద్రోయించి యవహేళనమ్ము గావించితి – రిద్దానికిం దగినక్షమాపణ వేఁడరేని పరువుపోకకు మీ పై నభియోగమ్ము తేరకవిడువ'' నని యయ్యధికృతున కొకలేఖ నంప నతండు 9

గీ. ఈవె సభ్యత విడనాడి తెన్నిమాఱు,లెచ్చరించిన వెలుపలి కేగివైతి
కడకు నింకొకమార్గంబు గానలేక, లెంకచేత నిను న్వెదలింపవలసె. 10

గీ. వెడలుఁడని బంటుసెప్పిన న్వినమిఁజేసి,పంపఁ దగినంతబలమ చూపింపఁబడియె
నిది యకార్యమటంచు మీ రెట్లు నన్ను,ముదలకించిన సాధ్వసమ్మునకుఁ బోను. 11

వ. అని తనసాహిణిచే మాఱుకమ్మ నంప దానింగొని లజ్జాభరమ్ముతో రాజకోటకుం జేరి యావద్విషయమ్ము నగ్రజునకు నివేదించుడు నతండు నిరవధికసంతాపవశంగతుఁడై నన్ను సమాశ్వసింపనేరక తగుమిత్రు స్గదిసి యాదొరపై నభిగ్రహంబు మోపుమార్గంబు నరయు చుండె – నయ్యవసరమ్మునంద సుప్రసిద్ధన్యాయవాది యగు ఫిరోజిషామెహతా యొకానొక తగవున కవ్వీడుసేర నే నగ్గుఱువమ్రోలకుం బోవ జంకి యతనిచెలికాని కొక్కని కాపత్రమ్ము నొసంగి దానిపై మెహతాహితమ్ము నర్థించుడు నతం డీనాఁడు పెక్కంద్రు న్యాయవాదులబ్రదు కిట్ల యున్నదని గాంధికిం దెల్పు – మక్కోదెకాఁడు నేఁడ లండను వాసి యాదేశమ్మునఁ గాలుపెట్టె – వానిభావంబు లిపుడు తప్తక్షీరంబులంబోని – వధికారంబునందున్న యాంగ్లేయు లతని కపరిచితులు – నాలుగురూక లార్జించి సుఖపడఁ గోర్కికలదే నతఁడీవ్రాయసంబును రూపుమాపి తదవజ్ఞ న్మఱచుట ల గ్గనిచెప్పుడు నబ్బోధనమ్ము నాకుం గాకోలకల్పమ్ముగ నుండెఁ–గాని కబళించుట యనివార్యమై యెన్నఁడేని నేస్తమ్మునిట్లు చెఱుపఁజన దనుకట్టడం జేసికొని దానిం దలఁగనైతి – నీసంఘటనతో నామనుగడకుం బెద్దమార్పు వచ్చె. 12



# 5 ఆఫ్రికా పోక

సీ. దొరచెంత కే నేగు టరయ దోసమ కాని,వీనివెలార్పు నుద్వృ త్తియెదుట
నపరాధ మస్మదీయము లెక్కసేయరా,నిదిగదా దీనికై నిప్పులుమిసి
యంతలు సేయంగనగునె యాతఁడు నన్ను,మంచితనమ్మునైఁ బంచు టొప్ప
దా?చెల్లుబడిమైక మేచిననాఁడు వి,వేకమ్ము నిలుచునా?వీని కించు

ఆ. కంత తాల్మిలేమి నవ్వలవింటి నీ,తెల్లబిడ్డ వచ్చి నెల్లవారి
నిట్ల చిన్నవుచ్చి యేపాటివిసువున,కేని మండునఁట కృశానువోలె. 1

క. నాయభియోగము లీతని,న్యాయస్థానమ్ములోని వయ్యెఁబ్రసన్నుం
జేయుట దుశ్శక మీదొర,నేయెడ నొరు దేవురించు టింపనినాకున్ 2

క. ఏయదియో తలక్రిందులు,సేయుదునని వీనిజంకెచేసి మరల నా
చాయకు నేగమి చింతా,దాయకమై నాదుశాంతతన్ గొఱపెట్టెన్. 3

క. అలఁతియలఁతిజేండ్లకుఁ దా,వలమై సవరిల్లు కరియవాదున నానాఁ
దలముకొనెఁ బెక్కుజగడం,బులు కల్లలు తలలుమార్చు బూమియచేఁతల్. 4

క. మితిగడచిన యీర్ష్యలచే,నితరేతరకలహవహ్ని నెరిసిరి వసుధా
పతు లత్తతి హితవాగభి,రతి సెడి మెఱమెచ్చులందు రక్తిపొడముటన్. 5

వ. వారిసచివులు స్వక్కుంగల యధికృతులు స్వమతమ లాభమ్ముపొంటె నొండొరులు గికురించు కొనఁ జాగి - రిఁక నమ్మహీపతుల కెవండేదిపల్కిన నదిప్రమాణంబాయె - నాసంస్థానాధీశుల శ్రవణంబులు ప్రియవాదులకు వశంపడె - వారు తమపైఁ బెత్తనమ్ముగల యాదొరకడ నూడిగమ్ము సలుపువానినే నుపలాలింప వలసె - నచటి సిరస్తాదారు వారిపట్ల శిరస్థుదారుండ (శివుఁడు) యయ్యె - నితఁ డారాజకీయప్రతినిధికిఁ దుపాసియు నగుట వీనిమాటయం దా యాంగ్లేయునకు విశ్వాసము మెం - డీద్విభాషియ వానినేత్రమ్మును శ్రోత్రమ్ము నై వెలయు - నితనివచ్చుబడి యయ్యధికారి యాయమ్మునకంటె మిక్కిలి యనుట స్వభావోక్తియు - కావుటంజేసి 6

క. విషపవనాపూర్ణం బీ,విషయం బనితోఁచె దీనివిసరుల కెదయై
పుషితస్వేచ్ఛాగతి నభి,లషణీయచరిత్రమై నిలంగల నొక్కో 7

క. అనుచింత యనుక్షణమున్,ననుఁ గాఱియవెట్ట దొడఁగె నాకౌతుక మె
ల్ల నడంగె నీయవస్థం,గనుఁగొని మద్భ్రాత బిట్టు కలగుందువడెన్ 8

క. తగునధికారం బది నా,కగపడుచో, నిచటిబూమె లంటక శాంతి
స్థగితంబగు మన్గడతో, నెగడుదుఁగా యన్నతలఁపు నెక్కొనె నంతన్ 9

ఆ. ఉద్భవించెఁ గాని యుద్యోగర క్తిమో, సమ్ము లెన్నియెన్ని సలుపలేని
వాని కెట్లు వడయవచ్చును ధర్మాస, నమ్ముగాని ప్రెగడనమ్ముగాని. 10

క. ఆదొరమైకో లించుక,లేదే నిట నెట్టిమేలు లేదుగదా మా
కో దక్షిణోత్తరధ్రువ, పాదమ్ముల కున్నపాటిబాంధవ ముండెన్ 11

వ. అయ్యవసరంబునందు పోరుబందరుసంస్థానమ్ము నేలుతేఁడు తనదేశమ్మునందలి పంట కాఁపులపై విధించినపన్ను దుర్భరం బగుట సేద్యగాండ్రపక్షమ్ము వహించి యే నమ్మహీపతిని

దర్శింప వలసె – నితండు మనవాఁడయ్యు మిడిసిపాటునం దాదొరకొజ్జ – గానఁ గర్షకులకోర్కి వమ్మయ్యె – నాయభియోక్తలకుఁ బాడిలభింపమి న్నన్ను నైరాశ్యమ్ము వలచె – నిఁక న్యాయమ్ము వదయఁగోరిన నుల్లతెల్లదొరకు మనవి పంపవలయు – నతనికి న్నాకును జుక్కెదురుగదా – కర్తవ్యమేమి – యనివగచు నెడ నొకమహమ్మదీయుండు పోరుబందరువాఁడు మాయన్నకడకు వచ్చి మా కాఫ్రికాలో నపారమగు బేహారమ్ము గల – దందలి తగవుపట్టునఁ దదవులంబట్టి మాయభియోగం బొందు క ౦దొడ్డది నడుచుచున్న యది – పెద్దపెద్దన్యాయవాదులు మాపనిం జూచుచున్న వారు – మీతమ్ముగుఱ్ఱం బుత్తెంచితివే నతండును మాకొదవు–నతనికిని లగ్గగు–ననవుడు మదగ్రజుండు సస్మితాననుండై 12

మం. ఏమందువని నన్ను నెచ్చరికింప,సగపాలుమెయికోలు చాటితి న్నేను
బేహారి యపుడు నన్ బేర్మిమైఁ జూచి,తమ్ముదా నీకు నింతయు జంకువలదు
తప్పకరమ్ము భద్రము లబ్బు నీకు,నాదీవి మానెయ్యురైన యాంగ్లేయు
లెందఱో గలరు పేరెన్నికగలరు,నీకు వారలతోడి నేస్తమ్ము పొసఁగు
నచటి మావ్యవహార మాంగ్లమం దుంట,బనికివత్తువు నీవు బాగుగా మాకు. 13

క. ఎన్నాళు లచట నుందువొ,యన్నాళ్ళున్ మాకు వింద వగుదువు మఱి నీ
కన్నా!పయనమువెచ్చం, బన్నది సకలంబు నిత్తు మతిసుఖదముగన్ 14

క. మాపనుల న్దిద్దుచు నీ, వాపుదమి న్నిల్వవలయు హాయన మొక్కం
డీపాటున కీయఁబడున్, రూపాయలు పదియునాఱునూ ర్లం చనియెన్ 15

క. ఈపాటి విత్తమునకే, ద్వీపాంతరగతికి సమ్మతింజూపుట శ్లా
ఘాపాత్రము గాకున్నను,నూఁపితి శీర్షమ్ము కొసరు టొల్లనిబుద్ధిన్ 16

మం. క్రొత్తరాజ్యముమీఁదికోర్కి హెచ్చుగుట మాతృదేశముమీఁది మమతలొచ్చుగుట
ననుభూతి ప్రబ్బునన్నాస పైకొంట, నాదాయ మది యెంతయైన నేమంచు
నంగీకరించితి నాఫ్రికాపోక, చెచ్చెర సంతరించితి మూ౯ ముల్లె 17



# 6 నేటాలు

మం. అపుడు విద్యార్థినై యాంగ్లదేశాన, కేగుచో నొదవినయెడఁబాటు వంత
యిపు డాఫ్రికాకుఁ బోయెడిపట్టునందు,దొరయదయ్యెఁ బరిస్థితు ల్మాఱుకతన
నాతల్లి యీవేళ నాకమం దుంట,లోకానుభూతి నాలోఁగుదుర్కొనుట
యబ్ధియానమ్మున కలవాటుపడుట, యీనాఁటిహాళికిన్ హేతువు లయ్యె 1

వ. అయినను 2

గీ. వెలఁది నీసారి విడనాడి వెడలుటన్నఁ, జిత్తమునఁ గొంతచింత రేకెత్తఁ దొడఁగె
సీమకుం బాసి యే నిల్లుసేరినంత, నుద్భవించెను మగుడ మా కొక్కచిఱుత. 3

గీ. వైషయికసౌఖ్యములమీఁదఁ వలపుపేర్మి, వలన నిందన్క మాచెల్మి తొలఁగదయ్యెఁ
గాని లోకమ్ముగుడుచు నౌగాము లెఱిఁగి, యిపుడ కాసంత సంస్కృతి కిచ్చగించె. 4

గీ. ఇంగలాండు వాసి యీనేల త్రొక్కిన,వెనుకఁ గొన్నినాళ్లు వెలఁదిఁ గూడి
యొక్క తావునంద యుంటినిగాని భ,ర్తృతకుఁ దోడు దేశికతయు వచ్చె. 5

క. అతికష్టమ్మున కొగ్గుచుఁ, గతిపయసంస్కృతులు మప్పఁ గడఁగతిఁ జెలికిన్
గృతి యిది ఫలింపఁగా నవి, రతవాసము మాకు నవసరం బనుకొంటిన్. 6

గీ. ఎట్టు లనుకొన్ననేమి నా యాత్రప్రయాణ,కౌతుకమ్ముమ్రోల విరహార్తికానరాద
యబ్దమన నెంత యని కాంత నాశ్వసించి,పట్టితిన్ నాఁడు నేను బొంబాయిబాట. 7

వ. అంత విశ్వప్రయత్నమ్ముమై నావలోమొదటితరపుసౌకర్యమ్ము విలిచి నేటాలునందు నాభాగ్య రేఖ బరీక్షింప నెంచి పరమోత్కంఠతోఁ (1893 ఏప్రియల్) బయనమైతి – మధ్యేమార్గమ్మున నౌకాధిపతి నాచెలికాఁడై నన్నుఁజతురంగ క్రీడకు దింపె – నయ్యాట బుద్ధివికాసమ్మున కెంతయుం దోడ్పడునని విన్నవాఁడ – నోడపెద్దనన్నందుఁ గుశలుం జేయఁ జూచెఁ – గాని యపజయంబు సర్వదా నన్న వలచు – నతండు నాతాల్మిం గని యత్తమచ్ఛాత్రుం డబ్బెనని యుబ్బిపోయెఁ – బదుమూడుఁ నాళ్ళకు మాయోడ తొలిరే వగు 'లామూ' చేరె – నవ్వల 'మొంబాసా, కేగె – నావెన్క జాంజిబారుం గదిసె – నీ నౌకాశ్రయమ్మునం దరణి పదినా ళ్లాఁగు – నొక్కదినంబున నౌకాధికారి వయాళికి రం దని యాంగ్లేయు నొక్కని న్నన్నుం బిలుచుడు ముఫ్వురము న్గట్టెక్కితి – మింతలో నొకకుంటెనకాఁడు తోడై మమ్ము 8

ఆ. పదుపువృత్తి నూఁది బ్రదికెడి నీగ్రోవ,ధూటు లిమ్ముకొన్నపేఁట కీడ్చి
మూఁడుగదులుఁ జూప మూరినలజ్జమై,నచటఁ బచ్చిమూఁగ నైతి నేను. 9

క. ఓచెల్ల నన్ను నచ్చెలి,యేచందమువానియట్టు లెంచెనొ దైవం
బే చెప్పవలయుఁజనిన,ట్లే చివ్వున వచ్చినాఁడ నివ్వలిదెసకున్ 10

ఆ. ఓడపెద్ద నాదుజాడలు గుర్తించి, మనసునందు నవ్వుకొనియెఁ గాని
కలికిచెంత నెడఁదగజిబిజి లేకున్కి, భగవదాదరమ్ము పొగడుకొంటి 11

క. గది నా కక్కఱలే దని,మొదటన మొగమోట నేల మోఁద నిసీ నా
మది యింతపేదదా యని,తుది లేని విచారజలధిఁ దోఁగితి నంతన్. 12

క. నామనుగడ నింతకుము, న్నీమెయిత్రొక్కటలు రెంటి నెఱుఁగుదు భగవ
ద్భామానుగ్రహలక్ష్మీ,ధాముఁడనై తప్పుకొంటిఁ దద్దురవస్థల్. 13

క. అటమటజాడ లెఱుంగని, చిటిపొటిగోవాళ్ళు పరుపుసెదు నని యీాద్రు
గ్ఘటనలు పొసఁగినతతి ను,త్కటకిల్బిషదాస్యమునకుఁ గడఁగెద రకటా! 14

క. ఏ నిష్పాపము నంటమి, నానెతి యని పొంగఁజాల నవలాగదికిం
బోనని మున్నె తిరస్కృతిఁ, బూనినచో నది మదీయపురుషార్థ మగున్. 15

క. కేవల మీశ్వరునాదృతి, యేవంవిధ విజయసిద్ధిహేతువు గానన్
దీవలుసాఁగెను భగవ, త్సేవారతి యస్మదీయ చిత్తమునందున్ 16

వ. అయ్యది యుట్లుండె – నీతీరమ్మునం గల మేడెన్మిదినా ళ్ళుందునని యెతింగి నేను వీటవిడిసి దాదాపునంగల దర్శనీయస్థలమ్ములం గంటి – నుర్వీరుహమ్ముల యౌన్నత్యాదుల నొక్క "మలబారే" 'జాంజిబారుం' బురుడించుఁ – బ్రకృతిసౌందర్యగాంభీర్యముల కానేల నెలవు నాఁ దగు – నంత మానావ 'మొజాంబిక్కు' గడచి 'మే' మాసమ్ముతుదికి 'నేటాలుం' జూచె. 17



# 7 కొన్నియనుభవములు

సీ. 'ఆఫ్రికా'ఖండమ్మునం దవాచీభాగ,మునఁగల నీవృత్తులను గరంబు
వెలుఁగొందు 'నేటాలు'విషయమ్మునకు రేవు, పట్టణం బగుచు 'దర్బాను' తనరు
నచ్చట మాకలం బాఁగినంతన నన్నుఁ, దోడ్కొనిపోవ 'నబ్దుల్ల' యనెడి
సెట్టి వేంచేసె నాఘట్టమ్ముఁజేరు త, ద్దేశవాసులు భారతీయుపట్ల

ఆ. వెలువరించునట్టి చులుకనఁ జూడనా,మది కలంగె సెట్టిమాత్ర మిట్టి
లేతచేఁత కెపుడొ ప్రాఁతకాఁ పాయెఁ గా,బోలు నుత్తలంబు పొందఁ దయ్యె. 1

గీ. ఇతఁడు నన్గారవంబుమై నిల్లుసేర్చి,ప్రాయసమ్ములు నాయిచ్చువానిఁ జూచి
తనకు నొకపారిజాతమ్ము తమ్ముఁడఁపెఁ, గొఱఁతలే దిఁక నంచుఁ గోర్కులనుబెంచె. 2

క. ఆతనికిం జదువులలోఁ, జాతుర్యం బసద కాని సంస్తవనార్హం
బై తగులోకజ్ఞత చుఱు, కైతనరుమనీష తొడుగనట్టివి సొమ్ముల్. 3

ఆ. ఇతని కించుకంత యింగిలీసును వచ్చు, భారతీయు లితని గారవింతు
రెన్ని మేలిగుణము లున్నను నిత్యశం,కితులలోనఁ జేరునతఁ డితండు. 4

ఆ. తనమతమ్ము నితఁడు తద్దయు మన్నించు, నీశ్వరప్రసక్తి నెపుడు వలచు
మాటలాడుపట్ల మహదుక్తసూక్తులు, కుప్పతిల్లునట్లు గుప్పివైచు. 5

ఆ. ఇతనితోడిచెల్మి హెచ్చినకొలది ని,స్లాముధర్మతత్త్వ చర్యసేయఁ
దగులు పెంచినాఁడఁ దన్మతజ్ఞానమ్ము, నాఁడు నాఁడు వదసినాఁడ సుంత. 6

వ. దర్బాను చేరినరెండవనాఁ డొండె మూఁడవనాఁ డబ్దుల్లా నన్నుచటి తీర్పు నెలవునకుం గొనిపోయి తనచెలిమికాంద్రకున్ నాకు నెఱుకగూర్చి స్వకీయన్యాయవాది కుఱంగట నన్నుపవిష్టుం జేయుటయ తడవుగాఁదగవరి నాదెసకుఁ జఱచుఱం జూఁడుచూపులం బఱిపి పఱిపి 7

ఆ. ముదలవెట్టెఁ దుట్టతుద కస్మదుష్ణీష, ముజ్జగిల్లఁజేయు టుచిత మంచు
సరగ వానిపల్కు పెఱువెట్టి నేఁ బాడి,పట్టువలన వెడలఁబడినవాఁడ. 8

ఆ. నన్ను విడువవయ్యె మిన్నులువ్రాలిన, పుడమి నున్నఁ గాని పోరితమ్ము
లెఱుకపఱిచె మల్కు యీశిరోవేష్టన, కలహమునకు మూలకారణంబు. 9

వ. తురకలుం దురకలనదవడిం బాటించువారును వెలిగా నితర హైందవు లానాఁటి తగవుపట్టులం దలచీరఁ జుట్టఁజన దనుచట్టమ్ము కల - దందలిభారతీయులలో నరబ్బుల మని చెప్పుకొను తురకవణిక్కు లొకతెగవారు - పారసీకుల మని వ్యవహరించుకొను, వ్రాయసమ్మునం బ్రదుకు పారసీ లింకొకశాఖవా-రరబ్బులమని చాటుకొను హిందూలేఖకులు వేఱొక్కకోవవా - రీముత్తెఱంగులవారికిం జుట్టఱికమ్ము నడుచు - నిఁక దక్షిణాపథమువారగు నఱవలు నాంధ్రులు నౌత్తరాహులగు నానాజాతుల మతమ్ముల పేదలుం గాయకష్టమ్ముచే బ్రదుకుచు నొకపెద్దపాయగా మెలంగుదు - రాంగ్లేయులు వీరిం గూలివాంద్రని పిల్తు - రచటి భారతీయులు పెక్కండ్రు కార్మవృత్తి నుంటంజేసి యానేలంగల యెల్ల భారతీయునకుం గూలి యనుపేరు మాఱుట మాట యయ్యె - నిక్కతంబున మనబేహారులు కూలిబేహారులైరి - నాకుం గూలి బారిష్ట రనునామం బేర్పడె. 10

సీ. ఇంతగ్రంథం బున్నయానేల నాతల,కట్టు తద్దయు వెట్టపుట్టఁజేయు
టొకవింతయా యిఁక నుష్ణీషమును డించి దొరల కుళ్ళా దాల్చి పరిభవమ్ము
నకు దవ్వుదవ్వుల నడయాడు టది చిక్కు, లేనికర్జంబని యేను దలఁప
వల దిట్టిమాఱుపుల్ వచ్చు పరిస్థితుల్, విషమించు నిది శిరోవేష్టనమ్ము
ఆ. వలచు భారతీయవర్గము న్వంచించు,నట్టి చెట్టచేఁత యగును జువ్వె
మఱియు నీదుతలకు మనపాగయే నెఱా,చెలువ మిచ్చునంచు సెట్టి పలికె. 11

వ. వెండియు నాంగ్లేయులతపారమ్ము దాల్చిననిన్నుఁ జెఱుదిండిపసారమ్మునం దూడిగమ్ము సలుపు కింకరుఁగాఁ దలంతురని యబ్దుల్లా హితమ్ము గఱపె - నీసూక్తులు న న్నలరించెఁ

- గాని కైంకర్యముపట్ల నతండు చూపినచిన్నచూపు న్మెచ్చనైతి - నీనాఁడుం గొందఱ కిట్టిభావముంట విచార్యం - ఐది యుట్లుండె - నీవేష్టనకలహమ్ము పొసంగనివెన్క నేను నావాదంబు న్యాయంబని యచటిపత్రికలకుఁ బెక్కింటికి వ్యాసమ్ము లంపితి- నావిమర్శనము పెరిఁగిపెరిఁగి నాలుగైదునాళ్లలో న న్నాఫ్రికా కెల్ల వెల్లడిపఱిచి నాయభిప్రాయమ్ములం బొగడువారిం దెగడువారిన్ బెక్కండ్రవెలికిఁదెచ్చె - నపుడు నాకుం బత్రికలలోఁ బిలువనిపెద్ద యను పేరు లభించె - నాఫ్రికాయం దిరవుకొన్నంతదనుక నాతలగుడ్డ మన్మస్తకంబు న్విడువ దయ్యె - నందయెప్పుడేమికతమ్మున దానిం దొలఁచితి నగ్గాథ మున్ముం దెఱుకవడు. 12



# 8 ప్రిటోరియా దారిలో

మం. దర్బానులో జీవితమ్మును గడపు, భారతీయులతోడఁ బలువురతోడఁ
దనకు నెయ్యముగూరు తరుణమ్మునందుఁ, దగవు పరీక్షించుతతి సమీపించెఁ
గామక మీర లిక్కడకు రావలయు, రానిచో మీవారి రాకేని వలతు
నని సెట్టికిఁ బ్రిటోరియా వీటినుండి, వ్రాసె నాతనిపక్షవాది యుత్తరము. 1

క. వ్రాయస మది యబ్దుల్లా, నాయెదుటం బెట్టి నీవు నడుతువె యన నే
నీయకొని వానిలేకరి, సాయమ్మునఁ దెలిసికొంటి జగడపుముసుఁగుల్. 2

క. మనతగవుగుట్టు పొక్కం, జనదు సుమీ శత్రు లైంద్రజాలికు లవ్వా
రు నిలుచుతావున నీకున్, మనికి వలా దంచు సెట్టి న న్నెచరించెన్. 3

వ. అంత నే నబ్దుల్లాను గని 4

గీ. అచట మీన్యాయవాదిప ల్కాదరించి, కాఁపుర మొనర్చెదన్ మంత్రగోపనమ్ము
సేఁతలో నన్ను నోమించుజెట్టి నేన, కాని ప్రత్యర్థిమైత్రీసుఖమ్ము వలతు. 5

క. నాతలకు న్మించనిచో, నీతగ విఁక వీధివీధి కెక్కనిత్రోవల్
సూతు నెదురువా ర్మీకును, లాఁతులె సన్నిహితబంధుల కదా యంటిన్. 6

వ. ఇట్లు నాకావించిన పరిష్కృతిప్రస్తానమ్ముచే సెట్టిచిత్తంబు చివుక్కురుమన్న ట్లూహించితి నంత నతండు నిజము నిజ మీన్యాయస్థానపీడ వదలుటకంటె వేఱొండు భద్రం-బేమి కలదు - కాని ప్రదివాదికి న్మాకునునెత్తురుపొత్తున్నయది - మాతత్త్వంబులుఁ పరస్పర జ్ఞాతమ్ములు - తైయబ్‌హాజీఖా నంతలంతలం బాటునకు వచ్చువాఁడు కాఁడు - మన మేకొలఁది పరాకునం జిక్కినను వాఁడు మనకొఱ సందులెతిఁగి కొంపగూల్పం గలఁడు కాన నీ వెల్లకార్యంబునం దొగాములు పెద్దపరికించు టావశ్యకం - బనవుడు నేను 7

క. జంకేల నీకు జలనిధు, లింకిన మనగుట్టు నొరుల కిత్తునె తగవుల్
బింకమ్ములుడిగి నేస్తము, వంకకు రం దనుహితమ్మ వాక్రుత్తు నటన్. 8

మం. అని పల్కి బేహోరియాశీస్సు లంది, పొదలుహర్షమ్ముమైఁ బొగబండి నెక్కి
వెడలి నేటాలుపెన్వీడు మారిట్జు, బర్గుఁ జేరితి రాత్రి పదిగంటలకును
బధికుఁ దొక్కండు నాపయనించు మొదటి, తరపుఁబెట్టియఁ జేరి తన్ను వీక్షించి
భారతీయుఁడ నౌట భరియింపలేక, చిటచిటలాడి చెచ్చెర లేచిపోయి
తెచ్చినయధికారి తిలకించి నన్ను, నిలువరా దిచ్చోట నీవు పిఱింది
పెట్టెకుం జనుమని బింకానఁ బలుకఁ, దాళుమా యిందుండఁ దగినట్టిచీటి
విలిచితి నంచు నే వినిచితి న్గాని, దిగక తప్పదటంచుఁ దీండ్రించె వాఁడు
పెట్టె వీడనటంచు బిగిసితి న్నేను, భటుని బిల్చెదనంచుఁ బదరె నుద్యోగి
యతఁడు నెట్టినఁ బోదు నన్నాఁడ నేను. 9

ఆ. అంతలోఁ దలారి యరుదెంచి నన్నుఁ దా, వెలికి నీడ్చివైచి వెడలిపోయె
వెనుక కేగనంచు విక్కెదునావంకఁ, జూచిచూచిబండి సురిఁగిపోయె. 10

ఆ. మాత్రసంచితోడ మాత్రమ నే బాట,సారు లాఁగుసజ్జఁ జేరినాఁడ
సెజ్జ పెట్టె గొడుగు చిమ్మినచోటన, కలవు కోలుకానికాపు వడసి. 11

క. చలిచట్ట మందసమ్మునఁ, గల దయ్యది సీతు పొంగుకాలం బిఁక నా
నిలిచినతా వద్రులతో, మలసినపెనుమిట్ట సమయమా నిసిగడియల్. 12

క. ఓవరిలోఁ దిల్లికలే, దీవయ్య చొకా యటన్న నేపరిభవమున్
మోపఁగవలయునొ యిఁక నా, దేవుండ యెఱుంగు నాఁటి తీవ్రవ్యధలన్. 13

క. కదలేని పేరివమ్మున, వడఁకుచు గది నొంటి నున్నవాఁడ నెవండో
నడిరే వచ్చి పిలువఁ జలి,తడఁబాటునఁజేసి మూఁగతనమునఁ బడితిన్. 14

వ. అయ్యవసరంబునం దేను లోలోన 15

క. ఏపని కొగ్గదు నిత్తతి, నాపరువు న్నిల్పుకొనఁ బెనంగుదునా? యీ
ద్వీపమ్ముఁ దలఁగి భరత, క్ష్మాపయనము వేగవేగఁ జాగించెదనా. 16

ఆ. ఈపరాభవం బదెల్లను నాకుఁ గా, దనితలంచి వచ్చినట్టికర్జ
మనువుపతిచి సెట్టి నలరించి యవ్వలఁ, జూతునా మదీయమాతృభూమి. 17

గీ. అరుగుదెంచిన చెయిదమ్ము నట్టె విడిచి, క్రమ్మతిల్లుట భీరులక్షణము గాదె
యిపుడు కుడిచినయవమతి యెంత? దీని, కోహటిల్లిన నవ్విపోదో జగమ్ము. 18

ఆ. తెల్ల నల్ల వన్నె తెవు లిది మగతనం, బున్న దీనిఁ జంప నుద్యమింతు
సంతసమ్ముతోడ సైరింతు నిం దెన్ని, బెట్టిదమ్ము లెసఁగి చుట్టుకొన్న. 19

వ. అని తలంచుచుండ నహర్ముఖం బగుటయుఁ గల్యకరణీయమ్ములం దీర్చుకొని ధూమశకట శాఖా ప్రధానాధికారికిం దనవారు నన్నుం బఱిచిన పొట్లెల్లఁ దంత్రీ మూలమ్మున సమగ్రమ్ముగాఁ దెలుప నతండు నాదెస నడచినకార్యంబు దూష్యంబు గాదనియు నాపయన మ్మునకుం దగినసౌకర్య మొదవునట్లు పరికింపుమనియు శకట విరామస్థానాధికారికిఁ దంతినంపె – వెండియు నా యీబన్నంబు నబ్బుల్లా కెఱుకపఱుచుటంజేసి యతఁడు వలయు నధికృతులం జూచుటయకాక మారిట్జుబర్గు నందును దానిచేరువను గలభారతీయ వణిక్కులకుఁ దీఁగ వర్తమానంబులు నడిపి నాయోగక్షేమంబుపట్ల జాగరూకులరై యుండుఁ దని వారింగోర సస్నేహమ్ము సగౌరవమ్ము నగుభంగి నన్ను నడిసి 20

క. తమ మున్నువడ్డ పెను బ, న్నములం బ్రకటించి నూతనమ్ములు గా వీ
క్షమ నివి యని వాచామధు, రిమమై న న్నూఱడించిరి వణిక్ప్రవరుల్. 21

క. పొగబండిలోనఁ బెద్దయు, సుగమిచ్చెడు పెట్టె నరుగఁ జూచెడు మన కీ
యగచాట్లు తప్ప విచ్చటి, జగజెట్టులచేతఁ దెల్లసాములచేతన్. 22

మం. అని వార లాపగ లంతయు న్నిలిచి, తమకష్టమయ ముదంతము నెల్ల వినిచి
రంతటఁ బొగబండి యరుదెంచె నిసికి, నొకబల్ల నాకునై యుండె నద్దానఁ
గ్రొత్తనెయ్యుర వీడుకోలంది శకట, మెక్కి చార్లెస్టీటి కే నేగినాఁడ. 23



# 9 పలు బాధలు

వ. ఆనాఁడు చార్లెస్టౌను జొహాన్సుబర్గుల నడుమ నినుపదారి లేమింజేసి యశ్వశకటంబులు నడుచుచుండె – నందును శ్వేత నీల వర్ణ భేదమ్ములు కలవు – కానఁ దదధికారి నన్ను శకటాంతర్భాగమ్మునం గాక దానిపురోభాగమ్ము సూరెల నొగలపైఁ దనకు న్సూతునకు మాత్రమ నిర్మింపఁబడిన రెండుపీఁటలలో నొకదాన నిల్పి తా నంతరమ్మునఁ గూర్చుండె – నిది నిండుదుండగం బనియుఁ బరాభవం బనియు నెఱుంగుదుఁ – గాని 1

గీ. కట్టువటి కాలమున కవజ్ఞను సహించు, టుచితమనియెంచి యంద కూర్చున్నవాఁడ
నాకు వెలిపీఁట వలదటం చాఁకవెట్ట, నన్ను విడఁద్రొక్కి శకటంబు నడుపునతఁడు. 2

క. విడఁద్రొక్కిన నింకొకఁ దా,ఱడివోవు న్దిన మనంతరంబున నైనన్
సడిలేనిప్రయాణం బల, వడునా యని సూతుచేరువన కూర్చుంటిన్. 3

క. శరవేగమ్మున మావులు, పరువెత్తుచునుండె బండి 'పార్డికో' పన్
పురమునకు వచ్చె నపు డొక, దొరకుం బొగచుట్టఁ ద్రావుతొందర వొడమెన్. 4

క. నాపీఠ మాక్రమించిన, నాపనికి న్వీలుపొసఁగు నని చల్లనిగా
డ్వాపోవం బీల్చి తనూ, తాప మడఁపవచ్చు నని యతండు దలంచెన్. 5

వ. కావుటంజేసి శకటస్వామియగు నాతెల్ల వాఁడు నాపజ్జకు వచ్చి సారథి యొసంగిన యొక కసుమాలపుం బట్టాను దనకాలిదిగువఁ బడవైచి న న్నందుఁ గూర్చుండఁ గోరుడు నే నప్పరీభావంబు నోర్వలేక వెఱచుచు వెఱచుచు వానిం గని 6

సీ. ఇది యేమి నను మొట్టమొదట లోపల నుండ, నీయ కిచ్చోటికిఁ ద్రోయఁ దత్త
రాభూతి నెట్టెటులో భరించితి నది, యట్టుండ వెండియుఁ జుట్టఁగాల్పఁ
దలఁచి నీ చరణమ్ముదాపునఁ గూర్చుంట, వలతు వం దెవ్వాఁడు నిలుచు నీకు
నాపీఁట వలయుచో నీపీఁట కేఁ బోదు, నను నంత నతఁడు కట్టల్కఁ గ్రుంగి
గీ. వడివడి న్నాదుచెంపలు వాఁపఁగొట్టి, పచ్చిబూతులు గూసి నన్ బండినుండి
క్రిందికిం ద్రొబ్బఁ జువ్వ లంకించుకొంటి, ముడుసులు తొలంగినం బట్టువిడువ కుంటి. 7

క. పెనుబల్మి వెలయ నాతఁడు, నను నేలకునెట్టఁ గుడిచె నానావస్థల్
తనపట్టు నేను వదలక, పెనఁగితి నధ్వగులగుండె బిరబిరఁ గరఁగన్. 8

క. వా రతనిఁ గాంచి కటకట, ఘోరంబగు నిట్టిచేఁతకుం జొత్తువె యే
నేరం బొనర్చె నితఁ డధి, కారము నీరీతిఁ జెఱుపఁగాఁ దగ వగునే. 9

క. అతఁ డాడినవాక్యమ్ములు, శతధా సూనృతము లార్యజనతా సమ్మా
నితములు హితములు మాసం, గతి కనుపుము వాని దుండగం బది యేలా. 10

క. అని రోయ మించిపోలే, దని అంకియవైచెఁ గాని యాతఁడు లజ్జా
వనరాశి మున్గి యవ్వల, నను మోఁదుట నుజ్జగించి నాచేఁ దొఱఁగెన్. 11

ఆ. కొసరుతిట్లు నాల్గు విసరి తురంగమ, చోదకునకు గోనె చూపి వాని
నిలుచుపీర మెక్కి నిట్టూర్పు లూర్చుచు, ధూమపానమునకుఁ దొడఁగె నతఁడు. 12

ఆ. ఈల మొరసె నంతఁ గోలాహల మడంగె, బండికదలెఁ గాని భయము నన్నుఁ
దలఁగ నొల్లదాయె దయనీయు వీని ర, క్షింపు మని హరిన్ భజించుచుంటి. 13

గీ. ఎడనెడ న్విస్ఫులింగంబు లదరుకంట, వాఁడు ననుఁజూచిచూచి యావచ్చువీట
దిగినపిమ్మట నీపాట్లు దేవుఁ డెఱుఁగు, రమ్మురమ్మని పెద్దయార్వం దొడంగె. 14

క. అతఁ డెంతయెట్టివాతినఁ, బ్రతిభాషణ మీక యేమిపాపం బిది నా
బ్రతుకునకు న్నిండినదో, శతాబ్దపరిమాణ మన్నశంకం బడితిన్. 15

వ. ఇట్లెటసంజ విరియువేళకు స్టాండర్డన్‌లోఁ గాలుమోపి యందు హిందూసోదరులం గొందఱఁ బొడఁగనినంతన ప్రాణమ్ములు లేచివచ్చి యేను దేఱుకొనుచుండ వైళంబ వారు న న్నంటసిల్లి ప్రసాదమృదూకృత విలోకనమ్మున బఱపి పయనంబు సుఖదంబుగాఁ జాగెనోటు – నీమే లారయుపొంటె మే మేతెంచినవార – మబ్దుల్లా నీరాక మా కెఱుకువ సేయుచుఁ దంత్రీవార్త నంపినవాఁడు – రమ్ము రమ్మని న న్నెంతయు నలరించి యీసాహాజీసెట్టి మళిగకుం గొంపోయి నాపడిన పాట్లెల్ల నూఁకొని పెల్లుదురపిల్లి మున్ను తా మనుభవించిన యంగద లనేకంబులు వినిచి న న్నూఱడిల్లఁజేసి – రంత నశ్వశకటవ్యాపారసంఘు ప్రతినిధికిం గడచినదుండగం బెల్ల వెల్లడించుచు నొక్కదీర్ఘలేఖ వ్రాయ వాఁడు మీ రెల్లి పయనించుతఱి నెల్లరతో పాటు శకటాంతరాళంబునం దధివసింపవచ్చు – మిమ్ముఁ గాఱియపెట్టి నతండు రేపురాఁ–దని ప్రత్యుత్తరం బంప నాయుల్లంబు కొండొకశాంతి ననుభవించె – నన్నట్లు బాధించి పరాభవించిన యాతెల్లవానిపై నభియోగమ్ము దేరఁ దలంపు వొడమమింజేసి యా గ్రంథ మానాఁటితోడన తీఱుగడకు వచ్చె – నమ్మఱుసనాఁడు నిరుపద్రవమ్ముగా జోహాన్సుబర్గున దిగితి – నుదారుండగు నబ్దుల్లాసెట్టి పంపిన తీఁగవక్కాణంబుకతన నచటి భారతీయవర్తకప్రముఖుఁడగు కమరుద్దీను తనసేవకుని నాకొఱ కంపెఁ – గాని వాఁడు నన్నుఁ దెలిసికొనం జాలమి నే నొక్కపూఁట కూటింటికిం జని బస నర్థించుదుం దదధికారి నన్నాపాదశీర్షమ్ము పరికించి యాదరంబు వెల్లివిరియ గదులు నిష్పాంధమ్ములు లే వనిపల్కి నమస్కరించి కృతగమనుం డయ్యె – నవ్వల నాకడ నున్న విలాసమ్ము నూఁతఁగాఁ గొని కమరుద్దీను విపణికిం జని యందు నారాకం బ్రతీక్షించు నబ్దుల్‌గనీసెట్టిం గనుడు **16**

క. అతివేలం బగు మన్నన, నతండు నన్గారవించె నబ్బసగాథన్
శ్రుతి వైచినంతఁ బరమా, ద్భుతమ్ము నావిష్కరించి బోరన నవ్వెన్. **17**

మం. మఱియు న న్దిలకించి మనకు నిందున్న, యన్నవిక్రయశాలలందుఁ జో టుండు
నని యెట్టు లూహించితయ్య సోదరుఁడ, యెఱుఁగ విమ్మహిలోని యిబ్బందు లీవు
ధనసంచయముమీఁది తగులమ్ముచేత, భరియింతు మే మెన్ని బన్నంబు లైన
యుష్మాదృశులు నిల్చు నుర్విగా దిచటు, నేటాలుసీమ నుండెడిబాధ లిట్టి
వల ట్రాన్సువాల్‌పీడ లవి దుస్సహములు, బాపురే కడగండ్లపా లౌదువేమొ. **18**

వ. తేపు నీవు ప్రిటోరియాకేగు పొగబండిలో మూఁడవతరగతిపెట్టె నెక్కి చనుట తప్పదు – ప్రథమద్వితీయశ్రేణులు భారతీయులకు దురారోహమ్ము – లనవుడు నాకు నుత్తమశ్రేణి యంద పయనించు తలంపు గల – దయ్యది దురాసదమ్మైన నశ్వశకటంబు నేర్పఱుచుకొందు – నవ్వీడు పదునెన్మిదిపరుగుల దవ్వునంద కలదు గదాయని నే నారేయిగడపి మఱు నాఁటిరేపాడి పటాటోపమ్ముమై దొరంబోలి ధూమశకటవిరామస్థానమ్మునకుం జని తదధికారిం గని ప్రిటోరియాకుం దొలిపంక్తిచీటినిమ్మని వినయమ్మునం గోర **19**

గీ. అతఁడు మధ్యాహ్నభపట్లఁ గట్టాదరంబు, మెఱసి శకటాధికారి ని న్నుఱనినాఁడు
వీధికిఁ దృతీయకు న్నీవు వెడలుదేని, నిపుడ నెఱవేర్తు భవదీయ మీప్సితంబు. 20

గీ. నిన్ను సౌజన్యరాశిఁగా నిశ్చయింతు, నభిలషించెద యుష్మత్ప్రయాణసుఖము
చిక్కుదాసిన మమురచ్చకెక్కఁజేయ, కనుచు నాకోర్కి దీర్చె సాధ్వగ్రయాయి. 21

ఆ. ఏటికోళ్లతోడఁ జీటి గ్రహించి మీ, పలుకు పసుపువోలెఁ దలఁతు నంటి
న వ్విశేషమెల్ల నబ్బుల్‌గనీ సూచి, ముక్కుమీఁద వ్రేలు మోపుకొనియె. 22

గీ. కదలెఁ బొగబండి ఘట్టముల్ కడచుచుండెఁ, జీట్లుపరికించువాఁడు న చ్చైరవచ్చెఁ
బొదము మూఁడగుపంక్తికిం బొద మటంచు, విరిసినల్కను జుట్టనవ్రేలు సూపె. 23

క. పదపడి నాచీటిం గను, మిదిగో యని తా వచింప నెదియుండిన నే
మెదురాడక యచ్చోటికిం, బదపదమని వాఁడు మండిపడ్డాఁ డయ్యెన్. 24

గీ. శ్వేతముఖుఁ డొక్కరుండు నాచెంత వచ్చు, నాతఁ దవ్వానిమాటకు నడ్డదగిలి
యేల యీసాధుతామూర్తి నేఁతు వితని, చెంతఁ గలదుగదా మేలిబంతిచీటి. 25

క. ఏచింతయులే దీ విమ, లాచారునితోడిపోవు టబ్బిననాకున్
నీచేష్టిత మిది విడువం, జూచుట తగునంచు వానిచుఱు కడఁగించెన్. 26

క. ఆసుకృతి నన్నుఁగని నీ, కేసందియమేని వలవ దియ్యాసనముం
బాసి చనఁబోకు నీసహా, వాసమ్మున కేను బెద్దవలచెద ననియెన్. 27

వ. అంత నయ్యుద్యోగి ఫుల్లగిల్లినమొగమ్ముతో నీతెల్లవానింగని బానిసీనితోఁ బోక నీకభిమతంబ
యేని నాపెద్ద లేమిచెఱపోయి రని సణుగుకొంచేగె - నంత మాశకటంబు రేయోగిరమ్ము
వేళకుం బ్రిటోరియాపురప్రవేశ మొనర్చె. 28



## 10 ప్రిటోరియాలో మొదటినాఁడు

క. అచ్చట శకటంబును డిగి, యెచ్చటికిం బోదు నెవని నేమడిగిన నే
యొచ్చెం బొదవునొ యనుభయ, మెచ్చున్ నిలుచుంటిఁ బథికు లేగెడుదనుకన్. 1

క. నావెఱ్ఱిచూపు లొక నీగ్రోవాఁ డవగతమొనర్చుకొని నన్గని మీ
రీవీటికిఁ గ్రొత్తలుగా, భావించెద నిందు మీకు బంధులు గలరా? 2

క. లేరని యూహించెద నా, తో రం డొకవసతిఁ జూపుదు నటం చనుకం
పారాశి యగుచుఁ బల్కెడు, బోరనఁ గేల్మోడ్చి వానిపోయెదు వెంటన్. 3

సీ. నడతెంచునన్ను జాన్సనుపాలితం బైన, యన్నవిక్రయశాల కతఁడు చేర్చి
నా యుదంతము సెప్పఁగా యజమానుండు, నన్నుఁ బేర్మిమైఁ జూచి నల్ల తెల్ల
వింగడంబులు నే నెఱుంగన కాని మా, బస కేగుదెంచెడిబాటసారు
లెల్లరు నాంగ్లేయులేయౌట నిను వారి, పజ్జనిల్పినఁ బరాభవము సేఁత

గీ. గాఁ దలంచెదరో లేచిపోదురో వ్ర, ధాకలఁత లేల భోజ్యమ్ము నీకు నీదు
సజ్జ వడ్డింతు దీనికి సమ్మతింతు, వె ట్లనం దలయూఁచియే నట్లయంటి. 4

క. అవ్వల నోవరికిం జని, బువ్వకు నెదురెదురుసూచుప్రొద్దున జాన్సన్
నవ్వుచు నస్గని వారికి, నివ్వేఱిమి యింపదయ్యె నేతె మ్మనియెన్. 5

గీ. అతనికి ధన్యవాదమ్ము లప్పగించి, యతిథిబృందమ్ముతో నన్న మారగించి
యంద శయనించి వేఁబోకయగుడు లేచి, యదుగుసాగించినాఁడగమ్యంబుఁ దఱియ. 6

ఆ. నడిచి నడిచి కదిసినాఁడ మాజగదమ్ము, నడుపుచున్న మేటిన్యాయవాది
నతఁడు బేకరాఖ్య నలరారు సౌజన్య, ఘనుఁడు ధీమదగ్రగణ్యుఁ డగుచు. 7

సీ. ఉచితమర్యాద నభ్యుత్థితుండై నాదు, చేయంటి పీఠికాసీనుఁ జేసి
కుశలానుయోగము ల్గురిసి బంధువునట్లు, బేకరు నన్ను సంప్రీతుఁ జల్పి
నాకథసర్వంబు నాకర్ణనమొనర్చి, కలహస్వరూపంబు దెలిపి నీకుఁ
బాడిపట్టున కేగుపనిలేద మెలిక లె, న్నే నున్న తగవిది గాన సెట్టి

గీ. తీర్పవలసిన పెక్కుసందియము లిందుఁ, గలిగెడిం జువ్వె వానికై వలయుకమ్మ
లెదురుకమ్మలు వ్రాయుట కీవు పూని, తోడ్పడితి వేని యిదిమాకు దొడ్డమేలు. 8

వ. అయ్యది యట్లుండె – నీరాక పొసంగినవెన్క రోయవచ్చు నను నూహమ్మునంజేసి యే నింతవట్టు నీకుం దగునెలవు గాలింపనైతి – నిజ్జనపదమ్మున రంగుతెగులు బెడిదమ్ముగాఁ బొంపిరివోవుచుంట నీ వెఱింగియ యుందు – కాన నినుబోఁటి కిం దనాయాసమ్ముగా వసతి సమకూరనేర – దైన నివ్వీట రొట్టెబేహారమ్మునం బొట్టపోసికొను దరిద్ర యొక్కొర్తుక కల – దాయమ్మ నీకు బసనిచ్చునని తలంతు – నాపెయింటి కేగుదము ర–మ్మని నన్నుచటికిం దోడ్కొనిచని నాకువలయు వంటకమ్ము నొసంగున ట్లామె నీకొల్పె – నతండు న్యాయవాదియ కాక వీనుమిగిలిన మతప్రచారకుండునై వెలయు. 9

క. ఈనాఁ డతండు న్యాయ, స్థానవ్యాపృతిఁ దొఱంగి సంతతదీక్షా
ధీనతమై నప్పుడమిం, బూనెం గ్రైస్తవమతప్రబోధ్ధృత్వవిధిన్. 10

క. భోగత్యాగక్షమ మగు, శ్రీగల దాతనికి దీనచింతామణియై
సాగించు న్మనుగడ నతఁ, డీగడెకు న్నడుచు మాకు నిటునటుఁ గమ్మల్. 11

క. స్వకమత పారమ్యమ్మును, బ్రకటించు నతండు పంపు ప్రతిలేఖమునన్
మకరంద మధుర వాచా, నికరాధీనమ్ము హేతునిచయం బలరన్. 12

క. భగవత్ప్రియనందనుఁ గా, జగదుద్ధరణక్రియా విశారదుఁగా న
మ్మిగ నిల్పియెతఁడు క్రీస్తుం, బొగడ్తగావించు నతఁడవో ముక్తుఁ డనున్. 13

వ. మా పరిచితిప్రారంభమ్మునంద మతమ్మొదెస నీతలంపేమని బేకరు నన్నడుగుడు జననముం బట్టి హిందువంగాని తన్మతపరిజ్ఞానమ్ము నాకడసున్న - పరధర్మవేత్తృత్వమన్న నదియుఁ గడుంగడు నిప్పచ్చరంబు - నా కెందు నమ్మికగలదో వాక్రువ్వనయితి గాదు - నామతమ్ము న్గతిచి వలయు గ్రంధమ్ములు చదువం దలఁచితి - నవ్వల నించించుక లాఁతిమతమ్ములం బరికింతు - నని యేను విన్నవింప నతండు నాపల్కుల కలరి నాయెడం బ్రసాదమేదుర మ్మగు చూడ్కి నిగిడించి 14

క. ఇచటం గ్రైస్తవధర్మ, ప్రచారకసమాజ మొందు భాసిలు నేత
న్నిచయంబున ముఖ్యుఁడనై, పచరించెద నేను దత్త్వపరతంత్రమతిన్. 15

గీ. ప్రార్థనాగార మొక్కఁ డీపత్తనమ్ము, నందు నెలకొల్పి నేమమ్ము ననుసరించి
దానఁ గావించుచుందు మతప్రసంగ, మించుకయు వర్ణ వైషమ్య మెఱుఁగ నేను. 16

క. ననుబోఁటి మతవ్యాపృతు, లనేకు లిందున్నవార లన్వహము జగ
జ్జనయిత్రారాధనమున, కెనిసెద మమ్మందిరమున నెల్లర మర్థిన్. 17

క. నీ వచ్చుటి కేతెంచిన, వావిరిగా సంతసింతు వారికి నీకున్
గావించెదఁ బరిచితి సం, భావింతురు వారు నిన్నుఁ బ్రమదస్ఫాతిన్. 18

క. హిత మెంచి నీకొసంగెదఁ, గతిపయ మతపుస్తకప్రకాండము లందున్
నుతిగన్నది బైబిలు సు, మ్మతిరక్తిం దానిఁ జదువ నర్థింతు నినున్. 19

వ. ఇట్లనుటయు నేనతనికి న్గిడిగిళ్ళువెట్టి తప్పక మీయుపాస్తి కేతెంతు - భాగవత సందర్శనమ్ము వాంఛనీయమ్ముగదా - యని విన్నవించుడు నతం డుబ్బి యెల్లి నీ రాకకు నిరీక్షింతు - నొంటిగంటవేళ కిటకు వత్తువే నిర్వురముంగూడి వేఁడుకోలున కేగుదము - నావుడు వల్లె యని వానివీడుకోలు వడసి బసకేగి యప్పేదరా లొసంగినయాకుబువ్వం దనివోవ నారగించితి - నాపె సాధుశీలయగుట నే నచిరకాలమ్మునంద తదీయాదరమ్మునకుఁ బాత్రుండనైతి - నట్లు మెసవినపదంపడి 20

క. పయనించితి నబ్బుల్లా, ప్రియమిత్రము నొకనిఁ జూడఁ బెద్దయు వేడ్కన్
దయమై నతఁడు సదాభవ, దయమ్ము నర్థింతు నోద కని మన్నించెన్. 21

మం. అంతట నె(త్రుంr(బొ ద్దగుడు నిల్సేరి, సాపాటొనర్చి సజ్జను సెజ్జ నెక్కి
బేకరు నన్నిట్లు ప్రేమించు టేల, యితనిమి(త్రులచెల్మి నెఱుక యెం తబ్బు
నేపాటి తెలియుదు నేసుమార్గంబు, మఱియు హిందూధర్మమర్మముల్ దెలుపు
గ్రంధమ్ము లెట్లు నా కైవసం బగును, నామతం బెఱుంగనినాం దన్యమతము
బాగోగు లెబ్బంగిం బరికింపనేర్తు, నని తలంచుచు నిద్ర కగ్గపద్దాండ. 22



# 11 క్రైస్తవ పరిచితి

వ. అంత నమ్మఱుదినమ్మున బేకరువెంట వేందుకోలున కేగి ప్రార్థనామందిరమ్మునం గోట్సు మున్నగు పురుషులతోడను హారిస్‌లోనగు మగువలతోడను బరిచితి నార్జించి వారితోపాటు నేనును మోంకరిల్లి జగదీశ్వరుం గొసరితి – వారు ప్రపన్నులై 1

క. మాకుం జూపినమార్గము, మా కొసంగినశాంతి నేంటి మానెయ్యరికిం
జేకూర్పవే ప్రభూ! కరు, ణాకర! లోకైకనాథ! యార్తశరణ్యా! 2

సీ. అని యేసునాథుని గొనియాడి రం దనా, విలచిత్తవృత్తిమై వెలయుకోట్సు
నాదెందమును జూఱలాడె మా కల్లల్ల, గాటంపునేస్తమ్ము నాటుకొనియె
నతనితో దొరసి వాహ్యాళిసాగించితి, నతండిచ్చు పుస్తమ్ము లాదరమునం
జదివితి నవి యేసు జగదీశు నద్వితీ, యావతారం బని, దేవునకును
గీ. మనుజునకు సంధిసంధాత యని వచించు, టేలొకో నామనమ్మున కింపదయ్యె
నన్ను నమ్మింపం గోట్సు నానావిధాల, యత్నముం జల్పె నిర్వేల మైనకూర్మి. 3

క. నామెద వ్రేలెడు తులసీ, దామం బొకనాండు సూచి తా వగచి బలా!
ధీమంతుండ వీ వేటికిం, బ్రేమించెద విట్టి యంధవిశ్వాసములన్. 4

క. నినుబోంటి కిట్టివేదుఱు, చనునా యిటురమ్ము రమ్ము సరమును దలంగిం
తు నటంచుం దెగడ నిది మ,జ్జనని యొసంగిన మహాప్రసాదం బనితిన్. 5

వ. అంత నతం డిది రక్షకంబను విశ్వాసమ్ము నీకుం గలదా – దీని మహిమం బేమి – యని పృచ్ఛసేయుడు 6

గీ. ఏతదీయప్రభావ మే నెఱుంగకున్న, నస్మదభ్యుదయావాప్తి నభిలషించి
నిర్మలప్రేమమైం దల్లి నిలుపుసోంగుం, దొఱంగంజాలను దగిన హేతువులు లేక. 7

ఆ. తనకుఁ దాన త్రెస్సి తావళమిది నాదు, నురముపొత్తువలన నుదుగునాఁడు
వెండి తులసిదండ విలుచుట కే నొల్లఁ, గాని దీని నేఁ దగౌరవింప. 8

క. అని నాపల్కినపల్కులఁ, దనివోక యతండు సంతతము ననుఁ దెలుపం
బని పూని యేసుధర్మమె, యనవద్యము సేవనీయ మనిబోధించెన్. 9

వ. మఱియు నతండితరధర్మములం దించుకనిక్కమున్నను గ్రీస్తుమతమునంద సమగ్ర సత్యమ్ము వెలయుననియు – దాని నవలంబింపనినాఁడు నిర్వాణంబు శశవిషాణం బనియు వేల్పు మానుసులనడుమ నేసునాథునిబాసట లేకున్న దురితనిబర్హణంబు సుసాధము గాదనియు సుకృతకర్మాచరణంబుచే నావంతయు లగ్గువొడమ దనియు వాదాడి నన్ను నమ్మింప సర్వథా శ్రమంపదుచుండె – నతని వలన నాకుం బరిచితులైన క్రీస్తుమతానుయాయులలో నొకండు నన్నుఁగని మనము పాపులము – దురితమ్ముసేఁత మన కనివార్యంబు – దుర్భరంబగు దానిఱ్ఱేఁగునెల్ల నఘవిదూరుండు నీశ్వరపుత్త్రుండు నగు నేసుపైఁ బెట్టవలయు – నతఁడ మోక్షదాతయని విశ్వసింపవలయుఁ – దన్ను నమ్మినవారు వీతకిల్బిషు లగుదురని యే సభయం బొసంగె – వాని యౌదార్యమున కిది మాదల – వాఁడ శరణ్యుఁ దనుప్రత్యయ మ్మొవనికిఁ గలదతండ సమగ్రశాంతి కధికారియగుఁ – బాపంబునకు వెనువెంటన పాచితంబు వలయు నని నీవందు – విట్లైన జీవితమంతయుఁ బ్రాయశ్చిత్తవిధులతోఁ జెల్లుఁ – దెగుదలలేని యాకర్మపుంజమ్ముకతన నినుబోఁటికి శాంతిసమకూడునా – మఱి నిశ్శ్రేయసమబ్బునా – యని పల్కుడు నతనిధోరణి నాకు రుచింపమింజేసి వానిం బొడఁ గని 10

ఆ. ఏసుమతముఁ గొల్చునెల్లరు నీపల్కు, లనువదించువార లగుదురేని
యేను దన్మతంబు నించుకయును విశ్వ, సింపఁ జాల గౌరవింపఁ జాల. 11

క. కలుషాపాదకవృత్తిని, దలఁగన్ జతనం బొనర్చెదను గాని యఘం
బులు సల్పి తత్ఫలంబులు, వలదని పరమేశ్వరస్తవం బొనరింపన్. 12

క. పాపమ్మువలన నంపహో, వ్యాపారమువలనఁ బాయునంత కశాంతిన్
దాపితుఁడనై యలందురు, టే పెద్దయు వలతు నంటి నెంతయు నోర్మిన్. 13

సీ. అనవుడు నతఁడు నిరర్థకాలాపమ్ము, లుడిగి నాపల్కినసుదుల నెల్ల
వారక తలపోయవలయు నటంచు నె,చ్చరికించెఁ; గటకటా జంకులేక
యేనస్సు లొనరించు నితఁ డిట్టిక్రైస్తవు, లెందఱో లేరు కో ట్సెల్లయెడల
వృజినమ్ముసేఁతకు వెఱచుఁ గ(ప్ర)పుముక్క, వోనిదై హృదయమ్ము వీని దలరు
గీ. నితఁడు సాదనచే నుల్ల మతిపవిత్ర, మగుననుచు విశ్వసించు; నాయాశయమ్ము
లెవని దుర్వాదమునబల్మి నెట్టి వెత్తి, తలలువైచునొ యని తద్ద తల్లడిల్లు. 14

వ. ఏ నతనివెనుఁబాటు నెఱింగి నెయ్యరీ! పిడివాదమ్ము లొనర్చి మీవా రెవ్వ రెట్టిపెదదారులు చూపినను మీమతమ్మునెడ నా కలుక వొడమనేరదు - నాపల్కు విశ్వసింపు - మని వానిం దేర్చితిఁ - గాని బైబిలుతత్త్వముదెస నా కింకను గట్టి నమ్మిక నిలువదయ్యె. 15



# 12 భారతీయ పరిచితి

మం. నాఁడు ప్రిటోరియానగరమం దున్న, భారతీయులతోడిపరిచితి వలచి
సభపేర సమధికోత్సాహమ్ము వెలయ, నెల్లర నొకసెట్టియింటికిఁ జేర్చి
యామాటలీమాట లైనతర్వాత, నొసఁగితి వారికై యుపదేశ మొండు. 1

వ. నామనుగడయం దదియ మొదటియుపన్యాస మగుట దానికి వలయు పూర్వరంగమ్మున కెంతేనిశ్రమించితి - నందు వక్తవ్యము సూనృతవ్రతం బాయె - బేహారి సత్యమ్ము సాగించుట దుశ్శక మనియు వణిజ్యాసూనృతంబు లితరేతరవిరుద్ధంబు లనియుఁ గొంద ఱాపణికులు నాకుం బలికి - రమ్మాటలదెస నాకు నాఁడునునేఁడును విస్రంభ మొదవదాయె - నా ప్రసంగమ్మున దీని మివులఁ జర్చించి 2

క. సూనృతము బేరమునకుం, బ్రాణము వాణిజ్యమూఁది బ్రతికెడితగులం
బేనరునకుఁ గల దాతఁడు, పూనికమై సత్యసేవ పొనరుపవలయున్. 3

క. పరభూముల వర్తించెడి, తరుణంబున సత్యనిష్ఠ తద్దయు వలయున్
బెఱలు మిముఁజూచి భారత, నరశీలవినిశ్చయం బొనర్తురు గానన్. 4

ఆ. అని హితమ్ముగఱపి యైకమత్యమ్మున, మేలు వెలువరించి మీకు సంఘ
మొకఁడు వలయునంటి నుద్యోగులకుమిమ్ముఁ, గలఁచువెతలఁదెలుపవలయునంటి. 5

క. మీసమితి కేనువిత్తము, నాసింపక సాధనీయ మగునూడిగముం
జేసెద నంటిని మదుప, న్యాసం బది నిలువరించె నయ్యోలగమున్. 6

క. చాగెం జర్చలు సభ్యులు, మాగొడవల్ వినుఁ దటంచు మన్నించిరి న;
న్నాఁగంగవలయు నీదు, ర్యోగంబులు నన్నకోర్కి యొదవెన్దనకున్. 7

ఆ. ఇంగిలీసుప ల్కెఱింగినవారల, మ్మనుజులందుఁ బెక్కుమంది లేమి
నీడుముదిరియున్న నోడక మీ రాంగ్ల, వాణి నభ్యసింపవలయు నంటి. 8

క. లాఁతివిలాఁతుల నున్నపు, దేతద్భాషానుభూతి యెంతయు వలయున్
బ్రీతిం గఱపెద నప్పలు, కేతేరుఁడు నావసించునిరవున కంటిన్. 9

క. ఒకమంగలి యొకలేకరి, యొక యన్నువబేరగాఁడు నుత్సాహంబుం
బ్రకటించిరి శిష్యత కి, య్యకొంటి సమ్మదము గదుర నాచార్యకమున్. 10

వ. వారికి నెసలిక లేమింజేసి యేన వారిమనికిపట్టుల కేగుట వలసె - నాయంతేవాసు లెంత పరాకువడినం గినియక యెబ్బెతికము సెందక నావిధిం బాటించితి - బోధన కౌశలంబు నాపాలి దనుట యతిశయోక్తి కాదుగదా - యేదెన్మిదినెలలకు వా రాంగ్లమ్మునేర్చి దత్భాషా బలంబునఁ దమబేరసారమ్ముల నిరాతంకముగా నడిపి విత్తముం బురాధికమ్ము గడింపఁ జాలి - రిప్పరిణామంబు నన్నుం బరితుష్టుఁ గావించె - నిది సభలవలనిమే లగుట నవి నియమపూర్వకమ్ముగాఁ బ్రతిమాసమ్మున జరుపం బడుచుండె. 11

క. ఏతాదృశీ సమజ్యలు, హేతువులై భారతీయు లెల్లరతో సం
గాతమ్ము పొసఁగె నా కపు, డాతురతయుఁ బొడమె వారియంగద లడఁపన్. 12

వ. కావుటంజేసి ప్రిటోరియానగరమ్మునం దున్న యాంగ్లప్రభుత్వ ప్రతినిధితోడి పరిచితి నభిలషించితి - నతనికి భారతీయులపట్ల నాదరమ్ము కలదు - కాని వానిమాట కచ్చోటఁ దగిన విలువ లేకుండె - నతండు వలయుతతి నీకుఁ దోడ్పడుదు నని న న్నాశ్వసించి భారతీయులకుం జెందిన కొన్ని రాజకీయపత్రమ్ములు నా కొసంగె - వానిం జదివినపదంపడి ట్రాన్సువాల్ ఫ్రీస్టేటులకుఁ బొగబండిలో వలయు సౌకర్యముల స్గుతిచి తదధికారులతోఁ గొంతగ్రంథమ్ముజరిపితిఁ - గాని దానిఫలిత మసంతృప్తిదాయకంబ యయ్యె - నాయభియోగము న్మగించుకొని యేఁడాదిలోపల నిలుసేర నెంచిన నాపట్ల నిశ్వరేచ్ఛ వేఱగుటం జేసి నా కర్తవ్యమ్ము లిట్లు పొంపిరివోవఁదొడంగె. 13



## 13 కూలితనము

మం. ట్రాన్సువాల్ ఫ్రీస్టేటు రాష్ట్రమ్ములందు బ్రదుకు నీడ్చుచునున్న భారతప్రజల
దురవస్థలెల్ల నిందు వచింపఁజాల, నెఱుఁగనెంచినవార లేఁబల్కినట్టి
యాఫ్రికాసత్యాగ్రహచరిత్రఁ గంద్రు, ఫ్రీస్టేటువారు నిర్మించినచట్ట
మదఁగించె భారతీయప్రజాస్వేచ్ఛ, నాశమ్మొనర్చె హైన్దవగౌరవమ్ము
బానిసతనముమై బ్రదుకుట తక్క, భారతీయున కొండుపని చెల్ల దిచటఁ
బాలకు లొకకట్టుపాటు గావించి, పాతిక పరకఁగా బ్రతిఫలం బొసఁగి
తతిమివైచిరి భారతవణిక్కు నకట, యికఁ డ్రాన్సువాల్ రాష్ట్ర మేలెడువారి
పను పది సభ్యప్రపంచగర్హ్యమ్ము, తద్దేశమందుఁ బాదమ్మును మోపు
భారతీయుం డైదుపదులరూప్యమ్ము, లరివెట్టవలయు - గేహమ్ము క్షేత్రమ్ము

నార్జింపఁజన దిష్టమగుచోట నీతఁ, డెన్నికలందు లే దితనికిం జనవు
పదుగురు పయనించుపద్యలో నడుచు, నధికారమును వీని కందనివరమ
కటకటా! తొలుజాము కదచన్న వెన్క, నిలువీడి పోవరా దితఁడు రే(పొద్దు
పోకతప్పనికస్తి పొసఁగినవేళ, నధికారు లయ్యకో లార్జింపవలయు
నిట్టిపోరాముల కిల్లైనచోట, గుణరత్నరాశితోఁ గోట్టుతో బెరసి
నిశలందు వాహ్యాళి నెఱపి యే నున్కి, పట్టుఁ జేరుచునుందుఁ బదిగంటలపుడు
రారానివేళ నారాక నీక్షించి, రక్షకభటుఁడు నన్ అట్టుపాల్సేయ
మద్గౌరవంబు నెమ్మయిఁ గాచుకొందు, దైవమా యని యేను దల్లడంపడితి
నాకంటె నీచింత నలఁగెను నెయ్యుఁ, డతఁడు నన్ బంటుగా నంగీకరించి
తనచెంత నడియరితనమువై బ్రదుకు, నీగ్రో కొసంగెదు నెఱి నూఁది నాకుఁ
జీటి నిచ్చెనయేని చిక్కురాకుందుఁ, గోట్టు దీనికి నొప్పుకో లెట్లుసూపు
నిట్టి తెక్కలిచేఁత కే నెట్లుసైతు. 1

వ. కావుటంజేసి తగినయనుమతిపత్రమ్ము వదయఁ గోట్టువెంట దొరతనమ్మువారి న్యాయవాది
యగు క్రౌజునొద్దకుం జేరుదు నయ్యధికారి 2

సీ. అలనాఁడు నాసహాధ్యాయుఁడై సీమలో, న్యాయశాస్త్రాభ్యసనం బొనర్చి
నతఁ డయ్యె; నొఱగడ్డ మాలించి మామకం, బచ్చెరుపడె లెస్స నొచ్చుకొనియెఁ
జీటి నీనొల్లక చేయుత్తరం బిచ్చె, నిచ్చవచ్చినవేళ నేగు మనుచు
నెయ్యమ్ము తియ్యమ్ము నింపి విందొనరించె, నపుడప్డు కలసికొ మ్మనుచుఁ గొసరె

ఆ. రేవగల్లు రక్షరేకువిధమ్మున, నెంచి దాఁచుకొంటి నితనికమ్మ
దాని వెలువరింపఁ దగినంత దురవస్థ, కలుగదయ్యె దైవఘటనఁజేసి. 3

గీ. నాకుఁ గడుఁగూర్పు నెయ్యుఁ డైనాఁడు క్రౌజు; పరిచితియు నబ్బె వీనిసోదరునితోడ
నది మదీయప్రజాసేవనావసరము, నందుఁ గొండాడఁదగిన సాయం బొనర్చె. 4

వ. అయ్యది యట్లుండె – నీ రాష్ట్రంబున నల్లజాతులవారి కాలితెరువుపోకకుం జెందిన చట్టమ్ము
నాపట్ల నెంతయుం జెట్టగూర్చె నొక్కనాఁడధ్యక్షుఁడగు "క్రూగరు"భవనమ్ము ముందుగా
వయాళికిం జనుచున్నన న్నచటికావలికాఁడు జాడవలనం దొఱఁగు మని యెట్టియెచ్చరి
కయు నొసంగనివాఁడు 5

క. కన్నెఱ్ఱచేసి చెటచెటఁ, దన్నుచు వెన్నాడ నాదుతనువు న్మనమున్
విన్నఁబడెన్ దీలుపడెన్, నన్నుంగనె నపుడ కోట్సు నదవంజనుచున్. 6

క. నాపదుబన్నంబున కతఁ, డాఁపంగారాని వనటనందుచుఁ గోపో
ద్దీపితుఁ డగుచును గాంధీ!, యీపాలసు రచ్చకీడ్చుటే కర్జమనెన్. 7

క. ఇతనియఱగొద్దెమెల్లఁ జూచితిని గాన, సాక్షిగా వచ్చి నీకునే సాయపడుదుఁ
బొమ్మపా మ్మభియోగముందెమ్ము వీని, విడువఁదగదంచు ననుకంప వెల్లిగొలిపె. 8

వ. పదంపడి యే నయ్యేసుభక్తునిం గని 9

ఆ. ఖేదరోషములకు లే దిందునెల వయో, యీతఁ దేకొలందియెఱుక గలఁడు?
నల్లమేనివార లెల్లరు నీలెంక, కొందె కాక భేదముందునెట్లు? 10

క. ఈతఁడు నను మన్నించిన, రీతిని నీగ్రోల నాదరించుట నిక్కం
బీతామసమ్ము సైఁపక, యేతెఱఁగునఁ ద్రెస్సి రచ్చకెక్కుదుఁ జెపుమా! 11

క. నమ్మము న న్నెవఁ దేక, స్తి మ్ముంచినఁ బాడిపట్టుదెసకుం జనఁగా
సమ్మతిపడ నది నా శప, ధమ్ముసుమా యనుదుఁ గోట్సు తా విస్మితుఁడై. 12

క. నీపాటమాని యించుక, నాపల్కు పునర్విమర్శనమునకుఁ దెమ్మా
కాపురుషుల కీదృశులకుఁ, జూపందగు నొక్కమాఱు చుఱుకుందనమున్. 13

వ. అని నన్నుఁ గసరినవెన్క నబ్బంటుపై నిప్పులు చెరుగుదు నతండు వెలుకంబాతి సిగ్గు ద్రేఁగున భయభరమ్మున నెన్నఁడో తన్నుమన్నించిన నన్నుంగని వీఁడు క్షంతవ్యుండని యేటికోళ్ళు చెల్లించె - నవ్వల 14

గీ. భారతీయులఁ గలఁచు నీదారిచట్ట, మెన్నఁటికి నెట్లు తొలఁగునా యన్నతలఁపు
లతిశయించెను గాని నా కపుడు సెట్టి, తగవుపని ముఖ్యకర్తవ్య మగుట తెలిసె. 15



# 14 తగవుపని

సీ. వెలకట్టరాని జీవితము సాగించుచు, నబ్దమొందు ప్రిటోరియాపురానఁ
గడపినాఁడను విశ్వకల్యాణసిద్ధికై, కష్టించుభాగ్య మిక్కడన తనకు
లభియించెఁ దత్కౌశలంబు నిచ్చోటన, యించుకించుక గందరించె నిందె
కట్టలుదాఁటి లోకవ్యక్తనానామ, తావలోదనకాంక్ష తీవరించెఁ

ఆ. బక్షవాదివృత్తిఁ బాలింపవలసిన, చదురు కొంతకొంతయొదవి తీర్పు
నెలవుచేఁతలందుఁ గలకీలకంబు లి, త్తావునంద యవగతమ్ము లయ్యె. 1

క. నాతలఁ దాల్చిన యబ్దు, ల్లా తగవునవిల్వ యాఱులక్షలదాఁటున్
భీతిజనకంబులై గణ, నాతీతము లుండెఁ జిక్కు లభియోగమునన్. 2

గీ. అది బెహారమ్ముపొత్తున నుదితమగుట, నిన్ని మెలికలు తలచూప హేతువయ్యెఁ
దారకాణకు వలయుపత్రములు లేక, తగవు సగపాలు మాటపైఁ దగిలియుండె. 3

గీ. పత్రములు వ్రాసితినిగాని ప్రతిఫలమ్ము, ముట్టలేదని యెదిరి తా మొఱ్ఱపెట్టు
నోటిమాటలు మొదలంట బూటకంబు, లాదరింపకుఁడా యంచు నంకిలించు. 4

క. ఇరువాఁగులబేరులు బం, గరుపిచ్చుక లగుట నిల్వఁగల్గిరి ప్రజ్ఞా
పరిపూర్ణులు కీర్తిధురం, ధరులై రాణించువారిఁ దగవాదుటకున్. 5

వ. మాపక్షమ్మున బేకరు ప్రధానన్యాయవాదియై యుండె – నితఁడు గాక సొలిసిటరు నొక్కండు
కలఁడు. 6

ఆ. వారిచేతిక్రిందివాఁడనై తిరుగుచు, నెఱుఁగఁగంటిఁ బెక్కుమెఱుఁగు లపుడు
సెట్టివాదమెల్లఁ జేకూర్చి వారల, కిచ్చుచుంటిఁ బర్యవేక్షపొంటె. 7

క. ఈయది సత్యము విశ్వస, నీయం బని మదికిఁ దోఁచు నెతిగల విషయం
బే యొసఁగుచుంటి వారికిఁ, బాయనిజంజాట మేరుపడె వ్యాజ్యమునన్. 8

క. నాయిచ్చిన వాదమునం, దేయంశము వారిదృష్టి కించెనొ వర్జ్యం
బేయది యయ్యెనొ చూచుట, రేయుం బవలు న్మదీయకృత్యం బయ్యెన్. 9

వ. దీనంజేసి నాకు గ్రహణపాటవమ్మును నిర్మాణకౌశలంబును నేర్పడె నని యెతింగితి – ని
ట్లనన్యాయత్తంబగుచిత్తంబున నీవ్యవహారంబున మునింగి వలయుపత్రంబులనెల్లఁ బరికిం
చితి – మావ్యాజ్యెగాఁడగు నబ్దుల్లాకు నిశితబుద్ధియు నాదెసం బరసీమలుదాఁటిన ప్రత్య
యమ్ము నుండుకతన నాకావించుకృత్యంబుల కెంతేని సౌలభ్యం బొదవె – యథార్థవస్తువే
ముక్కాలున్యాయంబని పిన్నట్టు నుడివిన పల్కుపుడు నాతలఁపునం బాతి సర్వాంగీణ సూనృతం
బగు మాయభిగ్రహంబు కామక జయంబువదయునని విశ్వసించితి – వెండియు 10

ఆ. ఈవివాద మిట్లు దైవాఱుచో నొక్క, పట్టణమున నిల్చుచుట్టములకు
నేల తొలఁగఁబాఱు నిరువీళ్లవారికి, సర్వనాశ మని విచారపడితి. 11

క. వాదిప్రతివాదుల కపు, డేదైవం బావివేక మిచ్చెనొ పోరం
గాదని నెయ్యమ కుశలా, పాదకమని విశ్వసించుభావం బొదవెన్. 12

వ. ఏ నద్దానియీగడ నెతింగి 13

చ. తలకొనుదెంచువేడ్క నల తైయబుసెట్టిని నిల్వరించి యీ
యలమటలేల యెవ్వఁడు జయంబును గాంచునొ యెవ్వఁ డోడునో
తెలియద సాధుశీలుఁడగు తీర్పరి నొక్కని మధ్యవర్తిఁగా
వలచుట మీకు సర్వశుభవత్తకు మూలమటంచుఁ దేర్చితిన్. 14

గీ. వాది కతనికి బహుళార్థవత్త యున్నఁ, బేరు పేరందినట్టి బేహార మున్న
వారి విత్తాపగల్ వఱువట్లుపోవఁ, బెరుఁగఁజాగెను బాడిపల్కరులముదుపు. 15

క. వెచ్చమునకంటె తొడ్డుగ, మచ్చరములు రేఁగి మదులు మంగలములు కాఁ
జొచ్చె వణిజ్యాదులు చెడి, వచ్చుబడియు సన్నగిల్లె వారికి నకటా! 16

ఆ. పాడిపట్టునందుఁ బైచేయి యైనట్టి, యతఁడు మున్నుచిందు నర్థమెల్ల
మరలిరా దటన్న మాట నాయెఱుకకు వచ్చె నపుడ వెఱఁగు హెచ్చిరిల్ల. 17

క. ఇతరేతర విజిగీషా, వ్రతులై గాలింత్రు ధర్మవాదు లశేష
స్మృతులుం దీర్పులు; నాకీ, కృతిమర్మ మెఱుంగునంత నేవ జనించెన్. 18

క. దుర్విధు లీదృశములకే, నోర్వక తగవాడు సెట్ల కుభయులకును నం
తర్ద్వేషమ్యాగ్నిశిఖా, నిర్వాణ మొనర్చి మైత్రినెఱపుట కాత్మన్. 19

క. పొవులుచు నది నాధర్మం, బవునని భావించి దుర్భరాయాసములం
దవులుచుఁ గడ కెట్టెటులో, నవరించితి సంధితంత్రసంపాదనమున్. 20

గీ. వర్తకుల కిర్వురకు మధ్యవర్తిగాఁగ, నెతి నెసంగునొకండు నిర్ణీతుఁ డయ్యెఁ
దగఁ బరామర్శకావించె జగడమతఁడు, గెలుపుసిరి యబ్బులాసెట్టికేలు పట్టె. 21

వ. తీర్పు ననుసరించి ప్రతివాది దరిదా పాఱులక్షలు చెల్లింపవలసివచ్చె - నది యువ్వెత్తుగా నిర్వహించుట కడిందికర్జంబని వెఱచి యవ్వణిజుండు కొన్నిగడువు లర్థింప నతనికోర్కి ధర్మ్యంబకాన మివులఁగష్టించి యుదారుఁడగు నబ్దుల్లా నిందుల కొప్పించితి - నపుడు నాయానందము పొలిమేరలం గడచె - నిరువాఁగులవారును దమపాడిపట్టుపీడ తొలంగుట కెంతేని హర్షించిరి - మఱియు నీయనుభూతింజేసి నా కయ్యవసరంబున 22

మం. పాడిపల్కెడివారి పని తెల్లమయ్యె, సత్యమ్ము తత్త్వమ్ము సకలంబు తెలిసె
మానవప్రకృతిమర్మము లర్థమయ్యె, నచ్చశీలురచిన్నె లవికానిపించె
మొలతెంచె నరుడెందమునఁ దూఱునేర్మి, యిరువీళ్ళవారికి హితము బోధించి
పగ నడఁగించుటే పక్షవాదులకు, నుత్తమధర్మమం చూహింప వలసె
నప్పసమ్ముగ నేతదాశయంబుంటఁ, బాడిపట్టున కెక్కుపని రాకమున్న
జగడముల్ పెక్కింటి సమయింపఁగంటి, నే నిట్టినదవడి నించుటంజేసి
కలిగినకష్టమ్ము కాసంతలేద, చెడినవిత్తం బొకచిన్నమే లేద. 23



# 15 మథనము

క. క్రైస్తవులతోఁ బొసంగిన, నేస్తమ్మున నాదుమది జనించినతలఁపుల్
ప్రస్తావించెద బేకరు, కస్తిపడం దొడఁగె నన్నుఁ గ్రైస్తవుఁ జేయన్. 1

వ. అతఁ డొకప్పుడు 2

క. మతమునవిరివికి నాత్మో, న్నతికిన్ వెల్లింగ్ట నాఖ్యనగరమ్మునఁ బ్ర
స్తుతి కెంతయుఁ జాలి ప్రవ, ర్తితంబయిన గోష్ఠిఁ గాంచుతివుటం జనుచున్. 3

క. నన్నుఁ గొనిపోయెఁ బారిష, దౌన్నత్యమునూచి తన్మతాచార్యవచ
స్సన్నభ్రాంతుఁడనై తన, తెన్నున కే వత్తునని మదిం దలపోఁతన్. 4

వ. ఈతలం పెటులున్నను బేకరునకు వేఁడికోలుబల్మియ కడపటిచేవ నాఁదగు - నీశ్వర ప్రార్థనమ్ముపై నితనికిఁ బెద్దయు నమ్మిక గలదు - హృదయమ్ముతోఁ గావించు వేఁడుకోలు భగవానుండు కామ కాలకించు ననియు నన్న వస్త్రాదు లగునైహికమ్ములు సైత మిద్దాన సిద్ధించుననియు నితఁడు విశ్వసించు - నిప్పట్ల నే నొక నిర్ణయంబునకు రా నైతి కాదయ్యె - నంతర్వాణి పెరరేచినాఁ డెల్లనిరోధమ్ములన్ గ్రేణిచేసి యేసుధర్మమ్ముకొల్వున కే నోదనని బేకరుతో నంటి - వెండియు 5

ఆ. అంతరాత్మ పంచినట్టుల కావించు, టంతకంటెమున్నె యమరె నాకు
నెలమి సంతరించు నీచేఁత తద్వివ, ర్యయము కష్టమూల మార్తికరము. 6

క. కావున సందియ మందక, యీవిధి, నాతనికి మాటయిచ్చితి నవలన్
దైవాఱువేడ్క నిర్వర, మావీటం గాలుమోపు టది వట్రిల్లెన్. 7

క. ననుబోఁటి నల్లనెచ్చెలి, తనవెంబడి నుంట దుర్వ్యథావారిధిలో
మునుఁగంగవలసె బేకరు, తనర్చునుల్లసముతో నతం డది యీఁడెన్. 8

క. నా కింత మెతుకుపెట్టుట, కీకొనియెదు పూఁటకూటియి ల్లుండ దొకం
డీకొన్ననేమి యొఱగెను, బేకరుతో నారగించువీ లుండదనున్. 9

క. నెచ్చెలికాఁ డీపల్కుల, కచ్చెరుపడు నాగ్రహించు నతిథులచనవుల్
త్రచ్చి తగవాడుఁ దనపదు, ముచ్చిరితనము న్నిగూఢమును గావించున్. 10

వ. ఎంతదాఁచిన నిది నాయెఱుకలోనిద యగు - నయ్యది యట్లుండె - వెల్లింగ్టన్ సభకు నేతెంచిన క్రైస్తవు లెల్లరు నపారభక్తిసంపన్నులు ననుత్తమశ్రద్ధాబద్ధులు నాఁ దగుదురు - వారు నాయభ్యుదయమ్ము వలచి పరమేశ్వరుం బ్రస్తుతించిరి - వారి వేఁడికోలుపాటలు తేనియతేటలంబోనివి - వారినమ్మికలు నాకు నెమ్మికలుగఁజేసెఁ - గాని 11

క. నామతము నాదునమ్మిక, లీమాత్రన ప్రిదులఁజేయు టేలా స్వర్గ
శ్రీమోక్షసుఖము లేసును, బ్రేమింపనివారలకు లభింపక యున్నే. **12**

క. ఏ సాకఁదే భగవత్సుతుఁ,డా? సర్వేశునకు బిడ్డ లని యుండినాఁ
డీసర్వమనుజు లతని క,హో! సూనులుగాక యగుదురో పెఱవారల్. **13**

క. జీసస్సు దేవుఁ డగుచో, నీసకలమనుష్య లెవ్వ రీశులుగారా?
యేసు తనరక్తధారలఁ, జేసి కడుగునొక్కొ జగముచేయునఘంబుల్. **14**

గీ. మనుజునకుఁ దక్క మృగ పశు మత్స్య నీడ, జాదికప్రాణికోటికి లేదె యాత్మ
చావుతో వీనికథ మాసిపోవునోటు?, సకలజంతువు లీశ్వరాంశములు గావొ. **15**

వ. ఇట్టిసందియమ్ములు పెక్కులు నన్నుఁ గలంచె - నీతలంపులం గ్రైస్తవమిత్రుల చెవిని వైచి నంతన వారిగుండె గుభిల్లుమనియె - నేసు వితరణఖని మహాత్ముఁడు దేశికవర్యుండునని యొడంబడుదుఁ గాని యతం దద్వితీయపురుషం దనఁజాల - లోకమ్మున కతనిచా వొకమేటితారకాణ యగుఁ-గాని దానియం దద్భుతజనకంబగు నొకప్రభావము నిగూఢ మ్మగా నున్నదనినమ్మనేర - నన్యతరమతమ్ములం గానరాని మహీయస్త్వంబు క్రీస్తుధర్మంబున గోచరింపదయ్యె - వితరణంబునందును హిందువులు క్రైస్తవుల నతిక్రమించినవార యని తెలిసె - ని ట్లేసుధర్మంబు సమగ్రంబని సర్వోత్కృష్టంబని విశ్వసింపలేకుంటిఁ - గాని హిందూధర్మమేని తాదృశంబని నిర్ణయింప నశక్తుండనైతి - నేలయన **16**

మం. నాలుగువర్ణముల్ నానావిధాల, తెగలు నస్పృశ్యులౌదీను లపౌరు
షేయముల్ శ్రుతులని చెప్పెడివారు, నిందుకొన్నమతంబు నిర్దుష్ట మనుచు
నంగీకరించు టె ట్లామ్నాయ మీశ్వ, రప్రసాదితమై కొరాను కాకుండు
నేమి బైబిలుమాత్ర మిట్టిది కాదొ. **17**

వ. అది యట్లుండె - నయ్యవసరంబున **18**

క. నన్నుఁ దమవానిఁ జేయుట, కెన్నెన్నోశ్రమల కొగ్గి రేసుమతమువా
రిన్నెతి నూఁదియ నిజధ, ర్మోన్నత్యము సెప్పఁజాగె నబ్బులు నాకున్. **19**

క. పదపడి నాడెందమునం, దుదయించిన కలఁతలెల్ల నొకలేఖమునం
గదియించి రాజచంద్రున, కధీతవేదాంతకోటి కంపినవాఁడన్. **20**

క. అతఁడోపికమై హిందూ, మతమ్ములోఁతుల నెఱుంగుమా యని మతసం
తతిలో వైదికధర్మం, బతిగౌరవపాత్ర మనియు నాదేశించెన్. **21**

వ. ఇతఁ దంపిన పంచీకరణ యోగవాసిష్ఠాది కృతులం బరికించి క్రైస్తవమహమ్మదీయ ధర్మము లకుఁ జెందిన రచనలుసైతము పెక్కింటిఁ బరించితి – నందుఁ దాలుస్టాయికృతంబు "దేవునిరాజ్యము నీలో నున్నది" యను గ్రంథము నన్నుఁ బెద్దయు నలరించి నాచిత్తంబున హత్తుకొనె – నిది నన్ను నాక్రైస్తవమిత్రు లూహింపని మార్గమ్మున కీడ్చినను వీరితోడి నెయ్యంబునంజేసియ నేను ధర్మజిజ్ఞాసువ నైతిఁ – గాన వీరికి మిగుల ఋణంపడి యున్న వాఁడ. **22**



# 16 తేపెట్టిదో?

గీ. తగవుపని మూలముట్టుగా ముగియుటన్ బ్రి,టోరియా వీడి దర్బాను చేరవచ్చి
మాతృభూమికిఁ బైనం బమర్చువేళ, సెట్టి న న్నాదరింపఁగాఁ జేసె విందు. **1**

గీ. ఆటపాటలతో మధురాతిమధుర, భోజనమ్ములతో సుహృత్పుంజమంజు
గోష్ఠితో బహుమానవాక్కోటితో న,ఖండహర్షవిధాయిగాఁ గడచె విందు. **2**

వ. యాదృచ్ఛికమ్ముగా నపు డొకపత్రికం జూచుచున్నా కందొకమూల "నిండియన్ ఫ్రాంచై" జను తలకట్టుతోడివ్యాస మొండు కానిపించె – దానిం జదువ నేటాలురాష్ట్రమ్మున భారతీయు లకు శాసనసభాసభ్యుల నిర్ణయించు చనవు నీని చట్టమొకటి నిర్మింపఁ బడుచున్నట్లు తెల్లమయ్యె – నిది నాక కాక విందునందున్న మిత్రులకును నజ్ఞాతంబ – పదంపడి దీని కలరూపు నబ్దుల్లా నడుగ నతం డిట్లనియె. **3**

మం. సోదరా! బేరంపుసుద్దులు తక్క, నితరప్రవృత్తి మా కెంతేనిదవ్వు
వెలఁజూడఁ బత్రికన్ విలుతుముగాని, చట్టముల్ తెలియ మాచదు వదియెంత
ఫ్రీస్టేటువారు నిర్మించినఘోర, శాసనం బొకఁడు లక్షలదాఁటినట్టి
మాబెహారమునెల్ల మంటిలోఁ గలుపు, టెఱుఁగవే యపుడు మే మెన్నోవిధాల
మొత్తుకొంటిమిగాని మొఱ లుడివోయె, విద్యావివేకముల్ వెలితిగా నుంట
మాపల్కు నాదరింపర యధికారు, లిటఁ బక్షవాదులై యేపారుచున్న
యాంగ్లేయులే మాకు నక్షులున్ శ్రుతులు. **4**

వ. అనుటయు నీనేల నిరవుకొన్న భారతీయులలో విద్యలుగడించిన యువ లెందఱో కాన్పింతురు – మీకు వారు తోడ్పడరో–యని నే నడుగ నబ్దుల్లా నైరాశ్యపిశునవదనుండై వెచ్చనూర్చి **5**

క. వా రేసుమతము నూఁదిన, వారగుటన్ మమ్ము లాఁతివారిఁగఁ గను టా
చారము నిజ మాడినచో, వారిదెస న్మాకు గౌరవము సున్న సుమా. **6**

సీ. మఱియు వీ రిటఁ గ్రీస్తుమతబోద్ధలై యుండు, నాంగ్లేయులకు దాసులై చరింతు
రమ్మతాచార్యు లీయవనిఁ బాలించెదు, దొరలకు భృత్యులై తిరుగుచుందు
రనియె నాతనిపల్కు లవి నన్ను మేల్కొల్పఁ, బదరి యిచ్చటనున్న భారతీయు
లెల్లరు నన్యోన్యహితులై మెలంగు న,ట్లాచరించుట కృత్యమనియు నన్య
ఆ. మతముఁ గొల్చునంతమాత్రన భారతీ,యులు విజాతు లగుదురొక్కొ యనియుఁ
దలఁచి నన్ను నపుడు కలఁచినసంతాప, మెల్ల నడఁచి సెట్టి కిట్టు లంటి. 7

గీ. చట్ట మిది నెగ్గునేని యిచ్చట వసించు, భారతీయులు దుర్భరాపదలు గుదుతు
రాత్మగౌరవశూన్యులై యలమటింతు, రాఫ్రికా వీడఁదగినవా రగుదు రకట! 8

వ. అనుటయు విందు లెల్లరు దీర్ఘాలోచనానిమగ్నులై యీముప్పు తప్పింప గాంధిని నిలువరింపు
మని మాయభియోక్త నర్థింప లోకజ్ఞుఁడగు నబ్దుల్లా వారివలనికిం జూడ్కిపఱపి 9

క. నాకుంగల యధికారము, మీకుంగల దితనిఁ గోరి మేలందుటకున్
లోకహితమ్మున కీకృతి, కీకొందని వేఁడుకొంద మీసోదరునిన్. 10

క. ఇతఁడు మనకోర్కిదెస నా, దృతిఁ జూపకపోఁ దటంచు నెంచెద నైనన్
మతి నొం దరయుఁదు సేవా,వ్రతుఁ దయ్యును గాంధిన్యాయవాదిగనుంటన్. 11

ఆ. అతని కిచ్చుసుంక మది విస్మరింపక, యదుగుఁ దెట్టిసాయమైన మిత్రు
లనుదుఁ జరమవాక్య మస్మన్మనోవీధిఁ, జొచ్చి సూదివోలె గ్రుచ్చుకొనియె. 12

క. ఏ నంత నతనిఁ గన్గొని, నీనోడివినపల్కు వెఱఁగు నించు నయారే
మానవసేవకు శుల్కం, బేనరుఁ దాసించు నింతయెఱుఁగవొ సెట్టీ! 13

క. ఈయున్న పెద్ద లెల్లరు, నాయెఱుఁగనివార వీరు నా కర్మిలిమై
సాయంపద నోపుదు రని, నీయెడఁద న్నమ్ముదేని నెలనాళ్ళుందున్. 14

క. నాకుం గట్నముతోఁ బని, లేకున్నను ముద్రణమ్ము లేఖలు తంతుల్
రాకలు పోకలు నడువన్, రూకలు కావలయు నిది యెఱుంగుఁడ యంటిన్. 15

క. నావుడు వణిక్కు లేక,గ్రీవముగా నిట్లు పల్కరించి రహో బ్రాఁ
తే విత్త మీశ్వరాద్భుతిఁ, గావలసినవట్టు తానుగా వచ్చిపడున్. 16

త. ని న్ననుసరింప మాద్భశు,లన్నా కల రెంద ఱెందఱైనను; మమ్మున్
మన్నించి నీవు నిల్చిన, నన్నియు నపుడపుడ మిత్రమా! సూత్రపడున్. 17

వ. నావుడు నవ్విందుకొఱ కేతెంచిన పెద్దల తత్ క్షణంబునఁ గార్యసమితి పాలిసభ్యులుగా
మాఱి - రి ట్లాఫ్రికాఖండమునం దీశ్వరుండు నామన్గడకుఁ బునాదివైచి యాత్మసమ్మాన
సమరంబునకు వెదపెట్టె. 18

# 17 బసపెట్టితిని

మం. హాజీమహమ్మదు యాజమాన్యమున, నబ్దులాసెట్టి దివ్యాగారసీమ
నడిచినసభకు నానాభారతీయు, లరుగుదెంచి నియోజనాధికారంపుఁ
జట్టంబు నెదిరింప సమ్మతిపడిరి, క్రైస్తవయువకోటి కరముల న్గలిపె
నైచ్ఛికభటు లసంఖ్యాకు లేర్పడిరి, పిన్నలు పెద్దలు పేదలున్ ధనికు
లాశ్రితు లాశ్రయు లానాఁటిసభను, మతకులభేదము ల్మఱచి పాల్గొనిరి
విశ్వజనీనమౌ విధులకున్ దిగుట, కలవాటులేమి నయ్యాయిపద్ధతులు
క్రొత్తలై కడువింతఁగొల్పె వారలకు, నెన్నివేఱుము లున్న నెల్లర మొక్క
జననిబిడ్డల మన్న సద్భావ మొదవె, శాసనం బిపుడు చర్చకుఁ దేరవలవ
దాఁగుఁడీ! యధికారు లని తంతిపంప, నభ్యంతరమ్ముల నాలించుపొంటె
రెన్నాళ్ళు చర్చ వారించితి మన్న, యుత్తరం బరుదెంచి యుద్వేల మైన
సంతుష్టిఁగూర్చె మాసభకు నవ్వేళ. 1

వ. పదంపడి యే నధికారులసన్నిధి కంపఁదగిన విజ్ఞప్తి యొండు విరచించి స్వచ్ఛంద సేవకుల సాయమ్మున నొక్కరేయిలో నందు వేలకొలఁది సంతకములు చేయించి వడివడిన్ దాని శాసనసభకుఁ జేర్చితి – వెండియు నమ్మనవిపత్రము నెల్ల వార్తాపత్రికలకు నొసంగుదు నయ్యవి విమర్శనపూర్వకముగాఁ బ్రచురించి మాకుం దోడ్పడియె – శాసననిర్మాతృ మండలియం దీవిన్నపం బొకపెద్ద కోలాహలమ్మును రేఁచె – నెంతచేసిన నేమి – కొట్ట కొసకుఁ జట్ట మంగీకృతంబ యయ్యె. 2

క. మాజతనమెల్ల నిట్లు ప, రాజిత మగు టేమియబ్బురంబగు విజయ
శ్రీ జడనుపడిన నభినవ, తేజం బొకఁ డలమె భారతీయుల నుదుటన్. 3

క. ఇతరేత రానురాగ, వ్రత మీకొని రాజకీయవాల్లభ్యసము
న్నతి నందు టది వణిజ్యా, స్వతంత్రతాగ్రియ మటంచు వారికిఁ దోచెన్. 4

వ. నాఁడు వలసమాగాణములమేల్గీడు లరయుప్రెగ్గడకు రిప్పన్‌దొరకు నీ యపవాదమున్గుతిచి విపులవిజ్ఞాపన మొండు పంపనెంచి యసంఖ్యాతంబులగు రాజకీయ గ్రంథములం బత్రములం బరికించి దానినిర్మించి మాసార్ధమ్ములో నందుఁ జేవ్రాళ్లు పదివేలు సేయించి తదధికారి కంపుటయ కాక యది యచ్చొత్తించి దేశమ్ము నలువలంకులఁ బంచిపెట్టించితి – వెండియుఁ దదీయప్రతికృతులంబెక్కుపత్రికల కందించుడు లండన్‌టైమ్సు సైతము మావాద మాదరణీయంబని మెచ్చెఁ – గాన నేటాలు వారిశిష్టి సార్వభౌమునితిరస్కృతికిం బట్టుగాక తప్ప దనునమ్మిక నాకొదవె – నంత. 5

క. నేటాలుమిత్రు లెల్లరు, గాటంబగు పేర్మినెఱపి కామక మీ రీ
నాఁటం దిరపడుఁడని పలు, పాటుల నన్వేద నిష్టపడితిం దుదకున్. 6

సీ. అటులయ్యు మజ్జీవయాత్ర కయ్యెడు వెచ్చ, మొరు లొసంగుట నాదుపరువుపోక
యనియు నన్యులయింట నునికి నుజ్జనచేసి, రమణీయతామందిరమ్మునందు
నద్దెగీమున నిల్చుటది సమంజసమని, న్యాయవాదిప్రాభ వానుకూల
జీవనమ్మున కిచ్చుసేయమి తద్వృత్తి, నడకించు టనియు నే నరసి నెలకు
గీ. నాల్గువందలరూప్యముల్ నాకు నిదు న,ఖిగ్రహంబుల మీర లర్పింతు రేని
నిలుతు నిచ్చోట నాలావుకొలఁది మీకు, నూడెమొనరింతునని వారి కొయ్యనంటి. 7

వ. పదపడి వార లాపాటిసొమ్ముం జులుక నార్జించి మాకొనర్చు సేవకుఁ బ్రతిఫలమ్ముఁగా నీ కిత్తుము - వ్యాజ్యెములు నడిపినశ్రమకుం దగినసొమ్ము నీవు మాకడన్ వేఱ కైకొనవచ్చు నని - రంత నేను 8

ఆ. సంఘమునకు సేవఁ జల్పుటకై విత్త,మభిలషింప నొల్ల దస్మ దాత్మ
యేల ధర్మవాది యీవిధి; కిందుఁ ద,ద్ధిబలమ్ముకలిమితోఁ బనేమి. 9

క. ఈకృత్యము శుభదం బని, మీకుం బనిపొందుపఱిచి మిముఁ గష్టములన్
దూఁకించుట బదలించుట, యే కద నా కార్య; మర్థ మిందుల కేలా. 10

గీ. మనము విశ్వజనీనముల్ పనులుసేయ, నిట నట వదాన్యుల సమాశ్రయింపవలయు
ధర్మనిధి కొంత నాదువేతనమ యైన, నెంతయొసొమ్మునకు బిచ్చ మెత్తవలయు. 11

గీ. సంబళముతోఁ బ్రజాసేవనం బొనర్చు, నాఁడు నే నెట్టు లొరుకాసు వేఁడనోర్తు
నెతి నెదలి జీతమునకుఁ గక్కుఱితిగొన్న, బండి తొలుకరికే మూలఁబడుట నిజము. 12

చ. అనుటయు వారు నన్గని సమాదర ముట్టిపడంగ నే మెఱుం
గనియవి గావు నీదునడకల్ పరవిత్త మకారణంబుగాఁ
గొన వొకరూకయేని నినుఁ గోరి పరక్షితి నిల్పు వారు నీ
మనుగడవెచ్చ మీగి యసమంజస మెట్టులగున్ సుహృన్మణీ! 13

వ. ఇట్లు పల్క నిపుడు నాదెసంగల ప్రేమోత్సాహముల కతన మీ రిట్లు వాక్రుత్తు - రివి యెల్లకాల మిట్ల యుండునోటు? - మున్నుం దేను మీ మిత్రుఁడుగా లెంకగా మీవలవనిమాట లాడుదు - నపుడుసైత మీ మీ యభిమాన మే నందనేర్తునో నేరనో యీశ్వరుండ యెఱుఁగవలయు - మఱియు 14

క. వాదంబులేల యిట నా, సోదరులకు సేవఁజేయుచున్ భృతి నంటం
గాదుసుఁడీ మీతగవుల, కాదృతిమై నన్నునిల్పఁ దంతియ చాలున్. 15

మం. తెలజాతిపక్షవాదిని గామికతన, నిదియు మీ కింటరమే యౌట నిక్క
మిట ధర్మవాదిగా నే నెంతదనుకఁ, బనికివత్తునొ పాడిపట్టువా ర్నాకు

నేపాటిగారవం బిత్తురో తెలియ, నభియోగములు వేఁడు టది సంఘసేవ
కర్థించుమాఱుమే లనుట దోసంబె? మఱియు వేతన మేల మానుఁ డాకోర్కి
యనుడు వర్తకు లెదురాట చాలించి, రబ్దులా నాకు నీయఁ దలంచినట్టి
బహుమతిసొమ్ముతో బల్లలుం బీఁట, లవి యివి కొని పంపె నాదరం బార
నిట్టు లే నాఫ్రికా నిరవుకొన్నాఁడ. 16



# 18 వర్ణద్వేషము

క. న్యాయస్థానం బొకతుల; పాయనిధర్మానురక్తిఁ బట్టును దానిం
దోయలి యొకర్త; కనుచూ, పాయమ్మకు విధి యొసంగఁ దాయె లవంబున్. 1

గీ. తెలివితేటలుమాత్ర మగ్గలముగాఁగఁ, బడచె నాయింతి; వదనంబువలను సూచి
బొట్టుపెట్టుట యామెకుగిట్ట; దెల్ల, యెడలఁ బాత్రతకే పేర్మియిచ్చుచుండు. 2

వ. కాని నేటాలునందలి న్యాయవాదిపరిషదం బేతదాచారవ్యతి క్రమమ్ముగా వర్తింపుమని నెఱ
పాడిపట్టుం బెరరేపె - నదియుఁ దనయడియాలమ్ముల మొగమోట పొట్టం బెట్టవలసె -
నెట్లన నే నచటియున్నత న్యాయస్థానమ్మునఁ బక్షవాదిగాఁ జేరవలచి తదధికారికి విన్నప
మంపుడు నాతండు ప్రీతిమై నాచేరికకున్ మైకోలుసూపె - నైనను నావినతిపత్రమ్ముతో
పాటు మదీయాంగ్లభాషా యోగ్యతాపత్రము నంపలే దనునెపమ్ము చూపుచు ధర్మవాదిమండలి
వారు నాప్రవేశము నిషేధించు నభియోగముం దెచ్చి - రాపత్రమ్ము బొంబాయిపాడిపట్టునఁ
జిక్కువడియుండె - నల్లవారిం జేరఁదీసినచో మెల్లమెల్లఁగా వారిసంఖ్య బలిసి తెల్లవారికి
నుపద్రవంబు దెచ్చునని యీసమితివారిభీతి - కావుటంజేసి తమపక్షమ్మున వీనుమిగిలిన
పాడిపల్కరి నొక్కని నిల్పి న న్నరికట్ట నెల్లదారులుం ద్రొక్కిరి - కాని తగవరి వారివాదముం
జించిచెండాడి పాడికి నల్లతెల్లవేఱడంబు లుంట దూష్యంబనిచాటి 3

గీ. నన్ను వత్సలతం జూచి విన్నపంబు, నీది మన్నింపఁబడియె గాంధీ! ప్రమాణ
మాచరించి న్యాయస్థానమందుఁ జేరు, మనుడుఁ బాలించితిం బ్రీతి నతనిపనుపు. 4

వ. పదంపడి తగవుపట్టునందలి కట్టుకట్టడంబట్టి నీశిరోవేష్టనమ్ము వర్జనీయం బని యతండు
నన్నుంబలుక నయ్యానతిం ద్రోయువీలున్నను ము న్నచటి మాండలిక దండనాధికారిపాడి
పట్టునం దలకట్టుతీయ నని తుటారించినవాఁడ నయ్యు భావికాలంబునందు నాకావింప
వలసిన దండయాత్రలు పెక్కులుంటంజేసి వానికొఱకు నాబలంబు న్గూడఁబెట్టవలచి తల
గుడ్డను డించితి - నీచెయిద మబ్దుల్లాప్రభృతిమిత్రుల కసమ్మత మగుడు నేలప్రొద్దు లెఱుంగ

వలదా యని వారి నెట్టకే నొడంబఱిచితి - నొక్కయంశంబ వేర్వేఱు సమయంబుల వెవ్వేఱు విధులఁ గంట వలయు నను ధర్మంబుదెస వారి కంగీకృతి లేదయ్యె - నామనుగడలెల్ల సత్యమను నభినివేశంబ మైత్రీసౌఖ్యమాధుర్యము నందింపఁగల్గె - నియ్యది సత్యాగ్రహము నందు నపరిహార్యంబగు నంగంబని రానురా నెఱుంగఁగంటి - నీపట్టుదలకతన నాతల ప్రాణమ్ము తోఁకకు వచ్చెడిది - నానెయ్యు రెల్లరు నసంతృప్తిపా లగువారు - కాని సత్యంబు కులిశంబువోలె నెంతకఠోరము క్రొవ్విరివోలె నంతమవ్వం బని తెలిసితి - నది యట్లుండె - నేటాలున్యాయవాదిసమాజమ్మువారి నిరోధమ్మునంజేసి యాఫ్రికాయందు నాపే రింకొక తూరి ప్రతిధ్వనించె - ననేకపత్రికలు వారిచేష్టిత మీర్ష్యామూలంబని తెగడె - ని ట్లేను వెల్లడియగుటచే నాకృత్యంబులు కొన్ని సుకరంబు లయ్యె. 5



# 19 నేటాలు భారతీయసభ

సీ. పరభూమి నాడుకాఁపురము సాఫల్యమ్ము, నందుట వాంఛనీయమ్ముగాన
నభియోగవిధుల కే నపుడు గౌణత నిచ్చి, వరియించినాఁడ సేవావ్రతంబు
మనవు లంపినయంతమాత్రన యధికారు, లంకెకువత్తురా యహరహంబు
నలజడి గావింపవలయు సుస్థిరమైన పరిషత్తు లేనిచోఁ బనులుసాగ
గీ. నేర వని యెంచి నేటాలుభారతీయ, సభను నెలకొల్పి నియమముల్ సంతరించి
నెలనెలకు సభ్యు లొసఁగుకానికల దాత, లిచ్చునీవులతో బండి నీడ్చుచుంటి. 1

గీ. నెలకుఁ బదునైదురూప్యముల్ నే నొసంగఁ, జొచ్చితిన్ సభ కిదినాదువచ్చుబడికి
మిక్కిలినకాన్క యయ్యు నీరొక్క మీగి, సులభతర మాయె నాయంబు సొరిది హెచ్చి. 2

వ. ఏను సభాకార్యదర్శి నగుట సభ్యు లొసఁగుకాన్కలం బ్రోవుసేఁత నాకర్తవ్యమయ్యె - రానురా నెంతవేఁడిన విత్తమ్ము నీక సభ్యులు న న్నలయించి - రారంభశూరత్వ మన్నది నా కపు డెఱుకపడియె - నవ్వల నెలకాన్కల మాని వార్షికోపహారమ్ముల నేర్పఱిచితి - మీకట్టడం జేసి నాప్రయాసంబు చాలవట్టుతలఁగె - నార్థికవాగ్దానముల నమ్మి సభ కే నెన్నఁడు నధమర్ణతాబాధ నాపాదింప నైతి - ననుయాయులు నిరవధికోత్సాహమ్ముమైఁ గ్రొత్తసభ్యుల నార్జింపఁ బూనిరి - సంపన్నులగు వణిజులు మమ్మాహ్వానించి ధనంబు నీఁజాగిరి - కాని యక్కఱకు మించిన సొమ్ము గడియించుట నింద్యంబని యే నితఃపూర్వంబ విశ్వసించితి - వెండియు 3

క. నెలనెలకున్ బరిషత్తులు, పలుచర్చలు నడుచుటన్ సభాస్తారులలో
వెలసెం గ్రమక్రమమ్మున, లలితోపన్యాసకౌశలం బది మివులన్. 4

క. చిల్లరవెచ్చము పెక్కువ, కొల్లనినే నచ్చు సేఁత కొప్పక లేఖల్
చెల్లుంజీట్లు నివేదిక, లెల్లన్ విరచింప నుత్సహించితిఁ జేతన్. 5

క. వలవదని దాత లన్నను, నిల కిచ్చితిఁ జెల్లుచీట్లు నిక్కచ్చిగ లె
క్కలు రువ్వరువ్వ కుంచితిఁ, బలువుర కీపనికి నొల్లఁబాటగు నకటా! 6

ఆ. దోసి గానిలెక్క యేసంఘమున కేని, జీవగఱ్ఱయని వచింతు నిట్టి
యబ్బెసంబు లేమి యనివార్యదుర్యశ, ఉదయమూల మెల్ల సదములకును. 7

వ. ఆయవ్యయవివరణమ్ము నిర్దుష్టముగాఁజూపలేనివాఁడు నిష్కళంకముఁగా సత్యమ్ము నునుచు టరిది – కాన మాసంఘ మెంతయన్నువయైనను దానిచరిత్ర నతిజాగరితనై రక్షించితి – నీనాఁడు పన్నిదముసఱచి పరికించినను దానిలెక్కలు సరిదాఁకునని గుండెపైఁ జేయివైచి వాక్రుత్తు – మఱియు 8

గీ. ఆఫ్రికాయంద పుట్టి విద్యావివేక, యుక్తు లైనట్టి భారతీయులకు వలయు
మేలు సల్పఁదలంచి నిర్మించినార, మర్థిమై నపు డొక్క విద్యాసమజ్య. 9

క. చదువులు నేర్చినతరుణులు, సదస్యులై కొన్క లీయఁజాగిరి వీరిం
బఱ్రుచుసమస్యలఁ బీడలఁ, బదుగురకున్ వినిచి వీరిప్రతిభాదికముల్. 10

క. పంచారింప నొనర్చుట, కంచితవిభవమ్ముతోడ నట బేరము గా
వించెడి హైందవులును వీ, రించిననెయ్యమ్ముకల్మి నెసఁగంజేయన్. 11

గీ. ఎంతయుం గృషి రవణించె నీసదస్సు, నెలవుకొనె దీని కొకగ్రంధనిలయ మిందు
నియమనిష్ఠులై సభ్యు లనేకవిషయ, చర్చలను జేయఁదొడఁగి రంచన్మనీష. 12

వ. మఱియు నేటాలునం బాదునిల్చిన భారతీయుల యవుగాములం గుఱిచియు వారి నియోజన స్వాతంత్ర్యముంగూర్చియు మహాసభాపక్షమునఁ గతిపయకరపత్రంబుల వెలువరించితి – మివి బహుళప్రచారముం బడసె – నిట్టి యాందోళనమ్ముకతన నాఫ్రికాభారతీయులు పెక్కంద్రు నాచెలికాం డ్రగుటయకాక యింగ్లాండునందును భారతావనియందును గల రాజకీయపక్షములెల్ల నాయుద్యమంబు నాశీర్వదించుటయుం బొసఁగి నాభావికర్తవ్యముల కొకరాచబాట గోచరించె. 13



# 20 బాలసుందరము

క. ఏవాని కెట్టితగులం, బావిర్భావంబు నందు నట్టిఫలంబే
దైవాఱు నతని కనుప, ల్కావంతయు రిత్తవోవదని వాక్రుత్తున్. 1

క. ఆపద్దాసులు పేదల, కోపినమే లాచరించునుబలాట మెదన్
దీపించునాకు బిరబిర, నాపన్నులతోడ గాటమగుజ డ్డొదవెన్. 2

వ. నేటాలుమహాసభయం దానేల నుదయించిన, యయ్యాయిపదవుల నిరవుకొన్న భారతీయులు భాగస్వాములైరి - కాని యచటికర్మకరు లిందనుకంబాల్గొనరైరి - వారు నెలకాన్క లీఁగల వలంతులు గారు - పరిషత్తు వీరియభ్యుదయమ్మున కెపుడు శ్రమంపదు నపుడ వీరు దాని నాశ్రయింతు - రిట్టిపరిణామ మొం దప్రయత్నమ్ముగా నామతిల్లె - నప్పటికి మహాసభ పిన్నతికమునంద కల - దట్టితరుణమ్మున 3

గీ. బాలసుందర మనుపేరఁ బరఁగునఱవ, కర్మకరుఁ డొక్కఁ డఖిలాంగకములు దూలఁ
దనదుతలచీర డించి హస్తమునఁ బట్టి, వెక్కుచు న్నిల్చె నాముోల నొక్కనాఁడు. 4

గీ. ఇతఁడు దర్బనులో వాసికెక్కు తెల్ల, వాని కొక్కనికిం గట్టువడినలెంక;
యొడయఁ డేమాటకో కింకగుడిచి వీనిఁ, బట్టి ప్రహరించె మొగదలపండ్లు డుల్ల. 5

గీ. వఱదలై దంతపుంబాదువలన నెత్రు, విరియఁబడి వీనిమేనఁ గ్రేళ్ళుఱుకుచుండ
నాకడన్ లేకరితనమ్ము నడుపుచున్న, యఱవచే వింటి నితని వృత్తాంత మెల్ల. 6

గీ. కడఁకమై నగడంకారుకడకు వీని, ననిచి ప్రహరప్రమాణపత్రాదు లంది
యవగడంబెల్ల నగరదండాధికారి, కెఱుకసేయించినాఁడ సుందరముచేత. 7

గీ. బాలసుందరు దురవస్థపట్ల జాలి, తెల్లదొరదుండగముదెసన్ దీవ్రకోప
మెల్లలన్ దాఁట నధికారి పెల్లు తతిమి, దోషికిం బిల్పునంపె సాధుస్తుతుండు. 8

వ. ఏలిక నల్లరిపాల్చేసి దండితుం బొనరించుట నాకు నింపనికర్జంబు - వాని యూడిగమ్ము వలన బాలసుందరుం దొలఁగఁజేఁత నాయీప్సితంబు - కాన నొకనాఁ డాయజమాను సరసకుం బోయి యణఁకువ మెఱసి 9

గీ. కనికరం బూద్చి నాయము స్గడచి బంటు, నట్లు పఱుచుట కిపుడు మీ రడలుచుంద్రు
పంచకరపాట్లుపడి మీకు బానిసమ్ము, నెఱపువానిదొసంగు మన్నింపవలదె? 10

గీ. వలతు నొకమార్పు వీని మీకొలువునుండి, విడిచి యొరుపాలుసేయ మైవడినొసంగుఁ
దేలజగడంబు మా కిదిచాలు ననుడు, నాఁకపెట్టక యాతఁ డొఁగాక యనియె. 11

వ. అంత నాయెఱుకకుం దవిలిన యాంగ్లేయున కొక్కని కీయుదంతము న్వినుప నతండు బాలసుందరమునేలుట కియ్యకో ల్చూపెఁ – దగవరి యల్లతెల్లవానిపై దోషమ్ము నిలిపి వాఁడు తనకట్టడం బెఱవాని కొప్పనసేయ నంగీకరించె నని తీర్పునందు లిఖియించె – నంత 12

గీ. బాలసుందరుకథ యిట్లు పరిణమించు, టెల్లకార్మ్మలవీనులం దిల్లుకట్టెఁ
గర్మకరబంధు వన్నవిఖ్యాతి నన్ను, వలచి నిర్భరసమ్మదావాప్తిఁ గూర్చె. 13

క. నాఁటిసుత నాకుఁ దమతమ, పాటులు విన్పింపఁ గూలిపనివాం[డ్రుర కా
రాటమ్ముహెచ్చి కూటువ,కూటువలై నన్నుఁ జేరుకొని రాసాసన్. 14

గీ. బాలసుందరుతగ వది పాటిసేయ, రాని దైనను నేటాలురాజ్యమందు
నొదవెఁ దమగోల నాలింప నొకఁడు నేఁటి, కన్నమాటయ వారి కాహ్లాదమిచ్చె. 15

వ. అయ్యది యట్లుండె – బాలసుందరము నన్నుం గదిసినప్పు దుష్టీషమ్ము నూడ్చి కేలంబట్టుకొనె నంటిఁగదా – యిందు మననైచ్యంబు దయనీయం బొండు కలదు – నేటాలునందలి యాంగ్లేయుని సందర్శించు భారతీయకార్మికుఁ దైదుపదిచేసినం జాల – దతఁడు పాగ నుజ్జగించి చేతం బట్టుకొనవలయుఁ – గావుటంజేసి నా[మోల నయ్యఱవ యిట్టినదవడిం గొనియాడె – నీచెయిదంబు నాకుం [గొత్తయై నన్నుఁ జిన్నవుచ్చెఁ – గాన నే నతనిం గని 16

క. ఏల తలచీర డించెదు, కీలింపుము తప్పులేద కీలింపు మనన్
జాల వెనుకాడి యాడి కృ, తాలసతన్ జుట్టుకొనియె నాతఁడు వలువన్. 17

క. అతఁ డెంత[క్రుయ్యఁబాఱిన, నతివేలానందభాగి యయ్యె వినూత్న
ద్యుతి వానిఁ బొదివె ననిమే, షతా[ప్రసన్నతల నన్ను సంభావించెన్. 18

క. తమసాటివారి నవమ, త్వముపా లొనరించునాఁడె తమ కౌన్నత్యం
బమరునని కొంద ఱెంచెడి, [క్రమ మెట్టిదొ యెఱుఁగ నెంతకాలము చన్నన్. 19



# 21 మూఁడు నిష్కముల పన్ను

గీ. బాలసుందరుతగవు నేటాలులోని, కార్మకులతోడ నాకు సఖ్యమును బెనుప
మెల్లఁ బరికింపఁజాగితిఁ దెల్లదొరలు, పాడికింబాసి వీరిఁ గీడ్పఱుచువడువు. 1

వ. వేయెనమన్నూట తొంబదినాల్గవయేఁట నేటాలునేలుబడివా రసువత్సరంబు నొడంబడిక కూలివాండ్రు తల కిరువదియైదు నిష్కములపన్ను చెల్లింపవలయు నను నపవాదముం బ్రవేశపెట్టుదు నది గని యేను తీచ్చవడి దాని మహాసభకు నందించితి - నం దీచట్టము న్మదలకింప నెల్లజతనంబులు రవణింపఁదగునని యైకకంఠ్యముగా నిర్ణీతమయ్యె - నీయప్ప నంబునకుం గలగుట్టు నించుక వెలువరింతు - వేయి యెనమన్నూటయఱువది యగు నబ్దంబునం దీదొరతనమువారు 2

క. నేటాలుగడ్డ చెఱకుం, దోఁటల కగునం చెఱింగి తోడన భరత
క్ష్మా టెంకిగఁ గలకార్మలు, పాటుపడం దగుదు రిట్టిపంటల కనుచున్. 3

మం. గుర్తించి హైందవక్షోణిఁ బాలించు, వారిమైకో లంది వలసినవట్టు
పనివాండ్ర రావించి పంచవర్షములు, కూలిసేయ బిగించుకొని రొడంబడిక
యవధి చెల్లినవెన్క నాఫ్రికామన్కి, కుత్సాహ మొదవుచో నుండఁగావచ్చు
నర్థమున్నఁ బొలంబు లార్జింపవచ్చు, శక్తులైన వణిజ్య సాగింపవచ్చు
నని వారికిం జూపి రాశ లవ్వేళఁ, బంచాబ్దములు చన్నపదపడిసైత
మీకూలివాండ్రచేఁ గృషి నీడ్వవచ్చుఁ, బాఁడిపంటలు వృద్ధిపఱుచుకోవచ్చు
ననుతలంపులె యిట్టి యనుకూలభావ, గరిమఁ జూపఁగ మూలకారణం బందు. 4

వ. కాని గడువుదాఁటిన భారతకర్మకరు లాంగ్లేయు లెన్నఁడు నూహింపని యభ్యుదయమ్ముల నందఁగల్గి - రెట్లన 5

గీ. భారతమునుండి నానాప్రకారశాక, బీజములఁ దెచ్చి కూరలుపెంచి కంచి
మావితోఁటలు నాటి సుశ్రీ వరింప, భవనములుగట్టి బేరాలఁ బాదుకొనిరి. 6

గీ. పచ్చపచ్చఁగఁ దిరుగాడు భారతీయ, కార్మకులఁ జూచి తెల్లవా రోర్మి నూడ్చి
సొంతకరిసనము న్గడించుట సరే! వ, ణిక్కు లైరేని వీరి మన్నించు టెట్లు? 7

క. అని యీరసమ్ము కొలువుం, గొనియాటకు మ్రొగ్గి రెన్నికుత్రల కైనన్
వెనుదీయక తత్కార్మక, జనావళిన్ రొప్ప వేడ్కసల్పిరి వారల్. 8

వ. వాణిజ్యంబ కాక మితవ్యయమ్ముతో నిరాడంబరముగా మెలంగుట, సామాన్య లాభంబునకుం దనిసనుట, యనామయకారికార్యంబుల నుఱమి, మందిరమ్ము సుందరమ్ముగా నొనర్చు కొంటకు బంకముచ్చుఁదనం బూనుట, మతవైలక్షణ్యమ్ము లోనగు నల్లవారిమనుగడ మార్గమ్ములుసైతము వారిం జాతిద్వేషదోషదూషితులం బొనరించెఁ - గావున 9

క. మునుముం దెన్నికచనవుం, దునుమాడు నిదేశమునకుఁ దొడఁగిరి తచ్ఛా
సన మైనవెన్కఁ దలప, న్నును వద్దించుటకు నేఁడు నూల్కొని రిస్సీ! 10

వ. చట్టము నామూలాగ్రచూడము పరికింప నైదేండ్లు ముగిసినంతన కూలివాండ్రు భారత దేశమ్మున కేగవలయు, నట్లు సేయనివాఁ డించుక జీతపుంబెంపున కీకొని రెండేఁడుల కొక్కమఱి ముచ్చిలిక వ్రాసి యీవలయు, నీరెండు తెఱంగుల కొల్లనియెడ నేఁడాదికి మున్నూటదెబ్బదియైదురూపాయ లరివెట్టవలయు నని తెలిసె - నీతీర్పునెల్ల భారత ప్రభుత్వమువా రొప్పక మూఁడునిష్కములకప్పమున కంగీకరించి - రిదియు నత్యాచారంబ - దీని నిర్మూలింప నేటాలుభారతజాతీయమహాసభవారు నిరంతరదీక్షమై శ్రమించిరి - కాని యది యిరువదేండ్లకు ఫలించె - నీపన్నెత్తి వైతు మని నేటాలురాచతిికమువారు గోపాలకృష్ణగోకులున కిచ్చిన వాగ్దానము చెల్లింపమింజేసి చరమసంగ్రామ మారబ్ధ మాయె. 11

క. ఆకయ్యంబునఁ గార్మకు, లేకాగ్రతఁ జూపి రెంద తెందతొ బందా
లై కస్తిం గుడిచిరి వె, న్నీకయ లఘునాళికాగ్ని కీల్గిరి పలువుర్. 12

గీ. దొసఁగు లెన్నెన్ని పైకొన్నఁ దుట్టతుదకు, సత్యమే నిత్యవిజయధ్వజంబు నెత్తెఁ
గర్మకరదుర్భరాపదాకార మూని, సత్యదేవత నాఁడు సాక్షాత్కరించె. 13

క. సడలని విశ్వాసంబును, సడిసన్నతితిక్ష సుప్రశంసార్హం బౌ
కడఁకయు లేకుండినఁ జొ, ప్పడునోటు జయంబు నాఁటిబవరంబునకున్. 14

వ. కర్మకరు లీసమరమ్ము నెదుర్కొనక మహాసభవారు దీని గుర్తింపక యున్నఁ దప్పక తలపన్ను విధింపఁబడి నేఁటికి న్వేధించుచుండు - వెండియు నేతదీయంబగు దుష్కీర్తి యాఫ్రికా భారతీయులకకాక సకల భారతప్రజల కంటి ప్రాఁబడియుండు. 15



# 22 ధర్మనిరీక్షణము

క. పరమేశ్వర సాక్షాత్కృతి, వరియించుటఁజేసి వేద్కవడినాఁడఁ బ్రజా
వరివస్య; కదియ వేలుపు, దరిసెన మిప్పించుమన్న తాత్పర్యమునన్. 1

క. భారతజగతీసేవా, భారంబును మోఁత నాకుఁ బరమప్రియ మీ
యారంభము నేటాలునఁ, గోరక లభియించె నెలమి కొనలొత్తంగన్. 2

ఆ. బ్రదుకుఁదెరువు వలచి పైకొన్న కారియ, వాడువేదబముల దాడి కదలి
దేశయాత్రవలనితెల్వి కూటాడి నే, టాలునందు నాదుకాలి నిడితి. 3

గీ. కాని భగవద్గవేష ణాధీనవృత్తి, నాత్మసందర్శనమ్మునయందు నోల
లాడితిం గ్రైస్తవులు నెయ్యురై మదీయ, ధర్మజిజ్ఞాసకు న్దోహదమ్ము లిడిరి. 4

వ. అయిచ్చ నుపశమిల్లఁజేయ నే నియ్యకొన్నను నాచెలికాంద్రగు క్రైస్తవు లడ్డుపడి - రెట్లన నాఫ్రికాక్రైస్తవమతపరిష దధ్యక్షుఁడై దర్బానునందు నెలవుకొన్న వాల్టను నన్నుఁ బసిపట్టి చేరఁదీసి గారవింపఁ దొడంగె - నితనినడవడి నాకు వింతగొల్పె - న న్నీతఁ డేసుధర్మంబు నారాధింపుమని యెన్నఁడుం గోరఁడయ్యెఁ - గాని 5

క. తెరదీసి తనమెఱుంగులు, నెరసులు నాయెట్టయెదుట నిలిపెను దన స
చ్చరితము దుశ్శీలమ్మును, బరికించెడిమార్గ మేరుపఱిచెన్ నాకున్. 6

క. అతని సహధర్మచారిణి, సతీమతల్లిక వివేకసంయుత వినయా
న్వితవిద్యారత; తజ్జం, పతులచరిత్రంబు నాకుఁ బ్రమదంబొసఁగెన్. 7

వ. మాతలంపులయం దెన్నే నెడమడుగులు గలవు - కాని సత్య సహ నౌదార్యము లున్నయెడ నవి ల గ్గొనరించునట్టివ యగు - నయ్యాలుమగల సౌజన్యంబు నన్నుఁ గడుంగడు నాకర్షించుటంజేసి యే నేరాళమ్ముగా వారి సన్నిధి కేగుచుంటి - నీజడ్డు మతమ్మదెస నా కేమరుపాటు వొడమకుండునట్లు సాయంపడె - వెండియు 8

ఉ. వీలగునప్పుడెల్ల మతవీధులుత్రొక్కుచు నిస్సమాన ధీ
శాలికి రాజచంద్రునకు సందియముల్ వెలిపుచ్చుచుంటి నా
గోల నుపేక్షసేయ కనుఁగుంబలె నన్గనుఁగొంచు మంచిమా
ర్గాలకు నీడువందగిన కమ్మల నంపఁదొడంగె నాతఁడున్. 9

వ. మఱియు నర్మదాశంకరకృతంబగు ధర్మవిచారము, మాక్సుముల్లరు వ్రాసిన 'హిందూదేశము మన కేమి బోధింపఁ గల'దను గ్రంథము, దివ్యజ్ఞాన సమాజమువా రాంగ్లీకరించి ప్రకటించిన యుపనిషత్తులు, మిగుల నాసక్తితోఁ బఠించితి - నీ వ్రాఁతలు హిందూధర్మముపై నా కత్యంత గౌరవ మేర్పడంజేసెఁ - గాని లాతిమతమ్ములదెస నాకపు దనాదరంబు వొడమదయ్యె - నపుడ వాషింగ్టనిర్వింగు రచించిన మహమ్మదుజీవితము చదివితి - నది తత్కథానాయకు నెడ నా కభిమానము గూరఁజేసె - జొరాస్ట్రొ బోధనమ్ములుసైత మానాఁడు పరిశీలించి నాఁడ. 10

క. ఏ ని ట్లలఁతిగ వలఁతిగ, నానామతశోధనం బొనర్చితిఁ దత్త్వ
జ్ఞానార్జనాభిలాషము, దానన్ వికసించె యోగతర్షము నొదవెన్. 11

క. కృతు లరసినంత యోగో, న్నతి వశ్యముకామి నందు నా కబ్బిన పాం
డితి యల్పిష్ఠమ భరత, క్షితి మెట్టినవెన్క యోగిశేఖరు నొకనిన్. 12

క. సేవించి యోగవిద్యా, ప్రావీణ్యము పడవనెంచి పాతంజల మ
ష్టే విడిచితి నీనాఁటికి, నావల పీడేఱ కున్నయది విధివశతన్. **13**

వ. మఱియు నయ్యవసరంబునం దేను దాల్‌స్టాయి రచనల దీక్షమైఁ బఠించుదు నమ్మహామహుని 'వేదముల సందేశమేమి' మున్నగు కృతులు నాయుల్లమం దిల్లుగట్టుకొనియె – విశ్వప్రేమ మానవు నెంతయున్నతికిం జేర్చు నారహస్యంబు నానాఁటికుగ్గడువుగా నెఱుంగఁగంటి – వెండియు నక్కాలంబునంద **14**

ఆ. ఏసుధర్మ మాశ్రయించుకుటుంబ మొ,క్కండు మిత్రమైనకతన దాని
వేడ్క నాదరించి వెదలితి భానువా,సరములందు వినుతిసదనమునకు. **15**

క. ఆసదనమ్మునఁ గాలిడు, నేసుమతమువారిబుద్ధి కీశ్వరచింతా
వాసనలే దైహికభో,గాసక్తియ జీవగఱ్ఱయగు వారలకున్. **16**

గీ. అకట! వాహ్యాళి కేతెంచినట్ల వారు, గుడికివచ్చెద రిట్టిపోకడలు చూడ
సిగ్గు గురువులువాఱెఁ దూఁ గగ్గలించె, నేవ క్రేళ్ళుబ్బె నా కట కేగుటన్న. **17**

వ. ఇట్లు ప్రార్థనామందిరమ్మువలనికిం జనుట దిగఁద్రావియు నా లంబితోడిచెలిమిం బాయనైతిఁ – గాని తలఁపనితలంపుగా నదియుఁ బరిత్యాజ్య మయ్యె – నెట్టులనఁ దత్కుటుంబిని **18**

క. శుచివర్తన యయ్యును సం,కుచితాభిప్రాయములకుఁ గుదు; రాయమతోఁ
బచరింతు బహుళధర్మ, ప్రచయాంతరచర్చ నమ్రభావము వెలయన్. **19**

గీ. అనఘుఁ దార్నాల్డు ప్రాగ్జ్యోతి యనెడు పేరఁ, బలుకుపొత్తము నాసాధ్విపజ్జ నొక్క
తరుణమం దేఁ బఠించుచోఁ దొరలె నేసు – మారజిత్తారతమ్య మీమాంసచేఁత. **20**

వ. అపుడు నే నామెతో నిట్లు పలుకరించితి. **21**

గీ. జననిరో బుద్ధగౌతము జాలిపెంపుఁ, గంటివే యది మనుజవర్గమ్ముఁ గడచి
కాలసర్పమ్ముదరికి వ్యాఘ్రమ్ముదెసకు, గునుకుపెట్టె సర్వప్రాణికోటికడకు. **22**

క. నగుమొగముదాని నాతని, యెగుబుజమునమేఁకపిల్ల నెవ్వఁడు కని మై
సొగయ నతివేలకరుణా, పగా జనుస్థాన మగుచు భాసిలకుండున్. **23**

క. సకలప్రాణివ్యాపక, మకలంకం బీదృశంబు ననుకంపను గ్రీ
స్తుకడం జూతుమె నావుడు, నకటా! నాపలుకు నొంచె నాయమ్మహృదిన్. **24**

క. ఆకందువ పసివట్టితి, నీకథ కారాత్రికమ్ము నిచ్చితి నయ్యే
వాకులు నొడివితి నవ్వల, నాకె ప్రసాదించువిందు నడఁకువఁ గొంటిన్. **25**

వ. ప్రత్యాదివార మరుదెంచి మా యాతిధ్యముం బాటింపుమని యెన్నఁడో న న్నీకుటుంబమువా ర్ధిధించుటంజేసి వీరివిందుల కింతకుమున్న యలవాటువడితి - నానాఁడు మాపంక్తియం దైదేండ్ల యీడుగలపసివాఁ డామెకొమరుండు నగుమొగమ్మువాఁ డొకఁడు కూర్చుండి మెసవఁజొగె - నంత **26**

గీ. అతనితో ముద్దుముచ్చట లాడుకొనుచు, నారగించుచునుంటి నాహార మపుడు కందుహరివాణమునఖంగుఖంగు మనుచు, మొరసె నొకయెంపముక్కన న్డాఱసెనేవ. **27**

గీ. అంతఁ బసివాని నవ్వి నాచెంతనున్న, బదరికాఫలముం జూపి యిదిగొ దీనిఁ జూడు మోచిట్టిపాపఁడా చూడు మెంత, చక్కఁగా నున్నదో చియ్యముక్కకంటె. **28**

గీ. అనుటయుం జిక్కవెన్నెల నవఘళించు, దెందమునచిన్నె పల్కులో సందడింప నిజమ నీవాడువాక్యంబు నిజమ యంచు, ముద్దుఁగుఱ్ఱఁడు నామాట పెద్దచేసె. **29**

వ. కాని యీసల్లాప మాకొండొకతల్లికి దుర్భరసంతాపకారి యగుదు నాసవ్వడి నెఱింగి యే నించుక మేల్కొని వైళంబ విషయాంతరము నందుకొంటిఁ - దరువాతిరవివాసరమ్మునఁ గొతుకుచుం గొతుకుచు వారియిల్లు త్రొక్కినపదంపడి యయ్యిల్లాలు నన్నుంగని **30**

క. నీనేస్తము నాబిడ్డకుఁ, గానిది సు మ్మితఁడు పిశితఖాదనవిముఖుం డై నన్నుఁ బూఁటపూఁటకు, నానా వేదనలపా లొనర్చెడి నకటా! **31**

క. నీకఱదలు వల్లించుచు, నాకొసఁగుము పండ్లటం చనారతముగ న ఱ్ఱాఁకలుపెట్టెడి నీతని, నేకరణిన్ సైఁతుఁ బెద్దయిడుమయ వచ్చెన్. **32**

క. ఆమిషము న్దినకుండిన, నామయముల్ కవియుదెంచు ననఁ గాని నిజ స్థేమమ్ముఁ బాసి వాడిన, తామరతూఁడై నిసుంగు తక్కువపడఁడో? **33**

క. ఏ నెట్టులోర్తు దీనికి, నేనాఁడున్ బిడ్డ కిట్టిహితములు గఱపం బూనకు వీనిం జెఱుపకు, నీనేర్చినచదువు మాక నేర్పుము తండ్రీ! **34**

వ. నావాక్కు లన్యధాకరింపకు మనుడు నే నగ్గరిత న్జూచి **35**

గీ. తల్లిరో! నాప్రమాదము న్దలఁచి తద్ద, వనరుచున్నాఁడ నంజిక న్మునిఁగినాఁడఁ దానునుం బిడ్డలను గన్నతండ్రి నగుట, నెఱుఁగుదుం దల్లిదండ్రులహృదయసరణి. **36**

క. నానేర్పు నీతికంటెను, నానడవడి బిడ్డమదికి నాటును దిరమై కానం గ్రవ్యము నంటని, యే నిచటికిరాక మానుటే లెస్సయగున్. **37**

గీ. దీన మననెయ్యపుందీవ తెగదు నీకు, నిట్టివేదన లింకమీఁదఁ బుట్టనేర వనుదు నాసాధ్వి నీచెప్పునట్టితెఱఁగు, కదు సమీచీనమని వేడ్కయడరఁబల్కె. **38**



# 23 గృహవ్యవస్థ

వ. కాఁపురం బీడ్చుట యన నాకింతకుము న్నలవాటులేనికార్యంబు గాకున్నను నా లండను బొంబాయిమన్కికిని నేటాలునందలియున్కికిని వేఱడమ్ముకల - దిందేనుహిందూన్యాయ వాదియు భారతీయప్రతినిధియు రీవికిందగుభంగి వెచ్చింపవలయుఁ - గాన 1

క. నగరిం జక్కనితావున, సొగసరిసదనమ్ము వదసి సుందరభావ
స్థగి తోపకరణములతోఁ, దగువిందులతోడ జీవితమ్ము నడిపితిన్. 2

గీ. ప్రతికుటుంబమునం దొకబానిసీని, నిల్పు టనివార్యమగుఁ గాని నేఁటిదనుక
లెంకఁగా నరు నెట్లు పాలింపవలయుఁ, బాలకతయెట్టిదో కనఁజాలనైతి. 3

గీ. అపుడు నాతోడ నొకమిత్రుఁ దప్పసమ్ము, పీఁటవెట్టెను; మఱియింటిబిడ్డవోలె
బానసీఁ డుండె నొక్కఁడు, మానివాస, మందె లేకరులన్ భోక్త లైనవారు. 4

వ. మాకాఁపురంబు చక్కఁగా నడిచినదనియ వక్కాణింపనోర్తుఁ - గాని యిందుఁ గతిపయ విషమసంఘటన లేర్పడక మానలేదు - నాచెలిమికాఁడు బుద్ధిమదగ్రగణ్యుఁ డనియు విశ్వాస్యుఁ డనియుఁ దలంచినయేను దుట్టతుదకు విప్రలబ్ధుండనైతి - నెట్టులన 5

గీ. ఇతఁ డసూయకు లోఁగి నాయింట నిరవు, కొన్న లేకరి దాలుగా యన్నశంక
నన్నువేధించునట్లు పన్నాగ మొందు, సంతరించె నుపాయకౌశలము మెఱయ. 6

ఆ. అవులించునంతఁ బ్రేవులు లెక్కించు, గడుసులేఖకుండు క న్నెఱింగి
వదలె నాదుకొల్వు పదపడి మాయింటి, చూరుదెసకు నిక్కిచూడఁ దయ్యె. 7

క. అతనియెడఁ దప్పు గావిం,చితినొక్కో యనుచుఁ బెద్దచింతించితి నీ
కత యిట్టులుండ నెయ్యరి, బ్రతుకెల్లన్ విరిసి బైటఁబడె నొక్కతతిన్. 8

క. నాచెంగటఁ దాత్కాలిక, పాచకుఁ డపుడుండె వాఁడు పలువగఁ దుదకుం
దోఁచినను వేల్పు నన్నుం, గాచుటకై పంపుదూతగా వచియింతున్. 9

క. నాయెఱుకువకు న్వెలిగా, మాయింటన్ నడుచు నీతిమాలినకార్యం
బీయాంధసికుఁడు తెలిసి మ,దీయాంధ్యముఁ జోపఁగా మదిం దలపోసెన్. 10

గీ. మంచివాఁడని యెల్లరమాట విశ్వ,సించువాఁడని జనులునన్ జెప్పికొందు
రిట్టినాయింట నోర్వరానట్టికంపు, కవియుదెంచుట వాని కక్కజముగొల్పె. 11

వ. కార్యాలయమునుండి ప్రత్యహమును రౌహిణేయ కాలమ్మున కిలుసేరి సాపడుట నానియమంబై యుండు - నిట్లుండ నొక్కనాఁడు కుతపకాలమునం దీబోనకాఁడు ముచ్చెమటలతో నిట్టూర్చువాఁడు కార్యస్థానమ్ముఁ జేరి నన్నుం గని 12

క. అక్కఱకల దొక్కఁడు మీ, రిక్కకు నేతేరవలయు నిప్పుడ యన్నన్
ముక్కు మొగం బిసుమంతయు, వక్కాణింపవ యిదెట్టి వల్లడి సెపుమా. 13

గీ. ఏమి మునిఁగెనోయి యీయున్న మొలబంటి, పనులనెల్ల నొదుఁగఁబాఱఁ జేసి
యుఱుకు పెట్టవలయునో యంటి నవ్వల, నతఁడు మాట లేటి కనుచుఁ బదరె. 14

గీ. అంత నతనిపల్కు నంకిలిపెట్టక, వెడలినాఁడ వానివెంట నింటి
కంటుకాఁడు నిల్చునటుసూపి మీర యీ, తలుపుఁ దెఱవుఁ డని యతండు నొడివె. 15

క. గుట్టెల్ల నెఱిఁగి తలుపుం, దట్టితి మార్పలుకురామి దార్ఢ్యముకొలఁదిన్
నెట్టితిఁ గొట్టితి భిత్తిక, లట్టిట్టె యటమటించె నదరెను ఱంపుల్. 16

క. విచ్చెన్ వాకిలి గదిలో, ముచ్చముడిఁగి యుండె నొక్కమూలను వెలయా
లచ్చెలికాఁడును సగపాల్, చచ్చి నిలంబడియె నొక్కచక్కటి నిసిరో. 17

క. పొదపొద మెన్నఁడు నీవీ, సదనంబునఁ గాలుమోపఁ జనదని పదుపున్
ముదియ నదలించి పంపితిఁ, బదపడి చెలికానిఁ గదిసి బాపురె! నిన్నున్. 18

ఆ. నమ్మి బేలుపోయినాఁడ నావెంగలి, తనమ నన్ను నింతదనుకఁ దెచ్చెఁ
జాలుఁ జాలు నీదుసంగతి గోముఖ, వ్యాఘ్రములు వసింపవలవ దిచట. 19

వ. అనుటయు నతండు పశ్చాత్తప్తుఁడై బుద్ధితెచ్చుకొంట మాలి వేగిరింపకు - నీబ్రదుకెల్ల వీథిపా లొనరింతు - నని నన్ను జంకెనచేయం దొడంగె - నంత నేను జిఱునవ్వు వెలార్చి 20

క. చాటింపు మెల్లభూములఁ, జాటింపుము నన్ను నోరి! జడమతి! నాకుం
జా టన్న దున్న దఁటరా!, టాటోటుంబ్రదుకు నాకద స్గల దఁటరా! 21

ఆ. ఇచ్చవొదమినట్టు లేదేని గావింప, వచ్చుఁ గాని పాయవలయు నిచటు
నా నతండు రుద్రుడై నిప్పులుమిసె దు,శ్శకమ యయ్యె వానిఁ జక్కఁజేఁత. 22

వ. అంత నేను గత్యంతరంబు కానరామింజేసి 23

క. లేఖకు నంపితి రక్షక, శాఖాధిపుకడకు నంత శాంతార్భటుఁడై
నాఖరవృత్తిని సైఁచి ద,యాఖేలాలోలబుద్ధి వగుమని నన్నున్. 24

క. చెలికాఁడు కొసరి గేహము, వలనన్ వెలువడియె గడుసువాఁ డితఁడంచుం
దెలిసియుఁ జేపట్టితి నా, చెలికారము వీని సవరచేయదె యంచున్. 25

క. నాయాసలెల్ల నాఱడి, పోయెఁ గదా వీనిపొత్తు పోలనిదని మ
హ్చేయొఒర్థు లెంతసెప్పినఁ, బాయనిమోహమ్ము నన్నుఁ బామరుఁజేసెన్. 26

వ. ఉల్లిమోక న్మల్లెపూలు పూవఁజేయఁ గడంగిన నా వేదుఱు నేమి సెప్పుదు–నైన నియ్యకార్యంబు యుక్తసమయంబునన్నన్నుఁ బ్రబోధించె – నిది నాకన్నువివ్వదయేని యీచెదగరవు నెయ్యంబునం దోఁగి యమూల్యంబగు నాకాలంబు నితనికి రిత్తవెచ్చించి నేఁ దవలంబించిన యేకాంతజీవనమ్ముజోలికిం బోక వీనిచూపించిన దుష్పథమ్ములంబడి దిక్కుగాన కల్లాడు చుండెడివాఁడఁ – గాని 27

క. ఏమానవుండు భగవత్, ప్రేమావృతు నెద్రిచి బాధపెట్టఁగఁ జాలున్
నామది పవిత్ర మగుటన్, సామి సదా నెరసులోర్చి సాఁకెను నన్నున్. 28

మం. తొలకరియంద యీ దుస్సహంబైన, పరిణామ మొదవి మద్భావిజీవనముఁ
గుస్తరింపఁగ ననుకూలించి మిగుల, నీశ్వరుం దర్థిమై నీబోనకానిఁ
బ్రేవలే దనుచుఁ జెప్పెడివాఁ డెవండు, నానిద్ర విరియించి నన్నుద్ధరింప
వచ్చినహితుఁ డీ సువారంపువాఁడు. 29

వ. అయ్యది యట్లుండె – నీ దుండగమ్ము బాహిరవోయిన వెంటన వంటరి నాసన్నిధి కేతెంచి మీ రమాయికులు–పసివాఁడే నలవోక మిమ్ము వంచించు – నిట్టి మీకొలు వభిలషణీయంబు గా–దొండు దెసకుం జనెద–ననుజ్ఞయిం–దని న న్నుజ్ఞనచేసె–నయ్యవసరంబున 30

ఆ. నన్ను మున్నువిడిచి చన్నట్టిలేకరి, కూళ యన్న తలఁపు గూరఁజేసి
నామనమ్ముఁ గలఁచె నీమిత్రమే యటం, చెఱిఁగి దుర్భరార్తి నెరిపినాఁడ. 31

క. అతనిం బ్రసన్నుఁజేఁతకు, శతధా యత్నం బొనర్చి సఫలత లేమిన్
వెతపాల యైతి నకటా!, యతు కతుకే యెంత దిద్దినప్పటికైనన్. 32



## 24 ఇంటికి

గీ. ఆఫ్రికాభూతధాత్రి నాయదుగు మోపి, సాగనంపినవాఁడ వర్షత్రయమ్ము
తెలిసెఁ దత్రత్యులకు నస్మదీయతత్త్వ, మెఱుకపడె వారిజీవనం బెల్ల నాకు. 1

ఆ. పాడిపట్టుపనులు పైకొనె నచ్చోటఁ, దీవసాఁగె భారతీయసేవ
పెద్దకాల మందుఁ బీరమ్ముపెట్టఁగాఁ, దగినయవసరమ్ము దాపరించె. 2

క. ఎక్కటిమనుగడ పెక్కులు, చిక్కులకు న్మూల మగుటచే భరతోర్విన్
ద్రొక్కి కుటుంబముఁ గైకొని, యక్కడికిం బోక సుఖద మగు ననుకొంటిన్. 3

వ. మఱియు నాఫ్రికాభారతీయుల కడగండ్లు మాతృదేశంబున వెగ్గలంబుగాఁ బ్రకటించి తదీయాదరంబు వడయుటకుసైత మీపయనం బనుకూలించు నకాఁ దలంచి వేయెన మన్నూట తొంబదియాఱగు శరత్తునడుమం జెలికాండ్ర నొప్పించి జాతీయమహాసభా, విద్యాపరిషద్వ్యవహారంబు లాదంజీమియాఖాన్, రుస్తుంజీల కప్పగించి కాళీఘట్టమ్మున కేగుధూమనావ నెక్కితి - నందలిపథికులు కొందఱు నానేస్తకాండ్రగుటంజేసి 4

క. ఉరు దొక్కనికడ నొక్కని, సరసన్ దమిళంబు నొకసన్నిధిఁ జతురం
గరహస్య మభ్యసించితి, నఱవమ నా కప్పు డంటె నల్పాల్పముగన్. 5

క. హిందూర్వి కేగినంతన, యందుం గౌశలమువడయ నాసించితి నై
నం దైవయోగమున నా, కుం దీఱనిదయ్యె నాఁటికోరిక నేఁడున్. 6

మం. ఏ నాఫ్రికాగడ్డ కెక్కినవెన్క, నేర్చిన చదువెల్ల నిర్బంధమంద
యఱవమ్ము గఱచితి నాఫ్రికాబందె, నెరవాడలోఁ బరియించితి నురుదు
ధాటిమై మాటాడఁ దగునేర్పులేమి, నడుగునఁ బడుచున్న దఱవ మాపిసరు
కడుచింత గూరు నక్కథ నెత్తుకొన్న, నాఫ్రికారాష్ట్రంబులందుఁ గష్టించు
దాక్షిణాత్యులు నన్నుఁ దమజీవగఱ్ఱ, వడువున భావింత్రు వా రెల్లప్రొద్దు
చెరలాడుచుండ్రు నాస్మృతిపథంబందు. 7

ఆ. అఱవలొండె నొండెనాంధ్రులు నాకంటఁ, బడిననాఁడు వారిపట్టదలయుఁ
ద్యాగపాటవంబు తలఁపునఁ బాతి సం, తోషవిస్మయములఁ దోఁగుచుందు. 8

గీ. అక్షరాస్యులుగారు వా రాఫ్రికార, ణాంగణంబున నెఱజోదులై తెగించి
నట్టివారెల్లఁ జదువులో వట్టివారె, పొట్టకూటికి వఱువట్లుపుట్టువారె. 9

క. కపటచ్ఛాయ నెఱుంగని, సుపవిత్రుల వీరిమనసు చూఱాడఁగ నా
కపు డాఁకరాద భాషా, విపర్యయం బెంత విఱ్ఱవీఁగుచునున్నన్. 10

క. అందదుకుగ నాంగ్లేయము, హిందూస్థానియును వార లెఱిఁగినకతనన్
బొందుపడెన్ మాపను; లి, బ్బందులు రావయ్యె నెట్టిపట్టులనైనన్. 11

వ. కాని దాక్షిణాత్యులు నాయెడంజూపు గౌరవమ్మునకుఁ బ్రతిగా నేను దమిళముం జదువనెంచి యించుక సఫలతఁ గంటి - నవ్వల భారతదేశంబునఁ దెలుఁగుబాస నభ్యసింపఁ బూనితిఁ - గాని తత్ప్రయత్నము వర్ణసమామ్నాయముం గడచి యవతలకుఁ బోనేరదయ్యె - నిట్లు ద్రావిడాంధ్రములు చాలినంతవట్టు నా కబ్బు నదృష్టము కలుగదాయె - నిఁక ముందేని కలుగదని తలంతుఁ-గాన దాక్షిణాత్యులు కామక హిందూస్థాని నేర్తురను బాఢవిశ్వాసంబుతో నున్నాఁడ - నాఫ్రికావాసు లగు ద్రావిడు లించించుక హిందీ నెఱుంగుదురు - కాని తమ

నేర్చి నాంగ్లభాష కెక్కడ ముప్పువాటిల్లునో యన్న భయమ్మున నింగిలీసుఁ గఱచినవార దేశభాషల పట్ల నౌదాసీన్యముంజూపుదు – రది యట్లుండె. 12

గీ. అపుడు మానావికునిచెల్మి యమరుకతన, నాతఁ డాత్మవిచారార్థి యగుటకతనఁ గడలిపయనంపు సుద్దులకంటె బలిసి, నడిచె నాధ్యాత్మికాభాషణములు మాకు. 13

క. నీతికి నెఱుకకు వింగడ, మీతఁడు వచియించు నేసునెడ విశ్వాసం బేతఁడు నిల్పునొ యాతఁ డ, పేతాంహస్తతి యటంచు బేర్కొనుచుండున్. 14

వ. నీతికిం దగుతగములు నిర్ణయించుమతం బతని దృష్టిలో రిత్తమతంబ – యీగొడవకెల్ల నా యాకుబుద్వనేమంబ నిదాన మాయె – న న్నతం డెఱచి నేలతినవని నిందించుఁ – గూరగాయలంబలెఁ బశుపక్షులసైత మీశ్వరుండు మానవుతిండి కొఱకుఁ బుట్టింపఁ డె ట్లని వాదించు – నిట్టి చర్చలు మమ్ము లోఁతులకుం గొంపోయెఁ – గాని యెవనిదారి వానిద – నీతిధర్మంబుల కరమరికలేదని యోద పెద్దయుఁ గలదని యేనును సిద్ధాంతము లొనర్చితి – మివ్విధంబున నయ్యాయి ముచ్చటల న్మనుఁగుచు నానందపరసీమలం ద్రొక్కుచు 15

క. ఇరువదియు నాల్గునాళ్లకు, నురలుచుఁ బింపిళ్లుగూయు హుగ్లీనదిసొం పరయుచుఁ గాళీఘట్టముఁ, దఱిసితి మాత్రవనిఁ గాంచి తనిసితి నాత్మన్. 16

వ. ఆనాఁడ ధూమశకట మెక్కి బొంబాయినగరమ్మునకుం బయనము సాగించితి. 17



# 25 హిందూదేశమున

గీ. దారినడుమం బ్రయాగమ్ము తగిలె నచట, బండి ముక్కాలుగంటసే పుండుఁ గాన రాణకెక్కిన తన్నగరంబు చూడ, నౌషధం బొందు విలువఁగా నరిగినాఁడ. 1

వ. అయ్యాయితావులు పరికించి మందుంగొని వచ్చునంతలో శకటంబు మెల్లమెల్లఁ జాగుచుండె – నంచెకాపరి మంచివాఁ డగుట బండి నొక్కనిముస మాఁచె – గాని నా యద పొడ కానిపింపమింజేసి నామూటములెల్లఁ బదిలించి యుంచె – నవ్వల నే నొక్కపూఁటకూటింట బసపెట్టి యాంగ్లేయుఁడు పయొనీరుపత్రికాసంపాదకుఁడు నగు చేజనీ కుఱఁగటికిం జని నేటాలుభారతీయులంగూర్చి నాపంపువార్త లాదరింపుము – ధర్మువుతక్క వేఱొండు నా కింపితము గా – దని పలుకుదు నుచితమగు సాయంబొనర్తు నని యతండు నన్ను గారవించెఁ – బదంపడి రామణీయకరాశి యగు త్రివేణీసంగమమ్ము నాప్యాయముగాఁ దిలకించి భావికర్తవ్యాలోచనములతో నాఁటిరేయి గడపి 2

క. వఱువాత లేచి బొంబయి, పురమ్మునన్ డిగుట కిచ్చపుట్టమిని సరా
సరి రాజకోట కేగితిఁ, గరఁగితిఁ బ్రియబంధుకోటిఁ గనుకలిచేతన్. 3

గీ. ఆఫ్రికాభారతీయ బాధావమాన, దర్పణంబుగ నలఁతిపొత్తంబు నపుడ
వెలువరించితి వదనంపువెలుఁగుఁ బట్టి, పచ్చపుస్తకమని పేరుపడియె నద్ది. 4

మం. భారతక్షోణిలోఁ బ్రథితిగన్నట్టి, యఖిలపత్రికలకు నద్దాని నంపఁ
బయొనీరుముఖ్యసంపాదకుఁ డైన, చేజనీ మునుముందు చేసెఁ దద్వ్యాఖ్య
తత్పిండితార్థమ్ము తరలెను సీమ, కద్దానిసారాంశ మాఫ్రికా కేగె
నేటాలునందు వన్నియకెక్కినట్టి, యెల్లపత్రికలందు నిది యచ్చుపడియెఁ
జినపెద్దటీకలు చెలరేఁగె దీని, కాఫ్రికామన్కి నా కగపడ్డపెద్ద
కడగండ్ల కిదె మూలకారణం బయ్యె. 5

ఆ. బొబ్బజాడ్య మపుడు బొంబాయినగరాన, వేమొగాలతోడ విస్తరిల్లె
నెచటవిన్నఁ గన్న నేడ్పులు పీన్గులే, ప్రళయరుద్రనాట్యపాటవములె. 6

వ. రాజకోటయు ని మ్మహామారిపాలఁ బడునో యని యే నపుడు బీతుకుడిచి యనా మయా
పాదకకార్యంబులందు నానేర్పు పెద్దదియగుటంజేసి నాసేవ నంగీకరింపుఁ డని దొరతనము
వారిం గోరుడు వారు నన్ను రోగపరిశీలకవర్గంబునం దొకసభ్యునిగా నియమించి-రంత7

ఆ. మఱుఁగుదొడ్లు తద్ద గరగరగా నున్కి, వలయుఁ గాన వాడవాడ కేగి
చాటుపెరదులుండుసందుల గొందులఁ, గంటి సభ్యులెల్ల వెంటనడువ. 8

క. తమదొడ్డులు చూడ నిరో, ధముసెప్పక పేదవారు తద్దయుఁ బేర్మిన్
మముఁ జూచిరి మాచెప్పిన, సమస్తసంస్క్రియ లొనర్పఁజాగిరి దీక్షన్. 9

క. ధనవంతులు తమపెడలిం, గనుఁగొంటకు నిచ్చగింపక మము న్గడుఁ జు
ల్కనగాఁ జూచిరి యింక మా, వినిచెడిహితవాక్కు లెట్లు విందురు వారల్. 10

ఆ. ఎట్టకేని దానియాగడఁ బరికించి, ఘోరనరకబాధఁ గుడిచినాఁడ
గౌలు తేమ క్రిములు గాఢాంధ మింకేమి, పేరుకొందు వారిపెరటిరోఁత. 11

ఆ. ఇలకు నంటనీక మలమూత్రముల నయః,పాత్రమంద విడిచి పవనమునకు
వెల్తురునకుఁ దగినవీలిచ్చుచో దొడ్డి, హానిసేయఁజాల దంటి నపుడు. 12

గీ. అవల మాతంగవాటిక కరిగి మాల, మాదిగలదొడ్లఁ గన నాకు మనసువోయె
సాటిసభ్యుల కీకాంక్షఁ జాటినంత, నద్భుతం బనిదంపూర్వ మవతరించె. 13

క. తుట్టతుద కొక్కసభ్యుం, డెట్టో తనవెంటరాక కిష్టంపడియెన్
మొట్టమొదలుగాఁ గన్గొని, కట్టబ్రంపడితి మాదిగలగూడెంబున్. 14

క. వెలివాడవారలు న్మముఁ, దిలకించినయంత నదరి దిగ్భ్రమపడి ర
వ్వల మీమఱుఁగుంబెరదుల, కలరూ పెఱుఁగంగ నేము కదుకొనువేడ్కన్. 15

క. వచ్చితి మని యే నన మే, మెచ్చట మలమూత్రశాల లెచ్చట దైవం
బిచ్చినబయళ్ళకుం జని, నిచ్చలు శకృదార్తి మేము నీఁగెద మన్నా! 16

క. మిముబోఁటి నాగరికులకు, రమాకృపాలబ్ధ సుఖపరంపరులకుఁ గా
క మలీమసులకు దారి,ద్ర్యమగ్నులకు నెట్లు మఱుఁగుతావులు చిక్కున్. 17

వ. అని నమ్రతాదైన్యంబులు విరియ వారు మాఱుపల్కిరంత నేను 18

క. మీయిండ్లఁ జూడ నొప్పెద, రా యనుదున్ గొంకదేల రండీ కనుఁడీ
మాయిం ద్లొకయింద్లా యిసి, రో యెలుకలకొంప లెల్లరోఁతలగంపల్. 19

క. అని వార లాడి రంతట, జనంగములు నిల్చుపెక్కుసదనంబుల నేఁ
గనుఁగొని వానివెలందికి, ననూనవిస్మయము హర్ష మందినవాఁడన్. 20

మం. కలయంపిఁ జల్లి చక్కఁదనాలు నిక్కు, జిలుఁగుమ్రుగ్గులు రచించిరి చత్వరముల
గోమయమ్మునఁ గ్రొత్తక్రొత్తగా నాల్కు, దెసల గోముఖమును దీర్చి రింటింటఁ
గుండలు చట్లు మూఁకుళ్ళు సానికలు, ముంతలు పిడతలు మొదలైనయట్టి
మృన్మయపాత్రముల్ మెఱుఁగులు క్రక్కు, చందానఁ దోమిరి చండాలకాంత
లిచ్చోటికిం జీడ లెట్లురానేర్చు, నేల మామేల్మోల్పు లిచటివారలకు. 21

వ. అయ్యది యట్లుండె - నంత మాస్వచ్ఛందసేవకసంఘము రాజకోటం గల చైత్యంబుల
సైతము పరికింపఁబూని మున్ముం దొకవిష్ణ్వాలయమ్ము నావేశించె - నందలి ప్రధానార్చ
కుఁదు మాకుటుంబమిత్రుఁ దగుటంజేసి 22

క. గుడినెల్ల మాకుఁ జూపఁగ, నొదఁబడె నాతండు మా హితోక్తులనెల్లన్
దదయక పాటించెద నని, కదుమక్కువఁ జూపె సాధుగణ్యుం దగుటన్. 23

క. అతఁదు నెఱుంగనికసటుం, బ్రతు కీడ్చుచునుండె నొక్కప ట్టాగుడిలోఁ
జితచితలాదెడు నెంగిలి, మెతుకులపుల్లియలు ముఱిగి మెండుకొనంగన్. 24

క. పావిత్ర్యనిలయ మనుకొను, దేవళమున గౌలు కవియుదెంచుట నన్మ
ద్భావమ్ముకలఁగి దుఃఖ, ప్లావితమై నాఁదు నన్ను బాధించెఁ గదున్. 25

వ. కోవెల యనం బరిపూతక్షేత్రంబనియు నందు శౌచవిధి నతిజాగరూకతమైఁ బాటింపఁ
దగు ననియు మనతలంపు - ధర్మతత్త్వవేత్తలు లో వెలి వెలందితనము కామక వలయు
నంద్రు - కాని దేనిదారి దానిద యయ్యె. 26

# 26 రాజభక్తి శుశ్రూషలు

మం. పరిపూతమగు రాజభక్తిలో నన్ను, దొరయువారలు జగత్తున లేరు లేరు
సత్యమ్ముదెస నాకు సహజానురాగ, మెలయు టేతద్భక్తిహేతువై యుండు
మెఱమెచ్చులకు దీని మెఱయు టే నెఱుఁగ, నాఫ్రికాధాత్రి నాయరుదెంచునట్టి
ప్రతిసదస్సున రాజభక్తిగీతమ్ము, వినిపించు గాయకవితతితోఁ గలిసి
తత్కృతిం బాడితి ధర్మ్యం బటంచు. 1

క. నా యెఱుఁగనిదోసము లాం, గ్లేయులరాచతికమందు లే వైనను ద
ద్గేయంబును మన్నించుట, చేయందగుచేఁత యని వచింపఁగ నోర్తున్. 2

వ. అనాఁ డాంగ్లేయరాజనీతి సౌఖ్యదాయకం బనియు నాఫ్రికాయందు సాక్షాత్కరించిన వర్ణ ద్వేషము దేశకాలానుసారిగాఁ బొడమినద కాని తెల్లవారి సహజలక్షణంబు కాదనియు విశ్వసించితి - గాన 3

ఆ. అవనినాధభక్తి నాంగ్లేయుల న్మట్టు, మిగిలి తాళ మరసి మేళ మెఱిఁగి
దొరలు పల్కుపలుకుతోఁ గంరము న్గల్పి, పాడినాఁడ రాజభక్తిగీతి. 4

క. అక్కఱ పొసఁగినవేళల, నిక్కొఱుఁగని రాచబత్తి నెఱపితి దానిన్
రొక్కమ్మునకును మెప్పుల, కొక్కపుడే నమ్ముకొంట కొడఁబడ నైతిన్. 5

వ. ఏను మాతృభూమికిం జేరినవెన్క విక్టోరియారాజ్ఞీ హీరోత్సవకార్యక్రమ మారబ్ధమయ్యె - నేతన్మహో నిర్వహణమ్ముపొంటె రాజకోటయం దేర్పడినదళమునం దేను బాల్గొని యధాశక్తి నిర్వ్యళీకంబగు ప్రభుభక్తిం బ్రకటించితి - వెండియు మాబాలురకును రాజకోటబోధనాభ్యసన కళాశాలా విద్యార్థులకును రాజభక్తి గీతమ్ము నేర్పితిఁ - గాని యహింసాధర్మపరిశీలనమ్ము ముమ్మరమై వాఙ్మనసముల దెస జాగర్య హెచ్చినకొలఁది నా కీకృతియం దాదరమ్ము తొలఁగె - నెట్టులన నందలి 6

క. రాజద్వేష్టలఁ గుఱప స,మాజంబునఁ జేర్చు మట్టి మాయావుల దు
ర్వ్యాజమ్ము లడఁపు మను నుడు, లేఁజెల్ల! మదీయబుద్ధి కింపని వయ్యెన్. 7

గీ. ఏలికకు దాయలైనవారెల్ల ధూర్తు, లగుదురో దోషమంతయు నగునె వారి
దీశ్వరుఁ డొకండె చాలువాఁ డిట్టియెడల, నితఁడు దండ్యుఁడు నిర్దోషి యితఁ డనంగ. 8

వ. ఈకృతింగూర్చి నాకొదవిన సందియమ్ములనెల్ల నానెచ్చెలియు భిషఙ్మణియు నగు బూథునకుం దెలుప నతఁడు నాయాశముంబెద్దచేసి యహింసానిరతి గల వాని కిప్పాట సూత్రపడ దని సందేశించె - మరియు 9

గీ. ఆఫ్రికాభారతీయ దైన్యమ్ముగుఱిచి, కోటలోఁ గరపత్రమ్ము గూర్చునాఁడు
తగినతావుల కేగి యేతత్సమస్య, రచ్చలోఁ బెట్టవలయు న న్నిచ్చవాఁడమె. 10

క. మునుముందుగ బొంబాయికిఁ, జనుదెంచితి న్యాయమూర్తిసత్తము రెనడేఁ
గనుగొంటి నతఁడు నాపల్కిన విన్నపమెల్ల నాలకించెను గరుణన్. 11

గీ. అతనియట్ల నన్నుఁ దయాబ్ధి యాదరించె, నిరువురు న్మెహతాచెంత కేగుమనిరి
పెద్దతగవర్లె యిట్లు సెప్పినకతాన, నాకు మెహతామహత్త్వ మంతయును దెలిసె. 12

ఆ. అంత నతనిచెంత కరిగితి సాధ్వసా, విష్టమైనమనసు వెనుక కీడ్వ
బొమిడికమ్ము లేని బొంబాయిసమ్రాట్టు, కొమరునట్లు నన్నుఁ గూర్మిచేసె. 13

వ. మఱియు నమ్మెహతా యిట్లనియె. 14

క. నీయుద్యమంబు విశ్వ, శ్రేయోవహ మది కడుం బ్రసిద్ధి గడింపన్
జేయఁ దగు నిచట నొకసభ, నాయోపినతోడుపా టొనర్చెద నీకున్. 15

క. బొంబాయిసింగ మీసర, ఱిం బల్కి సభాదినంబు నేమించి ప్రసా
దం బార నన్ను నంపుడుఁ, బంబినహర్షమ్ముతోడ బసకుం జనితిన్. 16

క. ఆవలఁ దత్పురిఁ గల మా, బావను దరిసించుపొంటెఁ బయనించితి రో
గావలికిన్ వసపడి నా, నావేదన లందుచుండె నాఁ డతఁ డకటా. 17

ఆ. అతఁడు నిస్సుఁ దగుట నస్మత్సహోదరి, యూడిగంపుప్రేఁగు నోర్వలేమి
నరసి రాజకోట కరుదెమ్ము నా నియ్య, కొనియె భావుకుండు కొంకువేళ. 18

ఆ. అంత నాలసింప కక్కతో బావతో, నరిగినాఁడఁ గాణయాచి కెంద
ఱెన్నిమందు లిడిన నెద్రిచి తద్రోగంబు, ముదిరెఁ గాని సుంత బెదరదయ్యె. 19

క. బావన్ నావసియించెడి, యోవరిలో నిల్ప యెల్లయుపచారములన్
గావించితి రేయుం బవ, లావంతయు విసువులేని యాదటతోడన్. 20

క. కనుమూఁత లేక వేళకుఁ, దిను టెఱుఁగక సేవచేసితిం బావకు ని
ప్పటిలో నేటాలుసమ, స్యను మఱవక యుంటి గ్రంథసంధాయకతన్. 21

ఆ. ఎంతపడిన దైవ మెడపెట్టె భావుకు, దుర్దమార్తిజలధిఁ దోఁచె నన్ను
బావ నట్లుకొలుచుభాగ్యంబు కల్మిచే, నపుడు కొంతదుఃఖ ముపశమించె. 22

గీ. తెగులుగొంటుల కిట్టు లూడిగముసేయు, కోర్కి నానాఁటికి న్నాకుఁ గొనలుసాఁగె
నేత దుపచారములమీఁది ప్రీతికతనఁ, జుల్కఁజేసితి నొకొకప్పు సొంతపనులు. 23

వ. అపు దప్పు డిట్టిచాకిరి సేఁతకు నాయిల్లాలిన కాక మాకుటుంబమువారినెల్ల నియోగించు వాఁడ - నొకనిసంతుష్టికై కాక దంబము వలచియుఁ బ్రజాభిప్రాయమునకు వెఱచియుఁ గావించుసేవ నిరర్థకమ - యది సేవకునాత్మోన్నతి నదంచు నూడిగం బెయ్యది హృది నానందితముఁ గావింపఁజాల దయ్యది కొలువుకాని కర్థదాయకమ్ము కామియు కాక సేవ్యుని సైతము సుఖితుం జేయనేరదు - మఱియు 24

ఆ. చిత్త మెప్పు డార్తసేవావిధానమ్ము, మరగి తాఁ బ్రమోదమగ్న మగునొ
యపుడ భోగజాల మర్థమ్ము వైయర్థ్య, భాజనం బటన్న భావ మొదవు. 25



## 27 బొంబాయి సభ

క. మాసోదరిభర్త మమ్ముం, బాసినమఱునాఁడ దుఃఖభారము నెట్లో
త్రోసిచనితిన్ సభాదిన, మాసన్నం బగుటఁజేసి యలబొంబయికిన్. 1

వ. మెహతా మున్ను ముదలవెట్టినట్ల సభాపూర్వదినంబున నతనిం గంటి - నప్పుడప్పెను మానిసి 2

గీ. వ్రాసితెచ్చితె నీయుపన్యాస మెల్ల, గాంధి! యది యెన్నిపొరటల గ్రంథమయ్యె
ననుడు నంజుచు నంజుచు నాశుఫక్కి, నొదువనెంచితి నంటి రాల్పద నెలుంగు. 3

వ. అంత ఫిరోజిషామెహతా విస్మయంబు నభినయించువాఁడు నన్నుంగని యిట్లనియె. 4

క. తగ దీతెఱంగు తగ దీ, నగరంబున వార్తలంపు నదవడి కలవా
రెగుడుదిగుడు కవనంబుల, కగపదరో వాఙ్ముఖంబు నచ్చొత్తనిచోన్. 5

గీ. వ్రాయు మిపుడేని బిరబిరవ్రాయు మెల్ల, పాట్లువడి తెల్లవాఱులోపలన దాని
నచ్చువేయింపవలయు నిట్లైననాఁడె, యంతయో యింతయో ఫలం బబ్బు సభకు. 6

గీ. అనుటయుం దెల్లఁబోయి గత్యంతరంబు, లేమి శరవేగమున నాదులేఖనంబు
పూర్తిగావించి ముద్రణంబునకుఁ దార్చి, పవ్వళించితి గుండియబరువు డించి. 7

గీ. తెల్లవాఱె సభాకాల మల్ల వచ్చె, నచ్చెరువుగొల్పె నా క మ్మహాసదస్సు
కొలువుచెవి కంటదాయె నాపలుకుపల్కు, నదుఁకుచుం బెంచినాఁడఁ గంఠస్వరంబు. 8

గీ. ఇంక నెత్తిలి భాషింపుమీ యటంచుఁ, దఱుమఁగాఁ జాగె న మ్మెహతామనీషి
యెంతగా న న్నతఁడు ప్రోత్సహించినాఁడొ, యంతగా స్రగ్గఁబాఱె నాగొంతురవళి. 9

వ. పదంపడి నాచిరంతనవయస్యుఁడగు కేశవరావు నన్నుద్ధరింప సభనుండి లేచివచ్చె - నతని యెలుంగు గంభీరమైనద - కాని సభ్యులు 'వాఘా'ను వలచుటంజేసి నాపని నతండు విన్నాణముగా ముగించెఁ - బరిషత్తు వింజ మాఁకపెట్టిన ట్లయ్యె - సదస్యులు నాయుప న్యాసము న్మిగుల మెచ్చిరి - కాన నా కెనలేని యానంద ముదయించె - వెండియు నయ్యవసరంబున 10

క. నాయకరత్నము మెహతా, నాయుక్తులఁ బెద్దసేయ నా కది గంగా
తోయమునయందు గ్రుంగిన, తోయమున న్మోవరాని తోషముఁ గూర్చెన్. 11

వ. మఱియు నానాఁడు మన్మిత్రులగు ధర్మవాదులు మువ్వు రాఫ్రికాకు విజయంజేసి నాయుద్య మంబునకు బాసటయౌదు మని బాసయిచ్చిరి - కాని యయ్యాయి నిరోధమ్ములకతన వారు నన్నాదుకొనలేకపోయి - రంత నేను బొంబాయినగరంబును గాలించి గాలించి నా సీమచెలికాఁడగు పేస్తనజీని గన్గొంటి - నితఁడు 12

క. అసమానశేముషీ సా, రసమగ్రుఁడు ధర్మవాదిరత్నము; శాకాం
ధసులము గావున మాకుం, బొసఁగెను జెలికార మాంగ్లభూవాసమునన్. 13

గీ. కోవిదుఁ డతండు ఘూర్జరకోశరచన, కగ్గపడె నప్పు డుభయభవ్యప్రసంగ
మైనయంతన పేర్మిమై నాఫ్రికాకు, వచ్చి తోడ్పడవో యని వాని నంటి. 14

గీ. అతఁడు నా కణుమాత్ర సాయం బొనర్ప, నొల్లమియ కాక నను సైత మల్లగడ్డ
కరుగఁ దగదంచు నెచరించె భరతభూమి, లేదె మనసేవ కని మూదలించి పలికె. 15

వ. వెండియు నచ్చెల్మికాఁడు నన్నుంగని 16

గీ. మాతృభాషాభివృద్ధికై మన మొనర్పఁ, దగినపను లెన్నిలేవు? సంతతము ప్రబ్బి
వచ్చు పాశ్చాత్యవిజ్ఞానవైభవంబు, తెల్ల మొనరింపవా జనుర్దేశమునకు. 17

ఆ. ప్రకృతిశాస్త్రమునకుఁ బరిభాష లేను శో,ధించుచుంటి నిపుడు తెఱపి లేక
మంద లనియ లేని మత్కార్యభూమిలో, వింటివా యిదెంత వీసమంత. 18

ఆ. కోట్లకొలఁదిప్రజలు కూటికి గుడ్డ క,ల్లాడుచుందు రిందుఁ జూడవోటు?
చదువు లేక హృదయసామరస్యము లేక, సంఘు మడుగుపట్టుజాడఁ గనవొ. 19

ఆ. భారతీయు లాఫ్రికారాష్ట్రముల స్రగ్గి, మ్రగ్గిపోవుచున్నమాట నిజమ
కాని నిన్నువంటి కఱకరి వారికై, మీఁదుకట్టుకొంట మెచ్చుగాదు. 20

క. మునుముందు కదలి భారత, జనయిత్రీదాస్యపీడఁ జంపఁగవలయున్
వెనుక నలవోకగా ల,గ్గొనరు మ్మనవారి కెచట నున్నను గాంధీ! 21

క. నీతత్త్వము సవరించుట, భ్రాంతి యటం చెఱుఁగుదును భవాదృశు లైనన్
నీతో నెటాలుగడ్డకు, నేతేరక యునికి తనకు నెంతయు నించున్. **22**

వ. అనుటయు నతనిహితవాదము న న్నసంతృప్తిపా లొనరించెఁ - గాని యీ సల్లపనమ్ము కతనఁ బేస్తనజీపట్ల నావెలారించు పెంపు పొంపిరివోయె - నతనిదేశాభిమానమునకు భాషాభి రతికి లెస్సపొంగితి - మానెయ్యం బీప్రస్తావమునంజేసి మిగుల బిగిసె-నైన నప్పుడు **23**

క. నేటాలుభారతీయుల, కూటువకుం గొలువుసల్పుకోరిక నాకుం
గాటంబై కృష్ణుని యీ, మాటలు నాయుల్లమందు మల్లడిగొనియెన్. **24**

మం. పరధర్మమును లెస్స పాటించుకంటె, నిజధర్మ మెట్టిదేని భజించు టుఱవు
తనధర్మమునఁ జావు తద్దమే లిచ్చుఁ, బరధర్మమునకొల్వు భయకారణంబు. **25**



## 28 పూనాలో

క. బొంబాయి నెడసి పూనా, కుం బోయితి లోకమాన్యగోకులు లచటం
బంబినకీరితి నిరుప, క్షంబులఁ బాలించుచుంద్రు సౌజన్యనిధుల్. **1**

వ. ఏను దొలుతొల్త బాలగంగాధరుం గదిసి వినీతుఁడనై **2**

ఆ. అన్ని తెగలవారి యాశీస్సు లర్థించి, యిచటు త్రొక్కినాఁడఁ గృప వెలార్ప
మనుడు లోకమాన్యుఁ డమ్మాటమెచ్చి నీ, పనికి నెల్ల రిష్టపడెద రనియె. **3**

గీ. రాజకీయప్రపంచ దూరస్థితుండు, సభకు నధ్యక్షుఁ డగుట యాశాస్య మందుఁ
బూజనీయుఁడు సడిసన్నబుధుఁడు రామ,కృష్ణభండార్క రర్హుఁ డీకృతికి ననియె. **4**

ఆ. సభల నిపు డతండు సన్న్యసించెన కాని, యీకొనంగవచ్చు నిట్టికొలువు
నతనిఁ గన్నవెనుక నరుదెంచి ఫలితాంశ, మెఱుకసేయు మనియె బుద్ధబుద్ధి. **5**

క. గోకులుఁ జూడుము గాంధీ!, నీ కక్కఱ వొడమెనేని నిర్భీకుఁడవై
నాకడకు రమ్ము వేసట,నాక సహాయుండ నౌదు నలి ననిపల్కెన్. **6**

వ. అంత నిట్టియుదారుం డగుటన బాలగంగాధరుఁడు లోకమాన్యుఁ డయ్యె - నితఁడు నసుబోఁటి ప్రత్యగ్రపరిచితు నింత గారవించునే యని నక్కజంపడుచు ఫెర్గుసన్ కళాశాల నున్న గోపాలకృష్ణుని సన్నిధికిం జనుడు నమ్మహామహుఁడు నన్నుఁ దనవానిఁగాఁ బ్రేమించి నూత్నవిద్యార్థినింబలె గ్రుచ్చిగ్రుచ్చి పరిశీలించి నాకుఁ దన్నగరంబునందలి సందర్శనీయుల

నెల్లరం దెలిపి నీయుపన్యాసంబు నాలింప నురవణించుచున్నాఁడనని నన్నుఁ బెద్దచేసి తన విద్యాలయంబు నలుగడం ద్రిప్పి వలసినపుడెల్ల నీకు నాయండ కలదనియు భండార్కరు నుత్తరము నాచెవిని వైవవలతు ననియుం బ్రోత్సహించి వీడుకొల్పె–నయ్యవసరంబున 7

క. మెహతా హిమాద్రియట్టుల, మహనీయుఁడు తిలకు వార్ధిమాడ్కిని గంగా
లహరివలె సజ్జనస్తో, మహితుఁడు గోకులుఁడు నాదుమదికిం దోఁచెన్. 8

గీ. అద్రిపతి నెక్కలే మబ్ధి నడుగుమోప, వెఱతు మమరాపగా వీచివీధులందు
నోలలాడెద మొనరింతు మోదపయన, మాదుకొననేర్తు మా తల్లియంకపీఠి. 9

మం. గోపాలకృష్ణగోకులుఁ దర్శణీయుఁ, డానాఁడు రాజనీత్యంశమ్ములందు
నస్మద్ధృదయ మెంత యతిమె గోభూమి, నుండియు నేఁ దంత యొత్తరించెదిని
బరు లెవ్వరేని మద్భావమ్ము నట్టు, లాక్రమించియెఱుంగ రని పల్కరింతు. 10

వ. అయ్యది యట్లుండె. 11

క. అంతట నే భండార్కరు, చెంతకుఁ జని నాదుమనవిఁ జెప్పితి సంఖ్యా
వంతుం డాతఁడు జనకుని, వంతున నన్గారవించె వాత్సల్యమునన్. 12

గీ. అన్న నా కిప్డు రాజకీయములతోడి, జడ్డు సుంతయు లేకున్కి జగ మెఱుంగు
నైన నిన్ను నైరాశ్యోపహతునొనర్ప, నోడెద న్నీదువాదంబుయుక్తమనియె. 13

క. అభినంద్యము నీజతనము, సభ నాకే లంచు నుడువఁజాల మనీషా
ఋభుగురులు తిలగ్గోకులు, లుభయులు న న్నొనటన్న నొప్పెద ననియెన్. 14

క. వా రిచ్చగించునాఁడే, వారక పరిషత్తు జరుపవచ్చును భవదీ
యారంభము జయలక్ష్మి ప,రీరంభముకల్మి విస్తరిల్లుత మనియెన్. 15

వ. ఇట్లు పరమపూజ్యులు నిరాడంబరులు నగు నియ్యంతర్వాణిగ్రామణులు నన్నాదరించి యనాయాసంబుగా ననార్భటముగా సదస్సు జరిపించి నన్నంపి – రంత నేఁ జెన్నపురి కేగుడుఁ దన్నగరంబునవారు నారాక కుప్పొంగి విద్వన్మణియగు సుబ్రహ్మణ్యుని యాజమాన్యమునఁ బేరోలగము సమావేశపతిచి – రందు నావినిచిన బాలసుందరుకథ సభ్యులన్ మిగుల నాకర్షించె – మఱియు నే నయ్యెడ 16

క. అతిదీర్ఘవాఙ్ముఖము ము,ద్రితమ్ము పరియించుడుం బ్రతిపదం బవధా
నిత విని సదస్యు లాస, క్తతఁ జూపిరి పచ్చపుస్తకంబును విలువన్. 17

గీ. వేఁడివేఁడి గారెలవోలె వేలకొలఁది, పొత్తములు చెల్లెఁ గీర్తిసంపత్తిఁ గన్న
పత్రికానేతృమండలిమైత్రిఁ గంటి, నెల్లభంగుల నావేడ్క వెల్లివాఁడిచె. 18

వ. నాఁటి నాప్రసంగము లన్నియు నాంగ్లభాషయంద నడిచెఁ - గాని యింటిలో వెలువడు నంత సౌహృద్య సౌహిత్య సముత్సాహములు నాపట్ల మద్రపురమ్మున బాహిరపోయె - నెమ్మికిం ద్రెవ్వనిపాశంబులు లేవుకదా. 19



# 29 వెంటనే రమ్మ

క. పదపడి కాళీఘట్టముఁ, గదిసితిఁ బరిచితులలేమికతమున నానా
పదలం బ్రుంగితి నచ్చటఁ, గొదుకుచుఁ గొదుకుచు సురేంద్రుఁ గొల్వనఁగంటిన్. 1

ఆ. అతఁడు వంగదైవ మామాట లీమాట, లైనవెనుక నిప్పురాన నీదు
పలుకు నాలకించుప్రజ లుండరని నాకు, నుత్తలంబు గదురుచున్న దనియె. 2

వ. ఇఁక నమృతబజారుపత్రికా సంపాదకుడు న న్నొక తిరుగుఁబోతుఁగా నూహించె - వంగ వాసిపత్రికా యజమానుఁడు నీజోలి మా కక్కఱలే దనె - నిట్టి దుష్ఫలితమ్ముల కే నోడక యింగ్లీషుమన్, స్టేట్సుమన్ పత్రికా సంపాదకులఁ గన్గొంటి - నాంగ్లహైందవులగు వారు నన్నాదరించి యాఫ్రికాభారతీయ సమస్య విలువ కలదని యెఱింగి దానింగుఱిచి నాయొసం గిన యంశమునెల్లఁ బ్రకటింపఁ జాగి - రం దింగ్లీషుమన్ సంపాదకుఁడు సాందర్సు న న్నాత్మీయుఁగా భావించి తన పత్రికను నా కప్పగించె - నితనికి న్నాకును గడిందినెయ్య మేర్పడె నంట యతిశయోక్తి కాఁజాలదు - యథాశక్తి నీయుద్యమంబునకుఁ దోడ్పడెద నని యియ్యెదారుండు నాకు వాగ్దాన మొనరించి దానిని శతధా పాలించె - నాబ్రదిమి యందు దబ్బాటుగాఁ బాటిల్లిన మధురాతిమధుర ప్రణయంబు లీదృశంబు లెన్నేని గలవు - నాకు దంబములేమియు సత్యప్రవణత కల్మియు సాందర్సు వెలారించునెనరునకుఁ గారణంబు లాయె - నితఁడు నన్నుఁ బెద్దపరికించె - నాఫ్రికా యందలి యాంగ్లేయుల తప్పులం దెగడుటకు నొప్పులం బొగడుటకు నేను సంశయింపలేదని తా నెఱింగె - నెదిరి యెడ మన మెంత ధర్మ్యముగాఁ జరింతు మంత వేగిరమ్ముగా మనకు న్యాయము లభించు నని నా యనుభూతి ఘోషించుచున్నయది - యి ట్లనుకోని సాయము ప్రాప్తించుదుం గలకత్తాయందుసైత మొక సదస్సు జరుప నెదురుచూచుచుంటి - నింతలో దర్బానుమిత్రు లిచటి శాసననిర్మాణసభ త్వరలోఁ గూడఁబోవుచున్నది - కాన మీరు వెంటనే రావలయు - నని నాకుఁ దంత్రీవార్త నంపుటం జేసి కలకత్తా కార్యక్రమాదులకు స్వస్తిచెప్పి నాయిల్లాలితో నిరుగురు బిడ్డలతో మేనల్లునితో ధూమనౌక నెక్కి రెండవమా ఆఫ్రికాపయనంబు సాగించితి. 3



# ఆ త్మ క థ

## తృతీయ భాగము

## 1 గాలివానచిన్నెలు

క. నడితరపు హైన్దవులలోఁ, గడుఁ బిన్నతికంబునంద కల్యాణవిధుల్
నడుచుట నాలుమగలమ, న్గడ లితరేతరవిరుద్ధ గత్యాశ్రయముల్. 1

గీ. మగఁడు చదువరిగానుంట మగువ కోన, మాలురాకుంట నైకసంసారసరణి
యగుట నింటియతండు తోయలికొనర్ప, వలయు నాచార్యకంబు చిక్కులకునోర్చి. 2

వ. కావున నేను 3

గీ. ఆలుబిడ్డల వేసంబునందు బాస, యెడల నాహారమున నడవడికపట్ల
రీతిదెసఁ బెద్దకాలంబు దృష్టినిల్పి, సైఁచితిం దొల్లి యింటియొజ్జనముబరువు. 4

వ. ఆనాఁటికథలు కొన్ని తలఁపునంబాఱి నేఁడునాకెనలేనినగవు పుత్తించు - వెండియు 5

గీ. పతిని సేవించుటయ తనపాలి పరమ, ధర్మమని విశ్వసించు హైందవవధూటి
జాయ కొడయండనని భారతీయుఁ డెంచు,నగుటఁబతిచేతికీల్బొమ్మ యయ్యెనబల. 6

వ. అయ్యది యట్లుండె - సభ్యత నర్థించువా రాంగ్లేయుల జీవనపద్ధతుల నవలంబింప వలయు
నని యట్లొనర్చిననాఁడ వారికి సంఘమునయందు గౌరవం బేర్పడునని మన్ననలేనివారు
ప్రజాసేవ కనర్హులని మున్ను నాతలంపు - కాన నాలుబిడ్డల చీరసింగారములు నాయిచ్ఛ
కొలఁది నేమించి కోమటివేసంబు వదలించితి - రాను రా నాంగ్లేయుల ననుకరించుట
దూష్యమనియుఁ బారసీక నాగరికత యెల్లనాడె ములం గ్రేడిసేయునట్టి దనియు నెఱింగి
మాయింటికి దాని నాహ్వానించితి - నీవిపర్యాసంబు నాయిల్లాలికిం బిల్లలకు నసమ్మతంబ
- యైనను వారు నావాదమ్మున కెదురాడనేరక నాచెల్లుబడి నుల్లంఘింపఁజాలక చెప్పిన
వాలకమ్ములెల్ల నవరింపఁజాగిరి - మఱి కొన్నినాళ్ళ కీతగులము నన్ను డిగఁద్రావుటంజేసి
నాగరికతా కూర్పాసకం బూడ్చివైచి సుఖంపడితి - వెండియు నాలుబిడ్డలతో నౌకాయానం
బొనర్చుటకు నాకిదియ మొదలు - కాని 7

క. పలువురు మిత్రులు బంధులు, కలమ్మునం దుంట నాకుఁ గడుఁగూరుచు నె
చ్చెలికాఁ డభియోక్తయు నై, యలరెడు నబ్దుల్ల తరణి కధిపతి యగుటన్. 8

ఆ. ఇంట నున్నయట్ల యింటర మెఱుఁగని, జలధియాత్ర నవుడు సలుపఁగంటిఁ
గాని గమ్యభూమి కడుదాపునం దున్న, వేళ విసరెఁ బెద్దగాలివాన. 9

క. అఱచేత నుసుఱు లిడుకొని, తెరువరు లత్తఱి విభిన్నధీదూరగులై
పరమేశ్వరు నిచ్చల ని,ర్భర నిర్మల భక్తియుక్తిఁ బాడిరి దీనుల్. 10

క. హిందువులు ముసల్మానులు, నందఱు నొకతల్లిబిడ్డ లైరపు డందుం
గొందఱు ముడుపులుగట్టిరి, కొందఱు నాస్తిక్య మట్టె గురువులువాఱెన్. 11

క. తండేలు మమ్ముఁ గని యీ, గండంబున కేమి యిట్టిగాడుపువానల్
తండోపతండము ల్గని, యుండినవాఁ డీతఁ డీర లోడకుఁ డనియెన్. 12

క. అతఁ డెంతదిటవు సెప్పిన, మతి కూఱట నొసఁగవయ్యె మా కాశాసం
తతి వ్రయ్యవాఱుఁ జటులా, వ్ర తీవ్రతం బేర్చు విలయఝుంఝూఝుంపల్. 13

గీ. అదె విరిసె నావ యిదె కలం బవిసె నన్న, రొద లనుక్షణ మెసరేఁగె నెదలు వ్రీల
మిట్టతరఁగలు ఱంపిల్లి ముట్టడింప, నోడ యుయ్యాలజంపాలు లూఁగఁజొగె. 14

క. ఏతన్మహాభయంకర, వాతార్భటి నిలిచె నొకదివారాత్రము; త
ర్వాత మొయి ళ్లైదలెను జల,జాతాప్తునిదర్శనంబు సమకుఱె మాకున్. 15

ఉ. ఎల్లరమోములందు నటియించె వినూత్నమహస్సు, గాడుపున్
వల్లడితోడనే పరుగువాఱె హరిస్మరణేచ్ఛ, విచ్చె న
ల్లల్లన పంచతాభయ, మనంతర మంతములేని యజ్ఞ తా
వల్లులు వ్రమ్మివ్రమ్మి తెరువర్లను దప్పుడుదారి కీడిచెన్. 16

క. అవ్వల భగవద్గీతులు, నివ్వటిలెంగాని తొంటినిశ్చలదీక్షల్
దవ్వులకుం జనె నెఱపులు, కవ్వింపనినాఁడు భక్తి కానంబడునే. 17

గీ. ఈమహావాతవిప్లవం బామతిల్లి, తెరువరులనెల్ల నాదునెయ్యుర నొనర్చె
నిట్టిచెట్టలు మున్ను కన్నట్టివాఁడ, నగుట నిగ్గాలివాన కే నలుకనైతి. 18

క. కదలిచీడలేవి వొడమవ నాకు ని,క్కతనఁజేసి గాలికసరువేళఁ
బేదగుండెలేక పేటనఁబెట్టితి, నధ్వనీనసాధ్వ సాపహృతికి. 19

క. చుక్కానువాని మెఱవడి, వాక్కుల నపుడపుడ వినిచి వారలభీతిం
జక్కాడితి మిక్కిలిగా, నక్కఱకు న్వచ్చె నేస్త మయ్యది నాకున్. 20

వ. మాపయనించునోడయు దాని ననుసరించు నబ్దుల్లాసెట్టి వేఱొండునావయు నిడుమలం గడచి వచ్చివచ్చి దర్బానుఘట్టమ్మునం దుక్కుజీను దిగవైచెఁ – గాని నేను నిక్కపుంగసరున కగ్గపడి బెగ్గడిల్లుట ముంగలన కలదుగదా! 21



# 2 గాలివాన

మం. పదియునెన్మిదినాళ్లు పయనం బొనర్చి, దర్బానుతీరమ్ము తఱియు, మావచ్చు
కలము బొంబాయిలోఁ కదలిననాఁడు, బొబ్బరోగంబు తత్పురి నున్నకతన
నీరుజాబీజంబు లిర్వదిమూఁడు, వాసరంబులు చెల్లువఱ కుండుఁ గాన
నిలిచినైదుదినాలు నిండెదుదన్క, నోడ సంద్రమునంద యుండంగవలయుఁ
బ్రజ లెవ్వ రుర్విపైఁబాదుకోరాద, యని వెజ్జు మానౌక నంకిలిపెట్టె. 1

వ. ఈ సత్కారము రెండవకప్పలికిని ముట్టె – దర్బానునందలి యాంగ్లేయు లీనౌకాయాత్రికుల
వచ్చినదారిన పాఱఁద్రోలుటకు వెగ్గలంబుగా మొగ్గరంబులు పన్నుచుంట యితనిముదల
కొకహేతు వాయె – నబ్దుల్లావణిగ్వర్గమువారు నగరవార్తావిశేషంబు లెప్పటి వప్పుడ మాకు
నివేదింపఁ జాగిరి – తెల్లవా రానాఁటి కానాఁడు సంఘీభవించి సెట్టి నొకదెస వెఱపించుచు
నొకదెస బుజ్జగించుచు నతఁడు తన రెండోడలం ద్రిప్పిపంపుచో వచ్చుదండువు లచ్చుకొందు
మని సూచించుచుండిరి – కాని తద్వణిక్పుంగవుఁడు 2

క. తెలవారి లెక్కసేయక, ఫలితం బెటులైన నొడ్డుపట్టించెద నా
కలములఁ దప్పక పాంథుల, నిలపై డించెద నటంచు నెరగలిఁ గ్రక్కెన్. 3

గీ. ఒక్కదెస దీనభారతీయులు మఱొక్క, దెస భుజాసంప దధికార ధీబలప్ర
పూర్ణులగు నాంగిలేయు లేపునఁ దెగింపఁ, గదనమిబ్బంగిభయదమై మొదలుకొనియె. 4

గీ. అబ్దులా మన కిఁక వంగఁ దనితలంచి, యాత్రికులవంక కత్తెత్తి రాంగిలేయు
లింటికిం గ్రమ్మఱిల్ల కిం దుంటిరేని, పంతమున మిమ్ము జలధిలో ముంతుమనిరి. 5

క. మా పనుపుం దలఁదాల్చిన, మీ పయనపువెచ్చమెల్ల మే మిచ్చెద మే
లా పీడ లిచ్చగింపఁగఁ, బోపొందని భీతినీతి బోధించి రొగిన్. 6

వ. అయ్యవసరంబునం దేను యాత్రికులం గదిసి 7

క. జంకకుఁ డీధవళాస్యుల, జంకెనలకు; నంకిలింపఁజాలర మిము వీ
రింకెన్ని యీఱతాఱల, కుంకించిన నించుకేని యోడకుఁ డంటిన్. 8

క. తెరువరులు నెమ్మి వీడక, ధరాధరములైరి వారిఁ దత్త్రక్కిడా
పరిచితుల నొనర్చి వినో,దరసమ్మున బ్రుంగఁజేయు తరుణమునందున్. 9

క. వచ్చెం గిసిమిసిపండువు, మచ్చికమై నావికుండు మా కాతిథ్యం
బిచ్చె నపు డధ్వనీనజ, నోచ్చయ మది కూడికూడి యొకసభ యయ్యెన్. 10

క. ఆసభ గంభీరోప, న్యాసం బొసగింఁతిఁ బ్రతీచ్యనాగరికత్వ
శ్రీసరణిగుఱిచి; మన్మన, మాసమయమునందు జగడమందే నిలిచెన్. 11

వ. ఏలయన దర్బానునందు రేcగిన యాకయ్యంబున కేన మధ్యబిందువ నైతి- హిందూదేశమున నున్నతతి నే నాఫ్రికావాసులగు నాంగ్లేయులం బాడితప్పి దిసంతులుకొట్టితి ననియు నేటాలు గడ్డనెల్ల భారతీయమయంబుc గావింపనెంచి రెండోదలపజను దెచ్చితి ననియుc దెల్లవారు నాయెడ నెగ్గుమోపిరి - కాని కల్లపొల్లనమ్మికలు సెప్పి నేటాలున కరుదెమ్మని భారతీయు నొకనినేని యేనర్థించి యెఱుంగ - నావచ్చు నావయందలి తెరువ ర్లేనలువురో త్రిక్కc దక్కెల్లవారు నాయెఱుక కందని వార - యిcక రెండగునోదవా రందఱు నా కపరిచితుల - వెండియు ము న్నాఫ్రికాలో వెల్లడింపనియక్కర మొక్కcడేని తత్రత్యులగు నాంగ్లేయులం గూర్చి భారతంబున భాషింపనైతి - నావినిచిన యెల్లమాటకు న్వలసినన్ని తారకాణ లుండె - నైనను దమసంస్కృతికి దాసులై తెల్లవా రిట్లు పరిణమించి - రీమార్పు నాకు నిరంతర వేదనాజనక మయ్యెc - గాననాcటిగోష్ఠిలో దీనిం దదవితి - శ్రోతలు కర్ణధారాదులు నా తలంపు నాదరించి నాపల్కులనోర్మిమై నాలించిరి - సభానంతరము ప్రతీచీన సంస్కృతిం గుఱిచి నావికాదులకు నాకును గొంతగ్రంథము నడిచె - నం దేను బాశ్చాత్యనాగరికత హింసాత్మక మనియుc బ్రాచ్యసంస్కృతి యహింసాబద్ధ మనియు వక్కాణించితి - నంత సభ్యులు న న్ననుయోగవర్షంబున ముంచి - రపుడు సరంగు నన్నుcగని 12

గీ. ఆంగిలేయులు నేc దన్నయట్ల రేపు, ఘోరహింసలకుం బూనుకొందురేని
యేవిధిం దావకం బహింసావిధాన, ముజ్జగింపక సాగింప నోర్తువయ్య. 13

వ. అనవుడు న్నేను 14

గీ. వార లొనరించు హింసాపచారమెల్ల, సైcపcగలబుద్ధి ధైర్యమ్ము సాహసంబు
మాకు జగదీశ్వరుండు కామక యొసంగి, విజయమొనగూర్చునని యేను విశ్వసింతు. 15

క. ఈరీతి నన్నుc గలcచిన, వీరిదెసన్ లేద సుంతవేర్మియు నాకున్
బేరిన యెఱుcగమిరొంపిం, దూఱిన యీనరులcజూచి దుఃఖంపడెదన్. 16

క. తమ యిట్లొనర్చుచేcతలు, సమంజసము లనియ వీరు సంభావిం త్రీ
క్రమ మెఱిcగినవానికి నె,ట్లమర్ష ముదయించు నాకు నాంగ్లేయులపై. 17

వ. అని యొసంగిన నామాఱుమాట నాలకించి నావికాదులు పెక్కండ్రు నన్నుc బరిహసించిరి - నాపల్కులయెడ వారి కేర్పడిన విశ్వాసము తాదృశము కాcబోలు-నిట్లు నిరుత్సాహమ్ముతోc బ్రొద్దులుపుచ్చుచు నౌకాబంధమ్ము త్రెంచుకొని గట్టెక్కు టెన్నcటికొ యని యే నురియాడుచున్న తతి 18

క. వింటిరె యిలc బదికాలము, లుంటకు మీ కిచ్చగింతయుండిన మాకున్
బంటులవలె వంగుదు వెడ, తంటాలకు రాకుc దేల తలతో నడకల్. 19

ఆ. అనుచుఁ దెల్లవార లంపినవార్త కే, నొల్లఁబోక సుంత డిల్లపోక
పధికలోకమెల్లఁ బ్రకటించుధీరతా, గరిమ మరసి హర్షభయము మెఱసి. 20

క. దిక్కోటి వ్రక్కలైనన్, జుక్కలు తెగిపడిన రవియు సోముఁడు పాడిం
దక్కిన దర్పనుతీరం, బెక్కెద మిది ధర్మబద్ధమే యగుఁ జుండీ. 21

వ. అని యాంగ్లేయులకుఁ బ్రత్యుత్తరంబు నంపితిఁ – గొట్టకొస కిర్వదిమూఁడునాళ్లు ముగిసిన వెన్క నావ లొడ్డుపట్టవచ్చు ననియుఁదెరువరులు నేలపై నడుగుమోప వచ్చుననియు నేలుబడివా రియ్యకొనిరి. 22



# 3 ఒరగల్లు

మం. రెండోదలును వచ్చి రేవులో విడిసెఁ, దెరువరు లెల్లరు న్దిగి రొయ్య నొయ్య
నపుడు నేటాలురాజ్యమ్ము పాలించు, నెస్కాంబి ప్రెగడలకెల్లఁ గన్నాకు
చీఁకట్లు కవియుదెంచిన యనంతరము, గాంధిని డింపుమీ కప్పలివలన
నతనిపేరన్న నేఁ దాంగ్లేయులెల్లఁ, బ్రళయాగ్నులై రోషపడుచున్నవారు
తతిసె నాతనికి దుస్తర దుర్విపత్తి, తీరపాలకుఁడు రాతిరివేళ నతని
నిరుపద్రవంబుగా నెలవును జేర్చు, నని కర్ణధారున కనిపె సందేశ
మది విని మేలుమే లనియంటి నేను. 1

వ. పదంపడి యబ్దుల్లావర్తకమండలివారి ధర్మవాదియు నాంగ్లేయుఁడు ఋజువర్తనుఁడు నగు లాటను వచ్చి నన్నుఁగదిసి యిట్లనియె. 2

ఆ. ఏలపెద్దచేసె దెస్కాంబివార్త నీ, వంటివాఁడు దొంగవానివోలె
నిల్లు సేరఁదగునె యీఁగయు నీమీఁద, నాదకుండఁ జూచువాఁడ నేను. 3

క. పురి నిత్తతి మదిమదికిం, గఱవన్నది లేద యెవరికార్యములకు వా
రరిగిరి యాంగ్లేయులు; భయ, పరతంత్రక కేల పాలుపడెదవు గాంధీ! 4

గీ. తదయ నేటికి మనసుపేదతిమి లేని, రవర వైతేని యాలుబిడ్డలను మొదలు
బండిపైనంపు మవ్వారిపజ్జ నొయ్య, నొయ్య నడుచుచుఁబయనించు టొప్పు మనము. 5

క. అనుటయు నేఁ దల నూఁపితి, వనితయు బిడ్డలు నుపద్రవంబున చిన్నెల్
కనుఁగొనకయ రుస్తుముజీ, ధనవన్మణిమందిరంబు దాసిరి పిదపన్. 6

క. నావికునిముదల గైకొని,నాపన్ దిగఁద్రావి నిల్చినాఁడను ధరపై
మూవురు నల్వురు చిఱుతలు, కావించిరి క్రందు గాంధి గాంధి యటంచున్ 7

క. పొంపిరివోయెడి ఋదుతల,అంపులు విని పక్షవాదిరత్నము లాటన్
గుం పెంతపేర్చునో యని, పెంపారునెలుంగుతోడఁ బిలిచెను బండిన్. 8

క. నరుఁడీడ్చుశకట మయ్యది, నరుపైఁ బయనింప నామనం బోర్వద త
త్పురుషతకు నియ్యకొన్నన్, జిఱుకుక్కలు తెల్లవారిశిశువులు నన్నున్ 9

క. అబండి నెక్కనిత్తురె, "నీబుఱ్ఱను వ్రయ్యఁజేసి నినుఁజం పెద మో
రీ! బుద్ధిఁగలుగు" మనుడుం,దాబెదరెన్ శకటవాహి తడఁబడిచెదరెన్. 10

వ. అంత నేను 11

క. లాటనుతో మెలమెల్లఁగ, బాటం జనుచుండ మూఁక బలిసెను నడువన్
జోటు కఱవయ్యెఁ గొందఱు, తూఁటరు లెసరేఁగి పాయఁద్రోసిరి మమ్మున్. 12

క. నెఱకఱకుఱాలవానన్, ముఱిగినగ్రుడ్డులను నన్ను ముంచిరి మిగులన్
జఱచిరి గ్రుద్దిరి తన్నిరి, చెఱిచిరి తలచీర కూలిచిరి నేలపయిన్ 13

క. స్మృతిసడలె నాకు దైవ,స్తుతిమై నపు డొక్కయింటిచువ్వలకడ ని
ల్చితిఁ గాని ధూర్తనిచయో, ద్ధతి డిందమిఁ దప్పవయ్యెఁ దన్నులు నాకున్. 14

క. ఆయెడ రక్షకశాఖా, నాయకునిల్లాలు వీరనారీమణి తా
నా యీవిపత్తిఁ గని రో,షాయితమూర్తిని వెలింగి శరవేగమునన్ 15

క. నాకడకు వచ్చె నన్నున్, సాఁకం దమకించి గొడుగుచాటున నిల్పెన్
మూఁక కపు డావఁద్రావిన, వీఁకయునై తనువు మనము విక్షోడుపడెన్ 16

వ. అయ్యవసరంబునం దొక భారతీయుఁడు రక్షకభటస్థానంబున కేగి మొఱపెట్టుడుం దదధికారి
నన్నుఁ గాపాడుపొంటెఁ గతిపయభటుల నేమించె - వారు తగువేళ కేతెంచి దుండగీఁడ్రం
జెదరఁగొట్టి - రంత నేను గమ్యస్థలంబున కేగుచుండ మధ్యేమార్గంబునఁ గల
రక్షకశాఖాధికారి నన్గని మాశిబిరంబు నాశ్రయించి నిర్భీతిమై నుండు మనుడు నే
నంగీకరింపక 17

క. దోస మెఱిఁగినంతన యిగ్గరాసుతనము, నుజ్జగింతురు వీరు ధీయుతులు మెచ్చు
తలఁపు మొలతెంచు వీరికిఁ దప్ప దంచు, నతనికిం బల్కితిని గృతజ్ఞత వెలార్చి 18

మం. పదపడి రక్షకభటులతోడ్పాటు, కలిమి రుస్తుముజీ యగారమ్మఁ జేరి
విడిసితి నెయ్యురు వెజ్జులుం దగిన, యుపచారములు సల్పి రోర్మిఁబాటించి

వీపుదెబ్బలు పెద్ద వేధింపఁజాగె, గాయ మొక్కటి భయంకరముగా నుండె
నింటిలోపల శాంతి యెసలారెఁ గాని, బయట నుల్కాపరంపరలు ఱంపిల్లె. 19

క. తుంటరులగు తెలవా రా,యింటి న్గిఱికొనిరి క్రుంకె।నినుఁ దపరాబ్ధిన్
గెంటనితమస్సు లోకము, నంటెన్ గోలాహలంబు లాగుబ్బుకొనెన్ 20

గీ. అప్పగింపుఁడు గాంధి మా కప్పగింపుఁ,దొప్పకుండిన నాపదల్ తప్పవంచు
మూఁక కేకలు వెట్ట నాముప్పు నెఱిఁగి, వచ్చి రక్షకభటచమూ వల్లభుండు. 21

క. అదలింపక బెదరింపక, మృదువాక్కులతోడ మేలిమేలమ్ములతోఁ
జదురేర్పడ నగ్గుమిలో, మదిమది చేకూర్పఁజాగె మతకరి యగుచున్ 22

క. అతడెంత పెనఁగులాడిన, మతికూఱటరామి నర్ధమానప్రాణ
స్థితి నిచ్చయున్నఁ గపటా,కృతులన్ జనుఁ డిల్లువీడి యింకొకదెసకున్ 23

వ. అని చారులచే మాకు సందేశ మంపె – నౌరా! యితరేతర విప్రతీపమ్ములగు సంఘటనలు రెం డొక్కనాఁడ నన్నెదుర్కొనె – నెట్లనం బగలింట మన్మిత్రుఁడు లాటను నాప్రాణముల కెట్టి హానియుం బాటిల్లదని తలంచి నన్ను బాహాటంబుగా నరుదెమ్మన నేను మైకోలుసూపితి – రేప్రొద్దు మరణోపప్లవంబు ప్రత్యక్షముగానుండ వేఱొండుచెలికాఁడు చాటుగాఁ బొమ్మని హితమ్ముగఱపె–నిదియునే నంగీకరించితి – నా కొండె నానెయ్యూరి కొండేని నాయాలుబిడ్డల కుపద్రవంబు వాటిల్లునని వెఱచి యే నిట్లు కావించితి నని యెవఁడు పల్కనేర్చుఁ – దొలుతొల్త నేను మూఁకం దలపడుటయు నవ్వల దొంగవేసమ్ముతో నూడనిఁ బాడుటయు నీ రెండుపను లొప్పుల యని యేఁడు నిర్ణయింపఁజాలుఁ – గడచన్నచెయిదంబుల మంచిచెడ్డలు నిర్ధరించుట రిత్తకురిత్త – వీనిగు ట్టెఱిఁగి యిం దేమేని నేర్వఁదగినది యున్న నేర్చుట లగ్గు – జగమునం దెవ్వఁ డెవ్వేళనెట్లుండు నది వక్కాణింప నయితి కాదు – మానవుని వెలినడవడింబట్టి వాని గుణదోషముల నెఱుంగు టరిదియగు – నయ్యది యట్లుండె – నయ్యధికారిహితమ్ము ననుసరించి యేనుభారతీయ రక్షకభటవేషమ్ము నవదరించి ప్రహరబాధానిరోధమ్మునకై శిరమ్ముపై నొకపి త్తళి మూఁకు దుంచి దానిపై దాక్షిణాత్య ప్రావారంబు నుష్ణీషంబుగాఁ జుట్టి పలాయనమ్ము సాగించితిఁ– దదీయ సంభ్రమంబున దెబ్బలతీపు మఱపునంబడె–నపుడు నావెంట నున్న వేగరు లిర్వురున్ హిందూవణిగ్వేషంబులు దాల్చ మూవురము న్సందుగొందులఁ బడి పోయిపోయి వాడ తెగుదల మాకొఱకు వేచియున్నశకటంబునధిరోహించి రక్షకభటస్థానంబు నీఁగితి–మంత నేను దదధిపతియగు నలెగ్జాండరునకు నన్నుఁగొని తెచ్చిన ప్రణిధిద్వయంబునకు నేటికోళ్ళు సెల్లించి తచ్ఛిబిరంబు నాశ్రయించితి – ని ట్లే నొకదెసఁ దప్పించుకొనిచనుచుండ వేఱొండుదెసనలెగ్జాండరు. 24

పాట

లెండు గాంధిని ముట్టడింతము
రండు తులువను బట్టుకొందము
కొండతుమ్మకుఁ గట్టియాతని
పుండు రేఁపుదము
తెల్లవానికి నీతిలే దని,
నల్లవానికి భీతిలే దని
పల్లెపల్లెకు నేగి చాటిన
పలువ నోర్చెదరా? 25

క. ఇవ్విధిఁ బాడుచు గుంపును, నవ్వులతో మల్లుకట్లె నామేల్విని మీ
గువ్వెగిరిపోయె నిఁక నీ,నొవ్వేలా నెలవులకుఁ జనుండని పలికెన్ 26

ఆ. గుంపులోనివారు కొంద అమ్మాటకు మండిపడిరి కొంతమంది నగిరి
నిక్కమా యిదంచుఁ బెక్కంద్రు సంశయా, ధీనులైరి మొగము తెల్లవాఱ. 27

వ. అంత నలెగ్జాండరు వారి కిట్లనియె. 28

క. సందియ మేటికి మీలోఁ గొందఱు నడతెంచి వెదకికొండీ నెలవున్
గాంధి యిటనున్నచో మీ,కందించెద లేనిచో రయానఁబదండీ! 29

క. రుస్తుంజీభవనము వి,ధ్వ స్తముఁగావింప గాంధితరుణీసుతులన్
గస్తిని ముంపఁ దలంపని,శస్త్రాత్ములు మీరటంచు సంభావింతున్. 30

గీ. అనుటయు న్మూఁకవా రిద్ద ఱరిగి వేయి, కనులతో నింటఁగల యెల్లగదులు వెదకి
యల్లవచ్చి కాల్సేతులు చల్లవడెదు, వార్త వైచిరి గుంపునవారిచెవిని. 31

క. కొంద ఱలెగ్జాండరుపని, నిందించుచుఁ గొంద ఱతని నేఱునేర్పున్
వందులవలె మెచ్చుచు మఱి, కొందఱు వందురుచు నిండ్లకుం జని రంతన్. 32

వ. "గాంధిం గొట్టినదుండగీంద్ర దండించు టావశ్యకం" బని నాఁటి బ్రిటనుదొర తనమువారి ప్రధానమంత్రియగు నిస్టిను చేంబర్లేను నేటాలుదొరతనమ్మువారికిఁ దంత్రీవార్తనంపుడు న్దదమాత్యశేఖరుండగు నెస్కాంబి 33

క. ననుఁ బిలువఁబంచి నాదగు,తనువునఁగల గాత లరసి తద్దయు నడలెన్
మును నాపల్కినహితమును, వినినన్ నీకిట్టిబెడఁద విజ్జునె యనియెన్. 34

క. అకటా! నీవెంద్రుక కే, నొకయొప్పమి రా మదీయ ముల్లము వగచున్
సుకృతీ! తద్ధూర్తుల పో,లికఁ జెప్పినఁ బట్ట నగ్గలించెద ననియెన్. 35

గీ. నిన్నుఁ గొట్టినవారి దండింపఁ దంతి, నంపెఁ జేంబరులే నిట్టియవగదమ్ము
సైఁపరానిద యంచు నాసచివులెల్లఁ, గెరలుచున్నారు ఖలుల శిక్షించుపొంటె. 36

వ. అనియుం బలికె–నంత నే నమ్మంత్రిపుంగవుం గని యి ట్లంటి. 37

ఆ. మూఁకలోనివారి మూవుర నల్వుర,జాడ తెలియుఁ గాని నేఁడు వారి
రచ్చ కీడ్పుచేఁత నచ్చద నా కేమి,యొఱగు దుండగీంద్రఁ బఱిచినంత. 38

ఆ. ఇచటితెల్లవారి హిందూర్వియం దేను,బాడిదప్పి యెగ్గు లాడినట్లు
లెవరొపల్క నల్కయేచిన పెదకట్టె,లిట్టులైరి నింద్యు లెట్టు? వీరు. 39

క. మీ పెద్దలు మీరు జుగు, ప్సాపాత్రులు ప్రజకు నచ్చుధర్మపథంబుల్
చూపఁ దగుమీర నమ్మిక,మోపిరి రూటరు వచించుముచ్చట మీఁదన్. 40

ఉ. ఏ నిటులంటి నా వలవ దెవ్వని నాపదపాలు సేఁతకున్
మానస మస్మదీయ మణుమాత్రయు నొల్లద నిక్కువంబు రే
పైన బయల్పడున్ నిజదురాచరణమ్ము దలంచి యప్పు డీ
మానవులెల్ల సిగ్గుమెయి బ్రమగ్గుదు రంతియచాలు శిక్షకున్. 41

వ. అనిన నయ్యమాత్యశేఖరుండు నీ విప్పు దాడినపల్కుల యొకపత్రమ్ముపై వ్రాసి యా నోపుదేని వానిన చేంబరులేనున కంపెద–నీవు దుండగీంద్రపై నభియోగమ్ము తేరనొల్లనినాఁడు ప్రజాశాంతి సంధించుటకు నాకు వలయునలవు సిద్ధించుటయకాక నీగఱువతనంబుసైతము జగమ్మునల్లడం బ్రబ్బు – నక్కఱయున్నచో లాటనుమున్నగు నెయ్యురహితమ్ము వదసి సముచితవిధానముం గొనియాడు–మని పల్కె–నంత నేను. 42

ఆ. ఇటకు రాకమున్నె యీనిశ్చయమ్ముతో, నున్న నాకు నిప్పు డొరులతోడి
చర్చ యేటికంచు సైరణపత్రమ్ము, వ్రాసి మంత్రి కందఁజేసినాఁడ. 43



## 4 శాంతి

మం. ఎస్కాంబికుఱఁగంటి కేగకమున్ను, రక్షకభటశిబిరమ్ములో నాకుఁ
గడచిన రెన్నాళ్ళకాలంబునందు, నిరువురు భటులు న న్నెదయ కేప్రొద్దుఁ
గడుజాగరూకులై కాచిరి కాన, సచివుసన్నిధి కేను జనుదెంచునాఁటి
కల్లనల్లన భయం బడఁగారిపోయె, రూపింతు నిట్టిమార్పునకారణంబు. 1

ఆ. కలము నవతరించుకాలానఁ బత్రికా, వార్త లాహరించువాఁడు నన్నుఁ
గదియవచ్చి చిత్తకార్తె జల్లులవోలె, నడిగెఁ బెక్కుపృచ్ఛలాత్రపడుచు. 2

చ. విసువక యెల్లప్రశ్నములు వింటిని సందియముల్ తొలంగున
ట్లొసఁగతి నుత్తరంబు మహదు త్తముఁడౌ మెహతాహితమ్ముఁ బ
ట్టి సకలవాఙ్ముఖాళిఁ బ్రకటించి పఠించితినంటిఁ దత్ర్పతుల్
కొసరకమున్న వాని కివిగో యని యిచ్చితి నాదరంబునన్. 3

గీ. తొల్లి నేటాలుగడ్డపైఁ దెల్లవారి, మంచిచెడ్డలగుతిచి నామాట లెట్లు
వెడలెఁదద్భిన్నముగ నొక్కనుడియుఁ బల్కలేద హిందూర్విననిమూదలింపఁగంటి. 4

క. నాతెచ్చినట్టిపథికుం, డీతరణుల లేఁడ యొక్కఁడేనియు నెపుడో
యీతెరువరు లీసీమకుఁ, బ్రాఁతవడిరి తోఁటకూలిబ్రదుకున నంటిన్. 5

క కలరూపు నిటు వచించుటఁ, దులువల నటు రచ్చకీడ్వఁ దొడరమి లజ్జన్
దలవంచి రాంగిలేయులు, పలుభంగుల నన్ను మెచ్చెఁ బత్రికలెల్లన్. 6

క. అలరిమూఁకలు నాలుగు, మూలల గర్హితములయ్యె మున్నటికంటెన్
మేలై హైందవకీర్తి, శ్రీలతికాపుంజ మెల్లసీమలఁ బ్రాఁకెన్. 7

వ. కొట్టకొస కియ్యాగడంబునంజేసి నాకర్తవ్యముల కానుకూల్యంబు పొసంగి నాబాట నిష్కంటక మయ్యె-రక్షాశిబిరమ్మునుండి నాలుగైదునాళ్ళలో నిలుసేరి నాకృత్యంబులు నెఱవేర్చుకొనఁ దొడంగితి-నేతద్ఘటనాఫలితమ్ముగా నాకు న్యాయస్థానవ్యాపృతులుం బ్రబలెఁ-గాని 8

క. ఒకవంక భారతీయుల, కకలంకం బైనపేర్మి యలవడిన ట్లిం
కొకవంకఁ దెల్లవారికి, నకటా! యీరసము హెచ్చె నవ్వారిపయిన్ 9

క. మానంబ భారతీయుల, ప్రాణం బనితెలిసెఁ దెల్లపజలకు నవు;ద
ద్దానన్ వారికి హిందూ,స్థానమువా రన్న నధికసాధ్వస మొదవెన్ 10

వ. అపుడ భారతీయుల కనర్థదాయకమ్ములగు చట్టమ్ములు రెండు నేటాలుశాసనసభవారి యంగీకృతిం బడసె - నివి నాకార్యక్రమంబును భారతీయులజాగర్యను మూరిఁబోవం జేసె - వీని నాయైబాసలం బ్రచురించి తీవ్రప్రచార మొనరించి ఖండించితిఁ-గాని తుట్టతుద కీశాసనమ్ములు తిరపడుట తప్పదయ్యె-నియ్యపవాదమ్ములను మొన్నటి నౌకానిరోధమ్మును బురస్కరించుకొని నేటాలు భారత జాతీయ మహాసభకు దెబ్బదియైదువేలరూప్యమ్ముల కానుకలు సంపాదించి తద్ధనంబునం జేసి కొన్నిభవనంబులు విలిచి వానియొసంగునద్దెతో మహాసభాకార్యంబులు సాగించితి - నీయాస్తికి వలయు పరిపాలకుల నియమించితిఁ- గాని యే నాఫ్రికా నుజ్జగించినవెన్క నిది యంతఃకలహకారణమై పాడిపట్టునకు వశమయ్యెఁ - గాన సర్వజనీనమ్ములగు సంస్థలకు మూలధనం బుందుచో నైతికపతనంబు తప్పదని విశ్వసించితి - మనసేయుపని జగద్ధితంబైననాఁడు లోకంబ దానికి వలయు వార్షికోపాయ

నమ్ము లొసంగు - న ట్లొసంగనప్పు దది యక్కఱలేని దనంజను - నపారమగు మూలధనమ్ముతో మూలుగుచున్న పెక్కుసంస్థలు లెక్కలుచూపక ప్రజాభిప్రాయంబు నుఱక నిరంకుశములై యుంట మన మెఱింగిన విషయంబ - విశ్వజనీనసంస్థ ప్రకృతివలెఁ దనంతఁదా వర్ధిల్ల వలయు - దానికి లోకమ్ము తోడ్పదనినాఁడది ప్రజాసంస్థ నాఁ దగని దగు-నొక సంస్థకుం గల జనాదరంబును దత్పాలకులసౌజన్యముం జూడఁదలంచుచో దాని కేటేట లోకులొసంగు కాన్కలపట్టికఁ బరీక్షించినం జాలు - నాఫ్రికాయం దేను శాంతిసమరంబు సాగించుపట్ల నీతలంపులు గట్టిపడె - లక్షలకొలంది విత్తమ్ముతో నావశ్యకమున్నను దన్మహాసంగ్రామ మొక్కతృణమేని మూలధనంబు లేకయ నడిచె - నెల్లి కాన్కలురానిచో నేమి సేయుదమా యని చేతులు పిసికికొన్నదినంబులుం గలవు - కాని వాని వివరించుచో టిదిగాదు. **11**



# 5 పిల్లల చదువు

వ. ఏను దర్బనులోఁ గాలుమోపినతఱి నావెంట నామేల్లుఁడుం గొమరు లిర్వురు గలరు - వీరు చదువవలసినపసివారు - కాని వీరి నాఫ్రికాలో నెచటఁ జదివింతు - భారతీయ విద్యార్థుల కొఱకుఁ గ్రైస్తవులు సాగించు పాఠశాలలున్నను నందలి శిక్షామార్గమ్ములు ప్రశంస్యములు కామి నాబిడ్డల నటకంపనైతి - నిఁకనాంగ్లేయులకొఱకు నడుపంబడుబడి యితరహిందూడింభకులకు దురాసదమ్మైననునా బాలురకునంకిలిపెట్టదు - కాని యది నాకు రుచించుసౌకర్యము కాదు-వెండియు. **1**

గీ. బుదుతలకు నాంగ్లభాష నేర్పుటకు నఱవ, మెఱుకసేయంగ హిందీని గఱపఁ దగిన
యొజ్జ లున్నారుగాని మా గుజ్జరాతి, ముక్కలను మప్పు నయవారు చిక్కు లెట్లు. **2**

వ. ఎంత జతనం బొనర్చినను దద్భాషాబోధకుఁడు లభింపమింజేసి **3**

ఆ. నేన యొజ్జనంబు నెఱపితిఁ బసివాంధ్ర, కదియుఁ జాగదయ్యె బదిదినాలు
తుదకు నొక్క తెల్లతోయలిశిక్షకుం,బాలుపఱిచినాఁడ బాలకులను **4**

వ. అయ్యుపాధ్యాయకు నెలకు నూటైదురూపాయల సంబళ మొసంగుచుంటి-నడుమ నడుమఁ దీఱిక చేపడునప్పు డే నర్భకులకు ఘూర్జరభాషం గఱపుచు సర్వదా తద్వాణియంద వారితో సంభాషించుచుంటి-దీనంజేసి వారికి మాతృభాషాజ్ఞానమించుక యేర్పడె-లేఁతవాంధ్రను జననీజనకుల కెడవుసేఁత లగ్గుగాదని యెఱింగి హిందూదేశమున కంపనైతి - గట్టుపాట్లుగల విద్యాధికునియింట యాదృచ్ఛికమ్ముగా నంటినట్లుం దేవాసిభవనమ్మున(హాస్టలు) బాలురకు విద్యావివేకంబు లంటఁజాలవు - కాన నాబిడ్డల నాచెంతన యుంచితిఁ - గాని **5**

గీ. పెద్దకొడు కీడు ముదిరిన పిదప నన్ను,వదలి చదువంగ భారతావనికి నేగె
భాగినేయుఁడు నాపల్కు పాటిచేసి, నిలిచె నానేర్పువిద్యతో నెలమి సెంది. 6

క. అవిలంఘనీయ నియతి, వ్యవసాయముకతన లేఁతవయసునఁ గసటుం
దెవులునకుఁ జిక్కి యాతం, దవని న్డిగనాడి మమ్ము సలజడి ముంచెన్. 7

క. ఇఁగ మిగిలిననాబిడ్డలు, ముగురున్ బడికేగి పాఠములు నేర కలం
తిగఁ జదివిరి నా నడిపిన, జగడముతటి నిల్పు పాఠశాలన్ నియతిన్ 8

గీ. తీఱుబడిలేమిఁ; జదువున దిట్టతనముఁ, గూర్పలేనైతి నాకొడుకులకు నుస్సు
రుస్సురని వీరు నిట్టూర్పు లూర్చుచుండ్రు, పట్టభద్రులు తమకంటఁ బడినవేళ. 9

వ. ఇప్పట్టునం దేను వారిదూఱున కించుక పాత్రంబ నైతి ననం దగుఁ - గాని కన్నవారి సన్నిధి నుంటంజేసియ వీరికి స్వాతంత్ర్యనిరతి యేర్పడె నని నాతలంపు - వెండియుం దమయిచ్ఛ ననుసరించి వీరు కృత్రిమశిక్షాదాసులై యుందురేని యీనాఁటి సౌశీల్యము వీరికలవడునా - వీరిమనుగడ నాప్రజాసేవకు నడ్డగాలుకాకుండునా - వీరియెడ నాకిపు దున్నంత నిశ్చింత లభించునా - కావున 10

క. పట్టముల కేమి వీరికి,ముట్టినచదువెల్లఁ గనకముంబోనిద తద్
ఘట్టమ్ముఁ దలఁచుకొన్నపు,డిట్టల మగునట్టితనివి యేర్పడునాకున్ 11

గీ. ఇపుడు నాపెద్దకొమరునం దెట్టిచెట్ట,నడత కన్పించు నది శిక్షణమ్ములేని
మూర్తమును గాని నా మొట్టమొదటిబ్రదిమి,కానవాలని మదికి నిత్యమ్ముతోఁచు. 12

వ. అబ్రదుకు మాంద్యమునకు నపరిపక్వజ్ఞానమునకు నెల వని యే నెంతు - నదియ నాజీవితమునం దుచ్చదశ యనియు నవ్వల నాలో వచ్చినమార్పుల కెల్లనా యపోహమ్ములు మూలము లనియు, నాదుర్దశకవి తార్కాణలనియు వాని నమ్మిక - తనయిచ్ఛ వచ్చిన ట్లూహింప నతనికిం జన వున్నదికదా!- వెండియు మన్మిత్రులు కొందఱు. 13

క. నీసుతుల ధర్మవాదులఁ, జేసినఁ గీదేమి తారసిలు; వీరి నిజే
చ్ఛానరణిం జననీ విడి, దోసము కాదెట్లటంచు దూఱిరి నన్నున్ 14

గీ. ఎంత యరసిన సార మావంతలేని, మాటలుగఁ దోఁచె విని నాదుమదికి; లాఁతి
చదువునేర్పెడిబిడ్డల చదురు చూడ, నాసుతుల నేర్పె గురిగింజవాసి మిగిలె. 15

వ. అయినను నా యీవిద్యాప్రయోగమ్ములవలని లగ్గు నిశ్చయింప భావికాలంబె యోగ్యంబు - మానవాభ్యుదయంబును బరామర్శించువాఁడు గృహశిక్షకుంబాఠశాలాశిక్షకు నుండు వింగడంబును, జననీజనకుల జీవనపద్ధతులకు బిడ్డలమనుగడ తెన్నులకుం గల చుట్టఱి

కంబును గుర్తించుటక యివ్విషయం బిటc దదవితి – నిదియునుం గాక సూనృత సేవానిరతుc డెంతవట్టు సత్యంబునారాధింపనేర్చుc, దన్నుc గొలుచువానివలన స్వాతంత్ర్య శక్తి యెంతబలి నపేక్షించు నమనంశముల నెఱిcగించుటకుసైత మీయధ్యాయంబు నారంభించినాcడ – వెండియు నానాcడు. 16

గీ. గఱువతనమునకుc దిలోదకమ్ము లొసcగి, లాcతిభారతవిద్యార్థులకు దురాప
మైనచదువును బసివాంద్ర కలవరించి, తృప్తిపడి యుందునేని మదీయసుతులు. 17

గీ. భాషలో వాఙ్మయమ్ములోc బ్రౌఢివడసి, యుండువారల కాని యాత్మోన్నతికిని
స్వైరజీవనమునకు నేcదారటించు, కరణిc బొగులుదు రనుమాట కల్లమాట. 18

గీ. త్రాసునం దొకమై స్వతంత్రతను నిల్పి, వేయిపాండిత్యముల నొండుచాయ నిల్పి
తూcచునప్పుడు వ్రేcకన యేచి స్వేచ్ఛ, దెసక ములుసూపు నంట పెంపెసcగుమాట 19

వ. మున్ను నేను భారతదేశమునందు సాహాయ్యనిరాకరణోద్యమంబు నారంభించిన తొలినాళ్లలో స్వతంత్రతా నాశకమ్ములగు పారశాలలం గలాశాలలం ద్యజియింపుcడనియుc జదువుకొఱకు బానిసీంద్రై యుంటకంటె స్వేచ్ఛకొఱకు నిరక్షరాస్యులై శిలావిదళనవృత్తియై జీవించుట లగ్గనియు విద్యార్థులకుం గఱపితి – నాయుపదేశమ్మువిలువ నప్పటికేని వారెఱింగియుందు రని తలంతు. 20



# 6 సేవాభావము

ఆ. న్యాయవాదివృత్తి నానాcటికిం బ్రబ్బి, హెచ్చుcజేసె నాదువచ్చుబడిని
విత్త మెన్ని రెట్లు విరిసిన నది నాకుc, గాకపోయె హర్ష కారణంబు. 1

వ. అయ్యవసరంబున 2

క. జీవనపథమున కింకను, బావనతం గూర్చి రోగబాధావశ దీ
నావలిని గాయికమ్ముగ, సేవింపcగ, నాదుమనసు చిందిలిపడియెన్. 3

గీ. అపుడ దుర్భరకుష్ఠరోగార్తుc డైన, కర్మకరుc డొక్కరుండు మాకడపc ద్రొక్కc
బట్టెc దన్నముతో వానిc బంపలేక, నిలిపితిం గొన్నినాళ్ళు మానెలవునందు. 4

క. ఏవపడ కతనిc జక్కని, యొవరిలో నిడితిc బూయ మురలెడిపుండ్లన్
బూవులవలెc గడిగితి సం,సేవించితిc గట్టుకట్టి చివికినరోగిన్. 5

వ. కాని తీతికయును సంకల్పంబును గొఱంతవడుటంజేసి యాతెవులుగొంటునకుఁ బెక్కునా. ళ్ళూడిగంబు సేయం జాలక ముచ్చిలికకూలివాంద్రకొఱకు దొరతనమ్మువారు నెలకొల్పిన వైద్యశాలయందు వీనిం జేర్చితి - నైనను శుశ్రూషావాంఛ నన్ను విడువమింజేసి యొక చికిత్సానిలయమున స్వచ్ఛంద సేవకుఁడనై యనుదినం బామయపీడితుల కూడెమ్ముసేఁ తకుం గొంతకాలము వెచ్చించితి - నియ్యనుభూతి బోయరుయుద్ధమున క్షతగాత్రు లైన సైనికుల సేవించుటకును, బిడ్డలఁ బెంచుటకును, బెండ్లమునకు మంతరసానినై పురుడు వోయుటకును నాకెంతయు నుపకరించెఁ - బసిబిడ్డల నిరుపద్రవంబుగాఁ బెంచుటకు జననీజనకు లించుకేని శిశుపోషణవిధి నెఱింగియుంట లెస్స - యిందు నా కబ్బినయెఱుక తద్దయు మేలుచేసె - నదిలేనిచో నా పిల్లల కీనాఁటియారోగ్యము లభించుననుట కల్ల - మఱియు. **6**

మం. బుడుతల కైదేండ్లు పూర్తి యౌదనుక,నబ్బెడివిద్య యావంతలే దనుచు
నజ్ఞానమునకు దాస్యముసల్పువారు, తలపోయుచుంద్రు కొందఱు తల్లితండ్రు
లర్భకుల్ ప్రథమ పంచాబ్దంబులందు, గడియించు తెల్వియ కడుమేలి తెల్వి
కందులకుం దల్లికడుపునఁ బిడ్డ, యపుడ విద్యారంభ మది మొదల్కొనెడి. **7**

ఆ. కడుపునిల్పునట్టి కాలానఁ దల్లికి, దండ్రి కెట్టియెట్టి తలఁపు లుండు
నవియ పాప కంటు నాపన్నసత్వల, క్షణములెల్లఁ గమిచి కల్గు శిశువు. **8**

గీ. నేలపైఁ బడ్డపదపడి నిసుఁగు పితల, ననుకరింప నజస్రంబు నంగవించు
నవలఁ గతిపయవర్షంబు లరుగుదన్క, గోర్కిసేయును దనపెంపుకొఱకు వారి. **9**

గీ ఆలుమగ లీరహస్యంబు నరయువారు, ప్రజకొఱక కాక లాలసాభర మడంప
వలతురా గార్హ పత్యజీవనము పరమ, పావనము నిఖిలాశ్రమశ్రీవనమ్ము **10**

గీ. నిద్రవలె నన్నముంబలె నిధువనంబు, సైత మక్కఱగల యొకచేఁత యంచు
నేతఁ దూహించు నాతఁడహీనమౌఢ్య, మూర్తియనిపల్కరింతుమోమోటవిడిచి. **11**

వ. జగమ్మున కాధార ముత్పత్తి యనియు, విశ్వంబు భగవత్ క్రీడారంగము తన్మ హీయస్త్రాచ్ఛాయయు ననియు నాలుమగలకూటమి సంతానసిద్ధికొఱక యనియుం దెలిసికొన్న పురుషుండు పంచకరపాట్లు వడియేని తనవులపుపేర్మి నోర్చి నిజప్రజా శారీరక మానసి కాధ్యాత్మి కాభ్యుదయసంధానమ్మున కర్హంబగు తెలివితేటలు గడించి రాణించుఁగావుత. **12**



# 7 బ్రహ్మచర్యము-1

గీ బ్రహ్మచర్యవ్రతంబు మత్పాలితంబు, నిందు వివరింతు నుద్వాహ మెపుడు నడిచె
నపుడ యేకపత్నీనియ మానుర క్తి,కలిగి నాహృదయమ్ములోఁ గాఁపురించె. 1

వ. అయ్యది మదీయసూనృతభాషా నియమమ్మునం దొకపాలై వెలసె - నింటిపట్టు నందును బ్రహ్మచర్యదీక్ష వలయుట నా కాప్తికాయం దెఱుకకు వచ్చె - నేత దావశ్యకంబు నాబుద్ధికిం దగులుటకు విద్వత్కవీంద్రుఁడు రాజచంద్రుఁడు నిదానంబు నాఁదగు - నొక్కమరి నే మయ్యాయిసుద్దులన్గుఱిచి మాటలాడుకొను పట్ల నే నతనిం గని 2

మం. వింటివే యింగ్లాందు విషయమ్మునందు, మంత్రిమాణిక్యమై మంతున కెక్కు
గ్లాడ్‌స్టనునెడ వానికాంత వెలార్చు, నెనరు మేల్బంతిపో నెలఁతల కెల్ల
నాయమ్మ తన కెంతయైశ్వర్య మున్న, విఱ్ఱవీఁగక మూఁడువేళలం బతికి
వలయు నాహారంబు వండి వడ్డించు,శాసననిర్మాయిసభలు తీంద్రించి
నైకవారమ్ములు నడుచుకాలానఁ బతి కూపిరాదనిపను లుండువేళ
నతఁ డెంతదయ్యునో యలయునో యనుచు, నాధునితోడ లండనువచ్చి నిలిచి
యాత్మేశునకు నించునన్న పానములు, తానయి సమకూర్చి తదయ కందించు
నగ్గింపవలదె యియ్యబలప్రేమంబు, కొండాడఁదగదె యీకొమ్మనేమంబు
మన్నింపఁజనదె యీమగువజీవనము. 3

వ. అనుటయు నమ్మహామహుండు న న్నిట్లనియె - సోదరా! గ్లాడ్‌స్టను పెండ్లము తనమగనికిం గావించినయూడిగంబు కొనియాడఁదగిన దంటి-వావెలంది వాని చెల్లెలనియొండె నమ్మికగల లెంకయనియొండెఁ దలంచి వారిద్దఱుం దాదృశాను రాగంబుతోడన యతని కన్నపానీయములు సంతరించియిచ్చిరని యూహింపు- మపుడాలియు ననుజాసేవకులయు నుపచారములం దెయ్యది ప్రశంస్య మందు - విట్టిస్వసలు భృత్యులు మనకు నెందఱులేరు? - నారీలోకమ్మునం గాక మగ వాంద్రయం దీహార్దంబు బాహిరపోవునయేని నీకపు దేతాదృశ హర్ష విస్మయంబు లొదవునా? - యించుక సమీక్షసేయు - మని నంతన 4

గీ. ఆలితోఁ గాఁపురముసేయు నమ్మనీషి, యట్లుపల్కుట దుస్సహంబాయె నాకు
నైనఁ గవిరాజువాక్కు సూదంటురాతి,రీతి నన్నపుడు బలాత్కరించిలాగె. 5

మం. పడఁతి వెలారించు పతిభక్తికంటె,బంటుచూపెడు సామిభక్తి మేల్గాదె
యాలుమగలకు మిథోనురాగంబు, మూరిఁబోవుట యభ్రమునహేతువెట్టు?
లెకిమీఁదు కొలువుకాఁ డితరేతరాను, రక్తిమై నుంటయే ప్రస్తుత్యవార్త
యని బయల్‌మెఱసిన యతనిభావములు, సొరిది నన్ దమకు దాసుని జేసికొనియె. 6

వ. అపుడు నామనమ్మున 7

ఆ. అలితోడ నెట్టియంటిస నుంచుకో, వలయు వలపుతీంద్ర వాపుకొఱకు
నింతి యొదవcజేంత యేకపత్నీవ్రతి, లక్షణంబె యను తలంపు లదరె. **8**

క. లాలస నన్నెన్నాళులు, పాలించునొ యస్మదేకపత్నీవ్రత మ
న్నాళులు ఘృతకోశాతకి,లీలన్ దృణమాత్ర విలువలేనిది కాదో. **9**

గీ. భూరిలజ్జాపరీత కస్తూరిబాయి, నన్ను వలపించుటెఱుcగని నారి యగుట
నపుడు నాపూను బ్రహ్మచర్యవ్రతంబు, సుకరమైసాగు నన్ననమ్మిక జనించె. **10**

గీ. మనసుపేదర్మి నాపోవుమార్గమునకుc, గంపcగొట్టె నెంతెంతజాగర్యతోడ
నడిపినను బండి గోతిలోcబడియె రెండు, తడవ; లైనను జతనంబు విడువనైతి. **11**

వ. నాయత్నమునకుంగల మూలకారణ ముదాత్త మనంజాల - సంతానప్రవాహమ్మున కానకట్టకట్టుటక యే నీ వైషయికసుఖ పరాఙ్ముఖత్వంబు వలచితి - సంతు నాcపుటకుం గల బాహ్యాసాధన సంప త్తిని గుతిచి యలcతిగనో వలcతిగనో యింగ్లాండునం దున్నతటి నెతింగితిc - గొన్నినా ళ్ళాలిస్సను తెల్పిన నిరోధక పద్ధతు లవలంబనీయము లని నమ్మితిc - గాని పదంబడి హిల్సు బోధించిన నిగ్రహ మార్గంబ సముచితంబని శతధా విశ్వసించి యందుc గృతార్థత వడచుటకు లెక్క లేనన్ని యిక్కట్లు కుడిచితి - నేతదుద్యమంబు నారంభించినవెన్క. **12**

క. పడcతుకసెజ్జకుc దద్దయు, నెడవుగ నాశయ్య నునిచి యెం తేని బడ
ల్పడినప్పుడ కూర్చుటకుం, గడcగితి సంయమరిరక్ష కదలుకొనంగన్ **13**

క. ఏ నెంత బిఱ్ఱబిగిసినc బూనిక యపుడపుడు రిత్తపోయిన దకటా!
యైన నపజయపరంపర, లే నాకిడెc దుదకు నెదురులేని జయంబున్ **14**

వ. నా బ్రహ్మచర్యదీక్షాస్వీకృతికిం గడపటినిర్ణయ మేకాన్నవింశతిశతషష్ఠ(**1906**) శరత్తునం గాని సాధ్యము కాదయ్యె - నాcటి కేను సత్యాగ్రహోద్యమంబున కంకురార్పణముసైతము చేయమియ కాక స్వప్నమందేని దానిపుట్టువు నూహింప నైతి-బోయరుకయ్యంబు ముగిసిన పదంపడి నేటాలురాష్ట్రంబున 'జులూ'తిరుగcబాటు రేcగుడు నం దేను దొరతనమ్మువారికిc దోడ్పడ నెంచి రణప్రణితులకుం బరిచర్యసేcత కొక్కదళంబు నడిపితిc - గత్తిమీcదిసాము గావించు నక్కాలం బున దేశారాధనలుబ్ధు లగువారు విత్తసంతాన వాంఛావల్లులం దెగc గోసి తార్తీయాకంబగు నాశ్రయంబును జేపట్టుట యనివార్యమని తలంచితి - నీతిరుగc బాటు నం దేను శ్రమించినకాల మాఱువారముల - యైన నిదియ నామనుగదయం దెన్నcదగినఘట్టమాయె-నీనాcడు శపథంపువిలువం దొల్లిటికంటె లెస్సయెఱింగితి - నొట్టు స్వాతంత్ర్యద్వారమును మూయదు సరిగదా దానిం దెఱచుననియు నేగ్రహించితి - భగవ దనుగ్రహముపట్లను నాపట్లను నాకు నిశ్చయాత్మకబుద్ధి లేమింజేసి యే నిందనుక విజయంబు

వడయ నేర నైతి - నీలోపంబునన మన్మనంబు సంశయజలధిం బడి యిటు నటుం గొట్టుకొనుచుండె - నశనమ్ముచేయ నొల్లని మానిసి ప్రలోభముదెస కీడ్వంబడినవాఁ డనియుఁ బ్రతినచేఁ దన్నుఁ దా నరి కట్టుకొంట విశృంఖలవిహారముం బాసి యేకపత్నీ వ్రతము ననుసరించుటం బోని దనియు నాకెఱుకవడియెఁ- "బ్రయత్నమునెడ నాకునమ్మిక కలదు - కాని నన్ను నే నొట్టుచేఁ గట్టివైచికొనఁ గోర"-నన్న తలంపు మానసికదౌర్బల్య చిహ్న - మిందు విసర్జనీయం బగువస్తువుపై నిగూఢ మైన యొకవాంఛ కల దనుట సముచితము - కానినాఁడు చరమనిర్ణయము గావించుకొనుట క ద్దేమి యుండు - నురగము కాటువేయు నని యే నెఱింగితినేని దానిబారివలనం దప్పుకొంట కొ ట్టీదుకొందుఁ - గాని వట్టిజతనంబు కావింపఁ - గేవలప్రయత్న మాచరించుట నాఁ బాము నన్నుఁ దప్పక దొరించు నన్నసత్యము నాకుఁ దెలియ దనం జనుఁ - బ్రయత్నమాత్రమునన యేను సంతృప్తివడి కూర్చుంట యన ముఖ్యకర్తవ్యపు టావశ్యకము నాకు సుస్పష్టము కాలేదని వచింపవలయు-"మున్ముందు నాతలంపులు మాఱకుందునా? యిట్టిచో శపథముం బూని న న్నెట్లు బంధించుకొందు?'' ననుశంక మనకు సర్వదా వొడమి కలఁతం గూర్చు - "నీవిషయము విడువం దగినది''యన్న స్పష్టదృష్టి లేమిని సైత మాశంక తేటపఱుచుఁ - గాన "వైరాగ్యము లేని పరిత్యాగ మస్థిర'' మని నిష్కులానందుఁ డనియె - నెచట విషయవాంఛ నశించునచటఁ బరిత్యాగరూపకశపథము సహజము ననివార్యము నగుఫలం బని వాక్రుత్తు. 15



# 8 బ్రహ్మచర్యము-2

గీ. అతివ కానాఁడు బ్రహ్మచర్యమ్ముఁ దాల్చు, గడియవఱకును దానియాగడ వచింప
నడిగినంతన కాదాడ కవ్వెలంది, యాఁకపెట్టక నాదీక్ష ననుమతించె. 1

క. ఈ నిగ్రహవ్రతమ్మును, బూనుతఱిన్ మిపుల బాధపొందితిఁ గామా
ధీనమనసునికి సులభం, బౌనె హృషీకప్రతాప మార్పుట యంచున్ 2

గీ. ఆలియెడనేని వికృతికిం బాలుగాక, యాఁగుమగఁ దుందునా యటం చపుడు తోఁచె
నైన భగవానుఁ డీపవిత్రాశయమ్ము, మనుపఁడా యని దూఁకితి మంటలోన. 3

వ. వింశతివర్షంబులు కడచన్నవెన్క నీనాఁడు నాబ్రహ్మచర్య విధింగూర్చి యేకతం బాడ నీడులేని యచ్చెరుపాటును నవధిలేని హర్షముం బొడమెడి - నింద్రియ నియంత్రణాదీక్ష నే నెన్నఁడో స్వీకరించితిఁ - గాని యిందు నేఁడు నాకుంగల స్వాతంత్ర్య సమ్మదంబు లా మొదటికాలంబునఁ గానరా-వేలయన నపుడు నన్ను సంసారవాసనలు విడువ వయ్యే - నేవేళ ధర్మభ్రంశము వాటిల్లునో యన్నభీతి నాకు మిక్కుటంబుగా నుండెఁ - గాని నేఁడు

నన్ను వాసనలు తఱియంజాలవు - వెండియు నేను బ్రహ్మచర్యవ్రతంబు వలచినవెన్క నొక్కనెల నిండియు నిండకమున్న తలఁపనితలంపుగా శాంతిసమరంబునకు హేరంబపూజ జరిగె - నీవ్రతంబు న న్నాప్రతిష్టంభమున కాయత్తపఱిచి యుండనోపు - మఱియు 4

గీ. బ్రహ్మచర్యంబు నిర్దుష్టభంగి నెతఁడు,నడుపు నతఁ డాత్మసందర్శనం బొనర్చుఁ
దనువునకు బుద్ధికాత్మకున్ద్రఢిమ మొసఁగి,నిత్యమునుగాచు నింద్రియనిగ్రహంబు. 5

గీ. దమవిధానమ్ము దారుణతపమునట్టు, లిపుడు నాబుద్ధికిం దోఁప దిది యఖండ
రసమయం బైన యుత్తమవ్రత మటంచు, మాటిమాటికిఁ జాటు మన్మానసంబు. 6

క. వేయేల దీనిమహిమమ, నాయుద్యమకోటి నెల్ల నడుపుఁ దదీయ
శ్రీయొఱపు నన్ను ముగ్ధని;, జేయుచు నానాఁడు పెంపుచెందుచు నుండున్. 7

క. ఏ నిట్లు బ్రహ్మచర్య వి, ధానంబునఁజేసి యెంత తనిసనుచున్నన్
దీనిపెనువెట్టయున్ నను, గ్లానివశుం జేయుచుండుఁ గడుబెట్టిదమై. 8

క. ఔరార! నాకు నేఁబది, యాతేఁడులవయసు చెల్లె నైనఁ దదీయ
క్రూరతఁ జూచెద శస్త్రీ, ధారావ్రత మిది యటంచుఁ దలఁచెద నెపుడున్ 9

క. ఏపురుషుండు రసజ్ఞా, చాపల్యము నడఁచు బ్రహ్మచర్యవిధానం
బాపురుషున కతిసులభం, బీపల్కుట కనుభవంబ హేతు వటందున్ 10

వ. కాన నాతిండి శాకాహార మైనంతమాత్రన యేను దనివిసెందక యింద్రియనిరోధమ్మున కది తోడ్పడునట్లు పరికింపఁజాగితి - మితమై క్షారరహితమై యభిఘార దూరమై సాధ్య మగునంతదనుక నపక్వమైన బోనంబు మేలైన దని యే ననుభూతిచే నెఱింగితి - నంగీకృత బ్రహ్మచర్యున కడవిం బండినపండులు సముచితాహారం బని పంచవత్సరంబులు శోధించి నిర్ణయించితిఁ - గేవల ఫలా హారంబుతో నున్ననాఁ డెట్టిసుఖము నెట్టిశాంతి ననుభవించితిఁ దాదృక్సుఖశాంతులు లాఁతితిండిఁ దినునాఁడు నా కందవయ్యె - బ్రహ్మచర్యవ్రత పరిపాలనంబు ఫలంబులు మెసవునాఁడు చుల్కనయై పయఃపానం బొనర్చుతఱి దుశ్శక మాయె - బ్రహ్మచారికి దుగ్ధంబు కీడుసల్పు ననుట కే నావంతయేని జంక - నిట్లనుటంజేసి బ్రహ్మచర్యవ్రతికి క్షీరంబు వర్జ్యంబని తలంపఁ జన - దిం దింకను బరిశోధనమ్ము వలసి యున్నది - సన్ననరములఁ బెంచుటలోఁ జక్కఁగా నఱుగుటలోఁ బాలకే మొదటితాంబూల మీఁదగు - వీన నించుక పైత్యదోష మున్నను నివి నిషేవ్యంబుల కాని నిషేధార్హంబు లన నొల్ల - వెండియు 11

క. నాగాయుత శతసత్త్వము, నాఁగం దగు నింద్రియాళి; నానాదిశలం
దేగతి బళకర ముంచిన, నాఁగక తనయిచ్చవచ్చిన ట్లది దుయ్యున్. 12

మం. కడఁగి ప్రేవుల నెండఁగట్టిననాఁడు, చెప్పినపని నెల్లఁ జేయు నింద్రియము
నిష్ఠతోఁ గావించు నిరశనవ్రతము, కామక తా హృషీకంబుల నడఁచు
నియ్యుపాసముప్రొద్దు లెప్పుడు ముగియుఁ గోరినభోజ్యము ల్కుడుచు టెప్పటికి
ననుచు నువ్విళులూరునతఁ డాత్మలోన, సకలభోగంబులఁ జవిచూచునతఁడు
వాటించు బాహ్యోపవాసమ్ముకతన, దక్కునా ఫలము రిత్తకురిత్త గాక
యింద్రియమ్ములమీఁద నెత్తిననాఁడు, మనము తోడ్పడకున్న మనము గెల్చెదమె
విషయావలికి మది విత్తుగా నుంట,నది విషయానంద మాసింపనపుడ
యనశనవ్రతమున కబ్బు సార్థక్య, ముపవసించినమాత్ర నౌదవునా దమన
మందురు కొంద అయ్యది నిక్కమైన, నిల్లి నొల్లని వాని కింద్రియజయము
నిండుగా నబ్బుట నిద్దురలోని, పలు కౌట నెవ్వాఁడు బ్రహ్మచర్యంబు
వలచు వానికిఁ బస్తు వారక వలయు. 13

క. నడవడిని సంస్కరింపక, కుడుపున సవరింత చేసికొనకయ దమమున్
బడయఁ దలపోఁత బెడిదపు, వడకారున మంచుముసురు వలచుట గాదె. 14

ఆ. స్వైరిబ్రదుకునకును సంయమిబ్రదిమికి, భోగిమార్గమునకుఁ జాగిబాట
కేమిపోల్కికుదురు నిది దక్షిణం బది, యుత్తరంబు సూచుచుండు నెపుడు. 15

ఆ. బ్రహ్మచారిచూపు పరమేశ్వరుని జూచు,విష్ణుకీ ర్తనమ్ము వినును జెవులు
భోగిదృష్టి లాస్యమును గాంచు జావళి, పాటరవళి కాత్రపడును శ్రుతులు. 16

క. అతఁడు కనుమూఁత నొల్లక, నుతిసేయును రాము నితఁడునుం గూర్కుపయిన్
మతివిడి నర్తనశాలా, స్థితుఁడై రోమాంచములకుఁ జేపడి సొగయున్. 17

ఆ. అతఁడు నిజశరీర మనుతీర్థమును గాచు, కొఱక యింతమెదుకుఁ గొఱుకుఁ గాని
యితడు చవులు వలచి యెల్లగడ్డిని దిని, కదుపుఁ గసటుకుడితిగాబుఁ జేయు. 18

గీ. అంత యిం తని విడుపున కవధిలేని, యట్ల నిగ్రహధర్మ మహత్త్వమునకుఁ
బరిమితియు లేద తాదృశబ్రహ్మచర్య, మలఁతిజతనమ్ములకు వశ్యమగుట కల్ల. 19

క. చేతస్సు పవనసమ్మిత, మేతన్ని గ్రహ మసాధ్యమే యగు నైనన్
బ్రీతి నెవం దది రామని, కేతన మొనరించు నతనికిం బాలుపడున్. 20

క. మనఉన్నతి నర్థించిన, మునుముం దేన్నేనివెతలు ముడివడు నైనన్
వెనుదీయుట మగపాడియె, ఘనశ్రమము వలదె మేలికర్జంబునకున్. 21

వ. అఖికాయం దున్నతతి నింద్రియదమనంబు సాత్త్వికాహార సేవనంబునం జేసియ వసపోవు
నని విశ్వసించితిఁ-గాని మాతృభూమి కేతెంచినవెన్క నది కేవల ప్రయత్నమ్ములకుఁ బాల్పడ

దనియు రామభజనంబును రామకరుణయు దానికిఁ జరమసాధనంబు లనియు ననుభూతిచే నెఱింగితి-నిప్పట్టునం గృష్ణభగవానుఁ డుపదేశించిన యీపద్య మవశ్యపఠనీయం బని వాక్రుత్తు. 22

ఆ. కడుపు మాడ్చుకొన్న కతమున విషయంబు, లడఁగుఁ గాని యుడుఁగునా రసంబు
దహరవీథి నెపుడు తత్త్వంబు రాజిల్లు, నపుడ రసముసైత మపసరిల్లు. 23



# 9 మిత వ్యయము

క. అందమ్ము లొలుకు వస్తువు, లం దెచ్చితి నిల్లు పె ల్లలంకృతిసేయన్
దెందమ్ము చివురుపెట్టెడు, చందమ్మున ననుభవింపఁ జాగితి సుఖముల్. 1

క. భోగమ్ములపై నొదవిన, రాగము మఖఁ బుట్టి పుబ్బరా నడఁగారన్
జాగించితి సంసారము,లోఁ గలవెచ్చమ్ము కొంత లుప్తముసేయన్. 2

క. మడివాలున కిడురొక్కము,కడు హెచ్చుట నతఁడు వలయు కాలమ్మునకున్
మడుఁగులు దేమిని జేయం,గడఁగితిఁ జాకిరము దానిఁ గఱపితి సతికిన్. 3

గీ. చాకిపనిఁ దెల్పు పొత్తముల్ చదివి కోక, లుదుకనేర్చితి నైర్మల్యసదనములుగ
నెంతవ్రేఁ గైన నప్పని వింతయగుట, మదికిఁ బొలివోనివేడుకం గదియఁజేసె. 4

క. తొలుతన్ నాసవరించిన, గళపట్టముఁజూచి మిత్రగణ మది నవ్వెన్
వలసిన యోరిమిపేరిమి, కలమానిసి నొట దానఁ గలఁగక యుంటిన్. 5

ఆ. ఇచటఁ జాకి లేఁడె యీపీడ యే లని, మేల మాడినట్టి మిత్రతతికిఁ
దనివిఁ గూర్పదయ్యెఁ దనపని తాఁ జేఁత, మంచి దనుచు నావచించుపల్కు. 6

క. ఎవ రెంతపిసాళించినఁ, దవిసకలితనమ్ము చాకితనమునఁ గంటిన్
భువనైకపూజ్యుడై వీ,న్మివిలినగోకులుఁడు నన్ను మెచ్చెను దీనన్. 7

వ. దేశారాధకవతంస మగు నగ్గోపాలకృష్ణు నొక్కయెడ మహాదేవగోవిందరానడే బహూకరించి యొసంగిన రమణీయరాంకవం బొండు కలదు-గోకులుఁ దాసేలును బ్రాణాధికమ్ముగా గారవించుచుఁ బ్రధానసమయంబులంద ధరియించు-నగ్గఱువ జోహన్సుబర్గునం దనకు జరిగినవిందునం దుపన్యసించువేళ నాసాలుం గప్పుకొన ముచ్చటపడి యది ముడుగఁ బాఱి యుంట నసంతృప్తి నెందుచుండ నేను 8

క. ఆనెతి నెతింగి సాలువు, నీనెతి నేఁదొలఁతు రజకవృత్తిం గల నా
దౌనెతి పరికింపవె కరు, ణానిధి! యని కృష్ణు వేఁడినన్ జిఱునవ్వల్. 9

క. వెలయించుచు నతఁ డిట్లనె, బళారె! నీన్యాయవాదపాండితి నమ్మం
గలఁ గాని చాకితనమునఁ, గలకందువ నెట్లు నచ్చఁగా నేర్తు నయా! 10

క. ఇది రానదేప్రసాదం, బిది పూజ్యం బిది యమూల్య మిది కల్లలకుం
గుదు రగునో యే మగునో, మది శంకాతంకములకు మందిర మయ్యెన్. 11

గీ. అనుటయు న్మెలమెల్లఁగా నతనిఁ దేర్చి,పట్టుసాలువు నపుడప్డ బాగుపతిచి
మేలిమడివా లటంచునమ్మేటి యొసఁగు,బిరుదువడసితి సంతోషభరముతోడ. 12

ఆ. చాకివానిబాధ పోకార్చుకొన్నట్లు, వలసె మంగిపీడ వాపుకొంట
నీ కెవండు గొఱుగు నిలువకపో మ్మంచు, నన్నుఁ గసరె నొక్కనాపితుండు. 13

వ. ప్రిటోరియాలోఁ దటస్థించిన యియ్యవహేళనం బోర్వ నైతికామింజేసి వైళంబపణ్య వీధికింజని
కర్తరి విలిచి శిరోరుహంబుల నెట్లెట్లో కత్రించుకొంటి–నెగుడుదిగుడుగా నున్న నాతలంజూచి
నాఁడు న్యాయవాదులు కడుపుబ్బనవ్వుటయ కాక. 14

మం. నెయ్యరీ! యిది యేమి నీనెత్తిమీఁద, నెలుకలు చెరలాడు నే మంచుఁ బలుక
గాదుకా దీనేలఁ గల తెల్ల ముండి, యస్మచ్ఛిరంబు నె ట్లంటుకో నొప్పు
నతఁ డియ్యకొనకున్న నాఁగునా వపన, మేన కత్రించితి నెట్టెటో నెఱులు
సొగసున్న లేకున్న సొంతము గానఁ, గదు నించు నాకు నీకత్తిరిం పనితి. 15

గీ. వారి కీపల్కు విస్మయకారణంబు, కాద నిక్కంబు నొరసిన క్షౌరకారి
నడతలో దోస మున్నదా నల్లవాని,బుఱ్ఱ గొఱిగినచో వీనిపొట్ట మాడు. 16

గీ. ఎవరినో యాడిపోసికో నేల మనకు, లేదె యీ తెగు ల్మాలకు మాదిగకును
వపనవిధిఁ దీర్చు మంగలివానిపట్ల, మనము సైరణ వెలబింతుమా రవంత. 17

గీ. తరతరమ్ములనుండియు వెఱపులేక, భారతీయు లొనర్చు నీఘోరదురిత
మిచ్చినఫలంబుగా నట్టియొచ్చెములకుఁ, జిక్కితి నెటాలుగడ్డలోఁ బెక్కుమార్లు. 18



# 10 బోయరు యుద్ధము

వ. అష్టాదశశత సప్తనవతి(1897) వత్సరముం దొట్టి నవనవతితమ (99) హాయనంబుదనుక నామన్గదయందలి యన్యతరానుభూతుల నటులుంచి బోయరుకయ్య మున్గుతిచి వక్కాణింతు – నాఫ్రికాదక్షిణభాగమ్మునం దడవులంబట్టి కాఁపురించు హాటెంటాటులును రాజ్య లోభంబునంజేసి సప్తదశశతాబ్దిమొదట నాగడ్డఁ ద్రొక్కిన డచ్చివారును బరస్పర బాంధవములతో బిగిసిరి – వీరిసంతతివార బోయరులు నాఁ దగుదురు – డచ్చివారి శౌర్యసంపత్తు లడఁగారినంతన యష్టాదశ శతాబ్ది కొట్టకొసనాళ్ళలో నాఫ్రికాయందలి వారివలసమాగాను లాంగ్లేయు లాక్రమించి మెల్లమెల్ల నెల్లసీమల న్గెలిచి స్వతంత్రు లైరి – వారియ్యధికారంబు వదయుపొంటె బోయరులు కాఫరులు జూలూలు మున్నగు తద్దేశీయుల నయ్యాయుపాయంబుల నదిమివైచిరి – కాని 1

క. మగఁటిమిగల బోయరు తెగ, పగపట్టిన కోడె(త్రాఁచుఁబాము విధానన్
దగునెదరు వేచి నేఁటికి, దెగించి యొఱక త్తి దూసి తీ(వ్రం బయ్యెన్. 2

క. ఇరువాఁగుల రణభేరులు, మొరసెఁ గడున్ వీరగంధములు గుబులుకొనెన్
మొఱసెఁ గరాచురకత్తులు, కురిసెదునేదారికంటికొలుకుల నిప్పుల్. 3

వ. ఆపు డాంగ్లేయప్రభుత్వమువారియెడ నాకుఁ గలనమ్మిక యేతదాయోధనంబున యథాశక్తి వారికి సాయంపడు మని నన్నుఁ బ్రేరించె – మేము మీయేలుబడిలోనివార మనునర్థం జూపి వలయు చనువులకొఱకు మన మాదొరతనమ్ము వారి నిలువవైచుటకుం బూనిననాఁ డాయర్థంజేసియ వారి కాపత్కాలమునం దోడ్పడుట మనక ర్తవ్య మని యేను భావించితి – నాఁడు మనసకలాభ్యుదయమ్ము లాంగ్లేయులచేతన దేయమ్ము లని తలంచువాఁడఁ – గాన. 4

గీ. కన్ను చెడి కేలు కృత్తమై కాలు తునిసి, నాల్క తడియాఱి ఘోరరణమ్మునందు
దిక్కులేక విలాపించు దీనయోద్ధ, కూడిగముసేయుఁ గూర్చితి నొక్కదండు. 5

ఆ. నాఁడు తెల్లవారు "నల్లవాఁ డన వట్టి, పంద యిమ్ముదప్పునందు నిలువఁ
డతఁడు రేయుఁబవలు స్వార్థంబవాంఛించు, రి త్తమనిసి" యంచు హృదిఁ దలంత్రు. 6

క. కావున మా సమకట్టిన, సేవావిధి నెఱిఁగి చులుకఁజేసిరి చనువాఁ
దౌ వెజ్జు బూ తొకంద మ, జా! విజయం బగుత మంచు నలరించె మమున్. 7

క. అది గా కతఁడు దయాసం,పద పొంపిరివోవ మాకుఁ బ్రథమచికిత్సా
విధి నేర్పి దానికిం దగు,చదు రేర్పడె నంచు నొసఁగెఁ జాతురిలేఖన్ 8

వ. అంత సేవాకౌతుంబు వేగిరపెట్ట 9

క. మా కావించెడికొల్వున, కీకొం దని వేఁడుకొంటి మేల్బడివారిన్
మీ కోర్కి మాన్య మైనను, రాకుం దని కిప్పు డంచు వ్రాసిరి వారల్. 10

గీ. అంతలో సమరమ్ముతీ రకటవికట,మయ్యె శాత్రవావష్టంభ మంగబలము
శూరతయు నాఁడునాఁటికి మూరిఁబోయి, దొరతనమువారి తాల్మిపాదును గదల్చె. 11

గీ. దిక్కు తోఁపక మనవారు దేశమెల్లఁ దిరిగి పలుపాట్లు పడిరి పోటరులఁ గూర్ప
నపుడు రారండు తోడ్పడుం దనుచు మాకుఁ,దంతినంపె నమాత్యసత్తముఁడునెమ్మి. 12

వ. మా దండునందు మున్నూర్వురపావృతులు నెనమనూర్వురు కర్మకరులుం గలరు – వీ రెల్లరు భారతీయుల – భిషగ్రగణి యగు బూతు కొండవలె మా కండగా నిలిచె – మేము లోహితస్వస్తికచిహ్నములం దాల్చి పాలికలని కీవల మాయూ డిగమ్ము సాగించుచు నిక్కచ్చి లేకున్నను సమరాంగణమునకుసైత మొక్కమా ఱరిగి లఘునాళికా బృహన్నాళికలు వర్షించు నగ్నిగోలమ్ములనడుమ మావిధిం బాటించితి – మియ్యవసరంబున దినమునకు రెండు మూఁ డామడలమేర పయనం బొనర్చి(శ్రమించి రణక్షతుల మోసితెచ్చి శుశ్రూషించు వారము – దళవాయి వుడ్ గేటుం బోని నెఱజోదుల నెత్తికొనివచ్చి సేవించునదృష్ట మిప్పట్టు నన్నాకొదవెఁ – గాని సర్వసేనాని రణంబు నాఁపుటంజేసి సార్ధమాసమ్ము పదపడి మాకూటువకు విడుమర యొదవె – నియ్యల్పకాలమునం దేముగావించినయలంతి చాకిరి కెంతేని పొగడ్త లభించి తన్మూలమున భారతీయుల గౌరవం బతిశయించె–మఱియు 13

ఆ. మా యొనర్చినట్టి యీ యూడిగముఁజేసి, భారతీయులందు బలిసెఁ జెలిమి
కూలివాండ్రలోనఁ గూరె వివేకంబు, తొడరెనాకు వారితోడి జడ్డు. 14

ఆ. ఇతఁడు దాక్షిణాత్యుఁ డతఁ డౌత్తరాహుఁడు, వీఁడు క్రైస్తవుండు వాఁడు మలక
యతడుఁ పారసీకుఁ డితఁడు హిందు వటన్న, వింగడంబు కానిపింప దపుడు. 15

క. ఎల్లరకు భారతీయుల, తల్లడ మింక దొలఁగు నన్న తలఁపు జనించెన్
దెల్లదొరల చేఁతలలో, నుల్లమ్ములఁ బలుకులందు నొదవెను మార్పుల్. 16

గీ. తెల్లజోదులు కొనియాట వెల్లివిరియఁ, జాటిరి కృతజ్ఞత న్నేము సల్పుసేవ
కదరె నొండొరులకుమధురాతిమధుర, మిత్రభావంబు కొలఁదుల మీఱిమీఱి. 17

క. ఆపద లతివేలమ్ముగఁ, బ్రాపించిన వేళ మనుజభావ ముదారం
బై పొదలు నన్నసూక్తికి. రూపించెద నొక్కకథ నెఱుంగంజేఁతన్. 18

క. రాబర్ట్సుదొర కుమారుఁడు, తా బవరమునందుఁ గూలఁ దత్కుణపంబున్
మాబుజముల నిడికొని చను,చో బగ్గన మండి యెండ శూరతఁ జూపెన్. 19

క. మాకును మాబడిఁ గల తెల, మూఁకకు నాలుకలు ఊతిముక్కల యయ్యెన్
లోకమ్ము దాఁటుదుర్దశ, చేకుఱునో యన్నభీతి చెలసెను మాకున్. 20

వ. అపుడు మాపయనించు మార్గమ్మునం దొక చిన్న కొండకాల్వ కన్పించుడు నెవరు మున్ముందు దప్పి వాపుకొన వలయు నన్నప్రశ్న మొలతెంచె - నంత మే మాంగ్లేయసైనికులం గని మీరు త్రావినవెన్క మేము త్రావెద మనుటయు మాతోడ వారు నట్ల యనిరి - కాదని మే మంటిమి - వల దని వా రాడిరి - యి ట్లితరేతర సౌహృదసమ్మానములతోఁ బెద్దయుం బ్రొద్దు స్పర్ధం బూనితి - మేతాదృ శౌదార్య మిక్కట్టులం ద్రిక్క లాఁతివేళలం బాటిల్లునా?21



## 11 నగరసంస్కరణము - క్షామనిధి

క. నింద కల దొండు నేటాల్, హిందువు లవివేకమూర్తు లెద్దెలు పశువుల్
మందిరచారిమము శుచిత,యుం దెలియనిమోటువా రయోగ్యు లటంచున్. 1

క. ఈ దూఱు కొంత నిక్కమ,నాఁ దగు నే నట వసించునాఁ డిది విని ని
ర్వేదంపడి యేతన్ని,ర్వాదము నడఁగింప నెల్లవంతలు వడితిన్. 2

వ. సమాజశరీరమ్మునం దొకయల్పాంగమేని చెడియుంట కేను సైరింపఁ జాల - మనలోపం బులు దాఁచిపెట్టి యొప్పరికించి పాచుటకుం గడంగక మాకుఁ బెత్తనంబు లీవలయు నని రాచతికమ్మువారి నర్థించుట నాకు నింపనిపని - కాన నే నీదుర్యశంబు దూరగింపఁ బెద్దయుం బ్రయతించితి - దర్బనునగరమ్మున బొబ్బ జాడ్యంబు రేఁగునాఁటికి వణిజ్యాదులం బ్రసిద్ధులైన - భారతీయులనెలవుల దిద్దితిఁ గాని లాఁతిమనికిపట్లదెస కేగ నయితి కాదయ్యె - నయ్యంటుఁదెవులు పంచారించిననాఁ డక్కార్యమునకుం బూనితిఁ - గాని యిందు నాతలప్రాణము తోఁకకు వచ్చె నంట యతిశయోక్తి కాఁజాలదు - నేటాలుదొరతనమ్ము నెదిరించుపట్ల భారతీయులు నాకొనర్చినసాయము వారిమేనికసటు వారిచేఁ గడిగించుతఱి నొనర్పరైరి - వెండియు నీ జతనంబున 3

క. కొందఱు నను దూషించిరి, కొందఱు వినయమ్ము నిందుకొనఁ జూతములే
తొందర యే మని తొలఁగిరి,యిందుల కొకరువ్వ రాల్ప నేడ్చిరి పలువుర్. 4

గీ. అవు డెఱింగితి సంస్కరణాభిలాషి, భయదవైరమ్ములకుఁ బరీభావములకు
నసువు లర్పించుటకు సిద్ధమైననాఁడ, సంఘసంస్కృతిధర్మంబు సాగునంచు. 5

క. ఈ సంస్కరణోద్యమమున, నాసల్పినసేవఫల మనన్ హైందవులం
దాసలు రెక్కొనె మందిర, వాసస్సౌందర్యవృద్ధి వలయు నటంచున్ 6

గీ. మొఱలువెట్టుచు నధికారములకుఁ గడిఁది,గోలసేఁతయ కాదు నల్గురును మెచ్చు
కరణిఁ దనవారి దిద్దుఁబో గాంధి యనుచు,నాఁడుతెలవారునన్నుఁ గొండాడినారు. 7

వ. కాని నేటాలు నందలి భారతీయులు మాతృదేశమ్మునెడఁ దమకర్తవ్య మెద్దియో దాని నింకను గుర్తింప రైరి – హిందూదేశము పేదఱిమికిం బుట్టినిల్లు – కానఁ దద్దేశీయులు ధనసంచయమ్ము కొఱకు లాఁతివిలాతుల కెక్కవలసె – వారార్జించిన విత్తమ్మునం గొంతపాలు దుర్భిక్షాదిదుర్దశలకు నగ్గపడినతఱిఁ దల్లిగడ్డకు నంపుట ధర్మ్యంబు – వేయేనమన్నూట తొంబదియేడవయేఁట భారతదేశంబునం బెద్దకఱ వేర్పడుటయ కాక మఱి రెండేండ్లకు వేఱొండుకాటకం బతిదారుణంబుగాఁ దల చూపె – నీరెండుదుష్కాలములయందును భారతీయు లాఫ్రికావాసులు తనజన్మ భూమి కపారధనసాహాయ్య మొనరించి కృతకృత్యు లైరి – కూలివాండ్రును యథాశక్తి నిప్పట్ల విత్తం బొసంగి–రాంగ్లేయులు న్మిగులఁదోడ్పడి – రీయభ్యాసమ్ము నంజేసి భారతభూమి కాపత్తి పొసఁగినపుడెల్ల నాఫ్రికాహైందవుల కూడి గమ్ము సలుపుచుఁ గ్రమక్రమమ్ముఁ బెక్కుధర్మంబు లెఱింగితి – సూనృతం బన నొక్క పెనుమ్రానిం బోనిది – దాని నెంతచక్కఁగా బెంతు మంతచిక్కఁగా ఫలించు – సత్యద్రుమఖని గర్భంబునం జొచ్చినకొలంది సేవారత్నములు వలసినన్ని లభించు. 8



# 12 స్వదేశాగమనము

మం. బోయరుకయ్యంబు పూర్తియైనంత, నాఫ్రికా నిఁక నస్మదాచరణీయ
కార్యముల్ ముగిసె నాకావింపఁదగిన, యూడిగ మెల్ల హిందూర్విసే కలదు
మఱి కొంతకాల మిమ్మహి నుందునేని, హైందవప్రజ కించుకంత తోడ్పడెడి
యక్కఱల్ పొడతెంచు టది నిక్క మైనఁగాసుల నార్జించుకర్జంబ నాకు
నుత్తమధర్మమై యుండునో యంచుఁ,గొసలేని తలపోఁతకుం జొచ్చినాఁడ. 1

వ. అయ్యవసరంబునంద 2

క. ఇంగన్ నీదగుసేవా, రంగము నిచ్చటికి మార్పరాదా యనుచున్
సంగాతకాండ్రు హిందూ, ర్విం గలవారలు బలాత్కరించిరి నన్నున్. 3

క. ఏనున్ భారతభూమికిఁ, బైనం బొనరింప వేడ్కపడితిని నాజర్
ఖానులు కలరుగదా సే,వానిష్ఠతు లిచట నన్న భావముతోడన్. 4

క. మిత్రములఁ గదిసి నా కిఁక,మాత్రవనికి సెలవొసంగి మన్నింపుఁ డనం
జిత్రములు బహుళదుఃఖ, క్షేత్రము లైనారు కొంతసే పవ్వారల్. 5

గీ. ఎట్టకేలకు గాద్గద్య మెసఁగ నొక్కవత్సరములోన నక్కఱ వచ్చునేని
పిలిచినంతన మీరురావలయునంచు,నియమ మిడి యియ్యకొనిరి నాపయనమునకు. 6

క. నేమం బది దుర్భర మని, నామదికిం దెలియుఁ గాని నన్నుఁ బవిత్ర
ప్రేమప్రగ్రహమున నెపు,డో ముడిచిరి వార లిం కెటుల్ వలదందున్. 7

గీ. కాంచనాంబరధారి మత్కంఠసీమ, గట్టిగాఁ బ్రేమసూత్రమ్ము కట్టినాడు
న న్నతఁడు త్రాటితో ఁ జేఁదుకొన్నకొలఁది, నే నతనిసొత్త నగుచున్నదాన బళిరె! 8

వ. అని మున్ను మీరాబాయి పల్కినయీపోలిక చాలవట్టు నాయందును సూత్ర పడియెఁ-
బదిమంది గలచోట దైవ ముంట నిక్క మ్మని పెద్ద లందురు - కాన నెయ్యురకోర్కిం
గుఱుచసేయ నేరక యీకొని వారియభ్యనుజ్ఞం బడసితి - వెండియు 9

క. నేటాలుతోడ నాకుం, గాటంబగు లంకె యున్నకతమున నన్నా
నాఁటఁగల భారతీయుల, కూటువ పాటించి వీడుకొల్పెడివేళన్. 10

క. విందులలో వింతల నభి,నందనపత్రములలో ననర్ఘోపదలన్
దెందమ్ముతనియు హార్దము,నందును నోలార్చి పరవశాత్ముని జేసెన్. 11

గీ. ఏను మును-భారతక్షోణి కేగుదెంచు, వేళ నేటాలుసోదరుల్ వేలకొలఁది
కానుకలు నా కొసంగిరి కాని నేఁటి, యుడుగర ల్గనినంత నాయుల్ల ములికె. 12

గీ. వెండిబంగారముల కాక వెల్గులీను, రవలు కెంపులు చెక్కినరవణములను
సూడిదలుగా నొసంగి రీనాఁడు వీని, నేమిసేయుదు ననుచింత హెచ్చునట్లు. 13

గీ. మోవఁగారాని జాళువానేవళంబు, పోరచిగ నిచ్చి రొకరు కస్తూరిబాయి
కదియు నాసేవ కొసఁగినయట్టి యులుప, గాఁదలంచుట ధర్మ్యంబు కాకపోదు. 14

క. ఈపావడమ్ము లన్నియు, నాపెట్టెను డాఁచుకొన్న నాదగుసేవా
వ్యాపారం బది భృతక, వ్యాపారమ కాక యెట్టు లభినంద్య మగున్. 15

గీ. కనులు మిఱుమిట్లుగొను రెండుకట్టనమ్ము, లబ్బె నొకనాఁడు నాకు నయ్యంపకమున
నాల్గుజాల్ వెత్తివాఁడనై నాఁటిరేయి, గడపినాఁడను గర్తవ్యజడత మీఱ. 16

క. మితిలేనిసొమ్ము నుడుగుట, మతి కింపనిచేఁత యయ్యె మఱి తద్వసువుం
గుతుకమ్మునఁ జేకొంటయు, నతికష్టమ యయ్యె నాకు నక్కాలమునన్. 17

గీ. పిసిడినై యేను లోకు లర్పించినట్టి, ధనము దిగమ్రింగఁగా నియ్యకొనెదఁ గాక
యాఁకపెట్టక యభ్యస్తలోకసేవ, లిచ్చగింతురె నాపుత్త్రు లిట్టిపనికి. 18

క. సేవకు మూల్యము లేదని, యే వినిచితిఁ బెక్కుమాఱు లీకుఙ్గలకున్
భావంబు నీటుగోఁటుల, కావలిదై వెలఁదినగల నమ్మితి నెపుడో. 19

వ. మఱియు మాసంసారము క్రమక్రమమ్ముగా సామాన్యజీవనమ్మున కలవాటుపడు చున్నతఱి హిరణ్యఘటీకారంబులకును వజ్రఖచితాంగుళిముద్రలకును మేము తగు దుమా – కావున నీద్రవ్య మంతయుఁ బ్రజాసేవకు వెచ్చించుట యుత్తమకార్యం బని నిశ్చయించితి – నాకొడుకు లిప్పనికి వెనువెంటన మైకోలు చూపిరి – కాని నాయిల్లాలు తద్దయు వైముఖ్యముం బ్రకటించుచు నన్నుంగని యిట్లనియె. 20

మం. నీ కేల యీనగల్ నీచేతికీలు, బొమ్మ లైనట్టి యీబుదుతల కేల
నాల్గవపడి నున్ననా కేల కాని, వల దందువా యెల్లి వచ్చుకోదలికిఁ
దగునందువా ప్రజల్ తద్దయు మెచ్చి, యర్పించునులుపాల నవలికిం ద్రోపు
రేపెట్టిదో యెవ్వరికి దెల్లమగును, వేగిరింపకు మంచు వేఁడెద నిన్ను. 21

క. అని పల్కెడి నాపెండ్లము, కనుఁదమ్ముల బాష్పవారి కాల్వలుకట్టెన్
దనయుల కలంగ రపు డిఁక, వినిపించుట రిత్త నాదువృత్తాంతంబున్. 22

వ. ఏ నట్టితఱిఁ గస్తూరిబాయిం గని 23

ఆ. చాన! యెంతవెఱ్ఱిదానవు బయకారి, బన్నసరము వలచుపడుచు మనకుఁ
గోద లగునె యైననాఁ డే నెటకుఁ బోదు, బేల! యింతవంత యేల నీకు. 24

క. అనుటయుఁ జుఱుకుంజూపుల, ననుఁ గన్గొని యిట్లుపల్కె నాతి బలా! నీ
యనుకంప నీతలంపులు, మనుగడలున్ గ్రొత్తలౌనె మాకు మహాత్మా! 25

క. నాసొమ్ము లెల్ల నూడ్చిన, నీసంగతి యే నెఱుంగనేరనె నన్నే
బోసి నొనర్చిన నీవు బ,లీ! సేయించెదవె కోదలికి రవణంబుల్ 26

క. నీసుతుల నెప్పుడో స,న్యాసులఁ జేసితివి వార లర్థ మ్మిఁక నె
ట్లాసింతు రెవ్వ రెవ్విధి, రోసిన నే నీధనంబు రోయఁగఁజాలన్. 27

క. అదిగాక లోకు లెవరో, ముదంబుమై నా కొసంగు ముక్తాస్రజమున్
గదియంగ నీకుఁ గలదా, యధికారము; తగవుఁదప్పి యాడకు మిట్టుల్. 28

వ. అని యిల్లాలు పల్కిన పదంపడి యేను మెల్లన యిట్లంటి – మగువా! నేటాలు భారతీయు లీహారంబును. 29

క. నీసేవం గని యిచ్చిరొ, నాసేవం జూచి యొసఁగినారో చెపుమా
రోసమ్ము నేలకొల్చెదు, సీ!సీ!యది యజ్ఞలోకసేవ్యము కాదే? 30

వ. అనుటయు 31

క. ఔ నౌను లెస్సపల్కితి, వీనగ నీసేవ కలరి యిచ్చినది యనం
గా నగుఁ గాని ప్రసన్నత, నూని విచారింపు ధర్మ వొందు వచింతున్. 32

క. నీ సల్పిన సత్కార్యము, నా సల్పిన యదియుఁ గాదె నానాశ్రమముల్
మోసి యనిశమ్మునీకై, నే సేవయొనర్చుచుంట నిక్కంబ కదా! 33

గీ. అడ్డమాడక నీతెచ్చు నంతవారి, కింతవారికి మైమక్కె లెల్ల విఱుగ
వండి వడ్డింపలేదె యీమొండిజంతు, వేమి యిది సేవకాక వే తెద్ది యగునొ. 34

గీ. అనుచుఁ గస్తూరిబాయి వాదదుచుపల్కు, లుగ్రశస్త్రంబులై మది నూడుకొనియేఁ
గాని తద్బాధ కోర్చి యిక్కాన్క లెల్లఁ, బ్రజకు నర్పింప నాయితంపడితి నపుడు. 35

క. ఎట్టకునేని వెలందుక, పట్టుం దిగఁద్రావి యిచ్చపడె నగ లీఁగన్
గట్టుం దాఁటినముదమునఁ, గట్టనముల నెల్ల మూటకట్టితి నంతన్. 36

వ. అమ్మడియయం దేను మున్ను స్వదేశంబునకు వచ్చుతతి నాఫ్రికాభారతీయులు నాకొసంగిన పావడమ్ములు సైత ముంచి తద్విత్తంబునకు రుస్తుంజీప్రభృతి సాధు సత్తముల ధర్మకర్తలఁ గా నియమించి నాయిచ్చ ననుసరించియుండెఁ బరిపాలకుల తలంపు ననుగమించియుండె నీ సొమ్ము జగద్ధితకార్యంబుల వెచ్చపోవలయు నను కట్టడతో దానపత్రమ్ము లిఖియించి యా ద్రవ్యంబు నొక వాణిజ్యకోశమునందుఁ బదిలపఱిచితి - మఱియు. 37

గీ. ఆఫ్రికాసోదరుల కూడె మాచరించు,వేళ నేతద్ధనంబును వెచ్చపెట్టఁ
దలఁచితిని గాని వలయు విత్తంబు సతత, మబ్బుటంజేసి యీసొమ్ము నంటనైతి. 38

క. నానాఁటికి రేకెత్తుచు, నానాఁట న్నెలవుకొనియె నాపత్కోశం
బీనిధి; యిది యి ట్లొటకు, నే నెన్నఁడు నొచ్చుకొంట యెఱుఁగ లవంబున్. 39

క. ఈ చేష్టితంబునం గల,యౌచితి మెలమెల్లఁ దెలిసి యబలయు గగ్గో
లాఁచి ముదంపడె మచ్చుల, మూచూడక యిట్టు లేను మోక్షముగంటిన్. 40

క. తనకావించు సపర్యలఁ, గని మెచ్చి జగం బొసంగు కట్నము తనసొ
త్తని యెవ్వఁ డించు నాతని, మనుగడ సంస్కార్య మంచు మానక తలఁతున్. 41



# 13 మరల భారతభూమిలో

మం. భారతక్షోణి కిప్పుగిదిఁ బైనమ్ము, సాగించి నావచ్చు సమయమ్మునందు
మార్గమధ్యమ్మున మారిషస్ రేవు, తగిలె నచ్చట నౌక తడవుంటఁజేసి
తరణిపొత్తును వీడి ధరణికి వచ్చి, యానేలవారి వృత్తాంతంబు లరసి
తద్రాష్ట్రపాలకత్వంబును మోయు, నతని చార్లెస్బ్రూసు నాతిథ్య మంది
కతిపయవారముల్ కడముట్టుసరికి, మాతృభూమికిఁ జేరి మన్మిత్రబంధు
సందర్శనార్థ మచ్చటికి నిచ్చటికి, నేగుచుఁ గడపితి నిట్లు కొన్నాళ్లు. 1

వ. ఇది వేయితొమ్మన్నూట యొకఁడగు శరత్తునాఁటి యుదంత-మాయేఁడు కాళీ ఘట్టమ్మున దిన్షావాచాయాజమాన్యమున భారతజాతీయమహాసభ జరుగనుండె-నింతకుమున్ను నే నాసదస్సుం గనియెఱుంగ-నిపు డందు నేటాలుభారతీయ సమస్యం బ్రవేశపెట్ట నెంచి యే నప్పరిషత్తున కేగ నిశ్చయించితి-నంతలో సభాసమయమ్ము తటియంబడ వాచా, ఫిరోజిషా, సెతల్వాడు మున్నగుమహారథు లెక్కినధూమశకటంబు నధిరోహించి బొంబాయినుండి తత్సభాప్రయాణంబు సాగించితి-మధ్యేమార్గంబున ఫిరోజిషా నాగొడవనెల్ల నాలించి 2

గీ. మాతృదేశంబు దాస్యనిర్మగ్నమై భ,రింపఁగా రాని నిందాపరంపరలకు
నగ్గపడి దురపిల్లు చున్నంతవట్టు, తలఁగునా మనయిక్కట్లు వలసలందు. 3

ఆ. ఇంట గెల్వనప్పు దేరీతి రచ్చలో, గెలుపువచ్చు నంచుఁ బలుక నతని
యట్ల పెదవివిఱిచె నాసెతల్వాడు నా,యెల్లయాస లపసరిల్లుభంగి. 4

క. నాచక్కి కపుడు దిన్షా, వాచా కరుణార్ద్రదృష్టి వఱపి సమజ్యన్
నీచొన్పునిర్ణయము నో, యీ!చక్కలిఖించి తనకు నిమ్మాయనియెన్. 5

గీ. దాననొకకొంత తేఱి యేత ద్దయాబ్ధి, కే వినీతుఁడనై మ్రొక్కు లిడితి నంత
జయజయధ్వానములు పెద్దసందడింపఁ, గదిసె మాబండి కాళికాఘట్టనగరి. 6

వ. పదంపడి పౌరలోకం బతిలోకవైభవమ్మున సభాపతిమున్నగు మహామహులం దత్తదుచిత వసతులకుం గొనిపోవుడు నేను బ్రతినిధులకై నిర్ణయించినవిడిదలకు రిప్పన్కళాశాలా భవనమ్మున కేగితి - నాపుణ్యావశమ్మున లోకమాన్యుండు మా బసకు విజయంచేసె - నతఁడుండుచో - టొకకొలువుకూటంబ యగుఁ గదా - చిత్రకళాచతురుండ నైనచో నే నాదృశ్యంబు నెన్నఁడో రచించుకొనువాఁడ - నాఁడు తిలక్ మోతీబాబులు దొరతనమ్మువారి దుండగమ్ములన్గుతిచి కావించిన ప్రసంగములును వానినడుమనడుమ వెలువరించు కంచినవ్వులును జిరస్మరణీయమ్ములు నాఁ దగు - నిఁక మహసభా నగరమ్ము దెసకు నాచూపు నించుకనిగుడ్తు - నందు 7

ఆ. వలసినంతమంది స్వచ్ఛందసేవకుల్, కలరు గాని సుంత కలుపుఁగోలు
తనము కానరాదు తాలిమి శూన్యంబు, నేరిమియు హుళక్కి వారియందు. 8

క. ఏసాయ మెవని వేఁడిన, నాసేవకుఁ డపుడ లాఁతి నప్పనిఁ బనుచున్
శాసించు నాతఁ డన్యుని, గాసింబడి సభ్యకోటి కలగుందుగొనన్. 9

ఆ. అప్పు డేను గొంద ఱైచ్ఛికభటులతోఁ, జెలిమి నాచరించి సేవతెఱఁగు
విన్నవింప సిగ్గువిరిసెను గైంకర్య, రతియు వారియందు నతిశయించె. 10

వ. ఐనను ప్రజాసేవనాసక్తి కుక్కగొడుగుంబలె నెల్లయెడల నుదయింపఁజాల - దయ్యది యంతరంగమ్మునం బుట్టి యనుభూతిచే విస్తరిల్లవలయుఁ - గల్లకపటంబు లెఱుంగని వీరికి సేవాభిరతి వలసినంత కలదు - కాని యోర్పునేర్పు లెవ రిత్తురు? - జాతీయ మహాసభయన్న నేఁడాది కొక మున్నాళ్ళపండువు గదా! - తావన్మాత్రమున వీరి కబ్బు ననుభవం బెంత? - మహాసభా ప్రతినిధులును స్వచ్ఛంద సేవకులవోలె నల్పానుభూతి గలవారల - వీరు పెక్కండ్రు 11

క. తమ కేదో నెఱదొరతన, మమరినగతి మాటిమాటి కై చ్ఛికభటులన్
శ్రమపెట్ట నెంతు రకటా!, తమలెంకలఁబోలెఁ జూచెదరు జంకెనలన్. 12

గీ. దాక్షిణాత్యులు భుజియించుతతి నొరుండు, చూడఁగా దఁట తద్ధర్మసూత్రరక్ష
కేరుపడె వేఱుగావంటయిల్లు; దాని, దదులు రవిమండలమ్మును దాఁటిపోయె. 13

క. వంటకు నీరాటకు మఱి, తింటకు నది యొకఁడ; గ్రుక్కతిప్పఁగనీ కా
యింటఁ బొగరేఁగుని ల్లని,యంట తగదు మందసంబ యనఁజను దానిన్ 14

క. ఇది వర్ణధర్మబాహ్యము, కద జాతీయోద్యమానుగంతలు చదువ
ర్లదిరా యస్పృశ్యత ని,వ్విధి మెచ్చిన వీరిమీఁద బెద్దతికంబున్ 15

క. మోపిన సామాన్యప్రజ,లేపగిది న్నడుతు రింత కెన్నిమడుంగుల్
పాపము పెంతురొ యని సం,తాపమ్మునఁ దోఁగి తద్ద తల్లడపడితిన్ 16

ఆ. మఱుగుదొడ్లు ఘోరనరకంబు లక్కటా!, యేమి యీయవస్థసామి! యంచు
నడుగ జంకులేక యైచ్ఛికభటుఁ డది,కుప్పవానికర్జ మప్పు! యనియె. 17

క. అటు లగుచో శోధని యొ,క్కటి సంపాదించి యీయఁగలవా యంటిన్
భటుఁ దంత వెల్లఁబాఱుచు, నిటు నటుఁ గాల్కదలనీక యీక్షించె ననున్. 18

క. ఏన పదంపడి యెట్లో, దాని స్గడియించి పెదలి తగ నూడిచితిన్
గాని యిటు లెన్నిపెరదుల, మానుగ సవరింపనేర్తు మాపులు తేపుల్. 20

క. పలువురకుం బ్రతినిధులకుఁ, దెలియద యౌచిత్య మేమి తెగడెద వారిన్
నెలవునపంచల నంచుల, మలమూత్రము లుజ్జగింత్రు మాపటిజాలన్ 21

క. స్వచ్ఛందభటుల కేత ద,నచ్ఛక్రియఁ జూప నొక్కఁడైనఁ దదీయం
దుచ్ఛను విష్ఠను దుడువఁగ, నిచ్ఛింపఁడ నాకు ముట్టె నీగౌరవమున్. 22

వ. మహాసభ యింకను గొన్నాళ్ళు సాగుచో నంటుఁదెగుళ్ళు తప్పక పీఁట వెట్టు నని తలంచితి – నట్టి దురాచారపరాయణులగు ప్రతినిధులును సేవాధ ర్మానభిజ్ఞులగు నైచ్ఛికభటులును మన దేశమునం దీనాఁడును వలసినంతమంది కల రనుట నిక్కంబ. 23



# 14 లేకరి – లెంక

క. కాళీఘట్టమునందున్,గా లిడి యొడ్డోలగంబుగడియకు నిఁక రె
న్నాళు లెడముంటఁ దత్కా, ర్యాలయమున సేవఁజేత కభిరతిగొంటిన్. 1

వ. దీనంజేసి జాతీయమహాసభావిషయంబులం దించుక యనుభూతి నార్జింపవచ్చునని నాతలంపు – కానఁ బరిషత్కార్యదర్శియగు ఘోషాలుచెంతకుం జని నన్ను నెందేని పనిగొమ్మని వేఁడ నతండు న న్నాపాదశీర్ష మవలోకించి మందహాసం బొలయ మాకడ లేకరిపని యొండు కలదు – వలయు నందువా – యనుడు నేను మిన్నంది 2

క. కావింతు నెద్దియైనను, సేవాధర్మమునఁ బెద్దచిన్నలు కలవా
నా విని నీశుశ్రూషా, భావము పరిపూత మార్యపరిగణ్య మనెన్. 3

క. అతఁ డంత నైచ్ఛికభట, ప్రతతిన్ సవిధస్థుఁ దేటపడఁ గని తరుణుం
డితఁ డాడినట్టిపల్కులు, శ్రుతిఁ బడెనా యని వచించి సురుచిరముఖుఁడై 4

వ. నన్నుఁ జూచి సోదరా! యియ్యాసనంబునం దధివసించి యసంఖ్యేయలగు నాలేఖలం బరికించి వలయువానికి నుత్తరమ్ములు వ్రాయు – మిక్కార్యంబు నిర్వహించు లేకరి లేక నాపదునిదుమలు నొడువంబాలివి గావు సుమా – మిక్కార్యంబునిర్వహించు లేకరి లేక నాపదునిదుములు నొడువంబాలివి గావు సుమా – వేలకొలఁదిగఱువలు నాకొఱకు నేతెంచుటం గంటిని కదా – యూపిరిపుచ్చలేక కటకటంబడు చున్ననా కీసాయం బొనరించి పుణ్యమునం బొమ్ము – నావుడు 5

గీ. అతిరథశ్రేణికిం జెందు నమ్మనీషి, యిట్లు నను విశ్వసించుట కే నెలర్చి
యప్పగించినపని వేగ యాచరించి, యతనిమన్నన వడసి ధన్యతను గంటి. 6

గీ. పిదప నాతఁడు నాయూరు పే రెఱింగి, వెల్లఁబాఱుచు ముక్కుపై వ్రేలునిల్పి
యెంతపొరపాటు పుట్టె నీయంతవాని, నింతయన్నువపనిఁ బంచు టేమిపాడి. 7

క. పశ్చాత్తాపము వెలయ వి, పశ్చిన్మణి యాతఁ డిట్లు పల్కుడు నతనిన్
నిశ్చింతుం బొనరింప వ, యశ్చాతుర్యముల సేవనారంభములన్. 8

క. మీరలు వృద్ధులు జాతీ, యారంభములందు వెల్లనయ్యేను దల మీ
కీరెక్కడ నేనెక్కడఁ, దూరుపుపడమర లెఱుంగుదురె ననుబోఁటుల్. 9

క. భారతజాతీయసభం, జేరి యధాశక్తి సేవసేయఁగ నువ్వి
ళ్లూరెడినా కలవోకగ, మీరొసఁగినపనియ తద్ద మే లొనరించున్. 10

వ. అని యేను గృతజ్ఞతం జూపితి-నంత నక్కార్యదర్శి నన్నుం గని 11

క. నీనడవడి యభినంద్యం, బీనాఁటియువల్ చరింప రీబాటలలో
మానక వలచెద రర్హత, లేని పదంబులు భరింపలేని యశంబుల్ 12

మం. చిననాఁడు హ్యూముతోఁ జేతులుకలిపి, శ్రమియించినాఁడ నీసభ యేర్పడంగ
దీనిమన్గడయెల్లఁ దెలియుదుం జూవె,దీనిసేవయ నాకుఁ దియ్యనిచేఁత. 13

వ. అని పెక్కువిశేషంబు లెఱిఁగించె - నివ్విధంబున మాకు గాఢస్నేహ మేర్పడుటం జేసి పగటిపూఁట నిర్వురముంగలసి భుజయింపఁ దొడఁగితి - మతఁడంగీని దాల్చు తఱి నింటిబంటు వచ్చి గుండీలం దగుల్చు - నది గని యేన యప్పని గావింతు నని వేఁడ నక్కార్యదర్శి వల్లెయనియె - గఱువలయెడ నాకుంగల పేర్మి యాకోర్కికిం గతము నాఁ దగు-ఘోషాలు నాతత్త్వంబు నెఱింగినవెన్కఁ దనకార్యంబుల కెల్ల నన్నుఁ బనుచువాఁడు - నే నొక్కనాఁడు తన గుండీలం బెట్టుచుండ నమ్మేటి 14

క. మూతిబిగియించి భారత,జాతీయమహాసదమ్ముసచివునివెత లీ
రీతివి గద యెసలిక లే, కాతం దసమర్థుఁ డయ్యె నంగీదిద్దన్. 15

వ. అనుటయు నతనిబోళాతనంబునకు లోలోన నవ్వుకొంటిఁ - గాని యతని కొనరించు నూడిగమ్మునెడ నా కించుకేని యనాదరంబు వొడమ దయ్యె - నీపరిచర్య కతన నా కొదవినమేలు సవతులేనిది నాఁ జను - ఘోషాలుబాబుం గొలుచుటఁజేసి భారతజాతీయ మహాసభా రహస్యము లెన్నే నెఱింగితి - గోకులుఁడు, సురేంద్రనాథుఁడు, మున్నగు మహామహుల మార్గంబుల కనుగొంటి - నెందఱో ప్రజానాయకులపరిచితి నార్జించితి - మహాసభయం దమూల్యమగు సమయ మెంత పాడగునో తెలిసితి - నాంగ్లభాషకుఁగల పెత్తనంబు నరసి మిగుల దురపిల్లితి - నొకఁడొనర్చు కార్యంబు పలువురు గావించుటయు నక్కఱ దీర్చుట కొక్కఁడేని పూనమియుఁగంటి - నిట్టికొఱంతలు నాయెదఁద నెంతకలంచి నను నేఁ డివి నివార్యంబులు కావని తోఁచుటంజేసి వీనియెడ నాకు దురభిప్రాయమ్ము పుట్టదయ్యె. 16

# 15 జాతీయమహాసభలో

గీ. త్రిభువనీమోహనం బైన దీప్తితోడఁ జాగెఁ బరిషత్తు తన్మహాసభ నలంక
రించు నతిరథలోకము న్గాంచినంత, నంశరంగమ్ముతోడ నాయంగ మదరె. 1

క. అసభ కధ్యక్షుండై, భాసిలు దిన్షా రచించె భారతమునకున్
వీసము తగ్గని సదుప, న్యాసం; బది చదువ శక్యమా సకలంబున్. 2

వ. అగుటంజేసి దాని యాయువుపట్లు కొన్ని వినిపింపఁబడె - నవ్వల విషయనిర్ధాయకసభ ప్రారంభమయ్యె - నుదారుఁడగు గోపాలకృష్ణగోకులుఁడు న న్నా గోష్ఠికిం దోడ్కొని చనె - నందు మహామహులు పెక్కు రాయయివిషయమ్ములం గుఱిచి యాంగ్లభాషలో దీర్ఘ చర్చలు గావించుచుండి - రీదుందుభిధ్వానములలో నాబూర యెవనిచెవి కెక్కునా యని యేను మిగుల బెదరితిఁ - జీఁకట్లు పడుచున్నకొలఁదిఁ బరిశిష్టవిషయంబులు శరవేగమునఁ బరిష్కృతంబు లగుచుండె - సభ్యు లెల్లరుం బసకుఁజేర నారటంపడఁజాగి - రింతలో నర్ధరాత్రమ్ము కదియం బడె - నపుడు ఫిరోజిషా కొలువుం గలయఁజూచి యిఁక నింద్ల కేగరాదా యని పల్క గోకులుం దెలుఁగెత్తి 3

గీ. ఆఁగుఁ దాఁగుఁడు గాంధిగా రాఫ్రికా స, మస్య వినిపింతు రనుడు నమ్మాననీయుఁ
డోర్మి వెలయించి గోపాలు నొయ్యఁ జూచి,నచ్చెనా మీకు వారినిర్ణయమటనియె. 4

ఉ. నావుడు గోకులుండు సుజన స్తవనీయుఁడు దాని మెచ్చెది
న్నా వరియింపు మంచు నను సన్నయొనర్చె నెలుంగు రాల్పడన్
మై వడఁకం బరించితి సమర్ధనముం బొనరించె గోకులుం
డావల సభ్యు లెల్ల రగు నౌ నని సమ్మతిచూపి రొక్కటన్. 5

క. తేపటికొల్వున గాంధీ, నీపాలికి నిడుదు నైదునిముసము లని ది
న్షాపల్కెఁ గాని సభ్యులు, చూపినచిఱచిట్లు కేను స్రుక్కంబడితిన్. 6

గీ. తెల్లవాఱె మహాసభ వెల్లివిరిసెఁజర్చపైఁజర్చ రేఁగె విశ్వమ్ము వడఁక
నిచట నీతెప్పపాటులో నేమిసెప్ప, నేర్తు దైవమా యనునళ్కు నిండెనాకు. 7

గీ ఓలి నరుదెంచె నావంతు మేలిరవళి, నపుడు నాపేరు పిల్చి రధ్యక్షపాదు
లెట్టెటో వేదికంజేరి పట్టరాని,జంకుతో నిర్ణయంబును జదువఁగంటి. 8

ఆ. అవల భారతీయు లాఫ్రికాగడ్డలోఁ, గుదుచు నొఱకటమ్ము కొంత కొంత
సభకుఁ బట్టువఱుపఁ జాలితి నింతలో, బల్ల మీదిగంట ఘల్లు మనియె. 9

వ. పదంపడి యేను నాపీఁటకుం జేరితి-నానాఁడు జాతీయమహాసభా ప్రతినిధులకుం ప్రేక్షణికులకు నంతరము గానరా దయ్యె-నెల్ల రెల్లవిషయంబుల పట్ల నభిప్రాయ భేదమ్ము లేక చేతు లెత్తెడివారు-నాప్రస్తావమ్మునైత మాఁగాదులం బడక యూరీకృత మయ్యె-దీనంజేసి నానిర్ణయమ్ముదెస నాకెన్నఁదగినమేలు గోచరింప కుండె - గానివిశ్వభారతజాతీయమహాసభ కాఫ్రికాసమస్య పరిచితయై తన్ముద్ర వడసెఁగదా యన్నతను పావహిల్లె. 10



## 16 కర్జన్ ప్రభువు కొల్వు

ఆ. సభ సమాప్తమయ్యెఁ జాగిరి తమతమ, యిండులకు సదస్యు లెలమితోడఁ
గాని నాకు నాఫ్రికాపను లుంటచే, వంగరాజధాని వదలనైతి. 1

క. సడిసన్న భారతీయులు, విడిసెడిబస కేగి పీఁటవెట్టితి సాధ్యం
పడునెడ వారికి నేటాల్, కడగండ్లు వెలార్చి నెమ్మి గాంచుటపొంటెన్. 2

క. ఆపట్టున కపుడప్పుడు, గోపాలుఁడు వచ్చు నాటకొఱ; కొకనాఁడ
ప్పాపవిదూరుఁడు ననుఁదన, కాఁపున వేంచేయ నింపుగదురం బలిచెన్. 3

క. గోకులునిపిల్పునకు నుర,రీకృతి నాదృతిని వెల్వరించియు నేనై
పోక తగ దంచు నాఁగితి, నీకరణిన్ మూఁడునాలు గేగె న్దినముల్. 4

వ. అంత నయ్యుదారచిత్తుఁ దేతెంచి తానై నన్నుఁ దనమనికిపట్టునకుం గొనిచని గారవింపఁ దొడఁగె-నొక్కనాఁ డతఁడు నాపుచ్చడీకతనమ్ముగని గాంధీ!నీ వీవిలాతియంద యనికి వలయు - నిట్టిసిగ్గరితన మున్న నిం దేమిసాధింపఁగలవు - నీకెంతమంది చెల్మికాఁడైన నంతలగ్గు - వెండియు నిన్ను భారతజాతీయమహా సభాసేవకుని గావించుట నాయభిమతం - బని నాబిడియముం గొంతవట్టు డిందు పఱిచె - నితనిపజ్జకుం జనకమున్ను మాబస యందు నా కబ్బినయనుభూతి యొందు వినుతు. 5

క. రాజప్రతినిధి కర్జను, తేజుమెయిన్ నాఁడు కొల్వుదీర నశేష
క్ష్మాజానులు వచ్చిరి గజ,వాజిమహాంగాదివైభవం బెసరేఁగన్. 6

గీ. అందుఁ గొందఱు మాబస నాశ్రయించి, దంబ మెఱుఁగని చొకవేసంబుతోడ
మెలఁగుచుండిరి కాని యక్కొలువునాఁట, బాల్పడిరి నూత్ననూత్న నేపథ్యములకు. 7

క. దాసీపుత్త్రుల కైవడి, గొసెన కైసేసి లాఁగుగట్టిరి మేలా
కాసె బిగించిరి మఱి జల,పోసనపుం బాదుకలను బూనిరి కడఁకన్. 8

క. తలచీరలు చుట్టిరి వా,రలవేసము నాకు దుర్భరంబగు నార్తిన్
మొలపించె నిట్టికై సేc, తలకుం గతమే మటంచుc దఱిసితి వారిన్. 9

వ. అంత వారు న న్నాదరంబుమైc జూచి 10

క. మే మనుభవించునరకం, బేమ యెఱుంగుదుము బిరుదు లెమ్మెలు సొమ్ముల్
భూములు జితింప మాపదు, బాముల బన్నముల గుట్టు పరుc డె ట్లెఱుcగున్. 11

వ. అని మాఱుపల్కుడు నే నంత నిలువక బానిసీంద్ర కురూపంబులగు నీతలగుడ్డ లీపాదరక్షలు
మీకేల యని పృచ్ఛసేయ నమ్మహారాజు లిట్లనిరి. 12

ఆ. ఏమి కన్నవాcడ వెర వది మాపట్ల, బానిసీంద్రపట్లc బలుకరింపు
మకట! వీరు మాకు నడియరు లైన లెం, కలము గామె మేము కర్జునకు. 13

గీ. కొలువుకూటంబునకుc బోమి గొప్పతప్పు, సహజవేషంబు వాటించి చనుట సొద్దు
బదవ లెన్నేని సైcచి పోయెదమ కాక,మాకు వశమౌనె దొరతోడిమాటలాట. 14

వ. అనుటయు వారిదుర్దశం దలcచి యేను మిక్కుటమ్ముగాc జుమ్మలుచుట్టితి – హార్డింజిప్రభువు
వారాణసీవిశ్వకలాశాలకు శంకుస్థాపన మొనర్చిననాc డిట్టిపేరో లగం బొందు నడిచె –
నెంద తెందతో నరేంద్రు లాసభకు విచ్చేసిరి – భారతా లంకరణ మగు మదనమోహనుచే
నాకారితుcడనైయే నాకొల్వునం బాలుగొంటి–నపు దయ్యేలికలు 15

మం. కౌశేయమగు లాcగు గట్టి నుంజిలుcగుc, బట్టుచొక్కా దొడ్గి ప్రస్ననియాణి
ముత్యాలసరములు మోచి యనర్ఘ, కేయూరములు దాల్చి కీర్తితవజ్ర
కలితావతంసంబు గట్టి రింతులకె, సోయగం బిదు వారిసొమ్ములc గాంచి
వలువలc జూచి దుర్వారశోకంబు, గుడిచితి భూపాలకులు పరిష్కరణ
సామగ్రి యిటులుండ స్వర్ణత్సరువులు, ఖడ్గముల్ చెక్కి రక్కట వలగ్నమున
నవి రాచతికమున కానవాళ్ళా? దు, రంతదాస్యముగుర్తులా? నెలంతకలకుc
దగినకై సేత లీధరణీశ్వరులు గ, ణించుట కడు శోచనీయంబు; విత్త
మధికార మాభిమాన మక్కటా! మనుజు, నెట్టిదుర్గతులకే నీడ్చుట నిజము 16



# 17 గోకులుతో నొకనెల-1

క. తన తమ్ముఁగుఱ్ఱకైవడి, నను గోకులుఁ డాదరించి నాబెరుకెల్లన్
దునుమాడెను దొలుపూఁటన,కనుగొని సమకూర్చెఁ దగుసుఖంబులు తనకున్. 1

ఆ. నాకు వలయువసతు లేకొంచెమో యొట, నేన నాదుపనులు నెఱపుకొంట
నన్ను నిశితనియమ మెన్నఁడు విడకుంట, హత్తుకొనియె నతనిచి త్తవీధి. 2

క. ఆకతమున గోపాలుఁడు,నా కచ్చెరుపాటు పుట్ట ననుఁ గొండాడున్
నాకడ గోపన మన్నది, లేకయ చరియించు నిర్వ్యలీకప్రేమన్. 3

క. తనదరిసెనమ్ము వదయం, జనుదెంచు నుదారపురుషసత్తములకు నా
కనఘుం దెఱుకువ గూర్చుచు, ననుఁ బరమానందరాజ్యనాథు నొనర్చున్. 4

వ. నాఁడు నాకుం బరిచితులైన గఱువలలో వైజ్ఞానికపండితశిఖామణి ప్రఫుల్లచంద్రుఁ దుత్తముఁడు - తనకు వచ్చునెలసంబళ మెనిమిదివందలలో నలువదిరూకలు మాత్ర మితం దనుభవించి తక్కర్థమెల్ల దేశసేవ కొసంగు ననియు నిందనుక నితఁడు బ్రహ్మచారి యగుటయ కాక ముందేని పాణిగ్రహణవాంఛ లేనివాఁ దనియుఁ బల్కి గోకులుఁడు నా కితనితోడి నెయ్యమ్ము గూర్చె - నాఁటికిని నేఁటికిని బ్రఫుల్లచంద్రుని మన్గదయం దెట్టి వేఁతిమియుం గానరాదు - గోకుల ప్రఫుల్ల చంద్రుల సల్లపనంబు నే నాపోకలేక వినుచుండు వాఁడ - దానికి దేశాభ్యుదయ మొండెఁ దత్త్వజ్ఞాన మొండె గుఱియై యుండు - నాదృష్టిలో నపాంపతు లగు ప్రజానాయకులు కొందఱు వీరిచూడ్కిలోఁ బడియ లగువేళ నామనస్సు చివుక్కురు మనుచుండుఁ - గాని వీరు వెడపల్కు వెలువరింతురా యని యూఱట సెందు వాఁడ - గోపాలకృష్ణుని పరామరికయెడ నాకుం గలవిశ్వాస మతివేలము గదా - వెండియు. 5

చ. అతఁ డొకతెప్పపాటుతడ వైనను వీసరవోవనీక భా
రతజగతీహితం బగుతెఱంగునఁ జల్పు సమస్తకార్యముల్
చతురుఁ డతం డొనర్చుపని సంతస మిచ్చుటెకాక లోకవి
శ్రుతము వివేక మిచ్చి పెనుచున్ జననీపరిషేవనేచ్ఛలన్. 6

గీ. అతనివాక్రుచ్చు నెల్ల వాక్యంబునకును, భారతక్షోణి వస్తువై పరిఢవిల్లుఁ
గపట మెఱుఁగక దబ్బఱకంపు లేక,యలరు నైర్మల్యకందమై యతనిపల్కు. 7

క. బందిగములోన గ్రుగ్గెడి,హిందూజనయిత్రిఁ దలఁచి యొండినపొట్టన్
వందురుసోదరులం గని,దెందం బది త్రెవ్వఁ దాఁ గడిందిగ వగచున్. 8

మం. తమగారవించు నుద్యమములదెసకు, నితని నాకర్షింప నేతెంచువారి
కేల పెక్కులుమాట లీరు మీపనులు, పాటించి నన్ను నాపని సేయనిండు
మునుముందు దాస్యనిర్ముక్తభారతము, నభిలషించెద నిచ్చ యది పండినపుడ
యితరమ్ముదెసకు నా దృష్టి సారింతు,నని యుత్తరం బిచ్చునట్టిగోకులుని
నేమంబు సూచి యే నివ్వెఱపడితి. 9

వ. రానడేపట్లఁ దనకుం గల పూజ్యభావమ్ము నతఁడు తన యెల్ల వాక్యమ్మునం దచ్చు పఱుచు – "రానడే యివ్విధిం బల్కువాఁ" డనువా క్యితనికి "సూతుఁ డిట్లనియెం" బోనిది – యే నితని సన్నిధి నున్నపుడ రానడే జన్మదినోత్సవము సంఘ టిల్లె – నాఁడు గోకులుఁ దమ్మహామహుని సర్వజ్ఞతను నిర్భీకమగు దేశభక్తిని వర్ణించుచు ననుభవించిన హర్ష పారవశ్యమ్ములు నుడువంబాలివి కావందు – మఱియు నొక్కనాఁ డేను గోపాలకృష్ణుం గని. 10

మం. ఈపురంబున మరు త్తిది నాఁగఁ జనుచు, వీధివీధికి నుండు విద్యుచ్ఛకటము
దీని నెక్కిననాఁడు దేశనాయకుల, గరిమంబు డిందునా కా దేని నీకు
నేల గుఱ్ఱపుబండి యీవెచ్చ మేల, యనుడు నించుక కుంది యతఁ డిట్లు లనియె. 11

వ. సామ్రాజ్యశాసనసభా సభ్యతంజేసి నాకుం బ్రాఁబడువి త్తమ్ము నాసొంతపనుల కొదవంజేయ నొల్ల – నా కెందఱు పరిచితు లుందు రందఱు నీకుం గలరయేని యానాఁడు నీవు మెఱపుబండిం బయనించుట యసాధ్య మనను–గాని వాలాయ మది దుష్కరం బగు నందు – నాయకు లొనర్చు నెల్లపనియు వారిసంతుష్టి కొఱక యని తలంచుట కించుకే నెడము లేదు – నీవుసైత మీమాత్ర తెలియమి కదుంగదు విచార్యము – మఱియు. 12

ఆ. మెచ్చుకొందు నీదుమితజీవనం బేను,నదియ వలతు శక్య మైనవట్టు
కాని నన్నుఁబోనిమానిసికిం గొంత,యుడుపరానివెచ్చ ముండుఁ జువ్వె. 13

గీ. అనుడు నాశంక సకలంబు నపసరిల్లెఁ, గాని "నీ వసివా ర్పోవుటే నెఱుంగ
నిది తెవుళ్ళకుఁ బాదు గాదెట్లు?వీలు, చిక్కదె వయాళికిం బ్రజాసేవ"నంటి. 14

వ. నా యీయభిశస్తికి గోకులుం "దబిసీలుసల్పు నెసలిక నాకుం గలదని నీవెంతువా" యని మాఱుపల్కె – నీవాక్కు నా కసంతృ ప్తికారిణి యయ్యెఁ – గాని వక్త యందలి గౌరవంబు నానోటికిఁ దాళమ్ము వైచెఁ – దినుటకుం దీఱిక చేపడినట్ల వాహ్యాళికిం దలపడు నని నాతంపు – శరీరపరిశ్రమము దేశసేవం బెంచుఁ గాని కుంచ దని యేను వినీతిమెయి నూహింతు. 15



# 18 గోకులుతో నొకనెల-2

సీ. గోపాలకృష్ణుని గొడుగునీడల నిల్చి, వెలలేనికాలంబు వితయొనర్ప
కొకనాఁడు క్రైస్తవ మూఁడియు భారత,జాతీయ సభసేవ సలుపువానిఁ
గాళీచరణుఁ బొడఁగంటి న ప్డాతని, చెలి చావుసెజ్జపై నలఁగుచుండె
నాడంబరములేని దాయనగేహ మా,తఁడు మహాసభలం దుదాత్త వేష

ఆ. మాదరించువాఁడ యయ్యును బేదవే,సంబు నింట వలపు చాలమెచ్చి
యేసుమతములోని నాసందియయ్యులా, తనికి వినతితోడ వినిచినాఁడ. 1

వ. అంతఁ గాళీచరణుఁ దఘమ్ముతోపాటు మనకు మాఱుపుట్టు వుండునని యీపు నమ్ముదువా
యనుడు శతధా విశ్వసింతునని యే నంటి-నవ్వలనతండు. 2

ఆ. వేళ్లతోడఁ బాపవృక్షమ్ముఁ బెకలించు,నిచ్చ యున్నవాని కేసుధర్మ
మొకఁడ దిక్కు; క సటునకు ఫలమౌ మిత్తి, నేసుభక్తుఁడే జయింపఁ జాలు. 3

క. హైందవధర్మంబునఁ గా,నం దరమా యిట్టిమహిమ నావుడు గీతా
సందీప్తభ క్తియోగము,నందించితి నొవ్వుతోడ నాతనిమదికిన్. 4

క. ఈజతనము నిష్ఫలతా,భాజనమై నన్నుఁ దృప్తిపఱుపద యైనన్
జేజేల్వెట్టితి నాతని,సౌజన్యంబునకు నంతఁ జాగితిఁ బురికిన్. 5

వ. ఆయ్యాయిరథ్యల కేగి న్యాయమూ ర్తి మిత్ర, గురుదాసబెనర్జీ, ప్యారీమోహన ముఖర్జీ
మున్నగు మహామహుల సందర్శించి నేటాలుజతనంబులపట్ల వారిసాయమ్ము వలచి
పదంపడి కాళీప్రాసాదము చూడంజనుచు మధ్యేమార్గమ్మున దేవికిం బలిగాఁబోవు
పొట్టేలుగుంపులం గంటి - నింతలో దేవళమ్ము దగ్గఱించుడు. 6

క. అచ్చోటఁ దిరియుమూఁకలు, వచ్చి ననుం బలసెఁగాని వాడల బిచ్చం
బిచ్చుటకు సమ్మతింపక,క్రచ్చఱ దేవ్యంగణమ్ముకడకుం జనితిన్. 7

ఆ. అచటిమంటపమ్ము నాశ్రయించినసాధు, వొకఁడు నన్నుఁ దేనెలొలుకఁ బిలిచి
యెచటి కేగువాఁడ విటురమ్ము తండ్రి!కూ,ర్చుండు మనుచు నాదరోక్తు లాడె. 8

వ. ఏ నతనిపట్ల నడంకువ మెఱసి 9

మం. ఏపాప మెఱుఁగని యిన్నిగొఱ్ఱియల, కుత్తుకల్ తఱుగుట కూడునా యంటి
నతఁడు హింసాకర్మ మది కృత్య మంచు, నాడువాఁ డెవఁడుండు నని మాఱుసెప్పె
నటులైన మీర లీయజ్ఞుల కేల, నీతిసెప్ప రటంచు నేఁ బల్కినాఁడ
నీశ్వరార్చన యొండె యితనికి నించు, నన్యంబు నితఁ డొల్ల దనె జటాలుండు

భగవదారాధన పరతంత్రబుద్ధి, యిట నిల్చునా యని యే వించినాఁడ
నిది శరణ్యము వర్జ్య మిది నాక జగతి, నెల్లతావుల నున్ని యే నిచ్చగింతు
నీమూఁకగొడవ నా కేల ప్రజాళి, యిసిరొ గొఱ్ఱెలమంద కీడనె నతఁడు. 10

క. ఏ నింక జర్చం బెంపక, లోనికిఁ జని కాళికన్ విలోకించితి న
చ్చో నెత్రు వెల్లివొడుచుచు, నానాక్షోభముల ముంచె నా హృదయమ్మున్. 11

క. అట నిల్వలేకపోయితిఁ, దటతట నాగుండె లదరి తలక్రిం దైతిన్
ఘటనం బయ్యది నా కె, న్నఁటికిని విస్మృతికిరా దనం దగు నిస్సీ! 12

వ. ఆనాఁడు వంగసమాజ మొందు నా కాతిథ్య మొసఁగ నం దొక యుదాత్తునికడ హింసా
మయంబగు నీ కాళికాపూజం దదవుడు నతం డిట్లనియె. 13

గీ. గొఱ్ఱియలకుత్తుకలఁ బట్టికోయువేళ, మొరయుఁ బటహాది వాద్యముల్ ముమ్మరముగ
నాప్రళయఘోషమున మరణార్తి లేశ, మెఱుఁగకయ బలివోవు నియ్యేడకములు. 14

క. ఆమాట లేను మెచ్చక, యేమీ గొఱ్ఱెలకు బాసలే వచ్చినచో
నీ మాడ్కినీవు పల్కెదె, హా!మాన్పఁగ వలయు దారుణాచారంబున్. 15

వ. అని ప్రత్యుత్తరం బిచ్చితి – మఱియు 16

గీ. అపుడు భూతదయామూర్తి యైన శాక్య, మునిచరిత్రము నాతలంపునకు వచ్చెఁ
గాని బుద్ధునివోలె లోకమ్ముదిద్దు, తెలివి నాపాలిదా యంచు నులికినాఁడ. 17

వ. ఈ బలిదానమ్ముపట్ల నాఁడును నేఁడును నాతలం పొక్కటియ – వెండియు 18

గీ. నరునిప్రాణమ్ము వెలకంటె గొఱియబ్రదుకు, విలువ కొఱవడు నన్మాట వెఱ్ఱిమాట
మనుజుమై పెంచుటకు మేషమును వధింప, నడుముకట్టంగఁ జాల నేనాఁటి కేని. 19

ఆ. ప్రాణి యెంత దిక్కులేనిదో నరుబారి,ను త్తరింపమర్త్యుఁ డొసఁగుసాయ
మందుకొనుట కంతయధికారి నాఁడగు,నది వివాదదూర మైనపల్కు. 20

ఆ. సవతులేనియట్టి సౌజన్య మధికార, మెతని కగ్గపడని వతఁడు తాదృ
శార్తినిష్నుచేతనావళి కాశ్రయ,మిచ్చి మనుపఁ జాలఁ డింత నిజము. 21

మం. అక్కటా! దిక్కులే కల్లాడుచున్న, గొఱియల నీమహాఘోరయజ్ఞమ్ము
వలనఁ దప్పింప నావంటిమానిసికిఁ దెగువయుఁ జిత్తశుద్ధియు వెండి వలయు
నీత్యాగసంపత్తి కీపవిత్రతకు, నారటించుచు నంగలార్చుచుండఁగనె
యీ బొందిపొత్తునా కెడలునో యేమొ, యీరాక్షసత్వంబు నెడపి మానవుల

నుద్ధరించుటపొంటె, నొకవీస మేని, పాపమ్ము లేని యీప్రాణుల మనుప,
నీకాళిగుడి నెన్నియే నేండ్లనుండి, వదలని కలుషప్రవాహ మింకింప
నేనాఁటి కీశ్వరుఁ దేమహోదారు, నేపుణ్యసాధ్విని సృజియింపఁ గలఁడొ
యనయమ్ము నిట్టికల్యాణమ్ము వలచి,వినతిమై భగవాను వేఁడుచున్నాఁడ
జ్ఞానసంపత్తిఁ బేర్గాంచినయట్టి, శేముషీశక్తి వాసి గ్గన్నయట్టి
వితరణ కేళీప్రవీణు లైనట్టి,నలి భావనాప్రధానత నోఁచినట్టి
వంగీయు లెట్టు లీవధము సైఁచెదరొ, నాబుద్ధి కంద దీనాఁటికి నేని. 22



## 19 గోకులుతో నొకనెల-3

గీ. కాళికాప్రీతి వలచి వంగప్రజాళి, సలుపు నీక్రూరహోమమ్ము సరణిగాంచి
జాలిమై వేఁడికన్నీరు జార్చినంత, వెడలె నాచూడ్కి వంగజీవితముదెసకు. 1.

గీ. తద్విశేషమ్ము లారయఁ దలఁచి బ్రాహ్మ, ధర్మముం దెల్పురచనలు తగిలి కంటి
మనసు నిడితిఁ బ్రతాపచంద్రుని చరిత్ర, వింటి నతనిప్రసంగముల్ వెక్కుసభల. 2

క. అతనివచించిన యుత్తమ, కృతి కేశవచంద్రచరిత మెఱిఁగితి విద్వ
న్నుతు శివనాథుం గని వి, శ్రుతునిన్ దేవేంద్రనాథుఁ జూడం జనితిన్ 3

క. అపు డమ్మహర్షి నిర్ఝర, తపమ్మునం దుంట నతని దర్శనభాగ్యం
బుపలబ్ధము గాక విష, ణ్ణపుఁజూపుల మరలి వచ్చినాఁడన్ బసకున్. 4

చ. పదపడి తన్నికాయమున బ్రహ్మసమాజమహోత్సవంబు రా
నది గన నేగితిన్ బిలుపు నంది; జగన్నుతులైన పెద్దలన్
గదిసితి వంగపండితులగాన మపూర్వ ముదారమాధురీ
సదనము వింటిఁ బ్రెంచుకొనఁజాలని దాసుఁడనైతి దానికిన్. 5

వ. బ్రాహ్మధర్మనిష్ఠితులం దెలియ నింతవట్టు శ్రమంపడినవెన్క జగదారాధ్యు వివేకానందుం గనుకలి యవశ్యాచరణీయం బని నడిచి తదావాసమగు బేలూరు మఠమ్ము దఱిసి శాంతి మూలంబగు తత్క్షేత్రంబు నగ్గించితిఁ - గాని స్వామి యపుడందు లేఁడయ్యె - నతండు లుప్తారోగ్యుఁడై కాళీఘట్టమునం దుంట విని యెనలేని నైరాశ్యముం గుడిచితి - నంత నయ్యాశ్రమంబున సోదరి నివేదిత గ్గని యాపెరీవికి నబ్బురంపడినాఁడ - నయ్యమ్మధోరణికి నాపోకడకుం బొత్తు జతపడదయ్యె - నియ్యుదంతము న్గోపాలకృష్ణుచెంత వక్కాణింప నాకెకు నీకును సామరస్యంబు పొసఁగుట దుశ్శకమని యమ్మహనీయుండు వల్కె -

నొకనాఁ డీమె 'పేస్త నజీపాదుషా' యింట శతవృద్ధ యగు నతనితల్లి కయ్యాయిధర్మంబు లెఱుక సేయుతఱి నే నయ్యిల్లుసొచ్చి యదృష్టవిశేషంబున వారికి దుబాసి నైతి – సోదరికిం దనకును భావబాంధవము లేకున్నను హిందూధర్మమ్మెుదెస న వ్విదుషీమతల్లికిం గలయాదరం బతివేలంబని తెలిసికొంటి – నవ్వల నవ్వెలంది వ్రాసిన పొత్తము లార్జించి పఠించితి – నిట్లు కాళీఘట్టమ్మునందలి యుత్తమసంస్థలం జూడ సగపాలును దక్షిణాఫ్రికా రాజకీయ సమస్యలం బ్రచారమొనర్ప నర్థభాగమ్మును గా నస్మదీయద్రైనందిన కార్యక్రమమ్ము నిర్ణయించుకొంటి – నంత నొక్క దివసంబున. 6

క. బోయరుసమరంబున సే, వాయత్తము భారతీయ మగునట్టి దళం
బేయేశ్రమమ్ము లీకొనె, నాయున్నతి నొకసదస్సునందు వినిచితిన్. 7

సీ. భిషగగ్రగణ్యుఁడై పెనుపొరు 'మల్లికు', కై సేసెఁ బరిషదగ్రాసనమ్ము
కీర్తించె నన్ను 'నింగ్లీష్మను'పత్రికా, నేతయౌ 'సాందర్సు' నెయ్య మూర
నీపల్కు తనివి సంధించెఁబో యని తద్ద,కొనియాడె గోపాలగోకులుండు
మనవార లెంతకమ్మనివా రహో!యంచు, సంతసంపడె సభాసదగణమ్ము.
గీ. బెడఁద లెఱుఁగక గోఖలే గొడుగునీడఁ, దిరుగుచు న్వంగభూమి నీదృక్షమధుర
గౌరవంబులు గంటి నగ్గాథలెంత, యింపితములైన నిచట వర్ణింపఁజాల. 8

గీ. బ్రహ్మదేశంబు కాళికాపత్తనంపు, దాపునం దుంట నేగితి దానిఁ జూడ
నచటి బౌద్ధసన్న్యాసుల నంటియున్న, సోమరితనమ్ము నాకు నశ్రువులఁ దెచ్చె. 9

గీ. కోవెలలు గంటి బంగారుగోపురములు, వీక్షచేసితి మితిలేక వెలుఁగుచున్న
క్రొవ్వుదివ్వెలఁ జూచితి నెవ్వియేని, నాకు సౌహిత్య మొదవింపలేకపోయె. 10

క. గుడిలోఁ బేరెమువాతెడు, కుడుముల దేవర గుఱాలగుంపులు 'మోర్బిం'
బొడఁగన్న దయానందుని, వడసినయనుభూతి గుర్తువచ్చుటకయ్యెన్. 11

గీ. అచటి మగువలచైతన్య మరసి వారి, యిచ్ఛకుం గలపెత్తన మెఱిఁగి యెఱిఁగి
పొంగితిని గాని పెంజెత్తిపోతు లట్లు,బ్రదుకు మగవాంఢ్రదెసఁ గుందుపాటుగంటి. 12

వ. మఱియు బంబయినగరం బెట్టు హిందూస్థానమ్ము కాఁజాల దట్ల రంగూనుపట్టణము సైతము బర్మా కానేర దనియు మన మీదేశమునం దాంగ్లేయవణిక్కులకు దళారుల మైనట్లు తెల్లబేహారులకును మనకును బ్రహ్మదేశీయు లడితికాం డ్రయిరనియు నప్పుడూహించి తద్భూమిం బాసి. 13

క. చొచ్చితిఁ గాళీఘట్టము, నచ్చటినాపని సమాప్త మగుటం గని వి
ద్వచ్చక్రవర్తి గోకులు, వెచ్చునినిట్టూర్పు లదర వేఁడితి సెలవున్. 14

సీ. మునుముందు పొగబండ్ల మూఁడవతరగతి, పయనమ్ముసల్పి తత్పధికలోక
మనుభవించునవస్థ లవి గంట కర్తవ్య,మని యెంచి మామకీనాశయంబు
గోకులుతోఁ దెల్ప నీకేమి వెఱ్ఱియా,యని నవ్వె నాతఁ దే నంతమాత్రఁ
గలఁగక నాతలంపులలోని లోఁతులోఁ, తులు చూపినంత సంతుష్టి వడసి.
గీ. నన్ను మన్నించె, నపుడు పేర్గన్న వార,ణాసికిం జని రుగ్నయై యలమటించు
నవ్వ యానిబిసెంటుమే లరయపొంటె, మొదట సమకట్టి కట్టితి మూటముల్లె. 15

క. పూరీలు లడ్డువమ్ములు, కూరినచిఱుదిండిపెట్టె గోకులుఁడు మహో
దారుం దర్మిలి వడ్డికిఁ, బాఱఁగ నిడి నన్ను నాఁడు బహుమానించెన్. 16

ఆ. ఏలవత్తు రాఁగుఁ డిక నాఁగుఁ దన్న నా, వేఁడుకో లొకింత వినక నన్ను
సాగనంపి రపుడు శకటంబుదనుక న, గ్గోకులుండు 'రాయి' ధీకులుండు. 17



## 20 కాశిలో

ఆ. నడుమ నడుమ నిల్వఁబడి కాశి కాగ్రాపు, రాదు లీక్షచేసి యవల రాజ
కోటఁ జేరఁ దలచుకొంటిని దారిలో, వెచ్చపెట్టుసొమ్ము నెచ్చనీక. 1

క. క్రందుకొని యున్న చేఁతల, నెండే నొక్కొక్క దివసమే నిల్చితి నం
దందుఁ గలధర్మసత్రము, లం దిగితిని రూకసెడనిలాగులు గంటిన్. 2

క. ఇప్పయనమ్మున వెచ్చము, ముప్పదియొక్కండు రూప్యములలో నిమిడెన్
దప్పియును మెయిలు నెక్కక, గుప్పిలి బిగియించి రాజకోటకుఁ జనితిన్. 3

క. కట్టా! మూఁడవతరగతి, పెట్టియ నేఁ దున్నయట్ల పేరినచెత్తన్
గట్టేవగొల్పు కంపున, పుట్టిల్లగు మఱుగుదొడ్డిపొత్తున నుండెన్. 4

గీ. కలదు పాంథులు సెల్లించువిలువపట్ల, నుత్తమాధమశ్రేణులు హత్తుకొన్న
వాసికి న్మించి యందలివారు వడయు,శాంతిసౌఖ్యమ్ములం గల యంతరమ్ము. 5

క. మూఁడవతరమ్ముువారికి, నేడకముల కున్నభేద మెది? యాబండిం
జూడఁగ గొఱ్ఱెలకుం దగు, జాడన కన్పట్టు నుడువఁజాలనిరోఁతన్. 6

క. కడతరగతిపెట్టియలో, వెడలుదు నే నాంగ్లభూమి వేమఱు; నొకనాఁ
డెడఁద యనుభూతికై నను,జాడన కన్పట్టు నడువఁజాలినరోఁతన్. 7

క. ఆకక్ష్యకుం దృతీయకు, నా కంతర మంతగాఁ గనంబడదయ్యెన్
సౌకర్యము లీ[శ్రేణిన్, జేకుఱుఁ దఱచై నెటాలుసీమరయిళ్ళన్. 8

గీ. బల్లపై మెత్త లుండును బాటసారు, లత్తమిల్లుటకుం గల దానుకూల్య
మక్రమంబుగఁ బెట్టియ నాక్రమింప, రచటి తెరువర్లు నీగ్రోల యైననేమి. 9

క. హద్దునకు లొంగి నడుచుట, యిద్దేశమునందుఁ జూడ నెచ్చటనేనిన్
గ్రుద్దుచు నిక్కుచుఁ ద్రొక్కుచు, రుద్దుచు వీ రెక్కుచుందురు గదా బండిన్. 10

చ. కదుఁగదు నింద్యమైన యధికారులయేల్బడి కేమి బండిలో
నడుగిడువారికంపునకు నక్కట!ముక్కులు మూసికోవలెన్
మడుఁగులవారు వీరి కసుమాలపువేసము సైఁపఁజాల;రె
వ్వడువున నుండుఁగాక తలవంపక తప్పదు వీరి కిచ్చటన్. 11

క. ఏపాపమునకొ శిక్షగ, నాపయనము సేయవలయు నాపెద్ద లిపీ!
యీ పామర పాంథజన, వ్యాపారము లెట్టు లేను వ్రాయఁగ నేర్తున్. 12

గీ. ఉన్నచోటన పలుమంది యుమ్మివైతు, రగ దొనర్తురు బీడీలపొగలు గ్రక్కి
యాకువక్కలురుబ్బి నిర్భీకు లగుచు, వఱ్ఱువొదువంగఁ బరఁగింతు రెఱ్ఱవాఁగు. 13

ఆ. కెలనివారినొవ్వ దెలియరు నేలయు, నాకసంబు వ్రయ్య నఱచుచుంద్రు
నెలువరింతు రింత వినరానిబూతు లీ, బెడఁద లెల్ల దెసలఁ గుడిచినాఁడ. 14

వ. వేయుం దొమ్మన్నూటరెండవయేఁట నేనీ మూఁడవతెగపెట్టెలో నడుగిడితి – నవ్వల నప్పుదునైదు నుండి నాల్గువత్సరంబు లెడపక దానియంద యాత్రలు సల్పితి – నాఁటికి నేఁటికి నుగ్గడింపఁదగిన యంతరము పొడకట్టదయ్యె – నీ తెగులుం దుడిచివైచునౌషధము నాకొక్కండ కన్పించు. 15

ఆ. చదువులున్నవారు సంస్కారసంపత్తిఁ, గుదురుకొన్నవారు కొంత సైఁచి
యెక్కవలయు నిచ్చలీశకటమ్ములో, మప్పవలయు నీతి మందమతికి. 16

సీ. వలయుసౌకర్యముల్ వడయ విన్నపములు, పంపి పైవారికిఁ ద్రెంపులేని
వేసట గూర్చి యేవోసుఖంబులు గోరి, యధికారులకు నుపాయనము లిచ్చు
టాదిగాఁ జెడుదారు లన్నియుఁ ద్రొక్కుట, వదలి తీఱమి యెంత వచ్చుఁగాక
పయనంపుమేర తప్పకనిల్చి పెద్ద లి,ట్లూర్జితధర్మమ్ము నూఁదిరేని.

ఆ. కొంతమంచిమార్పు కూడు నటంచు నా,యనుభవమ్ముకల్మి నాడనేర్తు
నిది యవశ్యకృత్య మిప్పనిలేక యీ,జాతి కన్నువిప్పి చక్కఁబడదు. 17

క. ఆయర్వదికొలె నన్న, త్కాయము రుగ్భరము రెచ్చి కదుదుర్బలమై
చేయునది లేక మానితి,నీ యవమశ్రేణిపెట్టె నెక్కెడిచేంతన్. 18

ఉ. పాడియు బాటయు న్గననిపాంథుల దిద్ది తదీయముల్ వెతల్
వీడంగ జేయుసేవ లొకవెంటకు వచ్చెడి వేళయంద నే
నోడితి నాయభాగ్యతకు నుల్లము తద్దకలంగ లజ్జయుం
దోడయివచ్చి బిట్టువగతున్ బయనంబు లొనర్చుపట్టునన్. 19

ఆ. పూనుకొంట వలయుఁ బొగబండ్ల నోడల, వెడలు పేదవాండ్రవెతలు దీర్చి
తరతరాలనుండి తరలని దూషితా,చారముల నడంపఁ జాలువారు. 20

క. దొరతనముసేయువారలు, పరదేశపు బేరగాండ్రపట్లం గదు నా
దర మునిచి కూర్చు ననుచిత, తరసౌఖ్యమ్ములఁ దొలంచుదంటయు వలయున్. 21

గీ. గమనపర్వమ్ము నింక దీనిఁ గట్టిపెట్టి, కాశికి న్వత్తు వఱువాతఁ గాలువెట్టి
యప్పురమ్మునఁ బండాగృహమ్ము చేరి, పీఁట పెట్టఁ దలంచితి నాఁటి కెల్ల. 22

ఆ. నన్ను ముట్టడించినా రొక రిద్దఱా?, కారు పదులకొలఁది పాఱువారు
శౌచనిష్ఠుఁడైన జన్నిగట్టుగృహమ్ము, చేరుకొంట కాసచేసినాఁడ. 23

క. నాతలఁపు సార్థమై పరి, పూతమ్ముగ నుండె నపుడు పోయినగేహం
బాతావున మొగసాలన్, మాతల్లివిధాన సురభిమాతయుఁ దోఁచెన్. 24

క. అది రెం దంతస్తులతోఁ, బొదలెడిసౌధమ్ము సౌఖ్యపూర్ణము దానం
గుదిరితిఁ బై దెసగదిలో, మదిమది సంధించు మృదులమారుత మొలయన్. 25

గీ. పుణ్యభాగీరథీసరి త్పూరమందు, గ్రుంగఁ దలఁచితి శాస్త్రోక్తభంగి నూఁది
తాన మగునంతవఱ కన్నపానములను, ముట్టఁజన దంచునేమమ్ము పెట్టుకొంటి. 26

చ. వలసినవస్తు లెల్ల నలవైదికుఁడే సమకూర్చె "లొచ్చు నా
వలదు సపాదరూప్య మిడువాఁడను దక్షిణగా" నటంచు నేఁ
దొలుతన చెప్పితిన్ దగినధోరణిలోనె ముగింపు మంటి నా
కలిమినిబట్టి యీచిరుతకాన్కయ పెద్ద యటంచు వించితిన్. 27

ఆ. సరసుఁ డతఁడు పోరుసల్పక "దక్షిణ, కేమి యెంతయేని నీయవచ్చుఁ
దీర్ఘవాసు లిచ్చు కార్థికపుష్టికిం, దగినయట్లు మమ్ముఁ దనుపుచుండ్రు. 28

క. వే లిచ్చు చక్రవర్తికి, నాలుగుపైసా లొసంగు నాదారునకున్
వాలాయ మొక్కరీతిన, పోలన్ జరిగింతు మెల్లపూజావిధులున్." 29

క. అని పండా తనకమ్మం, దనము వెలారించె మంత్రతంత్రమ్ములు ప్ర
న్ననిబాట నడిపె సుష్టు, స్వనమ్ముతో c గప్పదాంట్లు వైవక నిలిచెన్. 30

గీ. మట్టమధ్యాహ్నమునకు ధర్మంబు లెల్లc, దీర్చుకొను టాయె నవల భక్తిప్రపత్తు
లదర విశ్వేశ్వరుం గొల్వ నరిగి యచటి, దృశ్యములc జూచి లెస్సచింతించుటాయె. 31

ఆ కాశి యిట్టి దన్నకథ వినియుంట ని,రాశతోన గుడికి నరిగినాంcడ
విన్నదానికంటె వేయిమడుంగులు, కన్నదానcజేసి కలిగె నార్తి. 32

క. దిగజాఱు నలంcతిగొందియ, భగవద్భవనమ్ము సేరు బాటగదా! యం
దగపడదు శాంతి యింతయు, నగురా!'బుంయి'మని ముసురు నటునిటు నీంcగల్. 33

క. అంగడివారలకేకలు, క్రుంగనియాత్రికసమాజ కోలాహల మో
ర్వం గాదు మందునకు నై, నం గన మట దైవచింతన ధ్యానమ్ముల్. 34

క. నలుదెసల నేసరేంcగిన, కలకల మొక్కింత గానకయ కొందఱు సా
ధ్వు లహో! సమాధి నుంటయుంc దిలకించితి బేసికంటి దేవరమ్రోలన్. 35

క. ఈగొప్పతనమ్మును గని, యాగుడి పాలించువారి నగ్గించెదమా!
శ్రీగంధ శాంతి శుచితా, యోగం బీవలదె వారు యోగ్యుల మైనన్. 36

గీ. ఎన్నండో తిలాంజలి నీతి కిడినవారు, పెద్ద తమజీవగఱ్ఱ కాంcబద్దవారు
విక్రయించెద రచ్చోట నక్రమంబు, నాక రోగమ్ములకునూయి నలిమిరాయి. 37

క. విడిముడిదొరచెలి విడిసిన, గుడి నడుగిడినంతc దోcచెc గ్రుళ్ళిపూవుల్
కడలెల్ల విరిసె నందలి, చెడుకం పిట నిట్టిసరకు చేరందగునా? 38

ఆ. అచటిసీమ యెల్ల నైందవప్రస్తర, ప్రోత మవ్వెలందిఱాతినేల
నంధభక్తుc డొక్కc దదికించెరూపాయ, లిరవుకొనియె నందు నుతికి ముతికి. 39

ఆ. జ్ఞానవాపిc జేరి జగదీశు వెదకితి, లాభమేమి యెద కలంక గాక
గవులు కొఱంcత లేదుగద యిటనైన నిం, కేమికాన్క లొసంcగ నిచ్చవొదము. 40

క. ఒకరువ్వమాత్ర మబ్బా,వికి దక్షిణవెట్ట నల్క వెరింcగిన పండా
మొక మెట్టిచేసి దానిన్, వికటమ్ముగc ద్రోసి నన్ను వెసవెసc బదరెన్. 41

క. భగవ దపచార మిట నీ, పగిదిం బొనరింతువేని పాపముపండున్
బగబగ మండెడు నరకపు, సెగలం గ్రుంగెదవ నీవు చెన్నంcటి యనియెన్. 42

ఉ. నావుడు నద్ధరాసురు వినమ్రతమై నెదిరించి నాకు నే
చావు ఘటిల్లునో నిరయసంకట మెట్టిది ముట్టనున్నదో
పోవఁగనిమ్ము సామి! మిముబోఁటుల కీదృశనీచనింద్యవా
చావిధి చెల్లునా చదువుసందె లెఱింగినపెద్దవారికిన్. 43

ఆ. ఇష్ట మున్నదేని యిచ్చినదమ్మిడీ, పుచ్చుకొండు గదుసుపోకఁ జనిన
నిదియు మీకు ముట్ట కీసంచిలో నెక్కు, నంతవట్టు నిక్క మంటి నేను. 44

క. ఎవ్వనికి వలయు నీవెడ, గవ్వ యిసీ! పొమ్మటంచుఁ గట్టల్క నతం
డెవ్వివియొ మతినాలుగు,తివ్వన వెదలించె నవమరీథాకరముల్. 45

క. నాదమ్మిడి గైకొని యీ,వాదేలా యంచు నేను వడివడి సాగన్
బోఁదగ వోయి! పితిందికి, రాఁదగవని పిల్చి యతఁడు రక్కెసతాల్మిన్. 46

క. పట్టేలా పైసా నిటఁ బెట్టుము నీయట్ల నేను బెడిదమ్ములు చే
పట్టఁజన దేను నీసిరి, ముట్టనిచో నీకు నశుభములు చుట్టుకొనున్. 47

వ. అనుటయుం గిమ్మనక దమ్మిడీ నప్పండాముందు వైచి నిడుదనిడుదయూర్పు లూర్చి సాగివచ్చినాఁడ - నవ్వెనుక నొండు రెండుతడవ నైతిఁ - గానఁ దొంటి యనుభూతు లబ్బుటెట్లు? - లోకమ్మున కేన దర్శనీయుండ నైనతతి నా కట్టి దర్శనభాగ్యం బొడఁ గూడునోటు? - మహాత్ములయగచాట్లు మహాత్ములకుం గాక లాఁతివారి కెట్లువేద్యంబులగు- నయ్యది యట్లుండె. 48

క. పూర్వమ్ము నందు గీదృశ, దుర్వాసన వెట్టిగోలతో దుత నవిము
క్తోర్వి కనంబడె నాఁడా, సర్వావమవిధులు నచట సాగుచునుండెన్. 49

క. కరుణామయుఁ డీశ్వరుఁ; డె, వ్వరే నిటన్ సంశయించువా రుండినచో
నరయుదురుగాక కాశీ, పురాదిక ప్రాజ్యపుణ్యభూముల నెల్లన్. 50

క. ఎంతయసత్యము, నెంతబ, వంతము నెంతటియధర్మవర్తన నకటా!
యెంతటి పాషండత్వము, నింతగ నయ్యోగనిధి సహించునొ కనుఁడీ! 51

క. ఇల నెవఁడు కల్లసేయం, గలాఁడు కర్మమ్ము; నందుఁ గలగుణదోషం
బులు భోజ్యమ్ముల క ర్తకు, వలయునె ప్రభుఁ డింక నడుమవచ్చి పెనంగన్. 52

క. అగుటంజేసియ "యెవ రే, పగిది న్ననుఁగొల్తు రిచ్చపడి యవ్వగకుం
దగుఫల మిచ్చెద నే" నని, జగదీశుఁడు కట్టుచేసి చాటున నుండెన్. 53

క. అనుభూతు లీదృశమ్ములు, గొని యానిబిసెంటుఁ గంటకుం జనినాఁడన్
బెనురోగమ్మునతాఁకున, వనరి వనరి యపుడ యాపె వచ్చెను వెలికిన్. 54

క. నావార్త విన్నయంతన, తా వచ్చెన్ నాకుఁ గరుణ దర్శన మొసంగన్
గేవల మాకెం గనుటయ, నావలచినచేఁత యగుట నాఁ డిట్లంటిన్. 55

ఉ. అమ్మరో! నీవు జబ్బువడి తన్నుడి న్విని నిన్నుఁ జూడఁగా
నిమ్మయి వచ్చినాఁడఁ గృశియించియుఁ మంచమువీడి నిల్చి యీ
తమ్ముని గారవించితివి దర్శనమిచ్చితి వింతచాలు హ
ర్షమ్ముఘటిల్లె నీ కలవు రాఁదగ దే నిఁకఁ బోయివచ్చెదన్. 56



## 21 బొంబాయిలో

క. తననిల్పిన కాంగ్రెసులోఁ, బనిసేయుచు ధర్మవాదిపథమున బొంబా
యిని దిరపడి యే నుంటకు,మనసువడెన్ గోకులుండు మద్ధితరతుఁడై. 1

ఆ. కలదు నాకు నట్టివల;పైన నచట బా,రిస్ట రగుట లెస్సకష్ట మన్న
భీతికిం బురానుభూతి నగ్గంపడి, కుదురుకొంటి రాజకోటలోన. 2

క. నామేలు వలచి ము న్నా,సీమకు న న్నంపినట్టి చిరమిత్రుఁడు తా
నై మూఁడభియోగమ్ములు, ప్రేమ 'దవే' తెచ్చియిచ్చి బెంగం దొలఁచెన్. 3

గీ. అల బొంబాయికిఁ జన్నను,గలుగ దిఁకన్ వెఱ పటన్న గట్టి జనించెన్
'నిలువంగనేల యిచ్చట, వెలలుము బొంబాయి' కని 'దవే'యుం బలికెన్. 5

వ. వెండియు నతండు 'నినువంటిబారిస్టరులం బెంచుటయు డించుటయు నన్నుంబోని వకీళ్ల కేపాటిచెయిదంబు? - ప్రజాసేవకుం జాలిననిన్నుఁ గారియావాడు కూపమ్మునం గ్రుళ్ళి పోనీము సుమా!' - యని కరమ్ము కొనియాడినంత నేనుం దనిసని యయ్యాయి చిక్కులు చక్కఁబఱిచికొని బొంబాయికిం జేరి గిరిగ్రామమ్మునం దొక బాడుగయింట నెలకొంటి.6



## 22 ధర్మసంకటము

సీ. కార్యాలయంబును గాపురంబును గిరి, గ్రామంబునం బెట్టి రాణగన్న
గఱువల నెయ్యంబుకల్మి నార్జించుచు, వృత్తి కొగ్గితిఁగాని యీశ్వరుండు
తద్గేహమున నన్నుఁ దడ వుండనీఁడ య, ద్దానిలో నొకవారమేని ముగిసి
ముగియకముంద నాముద్దునకుం దావు, రెండవబిడ్డ సైరింపరాని

గీ. వేఁకికిం జిక్కె వాని తెల్వియును సడలి, వెడలెఁ దబ్బిబ్బునుడు లెంతవడిన నేమి
శౌర్యముంబాయదయ్యె నాజ్వరము సన్ని, పాతచిహ్నములున్ బయల్పడియెఁడుదకు. 1

క. పిలిచినపార్సీవైద్యుఁడు, కలుగ దిటన్ మందుచే సుఖస్థితి; వాడన్
వలెఁ గోడిగ్రుడ్లరస మ,వ్వలఁ గుక్కుటరసము నని ధ్రువమ్ముగ నుడివెన్. 2

ఆ. మంచమెక్కి వనరు మణిలాలు దశశరత్, ప్రాయుఁ దాతఁ దేమిపలుకనేర్చు
మంచిచెడ్డ లరసి మంచెడినేన యే, దే నొకండు నిశ్చయింపవలయు. 3

క. ఆవెజ్జు నుదారగుణ, శ్రీవిలసితుఁ జూచి సాధుశేఖర! యెఱిచిన్
సేవింప మేము వేఱొక,త్రోవను జూపించి మాకుఁ దోడ్పడు మంటిన్. 4

ఉ. నావుడు నాతఁ డిట్లులనె నాకు భవత్సుతుఁ డీవిపద్దశన్
ద్రోవఁగనేర్చి నిల్చునని తోఁపదు దైవమునిచ్చు యెట్టిదో
భావనసేయఁజాల మతి పాలిడవచ్చును గాని దానిదౌ
చేవ గణింపఁదగ్గ పనిసేయదు నాయనుభూతిఁ జూచినన్. 5

క. ఇట నెన్నియేని హిందూ, కుటుంబముల నింత కంతకును మం దేని
చ్చుట మీ కెఱుకయ వారే, నెటన్న నటు లాచరింతు రీకొని సతమున్. 6

ఆ. కోడిపులుసు గ్రుడ్లు కూడదునాక వా, డెదరు వారు జబ్బు లొదవుపట్ల
నాదుపల్కు మీరు నాదృతిచేసి యీ,కుఱ్ఱవాని నిల్పికొంట వలయు. 7

ఆ. ఇంతనిశితదీక్ష యాదృక్షపరుషతా, యోగమేల తీవ్రరోగనిఘ్న
సుతునిపట్ల; నెల్లగతులు త్రొక్కియు బిడ్డ, బ్రతుకుఁ జూడవలయుఁ బితరులెందు. 8

చ. అనుటయు నిట్లులంటి ననఘా! భవదుక్తి నిజంబకాని నా
మనవియు నాలకింపుఁ డిట మామకబాధ్యత లెస్సయేర్పడెన్
దనయుఁడు పెద్దయైనఁ దనధర్మము తాఁ గనువాఁడ కాని నా
మనిచెడిపాపయై తనసమస్తము నాతలపై నిడెం జుఁడీ. 9

క. ఇఱుకునఁ బడు నిప్పుడ నరుఁ,డెఱుఁగఁడు కర్తవ్య మిట్టి దిట్టిది యని; నా
తెఱఁ గురవౌ కాదౌ మనుజుం, డెఱిచిన్ దినవచ్చు నంట కే నియ్యకొనన్. 10

గీ. కలదు జీవనసాధనమ్ములకు సైత, మొక్కమర్యాద; జీవముల్ దక్క వన్న
కష్టకాలంబునందేని గ్రవ్యమునకు, నరుఁడు లోపదరా దంట నామతంబు. 11

క. నానమ్మినధర్మము న్నా,కైనను నాబిడ్డకైన నాలికినైనన్
బ్రాణోత్క్రమణమునందును, మానందగు నంచుఁ దెలుపు మాంసాదికముల్. 12

ఉ. కావున వీఁడు నిల్వఁడని గట్టిగ మీ రెద విశ్వసించినన్
జావున కీతఁ డగ్గపడినన్ వెత లెట్టివి దాపరించినన్

నావిధి నుజ్జగింప నిఁక నాదగుపట్టు దలంచి మీకృపన్
ద్రోవక యుంతురేని తమతో నొకవిన్నప మాచరించెదన్. 13

క. మీరిచ్చు మందు ప్రాఁకుల, నీరోగి కొసంగనొల్ల నించుక జలవై
ద్యారూఢి వదచియుంటం, బ్రారంభించెదను దాని బాలునిపట్లన్. 14

క. నాడియు గుండెయు నడిచెడి, జాడలు నే నాకళింపఁజాలను బిడ్డన్
వీడక దైహికవికృతుల, నాడుచు మీరున్న యుష్మదాదృతి మఱవన్. 15

క. సౌశీల్యమహఃపుంజము, నాశంకలు జంకు లెఱిఁగినాఁ డతఁ డిఁక నా
యాశించినట్ల వచ్చుట, కాశీస్సుల నిడుట కిష్టుఁ డయ్యెను గరుణన్. 16

క. పసివాఁ 'డిది నాతలఁ' పన, నసమర్థుఁడ యైన నాకు నవ్వైజ్ఞనకున్
బొసఁగినవాదము నతనికి, వెస వినిచితి నేమిసేయ వేఁడెద వంటిన్. 17

క. ఈకోళ్ళు కొక్కరాయులు, నాకేటికిఁ దండ్రి! నీవు నమ్మినవైద్యం
బే కానిమ్ము జలీయము, నాక స్తి యదంగకుండునా యనె నతఁడున్. 18

క. తప్పదు మాంసం బని యే, మప్పిన నెదురాడలేఁడు మఱిలా లైనన్
నొప్పి నెఱింగియు నతఁ డిటు, సెప్పుట నే నపుడు హర్షసేవధి నైతిన్. 19

క. ఏ నించుక 'కూనే'ఋషి, పానీయచికిత్సతోడి పరిచితి గంటిన్
దీని కలవాటుపడి మే, లైనది యీయోగ మగ్రియం బనుకొంటిన్. 20

క. అనుభూతి నెఱింగితి లం,ఘనమే కడుమంచిమందుగద యని;మఱికిం
దిననీక కటిస్నానము, కొనసాగించితిని దీక్షగొని జాగర్యన్. 21

సీ. నారింజరసము మూన్నాళ్ళొసంగితి నెన్ని, వేసటల్ కుడిచిన వేఁకిపొగరు
సడలద; యది నిశాసమయమ్మునం బెల్లు, రేఁగందొడఁగె దీనియాగడమ్ము
నూటిపై నాల్గైదుగీటులవఱ కేగ, నాగుండియలలో వణంకు వొడమ
సాగె బిడ్డకు వేఱుచందమ యైన నీ, ప్రజ లెట్లుతలఁతురో పాడిదప్పి
ఆ. నాఁడ వని యగ్రజుండు నోనాడునో భి,షక్కు నన్యుని బిల్చుట సముచితంబు
కాదొకో దేశివైద్యమ్ము నాదరింపఁ, దగదొ యనుచింత లెన్నేని దగిలెనాకు. 22

క. అస లేతండిరికిన్ దన, కసుగాయంబోని తెల్వి గదుపిన్నలపై
విసరుటకు హక్కుగలదా, యసదాశయ మిది యటంచు నపు దనుకొంటిన్. 23

వ. అది యట్లుండ "నోయీ! నీలగ్గు వదయ నీ వెద్దాని నాశ్రయింతు వదియ నీబిడ్డలకుం
బ్రాపు గావింపు-మీశ్వరుండు దీనం బరితుష్టి నందుఁ - దొట్టివైద్యముపైఁ గాక
యౌషధమ్ముదెస నీకుఁ బ్రత్యయంబు కల్ల - వెజ్జు వేరువెల్లంకు లీఁగల వాఁడ కాని

ప్రాణదాత కానోపఁ–డుసు రొసంగువాఁ డొక పరమేశ్వరుండ – జీవసూత్ర మతనిచేత నుంట తెలియు – మవ్వానినామంబు జపింపు – మతని నాశ్రయింపు – మిది విశ్వసించి నీవలచినబాటం బాయకు – మనుతలంపులు సైత మప్పు డుప్పతిల్లె – నిట్లెడఁదం దికమకలు వడుచుఁ గ్రిందు మీఁ దగుచుండ నాదిత్యుం డపరశైలమ్ముచాటున కరిగె –నిరు లెల్లకడలం దాండవింపఁ దొడంగె – నయ్యవసరంబున **24**

ఆ. బాలు నంటి యంటి పన్నుంటి బగ్గున, మండిపోవుచుండె మాయవేఁకి
గుండె చెదరి చెమ్మగుడ్డను బిడ్డపై, గప్పఁ దలఁచుకొంటిఁ గట్టకడకు. **25**

క. లేచితి శీతలవారిం, దోఁచితి నొకవల్వ నాసతో మణికాయం
బాచరణమ స్తకాగ్రము,లోఁచితిఁ దడుపునకుఁ గంబళులు పైనిడితిన్. **26**

క. నెట్టెముగా గావంచా, చుట్టితి నార్ద్రమ్ము; నేమిచోద్యమొ పెన మె
ట్లట్టుల యయ్యె నొదల్ మఱి, పుట్టద కుట్టునికిఁ జెమరుబొ ట్టొకఁడేనిన్. **27**

క. ఏత దుపచారభరమున,నాతను వెంతేని దస్సినదియై బుడుతన్
మాతకు నగ్గంపతిఁచితిఁ, బూత శిశిరమారుతానుభూతి వలచితిన్. **28**

క. ఏగితిఁ జౌపాటీదెస, కాఁగెం బ్రజరాకపోక లపుడు గణగణన్
మ్రోఁగెం బదియవగంటయు, మూఁగిననాచింత కంతము న్గననైతిన్. **29**

ఆ. ఇంత మఱపులేక సంతతావృత్తిగాఁజలుపుచుంటి రామశబ్దజపము
జంకు దూల్చి ధర్మసంకటాధీను న, న్నాదరింపు దేవ!యనుచు నుంటి. **30**

క. గుండియలు వడఁకుచుండన్, గొండొకవడి కిల్లు సేరుకొంటిని మణిలాల్
తండిరి! నే నీ కప్పున, నుండంగాఁ జొల్లుడ్డు మూపిరి యనియెన్. **31**

క. ఏ నంతఁజూడఁ జెమ్మట, సోనలుగా వెడలుచుండె సుతుగాత్రమునన్
క్షీణింపఁ దొడఁగె సెగ భగ, వానునకున్ శిరమువంచి వందన మిడితిన్. **32**

క. నాతండ్రీ! మణిలాలూ! భీతికి నిఁకఁ దావులేదు బెదరకు మంటిన్
మూఁతలు తొలంచి బాలుని,దౌ తనువుం దుడిచి వానియందఁ బరుంటిన్. **33**

క. ఇద్దఱము నుద్దియొఱుఁగని,నిద్దురకుం జక్కితిమి మణిన్ తే పరయన్
రద్దయ్యె వెట్ట నాభయ,మద్దరికిం బఱచెఁ బుత్రుఁ డదరెన్ సొరిదిన్. **34**

గీ. ఇపుడు నాకన్నవారిలో నెన్నఁదగిన, దిటవుగలవాఁడు తేటమైఁ దిరుగువాఁడు
నిక్కమారుఁడపో దీని కేమిహేతు, వనెద జలవైద్యమో రాముకనికరంబొ. **35**

క. ఎవఁ డిదమిత్థం బనుచున్,వివరింపఁగలాఁడు నాదువిన్నపములకున్
నవనీత మైనప్రభుఁడే,భవికం బిది కూర్చెనంచుఁ బల్కెద నిపుడున్. **36**

# 23 మరల నాగ్రిక

క. నామణిలా లారోగ్య, స్థేమంబుల నిండెఁ దనివిసెందితి నైనన్
దేమ గల దౌట నగ్గిరి, గామునఁ గలగీము విడువఁగన్ మనసయ్యెన్. 1

క. శాంతాక్రూజునదొరకెం, గాంతమ్మగు భవన మచటఁ గాఁపురముంటిన్
జింతలను దీర్చె రాబడి, సంతస ముప్పొంగ బండి సాగందొడఁగెన్. 2

వ. ఏ నింతదనుక నెఱపాడిపట్టున కెక్కనైతి – గాని యచట నడుచుచర్చలకుం బోవుచునందు మాటలాడ జంకుచు నుద్దండులగు నానాభాయిప్రభృతుల వాదం బులకలరుచు నున్నత న్యాయరంగమునం గొనసాగునభియోగమ్ము లాలకించుచు నడుమనడుమ నివతాళించు కదలిగాలికిన్ సొగసి కన్నుమూయుచు నన్నుంబలెఁ దూఁగు బారిస్టరులం బ్రత్యగ్రుల నవలోకించి లజ్జ నుజ్జనసేయుచు నట్లు సుప్తి నందుటయు నొకయందమ యని యెఱుంగుచు నపుడపుడు ధర్మస్థానమునందలి గ్రంథాలయమును సేవించుచుఁ దత్రత్యులతోడి నెయ్యంబు వడచుచు నిఁకఁ బ్రధాన న్యాయస్థానమునందు రాణింపఁగల నని తలంచుచుండ. 3

క. అపుడప్పుడు గోపాలుఁడు, కృపమై నాబసకు వచ్చి హితములు వల్కున్
విపులాసేవకు మరగిన, సుపవిత్రుల నాత్మసఖులఁజూపుచునుండున్. 4

క. తనకార్యక్రమ మిది యని, వినుచున్ గమ్యంబు తెఱఁగు వివరించును స
జ్జనశేఖరుఁ డగ్గోకులు, మనయున్నతి నేను మాటిమాటికి మెత్తున్. 5

మం. కాలంబు నీలీల గడపుచునుండఁ, దత్పురంబున నిల్వఁదలపోయుచుండ
దైవమ్ము నన్నొండుదారికి లాగెఁజేరనున్నాఁ డిటు చేంబరులేను
మనయవస్థలు వానిమది కెక్కుభంగిఁ బ్రకటింపఁదగు రాయబారమ్మునడిపి;
తరలిరమ్మా! నీవు తడయక యంచు, నరుదెంచినది తంతి యాగ్రికానుండి
మఱవనైతిని దొంటిమాటచందమ్ము, పంపుఁడీ ధనమని బదులుపల్కితిని
వచ్చె వెచ్చమునకు వలసినవిత్త, మాలుబిడ్డల నింద యాఁగు డీ యంటి
నబ్ధిపైఁ బయనింప నాయిత్తపడితి. 6

క. పనిలేక తిరుగుకుఱ్ఱలు, మనభూములవార లన్యమహికిన్ జను టొ
ప్పని నమ్మి యపుడు నాతోఁ, గొనిపోయితి నలువురైదుగుర గోవాళ్ళన్. 7

వ. అందు మగనలాల్ గాంధియు నొక్కరుండు – గాంధీకుటుంబ మస్మదీయంబు పెంపులో నున్నయది–యందు స్వతంత్రజీవనమ్ము వలచువారికిం దోడగుట కే నభిలషించు వాఁడ – జమీందారులకొల్వున దించి మాయయ్య వీరినరయువాఁ – దయ్యాడిగంబు వీరి కేలా యని నా తలంపు – నానాఁడు నా లక్ష్యమ్ము లెట్లు తిరపడె నట్ల వీరి యాదర్శములు సైత

మభివృద్ధిపఱిచి వాని నస్మదీయ సిద్ధాంతములం బెనవెట్టఁజూచితి – నిప్పట్ల మగనలాలు
దెస నాపడినపాటు చాలవట్టు సార్థకం బాయె – నా యుదంతముల దేటపఱుచుట కిది
యదనుకాదని తలంతు – మఱియు. 8

గీ. అనుఁగుబిడ్డల వీడి యర్ధాంగి నెదసి,తిరపడినవృత్తి వదలి చింతితము గాని
పని కకస్మాత్తుగా నగ్గపడుట నరసి, యపుడు కొండొకవంతపా లైనవాఁడ. 9

ఆ. ఐన నిట్టిమనికి కలవాటుపడ్డ నే, నిజ్జగంబునందు నీశుఁ డొకఁడె
సత్య మితర మైనసర్వ మసత్యమ్ము, యని తలంతు క్షణిక మనియు నెంతు. 10

క. మనకంటె కెల్లదెసలం, గనఁబడునది నడచునదియుఁ గల్లయ యిది యి
ట్లని విశ్వసించుటయు జీ,వనసాఫల్యమ్ము వలచువారికి వలయున్. 11

ఆ. నిశ్చితమ్ముగాని నిఖిలజగమ్మునం,దే యఖండసత్య మిమిడియుండెఁ
దత్ప్రదర్శనము సదా సాగు సత్పురు,షార్థ మన్న దాని నరయు టొకఁడ. 12

మ. ఇఁక వత్తుం గథ కాప్రికాగొదవ లెట్లెట్లున్నవో కంట కే
నొకనాఁడైనను ముందుగాఁ జనుటకున్ యోగమ్ము లేదాయెఁ దత్
సకలోదంతము నేర్చికూర్చి రట నస్మన్మిత్రు లద్దానికూ
డికమై విన్నప మల్లి పాల్పడయ నుంటిన్ దౌత్యధర్మంబునన్. 13



# ఆ త్మ క థ

## చతుర్థ భాగము

## 1 వృథా శ్రమము

సీ. మాననీయుండైన మంత్రి చేంబర్లేను, కాంక్షదీఱంగ నాఫ్రికాధనంబు
పలుకోట్ల నుపదగాఁ బడసి యాంగ్లేయుల, బోయర్ల లోఁగొనఁ బూని వచ్చి
నతఁ డౌట భారతీయప్రజాప్రతినిధి, వర్గంబుఁ జూచి మీవాద మెల్ల
నుచితంబ మీకిట నున్న బాధలు పెక్కు లనియు నెఱుంగుదు నైననేమి

ఆ. స్వపరిపాలనమ్ము సాగించుకొను నిట్టి, వలసలందు మాకు నిలిచియున్న
పెత్తనం బదెంత పెద్దలకున్ విది, తంబ మీకు రాజ్యతంత్ర మెల్ల. 1

ఆ. ఓపినంతవట్టు మీపడుపాట్లు వా, రించుజతన మాచరింతుఁ గాని
మీర లిచటితెల్లవారిపొత్తున నిల్వఁ, దలఁతురేని మేలు వలతురేని. 2

గీ. వారితో సంధిచేసికోవలయు వారి, మైత్రి నార్జింపవలయు నన్మాట విస్మ
రింపఁ జనదని యతఁ డెచ్చరించినంత, నెల్లరకుఁ గాలుసేతులు చల్లపడియె. 3

ఉ. ఐనను మంత్రి మా నిదుర యంతయు దవ్వుగఁ జోపె నూతన
జ్ఞానము గంటి మేము తొలి సల్పినయత్న మదెల్ల రిత్తయై
కానకు నర్పితంబయిన కౌముదియౌట యెఱింగినార మ
ప్డే నఖిలమ్ము దెచ్చి వచియించితి దౌత్యములోనివారికిన్. 4

వ. కాని చేంబరులే నాడినప ల్కేల కల్లయగు – నతఁ డిచ్చకములకుం బోక యథార్థమ్ము వక్కాణించె – దుద్దెవరిదో గొడ్డువారి దనులోకోక్తి నవ్వెరవరి మృదులంబుగా వినిచె – నైనను మనచెంత దుడ్డుగఱ్ఱ కలదా? – దానిలేమి కేమి? బడియమోఁదులు సైరింపఁగల కాయంబేని మన కున్నదా? – యయ్యది యట్లుండె – నమ్మంత్రిపుంగవుఁ దపు డాఫ్రికాయం దనతికాలంబ నిలిచె – నాదేశంబు సువిశాలమహీఖండం బగుట గాలింబలెఁ బేరెమువాతె – నమ్మేటి నేటాలు వీటి ట్రాన్సువాలునం గాలుమోపినతతి మనవారి కడగండ్లనెల్ల నీతనికి నివేదించుచేంత నాతలపై నుండె – దీనిం దీర్పఁ బ్రిటోరియా కేగుటెట్లొ? యను సమస్య నన్ను నిలువవైచె – నదనిలో నే నచ్చోటు చేరుటకు వలయునుత్తరువు నార్జింప నందలి భారతీయుల కయితిగాదయ్యె – నదియును న్గాక 5

గీ. అచ్చట న్మున్ను విలయనాట్యంబు సలిపి, సలిపి బోయరుసమరంబు చన్నవెనుక
జీవకళలేక ట్రాన్సువాలసీమ బిక్కు, బిక్కు మనుచుండె లేమి పై కెక్కుచుండ. 6

ఆ. కుడువఁ గూడులేదు కొఱవడె వస్త్రంబు, వాడవాడ పాడువాఱియుండె
బేర మడఁగిపోయి బేహారి తాళమ్ము, నొక్కె విపణి కేమి నుడువనేర్తు. 7

క. పెఱసీమవలన వలసిన, సరకెల్లను జేరవలయు సాహులకొ ట్ల
త్తఱి విప్పవలయు నిప్పని, సరగన్ నెఱవేఱ దెన్నిశ్రమలం బడినన్. 8

ఆ. కూడు గుడ్డ నిండుకొనకముం దానేల, వదలి పఱచినట్టివారు తిరుగ
నడుగువెట్టరాద యటులౌట ననుమతి, వలయు నచటు త్రొక్కువానికెల్ల. 9

చ. అది తెలవానికిం గరతలామలకం బగుఁగాని మింటిపై
నొదవెడుపుష్ప మయ్యెడి నహో! మనవానికి; నెంతవేఁడినన్
గదలరు కన్నువిప్ప రధికారులు లంచము నిచ్చు వానికిన్
సదయులు వార లిప్పనికి సాగెను మూఁగె దళారిదయ్యముల్. 10

గీ. ఆఫ్రికాయుద్ధ మెసరేఁగినట్టివేళ, హిందువులు సింహళంబువా రెందఱేని
వచ్చిచేరిరి శస్త్రజీవనమునందుఁ, గదనకార్యాలయములందు గతులులేక. 11

క. వీ రమ్మహి నెలకొంటకుఁ, గోరికవడిరేని వీలుగూర్చుట యుచితా
చారం బని యచ్చటియధి, కారులకుం దోఁచె దురము కడచన్నంతన్. 12

వ. ఆంగ్లేయు లగువీ రెయ్యెడనేని వలసినన్ని నూతనోద్యోగమ్ములు సృష్టింపనేర్తు - రీదొరల చతురతంజేసి క్రొత్తశాఖయొండు పాటమరించె - నిందు నీగ్రోలకుం బ్రాచ్యులకును వెవ్వేఱు తెగలు వెలసె - నాసియాశాఖ కాసియావార యధికారులైరి - నేనాట్రాన్సువాలు మెట్టుటకు న్మొుందఁ యీనూతనకార్యక్రమం బారబ్ధమై యల్లల్లన తనయుచ్చుల నెల్లదెసలం బన్నుచుండె - నధికారులు మరలివచ్చు నెల్లవారికి ననుజ్ఞాపత్రమ్ముల నీవచ్చుఁ - గాని నల్లవారిపట్ల నది సవ్యంబుగా సాగదుగదా! - మఱియు 13

క. దొరలున్ దళారు లొకఁడై, నిఱుపేదలు నల్లవారి నెత్తురు పిండన్
దొరఁకొని రీదృశదుర్భర, పరిస్థితిన్ గమ్య మెట్లు పట్టఁగనేర్తున్. 14

సీ. మనసుకలంగి యిమ్మయిఁ దొట్రువడుచుంట, మత్పురామిత్రుండు మాననీయుఁ
డల దర్బనుపురమ్మునరయు రక్షకభట, శాఖాధిపతి యలెగ్జాండ రపుడు
తోడయ్యె నాదగుగోడెల్ల నతనికి, వినిపించి ట్రాన్సువాల్ మనికిపట్టు
గా నున్నవాఁడఁగదా! నేను నాకథ, యెల్ల మీరెఱిఁగినదే యటంచుఁ
ఆ. బలుక నతఁడు మాటపాటించి న న్నధి, కారికడకుఁ జేర్చి గారవించి
యప్పుడపుడ చీటి నిప్పింప మెచ్చి ప్రి, టోరియాకు బయలుదేఱినాఁడ. 15

గీ. అప్పురిం జేరుటకుముంద యవగతంబు, లాయె రాఁగల బెడఁదల చాయలెల్ల
నేదియెట్లున్న నిబ్బర మింతవిడక, కాలుమోపితిఁ ద్రాన్సువాల్‌గడ్డమీఁద. 16

గీ. భారతీయుల తీఱముల్ బట్టబయలు, సేయు విన్నప మొండు సృష్టించినాఁడ
సోదరులగౌరవంబు లచ్చోటఁ బెనుపఁ, ద్రోవ లన్నియుఁ బరికింపఁ దొడఁగినాఁడ. 17

వ. దర్బనులో నింతకుమున్ను రాయబారంబు వెడలినతఱి నధికారులు తొలుత శిష్టమండలిం గల వారిపేరు లడిగినయ ట్లెఱుకలేదు – కాని నేఁ డిచటఁ బ్రత్యగ్రశాఖ యొం దేర్పడియుంట నందలిపెద్ద లే నాతావుసేరకమున్న దౌత్యవర్గసభ్యుల నామంబు లడుగుటంజేసి నేనా దళంబునం బాల్గొనుటకు వా రియ్యకొన రని ప్రిటోరియాభారతీయు లితఃపూర్వంబ కనుపెట్టి – రగ్గాధ బాధాకరంబయ్యు నుల్లంబు నలరించునట్టి దగుట నాగామి ప్రకరణంబున దానికలరూపు తెల్లంబొనర్తు. 18



## 2 నిరంకుశత

క. ఈనూత్నశాఖవా రపు, డేనెట్టులు ట్రాన్సువాల్మహిం జేరితి నా
వైనం బింతయుఁ దెలియక, నానామార్గముల నరసినారలు నన్నున్. 1

క. వారికడ కప్పుడప్పుడు, చేరెదు హిందువులఁ బెద్దచేసిరి గాంధీ
బారిస్ట రిచటి కెట్టులు, తా రా వీలయ్యె నంచుఁ దఱచిరి వారిన్. 2

ఆ. వార లేమిసెప్ప వలఁతులు నారాక, చంద మిట్టి దిట్టిజాడ యంచుఁ
'బ్రాఁతచెలిమికల్మి నీతఁడు దర్బను, రాజపురుషు లద్దురామివడసి. 3

క. ఆనతిపత్రము లేకయ, యీనేలకు వచ్చియుండు నియ్యది నిక్కం
బైనఁ జెఱసాలయం దిడి, వీనిం దగురీతిఁ బరిభవింపఁగవచ్చున్.' 4

వ. ఇ ట్లయ్యధికారు లూహించి – రేదేశమందేని ఘోరసమరంబు సాగి యాఁగిన పదంపడి దొరతనమ్మువారు కొన్నాళ్ళదనుకఁ దీవ్రాధికారం బుపయోగించు టాచారంబ – యానాఁటి దక్షిణాఫ్రికాపరిస్థితియు నిందులకుం దగినట్టుల యుండెఁ–గాన నవ్విషయంబున శాంతిరక్ష కయ్యేలుబడివా రొండుచట్టమ్ము గావించి – రద్దాని ననుసరించి యనుజ్ఞలేకయ ట్రాన్సువాలునం దడుగిడువారు కారాగారశిక్షకుం బాత్రులగుట వలయు – నీశాసనంబు నూఁతగాఁగొని నన్నుబంధింపఁ దలంచిరి – కాని 'నీచీటిం జూపు'మని నన్ను నిలువరించు పాటి గుండె యధికారులకుం గఱవయ్యె – మఱియు 5

క. అంత న్నిలువక వారలు, తంతి న్నడిపించి రల్ల దర్బనుపురికిన్
జింత కడు స్గడిచిరి నా, చెంతం బత్రమ్ముకల్మి సెప్పుటకతనన్. 6

క. కసిదీఱక వా రప్పుడు వెస వెరవుంగనిరి తుష్టివెంచిరి చేంబర్
దెసకు ననుఁ జేరనీయక, బసయందే నిలుప సిద్ధపడి రవగుణులై. 7

గీ. రాయబారమ్ములో వచ్చునాయకుల స,మాఖ్య లేమని తొలుతొల్త నడిగి రచట
నెచటి కేగిన దర్శనం బిచ్చితీరు, తెగులు కలదుగదా నల్ల తెల్ల వాసి. 8

ఆ. అది సహింపరాని దైనను మనగడ్డ, నెట్టిముతికి పేరె నెట్టికపట
మెట్టియార్చ పీఁటపెట్టె నేటాలులో, నట్టిచెట్ట లేద యని వచింతు. 9

క. అం దున్నప్రజల సౌఖ్యా, నందమ్ములకొఱక దొరతనంబునఁ గలవా
రందఱు నలయుదు రడఁకువ, పొందిక మార్దవము పొంగి పొరలుచునుండన్. 10

క. అధికారుల సౌజన్యము, వృథగా దచ్చోటిజాతు లెల్లను దాదృ
గ్విధ మూఁది "యథారాజా, తథాప్రజా" యన్ననుడికిఁ దార్కాణయగున్. 11

వ. కాని ప్రజాప్రభుత్వతత్త్వం బెఱుంగని యాసియాబిడ్డ లీనూత్నశాఖం బాలింపవచ్చునపుడ తమనేల జీర్ణించియున్న నిరంకుశత్వాది దుర్గుణములసైతము తమ వెంటం గొనితెచ్చి - రింతియకాక యొకపాటి స్వపరిపాలనమున్న యాఫ్రికాకు వలసవచ్చి తోఁటదొడ్డులతోఁ దిరపడి యధికారుల కలుకని తెల్లవారికిన్ వీరికి నెయ్యంబు బిగిసె - నిప్పరిణామమ్ముకతన దిక్కులేనిభారతీయులు కత్తినాగళ్ల సందునఁ బడినట్లు గిజగిజలాడ వలసె - నీసంకటంపురుచి నేను గొంత యనుభవించితి - నెట్టులన 12

గీ. సింహళమువాఁడు మన కాందిశీకశాఖ, నేలు నున్నతోద్యోగి ట్రాన్స్వాలులోని
భారతీయులలోఁ బేరుపడ్డ సేటుఁ, దైయబుమొహమ్మదుం జూచి దర్పమదర. 13

గీ. గాంధియన నెవ్వఁ డాతఁ డిక్కడికి రాక, యేలయని పల్క నతఁడు మాహితుఁడు మాకు
వలయునుపదేశములు సేయువాఁడు మేము, పిలువ నిటువచ్చె నని బేరి పలుకరించె. 14

చ. అది విని గాంధి మీకు హితుఁడా? కదులెస్స యటైన మేము మీ
కొదవలుదీర్చి భద్ర మొదఁగూర్చెడి చేఁతకుఁ గాక యింక నె
య్యది పొనరింప నిందుఁగల మాయన కిచ్చుటికీడు మేలు నె
ట్లు దెలియు నంచు నాతఁడనుడున్ వివరించె మొహమ్మ దివ్విధిన్. 15

క. మీనుడివినయది నిక్కము, మానెంజలి వోకకై శ్రమంపడ మీరి
చ్చో నుంటయు నేనెఱుఁగుదుఁ, గానీ! మాయింటివాఁడుగద గాంధి యనన్. 16

క. అతఁడు మాపలు కెఱుఁగును, మాతలఁపు లెఱుంగు మాసమస్య లెఱుంగున్
మాతో నెందకునెందును, సీతువునకు వడఁకు నేమిసెప్పిన సైఁచున్. 17

గీ. మీరు మాజాతివార మామేలు వలచు, వార గఱువతనం బున్నవార యెట్టి
వారలైనను గొస కధికార మున్న, వారుగద గాంధికి నీకు వాసిలేదె? 18

గీ. తైయ బిట్లాడ నుద్యోగి తలఁగదల్చి, మొగముచిట్లించి గాంధి నాగ్రోల కిపుడ
చేరవలయును వానిఁ దీసికొనిరమ్ము, పొమ్మనుచు నాజ్ఞయిచ్చె మొహమ్మదునకు. 19

గీ. అతఁడు నాపేర నొకచీటినైన వ్రాసి, పంపఁదగదా యటంచు నే బాధపడితి
నెంతయధికార ముండుఁగా కింతగడుసుఁ, దనము సెల్లునె యెవ్వఁ డీదారిమెచ్చు. 20

గీ. సేటుమున్నగువారితోపాటు వెడలి, నాఁడ నధికారిదండ కానాఁడు మాకు
నుచితపీఠంబు లచ్చోట నుండునెట్లు? దేవురించుచు నిలఁబడితీరవలయు. 21

క. నాదెసకుం గ్రుడ్లుఱుముచు, నాదొర యిట కేలచేరి తనియెను మావా
రాదృతిఁ బిల్వఁగ వచ్చితి, సోదరులకు హితముఁదెల్పఁ జూచితి నంటిన్. 22

చ. ఇదివిని యాతఁ డిట్టులనియెన్ గనవో తగ వింతవట్టు నీ
చదు వెటకేగె నిచ్చటిప్రజాతతిఁ జేరవునీవు నేఁడు నీ
కొదవినయాజ్ఞ చెల్ల దదియుం బొరపాటునఁ బుట్టె నిమ్మహిం
బద మిడఁగాదు నీవు మును వచ్చినమార్గముపట్టి పోవలెన్. 23

క. ఏలాగ్రశమ? చేంబరుఁ గనఁ, జాలవు నీ విచటినల్లజాతి విపత్తుల్
తూలించి సక్రమమ్ముగఁ, బాలింపన మేము నిల్పఁబడినార మిటన్. 24

క. మంచిది నీవిఁకఁ జనఁదగు, నంచున్ సెలవిచ్చె నాకు నపు డే నెదియున్
వించుటకు వీ లొసంగఁడ, యెంచెడివా రెవ్వ రతనియెగ్గను లగ్గన్. 25

క. పదపడి నాతోవచ్చిన, పెదపిన్నల నిలువరించి బెదరించి వెసన్
వదలింపుఁడు గాంధి నతం, డొదుఁగంజన దిచట నని తదుద్యోగి యనెన్. 26

గీ. అపుడు మన్మిత్రగణమా యహంతఁజూచి, పొంగునుద్రేకమును దిగమ్రింగిమ్రింగి
విన్నవోయినమొగముతో వెడలి రిండ్ల, కేర్పడెం గ్రొత్తచిక్కిది యెఱుఁగకుండ. 27



# 3 చేఁదు మ్రింగుట

గీ. ఈయవజ్ఞ మదాత్మకు నెల్ల లేని, వేదనం గూర్చెఁగాని జీవితమునందు
నీదృశంబులు పెక్కు సహింపఁగంటిఁ, గాన నివి నాకు నలవాటులోని వాయె. 1

కం. అటులగుటన్ నేనీ దు,ర్ఘటనం జీరికినిగొనక కరణీయముపైఁ
బటుదీక్షఁబూని నిల్చితిఁ, బ్రిటోరియానగర మిత్రబృందమునడుమన్. 2

వ. అంత నయ్యధికారి 'యీదౌత్యమున గాంధి రాఁదగఁ - దతండు దర్బనునంద చేంబరు
లేను గనియుంట నిట్లు నిర్ణయించుటవలసె' నని మా కొండులేఖం బంపె - నాకమ్మ
నావారి కలుకపుట్టించె - నిట్టితతి రాయబారంబ పరిత్యాజ్యంబని మిత్రులుతలంచి -
రయ్యవసరంబునం దేను వారింగని 3

గీ. రాయబారంబు వదలుకోరాదు మీర, లిపుడు చేంబరుసన్నిధి కేగకున్న
నతఁడు మీకిట సేగిలేదనియు తలంచుఁ, జూడుఁ డియ్యది మనపాలికీడు గాదొ. 4

క. అతనికడ నిపుడు వాచా, ప్రతాపముం జూపఁదగిన పనిలేద పరి
స్థితు లిట్టివిట్టివని వ్రా,సితి మిది యెవ్వాఁడు చదువఁజెల్లదు సెపుఁడీ! 5

ఆ. ఏన చదివినంత నేమియొుఅగు న య్య, మాత్యమౌళి దీనిమంచిచెడ్డ
లెంచి చర్చసేయఁ డిటులగుటన్ దిగ, మ్రింగుటొప్పు నేంటిభంగపాటు. 6

క. ఈకరణిన్ నుదువుతతిన్, మాకుం బ్రతినిధులు మీరు మాకర్జమునన్
మీకొదవిన యవమానము, తాఁకదొకో మమ్మటంచుఁ దైయబు వలికెన్. 7

గీ. ఔను! మీమాట నిక్కంబ కాని మనము, బన్నమున కిట్టిదానికి బాధపడక
యిదియు మనమంచికే వచ్చినదియటంచు, నరసిదిగమ్రింగు టురవని యంటినేను. 8

ఉ. అన్న! రుచింపదయ్యె భవ దాశయ మిత్తతి నెంతవద్దఁ గా
నున్నది కాకమాన దిపు దున్నవి చాలక క్రొత్తవ్రేఁగు నీ
బన్నము నేలమస్తకముపై నిడుకోవలయుం బరిస్థితుల్
కన్నులముందె వింగడము గా నగుచుండె మరల్పరానివై. 9

క. కలపెత్తన మెది మనకుం, దొలఁగినదొరతనము నెద్దీ దుర్విధి యిచ్చో
నిలిపెన్ మనల నటంచున్, గలంగి తైయబు వచించెఁ గళవళపడుచున్. 10

గీ. అతని యావేశమున కేను హర్షపడితిఁ, గాని యీమంటచే లగ్గు కలుగనేర
దని యెఱుంగుదుఁ బ్రజలధోరణియునాకుఁ, దెలియుఁ గావునవారి శాంతింపఁదంటి. 11

సీ. మనజాతివాఁడు కమ్మనివాఁడు బారిస్ట,రులయందుఁ బేరుపేరు గలవాఁడు
కలఁడుగదా! 'జార్జిగాడ్రేఫే'సమాఖ్యుఁ డీ, కృతికి నామాఱుగా నతని నిల్పి
దౌత్యంబు తరలింపఁదగు మీర లని విన్న, వించితి నాపల్కు వెంట నడిచి
కని రయ్యమాత్యశేఖరుని మిత్రు లతండు, నాప్రసంగము దెచ్చి నాఁడు నేఁడు
గీ. నొకనితోడన చర్చసేఁతకుఁ గడంగు, కంటె నవ్వునిజేర్చి యీగాము లరయు
టొప్పదా యిపు డంచు నానొప్పి నుపశ, మిల్లఁ జేయుటకుం జూచె మెల్లమెల్ల. 12

గీ. ఇటుల మాకర్జము ల్మగియుటకు మాఱు, వేయిరెట్లయ్యె వెండియు విఘ్నపతి స
మర్చకుం బూనవలసె నిరంతరాప, జయములకు నోడి చెలులు వేసారి రపుడు. 13

క. నీనుడి నమ్మికదా! క, య్యానకు దిగి నొవ్వుగంటి మౌరా! యిది య
ద్దానికిఁ బ్రతిఫలమా యని, నానెయ్యురు కొంద అపుడు నన్నదలింపన్. 14

క. ఏ నించుకయుం దూలక, నానెఱపినచేఁత కొక్కనాఁడును వగవన్
ఆనాఁ దనిలో నుఱుకుట, నా నది కర్తవ్యపాలనం బని తలఁతున్. 15

క. తొడఁగినయంతన లాభం, బొడఁగూడకపోవుఁ గాక యుత్తమకార్యం
బుడుగక సడిసన్నఫలం, బిడునను విశ్వాసమున్న దీమానిసికిన్. 16

ఆ. ఐనదేమొ యయ్యె నద్దానిరగడలు, మఱచిపోద మింక మనము చేయఁ
దగినదాని నరయుదము శుభంబిది యన, నెయ్యు రీపథంబు నియ్యకొనిరి. 17

వ. అయ్యవసరంబునం దేను వెండియు వారి నిట్లంటి. 18

క. వినుఁడీ మిత్రులు! మీరలు, ననుఁ బిల్చినచేఁత ముగిసినది యనఁదగు నై
నను నిల్వుమింద యని న, న్ననిశము నెచరించు నంతరాత్మ యిదేమో. 19

గీ. పొమ్ము నీవిఁక నింటికిఁబొ మ్మటంచు, నాకు వీడ్కోలొసంగినన్ ట్రాన్సువాలు
గడ్డపైనున్న యీకాలు కదలనీయ, నిచ్చగల్లదు నేటాలుసొచ్చుటకును. 20

ఆ. చేతనైనసేవ చేయుదు నిట నొక్క, యేఁటిదనుకఁ దల్లినాఁటి కేని
వెడలుకోర్కిలేదు కడపెద జీవితం, బిచట ధర్మవాదివృత్తి నూఁది. 21

క. ఏనాఁటికేని మార్చెద, నీనూతనశాఖవారి హృదయము వీరి
ట్లే నిక్కుచు నెదు రింతయుఁ, గానక వర్తింప మనకుఁ గాఱియహెచ్చున్. 22

క. దోఁపిడిపా లౌదుము మన, మీపుడమిం బాయవలయు నేడ్పులతోడన్
తేపటి కిచ్చటిదుస్థితి, యీపగిది న్నిల్వనేర దెంతయు బెడియున్. 23

గీ. క్రొత్తయధికారియును మంత్రిసత్తముండు, రాయబారమునెడ నన్ను రట్టువఱిచి
రిది యసహ్యము కాని మీరిచటఁ గుదుచు, కుత్సలో దీనికిం గలకో రదెంత. 24

క. ఈ గడ్డలోనఁ గుక్కల, లాగున మనవారు తోఁకలంద్రిప్పుట యే
యాగడములేని సైఁచుట, యేగతి సైరింతు మెవ్వఁ డిదిగని మెచ్చున్. 25

గీ. అస్మదీయాశయమ్ము నిట్లపుదు ప్రజల, ముందువెట్టితి హితులతో ముచ్చటించి
తుదకు జోహాన్సుబర్గులోఁ గుదిరి బల్ల, కట్టఁబూనితిఁ గోర్కులు నిట్టవొడువ. 26

గీ. ట్రాన్సువాల్సీమ నాకుఁ బట్టా లభించు,టంత సుకరంబుకాద! యేమగునో యన్న
శంకమై నుండ భగవత్ప్రసాదబలము, కలిమి నదిచిక్కెఁ గోర్టులోఁ గాలినిడితి. 27



# 4 త్యాగవృద్ధి

క. అల ట్రాన్సువాలునేలం, గల మనసోదరులపేర్మి కడుకొనుపొంటెన్
జలిపినకృషి వర్ణించుట, నిలిపెద నాబ్రదుకు వక్కణించెద మొదటన్. 1

ఆ. ఇంతదనుక విత్త మింతయో యంతయో, కూర్పవలయు నన్నకోర్కి నాదు
మదిని బాయదయ్యె మత్పరమార్థ సం, సక్తి నంటి స్వార్థరక్తి వొలిచె. 2

గీ. బంబయిని ధర్మవాదినై బ్రదుకువేళ, నన్నుఁ జూడంగ వచ్చు ననారతంబు
నమెరికాఖండవాసి విద్యావిభాసి, మరగె నవ్వీట నతఁడు బీమావణిజ్య. 3

క. కడుఁబ్రన్ననివాఁ డాతని, నుడువులు క్రొందేనెలూరునూతు లహో! ప్రాఁ
బడిన చెలింబలె నతఁ డి, వ్వడువున వాక్రుచ్చె భావివైభవ మొదవన్. 4

క. మీవంటివార లెల్లరు, మావసుధం దమకుఁదామ మానక బీమా
గావింతురు జీవితమును, భావింతురు దీనిఁ బరమభాగ్యం బనుచున్. 5

క. ఆగామికాలమున మీ, రేగొడవల కేదిగుళ్ళ కే నోడక స
ద్యోగమ్మున రాణించుట, బాగుగదా యంచు నేను బలుమఱు వలతున్. 6

ఆ. నిన్న నున్నవాఁడు నేఁడులేఁ డీబ్రదు, కేమిశాశ్వతం బిసీ! పయోజ
దళగతాంబుకణము తద్జ్ఞులుమీరు మీ, చెంత దీని నింతసేయఁ దగదు. 7

ఆ. అస్మదీయ దేశమందలివా రిట్టి, పని యవశ్యకృత్యమని తలంతు
రిందుఁ బాలువడయుఁడీ యని మి మ్మేను, బట్టుపట్టి లోభపెట్టఁ దగదె. 8

క. నావుడు నామది నెన్నో భావంబులు రేఁగె నన్నుఁ బలుతావుల నీ
త్రోవకుఁద్రిప్పం దమతమ, చేవలు చూపించి రిట్టిజీవికవారల్. 9

గీ. ఎంతపెనఁగిన వారికే నింతవట్టు, పట్టువడక వచ్చితిఁ జోటుపెట్టనైతి
నిప్పనికి నియ్యకొంట సర్వేశుపట్ల, నమ్మకములేమి, పందతనం బటంచు. 10

ఆ. ఇట్టివాఁడనయ్యు నీమాఱు వీనికి, లొంగిపోయి పోయి లోభపడితి
నతఁడు పంద్లుపులియున ట్లాడువేళ నా, యాస లేచియేచి యవధిదప్పె. 11

క. నాకంటిమ్రోల నయ్యెడ, నాకుఱ్ఱలపొదవు లవి కనంబడెఁ జింతా
వ్యాకులితయైన కస్తురి, యాకృతియుం దోఁచెఁ దలఁపు లగ్గలమయ్యెన్. 12

ఆ. తాలిబొట్టుతక్కఁ దక్కిన యిల్లాలి, తొడవులెల్ల మున్న తుడిచినాఁడ
వోయి! రేపు నీదుకాయ మెట్లుండునో, యెవరుసైఁతు రప్పు డింటివ్రేఁగు. 13

చ. జనకునివోలె నిన్నుఁ బలు చందములం బరికింపనోర్చి నీ
మనుగడలోనివెల్తి యణు మాత్రయు సైఁపని యన్ననెత్తిపైఁ
బెనుగిరివోలె వ్రాలుఁగద పేదయ కాని యతండు కల్మిలో
మునిఁగినవాఁడుకాఁ దతని ముంచిన నీ కపకీర్తిపుట్టదో. 14

వ. ఇట్లు న న్నంతర్వాణి ప్రబోధించుటంజేసి నా బ్రదుకుపై దశసహస్రరూప్యంబులకు బీమా యొనర్చితిఁ – గాని నేఁ దాఫ్రికాయందు నాజీవితాదర్శపరిణామమ్ము వొడముకతన నా భావనలుం దాఱుమారయ్యెఁ – డ్రాన్సువాలునం బొసఁగిన యీ్రకొత్తకడగండ్లతతి నా నిర్వహించు నెల్లచేఁతకున్ భగవాను సాక్షిగా నిల్పుకొంటి – నీగద్దయం దెన్నినా శ్యేను మసలందగు నయ్యది యింతవట్టు నిర్ణీతంబు కాదాయెఁ – గాని 15

క. భారతభూమికి నేనిఁకఁ, జేరుట దుశ్శక మటంచుఁ జిత్తమువల్కెన్
నారీ నందనులను నా, చేరువకుం దెచ్చుకొంట శివ మనుకొంటిన్. 16

ఆ. ఆలుబిడ్డ లెంతకాలమ్ము దవ్వుల, నుంట కోర్తు రనుచు టుచితమోటు?
తప్పు కిటకు వారి రప్పించి మనుచుట, పరమధర్మమన్న భావ మొదవె. 17

ఆ. ఈవిచార మెచ్చి హెచ్చి నాఁ దమెరికా, వణిజువాణి కేల వలపుగొంటి
బీతురేఁగి యేల బీమాకు నీకొంటి, నని దురంతలజ్జ కగ్గపడితి. 18

క. నాయన్న జనకతుల్యుం, డాయెనయే నతఁ డనాథయగు మఱఁదలికిం
బోయఁడె చేరెఁడు గంజిని, బాయక దయచేయఁడేమి బారెఁడుగుడ్డన్. 19

గీ. అనియునెంచితిఁ గాని నీవెలఁదికంటెఁ, దొలుత నీవ పోయెదవని తలఁచు టెట్లు
కడకు నెల్లరఁ బాలించు నొడయఁ డీశ్వరుండ! నీవును నీయగ్రజుండుఁ గారు. 20

సీ. బీమాయొనర్చి నీబిడ్డల కాలికిఁ, దెచ్చిపెట్టితి పరాధీనవృత్తి
మనలేరె స్వచ్ఛందమార్గమ్ము ద్రొక్కి నీ, వారు; జగాన నేవంకఁగన్న
నంకెలకందక యగపడునిర్భాగ్యు, లెట్లుజీవించెద రీవుసైత
మందొక్కరుండవ యని యేలతలపోయఁ, జనదోయి! యన్న విచారధార
ఆ. యెదఁదఁ బరువులెత్తె నింతియకాని య, ద్దాని ననుసరించి తడయ కెట్టి
పనియుఁ జల్పలేద భావస్థిరత్వ మే, ర్పడక క్రిందమీఁదఁ బడుచునుంటి. 21

వ. ఆఫ్రికాచేరినపదంపడియు న బ్బీమాసొ మ్మేకగడువుదానిం గట్టిన ట్లైఱుకయుండె – వెండియు నాఁటి నాతలంపులకు బాహిరంబగు ననుభూతియుం గొంత సాయంపడె – నెట్లన నాఫ్రికా కేనింతకుము న్నరిగినతతిఁ గ్రైస్తవవాతావరణమ్మునం గలసిమెలసి యుంటి – నద్దానిఫల స్వరూపంబుగా ధర్మమునెడ నా జాగర్య బలిసె – నీసారి దివ్యజ్ఞానసమాజమ్ముగాలి నాకుం దగిలె – నందుఁ గృషిసేయు‘రీ’ చనునతండు జోహాన్సుబర్గునం గల తనసమితితో నాకు మైత్రివాటిల్లఁజేసెఁ – గాని 22

క. ఆమతసిద్ధాంతములకు, నామార్గంబులకుఁ బొత్తు నలికం బగుటన్
సామాజికత్వ మందక, ప్రేమించితి నందువెలయు పెద్దలనెల్లన్. 23

గీ. దినదినమ్మును వీరితో నెనసి ధర్మ, చర్చసల్పితిఁ దత్సమాజమ్ములోన
గ్రంథపఠనమ్ము సాగెడుకాలమం దు,పన్యసించితి నపుడప్డు పాడినెంచి. 24

క. ఈవర్గమ్మున సోదర, భావము నార్జించుకొంట పరమాదృతిమై
నావలపుఁ బెంచుకొంటయు, జీవనసూత్రమ్ములై ప్రసిద్ధికిఁ జాలెన్. 25

గీ. ఏతదాదర్శములకు నం దెవ్వఁడేని, వింగడమ్ముగ నడుచుచో విడువకయ వి
మర్శగావింతు నద్దానిమహిమ మస్మ, దాంతరనిరీక్షణంబున కాది యయ్యె. 26



## 5 నిరీక్షణ పరిణామము

క. పదియేండ్ల నాఁడు నా కిటఁ, గుదిరెం గ్రైస్తవులపొత్తు; గురుసన్నిధిలోఁ
జదివెడి విద్యార్థింబలె, నెదియున్ విదళింపలేక యే నపుడుంటిన్. 1

గీ. నాఁడు బైబిలుగొప్పతనమ్ముఁ జాటి, నన్నుఁ గ్రైస్తవుఁ గావింప నెన్నియేని
శ్రమలకోర్చిరి వారు; తత్సదుపదేశ, విధి తటస్థుఁడనై నేను వినుచునుంటి. 2

గీ. అపుడు నాశేముషికి నందినంతవట్టు, తఱచిచూచితి హిందూమతమ్ము తెలుఁగు
నితరసిద్ధాంతములుసైత మించుకంత, చదువఁగంటిని ధర్మజిజ్ఞాస వెరిఁగి. 3

క. ఈనాఁ డిచ్చటిదివ్య, జ్ఞానసమాజమ్ములోని సంగడికాండ్రె
ట్లైనన్ శ్రమించి ననుఁ దమ, వానిం బొనరించుకొంట వలచిరి మిపులన్. 4

క. నామైత్రి వదచి హిందూ, సామాజికమైన ధర్మసంస్కృతిఁ గానన్
గామించిరి తచ్ఛాయలు, తా మాదృతిసేయు మతపథమ్ముల నుంటన్. 5

ఆ. అమరభాషఁ దనకు నబ్బినపరిచితి, కట్టలంతి యనుట గట్టి దౌట
మనమతమ్ముఁ దెల్పు మునుపటివ్రాఁతలు చదువఁ జాలనైతి సంస్కృతమున. 6

ఆ. లాఁతిబాసలందు గీతాదికంబులు, వెలసెఁ గాని వానివలన నాయొ
నర్చినట్టికృషియు నలికంబ యాగుట్టు, చెలిమికాండ్ర కెఱుకచేసినాఁడ. 7

సీ. సంస్కారములఁ బునర్జననంబుల న్గడు, విశ్వసింతురు గాన వీసమేని
గలుగదా లగ్గు నాకతమున నని వారు, మది నాసచేసిరి; వ్రాఁకులేని
పుడమి నేరండమే సడిసన్నతరు వన్న, సూక్తి యున్నదికదా; ముక్తసంగుఁ
డల వివేకానందుఁ డాత్మవిద్యారాశి, రచియించి యొసఁగిన రాజయోగ

గీ. మపుడు కొందఱు చెలులతో నరసి చదివి, నాఁడ మణిలాల్ద్వివేది యొనర్చినట్టి
గ్రంథమును రాజయోగమ్ముఁ గతిపయాప్త, సోదరులతోడఁ ద్రచ్చితి నాదరమున. 8

గీ. ఒకనిఁగూడి పతంజలి యోగశాస్త్ర,మును జరించితిఁ బెక్కంద్రనెనసి గీత
చదువసాగితి జిజ్ఞాసుసమితి యొక్కఁ, దచట నెలకొల్పితిం దత్త్వరుచిని మరగి. 9

క. ఆ మండలి నధ్యయనము, నేమమ్మున సాగె నాకు నిరతము భగవ
చ్ఛ్రీముఖనిర్గతవాణీ, ధామముపై భక్తిగలదు తద్గీతపయిన్. 10

ఆ. ఇపుడు తద్రహస్య మెఱుఁగుట కర్తవ్య, మనితలంచి యితరు లనువదించి
వెలువరించు దానివెలుఁగున మూలార్థ, వేది నగుట కంగవించినాఁడ. 11

గీ. వెండియును దానిశ్లోకమ్ము లొందు రెండు, దినదినమ్మును వల్లింప దీక్షగొంటి
దంతధావనమొనరించుతఱిని దాన, మాడునెడఁ గార్యమిది పూర్తియగుచునుండె. 12

సీ. తెలవానికైవడి నిలఁబడి పలుదోము, నలవాటు కలదు నా కది ముగింపఁ
బదునైదునిముసముల్ పట్టు మజ్జనవిధి, సలుప నిర్వదినిమేషములు వలయు
నటులౌటఁ బద్యంబు లలఁతిపత్రంబుపైఁ, జక్కలిఖించి నాసముఖమందుఁ
గల భిత్తి కదికించి కదఁకమై వల్లింపఁ, దొడఁగితి రదనము ల్కడుగువేళ
ఆ. నగుర! నీరాట యెల్లయు ముగియుసరికి, హత్తుకొనుచుండె శ్లోకమ్ము లాత్మలోన
నపుడు కంఠస్థమయ్యె నధ్యాయములు త, దీయముల్ పదుమూఁడు నాతృప్తివెరుఁగ. 13

ఆ. అవలఁ గార్యభార మగ్గలమాయె స, త్యాగ్రహమ్ము పుట్టె నానిసుంగు
నవఁత లేక నిత్యనవతమై వర్ధిల్లు, జాడలెల్ల నేన చూడవలసె. 14

ఆ. కొలఁదిలేనివ్రేఁగు తలనిడికొంటి నా, కాలమెల్లఁ జిఱుతలాలనమ్ము
పాలనమ్ము దిద్దుపనులక చెల్లె న, గ్గీతమిగులుఁ జదువుగీఁత తొలఁగె. 15

క. ఉపనిష దవతంసము నా, విపులన్ నుతిగన్నగీత విడువక చెలికాం
ద్రు పఠించిరి వారపు దే, యుపలబ్ధిం గనిరి వారె యోగ్యులు వలుకన్. 16

క. నాయనుభూతి వచించెద, నాయది నానదకదిద్దు నద్దము నన్నుం
బాయని ధార్మికకోశం, బాయెఁ దదాచార్యకంబు నభినందింతున్. 17

ఆ. అర్థ మెఱుకవదని యాంగ్లోక్తికిం గోశ, మెట్లు విప్పఁజూతు నట్ల నడక
చక్కియందు నెట్టి చి క్కెదిరించినఁ, దెఱతు గీత నపుడ తీర్పు గందు. 18

వ. ఈయుపనిషత్తునం గల ధర్మవాచివాచావర్గంబున 19

ఆ. నన్ను నిలువవైచినవి యపరిగ్రహం, బన్న పల్కు సమత యన్నమాట
పదయుటెట్లు తుల్యభావ మద్దానిఁ బా, లించుటెట్టు లని చలింపవలసె. 20

క. దొరలేని గర్వమున నొక, దొర మనకు నవజ్ఞసేయ దొరఁకొను ధర్మం
బరయక లంచముదిను నొ, క్కరుఁ డింకనొకండు గిల్లి కయ్యము రేఁపున్. 21

ఆ. ఇట్టివార కాక యెందఱోకలరు ప, రార్ధరతులు సజ్జనాగ్రసరులు
వీరు వారు నొక్కతీరువారా? రెండు, దెసల నెట్లు సమత పొసఁగనేర్చు. 22

క. ఇఁక నపరిగ్రహధర్మము, సుకరమె యీతనువు దారసుతముఖ్యుల పొం
దికయుఁ బరిగ్రహ మను టొ, ప్ప కదా! వెరవేమి దీనిఁ బాటించుటకున్. 23

క. అంతర్వాణిశిరోమణి, లెంతయు శోధించి పంచియిచ్చిన తేజ
స్సంతతి గ్రంథావళి నా, సొంతమె? యీకల్మినెల్లఁ జూఁడవలయునా? 24

ఆ. ఆశ్రయింప వలయునా నాకుఁ గల దెల్ల, విడిచి వేల్పు? ననుచు వేయివగలఁ
దీవ్రచింత చేయఁ దివిరితి నపుడ నా, యంతరాత్మ యిట్టు లానతిచ్చె. 25

క. ఔ నోయీ! నియమం బిది, పూనిన ధర్మంబులెన్ని పొనరించినఁ దాఁ
గానంజాలఁడ యీశ్వరు, మానవుఁ డీయిల్లు ముల్లె మానకయున్నన్. 26

వ. ఈవిచారమ్మతతి నాంగ్లేయన్యాయశాస్త్రంబు నాకుపకరించె-"స్నెల్" రచించిన ధర్మశాస్త్రంబు
నందలి సిద్ధాంతచర్చలు నాస్మృతికిం దాఁకె - ధర్మకర్తృశబ్దార్థ మీగీతాసేవనంబునఁ
దద్దయు నెఱుంగఁగంటి - నవ్వల న్యాయశాస్త్రంబుదెస నాతగులమ్ము పెరిఁగె - నందుం
బాడిలోఁతులోఁతు లుంట తెల్లంబాయె - ధర్మకర్తలగువా రసంఖ్యాతవిత్తము దమ యేలు
బడి నుంతు - రంతియ కాని. 27

ఉ. అందలి గ్రుద్దిగవ్వపయి నైనను వారికిఁ బెత్తనమ్ములే
దెందును ముక్తిగోరునరుఁ డిట్టుల యుంట తగున్ వివేక మీ
చందముదాని నేఁ దెలియఁ జాలితి గీతలకొల్వు నేర్చి నా
దెందము పందెనంచుఁ బ్రకటించెద దానికి నంజలించెదన్. 28

క. సమభావం బపరిగ్రహ, మమరుట కెద మార్పునందు టక్కుఱయని దీ
పమువోలెఁ దోఁచె సంశయ, తమస్సు పొదవడఁగె నాత్మ తనిసను టాయెన్. 29

గీ. అంత నిచ్చినసొమ్మున కింత వచ్చుఁ, గాక రాకుండుఁగాక శంకలకు దిగక
మాపుసేయుము నాదుబీమా నటంచుఁ, బనిచినాఁడ రేవాశంకరునకు లేఖ. 30

గీ. నన్నుఁ బుట్టించినట్టుల నావెలంది, నాదుబిడ్డల సృష్టించినాఁడు వేల్పు
నన్ను సాఁకినగతి జగన్నాథుఁ డతఁడు, సాఁకు నవ్వారి నుద్యద్దయాకరుండు. 31

క. నారుం బోసినయాతఁడు, నీ రేలాపోయకుండు నెచ్చెలి! యనుచుం
బూరితిచేసితిఁ గమ్మను, గూరిచితి న్మగుడ నన్నుకొఱ కిటు లేకన్. 32

క. అన్నా! పలమో తులమో, నిన్నటివఱ కేగడించి నిల్పినసిరి నీ
సన్నిధిఁ బెట్టితి నిఁక నా, తెన్నునఁ గలకోర్కివిడుపు తీఱదు నీకున్. 33

ఇంద్రవజ్ర

ఏ నింక నార్జించున దింత యున్నన్
దానిం బ్రజాసేవక ధారవోయన్
నానిర్ణయం బయ్యె వినమ్రభావ
శ్రీనింద నీపల్కులు సెప్పుకొంటిన్. 34

వసంతతిలకము

నాయన్న కీతలఁపునం గలమేలిచందం
బాయుత్తరంబు గనినంతన తోఁపదయ్యెన్
ద్రోయంగరాని రుషఁ దోఁగి కటూక్తి చిందన్
వ్రాయంగ నోర్చె నిటువంటిది లేఖ నాకున్. 35

ఆ. ఎంతవాఁడ వైతి వీనాఁ డహో! వెఱ్ఱి, తలలువైచె నీదుతెలివి యెల్ల
నప్పకంటె నీవు గొప్పవాఁడవె కన్ను, దెఱచిచూడు మతనితెరు వొకింత. 36

ఆ. అన్న మిడఁడె తండ్రి యాలుబిడ్డలకుఁ దత్, భద్ర మాసచేసి పాటువడఁడె
జగతిఁ బేరుగన్న జనకునియట్ల సం, సారభరము నీవు సైఁపవలదె. 37

క. ఈసరణి నేదినేదియొ, వ్రాసె మదగ్రజుఁడు దానివైఖరి కే నా
యాసమునందక వినయపు, వాసన లెసలార నిట్లువ్రాసితి మరలన్. 38

క. ఓయన్న! చిత్తగింపుము, నాయన వర్తించినట్ల నడుచుచు ధర్మం
బేయెడ నుల్లంఘింపక, సేయన్ దొరఁకొంటి లోకసేవావ్రతమున్. 39

ఆ. అల కుటుంబమన్న పలుకున కర్థమ్ము, దీయుతతి విశాలదృష్టి వలయు
నపుడు నాయొనర్చినట్టి కర్జంబున, మంచిచెడ్డ లెల్ల మదికిఁ దెలియు. 40

గీ. ఇట్లు ప్రత్యుత్తరము నంప నితనిచూపు, మాఱదని యన్న నామీఁదిమమతఁద్రోసి
కమ్మ వ్రాయుటయు న్మానెఁ గాని మదిక, లంగి దుఃఖతరంగముల్ పొంగె నాకు. 41

ఆ. ఎట్టులైననేమి యే నాదరించిన, ధర్మ ముజ్జగించి దారిదప్పి
యుందునేని నాఁటికుందునకున్ వేయి, మడుఁగులైన కుందుఁ గుడిచియుందు. 42

క. ఇది హేతువుగా నగ్రజుఁ, డొదవించిన యల్పదుఃఖ మోర్చితి నతనిన్
మొదలిటిచందపు భక్తిన, మది నిల్పితి వానిపెంపు మఱవక యుంటిన్. 43

క. అతనికి నాదెస నర్మిలి, యతివేలం బగుట నిట్టి యలమట వొడమెన్
సత మతనిమదికి నాసుచ, రిత మస్మద్ధనముకంటెఁ బ్రియమై తోఁచున్. 44

క. తనచరమకాలమున నా, మనుగడ మాన్యం బటంచు మదినమ్మి యతం
డెనలేనితుష్టి కెసరేఁ, గినట్టి యనుతాపమునకుఁ గేంద్రం బయ్యెన్. 45

ఆ. మరణశయ్య నున్నతతి 'ధర్మబద్ధ మౌ, బ్రదుకు నీది మేలిమాట నీది'
యనుచు నగ్రజుండు పనిచినకమ్మలోఁ, గరుణరసము గట్లనొరసి పాఱె. 46

క. దూరం బరయక నీదెస, నేరం బొనరించితిని గణింపకు మితనిన్
సైరింపు మనుచుఁ దా నను, గోరెను జనకుండు సుతుని గోరినసరణిన్. 47

క. తూరుపుపడమర లెఱుఁగని, వారలు నాబిడ్డ; లిచ్చ వచ్చినరీతిన్
దీరిచి దిద్దుము కుఱ్ఱల, భారము నీమస్తకమ్ముపైఁ గల దనియెన్. 48

ఆ. అనఘుఁ డతడు నన్నుఁ గనుగొంటకై కరం, బాత్రపడియె వత్తు నాక్షికాకు
ననియెఁ దడవుసేయ కరుదెమ్ము దర్శన, మి మ్మటంచుఁ దంతినిడితి నేను. 49

గీ. ఒండొరుల నేము చూచుకో నొప్పఁడాయె, నీశ్వరుఁడు; పుత్రకులభావి నెట్టియాస
పెంచె నగ్రజుఁ డదియుఁ బ్రాప్తింపదయ్యెఁ, గడ కతండు దేశమునందకన్నుమూసె. 50

ఆ. ప్రాఁతబాటలోనఁ బయనించుటయ కాని, క్రొత్తమెఱుఁగు లన్నకొడుకు లెఱుఁగ
రెంతపడియు వారి నింతయు నాపోవు, దెసకుఁ దిగువలేక దిగులుగంటి. 51

క. అరసితి వారలదోసము, నెరసంతయు నిందులేమి నేఁ గనుఁగొంటిన్
దురతిక్రమమగు ప్రకృతిన్, నరుఁడెవ్వఁడు గెల్చు లోకనాయకుఁ డైనన్. 52

ఆ. వేళ్లబలిసి యున్న వెనుకటిసంస్కృతి, నెద్రిచి యెవఁడు నిగ్రహింపఁ గలఁడు?
మనకు నంటుచున్న మార్పులు వెల్గులు, నాశ్రితులకు నంటు టది హుళక్కి. 53

గీ. బిడ్డలం గని యాసమైఁ బెంచువారి, పూఁట యన నెంతబెడిదమో తేటపఱుపఁ
దగు నుపాఖ్యాన మిది యెల్లతల్లిదండ్రు, లాత్మజులు దీని గుర్తింప నభిలషింతు. 54



# 6 ఆకుదిండికి బలి

క. చాగంబు ధర్మరక్షా, జాగర్యయు దంబములదెసన్ విముఖతయున్
రేఁగినకొలంది రెక్కొన, సాగెను మన్మానసమున శాకాన్నరతుల్. 1

క. ఏ నేధర్మము నమ్మితి, దానిం గడుభక్తి మున్న తల నిడికొందున్
నానాశ్రమమ్ము లీకొని, పూనుదు నడరింప నిచ్చపొడగలచోటన్. 2

ఆ. జలచికిత్స మెచ్చు శార్మణ్యుఁ డొకఁడు జొ,హాన్సుబర్గునందు నాకుదిండి
నెల వొకండు నడుపఁ దలకొనుదున్ వేడ్కఁ, దోఁగి యచటి కేగ సాగినాఁడ. 3

క. ఆకూటికి నాంగ్లేయుల, నాకుం గడుఁగూర్పువారి నడిపితి సాయం
బేకరణిం గూర్చిన నది, పైకము తగినంత లేక బందయిపోయెన్. 4

వ. కాని వెనువెంటన వేఱొండు పూఁటకూళ్ళయి ల్లావీటం దలయెత్తె – నద్దానిచరిత్ర మిచట
నావిష్కరించు టావశ్యకంబు. 5

క. దివ్యజ్ఞానసదస్సునఁ, గ్రవ్యంబును దిననివారుఁ గల; రందుఁ గలా
భవ్యార్చనాభిరత వి, త్తవ్యయమున కోటవడని తన్వి రహించున్. 6

క. పలువురు నెయ్యురు గల రా, వెలఁదికి నయ్యబల భోజ్యవిక్రయశాలన్
బొలలేనిదాని నడుపన్, దలపోసె నుదాత్తభంగిఁ దన్నగరమునన్. 7

ఆ. ఆయమవణిజ్యకై నా, సాయం బొకకొంత వలసె సంపన్నత్వ
చ్ఛాయ గలదౌట నమ్మికఁ, బాయక యిచ్చితిని వేయిపౌన్డులఋణమున్. 8

గీ. ఎందఱెందఱొ యభియోక్త లించుకేని, సంశయింపక సొమ్ము నాసరసనుంతు;
రప్పుగా నేఁడొసంగిన యర్థమెల్ల, 'బదరి' దయ్యభియోగి సద్భావపేటి. 9

క. అతఁ దన్నా!ని న్నెఱుఁగుదు, నితరంబు నెఱుంగ నీకు నిక్కార్యము సం
గత మనుప్రత్యయ మొదవిన, మతి నంజక వదయు ముత్తమర్ణతయనియెన్. 10

మం. అతఁ డాఫ్రికాభూమి కాదికాలమున, వచ్చి నిల్చినకూలివాండ్రలో నొకఁడు
సత్యాగ్రహం బేను సాగించువేళఁ, జెఱసాల కేగి దస్సినమేటిబంటు
ఈపాటిమైకోలు నిచ్చుటంజేసి, యతనివిత్తంబు నయ్యతివ కిచ్చితిని
మాపంచు రేపంచు మాసము ల్గడపి, కొస కాసహోదరి గ్రుడ్లప్పగించె. 11

క. నాగుండె చెదరె నింతటి, వ్రేఁ గెట్లుభరింతు నన్నవెఱ పైకొనియెన్
యోగం బీదృశ మెన్నఁడు, నేఁ గుడిచియెఱుంగ నింక నేమనువాఁడన్. 12

ఆ. బదరి నన్ను యెఱుఁగు భారం బదెల్ల నా, మీఁదవైచి ఋణము నాదరించె
నమ్ముకొన్నవాని నట్టేటిలో ముంపు, తగనికసటుఁజేఁత ధార్మికునకు. 13

ఆ. అగుట నతనివిత్త మంతయుఁజెల్లించి, యేన నష్టియెల్లఁ బూనినాఁడ
నీచరిత్ర విన్నహితుఁడభియుక్తుఁ డొ, క్కరుఁవుఁ డిట్లు నాకు నెఱుక సెప్పె. 14

గీ. సోదరా! యిట్టిచేఁతకు నీదునడక, కేమిపా త్రభియోగుల మేము నీదు
శీలమును నమ్మి నీచెంత వేలువేలు, నిలువనిత్తుము వత్తుము వలసినపుడు. 15

క. మాసొమ్ము నిట్లు సంస్కర,ణాసక్తికి లోఁగి పెఱల కప్పగ నిడినన్
గాసియగు మీకు మాకును, మీసేవావిధియు మెల్లమెల్లఁగ నడఁగున్. 16

గీ. ముద్దుముద్దుగ నితఁడు నన్ ముదలకించి, సన్నసన్నగ నాఁడు నాకన్ను దెఱచె
నింత కమ్మనిచెలికాని నెందుఁజూడ, నితఁడు నాభాగ్యమునఁజేసి యిపుడుఁ గలఁడు. 17

క. ఇతఁ డేనినేని మును దు,ర్మతిఁగా శంకించి యతఁడు మాన్యుం డను సం
గతి నవ్వలఁ గనినంతన, కుతిలపడున్ వానిసరసకుం బరువుగొనున్. 18

ఆ. అతని నాశ్రయించు; నపరాధి నితని మ,న్నింపు మిచ్చు నాదరింపు మనుచు
వేడివేఁడి యెదఁదవెలఁదితనమ్ము ను,గ్గడువుగా గడింపఁ గడఁగుచుండు. 19

క. మది నోడక యీతఁడు న,న్నెదిరించుట నాకు లెస్స యెంతయు నొదవెన్
అదిమొద లధమర్ణతకున్, గొదుకుదు నప్పునిన నేవకున్ వసపోదున్. 20

క. మన సెంతతీవరించినఁ, దన సంస్కరణానురక్తి తఱుగని దైనన్
మనుజుం డోపికదాఁటిన, పని సేయంజన దటన్న పాఠము గంటిన్. 21

క. ఏ నిందు గీతలోనఁ బ్ర,ధాన మనాసక్తి యోగతత్పరబుద్ధిన్
మాను టెఱింగితి భావిం, గానఁగ నీదొసఁగు వెలుఁగుఁగంబమ యయ్యెన్. 22

క. ఇచటన్ నిరామిషాన్న, ప్రచారమఖవేది కింతబలి నీవలె న
న్న చరిత్ర మెఱుఁగ కిట్లు వ,దచితిన్ సుకృతమ్ము వలచిదక్కినదానిన్. 23



# 7 మృజ్జల ప్రయోగము

క. దంబ మెఱుఁగనిబ్రదుకుపై నింబు నాదు, మదిఁ బెరుంగుటతోపాటు మందుమీఁది
వలపులేమియు నొగిని దైవాఱఁజొచ్చె, లంఘనాదులె తెగు లాఁపి లగ్గ నిడఁగ. 1

క. మలజాద్యము తలయేరుం, బలుమఱు నన్నీ జొహాన్సుబర్గున నేఁచెన్
గలఁగక పథ్యాదులతోఁ, దొలఁగించుచునుంటి వానిదుందుడు కెల్లన్. 2

క. ఆరోగ్యము సంపూర్ణము, కానేరద యెన్నివగలఁ గాఱియపడినన్
వారింతు వేని మందుల, నీరోగం బొదవి నిల్వనే ర్తనెఁ దలఁపుల్. 3

గీ. అపుడు 'మాంచెస్టరు,నఁ బ్రాతరశన ముజ్జ,గించెదు సమాజమొం దుదయించె నన్ను
నుదువు చెవిసోఁకె నెదపక కుడిచి వెజ్జు, నడుగులొత్తెదు తెలవాని కది శుభంబ. 4

ఆ. అతఁడు తిండిపట్ల నాచరించెదు తప్పు, లెల్ల నే నొనర్పనొల్లఁ గాని
వ్రేలి కందుదనుక విడువక ముమ్మాఱు, దినదినమ్ము బువ్వఁ దిందు నేను. 5

గీ. నడుమఁ దేనీరుగొందు నెన్నఁడును గడమ, వచ్చుటకు నోర్వ నశనసేవనముపట్లఁ
బోపులంటని శాకంబ భుక్తిగాని, యుడుగలే నందు రుచులు వీలున్నవట్టు. 6

క. ప్రాతర్భోజన ముడిగిన, నాతలపో టడఁగునంచు నమ్మితి నెటులో
మూతిబిగించితి మస్తక, యాతన వదలించుకొంటి నతిశీఘ్రముగన్. 7

ఆ. ఇన్నినాళ్ళనుండి నన్నొంచు నేరున, కాదికారణంబు హద్దుమీఱి
మెక్కుచుంట యన్ననిక్క మీనాఁటితోఁ, దెలిసివచ్చె లజ్జబలిసివచ్చె. 8

క. శకృదార్తి దీనికతనన్, వికలముగాదయ్యె దాని వెదలింపఁ దలం
చి కటిస్నానముఁ బూనితి, నొకకొంత ఫలంబుకంటి నుడుగనిదీక్షన్. 9

వ. అట్టితఱి 'జుస్టు' రచించిన 'ప్రకృతికిమరలుట' యనుగ్రంథమ్ము నొకనెచ్చెలి నాకొసంగె - నందు మృత్తికాచికిత్సావిధు లెన్నేని గలవు - మఱియు సరిక్రొత్త పండ్లుం బప్పుపదార్థమున్న కాయలు న్మానవప్రకృతి కనుకూలించుతిండి యని దాన నిరూపింపం బడియె-ఫలసేవనము నట్లుంచి యేను మృచ్చికిత్స కారంభించితి - నది నాకు లెస్సలెస్సం గూర్చె - దాని నిచటం గొంత వివరింతు - నెఱ్ఱమ న్నొండె నల్లమన్ను శీతలవారిం దోఁచి దాని మడుఁ గుల్వకు రాచి పొట్ట కదికింపఁజను - నే నీవైద్యమ్ము సేయంజేయనామలదోషంబు మటుమాయమాయె - నదిసుత నానేస్తకాంద్రం బలుగుర నిందు దింపితి - వారెల్లరుం దీని మేలు వడసి తనిసి - రీనేల నడుగిడ్డవెనుక నిరంతరకార్యవ్యగ్రుఁడనై యీప్రయోగమ్ముల దెసకుం జనలేనైతి - నట్లయ్యు నీచికిత్సపట్ల నాకుం గలనమ్మిక చెక్కుచెదరదయ్యె - మట్టిమందు నేఁడునుం గొంతకొంత పాటింతు - నొండు రెండు తడవ లే నతిభయానకమ్ము లగు రోగమ్ములకుఁ జిక్కితిఁ - గాని 10

క. నరునకు మందులతో న, క్కఱలేదని సెప్పనోర్తు గడుసరిపత్తెం
బరయుచు మృత్సాధన్సుల, నెఱిఁగి ప్రయోగింప రుక్కులెల్లను దుల్లున్. 11

గీ. కాయమందెల్ల రసవిషగంధకములు, క్రుక్కి నరుఁ డాయువున్ డించుకొనెడి నకట!
యతఁడు తనదేహమున కొదయందు గాక, బానిసీఁడై నిరంతరాపదలఁ గుములు. 12

గీ. పట్టుసెడి మంచమెక్కి యీ ప్రకరణమ్ము, పలుకుచున్నాఁడఁ గాన నాతలఁపు లేఁదు
నలఁతిసేయంగఁ జనదు నా తెలిపినట్టి, దారులన్నియుఁ బరికింపఁదగు నతండు. 13

క. నన్నుం బలసినరోగము, లన్నింటికి నేన హేతువని యెఱుఁగుదు నౌ
ట న్నాతాలిమి సదలద, కన్నాఁదను వేల్పుకరుణ గదరూపమునన్. 14

గీ. మందునొల్లని యీ మొండిమనిసివలన, నెందఱో నెయ్యురగువెజ్జ లింత యంత
గోదుగుడుచుట యేనెఱుంగుదును గాని, తక్క రవ్వారు నన్ను నౌదార్యఖనులు. 15

క. చదువరుల కిచట నొక్కఁడు, విదితముగావింతు 'జుస్టు' వినిపించిన ప
ల్కెదియేని సత్య మనుచున్, మదినమ్మక తఱచితఱచి మైకొను టొప్పున్. 16

వ. ఏలనా రచయితలచూపు తఱచుగా నొక్క లక్ష్యమ్మునంద తగిలియుండు - నెల్ల వస్తుల నెల్ల దెసలనుండియు నించించుక చూదందగు - వెండియు నవ్వస్తు వెటుగన్నను సత్యమ్ముగా నుంట వలయుఁ - గాని యేకకాలమ్మునం దదిసర్వధా నిక్కమైయుంట పొసఁగనేర దనియుం దెలిసికొను టావశ్యకంబ - నేఁ దావిష్కృతంబులగు పొత్తంబులం బెక్కులు రొక్కమ్మునకొండెఁ గీర్తికొండె సృష్టంబు లగుచుండుఁ - గావుటంజేసి యిట్టివ్రాఁతలం గనఁగోరు గఱువ లియ్యెఱుకతో నుంట లగ్గు - తత్తదంశములం బరికింప నెంచినవా రనుభూతివడసిన పెద్దల మాటలం బాటించి యాఁగి యాఁగి పఠించి తత్త్వంబు గన్నపదంపడి పరీక్షకుం గడంగఁదగు. 17



## 8 ఒక హెచ్చరిక

క. ఇంతకుమును మృత్స్నాకథ, కొంత లిఖితమయ్యె నిచటఁ గొండొక భోజ్యో
దంతము వ్రాసెద దీనికి, వంతున్నది ముందువచ్చు వ్రాఁతలయందున్. 1

సీ. ఆరోగ్యదిగ్దర్శనాఖ్య నిర్మించిన, కృతియందు భోజ్యసంస్కృతిని గుఱిచి
విస్తరించితిఁ గాని విపులంబుగా నిటం, దినుబందములసుద్ది తెలుపనొల్ల
నపుడప్డు నాకూర్చు నలఁతియలంతి పొ,త్తములలో నదియు తద్దయు రహించె
మనవారు తెలవారు మగవారు మగువ లా, రచనమ్ముదెస నాదరమ్ము నింపి

ఆ. రాత్మజీవనమ్ము నద్దానితో సరి, చేసికొనిరి నాకు వ్రాసిరెన్ని
యేని మెప్పుఁగమ్మ లింకను వ్రాయుచు, న్నారు గాన దానితీరు వినుతు. 2

ఆ. అందు వెలయుదానిఁ గ్రిందుమీఁ దొనరించు, నట్టి యవసరంబు పుట్టలేదు
కాని దాని కెడవుగాఁ గొంతసనితిఁ ద, త్పరిత లెఱుఁగ రేను బడినమార్పు. 3

గీ. ఏ నొనర్చిన మార్పాటులెల్ల వీరి, కెఱుకపఱచుట నాపాలికృత్య మగుట
లజ్జయుం బిమ్మటయు నెంత విజ్జఁ గాక, యిప్పనికి నంగవించితిఁ దప్పదనుచు. 4

క. కూరిచినవాఁడ ధర్మ, ప్రేరితమతి నితరకృతులరీతిన దీనిన్
వారక యేతద్ధర్మ, శ్రీ రాజిలు నాయొనర్పు చెయువులనెల్లన్. 5

క. ఈపుస్తకమునయం దేఁ, జూపినసూత్రములు కొన్ని సొంతమ్ములుగాఁ
జేపట్టలేకపోయితి, లోపంబిది సెప్పికొందు లోకమునెదుటన్. 6

క. మనుజునకుం గొండికతతి, జనయిత్రిపయస్సు వలయు, శైశవదశ దాఁ
టినవెన్క దుగ్ధ మెద్దియుఁ, గొనఁబనిలే దన్నబుద్ధి గూరెం దనకున్. 7

గీ. అడవులం దారముగ్గినయట్టి పండ్లు, కాయలుం జాలు నరునియాఁకటి నడంప
గోస్తనీముఖ్య ఫలరాజి గొప్పచేవ, నీయఁగలవు మనీషకుం గాయమునకు. 8

క. ఈదృశమగు నంధస్సున, నాదృతిగల మనుజుఁ డింద్రియంబుల నోర్చున్
భేదింపరాని శక్తికి, నాదరువగు బ్రహ్మచర్య మతనికి లోఁగున్. 9

వ. "తిండివంటిదే త్రేఁపు–బువ్వవంటిదే బుద్ధి"యనులోకోక్తులు పరమసత్యంబులు నాఁజెల్లు – నిందు నేనును నాసంగడికాండ్రును వలసినంత యనుభూతి వడసితిమి – నా "యారోగ్య దిగ్దర్శనము" నం దాయాయంశములు లెస్సతర్కించితిఁ – గాని దైవప్రాతికూల్యంబుకతన భారతదేశమునం దస్మత్ప్రయోగముల నెల్లవానిం బాటింప నశక్తుండనైతి – ఖేడా మండలమ్మున 10

క. పెనఁకువకు న్వలసినపో, జును సంతనచేయ నలయుచున్ దిరుగునెడన్
బనుపడ్డ యొందుమఱపునఁ, బెనురోగంబునకుఁ జిక్కి పెద్దయుఁ జెడితిన్. 11

క. మంచమునెక్కితి మృత్యువు, పొంచి ననుంజూచె నింతపుట్టినఁ బాలన్
డించియ బ్రతుకుం బడయఁగ, నెంచితి వ్యర్థశ్రమమ్ము లెన్నోపడితిన్. 12

గీ. పాలులేకయ జీవించవీలు నెఱుక, సేయుఁడా యని వెజ్జులౌ చెలిమికాండ్రఁ
బలుకరించితి బాదాముపప్పుపాల, మినుపకడుగును జూపిరయ్యనుఁగు లరసి. 13

క. మేనెల్ల సడలునంతకు, వీనిం గయికొంటిఁ గాని విడువద రుజయున్
బ్రాణంబు నిల్పుకొంటకు, నానామార్గముల వెదకినాఁడం బిదపన్. 14

గీ. తెగులు పైకొన్నతఱిఁ దినఁదగిన దేమి, తగనిదెయ్యది యనుచర్చ తప్పటంచుఁ
జరకసుశ్రుతముఖ్యు లేర్పఱిచినట్టి, ధర్మములుచూపి రారోగ్యదాతృమణులు. 15

క. అక్కఱయగుచో నంజుడు, మెక్కినఁ దప్పేమియనిరి మిత్రులు; పాలం
దక్కుట మంచిదియని వీ,రెక్కరణిం బలుకనేర్తు రీకష్టదశన్. 16

గీ. దుగ్ధమును ముట్టరాదని తొల్లి యేను, బ్రతినపూనితి నపుడు మద్భావవీధి
నావులుం బఱ్ఱెలున కల వగుటఁజేసి, మేఁకపాల్ ద్రావ నీనాఁడు మెత్తఁబడితి. 17

క. ఇది యుత్తమధర్మముగా, దిది శపథపుగుండెఁ జీల్చుటే యంచుఁ బదిం
బదిగ మది మొత్తుకొన్నను, బ్రదుకునఁ గలతీపి యిట్టిబాటకు నీడ్చెన్. 18

క. కట్టుగ్రమైన రౌలటు, చట్టమునకు త్రొమ్ముచూపి జయమును బడయం
బుట్టె నపు డిచ్చు దానన్, నెట్టుకొనెన్ జీవితాశ నిర్భరమగుచున్. 19

వ. ఈహేతువునంజేసి యస్మదీయ జీవనప్రయోగమ్ములు వెనుకడుగు వేయవలసివచ్చె - లోకమునం గొంద అన్నపానములతో నాత్మకుం బొత్తులేదనియు నది కుడుచునది క్రోలునది కాదనియు జఠరముం జేరు పదార్థమ్ముకతనం గాక లోదెస నుండి వెలువడునుదువునం జెడుగు వాటిల్లు ననియు, వక్కాణించుట నా కవగతంబ! - యీపల్కులం గొంతసత్యంబు కలదు - కాని దీనిపై వాదమ్ము రేఁపుట దిగఁద్రావి యిచటి నానిర్ణయంబు నివేదింతు. 20

సీ. పరమేశున కెవండు వెఱచు నచ్చుపుభక్తి, ప్రకటించు నెవ్వాఁడు ప్రభునిపట్ల
నీశ్వరదర్శనం బెతఁ దాసచేయు న,ప్పూరుషుండు పల్కునఁబోలెఁ గుడుపు
నెడలసైతము పట్టువిడుపుల నొందుగాఁ, బాటింపఁ దగునని చాటనేర్తు
నేనొనర్చినతప్పు లేఁబడ్డపొరపాట్లు, చేపట్టఁదగునని చెప్ప నొరుల
ఆ. కిదియ కాక మీకు నీ తెన్ను వలదని, యడ్డగింతు విం జ మాఁగినట్లు
వెజ్జు సెప్పెనేని విడువుఁడు పాలు నా, రచన చదివి మానరాద యందు. 21

గీ. తడవులంబట్టి తెగులుచే నడఁగువాని, జారరజ్వాల శుష్కించి స్రగ్గువానిఁ
దల్లివలె నుద్ధరింపగాఁ దగినమందు, కానరా దన్యతరము దుగ్ధమ్ముగాక. 22

క. వెనువెంట నతిగి రోగికిఁ, బెను పెంతయుఁ గూర్చి పాలు పె ల్లాదుకొనున్
గనినాఁడ నీదృశంబగు, ననుభూతిని భారతోర్వి నయ్యెయెడలన్. 23

గీ. కాన దుగ్ధమ్ముగుతిచి నాగ్రంథమందుఁ, గలప్రసంగ మారూఢంబు కాదటంచుఁ
జదువరులమ్రోల విజ్ఞప్తిసలిపి యెదఁద, ప్రేఁకమును డించుకొందు వివేకి నౌదు. 24

గీ. వైద్యు లిద్దానిఁ జూచినవా ర్పయస్సు, పగిది మేల్సేయఁగల వనస్పతిని జదివి
కాక యనుభూతిమైఁ బొడఁగాంచిరేని, నాకునెఱిఁగించి తోడ్పడ న్నతులొనర్తు. 25



# 9 బలిమితో నెదుర్పాటు

ఆ. అల జొహాన్సుబర్గునందువసించి యు, త్కోచములకు నాల్క సాఁచిసాఁచి
బైసిమాలినట్టి యాసియాశాఖాధి, కృతుల దెసకు దృష్టి నిడుద మిపుడు. 1

క. వీరిదొరతనము నీతికి, దూరంబుగ నున్నకతన దుర్భరబాధల్
గూరి దిగువాఱి తూరుపు, వా రత్తఱి దిక్కులేనివారై రకటా! 2

క. అధికారమున్నవా రా, పృథివికి రా నాజ్ఞపుట్ట దితరు లపాత్రుల్
వ్యధలేకయ చొర వీలగు, నధమం బొకనూఱుపొందు లర్థంబిడినన్. 3

క. రక్షసితన మిట్లున్నది, యిక్కడ మీ రూరకున్న నింకెవ్వరు మా
దిక్కని ప్రాగ్దేశీయులు, పెక్కురు నాచెంత మొఱ్ఱపెట్టిరి దీనుల్. 4

క. నీసోదరులం బొదివిన, గాసి పోకాలించి లగ్గ కల్పింపనినాఁ
డీసీమ నీవునిల్చుటఁ, జేసి ఫలంబేమి యనుచుఁ జిత్తము గదిమెన్. 5

క. కడఁగితిఁ గర్తవ్యమునకుఁ, బడసితి సాక్ష్యమ్ము వలయుపత్రము; లంతన్
నడిచితి రక్షకశాఖా, విడింద్రుసన్నిధికి ధర్మవీరము విరియన్. 6

క. అక్కటికము ధర్మేచ్ఛయు, నిక్కెడు మన సున్నవానినెతి నతఁ డుండెన్
జిక్కనితాలిమితో నా, వక్కణ సకలంబు ముక్కవదలక వినియెన్. 7

ఆ. సాక్ష్యమెల్ల నరసె సాక్షులఁ దానై ప,రీక్షచేసె "ధర్మదృష్టి పెంచు
కొన్నవాఁ" డటంచు నన్నుఁ దలంచె నా, పలుకు విశ్వసించి పాడివలచె. 8

ఆ. తెల్లవార లచటఁ దీర్పరులౌట వా, రాంగిలేయు దోషి నాదరింప
కచ్ఛధర్మదాసులై తీర్పుసెప్పుట, పొసఁగ దన్నబుద్ధి పుట్టె నాకు. 9

క. అయ్యధికారియు నాతలఁ పియ్యకొని కడంగిచూత మెయ్యదియో య
న్యాయ్యం బగుననువెఱతో, నియ్యెడ మనపాలిధర్మ మేలావిడువన్. 10

క. అపరాధుల బంధించెద, నపవిత్రంబైన ప్రభుత నాత్మ సహింపన్
గృపచూపుట కాదుగదా, కృపణులదెస ననుదు హర్ష మేసరె నాకున్. 11

క. తప్పొనరించినవారలు, కుప్పలుగాఁ గలరు కాని కోర్టున కీడ్వన్
జొప్పడినగుట్టు దొరకిన, యప్ప లిరువురౌట వారి కాజ్ఞలుపుట్టెన్. 12

వ. ఏ నిప్పట్ల మాటిమాటి కాపోలీసుదొరం దఱియుచుంటి – నా యొనర్పుపనికి దాఁపురం
బన్న దెన్నఁడుం బొసంగనేర – దట్లయ్యు నిందితులు నా జాడలెల్లం బరికించుపొంటె
వేగరులం గొందఱ నియమింప వారు నా కార్యాలయంబున కపుడపుడు వచ్చుచుం బోవుచు
వలయు విశేషంబు లార్జించి యధికారులకుం దేటపఱుపఁజాగిరి – కాని వలసినంతమంది
చారు లాయుద్యోగులకుం జిక్కరైరి – దీనికిం గారణంబు సాధ్వసంబ – హిందూస్థానమ్ము
వారుం జీనాదేశీయులు నిప్పట్ల నాదరువుగాకున్న నద్దోషులం బట్టించుపని నా కలవికాఁ
జాల – దిం దొకండు పలాయితుండయ్యెఁ గాని రక్షకభటులు బెట్టిదంపువెరవు లూఁది
సాధించి వాని దెచ్చి – రభియోగమ్ము చర్చకువచ్చె – సాక్షు లెల్లరున్ విచారితులైరి – మా
గెల్పున కెన్నేని ప్రమాణంబులొదవెఁ – గాని తీర్పు మాకు వింగడంబయ్యె – నంత 13

గీ. ఆస లుడిఁగితి నేను బోలీసుదొరయు, దుర్భరంబగు నలజడిం దోఁగిపోయె
న్యాయవాదుల(బదు కిట్టిదా యటంచు, నేవ తీం(డించెనాకు నావృత్తియెదల. 14

గీ. రాసులై రాసులై యున్నదోసములను, మూసిపెట్టుట కొదవె శేముషి యటంచుఁ
(బజ్ఞపై రోఁతయును రేఁగెఁ బాడి కిచట, నా(శయములేదెయనుభయంబదరెఁగాని. 15

ఆ. కోర్టుదెబ్బ తప్పుకొన్న నిందితులను, దొరతనమ్మువారు దూర మరసి
కొలువునుండి వెడలఁగొట్టుట నవ్వారి, (బదుకదెల్ల బట్టబయల యయ్యె. 16

క. వీరు పద(భష్టతమై, నాఱడిపా లగుట నాసియాశాఖదురా
చారము లించుక వెనుపడెఁ, గూరెం (బాచ్య(ప్రజాళిగుండెకు దిటవున్. 17

క. నాకీర్తి పెరిఁగె నవ్వల, నాకల్మియుఁ బెరిఁగెఁ గోర్టునం బనిహెచ్చన్
లోకమ్ము నడఁచు లంచవు, (వేఁకనయుం దఱిఁగెఁ బాడి వెరుఁగందొడఁగెన్. 18

క. ఆయుద్యోగులు నీచత, కాయువప ట్లనుట నిక్కమైనను వారిం
(దోయక కినియక నిల్చితి, నీయంశ మదెల్ల వారియెఱుకకుఁ బోయెన్. 19

క. అధికారమ్ములు కోల్పడి, యధమస్థితిఁ జిక్కి వీర లత్తఱి నాప
న్నిధులై తిరిగిరి (బదు కె,వ్విధి నీడ్తమటంచు నెల్లవీథులయందున్. 20

వ. ఆనాఁడు జొహాన్సుబర్గుపురపాలకసంఘ కార్యాలయంబునం గొన్నికొలువుల కెడముంట
వీరు వానింబడయ నుద్యోగించి నాయంగీకృతిలేమింజేసి యందుఁ గృతార్థత వడయలేక
యేఁకారుచుంట తన్మి(తుం డొకండు నా కెఱుకచేసిన యంత 21

క. ఏ నక్కటికమునం బని, పూని తదుద్యోగసిద్ధి పొసఁగించితి ని
ద్దానఁ దెలవారు శంకా, లీనాత్ములు గాక వర్తిలిరి నాపట్లన్. 22

గీ. ఎంత యెదిరించినఁ గటుత్వ మెంతచూపి, యెంతయల్లరి చేసిననేమి నన్నుఁ
(గొత్తశాఖయుఁ దీయమ్ముగురిసి మెచ్చె, నెఱుఁగ నవ్వేళ నాతత్త్వ మిట్టిదనుచు. 23

క. ఇది సత్యా(గహమునకున్, మొదలిటివే రని యహింసమోహనమూర్తిన్
బొదలెడు నొక యపఘున మని, పదపడి కనుఁగొంటి మేలిపథ మనుకొంటిన్. 24

సీ. నరుఁడువే ఱాతఁ డొనర్చుకర్మంబువే, ఱని విన్నవింతు నింద్యమ్ములైన
పనులపై రోఁతయుఁ (బన్ననిచేఁతల, దెస నాదరంబు సంధిల్లు మనకు
నిది వోలుఁ గాని సత్కృతినొనర్చినఁ జెడ్డ, పనిసల్పినను మానవుని సమాద
రించుట వలయు నీరీతి నెఱుంగుట, యలఁతికార్యమ కాని వలచి నిలిచి
గీ. గెలుచు టంతంతలం గానికృత్య మిదియ, బీజమని విశ్వసించెద నీజగాన
దినదినం బగ్గలించు విద్వేషములకు, నోహటింపని సమర సన్నాహములకు. 25

ఆ. సత్యశోధనమ్ము సలువ నహింసయ, మొదటిసాధనంబు మూలమంత్ర
మెంతదనుక మన కహింస వశంపడ, దంతవట్టు సత్య మగ్గపడదు. **26**

మం. కార్యంబుపైఁ గాక కర్తపై నలుక, తగ దట్లుసేయుట తనపైని దాన
పగగొన్నయ ట్లగుఁ బ్రజ లెల్లవారు, నజునిసంతానంబ యతఁ డీజనాళి
నొక్కతూలికతోన యొనరించి నిలిపె, నరునం దనంతగుణమ్ము లశేష
శక్తులుం గల వంట సత్యంబ కాన, నతని కల్గుట వాని కవమతిసేఁత
తద్గుణాదులఁ గ్రించుఁదనముపాల్సేఁత, యఖిలప్రజాకోటి కపకృతిసేఁత. **27**



# 10 పుణ్యస్మరణము

సీ. నానామతంబుల నైకజాతులవారి, చెలిమిమైఁ బెరిఁగినజీవితంబు
నాపాలిదై యుంట నాయిల్లు పరునిల్లు, నాభూమి పరభూమి నామతంబు
పరమతం బను భేదభావ మేనాఁడు నా, మదికినంటద; యహింసావ్రతమ్ము
బ్రహ్మచర్యము పరిగ్రహములేమియు నాది, యగు యమనియమమ్ము లాసచేసి
గీ. యింతవట్టును గష్టించునే నభేద, బుద్ధి నా కొండుగుణమని పొంగిపోవ
నెన్నఁడును దీనికల్మికై యించుకంత, జతనముం బొనరించినజాడ యెఱుఁగ. 1

ఆ. న్యాయవాదివృత్తి కగపడి దర్బను, కాఁపురంబు నడుపు కాలమందు
నాకు సాయపడెడి లేకరులెల్ల నా, యునికిపట్టునంద యుండువారు 2

క. హైందవులుం గ్రైస్తవులును, నందుఁ గలా రేను వీరి ననుజులవోలెన్
బొందికమైఁ జూచితి నా, చందము నీకొననిసతికి సంస్కృతినిడుచున్. 3

వ. ఈలేఖకులందొకఁడు పంచమకుటుంబమునంబుట్టి యేసుమతము నాశ్రయించినవాఁ -
డితఁడు సరిక్రొత్తగా నాపనికిం గుదిరె - నపుడు నావసించునెల వాంగిలేయులమనికిపట్టు
ననుసరించి యుండుఁ - గాన దానియఱలలోఁ గ్రంతలు లేవయ్యె - నవి యుంటయు
నా కింపితమ్ముగా - దిట్టిమాయింటఁ దూము లుండఁదగినయెడ మూత్రంబువిడువం
బాత్రంబు లుంచితి - వీనిం గడిగి చక్కఁబెట్టుట మాదంపతులకృత్యంబు - ప్రాఁబడినలేకరు
లింటివారియట్లయై వారిపనంటుల వార సవరించుకొనఁ జాగిరి - కాని యాక్రొత్తక్రైస్తవుని
మూత్రకలశంబు నేమ సంస్కరింపవలయు - నాయిల్లా లిట్టిపనిసేయునది యయ్యు నీ
తమ్ముని కుండం దొలఁగింప నేవపడె - నంత 4

ఆ. మాకు రగడపెరిఁగె మనసులు చెడె నేన, పనఁటినెత్త సిద్ధపడితిఁ గాని
పడఁతి యెప్పుదాయెఁ బదపడి తానైనఁ, గడవ నెత్తదయ్యెఁ గలఁకఁ బాసి. 5

ఆ. ఎట్టకేల కాపె యాకొని కుండ చే, పట్టి కనుల నశ్రుపాత మదరఁ
గెంపుఁజూపుతోడఁ గెరలుచు నొఱలుచు, మెట్లుదిగుట యిపుడు నెట్లుమఱతు. 6

గీ. ఎంతమక్కువ చూపింతు నంతనిష్ఠు, రత వెలారించుమగఁడ నే నతివపట్ల
శిక్షకుఁడ నంచుఁ దలఁచి యనుక్షణంబు, నాపె నేఁచితి బెడిదంపురూపువోలె. 7

ఆ. అట్టులగుట నింతి యమ్మూత్రభాండంబు, దెచ్చినంత నాకు మెచ్చురాద
యిచ్చతోడ నారవిచ్చినమొగముతో, నబల దీని కొగ్గ నాసపడుదు. 8

ఉ. కావునఁ గస్సుబుస్సుమని గంతులువైచితి దుర్భరక్రుధా
సేవధినైతి నిట్టివెదచేఁతలు మద్గృహమందుఁ జెల్ల వీ
త్రోవ సహింపనంటి నది తూపుతెఱంగునఁ గాఁడి తాలిమిం
ద్రోవఁగ నింతియుం బరుష ధోరణి పింపిసలాడ నత్తఱిన్. 9

క. ఓయయ్య! మీర యేలుఁడు, మీయింటిని నేను నిష్క్రమించెద నిఁక నం
చాయత్తిదప్పికల్ప, స్ఫాయజ్జలదంబువోలెఁ బలుకం దొడఁగెన్. 10

క. అపు డే నీశ్వరు మఱచితిఁ, గృప నన్విడనాడె నెల్ల యెఱుకయు సడలెన్
విపదంభోనిధి నబలన్, రెపరెపఁ గేల్వట్టి యీడ్వ రేఁగితిఁ దెగితిన్. 11

క. వాకిలిదనుకన్ దిగిచితి, వీఁకఁ గవాటంబు రెక్క విచ్చితి నవలన్
నాకస్తురి గంగా యము,నా కూలంకషలు లోచనంబుల విరియన్. 12

ఆ. మీకు నింతసిగ్గు లేకుండుఁగాక నా, సిగ్గు చిదుకలేదు చిన్నమంత
లజ్జనూఁది మదిఁ దలంపుఁడు నన్నిట్లు, వెలికిఁద్రోయ నెందు నిలుతు నేను. 13

క. కన్నారిచెంత కేగుదు, నన్నన్ నాతల్లిదండ్రు లగపడ రిచటన్
మిన్నందిన తాలిమిపై, మన్నియతన మున్నజాతి మాయది యగుటన్. 14

క. నా యాఁడుజాతిధర్మము, త్రోయక మీ రెంత పఱుపఁదొడఁగిన నింద్యం
బేయది సల్పిన నోర్మిం, బాయక భవదాగమెల్ల భరియింపవలెన్. 15

ఆ. ఇంకనైన లజ్జ యించుకపాటించి, మూయుఁడయ్య తలుపు వేయుఁడయ్య
వచ్చిపోవుపెద్దవారు పిన్నటివారు, నవ్విపోదు రిట్టిచివ్వఁ గన్న. 16

గీ. నావుడున్ గిన్క పెంచుకొన్నాఁడఁ గాని, యెడఁదలో సిగ్గుదొంతరల్ సుడియసాగె
నన్నుఁ గస్తూరి వదలలేకున్నాఁడు, నేను గస్తూరి నేలీల నిగ్రహింతు. 17

క. మాకొండొరులకు నిట్టి వ, నేకంబులు పుట్టెఁ దగవు లియ్యవి తుదకున్
శ్రీకరముల యైనవి జగ,దేక క్షమ వెంచి నిరత మింతియ గెలిచెన్. 18

క. ఈ దృగ్ఘటనలు సర్వము, నాదు పురాజీవితమ్మునన్ నడుచుటచే
నీ దినమునం దటస్థత, నూఁది సమస్తంబు సెప్ప నోర్తున్ నేర్తున్. 19

ఆ. వలపుగ్రుడ్డితనము వాయనిమగఁడనై, నేఁడు లేను సతిని నిలువరించు
శిక్షకుండఁగాను జిత్త మీకొన్న దం,డింపవచ్చు నన్ను నెలఁత యిపుడు. 20

వ. నేఁడు మా కొండొరులపై సమానస్వామ్యం బున్నయది - నిర్లిప్తులమై యుభయులమును జీవయాత్ర సేయుచున్నారము - రుగ్ణుండనై యేను దయ్యుతతిఁ గృతజ్ఞతామాత్ర ప్రతిఫలమునే నొల్లక కస్తూరి నన్ను సేవించునది యయ్యె - నిది నాయిర్వదితొమ్మిదవయేటం బ్రవర్తిల్లె - నే నపుడు 21

ఆ. బ్రహ్మచర్యధర్మ పరిరక్షణంబు నా, నించుకంతయేని యెఱుఁగనైతిఁ
జాన యన్న నాఁడు సహధర్మచరి యను, తెలివి లేశమేని కలుగనైతి. 22

క. మగనికి వలసినసౌఖ్యము, లగపడఁ జేయుటకు నతనియానతు లెల్లన్
సిగఁదాల్చుటక జనించెను, మగువ యటం చపుడు నాదుమది నూహింతున్. 23

వ. కాని నాముప్పదియొం దగునేఁట (1900) నాయాశయమ్ములం బెద్దమార్పువాటిల్లె-నది ముప్పదియేడవయేటికిం (1906) బూర్తియయ్యె - దీని నాగామి ప్రసంగమున విపులమ్ముగా వర్ణింతుఁ - గాని యేను నిర్వికారుండ నగుకొలంది నాకుటుంబమున శాంతిసౌఖ్యములుం బావిత్ర్యంబు నావహిల్లం దొడఁగె - నవి యీనాఁటికిం బెరుఁగుచున్నవని నుడువం దగు - నిప్పుణ్యస్మృతింజేసి మాయాలుమగలు జగమ్మున కొజ్జబంతింబోనివా రనియొండె నాయిల్లాలియం దేలోపముం గానరా దనియొండె మాలక్ష్య మొక్కండ యనియొండె నెవ్వరుం దలపోయ వలవ - దాపెకుం బ్రత్యేకమగు నాదర్శమొండు లేమి నిక్కంబ - కాని 14

క. నానదతలఁ బెక్కింటిని, మానిని మన్నింప; దంతమాత్రన వాదం
బేనాఁడు రాదు చర్చకుఁ, బూనిన సంతుష్టి యింతపుట్టదు నాకున్. 15

గీ. చదువు సెప్పింపరైరి శైశవముపట్ల, నాపెకుం గన్నవార; లేనైనఁ గొంత
వేసటకు నోర్చి కస్తూరి విద్యలందుఁ, జతుర యౌటకు జతనంబు సలుపనైతి. 16

ఆ. ఆకె చదువురాని దయ్యు హిందూసతీ, ప్రకృతిసిద్ధమైన పరమసుగుణ
మొండు లెస్సవడసె నుడుగక నావైచు, నడుగునంద తాను నడుగువైచె. 17

క. న న్ననుసరించుటయ తన, పన్నినబ్రతుకునకు మేలిఫలమని యదియే
పున్నెములకు నన్నిటికిం, గన్నాకని పరమసాధ్వి కస్తూరి నమ్మెన్. 18

ఆ. బ్రదుకువెలఁదితనము పాటించి నాపూను, నుద్యమంబులందు నొకటికైన
నాఁక సెప్పి యెఱుఁగ దాయమ్మ దీన మా, మనికి సౌఖ్యతుష్టిమత్త నెదిగె. 19



# 11 ఆంగ్లేయులతో గాఢపరిచితి

గీ. ఉగ్గడించెద సత్యప్రయోగచరిత, మిది రచించుతెఱం గిటన్ జదువరులకు
గ్రంథ మిట్లుండవలయు భాగమ్ము లిన్ని, వెలయు ననుబుద్ధిలేదు తొల్తొలుతనాకు. 1

క. దినచర్య నితరపత్రము, లను దఱచుచుఁ బుస్తకంబులం జూచుచు ని
ప్పని సేయు టేనెఱుంగను, వినిపించెద నంతరాత్మ వినిచినయట్టుల్. 2

వ. నా మానసికవ్యాపార మెల్ల నంతరాత్మప్రేరితం బని పల్కంజాలఁ - గాని కార్యరూపమ్ము నందిన నాతలంపులకెల్ల నదియ ప్రేరకంబనుట తప్పుగాదని యెంతు - నే నంతరాత్మం గన్నవాఁడను గాను - విశ్వంబునకెల్ల నీశ్వరుపైఁగల శ్రద్ధయ నాకుం గలదు - నా హృది నుండి యది తొలఁగింపరానిది - కాన నది కేవలవిశ్వాసము గాక యనుభవంబ యని తలఁతుఁ - గాని యిదియెల్ల ననుభవంబ యనుట సత్యంబు నొకభంగి బాధించుటయ యగు - నగుటంజేసి దీనికలరూపు నెఱిఁగింప దగుపల్కు నాభండారమున లేదనుట సముచితంబు - కంటికందని యీయంతరాత్మకు విధేయుఁడనై యే నీచరిత్ర పల్కుచుంటి నని నా నమ్మిక - మఱియు 3

గీ. ఆత్మకథ సర్వధా యితిహాస మగుట, పొసఁగదని దీనిరచనకై పూనుకొన్నఁ
బదపదమ్మునెనిబ్బందు లొదవు ననియుఁ, దొలుత విన్నాఁడ నది లెస్స తెలిసెనేఁడు. 4

గీ. సత్యపరిశోధనమ్ముపై సాగుచున్న, యీకథన్ నాయెఱింగినదెల్లఁ జేర;
దెవఁడు సూనృతావిష్కృతి కిట్టిపల్కు, వలయు నిట్టిది వలదంచుఁ బలుకనోపు. 5

గీ. పాటిదప్పునిదయ్యు నాపక్షమంద, పుట్టుసాక్ష్యమ్మునకుఁ బాడిపట్టునందు
నెంతవిలువ లభించు విశ్రాంతి యున్న, వారు తఱచిన వన్నె రావచ్చుఁ గధకు. 6

క. కాదే నొక్కఁడు తనపెడ, వాదమ్మును రేపి నాదువాక్కుల నెల్లన్
ఛేదించి వ్రక్కలించి ప్ర,మాదమ్ములఁ జూపి యెలమిమై నిలవచ్చున్. 7

గీ. తర్కమిటు పెంచినంత గ్రంథమును దీని,నాఁపుటయ లెస్సకాదా యటంచుఁదోఁచు
నైన సాగింపఁదలఁచితి 'నాఁగవోయి!' యనుచు నాయంతరాత్మ పల్కాదుదనుక. 8

ఆ. సత్యశోధనమ్ము సాగించునెడ రచ,నయు నొకండుశోధనంబ యనుచు
దీని వ్రాయుచుంటిఁ గాని మనీషుల, మెచ్చుకొఱకు వ్రాయునిచ్చ లేదు. 9

ఆ. నన్నుఁ దొడర నియ్యకొన్ననెయ్యుర కింత, తృప్తిపుట్టుననియు దీనిఁగూర్చు
వారిసంతసమ్ము వలచియ కలము చే,పట్టినాఁడ దీనిపుట్టువునకు. 10

క. ఆనందుఁడు జయరాముఁడు మానక నానాఁడు నన్ను మఱిమఱిగోఁరన్
బూనితిని గాన నిక్కథ, లోనిదొసంగునకు వారలును భాగస్థుల్. 11

వ. అయ్యది యట్లుండె - నిఁక మూలకథకు న్వచ్చెద - నాయింట భారతీయులగు లేకరులుం బెఱలును గుటుంబములోనివారింబలె నెట్లు కాఁపురించి రట్ల తెల్లవారు న్నిలువ దొరంకొనిరి -నానెలవునంగల కొంత తీపొత్తు నియ్యకొనకున్నను గావలయునని యేన వీరిం జేర్చుకొంటి - నెల్లరయెడ నిట్లు పంతగింపరాదనియు నెఱుంగుదు - నేఁటి యీక్రొత్తచుట్టఱికమ్ముకతనం జిక్కులు పెక్కులు దాపరించెఁ - గాని పశ్చాత్తాపముపాలు గాక నాధర్మంబునుజ్జగింపక తాల్మిం బూనితిఁ - బ్రాంతనెచ్చెలికాండ్రు నాపట్టుదలకుం గుజగుజవోవుచుం గొణఁగసాగ వారిం దగురీతి హెచ్చరించుచు 12

క. వినుఁ దాస్తికుండు తనలోఁ, గనుపరతత్త్వంబు నీజగద్విధులలోఁ
దన కగపడు నానావిధ, జనులందుం జూడవలయు సంవిత్తిమెయిన్. 13

ఆ. అట్టులగుట నాతఁ దందఱపట్ల ని,ర్లిప్తబుద్ధిమైఁ జరింపఁజాలు
నోర్పు వడయవలయు నూరక మంత్రముల్, చదివినంత భవము చక్కఁబడదు. 14

గీ. దైవికమ్ముగ నపుడప్డు తాదృ శావ, కాశ మబ్బిన నతఁ దది కాదు నాక
నవ్యబాంధవములకు మన్ననయొసంగి, మెలఁగవలయు రాగద్వేషములకుఁ దొలఁగి. 15

వ. నిర్లిప్తభావంబు వడయుసాధనం బిదియ సుఁడీ! యనుడు నా చెలికాం డ్రుదారులై నాదారి కియ్యకొనిరి - నాతత్త్వం బిట్టి దగుటంజేసి బోయరుకయ్యంబు సాగినతఱి 16

గీ. ఇఱుకటం బెంతయున్న నాయింటిలోని, కిద్ద ఱాంగ్లేయులను జేరనిచ్చినాఁడ
నెయ్యురను వీరి నిట్లు మన్నించుకతన, వెలఁది కస్తూరి నేడ్పింపవలసివచ్చె. 17

క. ఆటంకము లెఱుఁగక తెర, చాటులలోఁ బడక నాదుసైదోడులటుల్
నాటెంకి నాంగిలేయులు, పాటింపంబడుట కిదియె ప్రథమం బయ్యెన్. 18

క. ఏ నాంగ్లేయులనెలవుల, లో నిల్చితి వారినడతలున్ నేరిచితిన్
గాని యది పూఁటకూళ్లగృ,హానన్ గాఁపురము చేసినట్టులె యుండెన్. 19

గీ. తాదృశముగాదు మన్నికేతనము దాన, నస్మదీయులు మిత్రు లేరైన నేమి
మాకుటుంబంపు సభ్యులమాడ్కిఁ దనిసి, రభ్యసించిరి నడవడుల్ హైందవములు. 20

క. తెలవారియింటివలె మా, యిలు కన్పడుఁగాని యందు నెసఁగెడిచందం
బులు సంస్కారము లన్నియు, వెలయున్ మనసంప్రదాయవిధి కగ్గములై. 21

క. ఆమిత్రుల నాంగ్లేయుల, మామనికిన్ నిల్పుకతన మా కిడుములు పె
క్కామతిలెఁ గాని సాదుల, కేమాత్రయుఁ గస్తివుట్ట దీయిద్దఱకున్. 22

క. వారు తమయింట నిల్చిన, వారివలెం దనివి తద్దవడసిరి దర్బన్
లో రేఁగిన యీనెయ్యము, లారంబండినవివో! జొహాన్సుబరుగునన్. 23



# 12 ఆంగ్లేయులతోఁ బరిచితి

గీ. ఒకపరి జొహాన్సుబర్గునం దుండువేళ, భారతీయులు నిర్మలాచారఖనులు
నాకడన్ లెక్కవ్రాయుచు నల్గురుండ, సాఁకితిం బుత్త్రనిర్విశేషముగ వీరి. 1

క. నాపనుల కన్నిటికి వీ, రోపనివారైరి యిందు నొక్కరుఁడైనన్
దై పొనరించు టెఱుంగఁ డిఁ, కేపగిదిన్ బండినడుచు నిదిలేకున్నన్. 2

క. ఏ నిది కొంతయెఱుంగుదుఁ, గానం గొందఱకు దీనిఁ గఱపితి భాషా
జ్ఞానం బన్నువయగుటన్, గానరు వా రిందు వలయుకౌశల మెల్లన్. 3

క. ఈటైపు లెస్సనేర్చిన, నేటాల్ రాష్ట్రంబులోనినెయ్యుని నేఁ డి
చ్చోటికిఁ బిల్చెద నన్నన్, జీటీ శ్రమలెన్నిపడినఁ జిక్క దతనికిన్. 4

క. ఇఁక నయ్యధికారులచెం, తకుఁ జని యానతికి వారిదయ నర్థింపన్
స్వకమత మీకొన దీస్థితి, నొకటియు నిర్ణయ మొనర్పనోపక యుంటిన్. 5

క. ఒకదెస వకీలుపని వే, ఱొకవంకఁ బ్రజాసపర్యయును బైకొనియెన్
సుక మింతయెఱుంగక మది, వికలంబగుచుండె వీనిఁబ్రేఁకనకతనన్. 6

క. తెలజాతిపూరుషుండో, వెలఁదుకయో చిక్కి టైపువిధి దీర్పనిచోఁ
దొలఁగదు మద్భారం బని, తలఁచితి నది యెట్లుపొసఁగుఁ దద్రాష్ట్రమునన్. 7

ఆ. నల్లవానికొల్వునకు నిచ్చగింతురా, తెల్లవారు రంగుతెగులువారు
కడఁగిచూత మనుచుఁ గష్టించి తద్వృత్తి, నాశ్రయించువారి నడుగ నడుగ. 8

ఆ. అచట నిట్టిపనికి నర్హతవడసిన, వారియందు నాడువాండ్రు పలువు
రుండుకతన మిత్రుఁ డొక్కఁడు స్కాట్లాండు, కన్నియనుగుదిర్చి నన్నుఁజేర్చె. 9

క. నీతి నిర కున్నయతఁ డే, జాతీయుండైన వానిసన్నిధిఁ గొలువుం
జేఁతకు దిక్కను నచ్చెలి, కాతంకములేమి నెయ్యుఁ డాయమ నంపెన్. 10

క. ఆకన్నెయు నుద్యోగము, లే కారటపడుచు వచ్చె లిబ్బిం గనువాఁ
డేకొలఁదిం దనువుం గను, నాకొలఁదిం దృప్తిగంటి నాపెం గనుచున్. 11

ఆ. నల్లవానిచెంత నౌకరిచేయంగ, నమ్మ! నీకు నిష్టమగునె యంటి
నెచటనైన నేమి యింతయు నిప్పట్ల, లెక్కసేయ నంచు లేమ పలికె. 12

క. సంతుష్టిగంటి నబలా!, యెంతవలయు జీత మంటి నేడుంబదిపొం
డ్లింతు ననిపల్క బరువని, యెంతురె మీ రనియె దిక్కు మృదువాక్సరణిన్. 13

క. ఏ నాసపడినపనులకుఁ, బూనిన నీజీతమునకుఁ బూర్తిగ వెఱవన్
గాని యిట కెపుడువత్తువు, నా నిప్పుడె యంచుఁ గన్య నన్నలరించెన్. 14

క. ఈ నెలఁతను నాకై భగ,వానుఁడు పంపింౘెనంచు వగచితి నపుడే
చాన నభిముఖనుజేసి బి, ఆానన్ గడఁగితిని గమ్మ వ్రాయించుటకున్. 15

క. నాచెలియలిచందమ్మున, నాచిట్టికొమార్తవోలె నాదగుడెందం
బాఁచికొనె డిక్కు లేకరి, యాచిన్నది యని తలంచు టెన్నఁడు నెఱుఁగన్. 16

క. ఇది యెఱుఁగమికిం గారణ, మిది పొరపా టంచు నెన్నఁడే నామెపనిం
గదిరినవెలితిం జూపుట, కొదవద యవకాశ మెల్లయును సాధువగున్. 17

ఆ. అస్మ దీయవిత్త మాకన్నె యెన్నేని, వేలు పుచ్చుకొనియె వెచ్చపెట్టె
నెల్లరువ్వ లెక్కకెక్కించె నాపె నా, నమ్మకంబునెల్ల నాఁచికొనియె. 18

గీ. అంజు టెఱుఁగక యెంతరహస్యమైన, నాచెవిని వైచె నప్పను జూచునట్ల
నన్నుఁజూచెను డి క్కింతనమ్మె ననుచుఁ, జెప్పికొనుట నాపాలిటి గొప్పమాట. 19

గీ. నిజహృదయరాజ్య మేలుమన్నీని బదయ, నాదుసాయమ్ము వలచెఁ జిన్నారిడిక్కు
ఏమిసెప్పెద నాభాగ్య మేన కంటిఁ, గన్నియను ధారవోసినపున్నె మపుడు. 20

క. తగువాని మేక్డొనల్డును, మగనిఁగ నంగీకరించి మానిని నన్నున్
దిగనాడెఁ గాని యవసర, మగుచోఁ దోడ్పడియె నాకు నయ్యాయెడలన్. 21

వ. అంత సంక్షిప్తలేఖనార్థ మస్మత్కార్యాలయంబున కొక్కనేర్పరి వలసివచ్చె – నచ్చటి యున్నత పాఠశాలయం దొకదాన నుపాధ్యాయగా నున్న శ్లేశిన్ నాఁబడు పదునేడేండ్లయీడున్న కన్నె యిప్పునికి నియ్యకోలుసూపి నాచెంతకుం జనుదెంచె – నీమె యుద్యోగమ్ము వలచి కాక యనుభూతి నార్జింపఁగోరి యిట్లువచ్చె – వింత వింతపోకడలు కల దగుటంజేసి శ్లేశిన్ కన్యను మున్ముం దేను మెచ్చలేనైతి – నీపెకుం దెల్లవారు నల్లవా రనుభేదదృష్టి యేమాత్రయు లేదు – కాని యేపనియందేని నాసక్తి సున్న – పెఱలం జిన్నవుచ్చుట కీమె యుల్లం బోహటింపదు – తలంపుల దాఁపతికముసేఁత కావంతయే నిచ్చగింపదు – కావున 22

క. ఈ మెలఁతుకనదవడి పలు, బాముల నొదవించెఁగాని భావము శౌచ
శ్రీమంజు వగుట నక్కొఱ, గాములు నపుడప్ట దవ్వుగాఁ జనుచుండెన్. 23

క. ఈపిన్న కాంగ్లవాణీ, నైపుణి నాకంటె హెచ్చు నాఁదగు మతి నే
నీపెదెసం గడునమ్మిక, చూపుదు నీకల్మి నాదుసుకృతం బనుచున్. 24

గీ. అట్లగుట నీమె తీర్చినయట్టిపత్ర, మెట్టిదైనను బరికింప నియ్యకొనక
చెంతకు న్వచ్చినంతన సంతకంబు, వెట్టఁగల్గితి నావంతవెఱయు లేక. 25

గీ. ఎల్లయని లేని యౌదార్య మీవెలంది, కొదవి తొడుగనిరవణమై యొప్పుచుంట
జీత మొకయాఱుపొందులే స్వీకరించెఁ, గొసకుఁ బదిపొందులను దీసికొని శ్రమించె. 26

గీ. అమ్మ! సంబళ మిది చాల నస దటంచు, మఱియుఁ గొనుమంచు నే బతిమాలినాఁడ
నెంతవేఁడినఁ గాసుల నిచ్చగించి, నీకడ న్నిల్వనొల్ల దీనెలంత యనియె. 27

గీ. నీకు వలసినపనిసేఁత నాకు వేలు, లక్షలని నిన్నుఁజేరితి లక్ష్యములకు
యుష్మదీయమ్ములకుఁ దద్దయును ద్రవించి, యిచటఁ గుదిరితి ననియు నీయింతి కసరె. 28

గీ. ఒక్కపరి వెచ్చమెద్దియో యొత్తడింప, నడిగె నలువదిపొండ్లనొ మ్మబల నన్ను
నదియు ఋణముగ నెంచి వీలైననాఁడు, తెచ్చి నిశ్శేషముగ నాకు నిచ్చివైచె. 29

గీ. చాన కౌదార్యమున కుద్దియైన ధైర్య, సంపదయు నబ్బెఁ గోరమీసాలుదువ్వు
రాచబిడ్డయు నీపెధీరత నెఱింగి, క్రుంగవలయును సిగ్గువ్రేఁగునకు నోడి. 30

గీ. స్ఫటికశిలవోలె నచ్ఛయై పరిఢవిల్లు, నీనెలంతకు సరివచ్చునింతి నన్య
నే నెఱింగినసతులలోఁ గాననైతి, భాగ్యవశమునఁ గంటి నిబ్బాలచెలిమి. 31

క. అది పుణ్యస్మృతి యని స,మ్మద మందెద నీపె నాదుమదిఁ గన్పడుచోఁ;
నిది నుడువకుంట సత్య, మ్ముదెసన్ బహుళాపరాధముం జేఁత యగున్. 32

క. అఁకటి నెఱుఁగదు దప్పిక, రాకడ యెఱుఁగదు దివమ్ము రాత్రి యెఱుఁగ దే
యాఁక లెఱుంగదు కర్జము, పైకొన్నపు డీపె యెల్ల బాముల కోర్చున్. 33

ఆ. కార్య మెద్దియేని గడుకొని కాఁదారి, ప్రొద్దునందు నొంటిఁ బోవఁజాగఁ
దోడులేక వెడలుదువె బిడ్డ! యనఁ గన్ను, లెఱ్ఱవాఱఁ జూచు నీమె నన్ను. 34

గీ. మీసములు గడ్డములు వచ్చి మిఱ్ఱుసూచు, భారతీయులు పెక్కు రీబాలపట్ల
గౌరవంబు వెలార్తు రొఁగాదు నారు, కోరి తలఁదాల్తు రీమెపల్కులు సతంబు. 35

క. ఏమి చెఱంబడ ధైర్య, శ్రీమతియై ప్రజలగుండెచేవ నిలిపి యీ
లేమయె సత్యాగ్రహసం,గ్రామము పాలించె వీరకాంతామణియై. 36

గీ. అపుడు లక్షలకొలఁదిసొ మ్మరయవలయు, వాములకొలంది కమ్మలు వ్రాయవలయు
నుడుకువయ లేక పత్రిక న్నడుపవలయు, నలయు టెఱుఁగక యీయెల్ల నాచరించె. 37

క. ఈ గరితం గొనియాటకు, సాగిన నాకలము నిల్వఁజాలదు పూజ్య
శ్రీ గోకులుండు శ్లేశిను,పైఁ గురిసినపేర్మి నెఱుకపఱిచెద నింకన్. 38

క. నాకుం దోడుగ నిడుమల, కీకొని ప్రజ కింతలెస్స యిచ్చినవారిన్
గోకులుఁ దెల్లర నెఱుఁగును, నాకై పలుమాఱు దర్శనం బిడుచుంటన్. 39

క. నావారలు కొందఱు తత్, పావనచరితునకుఁ బ్రీతిపాత్రమ్ము లతం
డావారిదెసం గల తన, భావంబు లిఖించి యిడుట పరిపాటి యగున్. 40

ఆ. నల్లవారు గలరు నాచెంతఁ గొందఱు, తెల్లవారుఁ గలరు తెల్వి నేర్చి
యెల్లవారియందు నీయమ కగ్రిమ, స్థానమిచ్చె మాన్యతముఁ డతండు. 41

క. ఈదృశధైర్యం బీదృశ, వైదుష్యం బీదృశ ప్రవర్తనశౌచం
బీదృశవితరణ మెందఱు, కో దక్కదటంచుఁ బత్ర మొసఁగెన్ బొసఁగన్. 42



# 13 ఇండియన్ ఒపినియన్

గీ. భారతీయాశయం బనుపేర నపుడు, పత్రిక యొకండు వెల్వరింపఁగఁ దలంచి
మత్సహాయత నర్థించె మదనజిత్తు, మంచిపని యౌట నే సమ్మతించినాఁడ. 1

వ. ఇయ్యది పందొమ్మిదివందల నాల్గవయేఁట వారపత్రికగా నవతరించి నేఁటికిం గలదు – మనసుఖలాలనాజరు దీని కాదిమసంపాదకుఁడు – కాని ప్రధానమైన భారము నాతలయంద నిలిచె – నాజరు సమర్థుండ నాఁదగుం – గాని యాఫ్రికాకుఁ జెందిన చిక్కుసమస్యలు నాపాలుసేయువాఁడు – నావివేకశీలతపై నతని కతివేలంబగు విశ్వాస మొదపె – మొదట నిది హిందీ ద్రావిడ ఘూర్జ రాంగ్ల భాషలం బ్రకటిత మగుచుండెఁ – గాని ముందటిరెండు బాస లక్కఱలేదని కొన్నాళ్ళకు వాన నుజ్జగించితి – నీపత్రికకు నాచెంతఁ గలవిత్తంబు చాలవట్టు వెచ్చపెట్టవలసివచ్చెఁ – బ్రారబ్ధార్థము విడువంజనదుకదా – మఱియు నట్లు కావించుట భారతీయులకు లజ్జాకారణంబు నగు–నర్థంబురాకడకుం దీని నొకసాధనమ్మును గావించుబుద్ధి నా కావంతయేని లేద – యీబిడ్డకై కష్టనష్టమ్ములు మిక్కుటమ్ముగా సైరించితిఁ – గాని యిది దక్షిణాఫ్రికా భారతీయుల కొనర్చినయుపకృతి కడుంగడు దొడ్డది యని యీనాఁడు భావింతు – సంపాదకస్థానమునం దేను లేకున్ననేమి? పత్రికాహృదయమ్మున కేన బాధ్యుండనని యెల్లజాతులవారుం దలపోసిరి – వెండియు 2

ఆ. ఎన్నినా ళ్లది నాచేత నున్నదయ్యె, నన్నినా ళ్ళిందు నొదవు నయ్యాయిమార్పు
లస్మదీయాశయంబుల నవతరించు, సకలపరిణామములకు సూచకము లందు. 3

సీ. ఈనాఁడు యంగిండియా నవజీవన, పత్రిక లెట్లు నాబ్రతుకులోని
కతిపయాంశమ్ములు కఱపు నానాఁ డిది, యట్ల యేర్పడె నస్మ దాత్మశక్తి
నెంతయు వెచ్చించి యెల్లసంచికయందు, సత్యాగ్రహమ్మును జాటఁగంటి
వేగిరపాటునం దోఁగక మెఱమెచ్చు, లత్యుక్తు లొల్లక నిత్యదీక్ష

గీ. వదసి ప్రేంకనిపల్కు లే వాడి దీని, కిచ్చువ్రాఁతలు కూర్చితి నిదియ నన్ను
నెఱుఁగఁ గోరెడివారి కాదరువు నాదు, సంయమవ్రత శిక్షణస్థాన మయ్యె. 4

ఆ. ఇందు భాష్యకారు లెంతపెనంగిన, నెత్తిచూపఁదగిన దేమిదొరకు
నాఁగియాఁగి కలము నాడింపవలసిన, బెడఁద కనిశ మగ్గపడిరి వారు. 5

గీ. చదువరుల్ శాంతిసమరంపుజాడ లరయ, నాఫ్రికాభారతీయవృత్తాంత మెఱుఁగ
నెదురుచూతురు దీనికై యెల్లవార, మిదియ లేకున్నఁ దద్రణం బెట్లుసాగు. 6

వ. దీనిసాయమ్మునఁ బారక సంపాదకులనడుమ నచ్చమైనపొత్తు నేర్పఱుప నాసపడితిఁ - గానఁ జదువరులు తమసంశయాదులు నాకు వ్రాయుచుందువారు - జెడిదంబు లింపితంబు లగు నీకమ్మలనెల్లఁ జదివి నిగ్గుదేర్చి మాఱుపల్కులు ప్రచురించుట నాపాలింటి కొకచదు వయ్యె - దీనంజేసి సంపాదకుని బాధ్యత యెట్టిదో నాయెఱుకువకు వచ్చె - నింతియ కాక నాకు భారతదేశీయులం దెనలేని గౌరవంబు లభించె - నిది రానున్న సత్యాగ్రహసమర మెల్లభంగుల రాణింపఁ గారణం బయ్యె - దీనికిం దొడఁగినవెనువెంటన 7

క. సేవాభావముతోడన, కావింపన్వలయుఁ బత్రికాచాలన మన్
భావం బొదవె నెదురు లే, దీవార్త కనంతశక్తి యిదియగు; నైనన్. 8

ఆ. కట్టలేనియేరు గ్రామమ్ములం దోఁచి, చేను చెట్టు పాడుసేయుకరణి
నడ్డులేనివ్రాఁత లవి సత్యముం గూల్చుఁ, గాన నిల్పవలయుఁ గలమునకును. 9

క. అనిగ్రహంబు బాహిర, మైన నిలుపులేమికంటె హానిఁ గదించున్
గాన జగద్ధిత మెంచెద, రే నాంతరనిగ్రహంబు నేలఁగవలయున్. 10

మం. ఈచర్చలో దోష మింత లేకున్న, మహి నెన్నిపత్రికల్ మనుఁ జావులేక?
పనికిమాలినయట్టి పత్రిక నెవ్వఁ, డాఁకట్ట నుద్యుక్తుఁడగు? నిది గాక
యెవఁడు వాకొననేర్చు నిది రిత్తయైన, బాటలోఁ బయనించు పత్రిక యంచు?
మంచియుం జెడ్డయు మహిఁ బరస్పరము, నేకమై చరియించు టిది నిక్కువంబ
యిందు మేలగుదాని నెంచి కైకొనుట, మానవాళికి నుత్తమంబైన చేఁత. 11



## 14 కూలిగూడెమా? మాలగూడెమా?

ఆ. ఎల్లవారికంటె నెక్కుడుగా మంది, కూడిగం బొనర్చు నుత్తములను
మాలమాదిగలను మన మొనర్చితి మంట, రానివారిఁ జెప్పరానివారి. 1

క. మనవీధులలో వారల, యునికికి నంగీకరింప మూరికి వెలిగా
మనవలయును దత్సోదరు, లనుచుందుము మాలగూడె మని తత్పదమున్. 2

ఆ. మాలగూడె మన్నమాట పల్కుటకేని, యీసుపుట్టు మనకు నేవ పాదము
నేసుమతమువారియిల్లు యూరోపున, యూదు నిట్ల యణఁచి రొక్కనాఁడు. 3

క. ఇక్కరణిన్ మనహిందువు, లక్కట! నేటాలుసీమ నస్పృశ్యులుగా
లెక్కింపఁబడిరి కుడిచిరి, పెక్కులు బన్నములు పేరుపెంపులు సెడఁగన్. 4

ఆ. అచ్ఛశీలుఁడైన యాంఁడ్రూసునీగియు, శాస్త్రి మోహనాస్త్రశక్తి రేఁగి
యణఁపవెట్లు వీరి యస్పృశ్యతాపీడఁ, జేయవోటు వీరి శిష్టజనుల. 5

క. భగవత్కరుణకు మేమే, తగువార మటంచుఁ దలఁచి తక్కినప్రజలన్
దెగడిరి యూదులు వారల, జగనేరమ్మునకుఁ దగినశాస్తియ జరిగెన్. 6

గీ. ఆర్యులము సంస్కృతులమేమయనితలంచి, హైందవులుకొందఱాత్మీయులందొలంచి
మీ రనార్యులు ప్రాకృతుల్ మిమ్మునంటఁ, దగదు పొందనిలెందనితఱిమిరుఱిమి. 7

గీ. దక్షిణాఫ్రికా మున్నగుతావులందు, నేత దేనఃఫలంబు చిత్రాతిచిత్ర
సరణి వీరికి ముట్టె నెవ్వరికినైనఁ, గడవరానిది నాఁజెల్లుఁ గర్మఫలము. 8

క. ఇనుముం గూడినయనలము, పెనుసమ్మెటపోట్లు దిన్నవిధమున నంహః
ఖనులగు వీరలచెంగట, నునికిన్ బార్సీలు మలక లొందిరి శిక్షన్. 9

వ. పలుమాట లేల? - వీరివన్నెవారును వీరినేలవారును వీరియట్ల దక్షిణాఫ్రికా యందు నిర్భరావమానమ్ములం గుడువవలసివచ్చె - నీదేశమ్మున మనవారు కూలివాంఁడ్రు నాఁ బడుదురు - మనగడ్డలోఁ గూలివాఁడన వెలకుఁ గష్టించువాఁడు - కాని యిచట నప్పదమున కంటరానివాఁ డనునర్థంబు రూఢమయ్యె - నాఫ్రికావారు వీరి నూరికి దవుదవ్వుల నుంతురు - వీరికాఁపురించుతావు కూలిగూడెము నాఁబడు - జొహాన్సుబర్గునందలి గూడెమ్మును భారతీయులు తొంబదితొమ్మిదేండ్లకు గుత్తగొనిరి - వీరి కిది పెద్దయిఱుకాట మాయె - నంతియకాక 10

ఆ. మఱుఁగుదొడ్లు నామమాత్రశుద్ధమ్ములు, దుర్గమంబు లచటఁ ద్రోవలెల్ల
వలసినన్ని దీపములులేవు లేవన్న, దిగులులేదు భారతీయులకును. 11

క. శౌచమెఱుంగరు నగర, శ్రీచారిమ మెఱుఁగ రేమిసెప్పెద వీరిన్
దోఁచునె వీరికొఱంతల, నాఁచెడితలపోఁత లచటియధికారులకున్. 12

గీ. విపినమున సౌధసృష్టి గావింతురేని, నేలలో రాజనాల్ పిండనేర్తురేని
వేఱ పొడచూపి తత్రత్యభారతీయ, చరిత మొప్పెడి దైశ్వర్యభరిత మగుచు. 13

క. తమగడ్డఁ బాసి పరరాష్ట్రమునకు నెగఁబ్రాఁకు నిందఱం జూడము వి
శ్వమునందు; లేమితాఁకునఁ, గుములుచు మనవారె యిరవుకొని రీకొలఁదిన్. 14

క. వాణిజ్యముకొఱ కన్య,క్షోణికిఁ జనుచుందు రొరులు క్షుద్వేదనచేఁ
ద్రాణంగోల్పడి మన మా, గాణమువా ర్వోదు రాష్ట్రికకుఁ గార్మకులై. **15**

క. చదు వింతరాదు వీరికి, వదలనిదైన్యంబు వీరివంతు దయాసం
పదఁ బంచి వీరి నేలెదు, చదురులు కావలయు నేఁడు సౌజన్యనిధుల్. **16**

క. ఈ కూలివాంద్రపిమ్మట, రూకలరుచి మరగి కొందఱు వణిగ్జను లా
క్ష్మాకుం జేరిరి తద్దయు, సైకమ్ముగ నుండు వీరిసంఖ్య గణింపన్. **17**

గీ. భారతీయులమౌఢ్యము బలిసి నగర, పాలకుల సైఁపరానియొప్పరిక మేచి
రోఁతగొల్పుచు గూడెంబు రోగములకుఁ, బుట్టినిల్లయ్యె నునికికి గిట్టదయ్యె. **18**

క. పురపాలకవర్గము సం, స్మరణమ్మున కించుకేని కడఁగక తమ త
ప్పరమరికలేక గూడెము, నఱకడ నిడి దానినణఁప నాలోచించెన్. **19**

క. శాసనసభయును సమ్మతి, చేసిన దిప్పనికి; నేమిసేయుద మింక నీ
దాసిననెవ్వగ నెవ్వగఁ, బాసెద మని కూలివాంద్రు పలుచందములన్. **20**

గీ. పలవరించునాఁడు పద మిడినాఁడ జొ,హాన్సుబర్గుపురమునందు నేను
జదురులెల్లఁ జూపి సైదోడులం దీర్చు, టొప్పునన్న కోర్కి యొదవె నాకు. **21**

వ. గూడెము నెత్తివేయుచో నివేశములపై స్వామ్యమున్న భారతీయుల కించుకప్రతిఫలం బొసఁగుట పాడి – దీని నిర్ణయింప నొకపంచాయతి యవతరించెఁ – బురపాలకసంఘమువా రిచ్చుసొ మ్మల్పమని గుత్తగాంద్రు విన్నవించుచో నిక్కూటమివారు తీర్పు సెప్పుదురు – దాని కుభయపక్షములుం గట్టువడియుంట వలయు – నభియోక్తలు జయింతురేని వారి వకీలునకు ముట్టవలసిన సుంకముం బ్రతివాదుల యొసంగవలయు – నభిగ్రహములు పెక్కింట గుత్తగాంద్రు నన్ను తమసభికుం జేసికొనిరి – యే నిప్పనిలో ధన మార్జింప నాసపడక యిందు వచ్చువిత్తమ్మున సగపాలు పేదలకువలయు మందుమాఁకులకు వెచ్చింతు నని పల్క నభియోగులుప్పొంగిరి – దరిదాపు దెబ్బదితగవులం దేను వాదించితి – నం దొకటిమాత్రమ రిత్తయయ్యెఁ – గాన నా కర్థమ్ము సాలవచ్చె – నిందుఁ బదాఱువందల పౌండ్లు పత్రికకై సమర్పించితి – నియ్యభియుక్తులు పెక్కురు బీహారు మున్నగు నుత్తరదేశ ములకు నాంధ్రద్రావిడాది దక్షిణనీవృత్తులకుం జెందినవారు – వీరు తొలుత నొదంబడిక కూలివాంద్రుగా వచ్చి పదంపడి స్వతంత్రులై భారతీయవణిక్కులవోలె నొకసంఘముం బ్రతిష్ఠించుకొని తన్మూలమునం దమయిడుమలఁ బాపుకొనసాగి–రిందుఁ బలువురు **22**

ఆ. మిన్ను మీఁదబడిన మృషవల్కు టేనాఁడు, నెఱుఁగ రత్యుదారు లిద్ధచరితు
లీసమాజమునకు నేలికయై రామ,సింహు లొప్పు నచ్ఛశీలమూర్తి. **23**

ఆ. అతనివెన్క నతనియంతటి గఱువయై, బదరి యలరు మధురభావపేటి
యిపుడు వీర లిద్ద తేగిరి దివికి నా, కపుదు తోడునిల్చి రద్రులట్లు. 24

క. బదరికిని నాకు నెయ్యము, ముదిరెను సత్యాగ్రహంపుమొన నిల్చె నతం
డెదబెదరు లేనివీరుఁడు, గద యీపురుషుండు సంఘకార్యముపట్లన్. 25

క. ఇతఁ డిట్టివారు నస్మద్ధితులగుటన్ భారతీయు లెందఱొ నాకున్
హితులైరి తమ్ముఁగుఱ్ఱని, గతిఁ జూచిరి వీరు నన్నుఁ గష్టసుఖాలన్. 26

వ. ఓపినంతవట్టు నేనుం గష్టకాలమ్ముల వీరిసేవించితి - నబ్దుల్లాసెట్టి నన్ను గాంధీ! యని సంబోధింపనొల్లక సాహె బనిన సహింపనని యెఱింగి తగుమాటకై రోసిరోసి భాయీ! యని పిలువం దొడఁగె - నాఫ్రికాయం దీపేర నాకు రూఢమయ్యె - వెండియు 27

క. మితిగడచి ముక్తులై యట, బ్రతికెదు కార్మకులు నన్ను భాయీ! యని పి
ల్చుతతిన్ బీయూషము నా, శ్రుతి నింపినయట్ల పరమసుఖము న్గనెదన్. 28



# 15 మహామారి-1

గీ. చట్టములుచేసి పాడికి బొట్టుచుట్టి, గూడెముం బాలకులు పట్టుకొనిరి గాని
తగినపెఱనేల చూపమి దానియంద, పేదలున్నారు కాశ్మల్యపీఠమందు. 1

వ. నాఁటికి న్నేఁటికి నంతర మొందు వాటిల్లె - మున్ను భారతీయు లీవాడపై స్వామ్యంబు గలవారు - కాని యీనాఁడు గుత్తగాండ్రు మాత్రమ - తొల్లి లోకమ్మునకు వెఱచియే నధికారు లీతావు నించుక శుద్ధమ్ముఁగా నుంచువారు - వీరి కాజంకుతో నిపు దేమిపని? - కాన నెల్లకసటులకుం దావలమై గూడెము కేవల నరకంబుగా మాఱె - నీముఱికికిం దోడు ప్రజాసంఖ్యయుం బెరిఁగె-హిందూస్థానమువా రిట్టికడగండ్లకు లోనై యున్నతతి 2

ఆ. బొబ్బతెగులుకంటెఁ బోటరియౌ నల్ల, మారి వచ్చిపడియె నూరిమీఁద
శ్వాసకోశవీధి సంధిల్లు నిది దీని, బారిఁ జిక్కి బైటఁబడుట యరిది. 3

క. బంగారు పండుగనులం, దుం గూలికి నవయువారిఁ దొడరిన దిది యా
యంగద కిరువదిముగ్గురు, లొంగిరి మనవారు దొరలలోపముకతనన్. 4

క. ఆయజమానుల సేవకు, లేయలజడి వడుదు రనిల మెట్టిది యంథ
స్తోయము లెట్టివి కుడిచెద, రో యని చూడరు పసింటి రోయుట తక్కన్. 5

క. మారికిఁ జిక్కినవా రా, దారుణరోగమ్ముతోడఁ దమకొంపలకుం
జేరి రపు డచ్చటం గల, వీరుం డల మదనజిత్తు వీరియవస్థల్. 6

క. కని కరఁగి 'గూడెమునకున్, వెనువెంటన రండు ఘోరవిపదంబుధిలో
మునిఁగిరి మనసోదరు'లని, పనిచెన్ నాకడకుఁ గమ్మ పరమాతురతన్. 7

ఆ. అచట నిర్మనుష్యమగు నొకయింటిలో, శమ్ము ప్రక్కలించి య మ్మగండు
తెగులుగొంట్ల నెల్లఁ దెచ్చి తద్భవనమ్ముఁ, జేర్చి వారివెఱపు దీర్చుచుండె. 8

గీ. ఏను ద్రొక్కుడుబండిపై నెక్కి యపుడ, గూడెమున కేగి దురవస్థ మూడుకతన
నెలవుసొచ్చితి మన్యథా తలఁపఁబోకుఁ, దనుచు నధికారులకు లేఖ మంపినాఁడ. 9

ఆ. ఘనతగన్న వెజ్జు గాడ్రే మహాశయుఁ, డడిగినంత సాయపడఁగ వచ్చె
నతనికరుణ కస్మదాత్మ ముగ్ధంబాయెఁ, గాని తీఱదయ్యెఁ గర్జమెల్ల. 10

క. ఇరువదిముప్వురు రుగ్ణుల, పరిచర్యలు మూపు రెట్లుభరియింతు రెదన్
గరగరికయున్నఁ దామై, దొరకరె సేవకులు వెతలఁ దోఁగినవేళన్. 11

వ. అపుడు నాకార్యాలంబునఁ గల్యాణదాసును, మాణిక్యలాలును, దేశాయియు, విస్మృతనాముఁ
డగు వేఱొక్కయువయుం బనిసేయుచుండిరి – వీరు నాలేకరులో బిడ్డలో నిర్ణయింపనేర
– నాచెప్పినపని సేఁత వీరికిఁ బండువుగా నుండుఁ – బరోపకారప్రవణు లిట్టివార
లెందఱో యుండరు – వీరి నందఱ నీజన్మమున వేల్వఁ దలంచి కర్తవ్యముం దేటతెల్ల
గావించి యేమందు రన 12

క. ఆమిత్రులు మీతోడన, మేముం బయనింతు మంచు మితహితశబ్ద
శ్రీ మీఱఁ బల్కినంతన, నామది పర్వాంబురాశినా నుబ్బితిలెన్. 13

క. నాతో నుఱుకుట కింతయు, నాతంకములేదు రిచ్చి; క్రైనఁ గుటుంబం
బాతనిది పెద్దదౌటను, జేతం బీకొనదు వానిసేవలు వదయన్. 14

క. అగుటన్ బైతోడుగఁ దత్, సుగుణాకరు నిల్పి రుగ్ణసోదరసేవన్
దిగితిమి తన్నిశ యంతయు, జగవెఱపు గదించి మమ్ముఁ జకితులఁ జేసెన్. 15

ఆ. పెక్కురోగములకుఁ జిక్కినవారి కే, నూడె మాచరించినాఁడఁ గాని
నల్లమారిబారి కొల్లఁబోయినవారి, దాసి చూచి సేవచేసియెఱుఁగ. 16

సీ. వెజ్జు గాడ్రే ధర్మవీరుఁడై నిల్చి మా, వెఱపు దవ్వగఁజోపఁ గఱకుదేఱి
మందిచ్చి యోదార్చి మధురాంబువులు క్రోల్చి, మైలం దొలఁచి దీనమానవులకు
నుపచర్య సలిపితి ముడివోనితెగువమై, లేకరుల్ బ్రదుకన్న లెక్కసేయ
కార్తుల సేవించు టది సూడ నెల్లలం, గడచినయాపోక వొడమె నాకు
ఆ. మదనజిత్తు వైద్యమణియును లెస్స క,ష్టించి రెట్టులో గతించె రేయి
ధార్మికంబు కృపకుఁ దానక మిగ్గాథ, వేద్మదీఱ ముందు విస్తరింతు. 17



# 16 మహామారి–2

ఆ. గీము నాక్రమించి సేమమ్ము నరసెడి, దిక్కులేక వగచు తెగులుగొంట్ల
కాశ్రయమ్ముఁజేసి విశ్రాంతియెఱుఁగని, సేవచేయుమమ్ముఁ జిత్తగించి. 1

క. నగరాధికారి మాకుం, దగుమన్ననమైఁ గృతజ్ఞతం బ్రకటించెన్
నెగులిది పోకాలుటకు వీ, లగుసాయ మొనర్తు మనుచు నంపెను గమ్మన్. 2

సీ. పనిలేనిగిడ్డంగులను జూపె నార్తు లం, దుంట కీకొనె వారి కుపకరించు
సారాయితోఁ బరిచారిక నొక్కర్తుఁ, బుచ్చె నయ్యిరవులబూఁజు దులిపి
యటనట మంచమ్ము లార్జించి రోగుల, నందుఁజేర్చితి మొకయాసుపత్రి
వెలయించితిమి బాధితులకొల్వు గావింప, వచ్చినయమ్మకు వలసినంత
ఆ. గుండెబలిమి కలదు గొప్పతనం బెంత, యేని గలదు కాని యీమె రుగ్ను
ముట్టుకొన్న నెట్టిచెట్టకుఁ జిక్కునో, యెవ్వఁ డెఱుఁగు నంచు నేమ జంకి. 3

ఆ. వలదు వల దటంచు వారించితిమి రోగి, సరస కీపెకాలు సాఁగనీక
మద్య మిందు మాటిమాటి కార్తుల కని, హితవుసెప్పె మాకు నివ్వెలంది. 4

క. మీరుం గొంచక యించుక, సారాయిని బుచ్చుకొంట సాగించినచో
దారుణరోగం బిది కదు, దూరంబగు నంచుఁ గరుణతోడం బలికెన్. 5

క. మాయెదుటన పల్మఱు మై, రేయమ్మును గ్రోలె నబల రేయుం బవలున్
ఆయమ్మ యెంతకఱపిన, మాయుల్లము మెచ్చదయ్యె మదిరాసవమున్. 6

క. రోగులకైనను మధువుం, ద్రాగిన మేలొదవునంచుఁ దలఁపను జ్వరితుల్
మూగురు దీనిం దాఁకక, యాఁగిరి నాయాశయమ్ము ననుమతిసేఁతన్. 7

ఆ. వెజ్జునిచ్చ వడసి వీరికి మృత్తికా, వైద్యఫక్కి పఱపువాఁడ నైతి
నిందునిలిచి రిద్ద ఱిఁక నెల్లరు న్విధి, చేతఁ బడిరి మారివాతఁ బడిరి. 8

క. అడరెడు నిట్టూర్పులతో, విడిచితి మీసేవ; నైజవీరవిహారం
బుడుఁగక మారి పురమ్మును, వడఁకింపఁదొడంగె వివృతవక్త్రముతోడన్. 9

క. పురపాలకసంఘమునకుఁ, ద్వరయేర్పడె నపుడు రోగివర్గమ్మున క
ప్పురి కొకయామడదవ్వున, విరచించె గుడారు లెల్లవెరవులు రోసెన్. 10

గీ. ఆర్తులం గొల్వవచ్చి మా యాఁకఁజేసి, కెళవుగా నున్నమెలఁత కగ్గేయచరిత
కకట! యీవేఁకి సోఁకి తత్ప్రాణములను, దీసెనని వింటి నెంతేని దిగులుగంటి. 11

క. మారోగు లిద్ద ఱివ్విధిఁ, దేఱిరి మమ్మేల మారితినదయ్యె నహో!
యే రీమార్పునకుం గల, కారణ మిది యంచు నొడువఁగలవారు మహిన్. 12

క. ఇత్తతి మృత్స్నావైద్యం, బుత్తమయోగం బటన్న యూహము బలిసెన్
రిత్తగద మదిర దుర్థీ, మత్త గదా రోగి కదియు మందని వెజ్జుల్. 13

క. నుదువుట యనుబుద్ధియు నా, కదరినయది కాని వీనియౌగాములపై
వెడలెదు నా తీర్మానము, పడసెడిగౌరవ మదెంత భావనసేయన్. 14

క. ఐనన్ నాయీనమ్మిక, లీనాఁడే నట్లయుంట నిర్విషయంబున్
మానక పల్కితి నిచ్చట, ధీనిధు లున్నారు దీనితీ రిది నాఁగన్. 15

క. ఏ నీ తెగులు బటాబయ, లైనంతన వీటినేలు నధికారుల వే
రూనిన యౌదాసీన్యమ, దీనికిఁ గతమంచుఁ గటికుదేలిన భ్రాంతల్. 16

క. పత్రికలో నింపితి సుచ, రిత్రుఁడు పోలక్కు గుణగరిష్ఠుఁడు దోకున్
మిత్రులుగనైరి నా కీ, చిత్రణముం జదివి పెద్దచేసిరి నన్నున్. 17

ఆ. ఆకుఁదిండి వలచు నాల్బర్టువెస్టుతో, నన్నశాల నాకు నమరెఁ జెలిమి
చదివె నతఁడు మారిసంకటపాటుపై, నేనువ్రాసినట్టి దెల్ల నపుడు. 18

క. భోజనవేళల నాతఁడు, నాజాడం గానలేక నాకును ఘోరం
బీజబ్బు సోఁకెనో యని, తేజం గోల్పడియెఁ బెద్దదిగులునఁ బడియెన్. 19

క. ఆదుర్దినముల నేనున్, నాదగునెచ్చెలులుఁ గడుపునకు నల్పముగా
నోదన మొసఁగితి ముదరము, తాఁ దేలికయైనఁ దెగులు తలకొన దనుచున్. 20

ఆ. మానినాఁడ నేను మాపటితిండి నీ, చెట్టతెగులు నన్నుఁ బట్టివచ్చి
పెటిల నేఁచు నన్నవెఱపున నొద్ద రా,కదకు ముందు పగటి కుడుపు గొంటి. 21

క. ననుఁజూడక తహతహపడు, ననుఁగుంజెలి వెస్టు భోజనాగారమునం
దన గదితలుపుం దట్టుడుఁ, దినుటన్ ముగియించి వచ్చితిని వాకిటికిన్. 22

ఆ. నన్నుఁజూచి యతఁడు మిన్నంది నెచ్చెలీ!, యిటకు నీవురామి నేమిపుట్టె
యెట్టులైతొ యన్న కట్టారటంబునఁ, దోఁగియుంటి నెదియుఁ దోఁపకుంటి. 23

క. నీమేలుగంటిఁ దనిసితి, నేమింపఁగదయ్య నన్ను నీపనియం దే
నేమాత్రయు వెనుకాడ మ,హామారికిఁ జిక్కిసుక్కు నార్తులఁ గొలువన్. 24

క. ఒద్దులను సాఁకవలసిన, జ ద్దింతయు లేనివాఁడ శంకింపకు మే
యొద్దైననేమి నా కని, దొడ్డతనం బది వెలార్పఁ దుష్టింగంటిన్. 25

ఆ. అంత వెస్టుఁ జూచి యన్నా! సపర్యకు, నిన్నుఁ గోర; నిప్పు డున్నకష్టి
యొందు రెండునాళ్ళ కుదుగును గాని నీ,సాయ మొకటి వలతుఁ జనవునెంచి. 26

ఆ. మదనజిత్తు నేఁడు మారికిదాసులై, వగచువారికొల్వు దగిలినాఁడు
లాఁతిపనుల నిప్పు డాతఁడు సాగింప, వీలుపొసఁగ దంచు విశ్వసించు. 27

క. కానన్ దర్భనునకుఁ జని, పూనుము పత్రికను; నీవపో! తగుభంగిన్
దాని వెలార్పఁగలాఁడవు, దీనికి నీకొన్న దిగులుదీఱును నాకున్. 28

వ. అనుటయు నితండు మిత్రమా నా కొకయచ్చుఁగూట మింట నీ వెఱుంగుదువు - కాని వీలుచేసికొని నీపల్కు పాటింపఁ దలఁచితి - మాపటికి నానిర్ణయంబు నీకు నివేదింతు - నావుడు నట్లకాని మ్మని యేనంటి - నావల నాఁటిసాయంసమయము వాహ్యాళియం దయ్యాయి ముచ్చట లైనపదంపడి వెస్టు దర్భనువోవ నిశ్చయించితి నని తెల్ప నే నుప్పొంగి పదిపొండుల వేతనంబును వచ్చునాయంబునఁ గొంతభాగమ్మును గైకొమ్మని మిత్రుం గోరితి-నితని కర్థంబు ప్రధానముగాదు-ప్రజాసేవయ వీనిపరమలక్ష్యంబు-కానఁ దనకు 29

క. రావలసినవిత్తము తా, నీవలసినసొమ్ములెక్క లిచ్చెను నాకున్
వేవేగ బండినెక్కెను, నావలపుం దీర్చి ప్రేఁకనం దొలఁగించెన్. 30

క. నాటంగొలె వె స్టే నా, నేటాలుం బాయువట్టు నెయ్యముగురిసెన్
మేటి యితం డెంతయు నా, రాటపడెన్ నాదు జయపరంపరఁ జూడన్. 31

ఆ. ఇంగలాండుగడ్డ నిమ్మేటి 'లౌ'తను, పల్లెటూర నామతిల్లినాఁడు
శైశవంబునందుఁ జప్పచప్పనివిద్య, గఱచినాఁడు పేదకాఁపువాఁడు. 32

క. అనుభూతికతన ధిషణా, ఖని యయ్యెఁ బవిత్రుఁడయ్యె గడుసరి యయ్యెన్
ఘనతర సంయమదీక్షా, వనుఁడయ్యె న్వశ్యుఁడయ్యె భగవానునకున్. 33

క. పెఱలకు మేల్ సేఁతకు ని, గ్గఱువ కదున్ నొచ్చు; వచ్చుఘట్టములం దీ
పురుషుని వీనికుటుంబము, తెఱఁగెల్లను జెప్పి యప్పుదీఱుచుకొందున్. 34



# 17 గూడెము కాల్చుట

గీ. చెలులకున్ నాకు రుగ్ణసంసేవవలని, విడుగర లభించినది గాని వీటిలోన
కదరి యల్లటపెట్టు దయ్యంపుఁబనులు, తీఱవయ్యెను దన్మహామారిపనులు. 1

ఆ. గూడె మున్నవలను వీ దేలుపెద్దలు, కనరు వినరు నిజమ కాని తెల్ల
వారివాడపట్ల నోరంతప్రొద్దు జా, గర్యసూపుచంద్రు కస్తియనక. 2

ఆ. తెల్లదాలువారి యెల్లగృహమ్ములు, మారిబారిఁ బడక మనుటపొంటె
వెచ్చమెంతయైన వీఁగక విత్తంబు, నుప్పునీటివోలె గుప్పిరపుడు. 3

గీ. భారతీయులప్రాణమ్ము వార లెంత, చుల్కఁజేసిన నది మనస్సునకుఁ దేక
యాఁగిలేయులభద్రమ్ము నాసచేసి, యధికృతుల్ దయ్యుచుంట కొండాడినాఁడ. 4

క. కొండాటతోన యాఁగక, నిందన్ బురపాలకులకు నేఁ దోడ్పడితిన్
మొండిన యగుచో వా రీ, గండంబును దప్పుకొంట కట్టరిది యగున్. 5

గీ. కొట్టి తిట్టి తుపాకులు బిట్టుప్రేల్చి, యెల్ల రక్కసచేఁతల నిచ్చగింపఁ
దగినదురవస్థ వీరికి దాపరించి, యుండు నాసాయ మింత లేకున్ననాఁడు. 6

క. నిజవాంఛా పరిపూర్తికిఁ, గుజనత కెద్దానికేని గొంకరు వీ రీ
గజిబిజిలోనం బడకయ, విజయమ్మును గంట నెలమి విరిసెన్ దనకున్. 7

క. ఆవేళ నల్లవారల, త్రోవకు నధికారి పెల్లు తుష్టించబడసెన్
గావలసినపను లన్నియు, నావల సుకరంబు లయ్యె ననిరుద్ధములై. 8

క. నగరాధికృతులు పల్కిన, పగిదిన్ హైందవుల దిద్ద బాములువడితిన్
దగుతగములు సెప్పక నా, వగ నూఁది తెగించి వెంటవచ్చిరి వారున్. 9

గీ. అంటురోగంపునెల విది యౌట నిచటి, మనుజు లటునిటుఁ గదలరాదని విధించి
వారిగూడెమ్మునకు నాల్గువలఁకులందుఁ, గాపువెట్టిరి పాలకుల్ కఱకుబంట్ల. 10

గీ. రాకపోకలు జరుపఁగా నాకు నస్మ,దీయులగు మిత్రులకును జీటీయొసంగి
రితరులగు భారతీయు లయ్యిరవునంద, నిలవలెం జెఱసాలలో నిలిచినట్లు. 11

గీ. దాని కైదాఱుక్రోసుల దవ్వునందుఁ, గ్రొత్తగూడెంబు గట్టి యాకూలివాంద్ర
కాదరువుచేసి యవ్వల నగ్గిపెట్టఁ, దలఁచి రధికారు లప్పురానిలయవీధి. 12

ఆ. క్రొత్తయూరు గట్టి కూటికి నీటికిఁ, జాలువసతు లెల్ల సంతరింప
నవధి కొంతవలయు నందాఁక గూడెము, వారు తిరుగరాదు మేరదప్పి. 13

క. బెదిదములగు నిమ్మార్పులు, పొగడని కార్మికులు తెల్లఁబోయిరి వెఱపుం
గుడిచిరి కాని ననుంగని, వదసిరి ధైర్యం బొకింత వదలిరి చింతన్. 14

క. అందుం బెక్కురు లేమికి, విందులు కష్టార్జితమ్మువిత్తము తత్త
న్మందిరములఁ బూడ్చిరి యిపు, డెందున్ దాఁచెదరు వార లీప్రాణమ్మున్. 15

వ. వాణిజ్యకోశ మన్నపల్కోని వా రెఱుంగరు - కాన నన్నునమ్మి తమసొమ్మెల్లఁ దెచ్చి నాయింటఁ గుప్పకుప్పలుగాఁ గ్రుమ్మరించిరి - పదంపడి యఱువదివేల పౌండులకుం జాలినతద్ధనంబు నచటి యడితిబొక్కసమం దేను భద్రపఱిచి వారికి వలయుధైర్యంబు నొదవించితి - నంతలోఁ గ్రొత్తగూడెమ్ము సంపూర్తియగుట న్నగరపాలకులు భారతీయుల నెల్లరం బ్రత్యేకధూమ

శకటంబునం గొనిపోయి దానం గుదురుకొనంజేసి వారికి వలయు సౌకర్యంబు లేర్పఱుపం బూనిరి - యేనెల్లనాఁ డప్పొలెమున కేగి సోదరులయోగక్షేమంబు నరయం దొడఁగితి - మొట్టమొదట నిక్కాఁపురంబు వీరికేమాత్రయు నింపదయ్యెఁ - గాని మఱునాఁటికి మిగుల రుచియించెఁ - బరిపూతవాతమ్మునం దోఁగి ముయ్యేదునా ళ్లంట వీరియారోగ్యమున్ బలిసెఁ - గావుటంజేసి 16

క. ఆటల నాడుచుఁ దీయని, పాటలు పాడుచును రామభజనమ్ములకుం
గూటువకట్టుచు వీరలు, పూఁటన్ నిముసంబునట్ల పుచ్చుట కంటిన్. 17

ఆ. కూలివాండ్రఁ గ్రొత్తగూడెమ్మునకుఁ జేర్చి, ప్రాఁతగూడె మగ్గిపాలుచేసి
సంతత వ్యయప్రయాసమ్ము లోర్చి త, న్నగరిజకుకు మాన్పినారు దొరలు. 18



# 18 ఒక రచన మహిమ

ఆ. తెల్లవారిచెలిమి, దీనతానిష్ఫుయౌ, భారతీయసమితిఁ బలుకువిలువ,
న్యాయవాదభరము, నైతికజాగర్య, నాకు నెచ్చె మారిరాకఁజేసి. 1

ఆ. అపుడు వెస్టువోలె నిపుడు పోలక్కు నా, చెలిమి వలచెఁ దిండినెలవునందుఁ
గల్ల కవుడు లేనియుల్ల మాబిడ్డసొ, మ్మగుట నతఁడు నన్నుఁ దిగిచివైచె. 2

వ. అతండు నాయారగించుబల్లకు దవ్వగా వేఱొండుబల్లపై మెసవుచు నాతోడ సంభాషింపఁ దలఁచి మున్ముందు చీటినంపి వెనువెంటన సమ్మతివడసి నన్నుంగదిసి 'క్రిటి'క్కను పత్రిక కే నుపసంపాదకత్వం బూనినవాఁడ - మీరు మహామారిస్థితిచి వెలువరించిన లేఖం గాంచి మీసందర్శన మెపు దబ్బునా యని యువ్విళ్ళూరుచున్నాఁడ - నేఁడు నాపాలింటి సుదినంబు - నా నతని నావానిం జేసికొంటి - నాఁటిరేయంద మా కన్యోన్యసౌహృద మావిర్భవించె - మఱియు 3

క. అతఁ డాడంబర మొల్లఁడు, మతి కెయ్యదినచ్చు దాని మానకసేయున్
బ్రతుకుంబాటలలో మా, కితరేతరమైత్రి యుంట యెఱుఁగంగంటిన్. 4

క. ఒక్కత్రుటిం దనమనుగడఁ, బెక్కులు మార్పులకు లోఁచె బెదరక; యే యే
యిక్కట్లు మూఁగినం దన, త్రొక్కినమార్గంబు విడక దుర్జయుఁ డయ్యెన్. 5

క. పోలక్కుతోడినెయ్యము, పోలన్ వికసించువేళఁ బూతచరిత్ర
శ్రీలలితుం దగు వె స్టీ, లీలన్ నాపాలి కొక్కలేకం బనిచెన్. 6

మం. అవధారు! పత్రికావ్యవసాయ మరయ, నీవు సెప్పినలాభ మిచ్చో హుళక్కి
మిగులు లేమియ కాక మిత్రమా చేయి, తగులునో యనుశంక తలచూపుచుండె
బాకీలు బండ్లకుబండ్లుగాఁ గలవు, లెక్కలు సూటిగాలేవు వానికిని
ముక్కు మొగము లేక ముదిరినచిక్కు, విడదీయవలె నేఁడు వేసటనాక
యీకమ్మ గని ధైర్య మింకిపోనీకు, నాశక్తికొలఁది నంతయుఁ జక్కఁబఱుతు
నూహించినట్టిమే లొదవమి కోడి, చేపట్టి మన్నించుచేఁత వోనాడ. 7

వ. ఇది నష్టిం గూర్చుపనియని తెలినంతన వెస్టు దానిం ద్రోయవచ్చు - నపు డే నతనివెక్కిరింపఁ జాలఁ - బైపెచ్చు కలరూ పెఱుంగక వాని కాసకొల్పి యేనదోషినైతి - నానాఁడు మదనజిత్తు మాట నమ్మి యింతసెడితి - వెస్టు నాచెంత నెన్నఁడుం దీనిఁ దడవఁడ - కాని యొరు లాడినదెల్ల విశ్వసించువేఁదుఱు నాసొత్తని నిర్ణయించుకొని యుండు - దేశారాధకుఁ డెల్లయంశంబును దానై పరికింపవలయు - సత్యసేవకుఁ డావంతయే నేమఱిల్లం జనదు - మూలముట్టుగాఁ దన యెఱుంగనిదాని నమ్మఁడా! యని పరులకుం జెప్పుట యన సత్యంబున కొకమచ్చ తెచ్చుకొంటయ - మఱియు 8

గీ. ఇంతనేర్చియు నపుడప్పు డితరులాడు, పలుకులన్ నమ్మి దూఁకు నాప్రకృతి నోర్చి
తీర్చుకొనలేని వెఱ్ఱినై దెసలుసూచు, వాఁడ నని విన్నవింతు నెవ్వగకు లోఁగి. 9

గీ. తలకు మించినవ్రేఁగు కావలయు నన్ను, లోభమే హేతు వందు నీలోపమునకు
నకట! పేరాస నన్ను బిట్టడఁచివైచె, మిత్రు లీసేగిలో నన్ను మించినారు. 10

ఆ. ఇంకఁ బ్రకృతమునకు నేతెంతు నెచ్చెలి, వెస్టు పంపులేఖ విప్పిచదివి
నిలువ మనసువోక నేటాలుబండికి, నపుడ పయనమైతి నచటువాసి. 11

ఆ. రైలుదనుక వచ్చి పోలక్కు ముచ్చట, లవియు నివియుఁ బూర్తియైనపిదప
నర్థి నొసఁగె నాకు "అన్‌టుదిలాస్టు" నాఁ, దనరుకృతిని మేలితరముదాని. 12

క. సుచరిత్రుఁడైన రస్కిను, రచించె నిద్దాని విసువురానీక కదున్
రుచియించు మీకు నిది యని, వచించె నపు డతఁడు వినయవాసత్ఫణితిన్. 13

ఆ. కదలె రైలు పుస్తకమ్మును దెఱచితి, మూయఁజాలనైతి ముగియువఱకు
నెల్లనుడియు నాదునుల్లంబు నువ్వెత్తు, కొల్లగొనియె నిదురచెల్ల దనియె. 14

క. ఏమెయిఁ బల్కెను రస్కిను, నామనుగడనెల్ల నట్ల నడిపించుటకున్
నేమంబు చేసికొంటిని, సామాన్యముగాని ధర్మసరణిం బడితిన్. 15

క. కనియెఱుఁగ న్నే నింతకు, మును రస్కినుకృతులు; బాల్యమునఁ బాఠ్యముగా
నునిచినగద్యము పద్యము, వినా చదువనైతి వేఱువేఱగు రచనల్. 16

ఆ. కడఁగి కర్మభూమి నడుగిడ్డపిమ్మట, నిట్టిపనికి విరతి పుట్టదాయె
నగుటఁజేసి నాకు నబ్బినపుస్తక, జ్ఞాన మల్పమనుట సముచితంబు. **17**

క. శ్రమపడమినొండె ననివా, ర్యము లితరోద్యమము లడ్డమైయొండెను నా
కమరిన యీ లోపంబున, సమకూడినచెట్ట లేమి సత్యమ లవమున్. **18**

క. చదివినముక్కలు నాల్గును, హృదయమ్మున కదికిపోయె నీ కొంచెములో
బ్రదుకుం బ్రన్నగ దిద్దిన, యది రస్కినువాణి యొకఁడ యని వ్రాక్రుత్తున్. **19**

క. ఈ రస్కినుకృతిపైఁ గల, కూరిమి పెల్లగుట దీని గుజ్జరిబాసన్
దీరిచి సర్వోదయ మను, పేరిడి వెల్వఱిచి తనివిఁబెంచితి నాత్మన్. **20**

గీ. ఏ పదార్థము లుండు నాయెడఁద డాఁగి, వానిప్రతిమలె రస్కినువాణిఁ గంటిఁ
గాన నిదినన్ను నేలుకోఁగల్గెఁ దనకు, నిచ్చయగుబాట నడుగువేయించితీరె. **21**

గీ. అంతరమ్ములు సుప్తమ్ములైన మనుజ, భావనల మేలుకొల్పెడిచేవ యెవని
వాకునకు వశ్యమైయుండు వాఁడె జగతి, వన్నెకెక్కును గవిశబ్దవాచ్యుఁ డగుచు. **22**

ఆ. ఎల్లవారితలఁపు లేకపథ మ్మ్మాఁది, యుంట కల్లయగుట నొక్కభంగి
నెల్లకవులమహిమ మెల్లరపైఁ బని, సేయనోప దని వచింపనేర్తు. **23**

వ. రస్కిన్ సూచించు సర్వోదయసూత్రములం బరికింప నెల్లరలగ్గునంద తనలగ్గిమిడియున్న
దనియు జీవికావిధాన మిరుగుర కొక్కరూప యగుట న్యాయవాదివృత్తికిని మంగిపనికిం
గల విలువ తుల్యంబ యనియుఁ గూలివానియు సేద్యగానియు జీవనంబు సత్యజీవన
మనియు నాబుద్ధికిం దోఁచె - నిందు మొదటిది నాయెఱుకువలోనిద - రెండవది కొంత
కొంత తేటపడెఁ - గాని తృతీయమ్ము నేఁటివట్టు నాబుద్ధికిం దగులదయ్యె - నిందు
రెండవ మూఁడవ సిద్ధాంతములు మొదటిదాన నణఁగియుంట సర్వోదయమువలనన
విదితంబగు - నిట్టి తలపోఁతలం బ్రుంగి జోహాన్సుబర్గునుండి యిర్వదినాల్గుగంటల
పయనమ్ము సల్పి నేటాలురాష్ట్రమునం గల దర్బనునగరమ్మునకు నిశాసమయంబునం
జేరి వఱువాత లేచుటతోడన **24**

క. ఈసూత్రమ్ములు మూఁటికి, దాసుఁడనై నాదుజీవితంబును దిద్దన్
జేసితిజతనము విజయ, శ్రీ సంధిలఁజేయుమని భజించితి నీశున్. **25**



# 19 ఫినిక్సు నిర్మాణము

ఆ. ఎట్లుతనియించె రస్కినుఋషి మదీయ, వర్తనంబెట్లుమార్చె నవ్వార్తలెల్లఁ
దెల్లవారినయంతన తెలిపినాఁడ, వెస్టునకుఁ దొట్టతొలుతఁ బావిత్ర్యఖనికి. 1

ఆ. పొలము నిచట గొంతవిలిచి యెల్లర మంద, నిలిచి కాఁపుదనము నిర్వహించి
యన్నవస్త్రములకు నక్కఱ యెంతయో, నంతధనము కొంట ననుమతించి. 2

గీ. తీఱుబడివేళలందుఁ బత్రికకు వలయు, సేవసల్పుచు నీదృక్షజీవనంబు
మరగియుంద మటంటి నిమ్మాటలెల్లఁ, దత్సఖునిబుద్ధి నురరీకృతంబు లయ్యె. 3

గీ. తెల్లవారలకును భారతీయులకును, బొట్టకున్ మూఁడుపౌండులు పట్టునంచు
నేర్పరించితి మంతర మింతలేక, యచ్చుపనివాండ్ర దెసయంద వచ్చెశంక. 4

క. తిండికి వలసినవెచ్చము, కొందురె వా; రట్టి దియ్యకొన్నను సుఖముల్!
పొందని తెగించి యటవీ, మండలమునఁ గాఁపురింప మతిసేయుదురా. 5

క. వేతనమును దగ్గించుట, కాతంకము దెల్పువార లద్దానిఁ బురా
రీతిన కొనఁదగు రస్కిను, వ్రాఁతలు పాటించి బ్రతుకవచ్చుం బిదపన్. 6

గీ. ఎట్టకేలకుఁ దేల్చితి మిట్లు; పిదపఁ, జెప్పితిం బనివాండ్ర కీచొప్పు నెల్ల
నెద్రిచి రిద్దఱుతక్కఁ దక్కెల్లవారు, వనికి వచ్చెదమని రచ్చుపనికినైన. 7

ఆ. మదనజిత్తుసైత మెదురాడె నిది దుర్వి, వేక మనియె నెల్ల వెచ్చపెట్టి
సలుపు నిట్టిచేఁత సాగదు పత్రిక, యడఁగు నచ్చుఁగూట ముడుగు ననియె. 8

వ. ఐన నుత్సాహంబు నుజ్జగింపక దర్బన్‌పురసమీపమున ధూమశకట ఘట్టమునకుం గడు
దాపున ఫినిక్సనుచోట వేయిపౌండులవిత్తమ్మున కెనుబది యెకరముల నేలంగొంటిమి –
దీనఁ గొన్నిఫలవృక్షంబులు నొకముసలికొంపయు నలంతినీటిబుగ్గయుం గలవు–రుస్తుంజీసా
హాసంగినరేకులు మున్నగు పరికరములతో బోయరు కయ్యంబున నా కనుచరులై శ్రమించిన
వడ్లవాంఢ్ర సాయమ్ముతో ముద్రణశాలాదులు నిర్మించి మంచముం గంచము నచటికిఁ
జేర్చి యందుఁ గాఁపువెట్టితిమి – యిది జనశూన్య మైనతావు – గడ్డియుం గాద మిందు
వలసినంత – సర్పాదులవలని భీతియుం దద్ద – యెట్లున్ననేమి గుండె ఱాయిచేసికొంటిమి
కదా – పదంపడి 9

ఆ. గడన కోరి యాఫ్రికాగడ్డ ద్రొక్కి వె, వ్వేఱువృత్తులందు వెలయువారి
నస్మదాప్తబంధు లగువారి నిందుఁ జొ,ప్పించుయత్న మాచరించినాఁడ. 10

క. కాసులు వలచెడివారలు, మాసంసారమ్మునందు మన; రైనను ధీ
రాసులు కొందఱు వచ్చిరి, యాసలపొంగెల్ల నడఁచి యాశ్రమమునకున్. 11

ఆ. వచ్చి మరలిపోనివారలలో మగన్, లాలుగాంధి నుదువఁజాలి నతఁడు
నాఁటినుండి యితఁడు నాబాటవిడువని, యోగి యయ్యె మేటిత్యాగి యయ్యె. 12

వ. మనీషా త్యాగ భక్తి వైభవమ్ములకతన నితండు నా యాంతరికప్రయోగమ్ముల పట్ల నాకుం బాసటయయ్యె – నస్మన్మూలబలంబులో మొట్టమొదటిపీఠమ్ము వీనిది – స్వయంశిక్షితులైన శిల్పులందుసైత మితఁ దద్వితీయుండు నాఁ దగు – నిట్లు వేయితొమ్మనూటనాల్గవయేట నీఫినిక్సు నిర్మిత మాయె – నంతరాయము లెన్నెన్ని ముట్టడించినం జెదరక బెదరక యీ సంస్థయుం బత్రికయు నేఁటిదనుక మనుచున్న యవి – కాని 13

క. ఇది నెలకొల్పినతఱి మా, కొదవినయిక్కట్లు పెక్కులున్నవి వానిన్
మదిమది నెఱుఁగందగు విని, చెద భావ్యంకమునఁ దద్విశేషములెల్లన్. 14



# 20 తొలురేయి

క. కలిగె ఫినిక్సునఁ బత్రిక, తొలిసంచిక వెలువరింప దుర్భరబాధల్
మెలఁకువ నా కుండనిచో, నిలిచెడి దది కొన్నినాళ్ళు నిస్పృహ నిడుచున్. 1

క. రైతులమై బ్రదికెదుతఱిఁ, జేతిపని న్నమ్ముకొంట శ్రేయంబని మ
చ్చేతస్సు చెప్పినను బె, క్కాతంకము లుంట నిడితి నచ్చోట మరన్. 2

గీ. దానికిం జేటు వొడమినతఱిని గర్జ, మాఁగకుండుటకై హస్తయంత్ర ముంట
వలయు మనకంచు వెస్టుతోఁబలుక నతఁడు, మంచిదని చేసియుంచెఁ గైమరయొకండు. 3

క. నూనెమర కుంటువడుచో, మానక పత్రికను జేతిమరఁ దీర్పవలెం
గానఁ దదీయాకృతిపరి,మాణము డించితిమి చిన్నమర కనువుపడన్. 4

ఆ. కన్నుమూఁత మాని పిన్నలు పెద్దలు, రేయి నాల్గుజాలు రేఁగి తగిన
మదత లేర్పరింప మఱునాఁడు పత్రిక, పోవుచుండు నెల్లభూములకును. 5

వ. కాని మొదటిరాత్రి విస్మరింపరానిది నాఁజనుఁ – గూర్పంతయు న్ముగిసి చట్టము యంత్రముం జేరినంతన యది కదలనని బిఱ్ఱబిగిసె – సమర్థు లెందఱు శ్రమించిన నేమి – యెల్లయు రిత్తకురిత్త యయ్యె – వెస్టు విన్నఁబోయిన మొగమ్ముతో నన్నుఁగదిసి యీవారపుసంచిక నిలిచినట్ల యని వెచ్చనూర్చి చదికిలం బడియె – నంత నేను 6

క. ఓ నెచ్చెలి! దిగు లేలా, కానందగు లాఁతివెరవు కట్టలయికతో
నీ నిర్మించిన చక్రము, తా నక్కఱ దీర్పఁజాలదా యిపు డనుడున్. 7

ఆ. అతఁడు కడిఁదికర్జ మది కైమరం ద్రిప్పఁ, జాలినంతమంది జనులు దొరక
రున్నవారు నల్గు రుక్కిరిబిక్కిరి, పనుల దస్సి మూలఁబడిరి చెడిరి. 8

వ. అని నైరాశ్యముం బ్రకటింప నేమీ యీ గుబ్బువెట్టు వర్ధకుల మేల్కొల్పి వీరి తోడ్పాటు నర్థింపఁజనదా - యీ మాత్రతోఁ జేతులు కడుగుకొన వచ్చునా - మనకర్తవ్యము నిశ్శేషము కాలేదని నాతలం - పని యేనంటి - నంత వెస్టు వద్రంగు లేమందురో వారికి నిద్రాభంగ మొనర్పఁగల తెగువ నాపాలఁ గానరాకున్నయది - యన 9

క. వల దది నాపని యంటిన్, గెలిచెద మటులైన నంచు నెచ్చెలి పలికెన్
బిలిచితిని వడ్లవాండ్రను, దెలిపితిఁ బత్రికకు నామతిల్లిన బెడఁదన్. 10

క. అపు డాయెల్లరు నయ్యా! యిపు డొదవనియేము నరుల మెట్లయ్యెద మీ
విపరీతస్థితిలో ని,ద్రపోదుమా లెక్కసేయఁ దగనిది పనియున్. 11

క. తురగమ్ములవలె నోడక, మరత్రిప్పెద మీరు దిగులు మానఁగవచ్చున్
బఱు పెక్కవచ్చు ననుడున్, దరిలేనిముదమ్ము వెస్టుధనమై విరిసెన్. 12

గీ. అచ్చువారలు వడ్లంగు లిచ్చుతోడఁ, బనికిసాగిరి పత్రికల్ బయలుమెఱసె
నపుడు సంతోషపారవశ్యమున వెస్టు, భక్తిగీతమ్ము లెలుఁగెత్తి పాడఁదొడఁగె. 13

క. బిరబిర వద్రంగులతో, మరత్రిప్పితి నేను రేయి మాటునఁబడె భా
స్కరుఁడుం దోఁచెను బనిలో, నరపా లది నిల్చి యున్నయది యిప్పటికిన్. 14

గీ. యంత్రచోదకు లేపుద మతఁడు పగటి, వెలుఁగులోఁబిల్వ జంత్రంబు పలుకునేమొ
పలికెనా మేరతప్పక పనిముగింప, నేర్తు మని వెస్టుతో వక్కణించినాఁడ. 15

గీ. అతఁడు చోదకుఁ బిల్చె నచ్చుతురుఁ డేగి, ముట్టెనో లేదొ యంత్రమ్ము బిట్టుకదలె
నేమిసెప్పెద ముద్రణధామమందు, నొక్కపెట్టున మొరసె హర్షోల్బణంబు. 16

ఆ. ఎందుదాఁగె రాత్రి యీబుద్ధి, యెందఱు, మొత్తుకొన్న బిగిసె మొద్దువోలె
వ్రేలు తగిలినంతనే లేచి మైసాఁచి, నంగనాచి యిపుడు నాట్యమాడు. 17

వ. యంత్రమున్నటిచి యెల్ల రిట్లాడసాగఁ జాలకుఁ దయ్యా! మిమ్ము నమ్మించుట నా కసాధ్య కృత్యంబ కాని మానవులయట్ల మరలు న్విరతి వలచుఁ - గాన వీనినడవడికయం దపుడప్పు డిట్టిమార్పు కన్పట్టుచుండు ననియె - జంతర మాఁకపాలగుట మాకొక పరీక్షయనియు నది వెండియుం గదలుట నిష్కళంకమగు మా కార్యంబు సాధించిన మేలిఫలం బనియు నాబుద్ధికిం దోఁచె - నంతఁ బత్రిక మసలక రైలెక్క మాకెల్లరకుం దలద్రేఁగు డించినట్లయ్యె - మా యీయభినివేశమ్ము పంటగాఁ బత్రిక కొకనియమ మేర్పడి యది ప్రజారంజక మాయె - మఱియు ఫినిక్సునందుఁబరాపేక్షలేక తమపనితామనిర్వహింపఁగలమార్పులారంభ మాయెఁ - బిదప నిచ్చుమైఁ దైలయంత్రమును వీడి నిర్భయమ్ముగాఁ జేతిమరతోఁ బత్రికను సాగించినకాల మీయాశ్రమజీవనంబునఁ బ్రవేశించె - నది ఫినిక్సుజీవనమున నత్యుత్తమ నైతికకాలంబు నాఁదగు. 18



# 21 పోలక్కు కూడ దిగుట

సీ. ఏను ఫినిక్సునం దీసృష్టి కొగ్గిన, వేళ బారిస్టరువృత్తిఁ దొఱఁగి
కలకాల మిచ్చోట నెలకొని మడిదున్ని, పండించి యాఁకటిబాధ మఱచి
నాసేవ లన్నియు నీసంస్థ కందింపఁ, దలఁచితిఁ గాని నాతలఁపు లెల్ల
నాఱడివోయె నాయాశయం బొకఁడయ్యెఁ, ముట్టిన దొకఁడాయెఁ దుట్టతుదకు
గీ. జీవనం బస్మదీయ మీత్రోవయంద, సాగుచున్నది యైనను సత్యసేవఁ
దవిలి కష్టించువానియత్నమ్ము చెడియు, నశుభసంపాదకంబు కాదని వచింతు. 1

క. ఎవ్వనికి వాఁడ తనతిను, బువ్వను సృష్టింపవలయుఁబో! యను మతి నా
కవ్వారి యగుట నెల్లర, కవ్వసుధం బంచియిడితి ననుయాయులకున్. 2

ఆ. కాపువారివోలె గడ్డికప్పినయిండ్ల, నిమ్ముకొంట మాకు నింపె కాని
తగినతెఱపి లేక ద్రవ్యంబు లేక యీ, కొంటి మపుడు తేకుటింటిబ్రదుకు. 3

క. సంపాదకుఁడై పత్రిక, పెం పరసెడి నాజ రిచటఁ బెరుఁగక సేవం
ద్రెంపక దర్బనుపురిలో, నింపితమగు సొంతయింటి నెదయక నిలిచెన్. 4

ఆ. అచ్చుఁగూటమందు నక్కరము ల్గూర్ప, వలయుకూలివాండ్రు కలరు గాని
యాశ్రమస్థులైన యంద తీచేఁతకుఁ, జాలువార లగుట మేలటంచు. 5

క. తలఁచితి నెయ్యురు సమ్మతి, పలుకన్ వెనువెంట నచ్చుపని కొగ్గితి మీ
కళ నా కలఁతిగఁ జేపడె, వలంతియై మగనలాలు వఱలెను దీనన్. 6

ఆ. ఇండ్లు కట్టమైతి మిచ్చట సంతృప్తిఁ, దోఁగి కాలు నిలువఁద్రొక్కమైతి
మిట్టి యిఱుకునంద యీక్రొత్తలంబిని, వదలి బర్గు చేరవలసె నాకు. 7

క. అచ్చటికర్జంబులు నా, వచ్చుట కెదురెదురు గనుచు వాడుచు నుంటన్
జొచ్చితి జొహాన్సుబర్గున, నెచ్చెలులం గదిసి వక్కణించితి బ్రదుకున్. 8

క. చెప్పితి నాశ్రమచరితం, బపోలకుతోడ; విస్మయానందములన్
దొప్పఁగఁదోఁగెం జెలి తా, నప్పుడొసఁగు రచన యింత కాదరు వగుటన్. 9

క. అం దేనుం జేరుట కీ, కొందురె యని కౌతుకంబుగునియం బలికెన్
సందియమా యంటి నతై, నం దరలెద నేఁడ యని మనస్వి వచించెన్. 10

ఆ. అతనిచిత్తశుద్ధి కాత్మబలంబున, కేను వెఱఁగుపడితి నింపువడితి
నుజ్జగించెఁ బత్రికోద్యోగ మాశ్రమ, సభ్యుఁ డయ్యెఁ బరమసాధు వతఁడు. 11

క. వేఱిమి నెఱుఁగని నడతన్, నేరిమి గడియించుటన్ ఫినిక్సున మిగులన్
బేరిమిగని యెల్లరకుం, గూరిమిచెలికాఁడు బందుగుఁడునై వెలసెన్. 12

క. ఆడంబరములు మెచ్చని, వాఁ డగుట ఫినిక్సులోని వాతావరణం
బేదప్పి నిదక యతనికి, వేదుకసంధించె నదియ వీ దనిపించెన్. 13

వ. కాని యే నా వ్యవసాయకేంద్రమునం దతనిఁ దద వుంద నీనైతి - నపుడు జొహాన్సుబర్గులో నా కందగానున్న 'రిచ్చి' న్యాయశాస్త్రాధ్యయన సంపూర్తికై సీమ కేగువాఁ డాయెఁ - గాన 'నీ వేతెంచి కార్యాలయ వ్యాపారంబులు నిర్వహించుచు న్యాయవాది వగుటకు సైతము కృషిసల్పు'మని యతనికిం గమ్మ నంపఁ దనమన్నించువారి కెదురుసెప్పు టెఱుంగని మేలిశీలమ్ముగల పోలక్కు 14

క. ఏమార్గము సముచితమని, మీమదికిం దోఁచు నదియ మేలిదు నాకున్
నామనికిచే ఫినిక్సున, కామతిలున్ గొంతవాసి యని యనుకొంటిన్. 15

గీ. ఐనను జొహాన్సుబర్గునం దధివసింప, మనతలంపులు వెసఁ బండునని తలంతు
రేని యిదె వచ్చుచుంటి జాగేల యనుచు, నుత్తరము నంప నాచిత్త ముబ్బతిల్లె. 16

ఆ. రిచ్చి వెడలిపోయె వచ్చెను బోలక్కు, దీక్షపూని పనులు దిద్దసాగె
న్యాయవాది యగుట కస్మత్సహాయత, నందు 'టాయ'రతనియంద నిలిచె. 17

గీ. వడివడిగ నాశ్రమంబు దైవాఱుపొంటె, నుత్తమవిచారముల గ్రుంగియుంటిఁగాని
యల్లనల్లన తద్భిన్నమైన బ్రతుకు, మూఁగిరా లోఁతులోఁతుల కేగుచుంటి. 18

వ. దైవేచ్ఛ వేఱుగా నుండదయేని యేను సామాన్యజీవనం బను నీమోహబంధమునం దగిలి యుండువాఁడ - నాలక్ష్యంబు లప్రయత్నంబుగా నెట్లు రక్షింపఁబడె నగ్గాథ నెఱిఁగించుటకు ముం దితరవిషయంబులు కొన్ని వివరింతు. 19



## 22 రక్షకుఁడే భగవంతుఁడు

క. ఏఁడాదిలోన వచ్చెద, నోడకుమని చెలికి నభయ మొసఁగితి నపు; డా
యేఁడాదిపోయె నేటాల్, వీడుట యెట్లన్న తర్క విధియుం బెరిఁగెన్. 1

గీ. కాన బంబయినుండి నాకడకు నాలు, బిడ్డలను జేర్చుకొంటిని బిన్నవాఁడు
రామదా సోడలో గంతు రంతు మరగి, చేటుగానక యెగురుచోఁ జేయివిఱిగె. 2

ఆ. నావలోనివైద్యుఁ డేవో చికిత్సలు, చేసెఁగాని మేలు చిక్కదయ్యె
బెదరఁబోకు మంచు బిడ్డకు ధైర్యమ్ము, సెప్పి మృచ్చికిత్స చేసినాఁడ. 3

క. నెలనాళ్లు మట్టివైద్యము, సలిపితి నర్భకునికరము చక్కంబడియెన్
బలిసెను గృహవైద్యముపైఁ, గల నావిశ్వాస; మింతగాయము మానన్. 4

క. రోగుల పల్వురపట్లఁ బ్ర, యోగించితి మన్ను; పెక్కు రొందిరి సౌఖ్యం
బౌఁగాని నేఁడు దీనిని, సాగించెడి సాహసంబు జాఱెను దనకున్. 5

వ. ఈచికిత్సయం దాపత్తి కలదని యనుభూతిచే నెఱింగితిఁ - గాన నవీనయోగంబు నిద్దాని
నాదరించువారు మున్ముందు తమపట్లన ప్రయోగించుకొంట యావశ్యకంబు - సత్యం
బపుడ బయల్పడు - నేతత్ ప్రయోక్తలపాలిటం బరమేశ్వరుండ యగదంకారుఁడై రక్షించు
- మృత్స్నావైద్యమునం దెట్టియిక్కట్టు లుండె నట్టి యిక్కట్ల తెల్లవారితోడి చెలికారమునందం
గలవు - కాని చివరచిక్కుల నేను సరకుసేయనైతి - మఱియు 6

క. రార మ్మనినంతన నా, చేరువకున్ వచ్చి నేను జెప్పినపనులం
గోరి యొనరించుపోలకు, చారిత్రం బిచటఁ గొంత సంభావింతున్. 7

ఆ. అతనికిం బ్రధాన మన్నది యెన్నఁడో, జరిగెఁ గాని పెండ్లి సాగదాయె
నర్థపుష్టిలేమి నాతఁడు పరిణయో, త్సేక మాఁపెనంచు నాకుఁ దోఁచె. 8

గీ. అతఁడు రస్కినుసిద్ధాంత మాదరించి, నడువఁజూచును సర్వదా నన్నుమించి
మంచిదేకానిరస్కినుమార్గమూఁది, బ్రదుకఁబాశ్చాత్యులెంతేనిబడలవలయు. 9

వ. కాన నొక్కనాఁడేను బోలక్కుం జీరి బుజ్జవమ్ము నెఱపి యయ్యెముచ్చట లైనంత 10

ఆ. ప్రణయ మంకురించి బలిసినపిమ్మటఁ, గలిమి చాలదన్న కారణమున
విప్రయోగ మోర్చు టప్రశస్తము పేద, కిట్టులైనఁ బెండ్లి యెట్లుజరుగు. 11

క. నీ విప్పుడు నావాఁడవు, కావునఁ బనిలేద యింటికర్చులు రోయన్
భావం బనుకూలించిన, వేవేగన్ బెండ్లియాడవే యని యంటిన్. 12

క. చెప్పినవాక్యము వెండియుఁ, జెప్పం బనిలేదు వీనిచెంగట; నగుటన్
జప్పున మదాశయమ్మున, కొప్పెను బోలక్కు తనివియొదవెను నాకున్. 13

క. తనవలచిన కన్యామణి, కనిచెను బోలక్కు లేఖ మచ్చెలి మైకో
లును దెల్పి సీమవలనం, జనుదెంచె వివాహధర్మసంభృతిపొంటెన్. 14

గీ. వాద్యములు లేవు క్రొత్తవల్వలును లేవు, రవణములు లేవు మంత్రతంత్రములు లేవు
పందిళులు లేవు విందులపసలు లేవు, నడిచె దుగ్గానియును వెచ్చపడక పెండ్లి. 15

ఆ. వరుఁడు యూదుజాతివాఁ దేసుమతమునఁ, బెరిఁగె వధువు వార లిరువు రిపుడు
జంటయైరి ధర్మసామాన్య మున్నచో, నిచట జాతిమతము లెదురఁ గలవె. 16

గీ. పెండ్లిపై ముద్రవైచెడు పెద్దకడకు, నాఁడు దంపతితోడ నే నడిచినాఁడఁ
దెల్లవా రాలుమగలంట నల్లవాఁడ, సాక్షినంట నే నిదెంత విస్మయకరంబొ. 17

ఆ. మధ్యవర్తి నల్లమానిసి యౌట నీ, వధువు వరుడుఁ దెల్లవార లంచు
నెట్లు విశ్వసింతు నీ బంధ మని యధి, కారి మమ్ము రిత్తవారిఁ జేసె. 18

ఆ. ఎల్లి భానువార మేతెంచుఁ గిస్మిసు, పండు, వయ్యెఁ బెండ్లిపనులు సర్వ
మీతఁ డిట్లుపల్కె నిత్తతిఁ గర్తవ్య, మెద్ది యనుచుఁ గొంతప్రొద్దు వగచి. 19

క. ఎఱిఁగిన పైయధికారిని, దరిసించితి జంటతోడ; దత్కథ యెల్లం
బరికించి నవ్వి యతఁ డు,త్తరువిచ్చెన్ ముగిసెఁ బెండ్లితం తది యెల్లన్. 20

క. కల రింతకుమును కొందఱు, తెలవారలు పురుషు లస్మదీయగృహమునన్
నిలిచెన్ గ్రొత్తగ వచ్చిన, మెలఁతయు నీనాఁడు నాదుమిత్రుని సతియై. 21

గీ. వీరితో నాకు నెన్నఁడు న్వేఱడంబు, రామి నిక్కమకాని నాలేమ కిట్టి
యనుభవం బల్పతరమౌట నాపె కొంత, గొణఁగెనపుడప్పుడదిలెక్కగొనుటచనదు. 22

క. నానామతముల జాతుల, మానుసులకు నిక్కమైన మద్భృహమం దే
దే నొక్కపొరపు వచ్చిన, దానిం బాటించి తడవఁ దగదని యందున్. 23

ఆ. ఒక్కజాతివార లొక్కమతమ్మువా, రిరవుకొన్నయింట నెగయురగడ
నతకరించువేర్మి యస్మత్కుటుంబమం, దుప్పతిల్ల దనియు నుగ్గడింతు. 24

వ. సజాతీయ విజాతీయ విపర్యయంబు భ్రాంతిజనితంబు నాఁదగు - సత్యముం బరికింప నేమెల్లర మొక్కసంసారములోనివారమ - యిఁక వెస్టుపెండ్లికథ వ్రాక్రుచ్చెద - నింతదనుక నాయుల్లంబు బ్రహ్మచర్యంబుదెసం బరిపాకమునొంద దాయెఁ - గాన నవివాహితులగు చెలిమికాండ్ర నెల్లర నొకయింటివారిం జేయుట కర్తవ్యమని తలంచితి - నంతఁ గన్నవారిం జూడ వెస్టు పయనమ్ముకట్టె - వచ్చునపు డిల్లాలితో రమ్మని యే నతనికి వీడ్కో లొసంగితి - నేలయన 25

క. ఎల్లర కల్ల ఫినిక్సున, నిల్లున్నది సేద్యమున్న దిఁకఁ బెండిలి నాఁ
బిల్లలు నా మాచిత్తము, తల్లడకుడువంగ నేమితంటా వచ్చున్. 26

ఆ. వెస్టు మరలివచ్చె లెస్టరులోఁ బెండ్లి, యాడినట్టి వన్నెలాడితోడ
నిక్కమైనవన్నె చక్కనిగుణ మౌట, నాపె వన్నెలాడి యనుట పొసఁగె. 27

ఆ. ఆమెతల్లిదండ్రు లన్నలు తమ్ములు, పాదుకములు కుట్టి బ్రదుకుచుందు
రాకె నేర్చెఁ గొంత యాకౌశలంబు న, య్యబలవెంట వచ్చె నంబికయును. 28

క. ఈయవ్వ కృత్యములదెసఁ, బాయనిపూనిక వెలార్పఁ బ్రన్ననినగవుల్
రేయెండంబలె నిచ్చలు, గాయింపఁగ మాకు సిగ్గు కవియుచునుండున్. 29

ఆ. పెండ్లి కానివారి పెండ్లి సేయించుచు, నైనవారు దవ్వులందు నిలుచు
సతుల సుతులఁ బిల్వఁజను నని తెల్పుచుఁ, గాల మచట నిట్లు కదపుచుంటి. 30



# 23 ఇంటిదెస

క. మితమగు వెచ్చము రస్కిను, మత మగుటన్ దానిదెసకు మది నిడి నాకున్
జతపడినవట్టు దంబపు, బ్రతుకున్ సవరింప నెల్లబాటలు కంటిన్. 1

క. మానితి నంగడిరొట్టియ, కూనీమత ముగ్గడించు గోదుమరొట్టెన్
బూనికఁ జేయందొడఁగితి, దానికి మరపిండి యనుచితం బనుకొంటిన్. 2

ఆ. చేతిపిండి లగ్గసేయును గానఁ గై, మరనుగొంటి గోదుమలను విసర
నొక్కరుండు త్రిప్పనోపఁడ దీనిఁ ద, చ్చక్రమునభరంబు చాల నగుట. 3

ఆ. ఒక్కసారిపోల కొక్కమా ఆతని, నవల యొక్కతదవ నాదుబిడ్డ
లతివ యొక్కతూరి జతపడఁ జక్రంబు, త్రిప్పువాఁడఁ బిండి కుప్పవడఁగ. 4

వ. ఈపరిశ్రమంబు పసివాండ్రకుం దద్ద యుపకరించుఁ - గాని యే నెన్నఁడు న్వీరినిప్పునికి నియమించి యెఱుంగ - నట్లయ్యు నిది యొకరంతుగా బాలురు చక్రముం ద్రిప్పసాగిరి - వీరి కలసట వొడమినంతన యేను సెల విచ్చువాఁడ - నెంతసోమరి బిడ్డయేని నాచెంత గంతులువైచుచుం బనిసేయుచుండు - వెండియు 5

ఆ. కసవుచిమ్మి యింటియొసపరితన మెల్లఁ, జక్కఁజేయ లెంక యొక్క డుండె
నతని బంటువోలె నరయక సంసార, సభ్యుఁజేసి నెమ్మి చాటినాఁడ. 6

గీ. ఆతనికిఁ గుఱ్ఱలందఱు చేతనైన, సాయ మొనరించుచుండు రాసాయ మింటి
ముంగిళుల్ బాగుసేంత మఱుంగుదొడ్డి, కడిగిచిమ్ముట లోనైన యిడుమ లోర్చి. 7

క. మల మెత్తుటకును బిడ్డలు, కలఁగనివారైరి తెగులు కల్గమిపొంటెన్
వలసినబాట లెతింగిరి, యలయిక కలవడిరి నన్ను నలరించి రిటుల్. 8

ఆ. కుఱ్ఱవాండ్రచదువుకొఱ కేను యత్నంబు, సలుపలే దటంచుఁ బలుకఁ గాని
వలసినపుడు దాని వదలుఁడీయని చెప్ప, జంకనైతి నింత గొంకనైతి. 9

క. నాపుత్రు లీకతమ్మున, నాపై దోషంబునిడిరి ననిచిన తమ సం
తాపము తెల్పి రిటన్ నా, లోపంబును గలదు పాడిలోఁతులు సూడన్. 10

క. బాలురవిద్యాసంపద, చాలన్ వలచితిని గృషియు సల్పితి నైనన్
నాలాలస విఘ్నమ్ముల, పాలంబడి చెడియె నిడియెఁ బరితాపంబున్. 11

వ. వీరికిం దగునొజ్జ నేర్పుతిచి విద్యనేర్పింపక యేన వీలైనతతి నించించుక బోధించువాఁడ - మూఁడుక్రోసులదవ్వునం గల పనిపట్టునకు వీరి నావెంట నడిపించుకొని పోవుచు లాఁతినెయ్యురు నన్ను వెన్నడింపనినాఁడు దారియంద వీరికిఁ బారమ్ములు చెప్పుచుంటిఁ

- బెద్దవాఁడగు హరిలాలుందక్కఁ దక్కెల్ల బిడ్డల నిట్ల పెంచితి - హరిలాలు భారతభూమి యంద నిలిచె - నియతుండనై యనుదినం బొకగంటసేపు పాపలచదువుకై దస్సియుందు నేని వారు చదువరులై యుందురు - కాని యేను దీనికి శక్తుండఁ గానైతి - నిప్పట్ల నా కొమరులకు వలసినంతచింత కలదు - పెద్దవాఁడు తనకొొందలపాటుం బెక్కుతడవలు నాకడన వెడలఁగ్రక్కెఁ - దక్కినకొడుకు లీనేరంబు వారింపరానిదని యుదారతమై సైఁచిరి - యే నిందుల కనుతాపముం గుడిచియెఱుంగఁ - గాని యాదర్శజనకుండఁ గామి కపుడపుడు వగచితి - నాబిడ్డలచదువుం బ్రజాసేవకు బలియిచ్చితి నని నాతలంపు - నాయవివేకం బిట్లుసేఁతకు హేతువుకావచ్చుఁ - గాని యది సదాశయసమగ్రమని చెప్పనోర్తు - మఱియు నయ్యవసరంబున 12

క. బిడ్డలచదువులపట్ల న, సడ్డ యొనర్చినను వారిచరితము దిద్దన్
జ డ్డెఱుఁగక బదలితి నిది, గడ్డైనను గన్నవారికర్తవ్య మగున్. 13

మం. ఏ నింతనలఁగిన నిపుడు నాబిడ్డ, లేగెడుత్రోవలో నెదియేని వంక
యగపడ్డ నది మత్ప్రయత్నలోపంబు, కతనఁ బుట్టినచేటుగా నుజ్జగొనక
మాయాలుమగలను మాననిదొసఁగు, బిడ్డలం దిట్లు బింబితమయ్యె నందు. 14

గీ. సుతులునాఁ గన్నవారియాకృతికె కాక, గుణమునకు దోషమునకును గుర్తు లనెదఁ
బరిసరచ్ఛాయ వారికిఁ బట్టుఁ గాని, తండ్రితాతలగుణమే ప్రధానగుణము. 15

వ. వంశపారంపరీ ప్రాప్తంబు లగుదోషంబులఁ బాసి వాసిగన్న పిన్నవాండ్రుం గలరు - కాని వారి యీపవిత్రత కాత్మమూలస్వభావంబు నిదానంబు నాఁడగు - నది యీ దుర్గుణంబుల బలిగొనం జాలు - వెండియు 16

ఆ. పిన్ననాఁటఁగోలె బిడ్డల నాంగ్లేయ, భాష కప్పగించు భారతీయుఁ
డాత్మజులక కాక యాత్మీయభూమికి, నెగ్గుచేసినట్ల యెంతు నేను. 17

క. తనజాతికిఁగల సంస్కృతిఁ, గలలేమియ కాక తనదుగడ్డకు లోకం
బున కిట్టిబిడ్డ యూడిగ, మొనరింప నపాత్రుఁ డగుటయున్ నిక్కమగున్. 18

గీ. అగుటఁ గుఱ్ఱలతో నిచ్చ లంగవించి, మాటలాడఁ దొడంగితి మాతృభాష
ననుఁగుపోలక్కు దీనికి నహరహంబు, నాఁకసెప్పుచు నిబ్బంగి నాడఁదొడఁగె. 19

గీ. కుఱ్ఱవాండ్ర భవిష్యమ్ము కుంటువఱుపఁ, జాగితిరి మీరు లోకప్రశస్తిగన్న
యాంగ్లవాణి వశంపద యైననాఁడ, నేఁటిసంఘర్షమున వీరు నెగ్గఁగలరు. 20

గీ. అభినివేశమ్ముతోడ నెయ్యమ్ముతోడ, నితఁడు పల్కినపల్కు నా కింపదయ్యె
నపుడు రేఁగిననావాద మరసి మొండి, తనము పరికించి పోలక్కు తగ్గిపోయె. 21

క. ఇరువదియేండ్లకుము న్నిది, జరిగిన; దానాఁటి నావిచారంబులు నా
యెఱిఁగినయనుభూతులతోఁ, బెరిఁగెను సాహిత్యబలము పెంచెన్ దనకున్. **22**

వ. నాకొడుకుల కక్షరజ్ఞానంబు లెస్స లేకున్నను గుజ్జరాతిబాసం దగునేర్పు వాటిల్లెఁ - బలువు రాంగిలేయులతోఁ గలసి యుంట నింగిలీసునందును సాధారణపరిచితి యేర్పడె - నప్ర యత్నంబుగా రెండుభాష లబ్బి వీరికి దేశమునకు లగ్గుసంధిల్లె. **23**



## 24 జులూ తిరుగుపాటు

క. ఏ నిల్లుకట్టుకొంటిని, గాని ప్రశాంతముగ నాల్గుకాలంబులపా
టానెలవునఁ దిని బ్రదుకుట, కానంబడదాయె దైవగతి వేఱుగుటన్. **1**

క. పోలకు మున్నగుమిత్రుల, తో లంబిని బెంచి పుష్టితుష్టులు గనుచున్
గాలంబు గడపుచుండ నె, టాలుజులూ లెద్రుచువార్త దబ్బా టొదవెన్. **2**

క. మనవారలపట్ల జులూ, లొనరించినచెడ్డచేఁత యొకటియు లే దా
మనుజావలిదెస నాకుం, గినుకయు లే దపుడు వారు కృతనిశ్చయులై. **3**

ఆ. ఏలుబడి నెదుర్చు టేనియుఁ దద్దయు, నమ్మనైతిఁ గాని నాఁడు తెల్ల
వారిదొరతనంబు వసుమతీశ్రేయమ్ము, కొఱక యనుతలంపు కుదిరె నాకు. **4**

గీ. దానిదెస నాకు నిచ్చ యెంతయుజనించె, నీఁగయును దానిపై వ్రాలు టేనుసైఁప
నగుట నిది నీతి యవినీతి యనక బలిమి, నొద్దఁదగునంచు నెంచితి నడ్డులేక. **5**

వ. నేటాలుసీమ కేదే నొల్లమి వాటిల్లినతఱి నది త న్నాదుకొనుట కొక స్వయంసేవకదళంబు నాయిత పెట్టుకొని యుండె - నం దక్కఱపడుచో నల్లవారింగూడ జోడించుకొంట కలదు - నా కీనాఁటితో గాటంబగు లంకెయుంట నేనుందద్రాష్ట్రవాసినకా భావించుచుండుఁ - గావున **6**

గీ. వలసినం గృత్తగాత్రసేవన మొనర్ప, భారతీయదళంబుతో వత్తు నంచు
రాష్ట్రపాలకునకు నుత్తరంబు నంపి, యతనిమైకోలు వడసితి నప్పుడపుడ. **7**

గీ. ఆలుబిడ్డల నంపితి నాశ్రమమున, కేను దర్బనుసొచ్చితి దీనజన ర
రక్షు లిర్వదినల్వురు దీక్షఁబూని, దండునం జేరఁ దతిసితిం దగవుపట్టు. **8**

వ. మున్ముం దేను జులూ లెదుర్కొన్నచోటి కరిగి పరికింప నం దవరోధచిహ్నా మావంతయేని నాకుఁ గానరాదయ్యెఁ - దమపై నధికృతులు విధించినక్రొత్త పన్ను చెల్లింపఁజనదని

జులూనాయకుం దనుచరుల కాదేశించె నఁట – తత్కరంబు రాఁబట్ట వేంచేసినసుంకరి నీప్రజలు నలుగుపెట్టి పంపిరఁట – జులూతిరుగుపాటునా నిదియ – దీని నింతచేసి దొర తనంబువా రీతెగ నడఁగింప సమకట్టిరి – కాన నా కీజులూలపట్ల నాదరంబు వొడమె – నంత 9

గీ. కదనకార్యాలయంబును గదిసి యచటి, వెజ్జు నీక్షించి పనియేమి వినువుఁ డంటి
నాతఁడు జులూల సేవింప నాజ్ఞ పెట్ట, నస్మదానంద మతివేలమయ్యె నపుడు. 10

క. అతఁ డౌదార్యము విరియఁగ, క్షతాంగుల జులూలసేవ సలుపం దెలవా
ర్మతిసేయకుండి రే నే, గతి వీరిం జక్కఁజేయఁగల నొంటరినై. 11

క. గాయములు క్రుళ్ళి దుర్గం, ధాయతనము లయ్యె మీర లరుదెంచుట ల
గ్గాయె నపరాధ మెఱుఁగని, యీయనదలమొల్ల వినియె నీశ్వరుఁ డనుచున్. 12

ఆ. మమ్ముఁ బెద్దచేసి మందులు పట్టీలు, నొసఁగి యార్తు లున్నదెసకుఁ జేర్చె
ముఱికిముద్ద లగుచు మూల్గుజులూలు మా, దళముఁ జూచి తెల్వి తనివి గనిరి. 13

ఆ. ఆవలఁ గలతెలజోదులు, మావంకకుఁ జూచి కొల్వు మానుఁడు వీరల్
చావం దగుపాలకు లని, తీవరపాటున జులూలఁ దిట్టిరి మిగులన్. 14

క. ఆ పచ్చిబూతులను విన, నోపక చెవులందు వ్రేళ్ళనొత్తితి మంతన్
మా పొత్తున కల్లల్లన, లోపడి రమ్మగలు కింక లుప్తము కాఁగన్. 15

గీ. మున్ను నాతోడ లెస్సదీకొన్నదొరలు, వాయలీస్పార్బు మున్నగువార లందుఁ
గలరు వారికి నా సేవఁ గన్నయంత, నచ్చెరువుతోఁచె నన్మెచ్చునాస యేచె. 16

గీ. అపుడు మా పరిచారంబు నందుప్రజలు, దురమునన్ దెబ్బదిన్నపోటరులు గారు
చెఱకు లోపడి కొరడాలశిక్ష గుడిచి, నజ్జునజ్జయి క్రుళ్ళుచున్నారు వారు. 17

క. తొలి బోయరుజగడంబునఁ, గొలు విట్టిది సల్ప నేర్పు కొంతవడయుటన్
వలసిన చికిత్స నడుపుచు, జులూలకున్ సేవఁజేఁత చులుకనయయ్యెన్. 18

క. ఎచటికి దూఁకు ననీకిని, యచటికి డోలీలతోడ నరుగుచు భగవత్
ప్రచు రారాధనమునఁ బలె, రుచిపడి సల్పితిమి నాఁడు రుగ్ణులసేవన్. 19



# 25 హృదయమథనము

క. ఆపన్నులగు జులూలకు, నోపినసాయంబు సేయుచున్నతతిన్ నా
లోపల మథనము రేఁగెను, జేపడె ననుభూతినిఘ్న చిత్సంపదయున్. 1

గీ. మున్ను బోయరుకదనంబు గన్ననాఁడు, నాకుఁ బుట్టనియోట యీనాఁడు పుట్టె
నిదిరణంబనిపేర్కొంట యేమిపాడి, మానవులవేఁట యనియంట మంచిమాట. 2

క. రవిరాకదతో మొదలై, దివియు భువియు నద్రువ గుండ్లదెబ్బలు మొరయున్
రవుతులు పల్లెలపైఁబడి, తవిలి తుపాకులను బ్రేల్చెదరు నిర్దయులై. 3

క. ఈరొద నిచ్చలు చెవులం, దూఱఁగ నచ్చోట నుంట దుస్సహమయ్యెన్
నారాయణుకరుణను జే, కూరెను మా కీజులూలకొలు వవ్వేళన్. 4

క. అగుటం జేఁ దిది యెట్లో, దిగమ్రింగితి; మేము సమ్మతిం జూపనిచో
నిఁగ నెవ్వరు నీ సేవకుఁ, దెగరని నమ్మితిని గానఁ దేర్చితి నాత్మన్. 5

వ. ఆఖేటంబున కాటపట్టయిన తద్దేశంబున జనసంఖ్య యల్పతరంబు నాఁదగు - నక్కడక్కడఁ గొండలయందును గుహలయందును సాధువులు నాటవికులు నగు జులూలు నివసించు కుటీరములు తక్క నచట నొండేమియు లేదయ్యె - నిట్టి నిర్జనారణ్యంబున క్షతగాత్రుల డోలికలు మోయుచుఁ బెక్కామడలమేర పయనించుతఱి నాచిత్తమునం జిత్తజల్లులవోలెఁ బెక్కుతలంపు లుదయించె - నపుడ నా బ్రహ్మచర్యభావన పాకంబునంబడె - ననుయాయుల తోడం గూడి దీనిఁ దద్దతదవితి-మానవసేవకుం గాక భగవద్దర్శనంబునకును బ్రహ్మచర్యంబు ముఖ్యంబని యానాఁ డెఱింగినట్లు సెప్పఁజాలఁ - గాని 6

ఆ. తెలిసికొంటి నేను దినదిన మి ట్లార్త, వర్గమునకు దయ్యవలయు ననియు
భోగములకు లోఁగి బుడుతల సృష్టించి, పెంచుచున్న నిది లభింప దనియు. 7

గీ. రెండుగుఱ్ఱాలపై సవారీలుకొట్టఁ, జాల నిపు డింతి యాపన్నసత్వ యైన
నింతయావేశమున దూఁకి యీ యనాథ, సేవ గావింపనోర్తునా చింతలేక. 8

గీ. శమదమమ్ములు లేక సంసారవృద్ధి, కిచ్చసేయుచు జంజాట మెల్లఁ బెంచు
మనుజుఁ డత్యర్థశేముషీమంతుఁ డయ్యు, సంఘమునకూడిగము సల్పఁజాలఁ డందు.

వ. పరిణీతుఁడయ్యు బ్రహ్మచారియై మనువాఁడు సంసార సమాజముల రెంటిం గొల్లవచ్చునని నాయాశయం - బే నిట్టియాలోచనలు చేసి చేసి బ్రహ్మచర్యంబు నవలంబింప నాత్రపడితి - నపుడు నాహర్షంబునకు మేర లేదయ్యె - నాసేవా క్షేత్రంబును గడుంగడు విస్తృతమాయె - నంత 10

ఆ. జగడ మాఁగిపోయె నిఁగ మీర లింటికిఁ, జేరవచ్చు నన్న సెలవువచ్చె
నార్తకోటి నిట్టు లాఋవారమ్ములు, కొలిచి మరలినాఁడ జెలులతోడ. 11

క. ఏ నిలుసేరినపిమ్మట, మీనెఱపినసేవ మీసమీచీనత మ
మ్మానందపతిచె నని భూ, మీనాథుండు కమ్మ్రవాసి మెచ్చెను మమ్మున్. 12

క. పదపడి పరమోత్సాహము, గదురంగ నాబ్రహ్మచర్యగాథ మగనలాల్
మొదలగువారికి వినుచుడు, నది సద్వ్రత మంచు మెచ్చులాడిరి మిత్రుల్. 13

గీ. పొగడిరే కాని తద్దీక్షపూని గెల్చు, టరిదియని చెల్మికాండ్ర కందఱకుం దోంచె
భారమా యని కొందఱు పంతగించి, రందుం గొందఱు జేతలై రనియుం గంటి. 14

క. అపు డేను న్మది నంజక, శపథం బొనరించి బ్రహ్మచర్యము గొంటిన్
గృపనింపుము పెంపుము న, న్నపరాజితుం జేయు మీశ్వరా! యని యంటిన్. 15

క. ఆనాండు దీనివిలువయు, దీనికఠోరతయు నింతదెలియదు నాకున్
నే నేతదీయపరుషత, యీనాండుం గుడుచుచుంటి నెరియుచునుంటిన్. 16

వ. ఈబెడిదమ్మువెంట దీనిమహిమమ్మునైత మనుదినం బధికాధికంబుగా నెఱుంగుచుంటి – నీ నిగ్రహంబులేనిబ్రతుకు రిత్తకురిత్త యనియు నది పాశవజీవనం బనియు నాకుం దోంచు – నిచ్చమైం దన్నుందా నాదేశించుకొనుటయంద మానిసి మానిసితనంబు కలదని వక్కాణింతు – నొక్కనాం డేను 17

గీ. బ్రహ్మచర్యంబు సర్వధర్మములం బెద్ద, యనుట యత్యుక్తి యనుకొంటి నట్టిపలుకు
సముచితంబని యనుభూతిజనిత మనియుం, దేటపడుచున్న దీనాండు దినదినంబు. 18

క. శారీరకనిగ్రహమునం, బూరితిగా దీవ్రతంబు భోగేచ్ఛ మదిం
బాఱుటయును గల లట్టివి, కూరుటయుం దగదు సిద్ధిం గోరిన దీనన్. 19

మం. బాహ్యేంద్రియమ్ముల బంధించుటయును, గడుబెట్టిదంబైన కర్జంబ యందు
బాహిరంబగుగెల్పుం బడసితిం గాని, యంతర్జయం బందనైతి నెల్లయును
జాగర్య విడువక చరియించుచున్న, నేతెంచుం దలంపు నాయెఱుకువ లేక
తలంపుతల్పును మూయ తాళంబు నరుని, కడ నున్నదనియు నేం గన్నాండం గాని
యతండ రోయందగు నలయక దీని, వెదకి యిచ్చెడివారు వేఱుగా లేరు
తమ కన్నయనుభూతిం దరువాతివారి, కిచ్చిపోయినపెద్ద లిచట దర్శకులు. 20

వ. వారి యనుభూతులుసైతము పరిపూర్ణములు కావు – నాదృష్టిం జూడం బరిపూర్ణత యన్నది భగవానుం దనుగ్రహింపం దగినదియ–కాన భక్తులగువారు తమతపశ్చర్యంజేసి రామనామాది మంత్రములం బవిత్రములం గావించి మనకిడిపోయిరి – మఱియు మనుజుండు మూల ముట్టుగాం దన్నుం దా నీశ్వరున కప్పనచేసికొన్నం గాక లాంతివెరవులం దలంపుల నోర్వ నేరం డని యేను విశ్వసింతు – ధర్మబోధకంబులగు నెల్లకృతులు నిదియ వక్కాణించు – నిందలిసత్యంబు నీ నేమంబు నిర్వహించుతతి నెఱింగితి – బ్రహ్మచర్యదీక్షం బూనినంతన

యే నింతితో నెక్కటిసెజ్జయు నేకాంతసేవయు నుజ్జగించితి – నిట్లు నా యేకత్రింశ వత్సరంబునం దారబ్ధమై యిచ్ఛానిచ్ఛలతో సాగివచ్చు నీనిగ్రహంబు సప్తత్రింశత్తమ వర్షంబు నడుమ వ్రతాకృతిం దాల్చె. 21



# 26 సత్యాగ్రహోత్పత్తి

గీ. అంచితబ్రహ్మచర్యధ ర్మానువిద్ధ, మస్మదీయాత్మశుద్ధి సత్యాగ్ర హోప
గతికి మూలమ్ముగాఁ గొన్ని ఘటన లేరు, పడఁదొడంగెను జోహాన్సుబర్గునందు. 1

ఆ. ఏను బ్రహ్మచర్య మూనుటకు, న్మున్ను, నాదుబ్రదుకునందు నడిచినట్టి
ముఖ్యమైన ఘట్టములు మెల్ల మెల్ల స, త్యాగ్రహమును గూర్చె ననితలంతు. 2

వ. సత్యాగ్రహం బనుపదం బేర్పడకముంద తత్పదము నర్థంబైన వస్తు వుదయించె – నది పుట్టిననాఁడు దానిపే రిద్దియని నా కవగతంబు కాదాయెఁ – గాన దీనిప్రసంగము వాటిల్లిన తఱి 'పేసివ్‌రిజిస్టెన్స్' అను నాంగ్లశబ్దంబును ఘూర్జరియం దుపయోగించుచుంటిఁ – గాని యాంగ్లేయసమజ్యా నొకదాన నిమ్మాట సంకుచితార్థవాచి యనియు, నిది బడుగువాండ్ర కాదరు వనియు, దీన నీరసకుం జోటుకల దనియు, రానురా నిది హింసలోనికి మాఱు ననియు నెఱింగి యీనుడి భారతీయు లిచట సాగించుపెనఁకువ కలరూపు నావిష్కరింపనేర దని యంగీకరించి 3

క. మదినిడి తరిచితి దస్సితిఁ, బద ముచితము వదయనైతిఁ బ్రాజ్ఞులు సూచిం
చెదరేని బహూకృతి పం, చెదనని పత్రికను దెల్లఁజేసితి వార్తన్. 4

క. మదినిడి సదాగ్రహం బను, పదమును సృష్టించి వదసె బహుమతిఁ బ్రజ్ఞా
నిధియైన మగనలా; లే, నది "సత్యాగ్రహము" చేసి హర్షముగంటిన్. 5

వ. నాటఁగోలె నీనుడుగు నాతల్లిబాసయం దీనాఁటిశాంతిసమరంబున కభిధేయమై తిరపడె – నాసంగ్రామచరిత్రంబ దక్షిణాఫ్రికా ననువర్తించిన నామనుగడయు నాసత్యప్రయోగము లయుఁ జరిత్ర యగు–నిందుఁ జాలవట్టు బందా నై యెరవడ నున్ననాఁడు వ్రాసి తక్కిల్లయు విడుపుఁగన్నవెన్క రచియించితి – నిదియ దక్షిణాఫ్రికా సత్యాగ్రహేతిహాసం బనుపేర గ్రంథ రూపమ్ముఁ దాల్చె – నందుఁ జేరినగాథలం దొలఁచి నూత్నవిషయంబు లావిష్కరించి యవ్వల భారతదేశీయమ్ములగు మత్ప్రయోగమ్ము లుగ్గడింతు – నీనాప్రయోగపరంపర నవిచ్ఛిన్నముగా నెఱుంగవలచు పాఠకు లా యితిహాసంబునుసైతము తమప్రోల నిల్పుదురు గాక! 6



# 27 ఆహార పరిశోధనములు

ఆ. బ్రహ్మచర్యధర్మపాలన సత్యాగ్ర, హావలోదనంబు నన్నపనులు
పెద్దమార్పుసేయఁ దద్దయుఁ బెరరేచె, నాఁటి మామెసంగు కూటిపట్ల. 1

క. అన్నమున మార్పుచేసితి, ము; న్నది యారోగ్యదృష్టి మూరుట జరిగెన్
గన్నంతయు ధర్మువుదెస, నున్నదియై నేఁటివేర్మి కొగ్గినవాఁడన్. 2

క. దెందమ్ము విషయవాసన, లం దగిలిన జిహ్వాచాపలం బధికం బౌ
నందురు పెద్దలు నాకుం, గ్రందుగ నీ నాల్కపిచ్చి కనఁబడుచుండున్. 3

క. జనురింద్రియమును నాల్కను, దన కగ్గముచేసికొనఁగఁ దద్దయు జతనం
బొనరించితిఁ గృత్స్నజయం, బొనగూడినదని వచింప నోడుదు నేఁడున్. 4

క. మితిమీఱి భుజించెదు తర, గతిమానిసి నేను ముందుగా మేల్కొని యీ
కుతి నణఁపకున్నచో దు, ర్గతిపా లగువాఁడఁ బశువుకంటెను బాడై. 5

గీ. ఏను నాదుర్గుణంబుల నెఱిఁగియుంట, మేలివారలచెల్మి నాపాలిదగుట
నుపవసించితిఁ బర్వంబు లొదవువేళ, భార మనుకొన్నదినమునఁ బండ్లుతింటి. 6

వ. నిగ్రహదృష్టిం జూడఁ బండ్లకును గూటికిం జెప్పఁదగిన వేర్పాటు సున్న - గింజలం గల రుచియ ఫలంబునందు గలదు - రానురాను బండ్లరుచియు మేలిదనియుం దోఁచుఁ - గాన నేకాదశి జన్మాష్టమి మున్నగు పబ్బములం దుపాస మొండేని యొంటితినుట లెస్సయని తలంచితి - నింతియకాక ప్రాచితంబులందుసైత మేకాన్నముం గొనుచుంటి - నిద్దాన మేను వెలందియై రసజ్ఞతయు నశనాయయుం బెనుపందెఁ - గాన 7

గీ. భోగమునకును సంయామయోగమునకు, నక్కఱకువచ్చు నుపవాస మనుచుఁ దోఁచె
నేనకా దిట్టి యనుభూతి నెఱిఁగినట్టి, గఱువ లందందు నుంటయుఁ గన్నవాఁడ. 8

ఆ. మేను లెస్సబలిసి మిసమిసలం దోఁగి, యుంట నాకుఁ దుష్టినొసఁగుఁ గాని
సంయమానురక్తి సడిసన్ననాలుక, వెఱ్ఱి డించుతివుట విస్తరిల్లె. 9

క. కావునఁ దినుబండములం, దీవరపడి మార్పుసేయఁ దివిరితిని బుభు
క్షావేగ మాఁగి నియమము, మై వెలితిగఁ దింటి తేపుమాపులు రెంటన్. 10

గీ. ముద్ద తగ్గించితిని గాని బుద్ధి చవుల, మీఁదికే పర్వులిడుచుండెఁ గాదు నాక
యగుట నిదిమంచిదదిమంచిదంచుఁద్రచ్చి, పూఁటపూఁటకుమార్చితిఁగూటి తెఱఁగు. 11

క. నిన్నటిరుచి నేఁటికి నా, మన్నన గనదయ్యె నిట్టిమార్పులలో నా
వెన్నడిఁ గొండఱునెచ్చెలు, లున్నా రం దుగ్గడింప యోగ్యుఁడు కేలన్. 12

వ. “హరమాన్ కేలన్ బే”కను నితనిం గుఱిచి యాత్రికాసత్యాగ్రహ హేతిహాసమునఁ బెద్దయుం బల్కితిఁ – గాన నిచట నప్పని మానెద – నుపాసంబులోనగు నాహార పరిశోధనంబుల నితండు నా సతీర్థ్యుఁ డయ్యె – సత్యాగ్రహ ముచ్ఛ్రిస్థితి నున్నతఱి నే నితనిమనికిపట్టున విడిసితి – నే మొండొరుల మయ్యాయిపరివర్తనంబులు నిర్ణయించుచు నూతన పరిణామ ములం దగ్గలంబుగాఁ జవులుకుడుచుచుంటిమి – నాఁటి మా యాహారచర్చలు సైత మెంతయు రుచించుచుండె – నందొకఁడేని చేఁదుకాదయ్యెఁ – గాని చవులం దగిలి యిట్లు లోఁతులోఁతులకుం జాఱుట లగ్గుకాదని యే నవ్వల నెఱింగితి – నోగిరముం గొంత మేనినిల్పునకుఁగాని నాల్క నలరింపఁగాదు నాఁజను – సర్వేంద్రియములుం దనువును దనుద్వారమున నాత్మదర్శనము నర్థించి శ్రమించునేని యానాఁ దవి స్వాభావిక రూపమ్మునంది తమకర్తవ్యముం జక్కఁదీర్చుననివక్కాణింతు – నిట్టిస్వాభావికతం బడయ నెంత తఱిచిన నది రిత్తచేఁత కాఁజాల–దీయరయికపట్లఁ బెక్కుమేనుల బలిసేయు టక్కఱ యైనను దాని కోహటింపం గాదు – కాని 13

క. ఏ తెఱురెక్కుచునున్నది, దారుణ మిది మెఱపువోనితనువును నిల్పం
గోరికవడి మన మకటా!, దోరింతుము జంతుసంతతులఁ గర్కశతన్. 14

క. కదుఁగదు నింద్యంబగు పో, కడ నీకొని తుట్టతుదకుఁ గాయము నాత్మన్
మడియించుకొందు మొకరుజ, నడఁపన్ గమకింప సిద్ధమగు వేఱొకఁడున్. 15

గీ. అవిరతేంద్రియసౌఖ్యంబు లనుభవింపఁ, గడఁగి భోగించుబలిమిఁ గోల్పడుచునుందు
మిదియు ననిశంబు మనకంటియెదుట జరుగుఁ, గాని కన; మింతకంటె నక్కజము కలదె? 16



# 28 కస్తూరి ధైర్యము

క. కొమ్మకుఁ గస్తురిబాయికి, ముమ్మాఱు కఠోరరోగములు తలకూడెన్
నమ్మిన మృజ్జలవైద్యము, నమ్మగువ కొనర్చి లగ్గు నందంగనితిన్. 1

క. ఆపడఁతి మొదటిరుజకున్, జేపడె సత్యాగ్రహమ్ము చెలరేఁగుతఱిన్
నాపట్టు పరీక్షించుట, కాపద యిది కూర్చె వేలు పని నిలఁబడితిన్. 2

క. ఆవెలఁది మిపుల రక్త, స్రావంబున బడలె నొకభిషజ్మణి మిత్రుం
డీవెతకు శస్త్రవైద్యము, కావలయు నటంచు నాఁడు కఱపెను హితమున్. 3

క. ఎంతో చెప్పినమీఁదట, నింతికి నీకోలువచ్చె నీ కోయుటకున్
సంతతరోగార్తిం బడి, కాంత కడున్స్రుక్కి బక్కగా నపుడుండెన్. 4

ఆ. అగుటంజేసి వైద్యుఁ డాపెకు మత్తుమం, దిడక కోఁతచేఁతయెల్లనడిపె
నపుడు నొగులు తద్దయైనను గస్తూరి, ధైర్యమూర్తి యగుటఁ దాళుకొనియె. 5

క. అబ్బురమందితి నాబిడ, నిబ్బరముం జూచి కోఁత నిర్విఘ్నముగాఁ
బ్రబ్బె నుపచార మంతయు, నుబ్బుచు భిషజుండు నతనియోషయు సలిపెన్. 6

వ. ఈచికిత్స దర్బనుపురమ్మునందు జరిగె - నది సాగిన రెండుమూఁడునాళ్ళ కిఁక నిశ్చింతమై జొహాన్సుబర్గున కేగవచ్చునని వెజ్జు నాకు సెలవొసంగ నే నవ్వీడు సేరితిఁ - గాని వెను వెంటన కస్తురబాయిపరిస్థితి తృప్తికరము కాదని వార్త వచ్చె - మఱియు 7

క. ఆకెకు మాంసరసాదుల, నీకున్నం గడవనేర మీగండము నీ
రీకొన్న నిత్తు నొదఁబడుఁ, డాఁకట్టకుఁ దంచు వైద్యుఁ డడిగెను నన్నున్. 8

ఆ. అనుమతింపనొల్ల నాయమకే హక్కు, గలదు దీని కొను గా దనంగఁ
దగినతెల్వియున్న మగువక యాపల్కు, సెప్పి యొసఁగుఁ డాపె యొప్పుకొన్న. 9

క. అని వెజ్జున కేఁ దెల్పుడుఁ, జనుదెం డిఁకమీర లేను జాలన చెప్పన్
వినరే నస్మద్ధిత మీ, యనయమ్ము నడంపనేర నని వైద్యుఁ డనెన్. 10

క. ఆవార్త విన్నయంతన, యే వెడలితి నింతిచెంత కెనసితి వెజ్జున్
ద్రావించితి మాంసరసం, బావల మిమ్మడిగినాఁడ నని యతఁ డనియెన్. 11

క. ఇంత కికురింతువే యని, వంతుం జాటితి నతండు వైద్యమునం దా
వంతయు వెఱవక యిట్టి బ, వంతము సాగింతు; మెన్నివంకరదారుల్. 12

ఆ. త్రొక్కియైన రోగియిక్కట్టు దీర్చుట, కంగవింతు మిచట నన్నృతమునకు
విలువలేదు ధర్మవిధియిది మా కని, తెగివచించెఁ గొండపగిది నిలిచె. 13

ఆ. అపుడు దిగులు నొగులు నందితిఁగాని యా, వెజ్జు నేస్తకాఁడు వెలఁదివాఁడు
మెలఁతతోడ సేవసలిపి కస్తురికిఁ దో,డ్పడినవాఁడు నగుట బాధయెల్ల. 14

క. సైఁచితిని గాని వైద్యము, నాచందముదాని నోర్వనైతిని రుజ పెం
పై చచ్చుఁగాక కస్తురి, యీ చెలి వలదన్న నెఱచి నీకొన నంటిన్. 15

క. నావుడు నగదంకారుఁడు, మీ వేదాంతోక్తు లిచట మేకొన రుగ్ణుల్
మావశమున నున్నంతకు, నేవస్తువునైన నిత్తు మితముం బదయన్. 16

క. ఇది వైద్యులపోకడ మీ, మది యిందుల కొప్పదేని మగువను గొనిపొం
డది యిట్లు సచ్చుచుండఁగ, నెద నొకచట్టుం బొనర్చి యే నెటుసూతున్. 17

క. అనిపల్కెఁ; బదంపడి యా, వనితం గొని యింటి కేగవలెనని మీరల్
పనుతురె యంటి నిసీ! య, ట్లను కట్టిఁడి కాఁడు వైద్యుఁ డనె నెచ్చెలియున్. 18

వ. మఱియు నతండు మీరు నా కాఁక సెప్ప కుండురేని యోపినంతవట్టు మాజంట కస్తూరిబాయి కెల్ల యుడిగంబులు సేయు - వెనుకదిగులు మాని మీ రిల్లుసేరవచ్చు - సామాన్యమగు నీపల్కు మీ కంగీకార్యంబు కాదేని మీరు మీ యిల్లాలి నిచటినుండి తరలింపఁ దగునని చెప్పకతప్పదనియె - నపుడు నాచెంతం గల నాబిడ్డయు వెజ్జుమాట నీకొనఁదయ్యె - నంత నేను వసివాళ్ళపాలై జాలిగూర్చు నర్ధాంగిని దాసితి - నపు దామె కెట్టివేసటయేని రారాదని యెఱుంగుదుఁ - గాని యీతిండిమార్పుం దేటపఱుచుట పాడియని నమ్మి యామిషచికిత్స కేమందు వన నాపె తనదిట్టతనంబు నావిష్కరించుచు 19

ఆ. మాంసరసము నొల్ల మద్యంబు నొల్ల మత్, పూర్వజనన సుకృతపుంజ మధుర
ఫలముగాఁగ నేఁడు పడసిన మానవీ, కాయ మావిలంబు సేయనొల్ల. 20

క. నీచాన్నంబుల నిల్చిన, యాచెన్నఁటిమేను మోయ నాసక్తిపడన్
నీచేతులతోఁ జచ్చిన, నాచరితార్థత జగజ్జనస్తవ్య మగున్. 21

క. అనుటయు నామత మిటఁ గ్రై, కొనఁ బనిలేదమ్మ నీకు గోరమ్ములలో
మనయెఱిఁగినహిందువు లీ, కొనరే పెక్కండ్రు పొలసుకూటికి నంటిన్. 22

గీ. ఎంతసెప్పిననేమి నాయింతి తనదు, పట్టువిడదయ్యె న న్నాసుపత్రినుండి
యాశ్రమక్షోణికిం జేర్పఁ దనియె నపుడు, డిల్లపడి నాదుడెందంబు జల్లుమనియె. 23

క. తుదకుం దిరపడి మెలఁతం, గదలింపఁ దొడంగి వెజ్జుకడకుం జని చే
రెద మింటికి నిఁక మాకున్, ముదల నొసఁగుఁ డంటి వినయముగ్ధత వెలయన్. 24

క. ఆతఁడు నిప్పులుగ్రక్కుచు, ఘాతుకమూర్ధన్య! యిట్టి కష్టస్థితిలో
లోఁతు లెఱుంగనిసతి కీ, నీతులు బోధింప సిగ్గు నెగయదె నీకున్. 25

క. ఏపాటిగ్రందువకునే, నోపద యీయబల దారి నొదుదుదుకులలోఁ
బాపము! కస్తూరికి మర, ణాపత్తి ఘటిల్లవచ్చు నరయుము తాళ్మిన్. 26

క. వల దీ హరయోగము నా, పలుకు న్వినవేని తగినఫల మది యొదవున్
నిలయంబు కాలునప్పుడు, జలమునకున్ బావిదీయ శ్రమ రిత్తయగున్. 27

ఆ. మాంససార మొసఁగ మైరేయ మీఁగ మీ,రొప్పకున్న రాత్రి యొక్కఁడేని
మద్గృహమ్మునందు మగువను నిల్ప నా, గుండె చాలదనుచుఁ గొంకెఁ దుదకు. 28

వ. పదంపడి దోలీమున్నగు సాధనంబులతో నైదాఱుగురు పొగబండికడకు రా వలయుదని మున్ముందు వెస్టునకు వార్తనంపి కస్తూరి నొకనరశకటంబు నెక్కించి ధూమశకటఘట్టంబునకు వెడలితి - నది కడుదవ్వునం దుండె - నపుడు వానయుంగురియసాగె - నట్టి దారుణా వస్థయం దమ్మగువయ నాకు ధైర్యమ్ము గఱపుచు 29

క. నా కేమియు నలసట లే, దేకీడును రాదు మీరు హృదయస్థితి న
వ్యాకులితంబు నొనర్పఁడు, లోకేశుఁడు కలఁడు లగ్గలున్ జగ్గ లిడన్. 30

వ. ఇట్టిమాట లాడి నన్ను విస్మితుం గావించెఁ - గేవలశల్యావశిష్ట యగునాపె నేన ఘట్టవేదికం జేతులపై మోసితెచ్చి పెట్టియం జేర్చితి - ఫినిక్సునందు డోలీ సిద్ధముగానుండెఁ - గస్తూరి యలఁతంబడక యాశ్రమప్రవేశ మొనరించె - నంత 31

క. జలవైద్యమ సాగించితి, మెలమెల్లన కోలుకొనియె మెలఁతుక; చింతల్
తొలఁగెఁ గదా యనుకొంటిని, వెలఁదిన్ బ్రదికించుకొన్నవీరుఁడ నైతిన్. 32

క. ఆమిషము నంటరా దను, మామొండితనం బెఱింగి మము సవరింపన్
స్వామి యొకఁ డపుడు కరుణా, ధాముం దయి మావసించుధరణికి వచ్చెన్. 33

క. పలలంబు దింట తగునని, పలుకుచు మనుధర్మశాస్త్రపంక్తులు చదివెన్
జెలికడఁ దగ వీనుడు లని, తెలిసియు వాక్రువ్వనిచ్చితిని వినయమునన్. 34

గీ. మనువుప ల్కెమితోడ్పడు మాంస ముచిత, భోజనం బనిచెప్పి నాబుద్ధి మార్చ
మున్నెకంటిమనుస్మృతినున్న తెఱఁగు, నదియుఁబ్రక్షిప్తమని కొందఱనుటవింటి. 35

క. ప్రక్షిప్తము కాకున్నను, భక్షణ మిదిపాత్ర మిది యపాత్రం బని సం
వీక్షించి నిర్ణయింపఁగ, దక్షుండను నే నిటన్ స్వతంత్రుఁడ నందున్. 36

వ. కస్తూరిబాయి చదువుసందె లెఱుంగనిబేల - పితృపితామహ పరిపాలితంబగు నాచరణంబ యామెకుఁ బరిగ్రాహ్యము - నిశ్చలంబగు నాపెవిశ్వాస మెవ్వరుం దాఱుమాఱుసేయఁ జాలరు - కాన నామె యామస్కరిం జూచి 37

ఆ. ఎన్నినాళ్లు మీర లెంతబోధించినఁ, బలల మాశ్రయించి బ్రదుకనొల్ల
దయదలంచి నన్నుఁ దలయేరుపాల్సేయ, కొండుదెసకు సాగు టొప్పు ననియె. 38



## 29 ఇంటి సత్యాగ్రహము

వ. వేయితొమ్మన్నూట యెనిమిదవయేట మొట్టమొదలుగాఁ జెఱసాలకాఁపురంబు నాపాలి దాయె-నందు బందీలు తలఁదాల్పందగిన కట్టడలం బరికింప నయ్యవి సంయమి యగు వాఁ డిచ్ఛమైఁ బాటింపవలసిన కట్టుపాటులం బురుడించునని యెఱిఁగితి-నెట్లులన 1

క. ఏ నెట్టిలఁ దోలుతఱిన్, బోనము పెట్టెదరు నల్లపొదమానిసికిన్
దేనీ రొసంగ రుప్పిఁడి, గా నేర్తురు కూర లచటఁగల యధికారుల్. 2

ఆ. ఉప్పుఁజేర్చి కూర నుప్పుఁడు సంబారు, కార మిందు దానఁగలిపికొందు
మనుదు మీరు విందు లారగింపఁగ వచ్చి, నారె యనుచు వెజ్జు నన్నుఁ బలికె. 3

క. వలసిన లవణము నిత్తుము, కలిపికొనుఁడు కూరలందుఁ; గారములేమిన్
దొలఁగదు తిన్నన యనియుం, బలికెను దుద కించుకంత పాకముమార్చెన్. 4

క. ఉప్పుం గారము లేమిడి, యొప్పగు సంయమికిఁ గాని యొకఁ డాజ్ఞయిడన్
దప్పనిసరియై నేమము, నొప్పుకొనుటఁజేసి వాసియొదవదు లవమున్. 5

గీ. వలచి పాటించునియమంబె ఫలము నించుఁ, గానఁ జెఱవీడినంతన కమలమిత్రుఁ
దస్తగిరిఁ జేరుటకుముందె యారగింప, మొదలుకొంటిని దేనీరు ముట్టనైతి. 6

వ. నేఁడు నా కీనిర్ణయంబులు రెండును సాజంబు లాయె – నపుదు లవణముం దినకుంట
లెస్స యనియు, దుర్బలులు పప్పునుసైత ముజ్జగింపఁదగు ననియుఁ గొన్ని గ్రంథములఁ
దెలిసికొంటిఁ – గాని నాకెంతయుం బ్రియములగు నీరెండుపదార్థముల నానాఁడు విడువఁ
జాలనైతి – నిట్లుండ 7

గీ. గరితరోగమ్ము క్రమ్మఱఁ దిరుగఁబెట్టె, సాయపడదయ్యె నపుదు నా జలచికిత్స
యుప్పుఁబప్పును వర్జించు టుర వటంచు, మెలఁతకుం జెప్పితిని గాని మెచ్చదాయె. 8

ఆ. వైద్యుఁ డెవ్వఁడేని వలదని సెప్పుచో, వీనిఁ దినుట మీరు మానఁగలరె
యేమిధర్మమయ్య! యిది యని యిల్లాలు, పంతగింప నాకు వంతయొదవె. 9

క. వెనువెంటన మత్ప్రేమము, వనితకు నెఱిఁగించునదను వచ్చెఁగదా యం
చెనలేని సంతసంబును, గనఁగల్గితి నపుదు వెలఁదుకకు నిట్లంటిన్. 10

క. ఒడెదవు నీవు వెజ్జొకఁ, డాడం బనియేమి యిపుడె యావస్తువులన్
వీడితి నీనియమం బొక, యేడాది పరిగ్రహింతు నీ వెటులన్నన్. 11

వ. అనుటయుం గస్తూరి మిగులఁ బరితప్తయై స్వామీ! నాతప్పు మన్నింపుఁడు – మీహృదయం
బెఱింగినదాన నయ్యు వాగ్దోషంబు గావించితి–నుప్పుపప్పు లేనిఁక నంటనొల్ల–మీశపథంబు
నుపసంహరింపుఁడు – నాదెస నింతపట్టుదల పాటింపకుఁ – డనివేఁడ నాపె నూఱడింపఁ
దొడంగి 12

క. నీ వీరెంటిని వదలినఁ, గావలసినయంతలగ్గు కల్గును నీకున్
నావెల్వరించు బాసను, ద్రోవ నొడంబడ నెఱుంగుదువు నాతెఱఁగున్. 13

క. నాకున్ మేలిదు నియ్యది, యాఁకట్టకు మింక నన్ను నబలా! యిపు డీ
వీకొన్నపనికి నా యీ, పోకయుఁ దోడగును వగను బూనకు మాత్మన్. 14

క. ఏ నిట్లుపల్కఁ బెంకెల, లోనన్ సడిసన్నపెంకెలు గదయ్యా! మీ
రేనాఁడు పరులపల్కున, కౌనంటి రటంచు నింతి యక్కథ వదలెన్. 15

వ. ఈమార్పు సత్యాగ్రహమునం దొకపాలని నాతలంపు - నామనుగడం బాటిల్లిన యుత్తమ ఘటనలం దిదియు నొక్కండుగా గుర్తింతుఁ - దిండిమార్పునంజేసియొండె లాఁతినేమమ్ముల నొండెఁ గస్తూరిబాయి రోగవిముక్త యయ్యె - నుప్పువప్పులం దినమి నాయారోగ్యంబును బుష్టినందె - విసర్జించినపదంపడి వీనిం దినవలయు నన్నకోర్కి నాయుల్లమునం బొడమ దాయె - మఱియు నిప్పరివర్తనంబు కతన నాకునింద్రియశాంతియు సంయమప్రీతియు విస్తరిల్లెఁ - గాన వత్సరంబు కడచన్నను నిషేధంబు నట్ల యుంచితి - నిది దరిదాపు దశ వర్షంబులు సాగె - నీ నడుమ సీమలో నొక్కసారి యానిగ్రహంబు చెడుటకును భారతదేశమ్ము చేరిన పిదప దీనిం ద్యజించుటకును గల హేతువులు మున్ముందు తేటపఱుతు - భోగులకుం గాక బ్రహ్మచారుల కీవస్తువులు తగవని పల్మాఱు సెప్పనోర్తు. 16



## 30 సంయమము

క. ఇంతకుమును కస్తూరీ, కాంతను బ్రాపించుతెగులు కారణముగ నొ
క్కింత మదంధస్సున సవ, రింత జరిగె నంచు వెలువరించినవాఁడన్. 1

క. నా తాల్చిన సంయామము, హేతువుగాఁ గొన్నిమార్పు లేర్పడె ధర్మ
ప్రీతులు కొందఱు వ్రాసిన, వ్రాఁతలు గని నేఁడు పాలు వల దనుకొంటిన్. 2

గీ. ఎఱుఁగుదు న్మను దుగ్ధంబు మరగువాని, కింద్రియవికారములుతద్ద హెచ్చుననియు
మేనిపెనుపునకుం బాలు లేనినాఁడు, కొదవ యావంతయేని చేకూర దనియు. 3

ఆ. బ్రహ్మచర్యదీక్షఁ బాటించునంతకుఁ, బాల నుక్కఁబట్టఁ జాలనైతి
నలఁతికర్జమా పయస్సును వైళంబ, వదలుకొంట యెట్టివారికేని. 4

ఆ. ఇంద్రియాలి నోర్వ నీచాగ మెంతయు, వలయు నన్నబుద్ధి బలియువేళ
నాల నేలువార లాజంతువుల నేఁచు, గతిని జాటుపుస్తకములు డిగ్గె. 5

వ. ఈరచనల యోగాములంగూర్చి కేలన్‌బేకుతోఁ జర్చసల్పితి - నితనిచెల్మి నా కనాయాసమ్ముగా నబ్బె- నది యేర్పడ్డనాఁ డితనిరాచవెచ్చముం జూచి యే నదరిపోవువాఁడ - మా మొదటి చేరికయందు యితఁడు ధర్మతత్త్వముంగూర్చి న న్నడిగె నాఁటిచర్చలో బుద్ధభగవానుని యౌదార్యము లెస్స కొనియాడంబడియె - నదిసుత మామైత్రి విరియఁజొగె - రానురా నస్మత్కార్యంబు లెల్ల నతని కృత్యంబు లాయె - నేకాంగిగా నెలకుఁ బంద్రెండువందలరూకలు వెచ్చించు నిచ్చెలికాఁడు నూటయిర్వదితోన యిలుదీర్చుకొననేర్చెఁ - గారాగృహవాసమ్ము వీడి యేను వచ్చినవెన్క నిద్దఱ మొకయింటనే యుండి యలఁతి వెచ్చముతో బ్రదుకు సాగించితిమి - మా కీ క్షీరవిచార మానాఁడ సంధిల్లె - నతఁ డప్పుడు 6

క. పా లింతచెట్టసర కని, తేలినతరువాత వీని దిగఁద్రావఁగ జం
కేలా దుగ్ధము వదలిన, నేలోపము వచ్చు? నెచ్చెలీ! యని పల్కెన్. 7

క. అక్కజపడి యే నాతని, వక్కణ మెచ్చితిఁ బయస్సు వదలితి మపుడే
యిక్కథ ముగిసినపిమ్మట, మక్కువచేసితిమి పండ్లు మరగి సుఖింపన్. 8

గీ. కటికిపేదలమై బ్రదుకంగవలయు, నన్న యాకాంక్ష మాకుఁ బైకొన్నకతన
వేఱుసెనగలాదిగఁ బెచ్చువిలువలేని, బండములఁదింట కలవాటుపడితి మపుడు. 9

ఆ. ఓగిరంపుమార్పు లుపవాసములు బ్రహ్మ,చర్యమునకు లగ్గుసలుపుఁ గాని
యెదఁద కసటుగుంటవడువున నున్నంత, వట్టి వట్టివారు వాసిగనరు. 10

క. అపవిత్రమైన చిత్తం, బుపవాసముకతన శుద్ధినొందదు భగవ
జ్జపమునఁ జర్చల నాతని, కృపాప్తి నది ధౌతమై రహిం గనఁ జాలున్. 11

క. ఎదకున్ మేనికి బాంధవ, మది యెంతయుఁగలదు దుష్టమగు మానసముం
బొదిగొను దురన్నవాంఛలు, వదలవు భోగేచ్ఛ లనపవార్యము లగుచున్. 12

వ. ఆరగించుపదార్థములయు ననుభవించు భోగములయుం బ్రభావంబు చిత్తముపైఁ బడుట తప్పదు – కాన నుపాసంబులును భోజనసంయామమును వలయునని తలంతు – వికృతమైనమానసంబు శరీ రేంద్రియములకు బానిసయగుంగాని వానిఁ బాలింపఁజాలదు – కావుటంజేసియుఁ దిండిపట్ల నొకనేమంబు పరిగ్రాహ్యము నాఁదగు – నాతిండియు గరగరదై రజస్తమశ్శత్రువై యుంట యావశ్యకంబు. 13



# 31 ఉపవాసము

క. క్షీరాదులు వదలి ఫలా, హారమ్మున బ్రదుకువేళ యమమును బడయం
గోరి తినకుండ నుంటయుఁ, బ్రారంభించితిని 'బేకు' బాసటగాఁగన్. 1

గీ. వైష్ణవకుటుంబమునఁ బుట్టువాఁడ నగుట, సంతతవ్రతనిరత మజ్జనని యగుటఁ
దొల్లి హరివాసరవ్రతాదులు భరించి, నాఁడఁగాని విశ్వాస మానాఁడు సున్న. 2

ఆ. నేఁడు బ్రహ్మచర్యనిష్ఠకు నుపవస్త, మొదవునన్న బుద్ధి కుదిరియుంట
నియ్యకొంటిఁ బస్తు; లేకాదసుల నీర, మొక్కదానిఁ గ్రోలు హక్కుతోడ. 3

వ. నిరశనవ్రతం బిది మొదలుకొన్నయంతన శ్రావణమాసమ్ము వచ్చె – నపుడ రంజానుపర్వం బును సమకూడె – మాకుటంబము వైష్ణవధర్మములోని దయ్యు శైవమును సైత మాదరించుఁ

– గాన నీ(శావణంబునం దేను నక్తంబులకుఁ గడంగితి – నది సత్యాగ్రహంబు సాగుచున్న కాలము – కానఁ జెఱకేగినవారి సంసారములు పెక్కు లా(శమమునందుండె – నందు నానామతంబులవారుం గలరు – స్వధర్మారాధన సేయుచుం బరధర్మమునకుఁ దోడ్పడవలయు నన్న యా(శమనియమ మొక్కండు కలదు – కాన రంజానుపాసములు పాటింపుఁడని ముసల్మానులకుఙ్ఞల కుత్సాహంబు నొదవించితి – వారు నాపల్కు మన్నింప హిందూ(క్రైస్తవులు వీరిమాపటితిండి వండి యీఁజాగిరి – దీనఁ బరస్పరానురాగ మతిశయించె – నుపవాస మహిమ మెల్లరకుం దెల్లయయ్యె – మఱియు 4

గీ. ఆ(శమంబున - దిరపడినట్టివారి, కూటికిం గట్టుపాటులు కొన్నియుంట
నాఁకపెట్టక నాపన్ను నాదరించి, యెల్లవారును డిగఁ(దావి రెఱచితిండి. 5

క. రంజానునందుసైతము, నంజుదుదెస కింతచనక నలఁగక మలకల్
మంజులతం జూపిరి నను, రంజించిరి వీరి మది మఱాక నుతింతున్. 6

క. రుచులూరు వంటకమ్ముల, నుచితమ్ములఁ దీర్చి వీరి కొసఁగుచు మైత్రిన్
(బచురించి హైందవార్భక, నిచయం బాఁనాడు నాకు నివ్వెఱగూర్చెన్. 7

వ. నా పాటించు నొపవస్తముంగూర్చి సెప్పుచుం జెప్పుచు నిచ్చమై విషయాంతరంబు నావిష్క రించితి – నింపితంబగు నియ్యుదంతము నిచటన పేర్కొంట తగు – నగునని కావించు నా యెల్ల చేంతల కనుయాయులం గొందఱ గడించుకొంట నా కలవాటు – నేఁటిసహచరు లుపవాసాదు లెఱుంగరు – కాన నేదో పండువు నెపమ్మున వారి నాదారికిం జేర్చితి – ని ట్లా(శమంబున సంయామలక్షణం బేర్పడఁ దొడంగె – నందఱివారు మ మ్మనుకరించుచుఁ బస్తులకు నొంటికుడుపులకు మెల్లమెల్లన (బియపడంజాగిరి – వీనికతన వారికిం జేకుఱినమే లిట్టిదని గట్టిగా నుడువంజాలఁ – గాని నాకు సంయమశక్తియు నారోగ్యముం గుదిరె – నిప్పస్తు లెల్లరకుం బాగునొదవించునని తలంపనేర – నేలయన 8

క. మన సింద్రియ విజయముదెస, ననురక్తం బైననాఁడ యనశనదీక్షల్
పనిసేయుఁగాని కేవల, తనూపవాసమున విషయిదర్పం బఱునే. 9

శ్లో. "విషయా వినివర్తంతే, నిరాహారస్య దేహినః
రసవర్జం రసోఽప్యస్య, పరం దృష్ట్వా నివర్తతే."

వ. అను గీతాశ్లోక మిచట విచార్యంబగు – నింద్రియ దమనమ్ము వలచువాని కుపవాసాదినియ మమ్ములు వలయుఁ – గాని మేనితోపాటు చిత్తంబు పస్తుండదేని దాన లగ్గులేమియకాక యెగ్గుసైతము వాటిల్లు ననుట యొప్పు. 10



# 32 అయ్యవారు

ఆ. చదువునేర్పఁదగిన శాబకుల్ బాలిక, లాశ్రమమునఁ బెక్కు రమరియుంట
నచటఁ బితృపదమ్మునం దున్నవాఁడ నే, నగుట వీరిలెస్స యరయవలసె. 1

గీ. అయ్యవారిని రావింప నాశ్రమమున, కేమిసంపత్తి కల? దది యెట్టులున్న
నేఁటివిద్యావిధానంబు నేర్పు తెలివి, నాకు సంతృప్తిజనకంబు గాకపోయె. 2

వ. కాని సముచితవిద్య నాయనుభూతిలోనిది కాదయ్యెఁ – బితరులు తగువారే కుఱ్ఱల దిద్దుదురే నదియ యాదర్శవిద్యావిధానంబు నాఁజను – నిందేని బాహిరంబగు తోడ్పాటు కొంత వలయుఁ – గాని యీబిడ్డలు పిన్నటనాఁటినుండియు నాదండలేమియకాక భిన్నభిన్న మతములలో వేఱువేఱు సంస్కృతులలోఁ బైకి వచ్చిరి – వీరికి నాజనకస్థాన మెంత యుపకరించు? – విద్యా బోధనమునఁ జిత్త సంస్కారము ముఖ్యమని నాతలంపు – దీని నేయీడులో నేయలవాటులలో నున్న వారికేనిం గఱపుట సుకరంబ – దీనికి సద్వర్తన మాధార – మీయాదరువు గట్టిదైన నితరాంశము లక్కఱయైనపు డనాయాసవేద్యంబు లగుఁ – గాన సర్వదా యే నీబుదుతలలో నప్పంబలె మెలంగుచుంటి – వెండియు 3

ఆ. శబ్దశుద్ధి నెఱిఁగి చక్కఁ బరించుట, వ్రాయుటయును గొంతవలయుఁ గాన
దీని నేర్పుపొంటె దేశాయి కేలను, బేకు లొప్పుకొనిరి పేర్మినింపి. 4

గీ. చదువునకుఁ దోడు దేహశిక్షణము గఱపు, టక్కఱయకాని మలమెత్తుటదితొడంగి
వంటకమ్ములు సవరింతవఱకు మేమ, కర్తలము కాన వేఱ యీకష్ట మేల? 5

క. ఫలవృక్షము లెన్నేనియుఁ, గల వాశ్రమభూమి వీనికర్జము పూనన్
వలఁతులగు సేవకులు లే, రెలమిన్ మాపిన్నపెద్దలే దిద్దవలెన్. 6

ఆ. మాలితనము నేర్చి కేలను పాటలు, పాడుచుం గదల్చుఁ బాదుపాదు
చెట్టుచెట్టుకడకుఁ జినచిన్నకాల్వలు, త్రవ్వు నేతమెత్తు నొవ్వులేక. 7

ఆ. పనికిరానిచెట్లు పడఁగొట్టి తొడుగుల, నీడ్చుచుండ్రు పిన్నలూడ్చుచుండ్రు
క్రేళ్లవాతి నారుమళ్లకు మదవలు, మార్చుచుండ్రు బోదె తీర్చుచుండ్రు. 8

క. పిడిఱాళ్లవోలెఁ జఱుతల, యొడళ్లు నానాఁడు బిగియుచుండెను దీనన్
బడిలో వెండియు వేసట, పడయం బనిలేకపోయెఁ బసివారలకున్. 9

ఆ. తోఁటపనియుంటగరగరతోయముంట, మదుఁగుఁదెమ్మెరయుంటనెమ్మదియునుంట
దిండి కొకనేమ ముంట నేతెగులులేక, మనిరి సంతృప్తిగని రాశ్రమమునవారు. 10

క. ఒక్కొకతతిఁ గొందఱు పని, తక్కుదు రర్భకులు కొంటెతనములు చూపన్
నిక్కుదు రైనను మెల్లన, నొక్కుమ సవరించినాఁడ నొవ్వక వీరిన్. 11

క. ఏదేని చేతిపని యొకఁ, డాదరువుగ నుంట వలయునని బిడ్డలకున్
బాదువులు కుట్టుచందము, లేఁదెల్పితి బేకునేర్పె నీకళ నాకున్. 12

గీ. అతఁడు వడ్రంగమును నేర్పె నర్భకులకుఁ, గఱపె నొకరుండు పాకప్రకార మెల్లఁ
బాప లేనాఁడుఁ దలఁపనిపనులు నేర్చి, తెలివునందిరి నాకును దృప్తిహొడమె. 13

క. తనచేయనికర్జము కు, ఱ్ఱనికిన్ దేశికుఁడు చెప్పరా దనుచట్టం
బొనరించితి మట్లగుటన్, నినుపారినవేద్కఁ బనులునేర్చిరి శిష్యుల్. 14



# 33 అక్షరజ్ఞానము

ఆ. చేతిపనులు కొన్ని చిన్నలకున్ మప్పి, వాసిగంటిఁ గాని బాసనేర్ప
మిగుల నిడుమపడితిఁ దగుశక్తిలేక వి, శ్రాంతిలేక కరణసమితిలేక. 1

ఆ. పవలు రెండుజాలు పనిచేసిచేసి వే, సారి విరతినందఁ గోరువేళఁ
జదువుసెప్పవలయు సందడిగావించు, నిదుర నాఁపవలయు నెతి వెలార్చి. 2

వ. బాలురకు వారితల్లిబాసయందు చదువు సెప్పవలయు ననునేమంబు మాకుఁ గలదు - కాన నుర్దూ హిందీ ఘూర్జరీ తమిళములఁ బాఠములు సెప్పుచు హిందీ యింగ్లీషుల సాధారణభాషలుగా నేర్పుచుంటిమి - హిందీ గుజ్జరిబాసలవారికి సంస్కృతముసైతము బోధించితమి - చరిత్ర గణిత భూగోళ విషయము లెల్లర కుపదేశింపఁ బడుచుండె - నుర్దూ తమిళములం గఱపుట నాపాలిపని యయ్యె - నేనీ రెండుబాసల నోదలలోఁ జెఱసాలలలో నించించుక నేర్చితి - ఘూర్జరీ సంస్కృతము లున్నత పాఠశాలలోఁ జదివితి - నా పాండిత్యము లీదృశంబుల - కాని 3

గీ. దేశభాషలపై నాకుఁ దీపియుంటఁ, బాఠములు సెప్పునేర్పు నాపాలి దగుట
శిష్యు లేమియు నెఱుఁగనిచిన్న లగుట, సాధువులు నొట నాబండి సాగిపోయె. 4

క. చట్టులకద నాయెఱుఁగమి, నె ట్టెట్టో మఱువుసేయ కిది రాదనుచున్
బట్టబయలుచేసితిఁ గ, న్నట్టిద బోధించి వారి యాదృతిఁ గంటిన్. 5

గీ. కుఱ్ఱలకుఁ దద్దయుంజెట్ట కూరఁజేయు, సోమరితనంబు నడఁగింపఁ జూచినాఁడ
నాసపడి పొత్తముల్ తమయంతఁ దామ, చదువుకొనునట్లు దిద్దితి శాబకులను. 6

క. వలయుం బరనీయము లను, కలకల మెల్లెడల మొరయుఁ గానీ! చదువున్
వలచెడివానికి నొజ్జయు, వెలగలపార్యం బటంచు వినుపఁగనోర్తున్. 7

క. నాయొజ్జ పుస్తకమ్ముల, సాయంబున నేర్పినట్టిచదువున ముక్కా
లేయెడకో చనె విడిగా, నేయది బోధించె దాని నిపుడున్ మఱవన్. 8

గీ. నేత్రమున బాలకులు నేర్చునేర్మికంటె, శ్రోత్రమున లెస్సయెఱుక నేర్చుటయథార్థ
మగుటఁబరనీయపుస్త మెయ్యదియునాఁడు, చదువదామూలచూదమ్ముఛాత్రజనము. 9

క. నానావిధపార్యంబుల, నే నించించుక పరించి యిందలిసారం
బానాఁడు నాదుపల్కునఁ, గూనల కందించి తెలివికూరుటఁ గంటిన్. 10

క. విన్నది విన్నట్టులు నా, సన్నిధి వివరింత్రుగాని చదివినదానిన్
దిన్నగ వక్కాణింపరు, పిన్నలు మది నిల్వ విట్లుపెనఁచినవిద్యల్. 11

ఆ. అలఁతలేనిహూఁట నాదుచుం బాడుచు, సరసఫణితి నేను గఱపుమాట
వీను లొగ్గియొగ్గి విందు రౌచిత్యమ్ము, నెఱిఁగి మురియుచుంద్రు చిఱుతవాండ్రు. 12



## 34 ఆత్మ శిక్ష

గీ. కడఁకమై నాశ్రమస్థులౌ బుడుతవాండ్ర, మేనికిని దెందమున కింత మెఱుఁగుపెట్టఁ
జాలితినిగాని యాత్మకు మేలివెల్గు, చేకుఱంజేయ మిగుల నోలాకుపడితి. 1

క. తనపాటించెడిమత మే, మనిపల్కుఁ దదీయతత్త్వ మది యెది యంచున్
మనుజుండు తరిచి సత్యము, గనవలయుంగానఁ గొండికల కీతెలివిన్. 2

వ. నాయెఱింగినంతకఱపుటంజేసి వారు తమతమధర్మంబులపట్ల సామాన్యజ్ఞానమార్జించిరి
– కాని యిది మానసికశిక్షయం దొకపాల యని నాతలంపు – మఱి మేలినడక నలవరించు
టయు నీశ్వరతత్త్వ మెఱిఁగించుటయు నాత్మజ్ఞాన మాపాదించుటయు నాత్మశిక్ష నాఁ జను
– నియ్యెఱుకువ నొదవింపఁ బెద్దలు కుఱ్ఱల కెంతయుం దోడ్పడవలయు – నీతెలివితక్కఁ
దక్కెల్ల తెలువులుం గొఱగానివనియుఁ బైపె చ్చరిష్టదాయకంబు లనియు నాయాశయంబు
– సన్న్యసించిననాఁడ మానవున కాత్మజ్ఞాన మేర్పడునని కొంద ఱందురు – కాని తురీ
యాశ్రమంబుదనుక నెవ్వఁ డీయమూల్యసంపదకు దవ్వుగా నుండు నతఁడు దీనిం
గనలేనివాఁ డగుటయకాక రెండవ కొండొకతనంబు నాఁ దనరి కరుణాజనకంబగు
వార్ధకమునం జిక్కి నేలకు వ్రేఁగగునంట సముచితంబు – వెండియు నాత్మశిక్షావిధాన
మెద్దియని యెంచియెంచి తొలుతొల్తఁ గుఱ్ఱలచే భజనచేయించితి – నీతిరచనలు వారికి
వినిపించితిఁ – గాని నా కీపథంబు సంతృప్తి నొసఁగదయ్యె. 3

క. పుస్తకముకతన నాత్మిక, శస్తోన్నతి సంతరింపఁ జాలఁడు గురుఁ డన్
వాస్తవ మెఱిఁగితిఁ గుఱ్ఱల, నేస్తము నా కనుదినంబు నెగడినకొలఁదిన్. 4

క. నిజవర్తనమున శిష్య, వ్రజమున కీశిక్ష నొసఁగవలయును గురుఁ డా
ప్రజ దవ్వుల నున్నను దా, నజస్రజాగర్య నుండనగు శీలమునన్. 5

క. సౌశీల్యనిదానం బగు, దేశికుఁ డేదీవులందుఁ దిరుగుచునున్నన్
దా శిష్యుల కాత్మబల, ప్రాశస్త్యము పంచి సాయపడునోర్పు నిటన్. 6

క. ఇసుమంతయు జంకక యే, నసత్యముల నాడుతఱి మ దంతేవాసుల్
వసపడుదురె సూనృతమున, కసాధువులశిష్యు లెట్టులగుదురు సాధుల్. 7

వ. దీనంజేసి నాసన్నిధినుండు యువతీయువలమ్రోల నేన యొక పదార్థపారముగాఁ బరిణామ మందవలయు ననుసత్యం బెఱింగితి - నిందు మచ్ఛాత్రులే నాకొజ్జలైరి - వీరికొఱకేని యే నచ్ఛశీలుండనై నాసౌజన్యముం బరిరక్షించుకొంట యావశ్యకంబని కంటి - నీ టాలుస్టాయి యాశ్రమంబునఁ బాటించిన మదీయమ్ములు నానావిధనిగ్రహమ్ము లీశిష్యు లొనరించినయుపకృతి స్మఱవఁజాలవు - మఱియునిందు 8

క. అల్లరి కాచార్యుండగు, పిల్లఁడు కలఁ డొకఁడు సాటిపిన్నల నెపుడున్
గిల్లి తగవాడు నాతఁడు, కల్లలకుం బుట్టినిల్లుగా మనుచుండున్. 9

ఆ. ఎంతవారినైన నెదిరించునాతఁ డొ,క్కపు డొనర్చెఁ బెద్దయాగడంబు
కుఱ్ఱవాండ్రపట్లఁ గోపం బెఱుంగని, నాకు నాఁడు కడిఁదికాఁక రేఁగె. 10

క. అతనిం గదిసితిఁ గఱదలు, శతములు సెప్పితిని గాని సరిపడఁ డయ్యెన్
జతురతఁజూపి ననుం దన, మతకంబున కగ్గపఱుప మార్గము లరసెన్. 11

క. ఏచినకిన్కకు లోపడి, వైచితి నొకకఱ్ఱదెబ్బ వానికరముపై
నీచేఁతలోన నాకు న,హో! చే యననేల యెల్లయొడలును వడఁకెన్. 12

క. నా కంపనగతి యంతయు, నాకుఱ్ఱఁడుఁ జూచియుండు నతఁ దంతఁ గడున్
శోకించుచు ని న్నేఁచిన, నాకుం గరుణింపుమని వినమ్రతమెఱసెన్. 13

ఆ. అతఁడు బలిసి పిన్నయాఁబోతు కైవడి, నుండె నొకటి వేయ రెండు కొట్టఁ
గలఁడు కాని నన్ను నలమినయలమట, కన్నయంత నతనితెన్ను మాఱె. 14

క. అతఁ దవ్వల నా కవిధే, యత చూపఁడ కాని వాని నవ్విధి దండా
హతుఁజేఁత నింతవట్టును, వెతపాలగుచుండు సిగ్గువెంపర గండున్. 15

ఆ. అతనిఁగొట్టి యస్మదాత్మోన్నతిం గాక, చూపినాఁడ నా పశుత్వగరిమఁ
బిన్నవాండ్రఁ బట్టిపీడించి విద్యలు, గఱపు టేనికేని గానిచేఁత. 16

వ. నా యెల్లబ్రదుకులో నొక్కమాఱ నాబిడ్డ నొకని మొత్తితిఁ – గాన నేఁ డా విద్యార్థి నట్లు లగుదంబునం జఱచుట యుచితంబని యిందనుక నూఱడిల్ల నేరనైతి – నిప్పునికి మూలంబు రోషము – మోఁదుట యుద్దేశము – కాన నిది క్షంతవ్యమెట్లగు? – నిప్పట్లఁ బరితాపముం బ్రకటించుటయ నావిధి – కాని దానితోపాటు దండనముసైత మీకొని యపరాధినైతిఁ బసివాండ్ర కాత్మజ్ఞాన మొదవింపఁ గడంగి యేన యిట్లుదాని నార్జించుకొంటి. 17



# 35 సదసద్యోగము

ఆ. ఆశ్రమోర్వియందు నవగడంబుల కల, వాటుపడ్డ కుఱ్ఱవాండ్రు నుంట
వారితోడ మత్కుమారులు మూగురు, సందుకొంట బేకు సైఁపఁదాయె. 1

క. ఆ కొంటెమూఁక వెన్నడి, మీ కొడుకులు తిరుగ నెట్టి మే లొదఁగూడున్
బోకిరిబిడ్డలు వీరుం, గాకుందురె యంచు హితముగఱపెను నాకున్. 2

వ. పదంపడి యే నమ్మిత్రుని గని 3

క. ఆ పిల్లల నా పిల్లల, నేపగిదిన్ వింగడింతు నిరువాఁగుల కే
నే పూఁటకాఁప నైతిని, నా పిల్పున వారువచ్చినా రిచ్చటికిన్. 4

క. వా రింద నిల్వవలయును, వారలతోడన చరింపవలె నా సుతులున్
వీరికడ మంచియుండిన, వారికి నది యేలపట్టువదదో చెపుమా. 5

ఆ. వారికంటె గొప్పవారు మీరంచు నా, పిన్నవాండ్ర కిపుడె భిన్నభావ
మదరఁజేఁత యుక్తమందువా యిది వీర, లెఱిఁగిరేని చెడుదు రింతజనము. 6

క. ఆ సంసర్గముకతనన్, నా సుతు లిదిదోష మిదిగుణం బనుచు నిరా
యాసంబునఁ దెలియంగల, రాసింపఁగఁదగిన శిక్షయగు నియ్యదియున్. 7

క. అటుగాక దీన నేసం, కట మొదవిన సైఁతుఁగాని కఱకరినై నేఁ
డిటనుండి వారిఁ దరలిం, చుట కింతయు నియ్యకోలు చూపఁగఁజాలన్. 8

వ. ఇట్లుపల్క నతఁడు నిత్తరుం దయ్యె – నవ్వల నగ్గదుసువాండ్రతోడి నెయ్యంబునంజేసి నా కొడుకుల కెట్టిచెట్టయుం గల్గమియకాక లగ్గుసైత మాపాదిల్లెనని చెప్పనోర్తు – వీరి కేము దొడ్డవారమన్న యహంత యావంతయే నేర్పడ్డ నది యీచెలికారంబుకతన మటుమాయ మాయెఁ – దల్లిదండ్రులు కనుగల్గి యుందురయేని బిడ్డలు చెడ్డవారిం గూడిమాడియుంటఁ గొఱగాములపాలు కారని యీ యనుభూతివలనఁ గంటి – నానాప్రకృతుల బాలికాబాలకుల నొక్కయెడన నిల్పి చదివించుట పితరులయు నొజ్జలయు మెలంకువ కొకయొరగల్లు – వీరి కిప్పట్ల వేయికన్నులుంట వలయు నందు. 9

# 36 ప్రాయశ్చిత్తము

గీ. బాలికాబాలకుల మేలిబాట నునిచి, విద్దియలు నేర్పి చక్కఁగా దిద్దుటన్న
నంతలంతలతోఁ దీరునట్టిచేఁత, కాదటం చనుభూతిమైఁ గన్నవాఁడ. 1

వ. ఏను వీరి కాచార్యుఁడనై పాలకుఁడనై యున్ననాఁడు వీరిడెందములం జొరవలయు - నౌగాములం బాల్గొనఁదగు - జీవనమర్మములం దేటతెల్ల గావింపఁ జనుఁ - గ్రేళ్ళవాఱు జవ్వనంపుటలల మేలిబాటలం బరఁగింపనగు - నది యట్లుండె - సత్యాగ్రహులు కొందఱు బందిగమువీడి వచ్చినపదంపడి టాలుస్టాయి యాశ్రమంబున జనసంఖ్య తగ్గె - నున్నవారిలోఁ బెక్కురు ఫినిక్సువా రగుట వారి నచటి కంపి యేను జొహాన్సుబర్గునం దుంటి-నయ్యవసరంబున 2

గీ. ఆశ్రమంబునవా రిద్ద ఱక్కటా! భ,యంకరంబగు పతనంబు నంది రన్న
వార్త చెవిసోఁక నామేను వణఁకె గుండె, లదరె నది నాకు వజ్రప్రహార మయ్యె. 3

క. నాయస్త్రము సత్యాగ్రహ, మేయెడనే నడఁగిపోక యే విన్నతఱిన్
నాయుల్లం బీతల్లడ, మీయలజడిపె ల్లెఱుంగ దెరియదు నిట్టుల్. 4

క. ఎపుడో చెప్పెను గస్తురి, విపరీతము లిట్టి వుద్భవిలునని పెఱలన్
నెపమెంచక నమ్మెడి చం,దపుమానిసినౌటఁ దద్హితము విననైతిన్. 5

గీ. కదలితి ఫినిక్సునకు జాలిఁ గదురఁజేయు, నాయవస్థను దెలిసికొన్నాఁడు బేకు
వలదు నీ యొంటిమై నేగవలదు నేను, వత్తు నీవెంట నని పట్టుపట్టె నతఁడు. 6

క. పాలితులు సేయుచెట్టకుఁ, బాలకులున్ బాధ్యులన్న పాడిని గంటిన్
దూలక తద్దోషమునకుఁ, జాలినశిక్షను భరింపఁజను ననుకొంటిన్. 7

వ. ఆపతనమునకుం దగినప్రాయశ్చిత్తము నేన చేసికొన్ననాఁడు పతితులకు నావేదనయుం దమనేరంబును దేటపడి వివేకంబొదవునని తలంచి యేడునాళ్ళు నిట్రులు నాల్గునెలల పదేనుదివసంబు లొంటితిండియు సాగింప దీక్షగొంటి - నపుడు బేకు 8

గీ. నన్ను వారింప యత్నించినాఁడు గాని, వీసమేనియు నాపూన్కి విడువనైతి
నవల నాత్రొక్కుమార్గంబు నతఁడుమెచ్చి, పంతగించెను నాతోడఁ బస్తునెఱప. 9

క. ఆతని మధురాశయమున, కాతంకము సెప్పఁజాల కగుఁబొ మ్మంటిన్
నాతీ రిట్టుల మాఱుట, చేతన్ జేతస్సు శాంతిసేవధి యయ్యెన్. 10

క. నాగుండెల నల్లార్చెడి, వ్రేఁగంతయు సడలెఁ దొలుత విరిసిన కోపో
ద్వేగం బల్లన రూపఱ, నాగఃకర్తలదెసన్ దయార్ద్రుఁడ నైతిన్. 11

వ. ఇదియంతయు దారియంద నిర్ణీతమయ్యె - నంత ఫినిక్సునం దడుగువెట్టి వలయు వార్తల నెఱింగితి - నాపూనిన యుపాసమునంజేసి యందలివారెల్ల రల్లాడిరి - కాని దాన వారి

నదవడి చక్కంబదె - దుష్కృతినా నెంతబెడిదమో వారి కప్పు దవగతంబాయె - విద్యార్థినీ విద్యార్థులతోడ నాకుంగలచెల్మి కదుంగడు గట్టిపడియె - నియ్యవగడంబు జరిగిన వెను వెంటన యేతదనుబంధమ్ముగా వెండియుం బదునాల్గునాళ్ళు పస్తుపూనవలసె - దానిఫలం బే నపేక్షించినకంటె నుగ్గడువుగా నొదవె - నైనను 12

ఆ. శిష్యులాచరించు చెట్టలకెల్ల ని,ప్పగిది నయ్యవారు పస్తులుంట
వలయునంచు నేను వాక్రువ్వఁగాని యొ,క్కొక్కతతి నుపాస మొదవునందు. 13

వ. ఇట్టి ప్రాయశ్చిత్తంబులపట్లఁ దగినప్రాజ్ఞతయు నధికారంబును వలయు - మఱియు గురు శిష్యుల కొండొరులదెస నిష్కళంకమగు ననురాగబంధము లేనితతి నంతేవాసి యొనర్చు నేర మాచార్యునుల్లమున కార్తి నొదవింపనిపట్టునఁ జట్టున కొజ్జపై మన్ననలేనినాఁడు కావించు నుపాసము రిత్తయగుటయ కాక యొకప్పు దపకృతికిసైతము కారణంబగు - నీపస్తులయెడం గొందఱకు సందియం బుండవచ్చుఁ - గాని శిష్యునేరమునం గొంత కాచార్యుండు ప్రతిభు వనుట పాడి. 14

క. ఈ నిరశనవ్రతంబును, బూనినయపు డేను దస్సిపోవక పనులన్
మానక చేసితిఁ జేయుట, లో నింతయు మందగతికి లోపదనైతిన్. 15

ఆ. ఒంటిపూఁటతిండి కొగ్గినతతిఁ బందుఁ, గాక వేతొకందు తాఁకనైతిఁ
బదియునాల్గునాళ్ల పస్తులోఁ గడపటి, కాల మీద్వఁ గొంత కష్టపడితి. 16

ఆ. ఉపవసించువార లుదకంబు తద్దయుఁ గ్రోలవలయు నన్న గుట్టెఱుంగ
రామనామజపవిధా మహిమంబేని, నాఁడు తెలిసికొన్నవాఁడఁ గాను. 17

వ. మఱియు నాకద నొవ్వనోర్చు నేర్మియు నల్పంబ - కాన నియ్యుపవస్తమునఁ గస్తికుడిచితి - నపుదు నాకుత్తుక వట్టిపోయె - నొదలు శుష్కించె - మాట బిగువుసడలెఁ - గాని తుట్టతుదివఱకు రామాయణాదు లాలకించితి - నావశ్యకమ్ములగు కమ్మలు వ్రాయించితిఁ - గర్జంబులు గావించితి. 18



# 37 గోకులుం గదియుట

క. పదియుందొమ్మిదివందల, పదునాల్గవయేట నిల్వఁబడియె నహింసా
సదనము మత్సత్యాగ్రహ, కదనం బది దక్షిణాఫ్రికారంగమునన్. 1

వ. అంత గోకులునిచ్చ ననుసరించి యింగ్లాండువలన మాతృదేశంబుచేర సమకట్టి కస్తురితోదను బేకుతోదను సీమకుఁ బ్రయాణంబుసాగించి నౌకాధికారు లొసంగిన మేలిమేలిసౌకర్యముల ననుభవించుచుఁ గదలిపై నష్టాదశవాసరంబులు గడపితి - నిప్పయనంబునం జాగిన

విషయము లొండురెండు వక్తవ్యములు - కేలన్ బేకునకు దుర్బిణులదెస మక్కువ హెచ్చు నాఁదగు - నతనికడ నప్పు దేదుపొండ్ల విల్వగల దూరదర్శకయంత్ర మొక్కఁ డుండె - నేను దానిం బురస్కరించుకొని 2

గీ. నెచ్చెలీ! నిఱుపేదలనెతిని మనము, బ్రదుకుసాగింప నెన్నఁడో ప్రతినబూని
యింతవెలగల పనిముట్ల నిచ్చగింపఁ, జనునె యిదిలేమి నేలోటు సంభవించు? 3

క. అనిపల్కుచుఁ బయనంబున, దినదిన మీచర్చ పెంచితిని దుద కొకనాఁ
డనుఁగుం గని మనకిట్టులు, పెనఁకువ సంధిల్లఁజేయుబిస నిద్దానిన్. 4

క. మున్నీటి కొసఁగఁదగదా, యన్నా! యేమందు వంటి నతఁ డౌననియెన్
గ్రన్నన విసరితిఁ గిటికీ, తెన్నున యంత్రంబు నంబుధిం గుదురుకొనన్. 5

ఆ. వలచి వాడుచున్నవస్తు వీకైవడిఁ, జెడెఁగదా యటన్నచింత సుంత
యెఱుఁగఁడాయెఁ గేల నితనికి నా కిట్టి, యనుభవమ్ము లన్వహమ్ము ప్రబ్బు. 6

క. ఇరువురమును సత్యమ్మును, మరగి బ్రదుకుచుంటి మిట్టిమన్గడకతనన్
బిరబిరఁ గోపాదికములు, దురాశయమ్ములు నలంగి తొలఁగంబాఱున్. 7

వ. అయ్యవి పాయగిల్లనంతవట్టు నరుండు సత్యముం గనఁజాలఁ దందు - రాగద్వేషాదులున్న మానిసి యుదారుఁడు కావచ్చుఁ - గల్ల లాడక పోవచ్చుఁ - గాని యంతమాత్రన వానికి శుద్ధసత్యంబు ప్రాప్యంబు కాదని విశ్వసింతు - దాని నభిలషించువాఁడు ద్వంద్వములవలనం దొలఁగియుంట వలయు - వెండియు 8

ఆ. పస్తులుంట ముగిసి పదినాళ్ళు గడవక, ముంద కదలిపోక మొగియుకతన
నంజినట్టి దఱుగ నావపై నటునిటుఁ, దిరుగ మొదలుకొంటి దినదినమ్ము. 9

ఆ. ఉక్కు లేమిఁజేసి పిక్కలలోఁ దీపు, లెక్కుదయ్యె నోడ నిట్లునదవ
సీమ నడుగుమోపి జీవరాజున కీ య,వస్థ చెప్పికొంటి వైద్యమణికి. 10

గీ. అతఁడు కొన్నాళ్ళవిడుగర నందవేని, గాళ్ళకుం జేటురాక నిక్కంబ యనియె
నవల జాగర్యపూని యల్పాల్పభుక్తి, నల్లనల్లన గంటి ననామయంబు. 11

వ. అయ్యది యట్లుండె - మాయోడ మదీరా చేరినంతన మహాయుద్ధము సిద్ధము కానున్న దనువార్త మాచెవింబడె - నింగిలీసుకాల్వం బ్రవేశించుతతి సమరమారబ్ధమై మానావ యచట నిలిచిపోయె - నీటిలో దొంగదారు లేర్పఱుచుటం జేసి మేము సౌతాంప్టను చేరుట కొండురెండునాళ్ళు తడవయ్యె - నాగస్టు నాల్గవ దివసమ్మున నని సాగె - నాఱవ దినమునం దేము సీమ నడుగుపెట్టితిమి. 12



# 38 పోరిలో నాపాలు

సీ. ఆంగ్లావనికిఁ జేరినంతన గోపాల, కృష్ణుఁ దనామయశ్రీ గడింప
వలచి ఫ్రాన్సునకేగి తలకొన్న బెడిదంపు, జగడమ్ముకతన నచ్చటన చిక్కు
వడియున్నవాఁ డన్నవార్త నాలించి ని,ట్టూర్చి సీమకు నగ్గురూత్తముండు
వచ్చుట కెన్నాళ్ళువట్టునో యీలోనఁ, గర్తవ్యమేమి యీకలనిపట్ల
గీ. ధర్మ మెయ్యది నాకంచుఁ దలఁచి యచటి, భారతీయుల నందఱఁ జేరఁదీసి
సమరమునఁ దెల్లవారికి శక్తికొలఁది, మనము సాయంబు గావింపఁజను నటంటి. 1

ఆ. సమ్మతింపరైరి సభ్యు లాంగ్లేయుల, నాదరింపుఁ దన్న నాదునుడికి
బానిసీంద్రు మనము ప్రభువులువార లా, దెసకు సాయపడుట పాసఁగ దనిరి. 2

క. తేనికి మూడినరాయిడి, బానిస తనమే లటంచు భావించి పరా
ధీనత నూడ్చుకొనం దగుఁ, గాని యిదే మనిరి వాదకౌశల మదరన్. 3

వ. అప్పటి నానమ్మికంబట్టి వీరివాక్రుచ్చుపల్కు లేను లెస్సలని తలంప నోపనైతి – మనకును దెల్లవారికింగల వేఱడము వెగ్గలంబని యేనెఱుంగుదుఁ – గాని మన మింతతక్కువపాటునం బ్రుంగియుంటి మన్న తెలివి నా కానాఁడు లేదయ్యె – వెల్ల రాచతిక మించుక మంచి దనియు నందలిదొరలు కొందఱు చెట్టలనియు వారి నర్మిలిబలిమింజేసి చక్కఁబఱుపవచ్చు ననియుఁ దెల్లవారితోడ్పాటున మనము లగ్గువడయం దలఁతుమేని వీరికిం బాటిల్లిన యిడుమం గడవఁబెట్టి యవ్వల మనయిమ్ముదప్పూఁ దొలఁగించుకొంట కర్జంబనియు నప్పు డే నరయువాఁడ – నిపుడు వీరిదొరతనంబుదెస నాకు నిచ్చ యావంతయేని లేమి నిక్కంబు – నేఁ డీయేలు బడి కేను బాసటకానొల్ల – నా యిప్పటితలపోఁత లీచేరినచెలికాండ్ర కప్పటిక పాటమరించె–నిట్టివారు నాతెన్నుమన్నింతురా?–యట్లయ్యు నాపట్టువదలక 4

ఆ. బిగిసి తెల్లవారి బెదరించి యొత్తుడు, పాలుచేసి మనవరాలు వడయఁ
గడఁగఁదగ్గ యదను గాదిది కయ్యంబు, నిలుచదనుక నోర్మినిలుపు వలయు. 5

క. మనసభ్యత మనయీవియు, మనదూరపుఁజూపు నపుడు మహికిం దెలియున్
మనయున్నతి నందకమును, మనయున్నతి నందనేర్తుమా యని యంటిన్. 6

ఆ. నన్ను మెచ్చువారు నామధేయమ్ముల, నొసఁగుఁ దంటి లెస్సయొరయుఁ దంటి
నెల్లదెసలవారి యెల్లమతమ్ముల, వారిపేర్లు పెక్కు వచ్చిపడియె. 7

వ. పదంపడి "స్వయంసేవకవృత్తి నూఁది బవరమ్మున గాయపడ్డబంటుల కూడెంబు నెఱప నే మాయితంపడి యప్పనికిందగిన దిద్దుపాట్లు వడయ నుబలాటపడుచున్నవార"మని వార్డు క్రూకునకుం దెలుప నతండు మమ్ముఁగొండాడి మాకొల్పున కియ్యకోలు చూపె – నంత మేటివెజ్జు కేంటలీచెంత నాఱువారమ్ము లే మెనుబండ్ర మయ్యాయిసవరింత లెఱింగి

తత్పరీక్షలో నెగ్గి కర్నల్ బేకరుకనుసన్నల నగరిడి నేర్చితి - మితండ మాకూటువకుం దళవాయి యయ్యె - వెండియు 8

క. ఏమూలఁగన్న నపు డా, సీమను రణకౌతుకంబు చిందుచునుండెన్
క్షేమము గలవారందఱు, సామునమర్మమ్ము లెఱుఁగజాగిరి కడఁకన్. 9

ఆ. మేనిబిగువులేనిచానలు ముదుకంద్రు, మాతృదేశభక్తి మల్లడింపఁ
బోర గాయపడ్డవారికి నొదవెడి, యుడుపు లేర్పరింపఁ దొడఁగి రెలమి. 10

క. అనిసేయు జోదులకు వల, సినదుస్తులు కుట్టి యొసఁగ సిద్ధపడియె లం
డనునగరస్త్రీమండలి, తనరు సరోజినియు నం దుదాత్తపదమునన్. 11

గీ. కత్తిరించిన గుడ్డలకట్ట యొక్కఁ, డాపె నాపాలుచేసి మీ రోపినన్ని
కుట్టిపంపుఁ డటంచు నన్గోరెనదియ, మొదటిదివసంబు మానెయ్యమునకు నెల్ల. 12

క. ఆయమ్మకోర్కి మెచ్చితి, నా యనుఁగుంజెలులఁ గూడి నాడెము వెలయన్
రేయుం బవలుం బడి పలు, తోయమ్ములఁ దీర్పఁగంటి దురమునదుస్తుల్. 13



# 39 ధర్మసందేహము

గీ. తొడరునెడఁ దెల్లవారికిం దోడునిల్వ, నడుముగట్టిన నానేఁటినడత నెఱిఁగి
యిది యహింసకు నగ్గమై బ్రదుకునీకుఁ, దగునొకో యని పోలక్కు తంతినంపె. 1

గీ. మున్ను హిందూస్వరాజ్య మటన్నపేర, నా రచించినపొత్తములో రణంబు
నీసడించితిఁ గాన నన్నిట్లు నెయ్యుఁ, డెదిరె నిది తప్పదనియు నేనెంచుచుంటి. 2

వ. ఆలంబు కూడనిపనియని దక్షిణాఫ్రికామిత్రుల కేను బలుమఱుం గఱపితి - నాపల్కు వారిమైకోలుం బడసె - వెండియుం దిట్టినవానిఁదిట్టక కొట్టినవానిన్గొట్టక తాలిమిం జూపఁదగు ననితలంచు నే నిద్ద అనికిం దారసిల్లిననాఁడు వారియోగాముల నగనక యొకనికిం దోడగుట తగవెట్లగు - నైనను బోయరుకయ్యంబునం దేను బనిసేఁత పోలక్కునకుం దెలియుఁ - గాని పదంపడి నాచూపు మార్పునందియుండునని యితండు తలఁచె - బోయరుబవరంబునం దిగుట కేపాడి నాకాదరువయ్యె నదియ నా కీపెనఁకువం బాలువెట్టె - నహింసాధర్మంబు నూఁది బ్రతుకంగోరువారు పోరితంపు దెసకుఁ జనరాదని యేను లెస్సయెఱుంగుదుఁ - గాని 3

క. ఎవ్వనికిని గర్తవ్యము, దివ్వియవలె నెల్లనాఁడు తెల్లమి కాఁబో
దివ్విధి సత్యార్చకునకు, అవ్వలు నొవ్వులును గడవరానివ యందున్. 4

వ. అహింసనా వ్యాపకంబగు నొకవస్తువు – మానవులు హింసాగ్నులం దగులుకొన్న యజ్ఞులు – ప్రాణి ప్రాణిందిని మనుట తెల్లంబ – బాహిరం బగుచంపు గావింపక జీవుం డొకనిముస మ్మేని నిలువంజాలఁడు – తినునప్పుడు త్రాగునెడఁ గూర్చుండుతఱి లేచుపట్ల నది యిది నానేల యెల్లప్రొద్దుల వలచియొండె పలవకయొండె మానిసి యించించుక హింస యొనరించువాఁడ – యెవ్వఁ డీహింసనంబు సేయమికిఁ దంటాలువడు నెవ్వఁ డిట్టి తలఁపునం గరఁగువడు – నతనియం దప్పసమ్ముగా సంయమబుద్ధి వర్ధిల్లు – నక్కటికంబు పొంపిరివోవుఁ – గాని మేనుతా ల్పెవ్వండును బాహ్యాహింసవలన సర్వథా ముక్తుండు కాలేమి నిక్కంబ – యదియుంగాక యహింసయం దద్వైతభావన యిమిడియుండు – నెల్లజంతువు లొక్కండ యగునే నొకటికావించుచెట్ట తక్కన్నిటిం బొరయు – నగుట న్మానిసికి హింస యంటు త్రోపాదరానిది నాఁజనుఁ – గాన 5

క. పదుగుండ్రను దా నొకఁడై, బ్రదుకునరుం దొరులసేయుపాపమ్మునపా
లది మోయవలయు; నాతని, మది మడిగట్టుకొని యెంతమంచిగ నున్నన్. 6

గీ. ఇట్టితఱి రెండుమాగాను లేలుదొరలు, పొగరుపొంగునఁ గలనికిం బూనినప్పు
దెవఁ డహింసారిరక్షువై యెసఁగు నాతఁ, డాఁపవలయును జగడంబు మాపవలయు. 7

క. అతఁ డీకర్జము దీర్పఁగఁ, జతురుఁడు గాఁడేని చివ్వసాగించి నిజ
క్షితికిన్ సకలోర్వికి ను, న్నతి యేర్పడఁ జూడవలయు నానాశ్రమలన్. 8

గీ. ఇంగిలీసువారి యేల్బడికతన నా, బ్రదుకు నావిలాతిబ్రదుకుతెఱఁగు
చక్కఁజేయుకోర్కి నెక్కొనియుండె మ, న్మానసమునఁ బెక్కునాళ్ళఁదొట్టి. 9

ఉ. ఏ నిపు డాంగ్లభూమి వసియించి తదర్ణవసైనికాలి మత్
ప్రాణము నేలుచుండ నిరపాయసుఖస్థితి నందు మానిసిన్
గానఁ బటాల మయ్యది జగత్ప్రళయంబు ఘటించి హింసకుం
దానక మైననాఁడు ననుఁ దార్కొను దత్కలుషం బవార్యమై. 10

వ. కావుటంజేసి యే నీదొరతనంపు జెండానీడ నుంటయు దీనిపొత్తు గంటయు నక్కఱయని తలంతునేని హింసాజనకంబగు సమరంబు సేయంగాదని తెగఁబడి సెప్పి నాపల్కు వమ్మైన తఱి సత్యాగ్రహధర్మంబు నధిగమించి శాసనధిక్కారంబు నెఱపి చెఱసాలల న్వెదకు టొప్పు – నొండేని పెనఁకువం బాలువడచి తత్కౌశలంబు నేరం జను – మనకుఁ గయ్యంబు నాఁపుబల్మి లేమి తెల్లంబ – కాన దాన డిగుటయ కర్తవ్యమని తేల్చుకొంటి–మఱియు 11

సీ. అగ్నిగోళముప్రేల్చు హంవీరునెడ వాని, సుకము లందించు సేవకునిపట్లఁ
గాసంతయేని వింగడ మహింసకు లేమి, నిక్క మక్కటికంబు నుక్కడంచి
ప్రజలవీపులు తలల్ బ్రద్దలుగావించి, పల్లియలం దోఁచు బందిపోటు
దొంగలకును వారి కంగమచ్చుము లిచ్చి, వారిమూటలు మోసి వారిపుండ్లు

గీ. కడుగుమూఁకకు ఖేదమ్ము కల్గ; యగుట, దురమునన్ దెబ్బదిన్నజోదులసపర్య
కియ్యకోల్చూపు ననువంటి కేలతప్పుఁ, గడనహింసా సముద్భవ త్కల్మషంబు. 12

ఆ. మివుల మివుల నిట్లు మిత్రునిపోలక్కు, తంతిరాకమున్న తరిచికొంటి
వచ్చినంత మగుడ నెచ్చెలికాంద్రతోఁ, దడవి రణమునంద తగవుగంటి. 13

క. ఇది కానిచేఁత యని నా, యెద నేఁడుం బలుక; దప్పు దేల్పడిపై నా
కొదవినబుద్ధికి లోనై, కదనంబునపాలు గొంటిఁ గర్తవ్యముగన్. 14

వ. అగుటం దీనిపట్ల నా కావంతయేని యనుతాపంబు వొడమదయ్యె - నాయాత్రోవ నడువం దగినదని యానాఁటినెయ్యుర కెల్లరకుం దనివిసంధించుట దుశ్శకంబని యేనెఱుంగుదు - నిది కదుంగడు సున్నితంబగు నంశంబు - దీన భిన్నభిన్నాశయమ్ముల కెడముండుఁ - గాన నహింసాధర్మనిష్ఠాతుల కుఱంగట నాహృదయమ్ము నావిష్కరించుకొంటి - సత్యాగ్రహావలంబి యగువాఁ డాచారమునకుం గాక తనతలంపునకు విలువ నీఁదగు - నందుం బొరపాటు కలదోయని త్రచ్చిత్రచ్చి కంట వత్తినిడుకొని మెలఁగంజను - దోసంబు తెల్లమైన వెన్క దానిం దలఁదాల్చి పొచితమ్మునకుం గడఁగవలయు. 15



# 40 సత్యాగ్రహ లేశము

ఆ. పాడిలోఁతు లరసి బవరంబు నిచ్చగిం, చితిని గాని దైవగతి విరుద్ధ
మగుటఁజేసి దైహికావేశనంబు నా, కబ్బదాయె నందు జబ్బుకతన. 1

వ. అట్టి చెట్టప్రొద్దునం దించుక సత్యాగ్రహ ప్రయోగంబును నా కక్కఱయయ్యె - మాకు సామునేర్పుటయంద బేకరు పడవాలనియుఁ దక్కన్నియెడల మా దండున కేన పెద్ద ననియు నియ్యధికారి నాపూఁటకాఁపుదనంబునన మాయెల్ల పనులుం జేయింపవలయు ననియు మాతలంపు - కాని యితనితీరు వేఱుగానుంట మాకు మున్ముంద కానంబట్టె - నిది సోరాబజీ సైపఁజాలక నన్గదిసి 2

క. అన్నా! కంటివె బేకరు, కన్నులు తలకెక్కె నొజ్జగా వచ్చి నెఱా
మన్నియపోకిళ్ళకు డిగు, చున్నాఁ డితఁ; దోర్వనేల యుద్ధతు నిట్టుల్. 3

క. గోర్చుట్టుమీఁద రోఁకటి, నార్చినగతిఁ బిన్నవాంద్ర నాంగ్లేయులఁ దా
నేర్చి మనపైఁ బ్రభుత్వము, తీర్చుటకుం బనుచు నేమితెఱఁ గిది సెపుమా. 4

క. అనుటయు దీనికి నలుగం, బనియే మని చల్లచల్ల పల్కులతోడన్
వినిచితి నాతఁ డలంతులఁ, దనచూపు న్మరలఁజేయుతరగతి గామిన్. 5

క. నన్నుఁగని కల్ల కపటము, తెన్నెఱుఁగవు నీవు తియ్యతియ్యని నుడువుల్
మున్ను కురియించి యవ్వల, ని న్నీ తెలవారు ద్రోయనేర్తురు గోతన్. 6

క. అంతయు ముగిసినపిమ్మట, భ్రాంతికి దవ్వగుదు వెల్లఁ బరికింతువు పూ
రింతువు శంఖము రండో!, శాంతిరణంబున కటంచుఁ జాటింతు గదా! 7

క. పదపడి నీకు న్మాకును, బదింబదిగ దాపరించు బాములు జోస్యం
బిది కల్లగాదని హసద్, వదనమ్మున మెల్లమెల్ల వక్కణచేసెన్. 8

క. ఏ నపు దస్మన్మైత్రీ, లీనాత్ముల కార్తిగాక లేములుగా కే
మౌ నయ్యా! సత్యాగ్రహి, నా నేమి ప్రతారితుండ నమ్ము మటంటిన్. 9

క. వంచింపనిమ్ము న న్నతఁ, డించుకయు న్వెఱవ నొరుల నెవ్వండు ప్రతా
రించుం జివరకు నాతఁడ, వంచితుఁడగు నంచు మున్నువల్కనె యంటిన్. 10

ఆ. అతఁడు లెస్సనవ్వి యౌనౌను బూమెలోఁ, జొరుము తడయనేల చొరుము నీకుఁ
జావుతప్పు దెపుడొ సత్యాగ్రహమ్మున, సరస కీడ్చి మమ్ముఁ జంపఁగలవు. 11

వ. అని వాక్రుచ్చె – నీపల్కుల నుల్లేఖించుతతి నసహయోగదినమ్ములం గుమారి
'హోబ్‌హౌసు' వ్రాసినకమ్మ నాతలఁపునం గదలెడి – నీకన్నె యానాఁడు. 12

క. ఒకనాఁటి కీవు సత్యము, నకు నురిపా లగుదువంచు నమ్మెద నీకున్
సకలేశ్వరుండు తోడై, ప్రకటించుత మేలిమేలిబాటలు తేటల్. 13

వ. ఇ ట్లుత్తరంబు ననిపె – నయ్యది యట్లుండె – బేకరుపోకడ న్గతిచి నేస్తకాఁడు కినుకం
జాటినపదంపడి నా కూపిరితిత్తులం దేర్పడ్డనొవ్వు ముమ్మరంబాయె – రెండువారాలపస్తు
ముగిసినవెన్క నాయొడ లింతవట్టు తిమ్మవదకుండె – నైనను గరిడీ మానక మాయున్కికిం
గ్రోసుదవ్వునఁ గల సాముపట్టునకుం గాలినడకన చనుచుంటి – నిదియ నాయిమ్ము
దప్పునకుం గారణమయ్యె – నప్పు డనుచరు లందఱు స్కంధావారమ్మునంద కాఁపురింప
రేప్రొద్దున కే నిల్లుసేరువాఁడ – నధికారిజంకెన లెక్కు దగుటంజేసి యానాఁడ సత్యాగ్రహము
నాశ్రయింప వలసె – నయ్యవసరమ్మున బేకరు 14

ఆ. సామునంద కాక సర్వాంశముల నేన, మీకుదొర నటంచు మిట్టిచూచె
నవలఁ దనప్రతాప మావంత రుచిచూపె, నొప్పఁడయ్యె నెయ్యుఁ డిప్పుథమ్ము. 15

క. ఆ చెలి శరవేగమ్మున, నా చెంతకు వచ్చి యేమినాయం బిది యీ
నీచత నోర్చుట దుశ్శక, మోచెల్ల! యతండు మనకు నొడయం డగునే? 16

క. ఏ యానతినేనియు నీ, వీయందగు మాకు బేక రెవ్వఁడు పనుపన్
ద్రోయందగు నవగడ మిది, నీ యోరిమి నుజ్జగించి నీతి న్గనుమా. 17

క. ఇంతకును మనము గరిడీ, సంతనె యుంటిమి కఠోరశాసనముల కే
మంత యదనయ్యె నేటికి, నంతరములు వలయు మనకు నాంగ్లేయులకున్? 18

క. ఈవేర్మి కెవ్వఁ డీకొను, బోవలె నిది పొడవడంగి పోవలె మాన
శ్రీ వలచి కయ్యమున దిగి, యేవిధి సైరింతు మింతయేవపు(బ్రదుకున్. 19

వ. అనుటయు నేను బేకరుచెంత కేగి మాపైఁ గ్రొత్తగోవాళ్లకు దొరతనం బీగి మీకుఁ బాడిగా దనియు, మాదళంబున కేన ప్రతినిధినని మీరంగీకరింపవలయు ననియు నయ్యాయి భాగముల కక్కఱయగు నాయంకుల నేమ యెన్నుకొందు మనియుం బలుక నతండు 'ససేమిరా' యని బిఱ్ఱబిగిసె – నంత గత్యంతరంబు గానక 20

క. ఏ నొకగోష్ఠిం గూర్చితి, దానన్ సత్యాగ్రహవ్రతమ్మునమహిమం
బీనెయ్యురకెఱిఁగించితి, నౌ నని శపథించి రెల్ల రాదారిఁ జనన్. 21

గీ. మేము మాపెద్దలన్ నియమించుకొంట, కనువుపడదేని గరిడిసాదనకు రాము
సాముకూటంబ త్రొక్కంగఁజాల మన్న, నిర్భయం బాచరించిరి నెయ్యు రపుడు. 22

క. అధికారికిఁ దీర్మానం, బిది నేర్చితి బాధలెల్ల నెఱిఁగించితి మా
మది సేవాయత్తమ యని, పదపడి మృదువాక్యసరణిఁ బంపితి లేఖన్. 23

క. బోయరుసంగరమున మా, సాయముకల దస్మదీయసంఘమునకు నా
నాయఁకర ముండెఁ దర్కము, లాయెడ రా వీదృశంబు లంటిని దానన్. 24

క. ఈపనికతనన్ బేకరు, చూపునమా ర్పింతయేని చొప్పడదయ్యెన్
మాపొఁజునడత సమర, వ్యాపారవిరుద్ధ మనియు నాతఁడు తలఁచెన్. 25

క. ఇతఁ డిఁకఁ జక్కంబడఁ దని, మతినమ్మితి భారతంపుమంత్రికి మా యీ
వెతలెల్ల విన్నవించితి, నతఁ డీధర్మంబు దిద్దునని యనుకొంటిన్. 26

వ. ఆ(పెగ్గడ యాత్రికాపరిస్థితులకు నిచ్చటినడవడులకు వింగడంబు కలదనియు, నున్నతాధికారి కీనేల నిమ్నాధికృతుల నేమించుచన వుండుననియు, నట్లయ్యు నిఁక నాదొర మీమాట మన్నింపఁగలఁ డనియు నూరార్చె – నవ్వల నాకుం బేకరున కెన్నేని కమ్మలు నడిచె – నా బెడఁదనెల్ల నిందుఁ జాటనొల్ల – నది మనమీనాఁట నిచ్చలుం గుడుచునిడుమవంటిద యన్నంతవట్టు వాక్రుత్తు – నబ్బేకరు బెదరించియు బెల్లించియు మాదళమువారిం గొందఱ లోఁగొనియె – నంతన 27

క. క్షతగాత్రులైన యోధులు, శతములుగ సహస్రములుగఁ జనుదెంచిరి దు
ర్గతిమై నెటలీవైద్యా, యతనమ్మునఁ బడిరి మూల్గు లాగుబ్బుకొనన్. 28

క. బేకరునయభయములకున్, లోఁకువయైనట్టి మిత్రులు తదీయార్తా
నీకమ్మునపరిచర్యలు, చేకొని సాగించి; రెంతసేదం బడినన్. 29

క. వా రాదీనుల నెల్లరఁ, దీరుచు టెట్లొదవు; నపుడు ధీమన్మణి యా
భారతమంత్రికి నాకున్, వేఱడ మిసుమంతలేని నెయ్యము గుదిరెన్. 30

గీ. అతఁడు రాబర్ట్సు మంచమునంటియున్న, నన్నుఁగదిసి మృదూక్తిసంపన్నుఁడగుచుఁ
దనకు ననుచరమై పొల్పుదళముసైత, మాసుపత్రికిఁ బోఁబోలు నంచుఁ గొసరి. 31

ఆ. అచటనుండు నున్నతాధికారివినా త,దన్యు లెవరు దీని కాజ్ఞపెట్ట
రింతసెదదుపేర్మి యిందులవారి కీ, మేలుమఱవ రాంగ్ల మేలువారు. 32

వ. అనియుం బల్కి నగ్గఱువకోర్కి మా కెల్లరకుం దనివినింపె – నంత నా చెంతనున్న విద్యార్థు
లందఱు నెటలీకేగ రోగినైన యేను నిట్టూర్చుచుం బడియుంటి. 33



# 41 గోకులు నౌదార్యము

గీ. శ్వాసకోశమ్ము లుబ్బి మంచానఁ జిక్కి, చిక్కునంబడ్డ నామంచిచెడ్డ లరయ
నపుడపుడు జీవరాజు వైద్యాగ్రియుండు, వచ్చిపోవుచునుండె దైవమ్మువోలె. 1

క. పాలం బప్పుల ముట్టక, యాలివుతైలంబు నిమ్మ లరఁటులు ద్రాక్షల్
క్రోలుచు నాహారించుచుఁ, గాలం బపు డీడ్చుచుంటిఁ గట్టడతోడన్. 2

క. క్షీరంబును గొనుమని పలు, మా అమ్మెహతా వచింప మన్నియమంపుం
దీ రతనికిఁ దెల్పితి నప,కారంబగు ననియె వెజ్జు కానిమ్మంటిన్. 3

క. గోపాలకృష్ణుఁ డప్పుడ, నాపాలికి వచ్చె రుగ్ను నన్నుంగని సం
తాపంపడెఁ బాలొల్లని, నాపోకడ నెఱిఁగి చెల్లునా యిది యనియెన్. 4

క. గోకులునకు నెదురాడుట, నాకు నసాధ్యంబ సజ్జనస్తుత్యుఁ డతం
డీకడఁకన్ విడనాడమిఁ, జీకాకై గడువుకొంత సెలవి మ్మంటిన్. 5

ఆ. మేలిమిత్రుఁడైన కేలనుబేకుతోఁ, జాలవట్టు చర్చసలిపినాఁడ
నీప్రయోగమందు నితఁడు నాబాసట, యయ్యు నన్ను మెచ్చఁడాయె నాఁడు. 6

క. మిగిలితి నే నొక్కండన, యిఁగ నంతర్వాణి పల్కు నెయ్యది దానిన్
సిగఁ దాల్పవలయుఁ గావునఁ, దగుచింతల నెల్ల రేయి తంటాపడితిన్. 7

క. ఏ నిపు డివ్విధి నూద్చిన, నానమ్మికలెల్ల నల్ల నాశమునందున్
వీనం దప్పితినా యన, మానస మెదిరించు నట్టిమాట సహింపన్. 8

వ. కావుటంజేసి నేఁడు నాకర్తవ్య మెయ్యది? గోకులునికూర్మి నెందనుక మన్నింపఁదగు? నొదలిం బ్రోవ నీకట్టడ నెంతవట్టు సడలించుటొప్పు? నని లెస్సతడవి యిప్పట్ల ధర్మువున కెగ్గువాటిల్ల కుండునంతకుం గాచుకొనఁదగిన నేమంబులెల్ల నాకు వసపడియుంట వలయు ననియు, నితరంబు లగదంకారున కఠీనమ్ములై యుండఁ దగుననియు నిర్ణయించుకొంటి - నేను దుగ్ధంబు నొల్లమికి ధర్మంబ హేతువు నాఁజను - నిశ్శేషముగాఁ బయస్సు నాకర్షింపఁ గాళీఘట్టమ్మువా రెనుములకుం గోవులకు నాపాదించుహింస లేనెఱుంగుదు - నదియుంగాక పలలంబునట్ల పాలును మానిసి కాహారంబు కాఁదగదని విశ్వసించితిఁ - గాన 9

క. ఏది యెటులైన దుగ్ధము, కాదని భావించి యెదఁదఁ గలఁగక మఱునాఁ
డే దరిసించితి గోకులు, నాధృతి నతఁ డేమి తేల్చి తని ప్రశ్నించెన్. 10

గీ. అవల వినయమ్ము దైవాఱ ననఘ! మీర, లేమిపంచిన శిరసా వహింతుఁ గాని
దీనిదెసఁ బంతగింపకుఁ డేను దుగ్ధ, కణము గొననొల్ల మాంసభక్షణము నొల్ల. 11

క. ఇవి ముట్టకున్నచో మృ,త్యువు తప్పద యందురేని యోడక దానిం
గవుఁగిటఁ జేర్చెదఁ బాడికి, దవిష్ఠమైనట్టి బ్రదుకు తగునా యంటిన్. 12

ఆ. అంత నమ్మనీషి యక్కజపడి యిది, యౌనె చివరమాట యని వచించె
నట్టి దింక నొండు పుట్ట దీనోట మ, న్నింపుఁ డితనిఁ గరుణనింపుఁ డంటి. 13

క. త న్నెంత కష్టపెట్టినఁ, దిన్నఁదనం బింతవిడక ధీవార్ధి యతం
డన్నా! యిచ్చుట ధర్మం, బన్నది నా కంతుపట్ట దైనను నీకున్. 14

గీ. వింగడంబుగ నిఁకఁ బల్క నంగవింప, నరుగుమా! నీవరించిన తెరువునంద
యార్తరక్షాపరాయణుఁడైన వేల్పు, నీ కనామయసంపత్తి నెఱపుఁగాక! 15

క. అని నన్నుఁబల్కి వెజ్జుం, గనుఁగొని గాంధీ నలంపఁగా దిఁక నాతం
డనువగు నన్నపదార్థమ, తినిపించుచు మెల్లమెల్లఁ దేర్పుం డనియెన్. 16

క. గోపాలకృష్ణుఁ డాడిన, యీపల్కులు జీవరాజు నెట్లలరించున్
బాప మతఁ డట్లయని తల, నూఁపుట యనివార్యమయ్యె నొల్లమి యున్నన్. 17

వ. అతఁ డింగువతో సాతాళించిన మినుపచేరుం గ్రోలుమని పల్క నొండురెండునాళ్లు దాని సేవించితి - నది నా కొంటక నాయిదుమం బెంపుచేసెఁ - గాన వెండియుం బండ్ల నాశ్రయించితి - మెహతా సముచితంబులని తోఁచిన బాహ్యోపచారంబుల నేమతిల్లక నడుపంబూనె - దీనం గొంతచక్కఁబడితిఁ గాని నాకట్టడ లీభిషక్కునకుఁ దద్దయుం గిన్క నొదవించుచుండె - నింతన గోకులుం దక్టోబరు నవంబరు మాసమ్ములం దానేలఁ దారసిల్లు మంచుపెల్లున కోహటించి మాతృభూమికిం బయనమ్ముకట్టె. 18

# 42 వైద్య మెయ్యది

ఆ. ఎన్నిపాట్లువడిన నన్నుఁ బీడించెడు, తెగులు వోమిఁ గొంతదిగులు గంటి
మందులేల తిండిమార్పున దీనిపాం, గడఁపవచ్చు నంచు నరసికొంటి. 1

క. అన్నంబుమార్చి రోగుల, కున్నతి చేకూర్చునేర్మి నొసపరివైద్యుం
దన్న సడిగన్న యేలి, స్నన్నాముని బిల్చి నొవ్వుచందము లెల్లన్. 2

క. వినిపించితిఁ బాలకు నా, కనుకూలత్వంబు లేమి నాడితి దానం
బనియే మున్నది నాచె, ప్పినబువ్వం దినుమటంచు వెజ్జు వచించెన్. 3

ఆ. క్రొవ్వులేనికూడు గొనుమిప్ప రొట్టియ, పండ్లు పచ్చికూర పనికివచ్చుఁ
గోష్ణజలము వోసికొ మ్మెపుడుం గిటి, కీలు విచ్చియుండఁ బోలు ననియె. 4

ఆ. దీనఁ గొంతవట్టు తేతితిఁగాని సం,పూర్ణమైనలగ్గు పొందనైతి
నపుడు సాధ్వి సిసిలియా చెల్మికత్తెయై, యాసచేయుచుండె నాసుఖంబు. 5

క. పాలకు నాకు స్నెయ్యము, గీలింపఁ దలంచు నాపె; గిట్టదుగద యా
క్రోలుట నామది; కాయమ, యీలేవడి తొలఁగఁద్రోయు టెట్లని వగచున్. 6

క. ఆలేమకు నొకమిత్రుఁడు, పాలపొడిం జూపి దుగ్ధబంధుత్వము లే
నే లే దీనుఋమున కిది, చాలున్ క్షీరమ్మువలనిసారము నొసఁగన్. 7

గీ. మతి రసాయనశాస్త్రసమ్మతము కాఁగ, నేర్పడియె నిద్ది యని దానియెఱుక లేక
వినిచె నాతనిప ల్కామె విశ్వసించి, యప్పొడిం దెచ్చి నాకిచ్చె నప్పుడపుడ. 8

క. మన్నియమంబు నెఱింగిన, యన్ను తదాదరముసూపు నమ్మ దయాసం
పన్నతమై నిడువస్తువు, తిన్ననిదో కాదొ యన్నదిగు లెట్లుండున్. 9

ఆ. అగుట నామె యొసఁగు నాగుండ నీటిలో, మెదిచి త్రావి పాల నొదవురుచియ
నాల్కకంటఁ జూచినాఁడ సీసా కొక, చెంపనున్న చిన్నచీటి నపుడు. 10

క. పొడు మిది పయస్సుతో నే, ర్పడినట్టిద యంచు నెఱుకపడె నంతఁ గడున్
వడి దానిఁ ద్రోసి కొందల, పడకుము కథయిది యటంచుఁ బావనమతికిన్. 11

వ. సిసిలియాకు లేఖనంప నయ్యమ్మ కమ్మం గనినంతన నాచెంత కేతెంచి తనపద్ద పరాకున
కెంతయుం గస్తిగుడిచి సిగ్గునందోఁగ నే నాపె నూరార్చి 12

క. నీతప్పులేదు మిత్రుం, డాతఁడు పత్రంబు సూపఁడయ్యెను నీకున్
నీతమ్మునివలె నన్నుం, జేతమ్మునఁ జూచి నాదుచెట్ట నడంపన్. 13

క. నీతెచ్చినవస్తువు నీ, రీతిం దగవని బహిష్కరించితి నాయీ
చేంతను మన్నింపుమని వి, నీతిన్ వాక్రుచ్చినాఁడ నెలఁతయుఁ దేతెన్. 14

వ. పదంపడి యెఱుఁగమింజేసి కావించినయీపనిముట్లఁ జింతయు శిక్షయు నక్కఱపడవని సిసిలియాకుం దెలిపితి - నీవెలందియౌదార్యములు పెక్కులు నాస్మృతిపథంబునం గలవు - కాని వానినెల్ల నిచట వెలువరింపఁజాలఁ-బెక్కుకడగండ్ల నన్నాదరించిన చెలికాండ్రెందఱో కలరని పల్కి వారినిచటం దలఁపునకుఁ దెచ్చుకొందు - శ్రద్ధధానుం డిట్టియెడ 15

క. అనుకంపానిధి యీశ్వరుఁ, దనర్థమగు విసపుమందు నందించుచు న
వ్వెనుకలఁ దియ్యనినెయ్యము, ననుపానముగా నొసంగునని గుర్తించున్. 16

వ. అది యట్లుండె - రెండవమా తేలిన్సనువచ్చి పచ్చికూరలు రుచింపవేని వాని వండితిను మనియె - నిమ్మార్పు నా కింపితమాయెఁ - గాని తెగు లడంగకుండె - నట్టితఱి రాబర్ట్సు నాకడ కరుదెంచి మంచుకారు కదియంబడుచున్నయది - మీ కిచట నారోగ్యంబు చేకూర దని తలంతు - మీరు భారతముం జేరుటలెస్స - మీకావించినసాయ మలంతి నాఁజాల - ననవుడు నేనప్పులుకులు మెచ్చి మాతృభూమికిం జేర జతనంబు గావించితి. 17



# 43 వీడుకోలు

గీ. భారతోర్వికి రా నిచ్చపడుటఁజేసి, బేకు నావెంట సీమకురాక యొదవె
నిద్దఱము నేఁడు పొగయోడ నెక్కఁబోవ, నక్కటా! పుట్టదయ్యె నయ్యన్న కాఙ్క్ష. 1

గీ. అతఁడు జర్మనుజాతివాఁ డగుటకతన, సమరమది తీవ్రదశనున్న సమయమగుటఁ
జెట్టయిది పుట్టె నెంతయిక్కట్టువడిన, రిత్తయయ్యెను హోర్డింగుచిత్త మెద్రిచి. 2

ఆ. మివుల నార్తిగంటి మిత్రుండు కేలను, బేకు నుజ్జగించి నౌకనెక్క
నాఁడు నన్నుఁబాయ నాకంటెఁ బెద్దయు, నలమటించె నమ్మహాశయుండు. 3

గీ. అతఁడు నావెంట భారతక్షితికి వచ్చి, యున్నచో నాల్గుకొండ్రలు దున్నుకొనుచు
నాసమై మగ్గమున గుడ్డనేసికొనుచు, మనుచు నుండెడివాఁడు నామన మెలర్ప. 4

క. ఈనెచ్చెలి తనశీలము, మానక వద్రమ్ము నింతమఱవక రాజ
న్మానవతమై నెటాల్మహి, లోనం గలఁడిపుడు మిత్రులు కడుంజెలఁగన్. 5

వ. ఇఁకం బ్రకృతమ్మునకు వచ్చెద - నాయెక్కినకప్పలిన్ మూఁడవతరగతి లేమింజేసి రెండగు దానియంద కుదుర్కొని నానాఁడు విరియునారోగ్యముం గని మురియుచు నల్లనల్లన బొంబాయిచేరి పదియేండ్లనాఁడు విడనాడిన తల్లిగడ్డం గని లెస్సపొంగితి - ననామయంబు కొఱవడియున్నను గోకులుం దచటికేతెంచి ముద్దుముద్దుగా నెదురుకోలుపండువు సాగించె - నప్పుణ్యరాశిం గని యతని మార్గమ్ముపట్టి నాతలవ్రేఁగు దించుకొనంజూచి బంబయికిం జేరితిఁ - గాని విధినిర్ణయం బన్యతరముగా నుండె. 6

# 44 న్యాయవాద విశేషములు

ఆ. ఏల దానిగొడవ యిం దని యేనెంత, చెప్పుచున్న మిత్రు లొప్పుకుంట
నిపుడు కొంతపల్క నెంచితి నా కోర్టు, బ్రదుకు నీడ్చినట్టి బాటతెలుఁగు. 1

క. కల్లలకుం గైతవముల, కొల్లక యాధర్మమునకు నొగ్గితి నంచున్
దొల్లియ వ్రాక్రుచ్చితి నిది, చెల్లెన్ గేవల సమాజసేవాదృష్టిన్. 2

క. కూటికినిం గుడ్డకు నే, పాటిధనం బగుఁ దదీయపరిమాణంబున్
దాఁటనిభృతి నడసితి నది, పాటింపకయుం బ్రయాసపడితిని గొంతన్. 3

క. ఈమనుగడరూ పెఱుఁగుట, కీమాటల చాలుఁ గాని యింకను దెలుపన్
నామిత్రు లభిలషించెద, రేమోఫల మిచ్చునందు రిది కొందఱకున్. 4

ఆ. న్యాయవాదిబండి నడవ దసత్యంబు, పల్కకున్నఁ గుట్రపన్నకున్న
నతనిజీవగఱ్ఱ యనృతంబ యంచు నేఁ, బిన్ననాఁడ లెస్సవిన్నవాఁడ. 5

క. ఉన్నతపదమ్మునెడ నా, కెన్నఁడు నాసక్తిలేదు హేమంబుదెసన్
గన్నింతవడదు టక్కరి, పన్నుగడం బన్న నేమిపనియుండు నిఁకన్. 6

గీ. బొంకునకుఁ జోటునీక నాపూనినట్టి, నేమమిది దక్షిణాఫ్రికానేల నేను
ధర్మవాదిత్వముం దలఁదాల్చువేళఁ, బెక్కుమార్లుగ నొరయికం జిక్కవలసె. 7

ఆ. ఎదుటివారు సాక్షి కెన్నేనిదబ్బఱల్, నూతిపోయు చెట్టతీరు విందుఁ
గాని యెపుడు నట్టికక్కుఱితిం జిక్కి, కల్మషంబు మూటగట్టనైతి. 8

వ. ఏ నొక్కతగవున జయంబుగన్నవెన్క నాపక్షమ్మువారు నన్నుఁ గికురింతపాల్చేసినతెఱం గెఱింగితి – నన్ను నమ్మినయభియోక్త సత్యనిరతుండైన జయించు నొండేని యోటమిం గుడుచు నన్నతలం పొంద నాయుల్లముం బాయకుండు – జయాపజయంబులంబట్టి సుంకముకొలంది నేర్పఱుచుకొంట నాయిబ్రదుకునం గాన – మీవాదంబు సత్యదూరం బగునేని నన్నాశ్రయింపజన దని మున్ముంద యభియోగులకుం జెప్పువాఁడ – దీనంజేసి దబ్బఱతగవు నాపాలం బడదాయె – నొకమాఱు నాయభియుక్తులం దెన్నఁదగినవాని వ్యాజ్యెమొండునన్ను లెస్సపరికించె – నది లెక్కచిక్కులకుం బుట్టినిల్లు నాఁదగు – దాని పంచాయతినిర్ణయంబు మా కుపకరించెఁ – గాని పోబడిం జేరఁదగ్గయంకె యొం డిందు రాబడింజేరె – నీపొరపాటువలనిలగ్గు మాయది – యెదుటివా రీతీర్పు చెల్లరాదని లాఁతి హేతువులం జూపి మార్కొనిరి – పంచాయతిప్రమాదంబు నంగీకరించి దానివలనినష్టిం గుడుచుట మనపాడియని యే నభియోక్తకుం దెల్పితిఁ – బ్రధానుండగు న్యాయవాది నాయీపల్కు నియ్యకొనఁడయ్యె – బుద్ధిమంతుఁడగు వకీ లిట్టిచేఁతకు దిగఁడని యతండు నాకు నీతులుమప్పె – నంత నేను 9

క. మన మొప్పకున్నఁ గోర్టీ, యన్నృతమ్మును సమ్మతించునా ప్రతివాదుల్
కనులేనివారలా క, ల్లను దెగనాడంగ నింతలంపట యేలా. 10

క. నావుడు నప్పెద్ద కదుం, దీవరపడి కల్ల కవుడుదెస కేగక యీ
దావా నడుపుట నీకొన, నీవె తలఁదాల్చి మోయు మీబరు వెల్లన్. 11

క. అని బిఱ్ఱబిగిసె నవ్వల, మన సొప్పదయేని మీరు మానఁగవచ్చున్
నను నభియోక్త వరించినఁ, బెనఁగెద సత్యానురక్తి పింపిసలాడన్. 12

క. ఏ నిట్లుపల్కి వ్యాజ్యెపు, వానిదెసం గంటి నతఁడు వాడియు నన్నుం
బోనాడలేక మీరే, పూనుఁడు సూనృతము నేలుపురుషుఁడు లేఁడా? 13

క. ఇవ్విధి నా నేనుబ్బితి, నవ్వల నన్నెచ్చరించె నాపెద్ద కదున్
ద వ్వడలెన్ నాపట్టున, కివ్వేదనవెంట నాకు నిచ్చెను మెప్పుల్. 14



## 45 చాతుర్యమా?

క. నాయిచ్చిన యుపదేశము, శ్రేయఃకారణమ కాని చేవమెఱసి యే
నీయభియోగమునం దగు, నాయము రాఁబట్టనేర్తునా యనుకొంటిన్. 1

క. అందదుకులతగ వియ్యది, యందుం బెదరచ్చకెక్కినట్టిది యోటన్
దెందము వడంక నధికృతి, ముందు నిలంబడితి దైవమును జేకొంటిన్. 2

వ. అంత నేను దొలుతొల్తన పంచాయతిప్రమాదమ్ము వెలువరింప ధర్మాధికారి యిది చాతుర్యంబు నాఁ దగదాయని వక్కాణించె - నపుడు నామోము కంది కందగడ్డయయ్యె - నాపట్ల లూలామాల మావంతయేని లేమింజేసి యీనింద సైరింప నశక్తుండనైతి - మఱియు 3

క. ఈపెద్ద యింతవికట, వ్యాపృతి మున్ముందుచూపె నక్కట! విషమం
బై పొల్చు నావివాదం, బేపగిదిన్ నెగ్గునన్న యిఱుకునఁ బడితిన్. 4

ఆ. అవలఁ గొంతతేఱి యయ్యా కదుంగదు, వెఱఁగుఁగూర్చుమాట వినిచినారు
చివరదన్క నావచించుప ల్కాలింప, కిట్లు వెక్కిరించు టేమిపాడి. 5

క. అనుదున్ శంకయ చాటితి, వినుఁడు మిముం జిన్నపుచ్చువిధ మొల్ల భవ
న్మనసుఁ గలంచుట కెంతయు, వనరుదునని ధర్మదాత వక్కాణించెన్. 6

క. శాంతిమెయి నాతఁ డిట్లన, సంతోషము జాలువాఱసాగెను నాకున్
సుంతయు విడువక వాదం, బంతయు వివరించినాఁడ నయ్యధికృతికిన్. 7

వ. పదంపడి ప్రత్యర్థిపక్షవాది నానాశ్రమమ్ములువడి తనధోరణిం బ్రకటించెఁ – గాని పద్దుపార పాటుతక్కఁ దక్కుంగల పంచాయతినిర్ణయంబునెల్లం బాడిపట్టువారు తిరపతిచిరి – నాసంతృప్తి కపుడు మేరలేదయ్యె – నివ్వార్త విని మా పెద్దయు నభియోక్తయు లెస్సపొంగిరి – మఱియు ననృతంబు నాశ్రయింపక యీమనుగడ సాగింపవచ్చు నన్న నాతలంపు దద్దయుం గట్టిపడె – నంగడిగాఁ బఱచుకొన్న న్యాయవాదివృత్తి కసత్యంబ మూలభూతం బగుట దానిం దీనఁ జక్కాడుట యరిదియని సెప్పనోర్తు. 8



# 46 అభియోక్తల యండ

గీ. ఒక్కమరి ట్రాన్సువాల్‌కోర్టు నెక్కియున్న, తగవు నడిపితి నందు సత్యంబులేమిఁ
దుద కెఱింగితి నంత నాతోడ బొంకు, వలుకు నాయభియోక్తపై నలుకగొంటి. 1

గీ. అతనికిం బ్రతికూలమౌనట్లు తీర్పు, సెప్పుఁడా యని పల్కితి నప్పుదెదురు
వారు ధర్మాధిపతులైనవారు తద్ద, విస్తుపోయిరి నావాఁడు విహ్వలించె. 2

క. ఆతని కిట్లపకారము, సేఁత జరిగెఁగాని యింత చీ యన్నను మ
న్నీతి నెఱుంగుట నతఁడు క్రు,ధాతప్తుఁడు గాక లజ్జతాఁకునఁ గ్రుంగెన్. 3

క. ధర్మువుదెస నాచూపిన, యర్మిలి యిది రచ్చనెల్ల నాకర్షించెన్
బేర్మి కడుహెచ్చె నాకీ, శర్మంబును విస్మరింపఁజాలన యెపుడున్. 4

గీ. రంగుతెగు లెంతయున్న న న్నింగిలీసు, వారు మన్నింపసాగి రవ్వారిగాఁగ
నిక్కమునకుఁ బూజారినైయి నిలువనేర్చు, నాతఁ డెవ్వానియుల్లంబు నాఁచికొనఁడు? 5

క. నాతెల్వికి నవ్వలిదై, లోఁతైనసమస్య పుట్ట లోఁగక యిది నా
చేతం దీఱదు సడిస, న్నాతనికిం జూపుమందు నభియోగికడన్. 6

ఆ. నిర్వ్యలీకమైన నీతికి నగ్గమై, వెరవులేమి నిట్లు వెలువరించు
నన్ను లెస్సనమ్మి నాదెసవార ల, చంచలానురక్తి ముంచువారు. 7

క. ఈకతమున నభియోక్తలు, నా కీఁదగుసొమ్ము హెచ్చు నా నిచ్చుటయే
కాక మ దుద్యమలతికలు, ప్రాఁక నుపఘ్నంబు లైరి పరహితశీలల్. 8

ఆ. వారిరూకతోడ వారిసాయమ్ముతో, నచట నాయొనర్చినట్టిచేఁత
నాదరించి రద్దిరా! లోకసేవనం, బనుచు నిట్టిపెంపు నభినుతింతు. 9

క. చెఱసాలకు నడువుం దనఁ, గొరడాచెటచెటల కియ్యకొం దన నద్దం
బెఱుఁగక సాగిరి మూఁగిరి, కఱకరినాబ్రదుకు రసజగత్తునఁ దేలన్. 10



# 47 అభియోగి చెఱతప్పుట

క. నాచదువరులకు రుస్తుం, జీ చరిత మొకింత తెలియఁజేసితి మొదటన్
నాచెలికాఁ డభియోగియు, నై చెలఁగె నతండు నమ్మె నంజక నన్నున్. 1

గీ. పెద్దబేహారియై కల్మి తద్దపెంచె, నతఁడు తనచేర్చుసరకుల నడ్డుచేసి
యట నిషిద్ధములైన యయ్యాయివస్తు, లందుకొని కుహనావణిజ్యార్థియయ్యె. 2

గీ. కూటిముద్దయటుల్ రసఘుటికవోలె, దర్పణముకైవడిన్ నరునేర్పు నోర్పు
నుక్కడంచి బజారున కెక్కుఁగాని, దొంగతన మెన్నినాళ్ళు సురింగియుండు. 3

క. అయ్యపస బైటఁబడె నెద, వ్రయ్యలుగా నశ్రువారి వఱ్ఱులుగాఁగన్
జయ్యన నురుఁగులు గ్రక్కుచు, దయ్యుచు నబ్బేరి నాకు దాయఁగవచ్చెన్. 4

క. అన్నా! లుబ్ధుడనై నినుఁ, గన్ను మొఱంగితిని మూటకట్టితిఁ బాపం
బిన్నాళ్ళకు నది పండెను, నన్నుం బన్నముల ముంచి నవ్వఁదొడంగెన్. 5

క. చీఁకటిబేర మొనర్చితి, నాకొంప మునింగె దొరతనమ్మునఁ గలవా
రీకుట్ర గనిరి చెఱకుం, బోకడ విధి వ్రాసిపెట్టెఁబో! నానొసటన్. 6

క. ప్రకటంబగు నవమతి యిది, యకటా! యింక నేను జచ్చినట్లకదా! నీ
వొకఁడవ నన్నిపుడీచె, ట్టకు దవ్వులవానిఁ జేయుటకు దిక్కుగదా! 7

క. నామనుగడ సర్వంబును, నీముంగల నిడితిఁగాని నిల్పితి దీనిన్
నామెచ్చు వృత్తిమర్మము, నేమని వివరింతు నీకు నేనొ౽కనికిన్. 8

క. కుతిలపడి కొందలంపడి, యతఁడిమ్మెయి వగచె నావు రావురు మనుచున్
మతిగరఁగి రుస్తుమున్ మిత, హితవాక్కుల నూఱడించి యే నిట్లంటిన్. 9

క. ఎఱుఁగుదువు నన్ను; నిన్నుం, బరిరక్షణసేయఁ ద్రోయఁ బ్రభు వీశ్వరుఁ డొ
క్కరుఁడ సుమీ యైనన్ మన, పరిచితిఁ బాటించి సాయపడియెద నీకున్. 10

క. నీచత యని వెన్కాడక, నీచేసినదోషమెల్ల నెఱి నియ్యకొనన్
సైఁచెదవే నరికట్టిన, యీచిక్కు నడంచి నీకు నెలమి ఘటింతున్. 11

వ. అంత న ప్పారసీవణిజుం 'డేను గావించినపాపంబునెల్ల నీముంగల నంగీకరించితి నింతవట్టు చాలదో'టనుడు 'దొరతనమ్మువారిదెస దోసమ్మునల్పి నాకడం జెంపలు వాయించుకొంట యె ట్లుచితంబగు'నని యే నాడ నెట్టకేల కబ్బేరి దారికివచ్చె - నంత 12

క. పరికించిచూడ నతఁ డీ, దురితము పెక్కేండ్లనుండి తొలఁగక సేయన్
దొరఁకొన్నట్లు కనంబడె, దురాశకుం గొలఁదిలేమి తోడన తోఁచెన్. 13

క. ఇరువురమును రుస్తుంజీ, పురాతన న్యాయవాదిపొంతకుఁ జని యీ
చరితంబునెల్లఁ జెప్పుదు, నరిది యిటన్ గెలుపుగొంట యని యతఁ డనియెన్. 14

క. బరువంతయు మిత్రుఁడు నా, శిరమ్ముపై నిల్పె నీవు సెప్పినరీతిన్
జరియింతుఁ గరుణమై నా, పరువును దక్కింపు మంచు బతిమాలుకొనెన్. 15

వ. పదంపడి యే నతనికి ధైర్యమ్ముచెప్పి యీనేరంబు రచ్చకురాదని తలంతు – నభియోగంబుఁ దెచ్చుటయుం దేమియు రేవుసుంకరివశమ్మునం గలపని – యతండు రాచతికమ్మువారి ధర్మవాదిప్రముఖుఁ దాడిన తెఱంగున మెలంగవలయు – నే నియ్యిరువురం గామక దర్శింతు – వారు న న్నాదరింపరయేని 16

క. జరిమానా కట్టుటకో, చెఱసాలం బడుటకో విశృంఖలచిత్త
స్థిరతన్ సిద్ధముగ మీ్మ, దురవస్థ పదేనుపాళ్ళు తొలఁగఁగవచ్చున్. 17

క. అప్పా! బందియ నీకుం, దప్పదయే నదితలంచి త్రపచెందుట కే
నొప్పన్ దెక్కలితనమున, కప్పసముగ లజ్జగ్గుడుచు టది పాడియగున్. 18

క. ప్రాయశ్చిత్తముగాఁ దల, పోయుము చెఱనున్కి పాపపుంజంబునకున్;
ఛీ! యిఁక ముచ్చును గానని, చేయుము శపథంబు లగ్గిచేకుఱు మివులన్. 19

గీ. ఇమ్మెయిం బల్కి సెట్టి నాయెల్లబ్రదుకు, నీవశమ్మునఁ గలదు నన్ నీటముంతొ
పాల ముంచెదవో నీదుపనిచినట్ల, యదుగువైచెద ననియె దాసో౽హ మనియె. 20

ఆ. అంత నడుముగట్టి యస్మదీయంబగు, వినయమెల్ల నతనియనయ మూద్ప
నప్పగించినాఁడఁ దప్పు సమస్తంబు, వలికినాఁడఁ బన్నువానిచెంత. 21

గీ. తె మ్మనినఁ బత్రములనెల్లఁ దెచ్చి సెట్టి, పాపపుంబ్రదు కంతయు బాహిరింతు
నతఁడు నేఁటికిఁ దనదోస మరసియరసి, నానకుం జిక్కి కుములుచున్నాఁ డటంటి. 22

వ. అంత నాసుంకరీఁడు జాలిందోఁగి యిప్పారసీతాత సా దయ్యు నెఱుకలేనిపని గావించె – నిప్పట్ల నాకర్తవ్యంబు మీకుఁ దెల్లంబ – మాన్యాయవాదిచిత్తంబు నూఁది యే నిందు సంచరింపవలయు – మీ రమ్మేటిం గనుగొంట లెస్స – యేను వీలైనంత వట్టు మీబేహారి గౌరవంబు రక్షింతు – ననవుడు నెల్లలేనిహర్షంబు వడసి యే నవ్వల నవ్వకీలుసన్నిధికిం జేరి కలరూ పెఱుఁగంజేయ నగ్గఱువ నాసూనృతానురక్తికిం దనిసని యెన్నఁడున్ మీకు నాకడ నాస్తి యనుపల్కు పుట్టదని ప్రమాణపత్రముం బ్రసాదించెఁ – బదంపడి రుస్తుంజీ దొంగసొత్తు నిబ్బడివిలువం గొని విడుచునది యన్న యానతి వచ్చె – వెండియు 23

గీ. మిత్రుఁ డీదొంగబ్రదుకెల్ల మేలిమేలి, యక్కరంబులతో దిద్ది చక్కఁదనము
విరియుచట్టాన బిగియించి వ్రేలఁగట్టె, నాత్మ నోదక నైజకార్యాలయమున. **24**

క. తనవారు తరతరమ్ముల, మనువా రత్తతి వణిజ్య మరగినవారున్
జనరా దీచెడుదారికి, నని హెచ్చరికింప నాతఁ దప్పని కోర్చెన్. **25**

ఆ. ఇది శ్మశానవాటి నేచినవైరాగ్య, మెట్టి దట్టి దనిరి సెట్టిమిత్రు
లెంతవట్టు వీరి యూపల్కు గట్టిదో, తెలుపఁజాల గుట్టు దేవుఁ డెఱుఁగు. **26**

క. ఈనిందను రుస్తుంజీ, వీనులలో మెల్లమెల్ల విడిచితి నన్నా!
యే నిన్ను మొఱఁగి యెచటికిఁ, బోనేర్తు నటంచు నతఁడు పొసఁగం బలికెన్. **27**



# ఆ త్మ క థ

పంచమ భాగము

## 1 ఆద్యనుభూతి

గీ. అస్మదీయులు సేవావ్రతానురక్తు, లాఫ్రికా నుజ్జగించిన యట్టిబంట్లు
మగనలాల్ గాంధిముఖ్యులు మాతృభూమి, నందుకొన్నారునాకంటెముందవచ్చి. 1

క. నెచ్చెలులకంటె ముసు నా, వచ్చుట నిర్ణీతమయ్యె వదలనికయ్యం
బచ్చుపడి రోగబాధలు, హెచ్చి నిలంబడితి సీమ నిప్పటిదనుకన్. 2

గీ. దున్ని పండించి తిరుచు నేదో రవంత, సేవ సల్పుచు మిత్రులతో వసింప
నిచ్చగించితి నిందుల కేది లెస్స, తగినతా వని తద్దయుం దరిచికొంటి 3

గీ. దేశమం దాశ్రమంబులఁ దీర్చి ప్రజకు, నూడిగముసేయు పెద్దలతోడిమైత్రి
లేమి నిదమిత్థమని తెల్పలేక లేక, యొందు వ్రాసితి నపుడు నెయ్యురకుఁదుదకు. 4

ఆ. ఆర్తబంధువైన యాంఁడ్రూసుచెంతకు, నేగుఁదంటి నతనిహితము నూఁది
నిలువుఁదంటి నంత నెచ్చెలికాంఁద్రుద, ర్శించి రయ్యుదాత్తశీలధన్యు. 5

క. వా రమ్మనీషి పంచిన, తీరునఁ గాంగ్రీకిఁ బోవుదెంచిరి మహితా
చారులు శ్రద్ధానందులు, కూరిమిమై వారిఁ జూచెఁ గొడుకులవోలెన్. 6

గీ. అంత శాంతినికేతన మరయ నేగు, దెంచి రందుఁగవీంద్రుఁ దభ్యంచితాద
రానురాగసుధల్ పంచి యస్మదాప్త, జనుల రంజించె వెన్నెలజాలువోలె. 7

క. స్వామియుఁ గవితారాజ్య, స్వామియుఁ బాలించుధర్మసంస్థలఁ గంటన్
నామిత్రులు తెలివిం గని, రామేలిమి యుపకరించె నవ్వల నాకున్.   8

వ. శ్రద్ధానంద రవీంద్ర సుశీలరుద్రు లాంఁడ్రూసునకు ముప్వేల్పుంబోని వారు నాఁజెల్లు - నతఁడు దక్షిణాఫ్రికా నున్నతతి వారిగఋవతనముస్గుతిచి పొరింబోరి వర్ణించువాఁడు - వారినామాక్షరంబు లీసాధుపుంవుని హృజ్జిహ్వారంగముల సర్వదా నర్తించు - నక్కారణంబునం జేసి యాంఁడ్రూసు నానేస్తకాంఁద్ర సుశీలరుద్రుసన్నిధికిం జేర్చె - నాయయ్య వారిం బెద్దలాలించి వారికిం దన కాఁపురించు గేహంబ వీడుపట్టుం బొన రించె - నతనిబిడ్డలకు న్వారికి నప్పుడప్ప నెయ్య తియ్యంబులు బలిసె - నంత నా వారు ఫినిక్సుబ్రదుకు న్మఱచి యం దునికి వాటిల్లె - మఱియు 9

క. ఓడదిగి వీరికుశలపు,జాడం బరికించి వంగజగతిం గవిస
గ్రమాదాశ్రమమున నందఱు, పోఁడిమిమై నుంట తెలిసి పొంగితి నెదఁదన్. 10

క. గోపాలకృష్ణగోకులు, శ్రీపదముల కెరఁగినంతఁ జెలికాంద్రఁగనన్
జూపునిడి మధురమధురా, లాపంబుల వారువా రెలర్పు నొసంగన్. 11

వ. బొంబయినగరంబునం దే నాఁగియుంటి నచట నాకుం గైకోలుమన్నన వడయు తఱి సత్యాగ్రహం బించుక వలసివచ్చె - నేతదీయంబగు పరిషత్తు పేటిట్ మందిరంబునం గూడె - దాని తళతళలకుం గన్నులు మిఱుమిట్లపాలై కూలివాఁడం బెరసి బ్రదుకు సాగించిన యే నెంతయుం గలంతచెందితి - నప్పటినా వేస మంగరకా పాగా మున్నగు వానిం గూడి యిప్పటిదానికంటె మెఱుఁగు నాఁదగు - గాని సమలంకృతులైన సభాసదులయం దేను వెక్కిరింపఁదగి యుంటి - నైనను మాననీయుండగు ఫిరోజిషా మెహతా యందదండల నిల్చి యెట్టకేని గట్టునం బడితి - నానాఁటిస్వాగతపత్రాదు లాంగ్లభాషలో నడిచె - వాని కేను గుజ్జరి బాసం బదులాడ నోహటిల్లితి - నంత 12

ఆ. నన్ను సత్కరింప నగరమ్మునం గల, గుజ్జరాతివారు కొలువుదీర్చి
రందు ముఖ్యవక్త యయ్యె జిన్నాసాహె, బతఁడు ఘూర్జరీసుతాళి నొకఁడ. 13

క. చెప్పినముక్కలు నాల్గును, గప్పురపుంబల్కులట్లుగా నాంగ్లమునన్
గుప్పె నతఁ దన్యులు న్గతి, దప్పక మాటాడి రపుడు త త్పరభాషన్. 14

క. పదపడి నాప్రత్యుత్తర, మది గుజ్జరియంద వినిచి యాంగ్లోక్తి నిటన్
వదలఁదగు నంటి మన కు,న్నదిగద యొకబాసయంటి నమ్రత వెలయన్. 15

గీ. ఎన్నఁడో దేశమును విడిచన్న యేను, గ్రొత్తగా నేఁడ వచ్చి యీగోష్ఠి నిట్లు
మోహరించుట కూడదేమో యటంచు, జంకితిని గాని కొల్వు నాసరణి మెచ్చె. 16

క. నా కపుడు బలము చేకుఱె, నీక్రొత్త తలంపు జగమునెదుట వెలార్పన్
వీఁక యొదవెఁ బదపడి పూ,నాకుం జనవలసెఁ గృష్ణ నాగురుఁ జాడన్. 17



## 2 పూనాలో గోకులుతో

గీ. గోకులుం డీవు పూనాకు రాకముంద, రాష్ట్రపాలుని గనుట కర్తవ్య మనుట
నతని విల్లింగ్డనాఖ్యుఁ జేరితిని గుశల, వార్తలైనంత నమ్మేటి వలికె నిట్లు. 1

గీ. దొరతనముపట్ల నెట్టియాందోళనంబు, సేయనెంచిన నాతోడఁ జెప్పిసేయు
ముభయపక్షంబులకును లగ్గొదవు దీన,రిత్తవేసటయుం దలయెత్త దపుడు. 2

వ. అనుటయు నిట్టివాగ్దానమున కభ్యంతరమేమి? - సత్యాగ్రహవ్రతినగు నాకు నాయెదుర్చు వారితలఁపుం దొలుతొల్త నెఱిఁగికొంట యవశ్య కార్యంబ-తదనంతర మోపినంతవట్టు వారి కిష్టుండనై మెలఁగ జూతు - నాఫ్రికాఁబ్రదుకునం దిట్టినేమంబు ఎల్లప్రొద్దులం బాటించితి-నేఁడుం దీని ననుసరింతు - నని యేను వక్కాణింప నయ్యధికారి తద్దయుం దనిసి నన్నుఁ గొండాడి 3

ఆ. వలసినప్పుడెల్ల వచ్చి నాతో మాట,లాడవచ్చు నీకు నడ్డులేదు
కోరి దొరతనమ్మువా రెట్టిదోసమే, నాచరింపఁ గడఁగరని యెఱుంగు. 4

క. అని పల్కుడు నానమ్మిక,యును దార్ఢ్యక్షంబ యంటి నొద్దికతోడన్
వెనుకం బూనాపట్టణ, మున కేగితిఁ గౌతుకంబు మూరింబోవన్. 5

ఆ. అచట గోకులుండు నాతనిపాలించు సమితి నిరవుకొన్న సభ్యతతియు
నన్నుఁ గన్నయంత నాయం దనుత్తమ, ప్రేమవృష్టి కురిసి పెద్దచేసె. 6

క. ఉల్లంబులు విచ్చితి మపు, దెల్లర మయ్యాయిచర్చ లెసఁగించితి మా
యుల్లాస మపూర్వము న,న్నల్లసభం జేర్పఁ గృష్ణుఁ దాసక్తిపడెన్. 7

క. అద్దానఁ జేర నాకును, బుద్ధివొడమెఁ గాని తక్కుపురుషులచూపుల్
తద్దయు నా కెడమడుగ్రై, యద్దమువలె నుంట విడితి నాతగులంబున్. 8

గీ. లాఁతిసభ్యులకున్ నాకు లంకెపాటు, కుదరమింజేసి కృష్ణుండు కొంతనొచ్చి
యోయి!కేవలసభ్యత్వ మొందకున్న, నీవు సభ్యుండ వనియ గణింతు ననియె. 9

వ. అంత నాతలంపులనెల్ల నయ్యుదారచరితున కెఱిఁగించి మున్ముందు ఫినిక్సువీడి వచ్చిన యనుయాయివర్గంబు నిల్వ నాశ్రమం బొండు నిర్మింతుననియు నేను ఘూర్జరుండ నగుట నాదేశమునంద యుండి భారతసవిత్రి నారాధింతుననియుం బల్క నామార్గంబు నమ్మహాశయుండు మెచ్చి యిట్లనియె 10

క. వలసినవి త్తము నాకడఁ,గల దాశ్రమమునకు దానిఁ గైకొను మిపుడే
చెలిఁకాడ! యిట్టులైనన్, దలఁచెద నీయాశ్రమంబు నాయది యనుచున్. 11

ఆ. అనుడు నూరనూర నర్థము నార్జించు, బెడదతీఱె దొడ్డినిడినవేల్పు
టావునట్లు కృష్ణుఁ దాదరువై తల, వ్రేగు డించె నంచు వేడ్కవడితి. 12

క. గోపాలుఁ డపుడు సంఘ, శ్రీపాలకుఁ బిల్చి లోకసేవకు నీతం
దేపాటివిత్త మడిగిన, నాపూఁటన యిచ్చి పంపు మని శాసించెన్. 13

ఆ. మరలివచ్చునాఁడు మహనీయుఁ డితఁడు నా, కొఱకు విందొకండు కూర్చె నందు
నన్నుఁదనుపుపండ్లు మున్నగుభోజ్యంబు, లేర్పరించెఁ గూర్మి లిగురుపెట్ట. 14

క. అమ్మేటి యపుడు రుగ్ణత, కిమ్మై నడయాడలేని యింటరమున దూ
రమ్మున నుండియు నాతి,ధ్యమ్మునకున్ నిర్ణయించుతావు న్గదియన్. 15

ఆ. వలచి మెల్ల మెల్ల వచ్చుచువచ్చుచుఁ, దూలితూలి దారిఁ గూలఁబడియె
గురున కిట్టిమూర్ఛ తఱచుగఁ బ్రాప్తించు,కతన మిత్రు లపుడు కలఁగరైరి. 16

ఆ. కృష్ణు గదికిఁ జేర్చి యెల్లర మాదరం, బదరఁ దీయమాట లాడుకొనుచు
విందు గుడిచినార మిందనుకన్ మది, నాటియుండె గురునినాఁటిమూర్ఛ. 17



# 3 బెదరింపా?

గీ. బంధువులఁ జూచునాసక్తి భర్తృహీన, యైక్యశించువధూనిక నరయుచింత
నన్నుఁ బెరరేప బొంబాయినగరి వదలి, కదలితిన్ రాజకోట కుత్కంఠతోడ. 1

వ. ఏ నాఫ్రికారంగమున సత్యాగ్రహసమరంబున కొకసాధనమ్ముగా నాకట్టు సవరించుకొంటి - నది యచటికూలివాంధ్రు పాటించువేసంబు నాఁదగు - దీనినాంగ్ల దేశమునం దింటనున్న వేళ సైత మాదరించితి - నేఁడు భారతమునం దడుగు మోపిన వెన్క నెటాలునం దాఁచియుంచిన కారియవాదుదుస్తుల వెలుఁగునకుం దెచ్చితి - నంగరకా దోవతి మల్లెపూవుంబోనితలగుడ్డయు నందుఁ బ్రధానంబు లనంజను - నవియెల్ల నిచటినేఁతమరలం బొటమరించినట్టివ - యందలితలచీరయు నంగరేకును బనిలేని వ్రేఁగని తోఁచి యరచట్టయు సంతరీయంబును జౌకపాఱు చౌతుం దాల్చితి - నిట్టి బట్టలతో మూఁడవతరగతి పెట్టియం బోవువాని లేనివానిఁ గాఁ దలంతురు - నాఁ డానాఁడిక బొబ్బతెగులునకుం గుఱియై బెదరుచుంట నొకచో నధికారులు మాతరము తెరువరుల దింపి వారితిమ్మనం బరికించి - రపుడు నా కించుక వేఁకి యుంట వారు నాయూరుపే రడిగి రాజకోటంగల వెజ్జుపజ్జకుం జనుమని యానపెట్టిరి - పదంపడి మాబండి వడ్డవాణుచేరుసరికిఁ బ్రజారాధనతత్పరుండు కుట్టుపనికిం బేరందినవాఁడు నగు మోతీలాలు నన్గదిసి వీరమగామునంగల పన్నునంజేసి త్రోవరు ల్గుదుచుకడగండ్ల యీగడ నెఱిఁగింపఁ జెరసాలకేగ నాయితంపడి యుంటిరా యని యేనంటి - నంత నతఁడు 2

ఆ. బందియన్న మాకు భయమది కాసంత, లేమినిజమ కాని నేమమునకు
నగ్గపఱిచి మమ్మునందఱ నీవ సా, గింపవలయు నిడుమ త్రెంపవలయు. 3

క. ఈసీమవాఁడవై జన, తాసేవారతుఁడ వగుటఁ దప్పక మాకున్
నీసన్నిధిఁ జనవున్నది, మాసంప్రార్థనము నీవు మన్నింపవలెన్. 4

గీ. నేఁడు ని న్నవరోధింపఁగూడ దాప్త, బంధువులఁ జూచి మరలి బంబయికి నేగు
నపుడు కామక నీవిందు నాఁగవలయు, వెఱ్ఱిపిన్నల మమ్ము దీవింపవలయు. 5

క. నావారికౌతుకంబును, సేవావిధి నరయ నీదుచిత్తము పొంగున్
రావలెనని యీవాడిన, యావెంటన వచ్చువాఁడ ననుయాయులతోన్. 6

వ. అని మధురమధురమ్ముగాఁ బల్కి నన్నుం దనవానిఁ గావించుకొనె - నవ్వల మోతీలాలు పెద్దతికంబెల్ల మెల్ల మెల్ల నాకవగతం బాయె - సబర్మతీ సత్యాగ్రహా శ్రమమేర్పడ్డవెన్క నెలనెలం గొన్నినా ళ్ళందుండి యతఁడు పిన్నలకుం గుట్టుపని యలవఱచువాఁడు - కాని 7

ఆ. దైవ మోర్వలేనిదై వెడరాకాసి, తనమునెల్లఁ జూపి తరుణు నితని
మ్రింగివై చె నకట! మిత్రునిపోకతో, దొడ్డయడవి యయ్యె వడ్డవాణు. 8

ఆ. ప్రకృతమునకు వత్తు నిఁక రాజకోటకుఁ జేరినంత నాజ్ఞ గౌరవించి
యాసుపత్రి కేగ నచటిభిషక్కు నా, తెఱఁగు నరసి సిగ్గు తెరలఁ జిక్కె. 9

క. అధికారిపట్ల నాతఁడు, క్రుధయుం బ్రకటించెఁ గాని కోపించుట స
త్పధమెట్లగు నధికృతి తన, విధిఁదా నెఱవేర్పవలదె వెఱలే కెపుడున్. 10

ఆ. అంటురోగ మున్నయదనఁ దృతీయమౌ, శ్రేణి వెడలువానిరీతి నరయు
టేమిదోస మెవ్వ రీపెట్టెనెక్కిన, దాని చట్ట మింత తప్పరాదు. 11

క. అధికారులకుం గూడదు, పధికావళిపట్లఁ బక్షపాతము; వారీ
యధమశ్రేణిం జనునరు, వృధాపరిభవింత్రు వన్యమృగ మనుకొంచున్. 12

ఆ. నీవు నీవటంచు సేవకునిం జూచి, నట్ల చూతు రతనియా ర్తనాద
మాలకింప రెంతకైనఁ దెగింతురు, తన్ని యీడ్చి వానిధనము గొంద్రు. 13

క. రొక్కముదిని చీటీ నిడ, రక్కట తప్పింత్రుబండి నవగదమిది నే
నక్కడ నక్కడఁ గుడిచితి,నిక్కము సెప్పితిని దీని నిల్పుటవలయున్. 14

ఆ. విత్తమున్న వారుచిత్తంబుమార్చి యీ, దిక్కులేనివాని తెఱఁగు దిద్ద
నెక్కవలయు నాఁత దేగెడుపెట్టెలో, స్రుక్కవలయు నెన్నిచిక్కు లున్న. 15

క. అతనికి దవ్వైన సుఖ,స్థితి మాకును వలదటంచుఁ జెప్పుట వలయున్
మతినిడి వానికి నాగర,కత నేర్పుటవలయు భీతిఁ గడపుట వలయున్. 16

క. ఏ నపు దవ్విషయమునం, దేనేలకుఁజన్న మిత్రు లీ వీరమగా
మూనినశాయరిచట్టము, లూనము కావలయునని రలుప్తప్రతిఘుల్. 17

క. చట్టపుఁజందము లన్నియు, నెట్టన చూచితిని వాదు నిక్కమ యంచున్
ఐట్టించితి నెదఁదకు సమ, కట్టితి దొరతనమువారికన్నులు తెఱవన్. 18

ఆ. నన్నుఁ బెద్దచేసి ము న్నలవిల్లింగ్డ, నిచ్చుపల్కు గుర్తుతెచ్చుకొంటి
నతనిఁగంటిఁ గస్తియంతయు నమ్మేటి, ట్రోలఁ జెప్పి ధర్మ మేలుమంటి. 19

ఆ. అతఁ డుదారబుద్ధి నస్మదీయంబగు, మనవి నాలకించి తనిపెఁగాని
కీడు మాదికాదు కేంద్రప్రభుత్వంబ, తగును దీనిదిద్ది తగవు నెఱప. 20

క. అయధికారులసన్నిధి, నీయది వినిపింపుమనియె నేనవ్వల నీ
శాయరిచేఁ బ్రజలందిడి, రాయిడి సకలమ్ము వ్రాసి రారాజునకున్. 21

క. పలుమార్లు విన్నవించితిఁ, దొలఁగెను రెండేడు;లపు డెదో పనిమీఁదన్
గలిసితిని జేమ్సుఫర్డును, దెలిపితి నీగొడవ నతఁడు; తెలతెలఁబోయెన్. 22

క. తెప్పించె నెల్ల పత్రము, లప్పా! వీలున్నఁ దీర్తు నని సెలవిచ్చెన్
ముప్పియ్యది వెనువెంటన, తప్పించినయ ట్లెఱింగి తనిసనినాఁడన్. 23

వ. ఏ నీగెల్పు సత్యాగ్రహమూలబంధ మనితలంతు – నేలయన వీరమగామునందలి పన్ను బాధలం గుఱిచి బొంబాయిప్రభుత్వ కార్యదర్శిచెంత నేమున్నుముచ్చటించుతఱి 'బగ్రసా' యందు నాచేసినయుపన్యాసంబు నతఁడు వెలికిం దీసి యిది సత్యాగ్రహం బని జంకెన గావించితి – వీచప్పుళ్ళ కింతచేవగల యేలుబడి దద్దఱిల్లు నని తలంతువా – యని తీవిమైఁ బల్క. 24

ఆ. నరుని మేలుకొల్పువెర విది జంకెన, చేఁతయని తలంపఁజెల్ల దీవు
ప్రజలు నేఁడుకుడుచుబాములఁ దూలింపఁ, దగినయొఱపు లాడఁదగును నాకు. 25

క. బానిసమును దెగటార్పఁగ, మానస మున్నట్టివారు మానక విజయ
శ్రీ నించునెత్తు లన్నియుఁ గానందగు ననుభవంబు గడియింపఁదగున్. 26

క. ఈవసుధన్ నరుపన్నిన, యేవెరవుం గన్న దాన హింసయ తోఁచున్
గేవల మొకసత్యాగ్రహ, మేవెలయు నహింసకెల్ల నెల్లయనంగన్. 27

క. నాయాశుగ మిది దీనికి, నాయంకుడ నేను నన్ను నమ్మినప్రజ కీ
సాయకమర్మము లన్నియుఁ, బాయక యే నెఱుఁగఁజేఁత పాడిగఁ దలఁతున్. 28

క. తెల్లదొరతనముపే ర్విన, మల్లోకము లదురుఁగాని మోహనగాంధీ
వాల్లభ్య మేతదస్త్రము, చెల్లును బ్రహ్మాస్త్రమునకుఁ జెలియై బలియై 29

క. అని యేను జం కెఱుంగక, వినుచుడు నమ్మంత్రి లెస్సవింతలు వింటిన్
గనుఁగొందము మున్ముం దనెఁ, దనదర్పము పొంగిపొంగి తల నూఁగింపన్. 30.



# 4 శాంతినికేతనము

గీ. వెడలితిని రాజకోటను విడి రవీంద్ర, కేతనంబైన శాంతినికేతనమున
కచటియొజ్జలు విద్యార్థు లవధిలేని, పేర్మి నాపట్లఁ గురిసిరి కూర్మిజల్లు. 1

క. నెమ్మియు దంబములేమియుఁ గమ్మనిశిల్పంబు చిందఁగా స్వాగత ప
త్ర మ్మొసఁగిరి విద్యాసద, నమ్ముఁ గలేల్కరుని గంటి నాఁడే యచటన్. 2

గీ. మగనలాల్ పెత్తనమ్మున మాఘినిక్సు, మిత్రు లందుండి; రాశ్రమసూత్రములకు
నగ్గపడి నైజ ధీసౌహృదాదికముల, నతఁడు క్రొత్తావి నింపె నయ్యాలయమున. 3

వ. ఆనాఁ డాక్షేత్రంబునఁ బూజనీయు లాంద్రూను పియర్సనులుం గలరు - జగదా నంద నేపాల సంతోష ఖితిమోహన నగీన శరత్ కాళీబాబులతోడి చెలికారంబును నాకపు దగ్గలంబుగా నొదవె - మఱియు 4

క. గురుశిష్యులతో నట నం, దొఱతో నదికితిని బ్రకృతి తోదగుకతనన్
నరుఁ దెపుడుఁ దాన తనపని, జరిపికొనన్వలయు నంటి సవినయఫణితిన్. 5

క. జీతంబునిచ్చి పాచకు, చేతన్ వండించుకంటె శిష్యులు గురులున్
బ్రీతివడి కూడుగూరలు, చేఁత కదున్‌లెస్స యంటిఁ జెలికానివలెన్. 6

ఆ. గురుఁడు బానసమ్ము పరికింపసాగిన, నాఁడు బాలకుల కనామయంబు
శీల మెంతయేని చేపడునంటి నా, యుక్తి మెచ్చి రొజ్జ లొకరుతక్క. 7

క. క్రొత్తపనియన్నఁ గుఱ్ఱల, చిత్తము క్రేళ్ళుఱుకుఁ గాన శిష్యులు హర్షా
యత్తులయి రస్మదిచ్ఛకు, నత్తెసరులుపెట్టి తఱిగి రప్పుడ కూరల్. 8

క. గురుదేవుం డిదిసెప్పుడు, సరియని యాచార్యులన్న శంకింపననెన్
బరువనక పియర్సును నం, బరపడి చెమరోద్చె వంటపని దీర్పంగన్. 9

క. కొందఱు బియ్యముఁదీర్చుట, కొందఱు కట్టియలు వ్రయ్యఁగొట్టుట సాలన్
గొందఱు కడుగుటయున్ గను, విందై యే నెల్లలేని వేడుక గంటిన్. 10

క. ఎవ రలసిన నెవ రోడిన, నెవ రిది కాదన్న సేదయెఱుఁగక వికస
ద్వదనమ్ముతోఁ బియర్సను, పెదపెదగుండిగలు తోమి పెంపఱకుందున్. 11

గీ. వంటహండులు తోమెడివారు కుడుచు, నలసటన్ మఱపింప గాయకులు కొంద
ఱమరవాటీ మరందధారానుసారి, సారగీతి వెలార్తు రవ్వారిముందు. 12

వ. ఇట్లు శాంతినికేతనమెల్ల మధుకోశమ్మువోలె ఝంఝుమ్మనం దొడఁగె - నవ్వల ఫినిక్సునంబలెఁ దాలింపులేని పాకపద్ధతి నిం దలవరించితి - నద్దానఁ గూడుగూర లేక కాలమ్ము నంద మరప్రొయ్యిపై సుడుకుచుండె - నొకరిద్ద ఱొజ్జలుం గొందఱు చట్టులుం బూని దీని సంతరించువారు - వంటసాలయెల్ల నిమ్మెయిఁ బరాధీనం బాసి వాసింప దొరఁకొనెఁ - గాని కొన్నాళ్ళ కీదారిమాఱి తొంటియట్ల యయ్యె నని వింటి - నైనను దీనంజేసి నికేతనమ్మున కించుకయేని లెస్సయ మొలతెంచి యుండు - నది యట్లుండె. 13

క. కొన్నా ళ్ళీగురుదేవుని, సన్నిధి వసియించి కొంతసంస్కృతి వడయన్
గన్నిడితిఁ గాని దైవము, నన్నున్ మెడపట్టి యీడ్చినది నిర్దయమై. 14

ఆ. నాకు నిచట నైదునా ళ్లేగి యేగక, ముంద గోకులుండు బొందివదలి
చన్నవార్త పిడుగుచందాన వచ్చి మ, మ్మకట! దుఃఖవార్ధి కగ్గపఱిచె. 15

గీ. తల్లిపోయినలేఁగనై తల్లడిల్లు, నన్నుఁ గుస్తరింప వయస్యు లెన్నియేని
పల్కు లాడిరి సురపదప్రాంగణమున, జరిగె సంతాపసభ దాని మఱవనేర 16

కం. ఏ నప్పు డపుడు కస్తురి,తో నెచ్చెలి మగనలాలుతో నెవ్వగతోఁ
బూనాపట్టణమునకుం, బైనము సాగించినాఁడఁ బదములు వడఁకన్. 17

గీ. మాననీయుఁ డాంద్రూసు బర్ద్వానుదనుకఁ, దన్నుఁ దొడరుచు నెచ్చెలీ! తావకీన
మన్త్రరాజంబు సత్యాగ్రహంబు నిచట, బఱుపుతఱి యెప్పుడొనని పల్కరించె. 18

వ. అంత నేను దీనికిం బదులుసెప్పఁజాల - గోపాలుం డొకయేఁ డీదేశంబునెల్లం గ్రుమ్మరి పరికింపుమనియు నీలోనన దానిగుఱిచి యెట్టినిర్ణయంబేని వెలువరింపకు మనియు నా కాన వెట్టె - నాయయ్యపల్కు శతధా పాటింతు - నది నాధర్మువని తలంతు - నవధి ముగియుంగాక యక్కఱలేని యనుయోగంబులకు నుత్తరం బిడఁజాల - నైనను భారతమునం దిఁక నైదేండ్లదనుక శాంతిసమరంబు రేఁగదని విశ్వసింతు - నని విన్నవించితి - గోకులుండు 'హిందూస్వరాజ్య' గ్రథితంబులగు నాయాశయమ్ములెఱింగి దేశమందొకయేఁడుండువేని నీతలంపులువాని కవియ చల్ల పదునని నవ్వువాఁ డన్నవార్త నిచట వక్కాణించుట సముచితంబు. 19



# 5 మూఁడవతరగతివారి పాట్లు

గీ. క్రందు బలువయ్యె బర్వానుఘట్టమందు, రైలుచీటి నుపార్జించువేళ నాకు
దొడ్డతరగతి నేగుపాంథులకుఁ గాక, చిక్క దది మీకు ముందని చెప్పెఁబెద్ద. 1

క. కిటికీ విచ్చినయంతన, యటుసేరితిఁ గాని రాపు లగ్గలమయ్యెన్
బటుతాహీనులు తద్దయుఁ, గటకటపడి రపుడు దక్కెఁ గాతియు నాకున్. 2

ఆ. ఒత్తులోర్చి యెట్టెటో చీటివడసితిఁ, బ్రుల్ళిపడుచు వచ్చె ధూమశకట
మాముపెల్లు గునిసియాడ బలిష్ఠులౌ, వారు చనిరి వగ్గువాంఁడ్ర నెట్టి. 3

క. ఎక్కినవా రెక్కెదువా, రక్కట! తిట్టుకొనసాగి రన్యోన్యశిరో
న్యక్కారంబులు మొరసెను, దిక్కేమని యేను బెద్దదిగులునఁ బడితిన్. 4

క. ఆపెట్టెకు నీపెట్టెకు, వే పరువెత్తితి నదేమి విద్దూర మొకో
పోపొ మ్మిట నెడలే దని, రేపెట్టియుఁ జేరి యెంతయెదమదు గైనన్. 5

క. పదపడి మాగతి యేమని, కొదుకుచుఁ జని శకటరక్షకునకు వినిచితిన్
బదమున్న నెక్కు లేదా, పిదపన రమ్మని యతండు బింకము మెఱసెన్. 6

ఆ. పయన మాఁపరాని పనియిది యించుక, కరఁగిచూడు మంటిఁ గాని యాతఁ
డాలకింపఁడయ్యె నస్మదీయో క్తి వె, న్వెంట బండికదలుగంట మొరసె. 7

క. సోదరు నెందేఁ జొరుమని, పైదలితోఁ జేరినాఁడఁ బైతరగతికిన్
దాదృక్పరిణామము గని,యాదొరసొ మ్మడుగ వచ్చె నవ్వాలియంచెన్. 8

ఆ. నాకుఁ దగినచోటు లేక యీబండికి, నేగు దెంచినాఁడ నింతనిక్క
మిప్పుడేని వసతి యిదియని చూపుచో, నడ్డుసెప్పనంటి నతని కేను. 9

గీ. అతఁడు నామాట పెద్దసేయక వివాద, మేలసాగింతు చోటులే దిపుడు నీకు
బెచ్చురొక్కము చెల్లించునిచ్చ లేని, నాఁడుదిగిపొ మ్మటంచు నోనాడఁ దొడఁగె. 10

ఆ. అతని నిల్వరించి యారగడం బెంచు, వేద్కలేమి వానివిత్త మిచ్చి
వేఁడివేల్పు వొడుచువేళకు 'మొగలుస, రాయి' ఘట్టమునకు రాక జరిగె. 11

క. అవకాశం బేర్పడి మూఁ, డవతరమున కేగినాఁడ నపు; డీ సర్వ
వ్యవహారము నధికారికి, వివరించితిఁ బెట్టెమార్పు వెల్లడిపొంటెన్. 12

గీ. సాక్ష్యముగ నాల్గుమాటలు సంతరించి, చీటినిమ్మంటి నతఁ డది సేయనొల్లఁ
డవల రాఁదగ్గవిత్తంబు నంపుఁడనుచుఁ, గమ్మనంపితి నగ్రాధికారికడకు. 13

గీ. అతఁడు సాక్ష్యమ్ములేనినాఁ దర్థమీఁగఁ, బాడికన్పింప దైన మీపట్ల శంక
నవధరింపఁగఁజాల రాఁ దవినసొమ్ము, పంపుచున్నాఁడ నని లేకనంపి తనిపె. 14

క. ఈ మూఁడవతరగతిలో, నామనుగడఁ బద్ధ యాతనల్ వివరింపన్
సామాన్యగ్రంధము గా,దాముప్పుల నచటనచట నలఁతిగ వినుతున్. 15

క. కాయపటుత్వము కొఱవడి, నాయీపయనంబు మానినాఁడను విధిలే
కీయెడఁబాటున కే నెం, తో యదలినవాఁడ నదలుదు న్మనుముందున్. 16

ఆ. ఈతృతీయవీధి నేగెడుప్రజల యం, గదకు వారిస్వార్థకాంక్ష కొంత
యెఱుకలేమికొంత హేతువౌఁగా కథి, కారిగర్వమాదికారణంబు 17

క. నానావస్థలతోఁ గ,ల్యాణికి వచ్చితిమి మగనలాలున్ నేనున్
స్నానమొనర్చితి మంచియు, మానిని యెచ్చోటఁదీర్చు మజ్జనవిధులన్. 18

వ. అందులకేఁ దారాడుతతి భారతసేవకమండలికిం జెందిన 'కౌలు'నన్నానవాలు పట్టి కస్తూరిని ద్వితీయశ్రేణింగల యుపస్పర్శశాలకుం జేర్తు నా నతని సాధుత్వ మొదవం జేసికొంటకుఁ దొలుతొల్త వెనుకాడితిఁ - గాని తుట్టతుదకు నియ్యకొంటి - సత్యారాధకున కిది యుచితంబుకా - దేలననాయింతి కటం దానమాడు చనవు లేమియు నాపె యాగదియంద యవగాహింతు నను పూన్కిగలది కామియు నాకుం దెలియుఁ - దెలిసియు మగనివలపునం జిక్కి సత్యంబునుల్లంఘించితి - సత్యస్వరూపముం జూడ మాయా స్వర్ణయవనిక నిరోధంబగు -నని యుపనిషత్తు ఘోషించుఁగదా! 19



# 6 నా ప్రయత్నములు

క. పూనాపురికి న్వచ్చితి, దీనతమై నున్నహితులఁ దిలకించితి ధ
ర్మానుగము లౌర్ధ్వదైహిక, నానాకర్మములు ముగిసినవి కృష్ణనకున్. 1

క. పదపడి భారతసేవక, సదస్సుకర్తవ్య మేమి సద్గురుహృదికిన్
ముదమేర్పడ మన మెవ్విధి,బ్రదుకం దగునంచు నేము పలుచందములన్. 2

వ. తర్కంబులు సాగించితిమి - సమితియం దేనావేశించుటయు నాఁటి సమస్యలయం దొకటియయ్యె - గోకులుం డిచట నున్నంతవట్టు నాకీపొత్తుతోడియావశ్యకము లేకపోయె - నతనియానతిం బాటించుటయ నాధర్మం బనియు, ఝంఝూఝంపకుం జిక్కి యల్లాడుమాతృభూమి కట్టిమేటి యారకాటియై నిలువ నాకు దిగులే మనియు నపు డేను భావించితిఁ - గాని. 3

ఆ. నేఁడు గోకులుండు లేఁదుగదా! తదీ, యాత్మ తృప్తివదవ నతనిసమితి
నిపుడు చేరుటొప్పునే నని సభ్యతం, బడయ నపుడు పట్టుపట్టినాఁడ. 4

క. నాఁడు సదస్యులు పెక్కురు, కూడిరి నామార్గమన్నఁ గొందఱమదికిం
గీదనితోఁచెను వారల, నోదకుఁదని తేర్పఁ బెద్దయున్ శ్రమపడితిన్. 5

క. ఎల్లరు ననుఁ బ్రేమింతురు, తల్లులవలెఁ దండ్రులట్లు తనిపెద రైనన్
బెల్లాదరింత్రు సంఘము, నల్లది యుచితంబ వారి కది వేల్పుగదా. 6

క. ఈకతమున మాతర్కం, బేకటుభావంబులేక యింపుగ నడిచెన్
నీకు న్నాకు నభిప్రా,యైకీభావము పొసంగదని రపు డెదురుల్. 7

క. ఉత్తరదక్షిణములకుం, బొ త్తెక్కడ ననిరి యిట్లుపోయిన రేపే
తుత్తుమురై గురునాత్మకు, నుత్తల మిదు సంఘ మనిరి యుదుఁగనితాల్మిన్. 8

క. మఱియొకపరి చర్చింతము, త్వరయేమని యెవరియింటిదారికి వారల్
మరలిరి మన్మానస ము,క్కిరిబిక్కిరియయ్యె నపుదు కృత్యము నెఱుఁగన్. 9

క. పెక్కురు సభ్యులు నాదెస, మక్కువగలవారె కాని మతభేద మిటుల్
నెక్కొన్న సమితిఁ జేరుట, చిక్కులకున్ బా దటంచుఁ జివరకుఁ దోఁచెన్. 10

వ. త దనంతరంబ నాసమస్యను బరిష్కరింప సభ్యులం గూర్పవలదని మాననీయుఁదు శ్రీనివాసశాస్త్రికి లేఖవ్రాసి నాతలవ్రేఁగు డించుకొంటి - నన్నెదిరించినవారి కీవార్త హర్ష జనకం బాయె - వారితోడిచెల్మియు నవ్వల నా కెక్కుడుగా లభించె - నేతత్సమితితో నాకు లౌకికసంబంధము లేకున్న నేమి? - దాని నధఃకరించు నాధ్యాత్మికబాంధవ మేర్పడె - నదిలేని లౌకికసంగ ముసుఱులేని మేనిం బోనిది కదా! 11



# 7 కుంభోత్సవము

క. అగదంకారుని రంగూన్, నగరంబున నిలుచువాని నానెయ్యుర నొ
ద్దగువానిఁ బ్రాణజీవను, జగదాప్తుం జూడ నెదఁద సందడిపెట్టెన్. 1

క. కలకత్తా మత్పథమునఁ, బొలుచుట నన్నచట నాఁపె భూపేంద్రుఁడతం
డలఘూపచారములతో, వెలలించెను భక్తి మేటివిందులతోడన్. 2

క. వంగీయు లతిథిపూజకు, ముంగలివా రనుట నిక్కముగఁ దోఁచెను నాఁ
డంగద ఫలములతోడన, భంగించెడివాఁడ నికృతపక్వాన్నుఁడనై. 3

ఆ. అపుడు మత్తనూజుఁడగు రామదాసు నా,సరసఁ గలఁడు కలరు సఖులు కొంద
ఱేమిసెప్ప నప్పురీమచర్చిక నున్న, ఫలములెల్ల విలువఁబడియె నాకు. 4

క. పలుదినుసులవంటకములు, వెలసెను మావారికొఱకు; వెలఁదులు మాబు
వ్వలు సంతరింప నెంతయు, నలఁగిరి కనువిచ్చి రేయినాలుగుజాలున్. 5

క. ఈతిండిబాధ కడచుట, కేతెరువుం గాననైతి నిది దుర్భర మీ
చేఁతకు మాదెసఁగల సం, ప్రీతియ బీజంబటన్న రీతి నెఱుఁగుదున్. 6

ఆ. ఔనుగాక నలుగు రతిథులకై యింటి, యెల్లపాదు నెముక లిట్లు విఱుగఁ
గొట్టుకొనుచు నిశలఁ గూర్కన్న దెఱుఁగక, సేవచేఁత పెద్దసేయనొల్ల. 7

క. భూపేంద్రనాధవసుగృహ, మేపాటిసమాదరంబు నిదె మా కటుపై
నాపాటి యనాదర మిడి, వేఁపెన్ బొగయోడ దానివిధ మేమందున్. 8

క. దెక్కుపయనంబు మాయది, యక్కడఁ గలస్నానశాల కాకల్పము గొ
లక్కటి!నారకజగతికి,నక్క యనన్ మఱుఁగుదొడ్డి యందముఁగుల్కన్. 9

క. మూత్రపురీషంబులలో, గాత్రంబును ముంచి చాటుగది కేగవలెన్
మిత్రువలె నావికున కప, విత్రత యిది చెప్పి చెప్పి విఫలుఁడనైతిన్. 10

గీ. ఆకు వక్కలు కసటుపొగాకుతోడ, నమలి తమనిల్చునెడయంద యుమియుచుందు
రెంగిళులు నింతు రాకసం బెగిరిపోవ, ముచ్చటింతురు తెరువర్లు మొక్కలీంద్రు. 11

ఆ. ఎల్లవాఁడు చోటు కొల్లగొనం గన్ను, వేసియుండు సిగ్గు వాసియుండుఁ
దనకు మూరెఁడైనఁ దనమూటలకు బారెఁ,డమరవలయు నేల యని పెనంగు. 12

క. ఆనాల్గుపూఁట లెట్లో, ప్రాణంబుల నుక్కఁబట్టి బయటం బడితిన్
మా నొవ్వంతయు నౌకా, వాణిజ్యమువాని చెవిని వైచితి నంతన్. 13

వ. దీనంజేసియు నెయ్యుండగు ప్రాణజీవనదాసుమెహతాపూనికం బట్టియు నా తిరుగు పయనంబునం దిడుమలు చాలవట్టు కొఱవడె – మెహతాసైత మక్కఱ లేనన్ని పండ్లు తెప్పించి కుప్పలువోయించె – నతనియిల్లు నాపాల సొంతయిల్ల – కాన నచట నానజాతి ఫలంబుల నారగించుట మానితిఁ – గాని తిండికొలఁది నట్ల యుంచితి – నపుడు నూత్నవస్తులదెస నాయిచ్చ హెచ్చుగుటం జెలికానిరావించు క్రొత్తక్రొత్తపండ్లం జవులూర మెసవం జాగితిఁ–దినుట కింతసేపు వలయు నన్నకట్టడ నాకపుడు సున్న – యెఱసంజతో మొదలిడి తొలుజాము చెల్లు దనుక నయ్యాయిబండములు మెక్కువాఁడ – నీముచ్చట వేయుం దొమ్మన్నూట పదునైదవయేఁటిది– హరిద్వారమునం దాయేఁడు కుంభోత్సవము

సాగు – నప్పుండువునఁ దైర్థిక సేవ గావింప ననుచరులతో రమ్మని నాకుం బిలుపువచ్చె
– నంత మాదళముం దోడ్కొని శాంతినికేతనమున నున్నమగనలా లాక్షేత్రంబున కరిగె
– రంగూనునుండి యేనేగి వారింబెరసితి – హరిద్వారమునంగల మహాత్ముని మున్షీ
రాముం జూచుసుత్కంఠయు నాయీ పయనంబున కొకహేతువు నాఁదగు–వెండియు 14

క. భగవానుఁ దెఱుఁగుఁగాలీ, నగర హరిద్వారములకు నడుమం జనుచున్
బొగబండిలోనఁ గుడిచిన, యగచాట్లు మదీయముల్ దురార్తిప్రదముల్. 15

క. ఒక్కొకతతిఁ బెట్టియలో, నిక్కెడుచీఁకట్ల కేమి నే మందుఁ గదున్
గ్రిక్కిఱిసి గోతములవలెఁ, గుక్కలవలె నుంటి మంతగోరము నెఱుఁగన్. 16

గీ. మూఁతలేనిడబ్బాలలో ముడిఁగి ముడిఁగి, మట్టమధ్యాహ్నపుంబ్రొద్దువెట్ట కదరి
యదుగులం గాల్చు రేకుల కదలి బదలి, నాఁడు మాపడ్డపాట్ల నెన్నఁటికి మఱతు? 17

ఆ. నాల్క పిడుచకట్టినను మిత్తివెచ్చని, కోఱ లెమ్ముదనుక గ్రుచ్చుకొన్న
నిచ్చగింత్రు గాని హిందువుల్ కొందఱు, ముసలిమానుజలముముట్ట రపుదు. 18

క. ఈపరమచ్ఛాందసులు రు, జాపీడకుఁ జిక్కి వైద్యశాలకుఁ జనిన
ప్డేపాల స్సేయుస్మా, నేపలలరసంబు నిడిన నిగ్గరు త్రావన్. 19

క. మనదేశంబునఁ బాకీ, పనిసేఁతయ మేలిమేలిపనియని రవి శాం
తినికేతనవాసమ్మునఁ, గనుఁగొంటిని నేఁడు దానిగడియలు వచ్చెన్. 20

క. గోకులువర్గమువారలు, నీకుంభోత్సవసపర్య కేతెంచిరి సే
వాకాంక్ష వచ్చునెల్లర, కోకస్సుగ ధర్మశాల యొసఁగిరి పెద్దల్. 21

గీ. అందు దేరాలువైచితి మచట మలవి, సర్జనముసేయ గోపాలుసమితి నలరు
'దేవు' గుంటలుత్రవ్వి శుద్ధిం బొనర్ప, రూకలిడి నిల్ప నూహించెఁ బాకివాండ్ర. 22

ఆ. అది యెఱింగినంత నిది మాఘినిక్కు వ,ర్గమ్ము వారిపాలి కార్యమంటి
దేవు మెచ్చెఁ గాని మావాఁగులోఁ జెప్పు, వాఁడ నేను జేయువాఁడు మగను. 23

క. దేరాలోఁ దిరపడి నను, జేరెదు తైర్థికులఁ బెద్దసేయుట తత్తత్
సారతరధర్మచర్చలు, తీరుచుటయు నాకు నింతతీఱనిచెయ్యుల్. 24

క. గుంపులుగుంపులు నను ద,ర్శింప నపేక్షించి ప్రజ పొరింబొరి వచ్చెన్
అంపిది యొకనిముసంబును, దెంపన్నదిలేమి మునుఁగఁ దిన నోటిలితిన్. 25

గీ. ఈహరద్వారయాత్రయం దేను దక్షి, ణాఫ్రికాగడ్డఁ గావించు నలంతికొల్వు
భారతావనికిం దేటపడియె నన్న, కథనెఱింగితిఁ గాని బల్కష్టి గంటి 26

క. పొగబండిపైనమున మూఁ, దగుతరమున వచ్చువేళ నందఱితోపా
టగచాట్లువడితి నన్నపు, డగురా! యని మెచ్చ నెఱుఁగ రందలిపాంథుల్. 27

క. బండిం దిగితినొ లేదో, తండము లిట్లొత్తు నన్నుదర్శింపఁగ నీ
రెండింట జాలినిడఁ దగు, గండం బిదియంచుఁ దేల్పఁ గడువేసరితిన్. 28

క. ఊపిరి కెడమీయక త్రో,ద్రోపులతో నన్నుఁజుట్టు తుటుములఁ జాడన్
గోపం బొదవును మఱి సం, తాపమ్మును రేఁగుచుండుఁ దఱచుగ నెడఁదన్. 29

క. ఆమూఁడవతరగతిలో, బాములుగా కల్క యేరుపడ దేర్పడినన్
సామాన్యంబుగ నయ్యది, మామంచిగఁ బరిణమించి మది నలరించున్. 30

క. ఆవేళ దూరమెన్నక, త్రోవన్ నడయాడుబల్మితో నుంటిని మా
ర్గావగ్రహణముగూర్చు య,శోవిభవం బపుడు నాకుఁ జొప్పడదయ్యెన్. 31

వ. నేఁడు హరద్వారముం జేరిన తైర్థికులకు ధర్మంబుదెసం గలచూ పన్నువ నాఁ జను - జాగర్యలేమియుఁ జాపల్యమును బాషండిభావంబును వలసినంత కలదు - బైరాగులీజాతరకు నేలయీనినట్లు వచ్చిరి - పయశ్శర్కర లారగింపన వా రవతరించియుంద్రు - టక్కరియొకం డిచటి కొక్క మొదవుం దెచ్చె - వాఁడొకలే దూడచరణమ్ము ఖండించి దానిం దీనివిదారితకకుదంబునం బెట్టికుట్టియా ధేనువుం బంచపాదిని గావించె - లోభాకృష్టుం డతఁ డీపాపద్వయం బూఁతగాఁ బామరుల విత్తంబు కొల్లకొట్టఁ దొడంగె - నంతఁ గుంభోత్సవదినంబునకు లోనై వచ్చినవాఁడం గాను - గాని పదునేదు లక్షలతైర్థికు లీనాఁ డీయుత్సవమునం బాల్గొనిరి - వీరందఱుఁ బాషండు లనుట యపరాధంబగు - నందుఁ బెక్కం డ్రిచట నాత్మనైర్మల్యంబు చేపడునన్న నమ్మికమై వేంచేసి రనుటనిక్కంబు - తత్ పావిత్ర్య మిట్టి ప్రత్యయంబునంజేసి యేర్పడుంగాని యది యించుక కష్టం బనకతప్పదు - భగవ దాదరముం బడసిన పుణ్యమూర్తులుసైత మీప్రజానీకమునం దెందఱో కలదు - కాన నే నీక్షేత్రంబునకు రాక తప్పని తలంపఁ జాలనైతి - నట్టితఱి నిచ్చోఁ గానవచ్చు కలుషంబునకుఁ బాచితంబుగాఁ గఠోరనియమం బొందు తలఁదాల్చుటయుఁ దన్మూలమునఁ జిత్తంబు ననావిలంబుఁ గావించికొంటయుఁ గర్తవ్యంబకదా యని భావించితి-నాపుట్టువు నేమంబుల కొఱక వెలసెఁ - గాన నేఁడు పాటింపవలయు నియంమంబేమి? యనువిచారమునం దోఁగ 32

ఆ. వంగనగరమందు రంగూనులో నాదు, పొట్టకొఱకు నెయ్యు రెట్టిరిత్త
యలవు నోర్చి స్రుక్కి రది తఱుక్కునఁ గ్రొత్త,మించువోలె నెడఁదమెఱసె నపుడు. 33

ఆ. ఒరుల కూడిగంబు నెఱప జనించు నా,కొరులె యిట్లుబడలుచుంట యెట్టు
లోర్వనేర్తుఁ దిండి కొకయెల్ల గీఁత నా, ధర్మ వగునటంచుఁ దలఁచుకొంటి. 34

క. కావున నక్కుఱయగుతతి, సేవించెడిమందుగాక జీవనమునకుం
గేవల మైదుపదార్థము, లే వాడుకసేయ నిశ్చయించితి నాఁటన్. 35

క. రవి యస్తమించులోనన, యవి సాపడవలయు నన్న యానయుఁ గొంటిన్
లవమేని యీవ్రతంబును, జవదాఁటక నిర్వహింపఁజను ననుకొంటిన్. 36

ఆ. ఈకఠోరదీక్ష కే నగ్గపడి పదు,మూడుసమలు గడచె నాఁడునాఁడు
పట్టిపట్టి నన్నుఁ బరికించెనిది దీని, హరమ వజ్రకవచ మాయె నాకు. 37

క. నాపూనిక యిది పల్మఱు,త్రోపాడెన్ నన్నుఁ దొదరు దొడ్డతెగుళ్లన్
బ్రాపై మదాయురభ్యుద, యాపాదకమయ్యె వెజ్జునట్టులె యొదవెన్. 38



# 8 లక్ష్మణడోల

ఆ. ముగిసె నుత్సవంబు మూర్తీభవ త్పుక్ర, తమ్ము మున్ని రాముదర్శనమున
ధీమనోజ్ఞ మమ్మహామహుపాలించు, గురుకులమ్ము గంటఁ గుదుటఁబడితి. 1

క. గందరగోళములకుఁ బెను, విందు హరద్వార మచ్చవిధశాంతిరమా
కందము గురుకులమని నా, డెందమునకు నత్తఱిన్ గడిందిగఁ దెలిసెన్. 2

క. మధురప్రియతా వారా,న్నిధి నన్నీఁదించెఁ బూజనీయుఁడు రాముం
డధికాదృతి నాకొసఁగిరి, విధుతాహంకారు లచట వెలసినవడుగుల్. 3

క. ఆచార్యు రామదేవుని, జూచితిఁ దత్కార్యశక్తిసొగసులు గంటిన్
నోఁచితి నాతనిచెల్మికి, మాచిత్తము లొకట రెంట మార్కొనుచున్నన్. 4

ఆ. చేతిపనులతెఱఁగు చేకొని తద్దయుం, దరిచినాఁడ నాడ గురులతోడ
నితరకార్యభార మెక్కుడై యొజ్జల, సెలవు పొందినాఁడఁ జింతతోడ. 5

ఆ. ఇంతదవ్వువచ్చి తీచేరువన హృషీ, కేశతీర్థ మఘవినాశకంబు
వెలయు దానిఁగాంచి వెడలుట లెస్స గ, దా యటంచు నెయ్యు రాడి రపుడు. 6

క. సరియని తత్క్షేత్రంబున, కరిగితిఁ భావనకథాసమంచిత గంగా
సరిదోఘమ్మున మున్గితి, మరలితి నాబసకు నాప్తమండలితోడన్. 7

క. నన్నుఁ దిలకింపఁ బెక్కురు, సన్న్యాసులు వచ్చి; రేను జనుమార్గములన్
బ్రసన్నన తిన్నన కలదని, కన్న యతీశ్వరుఁ డొకండు కథసాగించెన్. 8

గీ. అతఁడు ధర్మప్రసంగంబు లవియు నివియుఁ దడవి ధర్మువుపట్ల నాయెడఁద లెస్స
యిచ్చమై నున్నదని నిశ్చయించి సిగయు, జందియము నాకు లేదని కుందుగుడిచి. 9

గీ. ఆస్తికుఁడ వీవు హిందూమతావలంబి, వకట! మనధర్మమునకు బాహ్యాంకమైన
పిలుకయును జందెమును లేనివేసమెట్లు, నీకురుచియించె నివినాకు నెగులునించె. 10

గీ. జాలిపై నిట్లుపల్కు మస్కరిని గాంచి,సవినయోక్తుల నోయతిస్వామి! యేను
బాల్యమునఁ బోరుబందరుపట్టణమున, గంటి విప్రార్భకుల జన్నిగట్లఁ జెలుల. 11

క. తాళంపుఁజెవులు జందెపు,నూలికి సంధించుకొని మనోహరనినద
శ్రీ లాస్యమాడ నపు డా, బాలురు నడయాడ నాకుఁ బందులు పులిసెన్. 12

క. ఏ నెపుడు బ్రహ్మసూత్రము, పూనుదునో చెవులగుత్తిపొత్తునఁ బోఁచన్
మానక త్రిప్పుచుఁ గమ్మని, యీనాదము నాలకించు టెన్నఁటి కగునో. 13

క. ఉవ్విళ్ళుగొంటి నిమ్మెయి, నవ్వేళ స్గరియవాడునందలి బచ్చుల్
దవ్వుగనుండిరి పోఁచకు, నవ్వలఁ గొన్నాళ్ళ కచట 'నందఱుద్విజులున్. 14

గీ. జన్నిదముదాల్చి ప్రామిన్కు సదువవచ్చు, ధర్మసంబద్ధమైన పద్ధతి యిదంచుఁ
గదలె నుద్యమమొండు మా గాంధికుదురు,కోమటులు నింపిరపుడుపోఁగులనొడళ్ళ. 15

క. ఒకపాఱుఁ దపుడు మావాం, డ్రకు నాకుం గఱపఁదొడఁగె రామస్తోత్రం
బిఁక నభ్యంతర మేమని, చెకచెక మామేనఁ దొడిగెఁ జిన్నరిపోఁచన్. 16

క. నాకుం బెట్టెలు తట్టలు, లేకున్నను జెవులుగట్టి లిప్పఫలింపన్
వీఁకను ద్రిప్పితి జందెము, చీకి తెగెం గొన్నినాళ్ళుసెల్లుడు నదియున్. 17

గీ. వెండియును దానిఁ దాల్చెడువేడ్క నాకు, నొదవమింజేసి క్రొత్త జన్నిదముదెసకు
నరుగనైతిని వయసురా నది యవశ్య, ధార్యమని నొక్కసాగిరి తగ్గవారు. 18

ఆ. కిట్టి యెంతపట్టుపట్టిన నాపట్లఁ, బాఱదయ్యె వారిప్రాభవంబు
శూద్రకునకు బ్రహ్మసూత్రంబుతగనినాఁ, దొరుల కేలజందెముండవలయు. 19

క. వెలిచిన్నె దీని మోచెదు, నలవాటును మాకుటుంబ మగ్గింపదు కా
వలయునని జందె మూనన్, బలువగుకారణము కానఁబడ దిఁక నాకున్. 20

గీ. ఏను వైష్ణవధర్మంబులోనివాఁడ, నగుటఁ దులసీస్రజంబు నాయఱుత నిడితి
నేమఱక పెద్దవాండ్రు నా కించుకంత, పిలుకపెట్టిరి కాని మాపితిని దాని. 21

గీ. ఆంగ్లదేశమున న్నిల్చునపుడు వెత్తి, వాఁడితం దెవ్వఁడని తెల్లవారు నన్ను
వెక్కిరింతు రటంచు సిబ్బితికి లోఁగి, వీడనాడితి నా నాల్గువెండ్రుకలను. 22

క. నావెంట నాస్తికాప్రజ, సేవించెడు ఛగనలాలుసిగ వలదన్నన్
ద్రోవంజేసితి నన్ను, ద్భావం బెదురాడు నిట్టిబహిరంకములన్. 23

ఆ. ఎన్నికోట్లమంది హిందువుల్ జందెము, శిఖనివారు జగతిలేరు నేఁడు
మనమతమ్ములోని మనుజులుగారె వా, రేల నాకు సూత్ర మిది మహాత్మ! 24

గీ. పోఁగుదాల్చుట నా మాఱుపుట్టు దాల్చు, టని తలంతును మాఱుపుట్టనఁగ వెలఁది
బ్రదుకు, మిక్కిలిబ్రదుకునాఁ బరఁగు నేఁటి, హైందవసమాజమున వీనికందగలదె. 25

క. మనసంఘము మనదేశము, మనసంస్కృతి దుర్భ రావమస్థితి లజ్జా
జనకంబై యున్నతతిన్, జనునే తలయెత్తి మనము జన్నిద మూనన్. 26

గీ. అంట రానితనమ్ము రూపాఱునాఁడు, హెచ్చుతగ్గులవేఱడం బెడయునాఁడు
చటులపాషండిభావమ్ము సమయునాఁడు, మనకు జందెముదాల్చు పెత్తనమువచ్చు. 27

ఆ. కాన బ్రహ్మసూత్రమూనంగఁ దగునని, మీవచించుపల్కు మెచ్చనేర
జుట్టునిల్పు మన్నసూక్తి మన్నించెద, సిగ్గుపడక యింకను సిగను బెంతు. 28

వ. నన్ను నావాదంబుచేతన తలక్రిందుసేయ నక్కావితాల్చు పెద్దయుం బెనఁగెఁ - గాని యజ్ఞోపవీతధారణమునకుఁ బెందిననాయాశయమ్ములు నాఁడు నేఁ డొక్కరూపు నంద వెలయు - జగమునం బలుమతమ్ము లున్నంతవట్టు నెల్లమతంబున కొక వెలిగు ర్తుంటతప్పదు - కాని దంబమునకు నహంకారమునకుం గారణ మైననాఁ డిది పరిత్యాజ్యంబ యగు - నేఁటి మనసమాజ మున్నతింబడయ నీసూత్రం బొకసాధనమ్మని యేను విశ్వసింపంజాలఁ - గాన దీనిదెసం దాటస్థ్యం మూనితి - లజ్జాత్రాసంబులంజేసి శిఖం ద్రోసితిఁ గాన ననుయాయులతోఁ గొంతకొంత చర్చించి మరల దీనిం బెనుప సమకట్టితి-నంత లక్ష్మణడోలం గాన నరిగితి-హృషీకేశమ్మును దీనిం గామక చూడ వలయుఁ - దొల్లింటి మనపెద్దల ప్రకృతి రమణీయ తాభిజ్ఞతయు ధర్మబోధక శిల్పంబు దిద్దు దూరదృష్టియు నిచటం గని యేను లెస్సపొంగితి - గాని 29

క. పావనములు సౌందర్య, శ్రీవనములు నైన యిట్టిసీమల మనుజుల్
గావించునెగ్గులకు నా, భావమ్ము కలంగె శాంతి పరువిడె నకటా! 30

క. నలుగురు నడిచెడిత్రోవల, కెలఁకుల గంగమ్మతల్లిక్రేవల నజ్ఞుల్
మలమూత్రమ్ములు విడుతురు, చెలఁగుచు మిన్నేటినీరు చెఱిచెద రిస్సీ! 31

క. మఱి నాల్గడుగులు వోయిన, దొరకుఁగదా వీరి కచట దొడ్డబయ ళ్ళీ
తెరు వెఱుఁగరేమి వీ రని,పరితాపముగంటిఁ గర్మఫల మనుకొంటిన్. 32

వ. లక్షణడోల నా నుయ్యేలవోలె వ్రేలాడు నాయససేతువు - మున్నిచట రజ్జునిర్మితము రమణీయం బైన వంతెన యుండ నౌదార్యరాశియగు మార్వాడిసా హౌకండు దానిం దొలంచి యపారవిత్తంబు వెచ్చపెట్టి యీలోహసేతువు నేర్పఱిచి దీనితాళపుంజెవులు దొరతనమువారి కప్పగించె - రాజభక్తి సంపన్నుండ నయ్యు నానాఁ డే నీయొప్పగింత సైరింప నోడితిఁ-దత్త్వముం బరికింప నిది తైర్థికవరణంబు కదా - వెండియు నచటి ప్రకృతిసౌభాగ్యమున కీకట్టు మచ్చయనియు వక్కాణింతు. 33



# 9 ఆశ్రమస్థాపనము

ఆ. రాజకోటలో హరద్వారమున వైద్య, నాథమందుఁ జెలులు నన్ను నిల్పఁ
గోర్కిపడిరి గాని కొసకు నహమ్మదా,బాదుకెలన నేను బాదుకొంటి. 1

ఆ. అచట వెలయునెయ్యు రాశ్రమమునకునౌ, వెచ్చమెల్ల నేమ యిచ్చువార
మునికిపట్లుసైత మొసఁగదెమని కదుం, గూర్మిఁజూప నందుఁ గుదురుకొంటి. 2

క. ఏను గుజరాతివాఁడను, గానన్ దద్భాష నండఁగాఁ గొని నాచే
నైనంతసేవ చేయుట, కానేలయ తగునటంచు నరసితి నాత్మన్. 3

ఆ. మఱియు నందుఁ జేతిమగ్గాలపై జీవ,నంబుసేయు జనమనంత మగుట
నూలువడుకుపనికి మేలొడఁగూర్చు న, య్యవనియంచుఁ బెద్దయాసపడితి. 4

క. మొదటన చెప్పితి నాశ్రమ, మిది కులముల లెక్కసేయ దిందలితీరున్
మదిమెచ్చి వచ్చుమాలకుఁ, బదమిచ్చుఁ జుఁడీ యటంచుఁ బౌరాప్తులకున్. 5

క. నీతలఁపుల నీకొని నీ,నీతిం దలఁదాల్చి నిల్వనేర్చిన సురియా
శీతావు త్రొక్కినప్పుడు, చూతములె మ్మనియె నొక్కసోదరుఁ డెలమిన్. 6

వ. అంత నే నాశ్రమంబునకుం బేరేమి యను చర్చకుం దిగఁ దపోవనం బనియు సేవాశ్రమం బనియు నెయ్యు రయ్యాయినామంబులు సూచించిరి - సేవాశ్రమంబనుట యుచింతంబ - కాని మాసేవాస్వరూపంబు దీనం దేట తెల్ల కాఁజాలదని నమ్మితి - నిఁకఁ దపోవనం బన్నయాఖ్య మాతలకు మించినవ్రేఁగు - సత్యముం బరికించుటయు నారాధించుటయు దానిదెస నభినివేశంబు పెంచుటయు మాలక్ష్యంబులు - మఱియు నాఫ్రికారంగమున మాపూనినకార్యపద్ధతి నిచటం బ్రవేశపెట్టి యది యీదేశమునం దెంతవట్టు ఫలించు నని శోధించుట నాయాశయంబు - కాన సత్యాగ్రహాశ్రమం బనునభిధానంబు సముచితం బని యెట్టకేలకుం దేల్చి మా యీడిగంబును దానితెఱంగును దీన సులభంబుగా నెఱుకపడునని తనివి నందితి - మఱియు 7

క. ఆశ్రమ మొకనేమంబున, కాశ్రితమై బ్రదుకవలయు నని కట్టడలన్
సశ్రముఁడనై లిఖించితి, విశ్రుతు లగువారికెల్ల వినిచితి నర్థిన్. 8

క. గురుదాసబెనర్జీ బుధ, వరుఁ డప్పుడు మీగణించు వ్రతవర్గమునం
దిరపడవలె నమ్రతయుం, బరమవ్రత మిది యటన్నపల్కును మఱవన్. 9

క. ఈనాఁటియువజనమ్మునఁ, గానంబడ దిట్టిమేలికట్టడ యని ధీ
మానితుఁ డతండు కన్గొనె, నేనుం జూచెదఁ గొఱంత యిది సంఘమునన్. 10

వ. కాని నమ్రతనుసైత మీనియమములం దిమిడ్చిన నది యదిగా నుంట పొసంగదు – తేట తెల్లగా వివరింపఁ బూనిననాఁడు దానిని శూన్యత నాఁజను – నదియె ముక్తి యగు – దానిం బడయ లాఁతినేమంబు వలయు – ముక్తిం గోరువాఁడు ప్రజం గొలుచువాఁ డెల్ల యెడల శూన్యతా నిరభిమానితలం బాటించు టావశ్యకంబ – యొుండేని యతఁడు మోక్షార్థియు సేవకుఁడుం గాక స్వార్థప్రియుండు నహంయువు నగునందు – నయ్యది యట్లుండె. 11

క. ఒక వంటసాలతో నది, యొకసంసారమ్ముపోలె నిప్పిదమున కే
లికయై యాశ్రమ మేర్పడె, రకరకములవారిమందిరం బది యయ్యెన్. 12



# 10 పరీక్ష

ఆ. అమృతలాలుఠక్క రత్యుదారుండు నా,కనిపె నొక్క లేఖ మవమకులజుఁ
డర్థుఁ డర్థహీనుఁ డాలితో బిడ్డతో, నిన్నుఁజేరు నిచ్చయున్నె యనుచు. 1

ఆ. ఆశ్రమంబుపుట్టె నప్పుడ తలఁపని, ఘటన యిట్లు రూపుకట్టి నిలిచె
నేమిసేయవలయు నిప్డని సంభ్రమం, పడితిఁ జెలులయెదుట నిడితిఁ గమ్మ. 2

క. వా రభ్యంతర మేమని, రారన్ ముదమంది రంత నాశ్రమవిధులన్
మీఱనిచో వారిం గొని, గారము వర్షింతుమని జగన్మాన్యునకున్. 3

క. ఠక్కరుబాబున కాకున్, మక్కువ నంపితిని వచ్చె మాలఁడు సతితోఁ
జక్కనికొమార్తతో నది, యక్కున మను నప్డు లక్ష్మి యనునామమునన్. 4

వ. ఈబిడ్డతల్లిదండ్రులు దానీబహన్ దూదాభాయి నామంబులం బరఁగుచుండ్రు – బొంబాయినగరంబున దూదా యొుజ్జనంబు నెఱపువాఁడు – మాయాశ్రమధర్మం బులకుం గట్టువడియుంట కీజంట యీకొనియె – మే మాప్యాయనమ్మున వారికిం గైగోలుమన్నన యొసంగితిమి – కాని 5

క. ఈమాలవారిపొత్తున, కేమీకొని యుంటఁజేసి యిన్నాళ్ళను మా
సేమంబు నరయు మిత్ర, స్తోమంబునఁ బెనుతుపాను తోఁచెన్ వీచెన్. 6

ఆ. అద్దెయింట నుంటి మపు డచ్చుటం గల, వాపి కింటివారు వచ్చుచుండ్రు
వారి వారితోడువాఁడు మారాకడ, కేవపడియె మాకు నిమ్ముసెడియె. 7

క. మానీటిచుక్క లాతని, మేనం బడరాదు పడిన మే మిఁక నానా
హీనోక్తులు వినఁదినవలె, నానాఁటికి నతనివెత్తి ననలం దొడిగెన్. 8

క. దూదాను గన్నయంతన, తా దావమువోలె మండెఁ దగవిటఁ బో పొ
మ్మోదయ్యమ యని మాలకు, నూఁదరపెట్టం దొడంగె నుడిగినతాల్మిన్. 9

క. నో రెంతపాఱవైచిన, మీ రాతనివంక రోషమిశ్రితచిత్తుల్
కారాదని ప్రత్యుత్తర, మీరాదని యంటిఁ జెలుల కే నవ్వేళన్. 10

ఆ. అతఁడు కొట్టుఁగాక యాఱడిచేఁత లే, వేవి సేయుఁగాక బావినీరు
మానవలవ దంటి మదిమదిమైఁ జెలి, కాంగ్రు నిలిచి రతనికాండ్రు సైచి. 11

క. మానిగ్రహ మాయయ్యకు, నానం గదియించెఁ గొన్నినాళ్లకు మంటల్
మాని సుఖముండె నాతం,డైనను బురివారిసాయ మడుగునఁ బడియెన్. 12

గీ. ఏను దొలుతొల్త గోసంగివానిరాక, సెప్పఁ జూతములె మ్మన్న చెలిమికాఁడు
నన్ను మెప్పించుపాణసి నన్నుఁదొడరు, మాలఁ దేయూరఁ గలఁడని మదిఁదలంచె. 13

గీ. ప్రజలు ధనమిచ్చు టది కుంటుపడినవెన్క, మాకు వెలివచ్చుచున్నద న్మాట వింటి
నెట్టిప్రళయంబు మూఁడుఁగా కీపురంబు, వదలరాదంటి మా లంబివారితోడ. 14

ఆ. ఒల్లఁబోక మాలపల్లెకుఁజని యంద, కాఁపురమ్మువెట్టి యోపినంత
కూలినాలి చేసికొని గంజిద్రావుచు,నుంద మంటిఁ జెలులయొప్పుఁ గంటి. 15

గీ. అంతలో బొక్కసము సున్నయయ్యె నన్న, మాట నాచెవికిం దెచ్చె మగనలాలు
బాగుబా గిఁక గూడెమ్ముబాటఁ బట్టి, సాగుదము లెందయా యంటిఁ జల్లచల్ల. 16

క. ఇక్క ట్లిట్టివి నాయెడఁ, బెక్కులు వాటిల్లెఁ గాని బెదరక నిల్వన్
జక్కనిబాసట యెట్లో, చిక్కెన్ దుదిగడియఁ జిత్రచిత్రం బగుచున్. 17

ఆ. వచ్చునెలకు లేదు వసువని మగనలా, లెచ్చరించి నాలు గేనునాళ్ళు
చనెనొ లేదొ నాదుసన్నిధికిం బాపఁ, డొకఁడు వచ్చె వేగ ముట్టిపడఁగ. 18

గీ. అతఁడు శకటంబు వీధిలో నాఁగియున్న, దెవ్వరో సాహు మీకొఱ కేగుదెంచి
పంచె మిముఁబిల్వ న న్నని పల్కినంత, బండికడ కేగినాఁడ సంభ్రమముతోడ. 19

గీ. నన్నుఁగని సెట్టి చిన్నారినవ్వు దోఁప, నన్న! మీయాశ్రమంబున కలఁతిసాయ
మాచరింపఁగ నాస క్తియయ్యె నాకు, నాదరింతురె నాకోర్కి నని వచించె. 20

క. తప్పక మీయాదరమున, కొప్పెద నేఁ దట్టి దెంతయుం గావలె నో
యప్పా! యంటిని వణిజుం, దప్పటియున్ వత్తు నెల్లి యనుచుం గదలెన్. 21

క. మరుసటినాఁ డవ్వేళకు, నరుదెంచెను సేటు మొరసె నాతనిమోటా
రెతిఁగించిరి చిఱుతలు నా, కుఱఁగటి కేతెంచి వర్తకునిదగ్గఱుటన్. 22

గీ. అతఁడు లోనికిరాఁడయ్యె నబ్బెహారి, చేరువకు నేన పోయితి నౌర! పదియు
మూఁడువేలరూపాయలముల్లె నాదు, చేత నిడి మౌనివోలె వేంచేసె విపణి. 23

క. కలనైన నిట్టియుపకృతి, కలిమిన్ దలపోసియెఱుఁగఁ గదు నక్కజమున్
వెలయించె సెట్టి సాయము, సలిపినరీతియు నపూర్వసంధానంబై. 24

క. అతఁ డెన్నఁడు మాసేవా, యతనంబును ద్రొక్కియెఱుఁగఁ డా నైగము నా
కృతతిన్ మాత్రము చూచితి, నతిసర్జన మీదృశంబు నభినందితున్. 25

ఆ. ఇన్నివేలవిత్త మీరీతి నబ్బుట, నాఁగె మాలపేఁట కరుగుపైన
మొక్కవత్సరంబు చిక్కొఱుంగక బండి, నడుపవచ్చునంచు నాకుఁ దోఁచె. 26

క. నామాలపొత్తు పౌర, స్తోమమునం దొకతుపానుఁ దొదరించినయ
ట్లేమని సెప్పుదు నాశ్రమ, భూమినిసైతము కలంత పొలువఁగఁజేసెన్. 27

ఆ. అంటరానివార లాశ్రికానేల మా,యునికి నుంట తింట యుండెఁగాని
ప్రకృతమాశ్రమమునఁ బాలివాంఢ్రె మాల, లిరవుకొంట చాన కింపదయ్యె. 28

వ. కస్తూరియ కాక లాఁతివెలందులును దానీబహేనుపట్ల నొప్పరికమూని యున్న యీగడ కదుంగడుఁ బదనుగల నాకంటికిం జెవికిఁ దేట తెల్లయయ్యె – బొక్కసము వట్టువోయి ప్రజలసాయంబు తెంపువడిననాఁడు నాదెందమం దెన్నఁదగినవగపు వెఱపులు పుట్ట వాయెఁ – గాని నేఁడు తలచూపిన యీయింటిపోరు సైరింప నోటువడితి – నిమ్మాలెత యెల్లమగువలంబోనిదియ నాఁజెల్లు – నయ్యిల్లాలి మగండు పెద్దచదువరి కాకున్నను గుణదోషవిచారంబు లెస్సనేర్చినవాఁడు – వానితాల్మి కే నుబ్బుచుందు – నతని కొక్కొక్క యెడఁ గింక యంకురించుఁ–గాని వాని యోర్పు నన్నులోఁగొను – నలఁతి యలఁతి యీసడింపుల లెక్క సేయకుమని యేను దూదాభాయికిం జెప్ప నతఁ డియ్యకొంటయ కాక తన యాలికిసైత మోరిమిం గఱపువాఁడు – సత్యాగ్రహాశ్రమం బీయాలుమగలపొత్తు వడయుటంజేసి పెక్కుసవరింతల నెతింగె – వెండియు 29

ఆ. ప్రొయ్యి పెట్టునాఁడ పొచ్చెములేక మే, మంటరానితనము నాదరింప
మది సమాజమునకు నాఅనిమచ్చగాఁ, దలఁతు మనుట మాకుఁదప్పెఁ జిక్కు 30

క. ఏ మింతలెల్ల చేసిన, గీమునవెచ్చంబు నాఁటికిన్ నాఁటికి ను
ద్దామంబైన సనాతను,లోమిరి మాయాశ్రమంబు నుద్గాథముగన్. 31

క. మాలలతో నివసించుచు, మాలఁడు వండినది తినుచు మనుచుండుఁ గదా
మాలంబి; దీని నెతిఁగియుఁ, బోలన్ మాకిడిరి వారు భూరిధనంబుల్. 32

వ. ఈ పెద్దలు తమ్ము సనాతనమతారాధకులఁగా విశ్వసింతురు – దీనంజేసి యంటరాని తనంపు టట్టడుగు లుఱ్ఱుఁతలూగె నని తెల్లమియయ్యె–నియ్యది సామాన్య ప్రమాణమ్ము కాదుగదా – మఱియ నీముట్టుదోసంబు నడఁగార్చుపట్ల నన్నెదిరిన ననసన్నతీఅములం గూర్చియు నాకస్మికంబుగాఁ దారసిల్లినయంతరాయములం గడచి యే నొద్దుపట్టుటం గూర్చియు సత్యపరిశీలనమునకుం జెందిన నానాగాథలం గూర్చియు వివరింపఁదగిన గ్రంథ మెంతేని కలదు – కాని దానినిపు డుజ్జనసేఁతయు ముందైనఁ గొంత మఱుపఱుచు టయు ననివార్యంబ – కారణం బేమన 33

క. ఈకథను వచ్చుపురుషుల, నేకులు మని యున్నవారు నేఁ డీజగతిన్
వాకొనఁదగునె తదీయం, బీకోలుం గనక వారివృత్తాంతంబున్. 34

క. సమ్మతికొఱ కయ్యయి భా, గమ్ములు వారలకుఁ జేర్చి కాఁదగు సంస్కా
రమ్ములు సేయించుట వా, ని మ్మతి తెప్పించు టెంతనెగులో సెపుఁడీ. 35

ఆ. నెగు లొకండెకాక నే నాత్మచారిత్ర, నియమ మతకరించుటయును బుట్టు
నగుట సత్యశోధనార్థి కీకథ నిఁక, వెల్లడింపఁజాల నెల్లఁ జేర్చి. 36

ఆ. ఇదుమ లిట్టివయ్యు నీశ్వ రాశంసన, మున్న నసహయోగ యుగముదనుక
నస్మదీయరచన మల్లనల్లన లాఁగ,వలయు నన్నకోర్కి కలదు నాకు. 37



## 11 ఒడంబడిక నెత్తివేయుట

ఆ. అడుగునంద వచ్చె హంసపాదం బను, రీతి నింట బయట రేఁగినట్టి
గాలివానఁ జిక్కి గాసిల్లి తేతిన, యాశ్రమంపుసుద్దు లవలఁబెట్టి. 1

క. నేటాలుకూలివారల, నూటార్చుబెడదంద కొంత యోజనసేయన్
బాటిల్లెఁ దరుణ మే నె, చ్చోటన్ నెలకొన్న వీరిసుఖ మెంతుఁ గదా. 2

వ. వీరి కచట విధించినవార్షికము మూఁడుపౌనులతలపన్ను నేలుబడివారు వేయుఁ దొమ్మన్నూట పదునాల్గవ శరత్తునం దొలఁగింప నిర్ణయించిరి - కాని తచ్ఛాసన మింత దనుకఁ బ్రయుక్తంబు కాదయ్యెఁ - బదునాఱవ సంవత్సరంబున మదన మోహనుఁ డీచేటుం గూర్చి రాజప్రతినిధి హోర్డింజిప్రభునకుం దెలుప నదను వచ్చిననాఁడీపద్ధతిం దొలఁగింపుమని సమ్రాట్టు నా కానతిచ్చెఁ గావున వేచి యుండం దగునని యతం డుత్తరమిడెఁ - దేట తెల్లగాని యీవాగ్దానముంబడసి భారతీయు లుప్పొంగఁజాలరు - కాన వెనువెంటన దురాచారంబు నిద్దాని నడఁగింప నిశ్చయించితి - నింతవట్టు దీని దెసకుం జూపు నిగిడింపక పరాకుపాలై యున్నను 4

గీ. నేఁడు భారతదేశంబు నిద్రలేచి, తనవిధిం బరికించుచందము నెఱింగి
తగనిప న్నిది యంచు మిత్రములచెంతఁ దడవి పత్రికలన్ దీనిచెడుగుఁ జాటి. 5

క. అలబల మెంతయుఁబెంచితి, వల దీకర మంచు నెల్లవా రెంచినటుల్
తెలిసితి సత్యాగ్రహ మిట, వలయునొకో యన్న తర్కవైఖరిఁ బడితిన్. 6

వ. అంత రాజప్రతినిధి'యదనువచ్చిననాఁ'డన్న పల్కు వివరించుచు 'నిపుడున్న తెన్నునకు మాఱు వేఱొండు తెఱఁగుం బ్రవేశపెట్టఁ దగినతఱి వచ్చినంతన యీపద్ధతి పరిత్యక్తం బగు'నని వెల్లడించెఁ - బదంపడి పదునేడవయేఁటి రెండవమాసమ్మునం దీబన్నముం దుదువ మాలవ్యామహాశయుండు సామ్రాజ్యశాసనసభ నొండు చట్టముంబ్రతిపాదించెఁ - గాని రాజప్రతినిధి దానిం ద్రోసివైచె - నీసమస్యను దేశమందెల్లఁ జాటుట కర్తవ్య మని నమ్మి మున్ముం దాయధికృతుం గనుకలి లగ్గని తలంచితిని - నతనిం జూడ నాపంపినమనవి తోడ్తో నురరీకృతం బయ్యె - నమ్మేటి ఛమ్సుఫర్డు నన్నాదరించి నాతోఁ బెద్దతడవు సంభాషించియు నిదమిత్థ మని యెద్దియుం దేల్చి పలుకఁడయ్యెఁ - గాని నా కతనిసాయంబు లభించితీరు నన్నయాస మొలతెంచె - నంత 7

క. తలప న్నిది దూష్యం బను, నలజడి సాగించినాఁడ నపు డాద్యసభన్
వెలయించితి బొంబాయిని, వెలగలవా రెందరేని విడిసిరి రచ్చన్. 8

క. పలుతర్కంబుల కవ్వల, జులై చివరనాఁడు పన్నుచొప్పును మాపన్
వలెనని తీర్మానంబును, సలిపిరి నల్గడల నిట్ల జరిగె సదస్సుల్. 9

గీ. జాతిగౌరవ మర్థించుసతులు వీను, మిగిలినన్నలు బొంబాయినగరివారు
రాయబారంబు నడిపి రీఱాపు నాఁపు, టుచితమని పల్కి ఢిల్లీశునొప్పుగనిరి. 10

క. ఏను గరాచీమున్నగు, నానాపురములకు నేగినాఁడను సకల
స్థానంబుల నుత్సాహ, శ్రీ నిండ నుదాత్తసభలు చేసిరి పౌరుల్. 11

క. ఈపనికిం బూనిననాఁ, డీపాటి మహాసదస్సు లేర్పడు ననియున్
నాపల్కులు ప్రజ కింతటి, తీపి స్గలిగించు ననియుఁ దెలియనివాఁడన్. **12**

గీ. తోడులేనిప్రయాణంబ నాఁ డొనర్చు, వాఁడ వేగులు నావెంట వచ్చువారు
కాని కల్లయుఁ గపటంబు లేనిమనిసి, నగుట మాకెన్నఁడేని గయ్యంబు సున్న. **13**

వ. అదృష్టవశమ్మునంజేసి నాకానాఁడు మహాత్మేతి విశ్రుతి లేదయ్యె – నైన నేమి నన్నుగు ర్తించినయెడం దానిగోల తప్పకుండె – నొక్కమా ఱేను బొగబండి జనుచుండఁ బెక్కంచెలలోఁ జారులు నన్నుఁగదిసి నాచీటిం బరికించి దానిసంఖ్య నెత్తివ్రాసికొని యించుక రగడగావించిరి – నాపెట్టెనున్న తెరువరులు న న్నొక యతింబలె భావించి మాటిమాటికిం బ్రణిధు లేతెంచి నన్నుఁ గలంచుటం గని కినిసి నావంకకుం జూచి యీనీచులకుఁ జీటిం జూపనేల యని పల్కు. **14**

క. పోనిండు నాకు దీనన్, గ్లాని జనింపదుగదా యిఁకన్ వేగరు లీ
పూనినపని వారలవిధి, యౌను గదా నిక్క మరయుఁ దయ్యా! పాంథుల్. **15**

క. అని యాడిననామాటలఁ, దనివిం గనరైరి వారిదయనాపట్లం
గునిసెను దోస మెఱుంగని, మనుజుని బాధించు టుచితమా యని వారల్. **16**

క. చారుల నెదిరించిరి; నా, కీరాయిడి నతకరించు నిఱుకటమునకున్
గారణమయ్యెఁ గొలందికి,మీఱినపథికాలి; తద్ద మెదిగితి దీనన్. **17**

వ. ఏనుగరాచినుండి కాళీఘట్టమునకుం జనుచుంటి – లాహోరున బండి మాఱవలసె – నపుడు నా కెంతబడలినం దావు దొరకదయ్యె – శక్తి సంపన్నులు కిటికీవలనం బెట్టెలోఁ బడసాగిరి – నాయాశ యంతరించెఁ – బయనం బాఁగరానిది – కర్తవ్యమేమని యే నొల్లంబోవుతఱిఁ గూలివాఁ డొందు ముప్పావులా నిత్తువే నునికి సంపాదింతు ననె – నభ్యంతర మేమని యే నంటి – నతఁడు పెట్టెపెట్టెకుం జని తెరువర్లకా ళ్ళంటి యెంత దేవురించిన నేమి వారు మెత్తఁబడరైరి – బండి సాగు తఱి వచ్చె – నపు డధ్వగుఁ డొకండు బండిలోనివాఁ 'డిం దెడము లేదు – కాని యతని నెట్లో నెట్టుము – నిల్చియైన వచ్చు' నన దలారి నాసమ్మతిం బడసి నన్నెత్తి లోనం బడవైచి తనకట్నముతోఁ దానేగె **18**

క. అది నాపాలిట ఘోరా, పదాశ్రయం బనఁగఁ దగువిభావరి; యెట్లో
కుదురుకొని రెల్ల రిదియే, పదివేలని యేను గొలుసుపట్టి నిలిచితిన్. **19**

ఆ. కదలిపోయెఁ బెక్కుగంటలు కూర్చుండ, వే మటంచుఁ బాంధు లాము వెలయ
నన్ను నెచ్చరింప నాకుఁ దా వెచ్చుటఁ, గలదు నిల్వ నేమిక స్తి వచ్చు. **20**

క. అని యల్ల నుడువసాగితిఁ, దననిల్చుట వారి కింపితము గా దైనన్
మణఁగింపరు సాఁచినకా, లణఁగింపరు సానుభూతి నౌద్ధత్యంబున్. **21**

ఆ. కసరి విసరి పల్కఁగడఁగిరి వార లే, నడఁగి ముడిఁగి మాటలాడుచుంటి
నెట్టకేని వార లించుకతేఱి నీ, యూరు పేరు సెప్పవోయి యనిరి. 22

క. నాపేరు విన్నయంతన, పాపము! తెరువర్లు క్రుంగఁబాఱిరి తప్పుల్
సైఁపుఁడని రెడము నిచ్చిరి, చేపడె నా కపుడు తాల్మిచే నగులగ్గల్. 23

ఆ. అలపుసేరి మూరి తలకాయ గిరగిరఁ, దిరుగువేళ నిల్చుదిటవు లేక
దెసలు సూచువేళ దేవుఁ డిబ్బంగిఁ బ్ర, సన్నుఁ డయ్యెఁ బధికసమితి బెరసి. 24

క. తతి దప్పక కలకత్తా, దఱిసితిఁ గాసింబజారుధాత్రీపతి మం
దిరమున విడిసితి నాదర,భరితం బాతిథ్య మొసఁగెఁ బ్రభుఁ డవ్వేళన్. 25

గీ. అమ్మహారాజు యాజమాన్యమ్మునంద, జరిగెసభ వెల్లివొడిచె నుత్సాహ మచట
వచ్చి రారచ్చకుం దెల్లవారుఁ గొంద, ఱాలకించిరి నామాట లాసపెంచి. 26

వ. అంత జులైనెల ముగియకముందఱ యీకూలి చట్టము నిషిద్ధంబాయె నని రాచతికము
వారు వెల్లడిచేసిరి - యిది పరిత్యాజ్యంబని యేను వేయెనమన్నూట తొంబది నాల్గవ
యేఁట మొదటిమొఱం జాటితి - సర్‌హంటరు దాస్యకల్పంబని ముద్రవైచిన యానీచ
పద్ధతి యెన్నఁడో తొలంగునని యే నాసపడితి - నెందఱెందఱో గఱువలు తోడ్పడ
నేఁటికిది రూపుమాసె - నీవిజయమ్ముకల్మికి సత్యాగ్రహంబును గారణమని వక్కాణింతు
- దానిం బాటించి దన్నినవారి మనుగడం దెలియవలచువారు నారచించిన
దక్షిణాఫ్రికాసత్యాగ్ర హేతిహాసమ్ము చదువుదురు గాక! 27



# 12 నీలిమందుదాగు

క. సీతమ్మతల్లి పుట్టిన, పూతాత్ముఁడు జనకయోగి ప్రోచిన మహి ను
ద్యోతిలుఁ జంపారణ్యము, చూతాదివనీకదంబ సుందర మగుచున్. 1

క. అచ్చటి పొలములు బంగరు, టచ్చులు పండింపఁ దగినయట్టివి వానిన్
నెచ్చోకవెలకు విలిచిరి, వచ్చిరి తెలవార లటకు వాణిజ్యరతుల్. 2

క. నిఱుపేదలు చదు వెఱుఁగరు, పొరపొచ్చెము లెఱుఁగ రందుఁ బొదలెడుకాఁపుల్
దొర లీసాధువులం దమ, కరిసనమున దింపి కొట్లుగట్టిరి సిరికిన్. 3

క. దారుణశాసనములతో, వారిని బానిసలఁ జేసివైచిరి చెమటం
గాఱిచినరైతు కూడుం, జీరయు కఱవై కడుం గృశింపఁ దొడంగెన్. 4

వ. నాఁడు మనదేశంపు నీలిమందువిలువ మండిపోవుటంజేసి యాంగ్లేయులు తమ భూములం దీపైరు వేయింపసాగిరి - వారు సేద్యగాండ్రకుం దగుకూలి నొసంగమియ కాక యిరువదింట మూఁడుపాళ్ల నేలం గర్షకులు పండించిననీలిపంటనెల్ల నిర్మూల్యంబు గాఁ దమకుఁ గానుక పెట్టునట్లు చట్టంబు సేయించిరి - వెండియుం గమ్మతీండ్రు క్రమవిరుద్ధంబులగుపన్ను లెన్నియో చెల్లింపవలయు - భూస్వాముల కధికారులచెంత వలసినంత పలుకుబడి యుండుఁ - గాని వంటకాఁపులమొఱ నాలకించుదిక్కు లేదయ్యె - నట్టితఱి 5

క. చంపారణ్యమునం బెను, లంపటలకుఁ జిక్కి యలుగులంపడు రైతుల్
పెంపారు టెట్టులని యీ, చంపుం దొలఁగించునాప్తజనుఁ డెవఁ డనియున్. 6

గీ. అచటిదైన్యములందుఁ బా లందుకొనుచు, మనెడు హాలికుండు రాజకుమారశుక్లుఁ
దారటించుచు లక్నోపురాంతరమునఁ, గూడు కాంగ్రెసులోఁ బట్టుకొనియె నన్ను. 7

ఆ. చాంపరానులోనిసైరికుల్ కుడిచెడు, నిడుమలెల్ల నాకు నెఱుకచేసి
మమ్ము నుద్ధరింప మాపొలమ్మునకు రా, వలయు మీర లొప్పవలయు ననియె. 8

క. నీచెప్పినపల్కులతో, నాచందము నిర్ణయింప నామది మరలున్
మీచిక్కులు కాంగ్రెసునకు, సూచింపుఁడు కృత్యమవలఁ జూత మటంటిన్. 9

వ. అంత నతనివకీలు వ్రజకిశోరుఁ - డాసమస్యను భారతజాతీయ మహాసభదృష్టికిం దెచ్చె-సభ్యులెల్లరు దాని నంగీకరించిరి-రాజకుమారుఁ డిందుల కెంతయుం దనివి నందెఁ - గాని యిల్లలికినంతన పండువు కాదని యతం దెఱుఁగు - నగుటం జేసి న న్నాభూమికిం గొనిపోయి తమతీఱములనెల్లఁ దెల్లముసేయం బట్టుపట్టె - నాపయ నమ్మునం గామక మీసీమకువచ్చి మీబ్రదుకుం బరికింతునని యేనంటి - ననంతరం బేను గాన్పూరునకుం జనఁ గర్షకుఁ డితం డచట సాక్షాత్కరించి మా నేల యాచేరువం గలదు - మాకై యొకనాఁటిని వెచ్చింపుఁ డనియె - నపు డే నీసారి మీకోర్కి చెల్లింపఁ జాల-నొండొకపరి తప్పకవత్తు-నని ప్రతినచేసి నన్నుం జెఱవైచి కొంటి-నంత 10

క. చేరితి నాశ్రమమున కీ, సైరికుఁడు న్వచ్చె నపుడ సమయంబది ని
ర్ధారణసేయుండనెన, వ్వీరుని రవరవకుఁ బెల్లు విస్మయపడితిన్. 11

క. అన్నా! కలకత్తా కేఁ, గ్రన్నం జనవలయు నపుడు కామక మి మ్మా
పన్నుల దర్శించెద మీ, బన్నంబులు మోవఁ బాటుపడియెద నంటిన్. 12

క. కాలం బిదియని సెప్పితిఁ, గాళీఘట్టంబునందుఁ గాల్ మోపకముం
దే లోకవ్యాపకుఁ డీ, మేలికృషీవలుఁడు నాసమీపముఁ జేరెన్. 13

ఆ. ఓనమాలచదువురాని కల్లయుఁ గప, టంబులేని యుత్కటప్రతిజ్ఞ
వెలయువాని వాని వీక్షించినంతన, మనసుపొంగి యతని మనిసి నైతి. 14

వ. వంగనగరమ్మునం గల కర్తవ్యమ్ము వేవేగ ముగించుకొని నీలిమందువలనిదాగుందుదువ నే నక్కాఁపువెంట వేయితొమ్మన్నూట పదునేడగునేఁటిమొదటఁ జంపారణ్యమునకుం బయనము సాగించితి - నే మిద్దఱ మొకయీడుగల్గి యచ్ఛమైన రైతువేసముతో నొకపెట్టెయందు చేరి సూర్యోదయావసరమునఁ బాటలీ పుత్రమ్ము గంటిమి - నా కా పురం బింతకుము న్నపరిచితంబు - కాన సచ్ఛీలుండగు రాజకుమారున కవ్వీట మాటసెల్లదాయని యూహించితి - బండిలో నితని యీగడ కొంత యెఱింగితిఁ - గాని యిపు డెల్లయుం గంటి - నితఁడు బొత్తిగా నమాయికుఁడు - తనచెలికాండ్రని తలంచినన్యాయవాదు లితని కట్టివారు కారు - పై పెచ్చు మనయీరైతుపెద్ద వారి కాశ్రితునింబలెఁ గన్పట్టె - నిట్టి కర్ష కాభియోగులకును ధర్మవాదులకుం గలదవ్వు కొలఁదిపెట్టరానిది నాఁడగుఁ - గాన 15

క. రాజకుమారకుఁ డంతన్, రాజేంద్రుని మందిరంబునకు ననుఁ జేర్చెన్
సౌజన్యరాశి యతఁ డా,రోజునఁ బురమందులేమి రోఁజితిఁ జింతన్. 16

క. సేవకులు గలరు గేమునఁ, గావలసినతిండిఁ దెచ్చెఁ గర్షకవీరుం
దేవేవొ కాయగసరులు, నావెంటం గలవు తీర్చినాఁడ బుభుక్షన్. 17

గీ. అంటరానితనమ్మున కాధరిత్రి, పాదుగా నుండె లెంకలు నాదుకులము
గుట్టెఱుంగరు నానీటిబొట్టు సోఁక, నద్దిరా వారినైర్మల్య మంతరించు. 18

క. ఏ నప్పుడు శకృదార్తికి, లోనైతిని రైతుసూపె లోపలిపెడలిన్
మాను మిటు పోవయా యని,బానిస చూపించె బయటిపాకీదొడ్డిన్. 19

క. ఈదృక్షము లనుభూతులు, నాదగుజీవనమునం దనంతము లొదవెన్
ఖేదంబు విస్మయంబును, రాదు సుఁడీ నాకు నిట్టిరాపులకతనన్. 20

క. ఆచేయుట తనవిధి యని, చూచెను సేవకుఁడు తనదుచొప్పది తన్నుం
బ్రోచుదొర కింపితంబని, తోఁచెను వానికి నిఁకెట్లు దూఱుదు నతనిన్. 21

ఆ. అక్కజమ్ముపెంచు ననుభూతు లిట్టి వా, కృషకుచందమెల్ల నెఱుకపఱిచె
నతనిపట్ల నస్మదాదర మల్లల్ల, మూరిఁబోయె జాలి ముమ్మరించె. 22

ఆ. అతఁడు నన్ను నడుపునట్టినేర్పరి కామి, లెస్సగంటిఁ బాటలీపురంబు
చేరుకొంట మొదలు సైరికబాంధవ, ప్రగ్రహంబు లేన పట్టుకొంటి. 23



# 13 బీహారువారి మంచితనము

క. ఏ నున్ననాఁడు లండను, లో నిల్చి మదీయమిత్రలోకమ్మున నొం
డై నెగడుహక్కు ముస్లిము, ధీనిధివృత్తాంత మది మదిన్ దళుకొత్తెన్. 1

క. ఒకపరి బొంబయి కాంగ్రెసు,నకు వచ్చిననాఁ డతండు ననుఁగని ప్రాఁజె
ల్మికి గుర్తు సెప్పి యాదృతిఁ, బ్రకటించుచు 'నావసించు పాట్నాపురికిన్. 2

క. ఏతెంచినతఱిఁ దప్పక, యీతమ్ముని యింటిదెసకు నేతేరవలెన్
గౌతుకమిది పం డగునని, చేతమ్మున లెస్స విశ్వసించెద' ననియెన్. 3

క. కావున హక్కున కప్పటి, నావచ్చుట నెఱుకపఱిచినాఁడఁ బ్రమోద
శ్రీవారిధియై పొంగుచు, వేవేగ నతండు నాదువిడిదలఁ జేరెన్. 4

క. తన మోటరుశకటంబున, నను నింటికిఁజేర్చి మధురనమ్రతమైఁ బ్ర
న్ననివిం దొసంగి నెచ్చెలి, తనముం బ్రకటించి మత్కృతజ్ఞత వడసెన్. 5

క. రాజకుమారుఁడు సెప్పఁగ, మాజతనము తెఱఁ గెఱింగి మౌలానా హ
క్కీంజద్దపట్ల మున్మను, పోఁజెల్లును మీ ర్మఝప్పపురమున కనుడున్. 6

క. పైనముకట్టితి నంపితి, వైనము వినిపించు తీఁగవక్కాణము న
చ్చో నలరెడిక్కృపలానికి, మానితశీలునకు బుద్ధిమచ్చంద్రునకున్. 7

క. అద్దమరేయికి గాటపు, నిద్దురతతి కిచటికేగి నిల్చెను మాౖరై
లద్దిర! శిష్యావలితోఁ, దద్దయు నాసక్తితో నతం దరుదెంచెన్. 8

క. త న్నగరకలాశాలకు, వన్నియనిడు గురుపదంబు వర్జించి యితం
డున్నాఁడు నాఁడు గేహం, బన్నది లే దచట నీకృపాచార్యునకున్. 9

క. తన సాటియొజ్జయై స,జ్జనుఁడగు 'మలకాని' నిల్చుసదనంబునకున్
గొనిపోయె నన్ను మిత్రుం, డనూనహార్దమ్ము కురిసె నప్పండితుఁడున్. 10

ఆ. దొరతనమ్మువారి దొడ్డకలాశాల, నొజ్జనమ్ము వడసి యున్న మేటి
నన్నువంటివాని నాఁడు మన్నించుట, నిక్క మరయ లెస్సయక్కజంబ. 11

క. ఆవల బిహారునం గల, లేవడిపెం పెల్ల మూదలించెను జెలికాఁ
డీవు తలకొన్నపని యొక, త్రోవకు నేతెంచుటన్న దుష్కర మనియెన్. 12

క. అతనికి బీహారుపరి,స్థితు లన్నియుఁ దెలియు లోకసేవనరతియై
బ్రతికెడు తద్దేశీయుల, కత లాతఁ డెఱుంగు వారిగౌరవ మందున్. 13

క. నారాకచంద మంతయు, వారికి మును సెప్పెఁ గాన వచ్చిరి వీటన్
చేరందినపెద్దలు నా, చేరువ; కగ్గించి రేను జేసినచెయువుల్. 14

గీ. రామనవమీప్రసాదాఖ్య రాణగన్న, సభికుఁ డీవచ్చు వారిలోఁ జాలినతఁడు
మఱచిపోఁజాల నితనినామంబు నెడఁద, నభినివేశంబు నేతదీయంబు మెత్తు 15

క. అమ్మేటి మీర లిగ్గురు,నిమ్మున వసియింతు రేని యాదేరదు మీ
నమ్మినపని మాయాతి, థ్యమ్మున మాచెంత నిల్వఁదగునని తలఁతున్. 16

క. ఇందు గయాబా బున్నతి, నందినసభికుండు తద్గృహమ్మున బసపె
ట్టందగును మీకు మి మ్మే,నందులకుం బిల్చువాఁడ నాతనివోలెన్. 17

క. మాకు నధికారు లన్నన్, జేకుఱుఁ దల్లడము; చెప్ప సిగ్గగు నైనన్
లోకమ్మున కోపినమే,లీకొని కావింతు మిట్టి విట మాబ్రదుకుల్. 18

ఆ. రైతు లిందుఁ గుడుచురారాపు లెన్నియో, కలవు శుక్లఁ దెల్లఁ బలికియుందు
నతనిపల్కు నిక్క మక్కటా! నేఁడు మా,నేత లిచట లేమి నెగులుపుట్టు. 19

గీ. వ్రజకిశోరుఁడు రాజేంద్రుఁ డజితదీక్ష, నవధరించిన సంఘసే వాభిరూపు
లిచ్చితిని దంతి వారికి వచ్చుచుందు, రమ్మనీషులు పిదప మీ కమరుఁ దనివి. 20

క. ఇచటి యవుగాములన్నియుఁ, బ్రచురింతురు వారు మీకు బాసటలై య
భ్యుచితమ్ముగ వర్తింతురు, రుచింత్రు వేంచేయుఁ దగ్గఱువగీమునకున్. 21

గీ. అనుడు నప్పల్కులెల్ల నాయాసఁ బెనుపఁ, జేరుకొంటి గయాబాబుగారియింటి
కతఁడు సకుటుంబముగ నంచితానురాగ, రసము వర్షించి నాకు సంతసముగూర్చె. 22

వ. అంత రాజేంద్ర వ్రజకిశోరప్రసాదులు పూరీ దర్భంగాల విడిచి నన్నుం గదిసిరి - వ్రజ
కిశోరుఁ డానాఁడు లక్నోకాంగ్రెసునం దెనలేని పటాటోపమ్ము నవధరించి వకీలుదొర
వోలెఁ జూపట్టె - నేఁడు బిహారుప్రజలకు సాజంబగు నడఁకువకును దంబములేమికిని
విశ్వాసమునకును మూదలయై నన్ను లెస్సతనిపె - నితనిపట్ల సాటి పాడిపల్కరులు
వెలువరించుపేర్మిం జూడ నాకెలమియు నబ్బురంబు నావహిల్లె - నదిసుత నా కీధర్మవాది
బృందమ్ముతోడి నెయ్యంబు తిరపడె - నంత 23

క. వలసినయుదంత మెల్లను, దెలిపెను వ్రజబా బతండు దీనులతగవుల్
తల నిడికొని వారికి మేల్, గలిగినఁ దత్సేవ దక్కెఁగద యని పొంగున్. 24

గీ. త్యాగధనులయ్యు రాజేంద్రుఁ డీగుణాఢ్యుఁ, దుజ్జగింపరు పేదర్మి విజ్జి కుములు
కమ్మతీంద్రురచెంత సుంకమ్ము గొనుట, యెట్లుజీవింతు మదిలేక యే మటంద్రు. 25

క. భృతివదయక బీదల కే,గతి సాయమొనర్తు మంద్రు కాళీఘట్ట
క్షితిని బిహారున సభికులు, జతలేనిధనమ్ము నడుగ జంకెఱుఁగ రెదన్. 26

క. ఒకన్యాయవాది తనమతి, ప్రకటింపం గొనియె సొమ్ము పదివే లెచ్చో
టికిఁ జని విన్నను వేయిం,టికిఁ దగ్గినముదుపు లేమి నివ్వెఱపడితిన్. 27

గీ. వలదు లోభ మిటుల్ ధర్మవాది కంచు, నపుడు సౌహార్దపూర్వకమైన మంద
లింపు నెఱపితి నాపల్కు లెస్సయను త, లంపున వకీళ్లన న్నెదిరింపరైరి. 28

గీ. చాంపరాన్‌సేద్యగాంద్రుభూస్వామివలనఁ, గుడుచుకడగండ్లఁ గొన్నింటిఁ గోర్టువారి
యెదుటఁబెట్టిరి వానిగుట్టెల్లఁ దెలిసి, కరము తర్కించి యచటిసోదరులఁ గాంచి. 29

ఆ. అన్నలార!యిడుమ లగ్గలమై పేద, కాఁపు లింతయోట గన్ననాఁడు
పాడిపట్టువలనిఫల మది యేపాటి, యూఱడించు వీరి నుద్ధరించు. 30

క. వెఱపును దవ్వగఁ జోపుట, సరియగుమం దిపుడు దుష్టశాసన మది రూ
పఱవలయును 'దీన్‌కఠియా', పరాన్నభుక్కులకు మేలిపారము కాఁగన్. 31

గీ. చట్టమిది నష్ట మౌనంతవట్టు మనము, కన్ను మూయంగఁదగదు నాకార్య మిచట
నొందు రెండు దినాలతో నిందు ననుచు, వచ్చితినిగాని తలఁపది వాసెనిపుడు. 32

క. కందునుగదా నెఱం కిది, రెండేఁడుల కృత్యమని యెఱింగితిఁ దలఁపున్
బందించుతెఱఁగు జూచితి, నుండెద రెండేండ్లుసైత ముపకృతి యున్నన్. 33

క. నాయత్నము నెగ్గఁగ మీ, సాయంబును వలయునంటి సరసుఁడు వ్రజబా
బోయన్న యస్మదాదులు, చేయం దగుసేవ యెద్ది సెపుఁడా యనియెన్ 34

గీ. వలదు మీ న్యాయవాదితావైభవంబు, లేకరియును దుబాసియు నాకు వలయు
నిందు రావచ్చు నేఁజెఱకేగుదశయు, మీరలును వచ్చెదరయేని మిగుల మెత్తు. 35

క. కారాగృహమున కోడిన, రారండని యేను మిమ్ము రాపిడిసేయన్
గోరిన వ్రాయసపుంబని, తీఱిచినం జాలు దూఁకితీరెదఁ గలనన్. 36

క. ఇచ్చటి కైథీ యురుదులు, వచ్చినపండితుఁడఁ గాను వానిని విత్తం
బిచ్చి యెఱింగిన బాసకుఁ, దెచ్చుటకుం జాల మేమి తెల్పుదు రంటిన్. 37

క. ఎన్నా ళ్లయినను మీ రిపు, దన్నపనుల్ సేయమాకు నాతంకములే
దన్నా!చెఱకును దగుచే,వ న్నేర్తుమటంచు నపుడు వ్రజబా బనియెన్. 38



# 14 అహింసాదేవి సాక్షాత్కారము

గీ. హాలిక భూస్వామివర్గమ్ము నంతరమునఁ, బొటమరించిన జగదాలపోలు పెఱుంగ
నిచ్చచేసితిఁ గానఁ గీ లెఱుఁగుపొంటెఁ, గమ్మతీంద్రను బెక్కండ్రఁ గాంచవలసె. 1

క. కాఁపులఁ గంటకు మున్నుగ, భూపతులం జూచి వారిపాలకువఁ దెలియం
జూపునిడి సమయ మడిగితి, నాపిమ్మట వారిమంత్రి యండకుఁ జనితిన్. 2

క. మీ రీనాఁడికవారలు, కారుగదా మాకుఁ బట్టుకయ్యంబునఁ బా
ల్గోరకుఁడు చెప్పఁదలచిన, తీరిది లిఖియించి పంపఁ దివురుం దనుచున్. 3

ఆ. అతఁడు మిన్నుసూడ నన్నా! విదేశి నే, నగుదునని తలంప హాలికసమితి
వలచునేని వారివందలు పరికించు, హక్కుగలదు నాకు నంటి నెద్రిచి. 4

వ. అంత రాచతికమువారు నిల్పిన మధ్యస్థసంఘము నేలుయజమానుం దఱిసి నావాదంబు
మొదలిడ నయ్యధికారి(కమీషనరు) నన్ను జంకెనచేసి నీవు వెన్వెంటన తిరహుత్ పరగణా
విడువందగునని హితమ్ము సెప్పె – నవ్వల ననుయాయులం గని కదచినకథయెల్లం
దెల్లమొనర్చి యేలుబడివారు నే నీకర్జంబు సాగింప నీకొనరు – నాతలంచిన
గడియకుముంద నన్నుం జెఱగొందురని తలంతు – నట్టిపని మోతీహారినొండె బేతియా
నొండె రూపుదాల్చినఁ గడుంగడు లగ్గు వొదముఁ – గాన వేవేగ నాసీమలకుం బోక
నాకర్తవ్యమని వక్కాణించితిఁ – జంపారణ్యము తిరహుత్ ప్రాంతమునం దొక
మండలము – మోతీహారి దానికిం బెనువీడు – బేతియాచేరువ రాజకుమారశుక్లుండు
కాఁపురించుపల్లియ కలదు – దానికెలంకులం దిరపడియున్న కోరీతెగపంటకాఁపు
లాసీమం బేర్వడసిన గుల్లకాండ్రు – వారిబ్రదుకుం గనవలయునని రాజకుమారుండు
న న్నర్థించె – నప్పని నాకుం బ్రియమాయెఁ – గాన 5

క. పైనమ్మును సాగించితి, నానాఁడే చనితి మోతిహారికి శీల
శ్రీనిధి గోరక్షకబా, బానందము విరియ స్వాగతాదులు నెఱపెన్. 6

క. చెలికాండ్రతోడ నాతని, నెలవున విడిసితిఁ; దదీయనిలయం బపు డు
జ్జ్వలధర్మశాల యయ్యెను, గొలంది యసదైన నిఱికికొంటిమి దానన్. 7

క. అవ్వీటికి నిరుపరువుల, దవ్వున నొకరైతు తగవుదప్పినశిక్షన్
నొవ్వింబడెనని వింటిమి, నెవ్వగపాలైతి మెట్టినీతి యటంచున్. 8

క. వఱువాత లేచి ధరణీ, ధరబాబుం గూడి కృషికుదర్శించుటకున్
దొరఁకొంటి బయలుదేఱితి, మిరువురమున్ గుంజరంబునెక్కితి మర్థిన్. 9

గీ. బండిపై ఘూర్జరంబునఁ బయన మెట్లు, నడుచు నిచ్చట నేన్గుపై నడుచు నట్లు
సాముద వ్రేగుటకమున్న మామతంగ, మొకఁడు పోలీసుబంటు మాయొద్దఁదోఁచె. 10

క. మీకేటికోళ్ళు సెప్పఁగ, నా కానతియిచ్చి పంపె నాయకుఁడనుచున్
వాకొనె నతండు తన కా,వాకునఁగల యర్థమెల్ల వైళమ తెలిసెన్. 11

క. సరిసరి నీ వటకుం జని, పరిస్థితుల నరసిరమ్ము బాబూ! యంటిన్
దొరపంపిన శకటముపైఁ, దిరపడితిన్ వచ్చినట్టి తెరువునఁ జనితిన్. 12

ఆ. చాంపరాను వదలిచను మన్న యాజ్ఞనా, కిచ్చెబంటు పురికి వచ్చువేళ
నిల్లుసేరినంత నీపన్నుపైని మీ, వ్రాలువలయునంచు వాఁడు వలికె. 13

గీ. ఇచటి కష్టసుఖంబులనెల్ల వినక, యేను విడనాడిపోవఁ జాంప్రానుసీమ
యిది సమంజసకృత్యమం చేఁ దలంతు, ననిలిఖించి వ్రాల్ చేసితి నాజ్ఞమీఁద 14

క. శాసనధిక్కృతి చేసితి, దోసంబిది యెల్లి తడవుదుము రమ్మనుచున్
నాసన్నిధి కవ్వలఁ బో, లీసువిభుం డానపంప లెస్సయ యంటిన్. 15

ఆ. కడఁగి కంట వత్తినిడికొని యా రేయి, వలయుకమ్మ లెన్ని వ్రాసివ్రాసి
ప్రజకిశోరుఁ బిల్చి వక్కణించితిఁ దగు, తగము లిట్టివంచుఁ ద్రచ్చిత్రచ్చి. 16

క. నా కానతి పుట్టినకథ, ప్రాఁ కెను గ్రొమ్మించువోలెఁ బట్టణమందున్
మూఁకలుమూఁకలుగా నర, లోకంబది నావసించు లోఁగలి కెక్కెన్. 17

క. రేయెల్ల నొల్లఁబోవక, చేయందగుచేఁత లరసి చేసితిఁ గానన్
రాయిడికి దీని కోర్చితి, నాయనుచరు లొక్కత్రాట నడిపిరి ప్రజలన్. 18

క. ఎచ్చటనేఁ గాల్మోపిన, నచ్చట నుప్పొంగు మానవాంబుధి; యైనన్
నెచ్చెలియలికట్టలుగా, నెచ్చెలు లేర్పడిరి పడవనేర్చిరి మెప్పుల్. 19

వ. అయ్యది యట్లుండె – నాపైఁ బ్రయుక్తంబైన యాజ్ఞాపత్రంబును జట్టముంబట్టి ధిక్కరింప వీలున్నను బరిగ్రహించితిఁ – గాన నేను వ్యక్తిం బరిభవింపక తదాదేశంబునుమాత్రమ సముచితంబుగాఁ ద్రోసివైచితినని తలంచి యధికృతులు నన్ను మెచ్చి నాపాల మిత్రకల్పులుగా వర్తింపఁజాగిరి–నావలనిభీతియుం బాటిల్లదని తలంచి వీరు నన్ను రాపాడక నాసౌకర్యముల నెల్లఁ జేకూర్చిరి – వెండియుఁ గోర్టునం దెసరేఁగిన మానవానీకంబు నొకహద్దునం బెట్ట నాయు నాయనుచరులయుం దోడుపాటు నిచ్చమై నందుకొనిరి – కాని 20

క. తమదొరతనమ్ము వోయెడి, సమయంబది వచ్చెనంచుఁ జక్కం గని రా
క్షమఁ గలవారలు దండభ, యము మానిరి పూని రస్మదాదేశములన్. 21

క. ము న్నలచంపాటవిలో, నన్నెవ్వ రెఱుంగ రచటి నాఁగటిజోదుల్
మిన్నందిన కింపాకులు, మన్నుదినిన పెద్దజెఱ్ఱిమాదిరిజంతుల్. 22

క. మిన్నేటికి నుత్తరమునఁ బన్నగభూషణున కింటిపట్టొసఁగిన యా
పెన్నద్రిపాదమునయం, దున్నది చాంప్రాను నూతనోర్వీతలమై 23

ఆ. అచటఁ గాంగ్రెసునకు నావంతచోటు లే, దందుఁ జేరవెఱచు నాప్రజాలి
కదలివచ్చి నేఁడు కాంగ్రెసుబలఁగ మి,య్యవని కందయయ్యె నభయమిదియె. 24

క. ఈకడఁ గాంగ్రెసుపే రిడి, యేకర్జము సలుపఁగూడ దిపుడంచు సుహృ
ల్లోకమ్మునెదుటఁ దేల్చితి, లేకుండిననేమి పేరు లెస్సయొదవినన్. 25

ఆ. అచటఁ బక్షవాదు లదరి వాచాటులై, రచ్చలందు వాక్యరణముసేఁత
క్రిందుమీఁదు మీఁదుక్రిం దొనరించి న్యా, యంబునిల్పు కాంగ్రెసనఁగఁ జెల్లు. 26

వ. మరియుఁ జంపారణ్యమునం గల నీలితోఁటలదొరలును రాచఠీకమువారును గాంగ్రెసు నాఁ గుట్రయనియు రాజద్రోహమనియు బాంబనియుం దలఁతురు – వీరి కదియట్టిది కాదని నిక్కంబు నెఱిఁగింపవలయుఁ – గాన దానిపే రెత్త రాదని దాని స్థూలాకృతిం గూర్చి యే నచటి ప్రజలకడ ముచ్చటింపరాదని తేల్చితిమి – కాంగ్రెసన్న మూఁడక్కరము లెఱుంగకున్న నేమి – దానియాత్మం గని తొడరినంజాలు – వలసిన కార్యం బట్టిద – కానఁ బూర్వరంగముం గూర్ప జాతీయమహాసభాపక్షమునఁ బ్రత్యక్షముగా నొండెఁ బరోక్షముగా నచటి కెవ్వరుంబ్రయుక్తులు కారైరి – రాజకుమారున కట్టిసేనం దట్టుకొనఁ దగ బలిమియుం గల్ల – రాజకీయోద్యమప్రచార మానేలకుం గ్రొత్తనాఁజనుఁ – దత్రత్యు లితరప్రపంచముం గన్నవారు కారు – కాకున్నను 27

క. తమ ప్రాఁజెలికానింబలె, రమణీయతరాదరానురాగమ్ముల న
న్నమలినచిత్తులు సూచిరి, కమతమ్మున మునిఁగి తేలు కమ్మనవెలయున్. 28

క. ఆనాఁ డీమందిని భగ, వానుం గనుగొంటి సత్యవసువును గంటిన్
గానంగంటి నహింసను, దీనిన్ మెఱమెచ్చుపల్కు దేరక యంటిన్. 29

క. ప్రత్యక్షరమును దీనన్, సత్యమ యననోర్తు నిట్టిసాక్షాత్కృతి కే
నత్యర్థంబుగఁ బ్రజపై, నిత్యమ్ము వెలార్చు నెమ్మినెఱి హేతువగున్. 30

క. ఈకూర్మి కీదృశంబన, నాకు నహింసావ్రతమ్మునన్ దినదినమున్
రేకెత్తెడి విశ్వాసమ, కాక మఱెద్దియును గాదుకా దని వినుతున్. 31

క. అనీలిమందుజగమున, నానేరము రచ్చ కెక్కినదినంబు నహో!
యే నెట్లుమఱతుఁ జాంప్రాన్, మానవులకు నాకు నాఁడు మకరార్క మగున్. 32

ఆ. స్మృతిని బట్టిచూడ నేన విమర్శింపఁ, దగినవాఁడఁ గాని తత్త్వ మరయ
దొరతనమ్మువారె తుదకు విమృశ్యులై, నారు పెద్దపెద్ద నలఁగినారు. 33

# 15 అభియోగము నెత్తివేసికొనుట

క. మొదలిడి రధికారులు న, న్నెదిరి విచారింప; నేర మిదియని తెల్పన్
మదిచాలక మినుసూచిరి, బెదరిరి నో రెత్తలేని బెడఁదం బడుచున్. 1

క. ఏలుబడివారి సభికుఁడు, చాలింపుఁడుచర్చ గడువు చాటుం దనుచున్
గోల యొనరింపసాగె న, దేలా యని మోహరించి యే నిట్లంటిన్. 2

ఆ. అయ్యలార! విరతి నంగీకరించుట, కేను జాలఁ జాంపరాను వీడి
చను మటంచు మీర లనిచినయానతిం, గుఱుచచేసి యొప్పుకొంటిఁ దప్పు. 3

వ. శిక్షాస్మృతియందలి నూటనలువదినాల్గవసూత్రమ్ము నూఁది నాపై మీపఱిపిన యాజ్ఞా పత్రమ్ముపట్ల నాకావించిన గంభీరధిక్కారంబునకుఁ గారణ మిదియని మీయానతిం గొని నిర్ధరింపవలతు - నిది నాతలఁపుంబట్టి యవిధేయత కానేరదు - మఱి యిచటి యేలుబడికిని నాకుం బొటమరించిన యభిప్రాయభేదమ్మని విన్నవింతు-నిచట నీలిపంట నేలం బాలించుదొరలు సేద్యగాండ్రదెసం బాడిదప్పిరని విని నిఱుపేదలగు కాఁపుల వేఁడుకోలుం బడసి వారి కోపినంతవట్టు సాయం బొనర్ప నీగడ్డపై నడుగిడితిఁ - గాన 4

క. ఔగాములెల్లఁ దెలియక, యేగతి సాయంబొనర్తు నీరైతులకున్
లోగు ట్టెఱుంగ మీయను,రాగము భూస్వాములాదరంబును వలతున్ 5

క. నారాక కింతకంటెను, వేఱొండుతలంపు లేద వినుఁ డిద్దానన్
మీరాజ్యమున నశాంతియు, నాఱనిబాధలు జనించునని భావింపన్. 6

క. ఈతరగతిపనులం దను,భూతి కడుం గంటిఁగాని భూపాలు రెదో
రీతి న్ననుఁజూచిరి నా,నీతిని శంకించి రాజ్ఞనెఱపిరి నాపై. 7

క. దొరతనమువారి సంకట, మెఱుఁగుదు వేగరులు సెప్పువృత్తాంతము వా
రఱలేక నమ్మవలయును, దొరలదు శకటంబు వేఱుత్రోవం జనినన్. 8

క. నాపైఁ బఱపినయానకు, లోపదవలె నేను; ధర్మలుబ్ధత్వంబున్
నాపాలఁ గలద యైనను,మీప న్పినాఁదతిక్రమింపఁగవలసెన్. 9

క. దానిం దలఁదాల్చితినా,యే నేపని కాసచేసి యెవ్వరికొఱ కీ
పైన మొనర్చితి వారికి, దీనుల కెగ్గాచరించు తెఱఁగునఁ బడుదున్. 10

ఆ. ఏను వారిచెంత కేగనినాఁ డెట్లు, సేయనేర్తు నార్తసేవనంబు
కృత్య మిట్టిదగుట నేనయి చాంపరా, నుజ్జగించి పోక యుచిత మగునె? 11

గీ. అకట! యీ ధర్మసంశయమందుఁ జిక్కి, నేఁడు నన్నిటనుండి త్రోపాడు కడిఁది
వ్రేఁగు మీతలమోపితి వెరవు నొందుఁ, గానలేనైతి సత్యమ్ముగనుఁదు వినుఁడు. 12

క. ఈదేశమునం బ్రజలకు, నేదే నూడిగము సేయనెంచెడి ననుబోం
ట్లీదృజ్మహోద్యమంబున, నాదమఱచి యుంట నింద్యమని కంటిఁ జుఁడీ. 13

క. చిత్తసమున్నతి గలవాఁ,డిత్తఱి నాపోవుబాటకే రావలయున్
మెత్తఁబడ కాజ్ఞనెదిరిచి, యుత్తలపడ కనుభవించు టొప్పును శిక్షన్. 14

క. నాకు విధించెడిదండన, మేకొంచెమొ యగుట వలచి యే నీపలుకుల్
వాకొంటినని తలంపక, మీకుం దోఁచినవిధంబ మేకొనవచ్చున్. 15

క. న్యాయంబుకొఱకు వెలసిన, మీయెద నాదరములేక మీయాజ్ఞనిటుల్
త్రోయుటకు సిద్ధపడలే,దాయాజ్ఞను మించునాజ్ఞ కంజలి నిడితిన్. 16

ఆ. అది మదంతరాత్మయాజ్ఞ సుఁడీ! యేది, యెట్టులైన శిక్ష యెట్టిదైన
దాని నెల్లప్రొద్దు తలఁదాల్చి పోక నా,మతమటం చొనర్తు మనవి మీకు. 17

వ. ఏ నిట్టివాఙ్మూల మొసంగినవెన్క నభియోగంబు నిలువరింపందగిన యక్కఱ కానరాదు - కాని దండనాధికారియు రాచతికమువారిన్యాయవాదియు నీకథ యిట్లడ్డముతిరుగు నని భావింపమింజేసి శిక్షానిర్ణయంబు గావింపనోడి గడువువెట్టిరి - యే నీనడుమ నియ్యుదంతమునెల్ల ఢిల్లీశ్వరునకును మదనమోహనునకుం బాటలీపుత్రస్థ మిత్ర మండలికిం దంతిమూలమ్మునఁ దెలిపితి - దండముం బడయఁ బాడిపట్టునకే నేగక ముంద 'యీయభిగ్రహంబును డిగ్గఁద్రావునది' యని రాష్ట్రపాలకుండు తన కానపంపె ననియు మీరు మీకృత్యంబు నిఁక నిరాఘాటంబుగా సాగించుకొనవచ్చు ననియు, నుద్యోగులు మీరు వలచుసాయంబు నెరవేర్పఁగల రనియు మండలాధికారి నాకుం గమ్మననిచె - నిట్టి లెస్సమార్పింతలో నొదవునని యే నూహించి యెఱుఁగఁ-బదంపడి 18

క. ఉత్తమపురుషుని ధర్మా,యత్తుని 'హైకాకు' మండలాధిపుఁ గంటిన్
మెత్తనిపల్కుల వలసిన,పత్తరములనెల్ల మీరు పరికింపఁదగున్. 19

క. నన్నుం గననెంచిననాఁ, డన్నా!రావచ్చు నీకు నాటంకములే
దెన్నండు ననుచు గఱువల, కన్నాకై యతఁడు కురిసె గౌరవరుక్కుల్. 20

క. ఇది సత్యాగ్రహపథమున, మొదటిదగు పదార్థపాఠము గదా! యిచటన్
బదిఁబదిగా నేతత్కథ, కదలెం బత్రికలకెక్కి కడ లన్నిటికిన్. 21

గీ. పక్షపాతమ్ము విడనాడి ప్రభుతవారు, నడిపి రీనేర మని తోఁచు నాదుబుద్ధి
కగుటఁ బత్రికలెల నీయదు నింత, పెద్దసేయంగఁ బనిలేదు ముద్దుచూపి. 22

క. మితిమీఱిన భాష్యమ్ములు, చతురతలుం జాటిచాటి సంపాదకు లీ
కత నాకసమున కెత్తిన, శ్రుతిమించు నటన్న వెఱపుఁ జొప్పదె నాకున్. 23

క. కావునఁ బ్రసిద్ధపత్రిక, లావిష్కృతిసేయువారి కయ్యా! యిటకున్
వేవేల వెచ్చములతో, మీవార్తావహులు రాక మేలని తలఁపన్. 24

క. జగమునకుఁ దెల్పఁజాలిన, వగవార్తల యున్నఁ బంపువాఁడను నేనై
రగడం బెంచుటచేఁ బని, యగునా యని పేర్మివెలయ నంపితిఁ గమ్మల్. 25

క. ఏలుబడివారలకు నా, పాలం గల్గినయుదారభావము గనుటన్
నీలిపొలమ్ములసాములు, జాలింబడి రెంతచెట్ట సమకుతె నంచున్. 26

క. అధికృతులకుసైతం బిది, వ్యధగూర్చెను గాని వార లతిశాంత పయో
నిధులట్టుల చూపట్టిరి, కథయంతయు సన్నసన్నగా వినుచుంటిన్. 27

క. సత్యాసత్యంబుల సాం, గత్యంబున వెదలుపత్రికలు వీరిమనం
బత్యర్థప్రతిఘం బడి, నృత్యం బొనరించుగతికి నీడ్వఁగవచ్చున్. 28

ఆ. ఏనుగాక వారియీామంటవేఁడిమి, గుండెలేనిరైతు కుదువవచ్చు
నిచట సత్యశోధనేచ్ఛఁ గష్టించు న, న్నకట యద్దకట్టు లంటవచ్చు. 29

క. ఏ నింతజాగరూకత, మై నున్నను దోఁటదొరలు మావర్గంబున్
నానావిఘ్నప్రచారా, ధీనము గావించి రనృతధీకింకరులై. 30

క. కడుమెలఁకువతో నిది యె, క్కుడు పోటిపోటి యిద్ది యనక గుఱినిడి యే నె
ల్లెడలన్ నిక్కము వదలక, నడుచుట వమ్మయ్యె వారినట్టువ యెల్లన్. 31

ఆ. ప్రజకిశోరుపట్ల వా రెంతకేని తె, గించి తెగడి రెల్లమించి; వారి
పలుకు సాగుకొలఁది బాబుయశస్సు రే, కెత్తఁదొడఁగె దెసల నొత్తఁగడఁగె. 32

ఆ. రాపు లిట్టివగుట రండని పత్రికా, లేఖకులను బిల్వలేక యుంటి
దేశసేవ మునిఁగి తేలు నాయంకులఁ దోడునిల్వుఁడంచు వేఁడనైతి 33

క. రావలసినతతిఁ దెల్పిన, నేవచ్చెదఁ గొంతసాయ మిచ్చెద నని వి
ద్యావార్ధి మదనమోహనుఁ, డావేదించినను జేర్ప నమ్మహనీయున్. 34

వ. ఏనిట్లు పట్టుపట్టి ఈనీలిమందు జగడంబునకు రాజకీయమగువల పంటకుండు తెఱంగున మెలఁగితి – నక్కఱపడినసుద్దుల నేన వీనుమిగిలిన పత్రికల కంపితి – నియ్యెఱుక సంపాదకుల, ప్రజానాయకులకొఱక కాని జగమునకుం దెలుపఁగాదు –

కొసకు రాజకీయముగా ముగిసినను దన్నిరోధముతోడిపొత్తు లేనిపనికిఁ దదాకృతి నిచ్చిననాఁ డాచేఁత యాఱడిపోవు ననియు, దానిని యథాతథంబుగా నిల్పిన నాఁడు రాజకీయసమరమునకుసైత మదిబాసట కాఁగలదనియుఁ జిరకాలాను భూతిం గనుఁ గొంటి – నిష్కళంకమైన ప్రజాసేవ యేరూపమున జరిగినను దుదకది దేశమునకు రాజకీయముగా నుపకరించునని యీ చాంపరాను పోరాటంబు చాటెడిని. 35



# 16 కార్యగతి

ఆ. ఇచటఁ జాంపరానువృత్తాంత మంతయు, సంతరించుపనికిఁ జాల; నచటి
సేద్యగాంధ్ర దీనజీవనకథ నూఁచ, ముట్టు వఱ్ఱినపుడ ముగియు నదియు. 1

వ. చంపారణ్య పరిశీలనంబు నా నహింసాసత్య సంప్రయోగంబ – దీనికిం జెందినగాథ లెన్నేని గలవు – వాన నుత్తమంబులని యేర్పరించిన యంశంబు లిట వివరింతు – గ్రంథమెల్లం గనవలచువారు రాజేంద్రప్రసాదరచింతబై 'చంపారన్‌మేఁ మహాత్మాగాంధీ' యనుపేరం దనరుకృతిం బరియించు టొప్పు – నది యట్లుండె – నీచర్చయంతయు గోరక్షకబాబుమందిరంబున సాగునేని వారియిబ్బంది యిబ్బడి ముబ్బడి యగుట నిక్కంబు – కాన మా కొకబాడిగయిల్లు వలసె – మా వసించుట కద్దెగీము నొసంగుదిట వామోతీహారిప్రజల కింతవట్టు పుట్టదయ్యెఁ – గాని వెరవరియైన వ్రజకిశోరుఁ డెట్లో శ్రమించి యొకయిరవు నార్జించె – దాని ముంగలను కదుంగదుఁ బఱపై నిలువం దగియుండె – నే మానెలవునం బీఁట వెట్టితిమి – కాని 2

గీ. చేతిలో రూకలేక యేచేఁతయేని, సాగదుగదా ప్రజాహిత శ్రీ గడింప
నాయొనర్చినపనుల కేనాఁడు నొక్క, చిన్న మర్థించి యెఱుఁగఁబో సన్నగాంధ్ర. 3

ఆ. వ్రజకిశోరబాబువర్గంబు నా న్యాయ, వాదివర్గ; మదను వచ్చినపుడు
వారు, వారితరమువా రగుమిత్రులు, వేసికొంద్రు విరళ మోసరిలక. 4

గీ. పచ్చపచ్చగఁ గాలంబుపుచ్చు మేము, దేవురింతుమె సామాన్య జీవిప్రోల
నని తలంతురు వార లీయాశయంబు, సముచితం బనఁదగు వాదసరణిఁ బట్టి. 5

క. ఈపనికిం జంపాటవిఁ, గాఁపురమొనరించు సేద్యగాంధ్రధనంబున్
జేపట్టరాదు రువ్వయు, నాపద్ధతికిన్ దురర్థ మంటును గానన్. 6

గీ. వెండియును భారతావనీమండలంబు, లెల్ల నీభిక్ష నిడుట కే నొల్లనైతి
నాపనికి రాజకీయస్వరూప మప్పు, డొదవు దేశీయతయు సోఁకు నోటలేక. 7

క. అల బొంబాయిపురమ్మున, వెలయు చెలుల్ పదియునైదు వేలధనం బీఁ
దలఁచినముచ్చట చెవిఁ బడ, వలదు వలా దంటి నేను వందనములతోన్ 8.

గీ. చాంపరాన్మండలంబు నుజ్జనయొనర్చి, తక్కినబిహారునం గల ధనవదోఘ
మొండయుపసర్పణీయమీవందకనియు, నడుగునాతఁడువ్రజకిశోరనియుఁగంటి. 9

క. అక్కఱయగుచో వలసిన, రొక్కము నంపఁగ భిషగ్వరుండగు మెహతా
మక్కువచూపెం గావున, నిక్కట్టున దానిఁ బడయ నెంచితి నెడఁదన్. 10

గీ. సొమ్ముదిగు లిట్లు తీఱ నచ్చోట గునియు, లేమికిం దగుచందాన మేము దాని
వెచ్చపెట్టఁ దలంచితి మిచ్చ యిట్టి, దగుట నార్జింపకుంటి మత్యర్థవసువు. 11

గీ. లెస్సవిత్తముతోఁ బనిలే దటంచుఁ, దుట్టతుద కర్థమాయె నీఘట్టమునకు
వాడినధనంబు సకలంబు మూఁడువేల, మించదయ్యెను గడనలో మిగిలెఁగొంత. 12

క. నెచ్చెలులతెఱఁగు మునుము, న్నచ్చెరు వొదవించె నాకు నందఱవెంటన్
వచ్చెను దల కొకపాచకుఁ, డెచ్చయ్యెను వంటసాల లేదెసఁ గన్నన్. 13

క. నడిరేయిఁ దిందు రెవ్వరి, యొదమిని వా రారగించుచున్నను నేమం
బుడిగినబ్రదిమికి లోపడి,నడిచెడు వారలపథమ్ము నా కార్తినిడెన్. 14

క. ఆసహచరులకు నాకున్, వీసంబును వేర్మిలేని నెయ్యము కల్మిం
జేసి దురర్థము లరయక, నా సన్నిపలుకుములికినాటుల నెమ్మిన్. 15

క. రుచిసూచి రనుచరులు మీ,రిచటన్ సేవకుల విడిచి యొక్కటిపాకం
బుచితసమయంబులందుఁ గు,డుచు టొప్పు నటంటిఁ దుద కెటో నాహితమున్. 16

ఆ. ఇయ్యకొనిరి నెయ్యు రిందుఁ గొందఱకు మాం,సమ్ముపలయు బానసమ్ము లిట్లు
రెండుత్రోవలైన రెక్కొను వెచ్చమ్ము, మానుఁ డెఱచి నంటి మంచి దనిరి. 17

క. శాకాన్నముసైతము విత,గా కుండువిధాన వండఁగడఁగిరి దీనన్
రూకలవెచ్చము తగ్గెను, మాకుం బల్మియును దఱియు మలచం బయ్యెన్. 18

క. వచ్చిరి వాజ్మూలంబుల, నిచ్చుటకుం గాఁపు లుర్వి యీనినకరణిన్
హెచ్చినయుత్కంఠను గనఁ, జొచ్చిరి నను; వారి నిల్ప స్రుక్కిరి మిత్రుల్. 19

ఆ. వారిసెప్పునుడులు వ్రాసికొనంగ నే, ద్గురు కడంగి రెంతయిడుమ వడిన
ముగియదాయె వ్రాఁత మునిమాపులను రిత్త, చనఁగవలసె రైతుజనము కొంత. 20

క. నిక్కమున కిన్నిసాక్ష్యము, లక్కఱలే దెల్ల రాడునదియును దరిదా
పొక్కతెఱఁగ యైనఁ దనివి, చిక్కదు కాఁపులకుఁ బలుకుసెప్పక చన్నన్. 21

ఆ. సాక్ష్య మిచ్చినంత సంతస మెంతేని, నెగడుచుండు వీరిమొగములందుఁ
గమ్మతీంద్ర యిట్టికమ్మనియుబలాట, మరసి హర్షమూర్తి నగుదు నేను. 22

ఆ. కాల మెంత పట్టుఁగాక వాఙ్మూలంబు, త్రచ్చిత్రచ్చి వ్రాయఁదగిన దంటి
నిట్టి నిల్పుకతన నీవ్రాఁత లెదురెక్కి, వచ్చె నేటఁ బాఱవైచినపుడు. 23

క. ఈసాక్ష్యమ్ముల నింటను,వ్రాసికొనెదు వేళ వేగువారలరాకన్
ద్రోసినను నేరమిది యను, శాసనములు లేవు కాని సద్భావమునన్. 24

క. చారుల రానిచ్చితి న,వ్వారలఁ బ్రేమించినాఁడ వాఙ్మూలంబుల్
కూరుచుతతి వీరలు మా, చేరువ నివసించి కనిరి చేసినదెల్లన్. 25

క. మాసౌజన్యము వడచుచు, మాసన్నిధి వీర లుంట మంది భయంబుం
బాసె నసత్యకథా దు, ర్వాసన కెడయైనపల్కు వల్కెను దీక్షన్. 26

ఆ. సాక్ష్య మింత పెరుఁగఁజాగిన భూస్వామి, సమితి కార్తిగూర్ప సమ్మతింప
శాంతచిత్త మూఁది సౌజన్యసంపత్తి, నోర్వ నెంచితిని దదుద్గమంబు. 27

ఆ. నేర మెవనిపట్లఁ బేరె నమ్మానిసి, నియ్యకోలు వడసియేగి చూచి
మంచిచెడ్డలెల్ల మాటలాడుట మేలి, చేఁత యనుచు విశ్వసించినాఁడ. 28

వ. కావుటంజేసి నీలితోఁటలదొరలం గడిసి యేను పరిపాలించుపంటకాఁపులు కుడుచు
కడగండ్ల నెల్లం దెల్లమి కావించుదు 29

క. కొందఱు తచ్చన లాడిరి, కొంద ఱుపేక్షించి రవలఁ గొందఱు సత్య
స్యందివచస్సుల నెడఁదవె, లంది వెలారించి నా కెల ర్పిడి రందున్. 30



# 17 సహచరులు

క. రాజేంద్రుఁడు వ్రజబాబు జ, గా జోడుగ నుందు రెందుఁగన మిట్టికవన్
సౌజన్య ప్రేమంబుల, నీజత న న్నాఁకపెట్టె నెంతయుఁ దనిపెన్. 1

వ. వీరివిద్యార్థులుగా నొండె ననుయాయులుగా ననుగ్రహ శంభు ధరణీ రామనవమీ
బాబులుం గొందఱు న్యాయవాదులును సర్వదా వీరిం బలసి యుండువారు –
నడుమనడుమ వింధ్యా జనకధారీబాబులు వచ్చువారు – వీ రెల్లరు బిహారు దేశీయులు
– కర్షకు లిచ్చు వాఙ్మూలముల వ్రాయసము వీరికృత్యంబు – మఱియు 2

క. ఆచార్యుఁడు కృపలానికిఁ, దోఁచునె మావెంట నిలిచి తోడ్పడకున్నన్
వేచూపుల నిడి యాతఁడు, కాచెన్ నానిల్చునింటిగవ నర్థిమెయిన్. 3

క. నన్నుఁ గన వచ్చుగుంపుల, పె న్నొత్తడి నాఁప నితఁడు పెద్దయుఁ బెనఁగెన్
గన్నులఱుముచు నవ్వించుచుఁ, బిన్నలఁ బెద్దలను నిల్పి పిఱిఁదికి నంపెన్. 4

క. పగ లిట్లుడస్సి రేతఱి,జగయొజ్జతనంబు నూను సహచరులకు బల్
నగవు నొదవించుఁ బందకు, మగఁటిమి సేకూర్చు నితని మఱవఁగఁజాలన్. 5

గీ. 'హక్కు' బాసట కీకొని యప్పుడపుడు, వచ్చి నన్ దిలకించి పోవం దొడంగె
నతని యొకనాఁటి జీవనద్యుతినిగన్న, నాకితం దబ్బురము గొల్పినాఁడు నేఁడు. 6

క. ఆడంబరమ్ము లే దీ, నాఁ డితనికి; నాఁటి నేఁటినడతల నరయన్
రాడగ్రణికిని లెంకకు, వేడబములఁ గానిపించువేఱిమి తోఁచున్. 7

క. కాలక్రమమున నా కా, నేలన్ నడయాడ నాడ నిజ మెఱుకవడెన్
మేలైనసేవ గోరిన, వాలాయం బచటఁ జదువువలె ననుకొంటిన్. 8

క. ఆ చాంపరానుకాఁపుల, నేఁచెడు నవివేకభూత మిట్టి దటంచున్
సూచింపఁజాల నకటా! పూచినచీఁకట్లు వారిప్రోపున చిఱుతల్. 9

క. మిన్నక చరించుబుడుతల, నెన్నండును మందలింప రీరైతులు కా
కున్న నొకరువ్వకూలికి, నన్నా! తోలెదరు నీలియడవులదెసకున్. 10

క. మగవానికిఁ బదికానులు, మగువకు నార్కాను లొసఁగి మణివమ్మనవా
రగ దనక నాల్గుజాములు, నొగుల్తు రీకూలివాండ్ర నోఁచినసాహుల్. 11

క. బుడుతలకు మూఁడుకానుల, నిడియెద రేకాఁపువాని కేనెప్పటికో
గడన యొకపావులా చే, పడ నతఁ డుప్పొంగు విరిసె భాగ్యం బనుచున్. 12

క. అనుచరులతోడఁ దృచ్ఛితి, మునుముందుగ నాఱుకుప్పముల కుఱ్ఱలకున్
గనువిప్పవలయు నని యిది, యనివార్యం బనియుఁ దేల్చి యచ్చటిప్రజకున్. 13

క. ఎల్లయుఁ దెల్పితి వారల, యుల్లాసముగంటి వచ్చునొజ్జల కన్నం
బి ల్లొసఁగవలయు మీ; రిఁకఁ జిల్లర నే మోర్చి సేవచేసెద మనితిన్. 14

క. ఆ పేదసేద్యగాండ్రకుఁ, బాపము! రూపాయ కానఁబడ దేప్రొద్దున్
లోపమిది సెప్పి వా ర, ధ్యాపకునకు గింజ లిత్తుమని రగు నంటిన్. 15

గీ. గురుల నెచ్చట నార్జించుకొందమనెడు, చింత యవ్వలఁ బొడమె నాసీమయందు
భృతిని ముట్టకయొండె గ్రహించియొండె, దొడ్డయొజ్జలు చిక్కుట దుష్కరంబు. 16

గీ. చిఱుతలన్ నామమాత్రదేశికునిచేతి, కప్పగించుట యన్న నే నొప్పనైతిఁ
బుస్తకజ్ఞానమునకంటె శస్తమైన, శీల మబ్బుట కే నాసచేయుకతన. 17

వ. పదంపడి స్వయంసేవకులు వలయుదు రని వార్తాపత్రికల విజ్ఞప్తి చాటితి – దాని నాదరించి దేశపాండ్యాగంగాధరరావు బాబాసాహెబ్, సోమణు, పుండలీకుల నంపె – బొంబాయి వలన నవంతికాబాయియుఁ బూనానుండి యానందీబాయియు విచ్చేసె – నేను సత్యాగ్రహాశ్రమనివాసులగు ఛోటేలాల్, సురేంద్రనాథులను, నాబిడ్డ దేవదాసును రావించితి – నీలోపల మహాదేవదేశాయి తనయిల్లాలు దుర్గాదేవితో వచ్చె – నరహరిప రేఖు తనరాణి మణిబహనుతోఁజనుదెంచె – నపు డేను గస్తూరినిగూడ రప్పించితి – ని ట్లుపాధ్యాయులు నుపాధ్యాయానులు నుపాధ్యాయలుం గనువిందుగా వెలసిరి – యవంతికయు నానందియుం జదివినవారు – కాని దుర్గకు న్మణికిని గుజ్జరాతియెఱుక మిగులనలంతి నాఁజనుఁ– గస్తూరిబాయి కది యాపాటియేని లేదయ్యె – నిట్టినారీజన మ్మచటి హిందీడింభకుల కేమి నేర్పఁ గలదు? – కాని పసివాండ్రకు నుడితీర్పులకంటె మడినేర్పు లెఱుకచేఁత లెస్స – కాన నిమ్మగువలు పాపలకు శౌచవిధులు మప్పం బనిచితి – నప్పనికి వీరెంతయుందగి నామెప్పు వడసిరి – వెండియు హిందీ, మరాఠీ, గుజరాతీ బాసల యక్కరము లించుమిం చొక్కరూప యగుట నియ్యమ్మ లాకుఱ్ఱల కోనమాలుసైతము కఱపిరి – యంకెలును నేర్పిరి – యీదృశంబగు సేవంజేసి యీ వెలందుల కాత్మ విశ్వాసము హెచ్చె – మఱియు. 18

క. ఈసతులకు నిప్పనిదెస నాసయు నేర్పదె నవంతి యారయుబడి పెన్
వాసి గడియించె నప్పన, చేసెం దనయుసుఱు లీపె సేవావిధికిన్. 19

క. ఈ కాంతలసాయమ్మున, మాకుం బల్లియలఁ జొచ్చు మార్గము దొరకెన్
లోకము నెఱుఁగని పేదల, చీఁకుం జింతయుఁ గనంగఁ జేపడె వసతుల్. 20

గీ. పాఠశాలలు నిర్మించుపని యొకండ,చాలునని నిల్వనైతి నచ్చొంపరాను
ప్రజలలో నీడుముదిరినప్పలకుఁ, వెలఁదితన ముపదేశింప వేడ్కపడితి. 21

క. పల్లియలలోని మైలకు, నెల్ల య లే దచట; వీధి కేగిన ఁ జెత్తల్
పుల్లెలు బావుల కెలఁకులఁ, గ్రేళ్ళుబ్బెడిరొంపి గౌలు కృములుం దోఁచున్. 22

క. గుమ్మములందును గా లిడ, గ మ్మది యెదిరించు నెవనికాయము గన్నన్
బమ్మినతామర గజ్జియుఁ, గొమ్మలు రెమ్మలు వెలార్చుకొని కన్పట్టున్. 23

క. అలవి యగునంతవఱ కీ, మలినత్వము నూడ్చి మూర్ఖమండలి దిద్దం
దలఁచితి వారలమనుగడఁ, గల సందులు గొందు లరయఁగా మన సిడితిన్. 24

క. ఈసవరణలో వెజ్జున్, బాసట కావలయుఁ గానఁ బడసితి భిషగ
గ్రేసరు 'దేవున్' భారత, భూసేవకసంఘసభ్యుఁ బుణ్యచరిత్రున్. 25

క. మున్నే లభించె నా కా, యన్నచెలిమి యిట్టు లొదవె నది నేఁ దతఁ ద
స్కన్నప్రీతి ననామయ, కృన్నియతుల నల్ల నేర్పెఁ గృషికావలికిన్. 26

ఆ. ఆఱునెలలు నిల్చె నతఁడు చంపారణ్య, నరసమాజసేవనంబు నెఱపఁ
జదువు సెప్పుచున్న చానలు మగవాండ్రు, వడచి రతని చెంత వైద్యవిధులు. 27

వ. వీరి కితర కార్యక్రమంబుతోడిపొత్తు బొత్తిగా లే దనందగు - భూస్వాములతో నొండె నేలుబడివారితో నొండె వలయువ్యవహారంబుల నెల్ల నేన సంబాళించుకొనువాఁడ - నస్మ దనుచరులందఱుం దమనేమమ్ముల జవదాఁటక సమగ్రనిగ్రహముం బ్రకటించి నన్నలరించిరి. 28



# 18 గ్రామప్రవేశము

గీ. ఒజ్జనొకని నుపాధ్యాయ నొకత నెల్ల, పల్లెకూటమున న్నిల్పఁబనిచినాఁడ
రుగ్ణులకు మందు లిత్తు రారోగ్యవిధులు, వెల్లడింతురు వీర లాపల్లెప్రజకు. 1

క కొందఱు గరితలసాయము, నంది పరీక్షింతు రచటియతివల బ్రతుకున్
మందిర భోజన భాజన, సౌందర్యము నేర్పి వారి సవరింతు రొగిన్ 2

వ ప్రతి పాఠశాలయం దేరండతైలము గంధకలేపము క్వినిన్ మాత్ర లుంచితిమి - నాల్కపై ముఱికియున్న నాముదము, వేఁకి సోఁకినఁ గ్వినిన్, కసిమిరి కన్పడిన గంధకలేపము ప్రయోగించితిమి-గడ్డ తెగుళ్ళవారి దేవుచెంత నిల్పితిమి - మాచౌకవైద్యము పెక్కండ్రకు లగ్గుగూర్చె - దీని నెవ్వరుం గేలిసేయరైరి. 3

ఆ. కడిఁదికర్జమయ్యె గ్రామమ్ము దిద్దుట, నిచ్చలుం బొలాల నిలిచి దయ్యు
నతఁడుసైత మొప్పఁ దయ్యెను దనచేతఁ, దనపురీష మెత్తి దాగురింప. 4

గీ. బనను భిషక్కు దేవు కాసంత బెదర, కనుచరులతోడ నొకపల్లె కరిగి దాని
నెల్లరీతుల సవరింప నిచ్చచేసి, వీధులను జిమ్మెఁ బెండను బెంటనెత్తె 5

క. లుకలుకలాడెడి గుంటల, నొకదారికిఁ దెచ్చి నూతి నొప్పుఁగ దీర్చెన్
బ్రకృతగ్రామము గని ల, జ్జకు లోనై ప్రజ లొనర్పసాగిరి సేవల్. 6

క. నా చను మోటరుదారియు, శౌచమ్మున వెలయునట్లు సవరించుట కా
యూ చోట్లవారు పూనిరి, పూచె వివేకంబు గ్రామభూములలోనన్. 7

క. ఈ కమ్మనతోపా టక, టా! కటుతయు దక్కె మాకు; నటనట మమ్మున్
లోకు లుపేక్షించిరి మా, పోకన్ బయిలోట లేక పోనాడి రెదన్. 8

వ. ఏను మహిళాపరిషత్తులం బెక్కింట వక్కాణించినగాథ యొం డిచట వెలలింతు - 'భీతిహరవా' యనుపేరం బరఁగు పల్లెచేరువ నొకచిన్నగూడె ముండె - నందుఁ గాఁపురించు నబలల కొందఱు యలవరించువలువలం జూడ ముఱికి వఱ్ఱొద్దుచుండె - నది యేను సైరింప నోడి యీ యాఁడువాండ్రు చీరగుంజుకొనమికిం గత మెద్దియో పరికించి రమ్మని కస్తురిం బనుప నాపె యీగడయెల్ల న్గని వచ్చె - నామె నప్పాలెంపు నెలంత యోర్త తనగుడిసెలోనికిం జేర్చి 9

క. కనవమ్మ! తల్లి! మాకుటి, కనవమ్మా! యిచట గోదగదులని బీర్వా
లని పెట్టియలని సెప్పం, జనువస్తు వొకండు లేనిచందము నెల్లన్. 10

ఆ. ఉన్న దొక్కచీర యుదికినచో నిది, చక్కఁబడు నటన్న చదువు తెలియు
నేమికట్టి దీని నేటిలో ముంచెదఁ, జెప్పవమ్మ హితము నొప్పుకొందు. 11

క. ని న్నేలుమహాత్ముఁడు నా,బన్నము గని జంటకోక పంపిననాఁడీ
పెన్నరకము నోర్చెదనా?, ప్రన్నఁగ నీరాడి మడుఁగుబట్టఁ దొడుగనా? 12

క. అని పల్కెనఁట కటా! మన, జనపదములు నిట్టిదుఃఖజనకస్థితిఁ గ
న్గొనుచుండుఁ బెక్కుతావుల, మన మెరియున్ వగల నిట్టిమాటలు వల్కన్. 13

ఆ. మాఱుబట్ట లేక మానమ్ము నిల్పుకోఁ, దగినవెరవు లేక తల్లడిల్లి
పనికిరాని ప్రాఁతతునుకలతో నిల్చు, నింతి లేనినాఁడె శాంతి మనకు. 14

వ. అది యట్లుండె-వేఱొండుకథ నిపుడు పేర్కొందుఁ-జాంపరానుసీమ తెల్లుంబోని పూరియు గడయు వలసినంత కలదు - కాన భీతిహరవాయందు మానెలకొల్పిన పాఠశాల కీసరకుతో నొకచప్పరంబు వెలసె - నొకనాఁటిరేయి నెవరో దాని కగ్గి ముట్టించిరి - దాపునంగల నీలిదొరలలెంక - యీయకార్యంబు గావించి యుండునని గ్రామీణులకు శంకవొడమె - నిఁక నట్టిపూరికొంప తగదని 'సోమణు' తలంచె - నతఁడును గస్తూరి బాయియు నాబడి సాగించువారు - పల్లెప్రజలసాయమ్ముతో సోమణు ఱాతిగోడలపైఁ బెంకుటిల్లు నేర్పఱిచె - నిఁక దాని కగ్గివలని వెఱపు తొలంగె - నివ్విధంబున 15

గీ. చదువునేర్పుచు శౌచమ్ముసరణిఁ దెల్పు, చామయంబులలోనింత యాదుకొనుచుఁ
బల్లియలఁ గొల్చు నైచ్ఛికభటులపట్లఁ, బ్రజలకుం బ్రేమమేచె గౌరవముతోఁచె. 16

క. ఈసేవ సుస్థిరమ్ముగ, నాసీమన్ నడువఁజేఁత కాసించితిఁ గా
నీ! సాగదయ్యెఁ దలఁపని, వ్రాసికొనన్ వలసె నేఁడు వాలినవనటన్. 17

క. వచ్చినసేవకు లందఱు, నచ్చటఁ గొన్నాళ్ళె యుంట కరుదెంచిరి దీ
వ్యచ్చరితులు నూతను లటు, చొచ్చిల్లుట కడిఁదియయ్యెఁ జూడన్ జూడన్. 18

వ. నా మొదలిడిన యూడిగంబు గావింపఁ దగినవా రాబిహారునం జిక్కరైరి – మఱియుఁ జంపారణ్యమునందు నాకర్తవ్యము సమాప్తం బగునంతన నాకై యెదురుసూచుచున్న వేఱొండుకర్జంబు నన్నుం దిగిచికొనియె – నా కాఁపురం బచట నాఱుమాసమ్ములంద ముగిసెఁ – గాని యానాఁడు కావించినచేఁత యీనాఁడుసైత మానేల నేదే నొకరూపునం జూపట్టు. 19



## 19 ఉజ్జ్వల పక్షము

క. మును పల్కినగతి నొకదెస, జనతాసంసేవనంబు జరుగుచునుండెన్
మన మిడి యొకదెస శుగ్భా, జన కర్షకచరిత వ్రాఁత సాగుచునుండెన్. 1

ఆ. వలసినన్ని హాలిక వాఙ్మూలముల సమా,ర్జింపఁగంటి నిది యెఱింగినంత
మండిపడిరి నీలిమందుబేహారు లా, యిత్తపడిరి నన్నుఁ జిత్తుసేయ. 2

వ. పదంపడి బిహారుదొరతనమ్మువారు 'మీయరయిక పెద్దకాలంబు నాఁచికొనె – నిఁక నీకార్యంబునకు స్వస్తిచెప్పి మీ రీరాష్ట్రముం బాయఁజనదా, – యని నా కొండుకమ్మ నంపి – రందు వినయం బెంతయున్ననేమి? దానిహృదయంబు తేటతెల్లంబ – కావుటం జేసి 3

గీ. నావిచారణకుం బెక్కునాళ్లు వలయు, నది ముగించినవెన్క నియ్యవనివారి
యలజడుల్ వాపవలయు నే నంతవట్టు, వదలి పోనొల్ల బీహారువసుధపొత్తు. 4

క. అని యేల్బడివారికి లే, ఖను బంపితి; నపుడు నాదుగ్రంథము నాఁపన్
బెనువెరవు గని గవర్నరు, తనచెంతకు రమ్మటంచుఁ దన్నుం బిలిచెన్. 5

ఆ. కాఁపువాండ్రు కుడుచుకష్టి విచారింప, నేమ సమితి యొందు 'నిలుపువార
మందు సభ్యపదము నంది మీరుం బని, సేఁత వలతు నంచు నాతఁ డనియె. 6

వ. అంత నీసమస్యం బరిశోధించుతతి నావారిసాయంబు వదయుటకును నన్నునమ్ముకొన్న సేద్యగాండ్రకు వలయుహితంబు సెప్పుటకును సమితి కావించుతీర్పు నాకు నింపని నాఁడు నాయిచ్చవచ్చినరీతిం గర్షకుల నడిపించుటకును నాకు నడ్డుసెప్పర యేని మీ పల్కుం బాటించువాఁడ నని యే నాద రాష్ట్రపాలకుఁ డీ నాకోర్కుల కెల్ల నియ్యకోలుం దెలిపెఁ – బదంపడి నే నా సంఘమునం బాలివాఁడనైతి – దీనికి సర్‌ఫ్రాంక్‌స్లాయీగారు

నేతలుగా నియుక్తులైరి – యీసమితి పెద్దయుండ్రచ్చిత్రచ్చి హాలికులయభియోగంబు
న్యాయమని విశ్వసించెఁ – గాన 7

ఆ. దొరలు మున్ను పాడిఁదొలఁగి రాఁబట్టిన, సొమ్మునందుఁ గొంత కమ్మతేండ్ర
కీగి వలయు దారుణాగస్సు 'తీన్‌కరియా' విధాన మెడసిపోవవలయు. 8

వ. అని నిర్ణయించుట సముచితం బని తలంచె – సభ్యులెల్లరు నేకాశయబద్ధులై యుంటకును
గర్షక రక్షకశాసనము పుట్టుటకును దనదిట్టతనంబెల్లఁ జూపి రాష్ట్రాధికారి 'యెడ్వర్డు
గెయిటు' లెస్స తోడ్పడె – నూతేండ్లనుండి నోరులేనికాఁపుల నెత్తుటిం బీల్చు 'తీన్‌కరియా'
శాసన మీనాఁటి కి ట్లంతరించె – దీనితోడన 9

క. తోఁటదొరల రాచతీకము, చాటునఁబడె దీన హాలికజాతికి నుసుఱున్
దేటయు నేర్పడి నిది యిఁక, మాటువడ దటన్న నీలిమచ్చ నశించెన్. 10

గీ. చాంపరానెల్లఁ దిలకించి చదువు పెంచి, యితరసంస్కృతి నేర్పి పెక్కేఁడు లచట
నుండఁజూచితిఁగాని రావోయి! యంచు, నీశ్వరుఁడు నన్ను వేఱొక్కయెడకుఁదిగిచె. 11



## 20 కూలివారితో

క. పంచాయతికార్యము నొక, యంచునకుం దెచ్చునంత నక్కట! కఱ వే
తెంచెను ఘూర్జరమున నశి, యించెం బంటలు దురార్తి నిగ్గిరి మనుజుల్. 1

క. "ఖేదామండల"మెంతయుఁ, బాదయ్యెను సేద్యగాండ్రు పన్నిడలే రీ
నాఁ డోర్వరానిపిమ్మట, మూఁడెన్ దోడ్పడుఁడు మీరు ము ప్పిది రొప్పన్. 2

వ. అని మోహనలాల్‌పాండ్యా శంకరలాల్‌పారఖులు నా కొక యుత్తరము నంపిరి – దవు
దవ్వుల నిల్చి వారికి హితమ్ము నెఱిఁగించునిచ్చయుం దెగువయు నాకడ లేదయ్యె – న
య్యవసరంబునందు యహమ్మదాబాదుకూలివాండ్రు సంబళములు చాలక యలజడిపాలై
రని యనసూయాబాయి వ్రాసినలేఖయు వచ్చెఁ – గార్మికులఁ దగినబాటకుం జేర్చునుబ
లాటము నా కున్నయది – యిది యలఁతికర్జంబైనను బిహారునం బీఁటవెట్టి దీని
సాగింపనేర – నగుటంజేసి 3

గీ. ఘూర్జరంబున కేగి చిక్కులను రెంటిఁ, జక్కఁబెట్టి హుటాహుటిఁ జంపరాను
వలనికి న్వచ్చి నెరవేర్పఁదలఁచుకృత్య, మఖిలముందీర్పఁగల నని యాసవడితి. 4

క. చేరితి నహమ్మదాబా, దారసితిన్ గొడవ లంత లంతలతోడన్
దీఱపదని యని వెసఁ జం, పారణ్యము సేరఁజాల నని యనుకొంటిన్. 5

గీ. అచట నిల్పిన విద్యాలయంబు లల్ల, నల్లన సురింగె ననుయాయు లౌ ననంగ
గాలిమేడలు పెక్కింటిఁ గట్టుకొంటిఁ, గాని మూన్నాళ్ల కవి పాడుకదలి కూలె. 6

ఆ. బడులు గాక పల్లెపట్టుల కారోగ్య, భాగ్యవిధులు నేర్పుపనియుఁగాక
గోకులంపులగ్గుఁ గోరియుఁ జాంపరాన్, మహికి సేవఁజేయ మనసునిడితి. 7

క. హిందీప్రచార మన గో, బృందసముద్ధరణ మన్నఁ బ్రియపడి తామై
ముం దడుగువైచి లక్షలు, వందలుగాఁ గంద్రు మారువాడీసాహుల్. 8

క. తనధర్మశాలలో న, న్నునిచి కడున్ గారవించె నొకపరి సంపత్
ఖని బేతియాపురమ్మునఁ, దనరెడిమార్వాడి సాధుతామూర్తి యనన్. 9

ఆ. అతనితోడిధనికు లానాఁడు నన్ దమ, మొదవు లున్నసదనములకుఁ జేర్చి
కనులవిందు గూర్చి వినిచిరి వారి గో, సేవకరణి మధురభావసరణి. 10

వ. గోసంరక్ష ణావశ్యకము నంతకుమున్న యే నుల్లమం దిడికొంటి – దీనిపట్ల నిపుడు నామన్నించు నెల్ల తలంపు లప్పటివ నాఁజను – నాఁదెగం దిద్దుట యావంగసముం బెంచుట బసవన్నల పనిప్రేఁగు డించుట మున్నగుచేఁతలు గోరక్షకుం జెందియుండు – మార్వాడిసంపన్నుల సాయంబు వడసి చంపారణ్యమునం దీయూడిగంబుసైత మారంభించితి – నమ్మండలమునం దేను బహుకాల మధివసింపమింజేసి యీసేవ సగపాలి యంద కుంటువడె – బేతియాక్షీరశాల నేఁడుం గలదు – కాని సమగ్రంబు గాకుండె – వెండియు 11

మం. దయ నుజ్జగించి హైందవనామధారు, లిది రేయి యిది గుంట యిది రొంపి నాక
యలవితప్పినప్రేఁగు నతిలిపై మోపి, యిపుడేని దద్భూమి నెడ్ల బాధింతు
రక్కటా! తమపాడి నడఁగార్చుకొందు, రనిశంబు వగతు నియ్యార్తిఁ దలంచి
చాంపరానున కేను జనినప్పుడెల్ల, నాచాలమింజేసి నట్టుపాలైన
యీచేఁతఁ గనినంత నెరియు నాయెడఁద, పడతు నచ్చటిసఖుల్ పఱపుహెచ్చరిక. 12

ఆ. ప్రకృతమునకు వత్తు నిఁ కహమ్మదాబాదు, చేరినంతఁ గఱవుసీమ కేమి
సేయవలయు నంచు రోయుచు మున్ముందు, కూలివాండ్రఁ దేర్పఁ గోర్కిపడితి. 13

క. ధర్మానుగ మని నమ్మితిఁ, గార్మికవర్గమ్ము నేఁడు కావించుపనిన్
గూర్మియు నోర్మియునై త, చ్ఛర్మము ననసూయబాయి సంధిలఁజేయున్. 14

వ. ఈమెసోదరుఁ దంబాలాల్‌సారాభాయి యంత్రస్వాములదెసం బనిసేయు – నాకును వీరితోడిచెల్మి మిక్కుటము – కాన నాపాల నిది గడ్డుసమస్య యయ్యె – మధ్యస్థసంఘము నెన్నుకొని దానితీర్పుం బాటింపుఁ డని యజమానుల నర్థించితిఁ – గాని వారు 'ససేమిరా' యని కూర్చుండిరి – కాన వేఱుదారిం గానక సమ్మె సాగింపుఁ డని కూలివాండ్ర కుపదేశింప వలసినవాఁడ నైతి–మున్ముందు కూలిపెద్దలతో లెస్సచర్చించితి–నౌగాములు తెల్పితి – నల్లరి తగదనియుఁ గట్టుతప్పినవాని నాఁగరా దనియు, బికిరమునకుం జనరా దనియుఁ దిండి కొఱవడిననాఁడు మన్నింపఁదగిన వేఱొండుకూలిం జేపట్టవచ్చు ననియు నేమములిడితి. 15

క. నాబాటలు నామాటలు, నాబీదల కింపు నింపె నాఁకటిమంటల్
ద్రాబనెగు ళ్ళైవి ముట్టిన, బాబూ! పనికేగ మనిరి పట్టిరి ప్రతినన్. 16

ఆ. కట్టులోని కర్మకరుల సబర్మతీ, తీరమునకుఁ జేర్చి దినదినంబు
వలయువిధులు జ్ఞప్తి కెలయించి మానంబుఁ, బెంచుకొండ యని వచించుచుంటి. 17

క. "పాలింపుఁడు శపథం"బను, వ్రా లుంచినసిదము లూని వా రనుదినమున్
బ్రోలెల్లఁ దిరిగి ప్రొ ద్దటు, వ్రాలన్ వచ్చెదరు సభకు వాలినవేడ్కన్. 18

క. ముయ్యేడునాళ్లు నడిచెను, గయ్యంబిది నడుమ నడుమఁ గార్మికవాంఛల్
న్యాయ్యములని పోషించెదు, నయ్యల నర్థించుచుంటి నడఁకువతోడన్. 19

వ. వారు నావేఁడికోలు సరకుచేయక 20

ఆ. కూలివాండ్రు మాకుఁ గొమరులవోనివా, రేము వారిపితలయీడువాండ్ర
మేల సెప్పవయ్య యీబిడ్డదండ్రుల, నడుమఁ దీర్పు సెప్పునరుఁ డొరుండు. 21

క. మా కూలివాండ్రకుంబలె, మాకున్ శపథమ్ము గలదు మన్నన గల దీ
రాకడ పోకడ లే లని, వాకొంటకుఁ జాగి రేను వాదకయుంటిన్. 22



## 21 ఆశ్రమము దెసకు

ఆ. సమ్మెసుద్ది నిల్పి సత్యాగ్రహాశ్రమ,రంగ మొక్కమాఱు తొంగిచూతుఁ
జంపరానుకొల్వు సాగించుతతిసైత, మిటకు వచ్చుచుంటి నెదపదదప. 1

క. పురమునపజ్జం గల 'కో,చర' బను కుప్పమున నిది యెసంగుచు నుందన్
గఱకరి బొబ్బతెగుల్ దు,ర్ధరముగ నప్పల్లెటూరఁ బ్రాఁకెన్ సోఁకెన్. 2

క. ఎంత కనుగల్గి యున్నను, జెంతం గలచేటు మమ్ముఁ జెనకుట నిక్కం
బింతంతల కుఖ్యల ని,శ్చింతముగా నిపుడు ద్రోపుసేయంగలమా? **3**

క. ఆనాఁ డాపల్లెకుఁ జని, నానాశౌచములు నేర్పునాణెము మాకున్
లేనట్టి దగుట నచ్చటు, మానుట కర్తవ్య మన్నమది మొలతెంచెన్. **4**

క. ఇచ్చోటు వలదు పొం దని, హెచ్చరికం జేసె దయ్య మీవల్లడితో
నచ్చినతావుం గొని యటు, సొచ్చుట కత్తఱిని బెద్ద చూచుచునుంటిన్. **5**

వ. పుంజాభాయిహీరాచందు సత్యాగ్రహాశ్రమమున కానాఁడొకబందుగుఁడై యది యలంతి యిది వలంతి నాక యెల్ల యుడిగముం గావించు - నతని కహమ్మదాబాదుగుట్టంతయుఁ దెల్లంబ-కాన నాశ్రమమునకు దగినపొలమ్ము నతఁడు వెదకం దొడఁగెఁ - దిరిగి తిరిగి నేఁడు మానిల్చునేల నాయయ్య గుర్తించె - నా కాతావు లెస్సయనియుం దోఁచె - నేలయన **6**

క. కారాగృహ మాగద్దకు, జేరుగడం గలదు లోకసేవను బ్రదుకం
గోరిన మాయాశ్రమమున, వారికి నది యెంతయును శివం బనుకొంటిన్. **7**

గీ. మూడుఁబంతులు పెట్టి మామొగమునందు, వ్రాసినాఁడు గదా బంది వ్రాఁత ధాత
యిట్టివారికి మొగసాలయట్టు చెఱయుఁ, గంటిముం దుంట కల్యాణకరము కరము. **8**

క. ఆరోగ్యము నిడునేలన, కారాగారముల దొరలు కట్టుదు రి య్యా
కారణముల నిలువందగు, ధారణి యని దాని విలువఁ దలచితి నంతన్. **9**

క. ఏ దెనిమిది నాఁడులలో, బీ దయ్యది క్రీత మయ్యెఁ బెరిఁగినప్రాఁకుల్
గోడలు గీములు నం దా,నాఁ డెవ్వియు లేవు గాని నద్యంకమునన్. **10**

క. శాంతినికేతనమై యే, కాంతముగా నుంట నది సుఖంబిదు నంచున్
సంతసమంది గుడారులు, కాంతముగా నిల్పి నిల్వఁగడఁగితి మచటన్. **11**

క. రేకులతో సంధించిన, పాకలలో వంట తీర్పఁబడుచుండె జనం
బేకాన్న మేకభాండం, బేకశ్రేణిగ భుజించు నేకాన్వయమై. **12**

క. పిన్నలు పెద్దలు మగవాం, డ్రన్నులు నొకనాల్గుపదుల కమరిరి దానన్
బెన్నలసట లెక్కింపని, యన్న మగన్‌లాలు దాని నరయుచు నుండెన్. **13**

ఆ. గట్టియిండ్లు కట్టి కా ల్నోపు లోపల, వాన లూరి మూరి వఱదపొంగి
యిదుమ లెన్నియేని గుడిచితి మాశ్రమ, స్థలిని బందములకు దవ్వుచనుచు. **14**

క. అదిపాడువడ్డబీడై, పొద లేచినదగుటఁ బుట్టపుట్టను దోఁచున్
బెద చిన్న పాము లచ్చట, బ్రదుకుట సుశకంబె వెదఁగుఁబాపలతోడన్. 15

క. పైపెచ్చు చిలువ నణఁపఁగ, నోపదు మాతాల్బు నేమ; మొక్కందును ద
ద్రూపము గని బెగ్గిల్లక, వాపోవక నిల్వలేఁ దవగ్రహణమునన్. 16

గీ. అపుడ కా దిపుడేని మాయాశ్రమమున, నురగమును గాంచి జంకనినరుఁడు లేఁడు
చిక్కి లిట్లుండెఁ గాక హింసించుప్రాణి, చంపఁదగినట్టిదని సమ్మతింపనైతి. 17

వ. ఫినిక్సునందును టాల్స్టాయియందును సబర్మతియందును నానెలకొల్పిన యాశ్రమంబులం దీకట్టడ పాటింపఁబడియె – భుజంగాదులవలనివల్లడి యీమూఁడు రంగములందును వలసి నంత కలదు నాఁజెల్లు – నైనను 18

క. ఎన్నఁడు నెవ్వని ముట్టద, పన్నగ; మిటఁ గన్నువిచ్చి పరికించిన నీ
తిన్నఁదనంబునకున్ భగ, వన్నిరవధికరుణ యొండ వఱలున్ గతమై. 19

వ. భగవానునకుం బక్షపాతములే దనియొండె మనగొడవ లన్నియుం బరికించు పాటి విడుమర యతనికిం గఱవని యొండె యెవ్వరే నడ్డుసెప్పక యుందురుగాక! – నా కడుగడుగునం దోఁచు నియ్యనుభూతి నింతకుమించి తేటపఱచునేర్మి నాకడం గానరాదు – మానిసిబాస భగవల్లీలల నూఁచముట్టుగ్గడింప వలంతికా దనెద – నవి వర్ణింప రానివని నరుఁ డెఱుంగరానివని యేను గంటి – మర్త్యుఁ డేతద్వ్యాఖ్యకుం దెగిననాఁ డతనికిం బసిపాపల తొక్కుఁబల్కుల శరణ్యము నాఁజెల్లు. 20

గీ. అహివధమ్మున కెదురు మా యాశ్రమస్థు, లిరువదై దేండ్లఁదాట్టియు నురగపీడ
కగ్గపడ; రానుషంగిక మనుట మాని, భగవదనుకంపయని దీనిఁ బల్కరింతు. 21

క. ఇది వేదుఱునమ్మిక యని, యెదురాడిన మూదలింప నేఁ జాలఁజుఁడీ!
బ్రదు కిచ్చెద నీ వెత్తిని, వదలక; తద్దాస్యవిధి నవశ్యము వలతున్. 22

వ. అది యట్లుండె – నాశ్రమకార్యంబులం దానాఁడు ప్రధానంబు నేఁతపని – నూలు దీయుట మాకు నంతవట్టు చేపడని చేఁత – కాన మున్ముందు వాపశాల నిర్మింపనెంచి కూలివాంద్ర సమ్మెతతిఁ దన్మూలబంధమ్ము లేర్పరించితిమి. 23



# 22 ఉపవాసము

గీ. కట్టుకట్టినభృతకులు మొట్టమొదటి, నాళ్లలో ఱాతిగుండెమై నడువసాగి
రనుదినమ్మును వచ్చి నావినుచుకఱద, లాలకింపఁ దొడంగి రత్యాదరమున. 1

క. క్షమ వాయరాదు చేసిన, సమయమ్మును విస్మరింపఁజనఁ దనుచుంటిన్
శ్రమ మెట్టిదైన శపన, క్రమ ముల్లంఘింప మనిరి కర్మణ్యార్థుల్. 2

క. నడిచెఁ బదునాల్గుదినములు, సడలెం బనివాండ్రదీక్ష సనసన్నముగన్
గడఁక గలవారు జాఱిన, బదుగుల దూషింపఁ బాలుపడి రల్కమెయిన్. 3

ఆ. వాదు హెచ్చిహెచ్చి వారికి వీరికి, నడరునేమొ దురము బెడిద మగుచు
నేమిసేయువాఁడ నిపుడని తద్దయుం, గలఁగినాఁడ భీతి నలఁగినాఁడ. 4

ఆ. సభకు వచ్చువాండ్ర సంఖ్యయు నల్లల్ల, కుందసాగెఁ జేరి కూరుచున్న
వారి మోములందు వలసినంత యుపేక్ష, మూఁగియుండెఁ దెలివి యాఁగియుండె. 5

ఆ. అకట! పేదలెల్ల రల్లాడుచున్నవా, రన్నమాట వింటి నదలుగంటి
నేది నాకుదారి యిపుడని యోరంత, ప్రొద్దు తడవికొంటిఁ బెద్ద వడితి. 6

వ. నెటాలునం దుప్పతిల్లిన కూలివాండ్రసమ్మె లే నెఱుంగుదుఁ గాని నేఁటికట్టు నాప్రేరిం చుటం బొటమరించెఁ-గాన నిది నాపాల నూత్నసమస్య యయ్యెఁ - గర్మకరు లెల్ల నాఁడు నాచెంతఁ బ్రతినగావించి చనుచుండిరి - నేన యిప్పనికి సాకిరినైతి - నగుటంజేసి వీరు తమ కావించు బాస నతకరింప నోపరని నాతలంపు - దీనికిం గతము నా యహంతయో, భృతకుల దెస నా కేర్పడిన మక్కువయో నిక్కంబుపట్ల నాకుంగల ప్రేముడియో నిర్ణయించు వారు లే-రది యట్లుండె. 7

క. రేపాడివేళ నొకనాఁ,డీపేదలఁ జేరఁదీసి యెది కృత్యంబో
యేపల్కు సెప్పవలెనో, తోఁపక సుడివడుచునుంటి దుర్భరవృత్తిన్. 8

గీ. అట్టితతిఁ గర్మకరులెల్లఁ గట్టు నూఁది, నిలుచునంతకు నీసమ్మె గెలుచునంత
కేను మెతుకంట ననుపల్కు లెఱుక లేక, వెడలె నానోటి నుండి పెన్పిడుగులట్లు. 9

క. గడగడ వడఁకిరి భృతకులు, పడె ననసూయమ్మ విడుచుబాష్పోదక ము
గ్గడువై సబర్మతీనది, కుడియెడమలఁ దాఁకి పర్వుగొను వఱ్ఱిగుచున్. 10

ఆ. మాకుఁ గాక పస్తు నీకేల బాబయా,నిన్ను దింప మిట్టిబన్నమందు
మమ్ము సైఁపు మన్నమాట నిఁకన్ జవ,దాఁట మనిరి బీద లోట విడిచి. 11

క. అంత నుపాసంబది నా, వంతు దురాపత్తు లెన్నివచ్చిన నెడఁదన్
జింతింపక నిల్చుట మీ, వంతు సుఁడీ! త్యాగమిది యవశ్యము వలయున్. 12

ఆ. మనకుఁ గల్మిసున్న మ మ్మేలుఁదని వీటఁదిరిసి కట్టుకట్టఁ దివురు టొప్ప
నొరులు మెచ్చువృత్తి యొం దూని మీరు జీ,వింపవలయు బెగడు త్రెంపవలయు. 13

క. స్వస్తి యెపు దందురా నా, పస్తున? కీసమ్మె యొద్దుపట్టినయపుడే
కస్తిం గుడువకుఁ డిది విని, యస్తవివేకుండు శస్త మందునె యంటిన్. 14

వ. అనాఁ దహమ్మదాబాదు పురపాలకసంఘము వల్లభాయి యాజమాన్యమున నడుచు - నతఁడు కొందఱుకర్మకరులకుం బనిచూపె - నాశ్రమమునం గట్టిన నేఁతసాలయం దిసుము నింప నేము కతిపయకార్మకులం బిల్చితిమి - పదంపడి 15

ఆ. ఇసుకతట్ట నెత్తి నిడుకొని యనసూయ, ముందు నడిచెఁ గార్మబృందమునకుఁ
జూచితీరవలయు నా చారుదృశ్య మా, ప్రజల కపుదు లేనిబలిమి చిక్కె. 16

క. గౌరవపూర్వక మగు చెలి, కారము యంత్రాలయాధికారులకును నా
కేరుపడి యుంట నిక్కం,బారయ నొకదోస మున్నయది నాయిల్లిన్. 17

ఆ. ఏను బూనిననట్టి యీయుపవాస మా, సాహుకార్లమదికి జాలిఁగూర్చి
వారినిర్ణయంబు వారింపకుందునా, యేమిపాడి యందు నిట్టిమార్పు 18

గీ. వారి నెదిరించి సత్యాగ్రహోరుధర్మ, వేది నగు నేను బస్తుంట కా దటంచు
నెఱుఁగుదున్; యజమానుల నిగ్గఁజేయఁ, దగినవా ర్కూలివారలే యగుట నిజము. 19

క. భృతకులదోసమునకుఁ గా,కితరులతప్పునకుఁ బూన నీపాచితమున్
బ్రతిభువ నే నప్పేదల, కతుకుఁ దదీయంబు దోష మదఁగక నాకున్. 20

ఆ. ఏను మరలదొరలయెడ వినయంబ చే, పట్టవలయు వారి నట్టిగతిన
మెత్తఁబఱుపవలయు నొత్తడిసేఁత గా, కున్నె వీరి కెదిరి యుస్సు రనుట. 21

క. నాపస్తు సాహులకుఁ బెను, రాపిడి చేకూర్చునని కరం బెఱిఁగియు నే
నాఁపంజాలక పూనితి,నాపని మేలని మదంతరాత్మ వచింపన్ 22

క. ఏ నిల్లికి నొగ్గితినని, దీనన్ నాకార్తి యుప్పతిలునని మీరల్
మీనడిచెడితెరు వింతయు, మానం బనిలేద యంటి మరపెద్దలకున్. 23

వ. వారు నాపల్కుఁ జల్లచల్లఁగా నాదరించిరి - కాని నడుమ నడుమ సవిలాసంబుగా న న్నవహేళనంబు గావించిరి - యి ట్లొనర్పు నధికారంబు వారికిం గలదు. 24

క. యంత్రాలయాధికృతులకు, మంత్రిగ నిలఁబడియె ధనికమణి యంబాలాల్
కాంత్రితనిం బౌరులు దు, స్తంత్ర మసత్యోక్తి లేని సత్పూరుషుఁగన్. 25

ఆ. ఇతనియభినివేశ మతిలోకమై నాదు, మదిని లోఁచికొనియెఁ గొదువలేక
యింపు లెస్సవొదమె నిర్వీరుతో నెది,రించి బవర మాచరింప నాకు. 26

ఆ. ఇట్టి మాననీయునేల్బడి నున్న వి,రోధివర్గమునకు నాధరించు
ననశనవ్రతంబు పెనుఁగొందలంబు సం,ధించుఁ గాన నాకు దిగులువొడమె. 27

క. ఈవణిజునింతి సరళా, దేవికి నా కీడులేని తీయము వెలయున్
భావింతుఁ జెలియలింబలె, నావెలఁది సుదారచిత్త నంచితశీలన్. 28

క. అన్నవలె నప్పకైవడి, న న్నరయుచు మజ్జయంబునకు నుబ్బెడి యీ
పిన్నది నానిత్రుం గని, విన్నంబడె నాపె తెఱఁగు వెతనిడె నాకున్. 29

క. అనసూయాదేవియు నా, యనుఁగుంజెలికాంద్రు కొంద ఱనశనదీక్షన్
గొని నాతో నిల్చిరి తొలు, దినమున; బతిమాలి వారిఁ ద్రిప్పితి నవలన్. 30

ఆ. నాల్గుదెసల నిట్లు నర్తించె హోర్దము, సాహుకార్లగుండె జాలువాఱెఁ
దదవుసేయఁ జనక తగవు నెట్లో చక్కఁ, బఱచుపొంటె నాత్రపడిరి వారు. 31

ఆ. అపుడు రచ్చసాలయై పొల్చె ననసూయ మనికిపట్టు దివ్యమందిరంబు;
నడుమ నేరుపడియె నడిసన్న యానంద, శంకరధ్రువునకు సమ్మెపొత్తు. 32

క. పెద్దలకోరుటఁ బెనఁకువ, దిద్దుట కీతండ కొసకుఁ దీర్పరి యాయెన్
రద్దయ్యె సమ్మె; పస్తుం, బ్రొద్దుల నప్పటికి మూఁటిఁ బుచ్చితి నోర్మిన్. 33

ఆ. సమ్మెపుట్టి మూఁడుసప్తాహములు నిండె, నేఁటి కిట్లు చక్కఁబాటు కుదిరె
సంధి సంతరింప జరిగినసభకు న,ద్ధరణి నేలుచున్నదొరయు వచ్చె. 34

ఆ. అతఁడు కూలివాండ్ర కది యిది సెప్పుచు, గాంధిపల్కు వినుట కర్జ మనియె
నవలఁ గొలఁదినాళ్ళ కయ్యధికారి నా, కెద్రిచి భీమసమర మొదవఁజేసె. 35

క. నాపల్కు దూష్యమని యవు, డీపెద్ద కృషీవలులకు నితవుం బలికెన్
బాపము! కాలము మాఱుట, తోపా టీతఁడును మాఱె దుర్వారగతిన్ 36

క. రసనీయము కారుణ్య, ప్రసువగు నొకవార్త నిచటఁ బల్కక యీస
ర్గ సమాప్తిసేయ మన్నా, నస మొప్పదు కాన వింతు నాలుగుముక్కల్. 37

ఆ. కట్టు ముగిసినంతఁ గార్మికశ్రేణికిఁ, బంచుపొంటె రుచికి సంచులైన
లడ్డువములు గంపలకొలందిఁ దెప్పించి, రర్థి చెంగలింప నర్థపతులు. 38

ఆ. వేలకొలందిని నున్న కూలివాండ్రకు వానిఁ, బంచుటెట్లు శాంతి నించుటెట్లు
నగరి నిట్టిపనికిఁ దగినంతనేల నా, ర్జించుటెట్లు నిర్వహించుటెట్లు. 39

వ. ఇట్టి శంకలకు లోనై యెట్టకేని బాసచేసినమ్రానిక్రేవల నీవిందుం బూరితి సేఁత యెల్ల భంగుల నుచితంబని నిర్ణయించితి – ముయ్యేడునా ళ్ళొక నేమంబున కగ్గంపడియున్న వారు వేగిరపడక బారులు తీరి భక్ష్యంబు లందు కొందురనినమ్మితిఁ– గాని 40

క. వద్దైన మొదలిద్దంతన, యద్దంకి రవంతలేని యల్లరి సాగెన్
బిడ్డలు దొడ్డలు బంతుల, నొద్దారించిరి త్యజించి రొక్కుమ్మడిగన్. 41

ఆ. కూలిపెద్ద లెంతకొట్టుకొన్నను ఫలం, బావగింజయంత యబ్బదాయె
గోల పెంచిపెంచి కొసకు భక్ష్యంబులు, కొల్లలాడఁ దొడఁగి రెల్లవారు. 42

క. ఇఁక లాభములేదని పం,పక మాఁపించితిని నిల్పఁబడిన మిరాయిన్
జెకజెక నంబాలాల్ టెం, కికిఁ బంపితి నచటిబంతికిన్ వెచ్చపడన్. 43

వ. హాస్యరసం బిందుఁ దేటతెల్లంబ– సమ్మెచెట్టుకడ లడ్డువమ్ములు పంచెద రన్న సడి వీటంగల తిరపగాం డ్రెట్లో పసిపట్టి మెల్లమెల్ల మ్రానిం జేరిరి – భక్ష్యరాశిం జూఱలాడిరి – దావాగ్నివోలె రేఁగిన వారిబుభుక్ష యింతపనిసేయించె – నిది కడుంగడు శోచ్యంబు నాఁజను – వెండియు – 44

క. బగబగ మండెడునాఁకటి, సెగలం బడి స్రగ్గిమ్రగ్గి చెడుపేదలు పెం
పగుచున్నా రీగడ్డను, దిగు లెంతయు రేఁగు దీనిఁ దెలిపెడుపట్లన్. 45

ఆ. గండుమెఱసి క్షుత్తు కవ్వించునెడ దీనుఁ, డేమిసేయు గరువ మెట్లుమనుచు
నారగించుపట్ల నానెడుతతిఁ బెల్లు, వెలితిపడ కితండు నిలువలేఁడు. 46

క. విత్తముగల యయ్యలు తగు, వృత్తిని జూపించి వీని కిడరన్నంబున్
జిత్తమువచ్చిన నాలుగు, విత్తులు బిచ్చంబు రాల్చి వీఁగుదు రకటా! 47



# 23 ఖేడాసత్యాగ్రహము

ఆ. కూలివాండ్ర లగ్గుకొఱకు సాగించిన, కదన మాఁగినంతఁ గదలినాఁడఁ
బంటవోయి కఱవుపట్టె కృశించు ఖే,డాధరిత్రిఁ బన్ను బాద లడఁప 1

వ. అచటిసేద్యగాండ్రు కరవిముక్తికై జతనం బొనర్చుచుండిరి – వారి కమృతలాల్ ఠక్కరు, మోహన్‌లాల్ పాండ్యా, శంకరలాల్ పరీఖు లండయైరి – వీరు దివంగతులగు గోకులదాస

కహాన్‌దాసు, విఠలభాయి పటేలుల నాశ్రయించి బొంబాయి శాసనసభయందు గగ్గోలు పుట్టించిరి-దొరతనమువారికడకు రాయబారంబులు నడిపిరి - ఘూర్జరసభ కే నత్తఱి నధ్యక్షుఁడనై యుంటి-నీసభాపక్షమున నధికారికి మనవులు, తీఁగవర్తమానములు పంపితి - మతఁడు వానిం బాటింపమియ కాక మాకు బెదరింపులరుచియుం జూపె. 2

క. నాఁ డధికారులచనుగతి, నేఁడు పరీక్షింప నవ్వు నెట్టన పుట్టున్
గోడువిన రెచటినుండియొ,యూడిపడిన వేల్పులట్లు యుందురు జగతిన్. 3

క. కన్నంతన కృషకావలి, విన్నప మది ధర్మ్యమన్నవిధ మెదఁదోఁచున్
బన్నముల కోర్చి ప్రభువిల, సన్నిధి మొఱపెట్టనేల జన మిప్పనికిన్ 4

క. నేలం బంటలు నాల్గవ, పాలికిఁ గుం దైననాఁడు పన్నిమ్మని భూ
పాలకు లొత్తడిపెట్టుట, పోలద యనుసూత్ర ముండెఁబో! చట్టమునన్. 5

గీ. నాలుగవపాలికంటె నీనాఁటిపంట, లొచ్చుయనెఁ గార్షుఁడధికారి హెచ్చుయనియెఁ
దీర్పరిం బంపుఁడని కమ్మతీంద్రు వలచి, రది ప్రభుత్వమ్ము నెదిరించు టనిరి దొరలు. 6

క. విన్నపములు సంప్రార్థన, లన్నియు వమ్మైనయంత హాలికజనులం
గ్రన్నన పిల్చితిఁ దడవితి,నన్నలు! సత్యాగ్రహులుగ నగుఁడా యంటిన్. 7

వ. ఈసమరంబున ఖేదామండలమందలి స్వయంసేవకుల కాక నాకు వల్లభభాయి పటేలు, శంకరలాల్‌బాంకరు, మహాదేవదేశాయి, యనసూయాబాయి, యిందు లాల్ కనైయాలాల్ యాజ్ఞికుఁడు మున్నగువారు సాయంపడిరి - వెండియు 8

ఆ. పెరటివేల్పుటావుకరణి వేల్పే లర్థ,మిడుచు నాఁడునాఁడు నడరుచున్న
న్యాయవాదివృత్తి నీయజ్ఞదీక్షలో, నొల్లఁబోక విడిచె వల్లభుండు. 9

క. ఇతఁడు మతి దాని నంటక, జితేంద్రియత మెఱసి లోకసేవావిధికిన్
బ్రతు కప్పనచేసె జగ,ద్ధితశీలుర కొజ్జబంతి నీతని మెత్తున్. 10

క. విడిదలకుఁ జాలినంతటి, యెడమున్నది యగుట నుచిత మీతా వనుచున్
నడియాదునఁ గల యనదల, విడిమట్టునఁ బటగృహమ్ము వేసిరి మిత్రుల్. 11

వ. అంత సత్యాగ్రహులగు సేద్యకాం డ్రెల్లరు 12

గీ. "పావులాపంటయేని మాపల్లెలందు, బండదయ్యెను వర్షమ్ము లెండిపోయి
పలుమఱు న్వేఁడుకొంటిమి పన్నుకట్ట, నేర మీయేఁటి కంచు సర్కారువారి. 13

క. అధికారులు మావిన్నప, మధఃకృత మొనర్చి రాఁపరైరి కరంబున్
వ్యథ లెన్నియిడిన శిస్తున, నధమాంశం బే నొసంగ మాపదనుంటన్. 14

గీ. ఇచ్చుమై నేము సుంకంబునిచ్చి మున్ను, వినిచిన దసత్య మనిపించుకొనుటకంటె
మానసంపత్తి నార్చుకోఁ బూనుకంటె, మాపొలా లప్పగించుటే మాకు లెస్స. 15

క. ఒదయుం ద్రిఁకఁదమ రెండవ, గడువునరిన్ గోర కార్తిగల్పింపక యు
న్నెద మాలో సంపన్నుల, ముదుగక మాయెల్లపన్ను నొసఁగెద మర్థిన్. 16

క. తనపాలిపన్ను వెట్టిన, వెనుకన్ నిఱుపేదరైతు వెతపడుఁ గానన్
ధనవత్కర్షకుఁ దేత,ద్దినమునఁ జెల్లింపఁదయ్యెఁ దెంపరి యగుచున్. 17

క. నాదారుకాఁపు లిత్తఱి, నేదారియు లేక మేఁక నెద్దును గేదెన్
గాదెను గడవం జట్టిని, రోదించుచు నమ్మవలయు రొక్కమువదయన్. 18

క. ఏతాదృగ్దశ నర్థా, పేతుల కర్షకులసేమ మెంచుట విత్తో
పేతుల కృత్యంబని మా, చేతంబున నిపుదు విశ్వసింతుము దీక్షన్.'' 19

వ. ఇట్లు బాసచేసి తత్ ప్రతిజ్ఞాపత్రమ్ముపై సంతకము లుంచిరి – వారి యీపెనఁకువ
నిందు విస్తరించి వర్ణింపఁజాల–నగుటంజేసి యానాఁటి మధురమధురానుభూతు
లిచటం బెక్కింటి నుజ్జనసేయక తప్పదు – శంకరలాల్‌పరీ ఖీపోరాటమున్గతిచి సంత
రించిన మేలిపొత్తముం గన్నవారు దీనికలరూ పెఱుంగ నోర్తురు. 20



# 24 ఉల్లిదొంగ

గీ. ఎచటనో దుర్గమక్షోణి నెసఁగుచుంటఁ, బత్రికాలేఖకుల కద్దపాటు నిదుట
నొరులు రారైరి చాంపరాన్ దురముదెసకు, నేఁటి ఖేదావివాద మానెతీది గాదు. 1

క. పెదపెద్ద శీర్షములతో, నద నెఱిఁగి తదీయవా ర్త లఖిలాశలకున్
వెదచల్లెఁ బత్రికలు త, త్కదనము ఘూర్జరులకుం బ్రకామ్యంబయ్యెన్. 2

క. సత్యాగ్రహమ్మునకు వసు, వత్యల్పమ చాలు ననురహస్యము కనమిన్
నిత్యము వలదనుచుండిన, నత్యర్థధనమ్ము వార లంపిరి నాకున్. 3

గీ. విత్తమొకవంక వేనవేల్ వెరుఁగుచుండఁ, బొదుపు నేర్పితి నొకవంకఁ బోటరులకు
జోదు లిది లెస్సగా నేర్వలేదు గాని, దిద్దుకొన్నారు తమపోవుతీరు కొంత. 4

క. రైతుల కీసత్యాగ్రహ, రీతి కదుం గ్రొత్తయగుట రేయుం బవ లే
నేతద్ధర్మవిశేషము, భూతచరిత్రమ్ము దెలుపఁ బూనితి నోర్మిన్. 5

గీ. అధికృతుల్ మీ రొసంగుప న్నారగించి, నిచ్చలు న్మిముఁగొల్చు బానిసల కాని
మీకు నొదయుంద్రు కారునిర్భీకవృత్తి, బ్రదుకుఁడని కాఁపులకుఁదెల్పుపనికిఁదగితి. 6

క. దొరలం గని బెదరకుఁడని సరిచేసితిఁ గాని రైతుజన మధికారిన్
నిరసింపం జన దనువిధి, కలుపుట దుస్సాధమయ్యె గ్రామములందున్. 7

ఆ. బీతుపోయినంత రైతు లుద్రిక్తులై, తరతరాలనుండి తమ్ము నేఁచి
భంగపఱుచువారిపట్ల మాతొద్దుట, కంగవింపకుంట యరిదిచేఁత. 8

క. అవినయ మిది సత్యాగ్రహి, కవలంబన మైనయెడఁ బయస్సున కురగో
గ్రవిషమ్ముతోడినెయ్యం, బవు శతసుకృతమ్ము లొక్కయనృతోక్తిఁ జెడున్. 9

క. ఏ నెంత పెనఁగులాడిన, నానుడివినయంతవట్టు నడియాడుప్రజల్
పూన రడంకువ; తుదకుం, గానంబడె నాకు దీనికలరూ పెల్లన్. 10

క. ఉన్నవి సత్యాగ్రహమున, మన్నింపఁగఁదగిన ధర్మమార్గంబులు పె
క్కన్నింటను బెడిదము నాఁ, జన్నది వినయంబె యన్న సత్యము గంటిన్. 11

క. వినయంబన మన్ననమై, సనసన్నగ మాటలాడుచందమ కాఁబో
దనయంబు నెడఁదతోడం, దనదాయను బెద్దసేయఁదగు విందుబలెన్. 12

క. కల్లయుఁ గైతవము న్విడి, యెల్లతతిన్ బగతుసేమ మెంచుట వలయున్
జెల్లు నడంకువ నా నిది, యుల్లం బిడవలయు సత్యయోద్ధలు వీనన్. 13

వ. సత్యాగ్రహప్రతిజ్ఞం బూనినప్రజలు ధీరులైనంతన యేలుబడివారు బెట్టిదంబులగు వెరవుల
నూఁదం దొడఁగిరి – సేద్యగాంద్రసరమ్ముల వారిగీమునం జిక్కిన పనిముట్లను బలాత్క
రించి లాఁగిరి – తొలిగడువుపన్నీమికి దండువగొందు మని యాన లంపిరి – యచ్చ
టచ్చటఁ బండినపంట నాఁకట్టిరి – కాన 14

క. కలఁగిరి నలఁగిరి కాఁపులు,సిలు గోర్వక కొంతమంది చెల్లించి రరిన్
దలుపులు తట్టలు నధికా,రులముందట నిడిరి కొందఱు కొనుం దనుచున్. 15

క. మఱికొందఱు కాఁపులు సుర,గిరులై నిలఁబడిరి యెట్టికీ దేర్పడినన్
బిఱుతివియక తుదిమట్టుం, దురమిచ్చెద మనిరి ధర్మదోహల మెగయన్. 16

ఆ. సమర మిట్టు లుండ సైరికు లెవరొ శం,కరపరీఖుపన్ను కట్టివైచి
రంత రగడ రేఁగె నక్కటా కంచెయే, చేనుమేసె ననిరి సేద్యగాంద్రు. 17

క. అత్తఱి శంకరలాల్ కదు, నుత్తలపడి లజ్జగుడిచి యోగ్యము ప్రాయ
శ్చిత్తం బేమని తుద కా, గుత్తపొలం బార్తసేవకొలి కర్పించెన్. 18

వ. ఇట్లుండ నధికారు లొకనేలంగల యుల్లిపాయలగుట్టం బాడిమాలి నిర్బంధించిరి - కాఁపు లపుడు కొంత బెదరియుంటంజేసి వారికి వెండియు జవసత్వంబు లొదవింప వలచి యా పలాండురాశి నొండుచోటికిం దరలింపుఁడని వారి కితవుం గఱపితి - మోహన్‌లాల్ పాండ్యా నిప్పనికి నొదయనిం జేసితి - నిది యాజ్ఞోల్లంఘనమని యేను భావింప - నిలువపంట ని ట్లాఁగుట శాసనబద్ధం బయినను ధర్మువునకు బాహిరంబ - దోఁపిడికి దీనికి వేర్మియేమి? కాన నేల్పడివారి యీయాఁకం ద్రోయుట పాడియని యనుయాయులకుం దెలిపితి - వెండియు 19

క. ఈ రీతి నెదుర్కొనవలెఁ, గారాగారమ్ముపొత్తు గనవలె దొర లే
యే రాపి కొ్ఱదఁగూర్చిన, సైరంపన వలె సమగ్రజయ మది యంటిన్. 20

ఆ. బంది కేగుటన్నఁ బాండ్యాకు సంబర;, ముచిత మైన వెరవు నూఁది చెఱకుఁ
జనక నేఁటిశాంతిసమరంబు నాఁపుట, కితఁడు సమ్మతింపఁ డించుకేని. 21

క. కావున నితఁ డా లశున శ్రీ వేఱొకదెసకుఁ జేర్చ సిద్ధంపడె నీ
త్రోవన్ మెచ్చినచెలికాం, డ్రీవీరుని వెంట నడిచి రేద్వురు వేడ్కన్. 22

క. ఇంతపని సేయువారిఁ ద్య,జింతురె యధికృతులు బందుసేయక; వా రా
సుంతయు నెఱపిరి వెంటన, గంతులువైచెన్ బ్రజానికాయము దీనన్. 23

క. చెఱసాలబెదరు తీఱిన, తఱి మగఁటిమిఁ బెంచు రాజదండన; మోహో
నరనారీమండలితో, నిఱుకునఁబడె రచ్చ నేర మిది త్రచ్చునెడన్. 24

వ. పదంపడి పాండ్యప్రభృతుల కించుక కారాగారశిక్ష విధింపఁబడియె - నే నీ దండముం దెగడుదు - ధర్మశాస్త్రముంబట్టి యిప్పని త్రుచ్చిమి కానేరదు - కాని రచ్చ కెక్కుట మా నేమంబునకు వింగడంబగుటఁ బునర్విమర్శనముం గోరమైతిమి-శిక్షితులఁ జెఱసాలకుం గొనిపోవుతఱి వారివెంట నపూర్వమగు మెఱవణి సాఁగెఁ- బ్రజ లానాఁడు పాండ్యా నుల్లిదొంగ యను పట్టంబిడిమన్నించిరి - తద్బిరుదం బితని నిపుడుం బాయదయ్యె - నీ ఖేడాసత్యా గ్రహచరిత్ర కాగామి విభాగమ్ముతో స్వస్తిసెప్పెద. 25



# 25 ఖేడా సత్యాగ్రహ సమాప్తి

ఆ. రానురాను రైతు లీనిగ్రహమ్మున, కాఁగలేక లేక యలఁతసెంది
రోర్మివిడని సత్యయోగులు తడసినం, బెల్లుచెదుదు రన్నభీతి గంటి. 1

క. సత్యాగ్రహధర్మమునకు, వ్యత్యస్తము గాని మార్గ మగపడునేనిన్
బ్రత్యుత్క్రమ ముడిగించుట, కత్యంతము రోయుచుంటి నాక్లిష్టదశన్. 2

వ. నాఁడు తలఁపనితలంపుగా నడియాదుసీమ నేలునుద్యోగి పచ్చపచ్చగానున్న కమ్మతీం ద్రరివెట్టుదురేని సన్నగారు కాఁపులకడం బన్నురాఁబట్టె మని నా కొక వార్త నంపె - నద్దాని వ్రాయసంబునం దీర్చి పంపుఁడని యే నడుగ నతం డట్ల కావించె - 'మండలమ్మునకెల్ల నతఁడధికారి కాఁడు - కాన దీని కేమందు'వని కలెక్టరు నడిగితి - నమ్మేటి 'మీ రింతకుము న్నీనిర్ణయంబు నెఱుంగరా' యని వ్రాసె - నా కట్టివృత్తాంత మతఃపూర్వ మశ్రుతచరంబ - కాని 3

క. ఈసుద్ది నిక్కమగుచోఁ, జేసినశపథంబు సిద్ధిచెందినయ ట్లు
ల్లాసపడవచ్చు రణమం, దాసించినఫలమ యిదికదా తొలుతొల్తన్. 4

ఆ. అగుటకతన మండలాధిపుముదల నా,హృదికి సమ్మదంబు నిడియెఁ గాని
పోరు ముగియునాఁడు పొందుసంతృప్తినా, కబ్బదయ్యె నితనియానఁజేసి. 5

ఆ. గుల్లకాంఁద్రు శిస్తుచెల్లించునొత్తడి, కలుగదని యితండు పలికెఁ గాని
చెప్పఁదగినలగ్గు చేపడదాయె నే, గానియేని లేని కర్షకులకు. 6

క. ఇతఁడు నిఱుపేద కలవాఁడతఁడని రూపింపఁ బ్రజలె యర్హులు తత్సూ
నృతము నధికారులు నిరా,కృతిచేసిరి నేఁడు దీనికిన్, ముచ్చిరుదున్. 7

క. ఈ సత్యాగ్రహమున జయ,మాసాదిత మయ్యెనని మహస్సులు సాగెన్
నాసంవీక్షణమున నీ,యాసత్తి గణింపరా దని వాక్రుత్తున్. 8

గీ. ఉందవలయును సత్యాగ్రహులకు మొదటి,నాఁటికంటెను దుదినాఁట మేటిబల్మి
యపుడె నిర్దుష్టముగ రణంబాఁగె ననుట, యుచిత మిదిలేదు నేఁటియాయోధనమున. 9

క. ఐనను ఘూర్జరకృషికులు,దీనం దేఁకువను సంస్కృతిం బడసిరి నేఁ
డా నేర్మివలనిలెస్సలు, కానంబడు మనకు నెల్లగ్రామములందున్. 10

వ. విదుషీమణి వసంతీదేవి (బిసెంటు) కావించిన 'హోమ్‌రూల్' ప్రచార మీ కాఁపులం దాఁకె ననుట నిక్కంబ - కాని ఖేదాసత్యాగ్రహంబె విద్యాధికులను స్వయంసేవకులను గమ్మతీంద్రమనుగడ కగ్గపతిచె ననం జను - నైచ్ఛికభటు లీకాఁపులబ్రదిమియం దోతప్రోతమ్ముగా నల్లుకొని పోయిరి - వా రీపెనఁకువం దమకుఁదగ్గ కార్యరంగమును గుర్తించిరి - వారి స్వార్థత్యాగనిరతియు దీనం బొంపిరివోయె - మఱియు 11

క. వీరాగ్రణి వల్లభుఁ డీ,పోరికి నర్పించుకొనియెఁబో! త న్ననినన్
లేరని తలంతు నల్పం, బీరణఫల మని వచింప నెదగలవారల్. 12

క. పల్లియలు పట్టణంబులు, వెల్లువలోఁ జిక్కువడ్డ వెనుకటియేఁటన్
నల్లవొ బార్డోలిని నేఁ, డల్లఫలంబెల్లఁ దెల్లమాయె న్మనకున్. 13

ఆ. క్రొత్త వెల్గు పుట్టె ఘూర్జరమ్మునఁ దన, బలిమి తెలిసె నచటిపంటదొరకు
మఱవఁ దాతఁడాత్మమహిమంబునిఁక వాని, తలఁపుమాటె! బ్రదుకువలపుమాటె. 14

క. త న్నుద్ధరింప నెవరో, యున్నారని యెదురుసూచు నూహము తొలఁగెన్
బ్రన్ననిచాగమె ముక్తికిఁ, బెన్నాదరు వనియు రైతుబిడ్డకుఁ దెలిసెన్. 15

వ. ఖేదాసమస్యంజేసి ఘూర్జమున సత్యాగ్రహసౌధంబునకు గట్టిగట్టిపునాది యేర్పడియె – దానిముగింపు నాకెట్లున్న నేమి? సేద్యగాండ్రకుఁ జైతన్య మొదఁ గూర్చెఁ – దమబల్మి నతిక్రమించినలగ్గు వాటిల్లెనని కాఁపులు తలంచిరి – యేలుబడివలనిచెట్టం దొలఁ గింపఁ జాలు తెరువుం గంటిమని వా రుప్పొంగిరి – వారిసంతసమున కీయెఱుక చాలుఁ – గాని యీ ప్రజలు సత్యాగ్రహలక్షణం బామూల చూడము కన్నవారు కారు – కాన వీరు కొన్ని కడగండ్లఁ గుడిచిరని మున్ముందు మన మెఱుంగనోర్తుము. 16



# 26 ఐక్యప్రయత్నము

క. ఖేదాసత్యాగ్రహ మొన, గూడినతఱి సాగుచుండె ఘోరాహవమా
కీడునఁ బడి ఢిల్లీపతి, నాఁ డాహ్వానించె దేశనాయకసమితిన్. 1

ఆ. ఛేమ్సుఫర్డుతోడి చెలిమి నాకుం గల,దన్నవార్త సెప్పియున్న వాఁడ
నగుట నన్నుసైత మాతఁడు పిల్వ నౌ,నంటి హస్తినగరి నందుకొంటి. 2

వ. కాని యాలిసోదరులు బ్రజారాధ్యులగు లాఁతిపెద్దలును నేఁ డాకారితులు గామింజేసి యీసభం బాల్గొంట కే నొకవంకఁ గొంకుచుంటి – నపు డాలి సగర్భ్యులు బందిగమునం బడియుండిరి – యేను వీరిగొప్పతనమును లెస్సవింటిఁ – గాని యొండురెండువిడుతలె వీరిం గంటి – మఱియు హకీముసాహెబుతోడి మైత్రియు నా కప్పటి కేర్పడదాయె – నాండ్రూసురుద్రు లీగఱువం బెల్లు కొండాట యే నెఱుంగుదు – లక్నోనగరమున ముస్లింలీగు సమావేశమైనతఱి శ్వేబ్కురేషి, బారిస్టరుఖ్వాజాల పరిచితిం బడసితి – నన్సారీ యబ్దుల్ రహమానుల నెయ్యంబు వడచితి – వెండియు 3

క. ఉత్తమశీలుర సేవా,యత్తుల ముస్లిముల మైత్రి నార్జింపఁగఁద
చ్చిత్తములోఁతులు సూడఁగ, నత్తఱిఁ బయనించినాఁడ నయ్యాదెసలన్. 4

క. హిందూ మహమ్మదీయుల, దెందములకుఁ బొత్తులేమిఁ దెలిసితి నేటా
లందు నివసించువేళల; మం దీరుజ కెద్ది యనుచు మల్లటపడితిన్. 5

గీ. చక్కచక్కఁగ నెదుట నిచ్చకములాడి, చనవుగోల్పోయి పరులతో సంధిసేఁత
కిష్టపడుబుద్ధి నాపాల నెపుడు లేదు, వలయుసత్యమ్ము గరువమ్ము వలయు నాకు. 6

వ. హిందూముసల్మానుల కైక్యముం గూర్చుతతి నా యహింస కగ్నిపరీక్ష తప్ప దనియు, నక్కార్యమం దీనాప్రయోగములకు వలసినంత యవకాశ ముండు ననియు నాఫ్రికాయంద నమ్మితి - నావిశ్వాస మిప్పటికే నట్లకలదు - భగవానుఁడనుక్షణ మీరాపిడి నాపాదించు చున్నను నాప్రయోగ మల్లల్ల సాగుచున్న యది - యే నిట్టితలపోఁతల న్మునిఁగి బొంబాయిరేవునం దోడదిగితిఁ - గావున వెన్వెంటన 7

క. ఆలీద్వయముం జూచితి, మాలో మొలతెంచె మధురమైత్రి; తదీయో
న్మీలనకాలమ్మునఁ జెఱ, పాలం బడె నీయుగమ్ము జాలిం బడితిన్. 8

గీ. అదను చిక్కిననాఁడు మహమ్మదాలి, బందిగమునుండి కమ్మలుపంపె నాకు
నవి యలంతులుగావు రామాయణములు, భారతంబులు బహుళార్థబంధురములు. 9

క. ఈ సోదరులం జూడఁగ, జేసినయత్నమ్ము లెల్లఁ జెడె నధికారుల్
నాసంప్రార్థన ముడివోఁ, జేసిరి వేసరితి వారిచిత్తము రామిన్. 10

వ. ఈయన్నదమ్ములు చెఱకేగినపదంపడి ముసల్మాను పెద్దలు కాళీఘట్టమునం గూడిన తమసభకు నన్నాహ్వానించిరి - వారికోర్కిపై నాలీద్వయమ్మును వెలికిం దెచ్చు కొంట మహమ్మదీయుల కర్తవ్య మని తత్పరిషత్తునం దుపన్యసించితి - నవ్వల న న్నలిఘరు కళాశాలవారు పిల్చిరి - జన్మభూమికిం బరిచర్యసేయ మీ రందఱుం బరివ్రాట్టులు కందని యచటి విద్యార్థిలోకమ్మున కుపదేశించితి. 11

గీ. అంత నాలీసగర్భ్యుల కాఁకవలన, విడువుఁడని యేలుబడివారి వేఁడుకొంటి
నల ఖిలాఫత్తువాద మీయన్నదమ్ము, లెట్లుభావింతు రాతెఱఁ గిపుడు గంటి. 12

క. సౌకత్‌మహమ్మదాలుల, యాఁక దొలంగన్ ఖిలాఫ తది చక్కఁబడన్
వ్రేఁకన యనక శ్రమించుట, నాకృత్యం బనుచు నాఁడు నమ్మితి నెడఁదన్. 13

వ. ఏను ముసల్మానులకు నిక్కపుంజెలికాఁడ నైననాఁ డీధర్మంబు వాలింపవలయునని భావించితి - ఖిలాఫతుసమస్యయందలి మంచిచెడ్డలం దడవుట నా కక్కఱలేనిపని - మహమ్మదీయులు దీనిం బాటించుట పాడియైన వారికిం దోడగుట నా కావశ్యకంబ - మతవిశ్వాసము లందఱ కొక్కరీతి నుండవు - తన విశ్వాసము సత్యమని యెల్ల వాఁడుం దలఁచు - నట్లుగాక యిప్పట్ల నెల్లరనమ్మిక లొక్కఁడైన లోకమం దిన్నిమతములకుం దావులేదు - కన ఖిలాఫతుసమస్య మతసిద్ధాంతవిరుద్ధము కాదనియు నాంగిలేయుల పెద్దప్రెగ్గడ లాయిడ్‌జార్జి యిందలి సత్యము నంగీకరించినాఁడనియుం దెలిసికొని యతఁ డాడినమాట చెల్లించునట్లుసేఁత నావిధి యనుకొంటి - వెండియు 14

గీ. ముసలమానుల మతవాదమును గణించు, నను విమర్శింపఁదొడఁగి రానాఁడు పెక్కు
రెవ్వ రేమన్ననేమి నా యాతలంపు, మానవలసినధర్మువుం గాననైతి. 15

గీ. ముస్లిములఁ గ్రుంగఁదీయు నీముప్పుగుట్టు, పలుకనెంచితి నల ఛేమ్సుఫర్డునెదుట
నిభపురమ్మునయందుఁగా లిడినయంత, దీనజనబంధు వాంఁడ్రూసు కానఁబడియె 16

వ. ఆయయ్య యిటలీ యింగ్లండుల కొకరహస్యసంధి సాగినదనియు, నిట్టితఱి నీయుద్ధ
సభం బాటించుట పాడియగునా యనియు నన్నుఁ బ్రశ్నించె - నా కాపొత్తు గొడవ
తెలియకున్ననేమి? - దీనబంధు వన్న దాని శంకింపఁజాల - నగుటంజేసి 17

క. అత్తఱి ఢిల్లీవిభునకు,నుత్తర మంపితిని సభకు నొడఁబడ ననుచున్
మెత్తనిపల్కులఁ జర్చకుఁజొత్తము రమ్మని యతండు సూచనచేసెన్. 18

గీ. అతనితో లెస్సతడవినయంత నాదు,సందియము తీఱ నీకొంటి సభకుఁ జేర
నాఁటి ఢిల్లీశుపల్కినమాటలోని,సారమును వక్కణింతు నాచదువరులకు. 19

వ. "బ్రిటన్ ప్రెగ్గడలు కావించునెల్ల చేఁతయు నాయెఱుకలోనిదని తలంపఁగాదు -
తన్మంత్రివర్గమువారు తప్పటడుగు వేయరని నిర్ణయింపఁ జాలువా రెవ్వరు?-కాని 20

గీ. ఆంగిలేయులదొరతనం బది జగచ్ఛి, వంకరంబని భారతావనికి దాన
లగ్గువాటిల్లెనని లోఁ దలంతువేని, కృత మెఱుంగుట పాడిగా నెంతువేని. 21

క. ముజ్జిద్దుగ బవరంబులు, విజ్జినయానాఁడు దానివెత దీర్చుట యే
తజ్జగతి వారి విధి యని, వజ్జీరుని వోలె నిలిచివల్కవె నీవున్. 22

ఆ. ఆంగ్ల భూమి వెడలు నయ్యాయిపత్రిక, లీరహస్యమైత్రి నెఱుకసేఁత
యేనుఁ గంటి దీన నింతకుమించిన, యెఱుకలేదు నాకు నింత నిజము. 23

క. పత్రికల నెన్ని చిత్రవి, చిత్రంబులు వుట్టు నది వచింపం బనిలే
దీత్రొక్కటలోఁ బత్రిక, చిత్రణ మీ విట్లు విశ్వసింపం దగునా? 24

క. కదన మొకయొద్దు పట్టిన, పదపడి యిది పాత్ర మిది యపాత్రంబని తాం
బది సెప్పుమదేమని మ, మ్మొదిరింపుము చర్చసేయు మే నొందాడన్". 25

వ. రాజప్రతినిధివాదం బిట్టిది - యిది నాకుం గ్రొత్తకామి నిక్కంబ - కాని యానాఁటి
ధోరణింబట్టి వింతగాఁ దోఁచెఁ-గాన సమరసభం బాలుగొంట కియ్యకొంటి - నవ్వల
ఖిలాఫత్తుగాథస్తుతిచి ఛేమ్సుఫర్డున కొకలేఖ వ్రాయం గడఁగితి. 26



# 27 పోరికిం(బజంగూర్చుట

క. అయ్యయి నాయంకులతోఁ, గయ్యపుసభ సాగె సమరగాధలు బెడఁదల్
నెయ్యము తియ్యము విరియఁగ, నయ్యిభపురవిభుఁడు వినిచె నక్కఱ తెలిపెన్. 1

క. కలనికి బంటులఁ గూరుప, వలె నసునిర్ణయము తెచ్చె వక్కణచేసెన్
వలచెను దీర్మానంబును, బలపఱుచుట కేను నిల్వఁబడవలె ననుచున్. 2

వ. అంత హిందూస్తానీపల్కున దీని సమర్థింతు-నియ్యకొం-దని యేనాడ నతఁడు నాకోర్కి మన్నించుచు నాంగ్లమునందును భాషింపుఁడని యర్థించె-నది దీర్ఘోపన్యాసముల కదను కామింజేసి "నా కర్తవ్యమును నిప్పట్ల లెస్స యెఱింగి యీ నిశ్చయంబున కామోదింతు" నని యిరు బాసలం బల్కితిఁ - బదంపడి 3

క. ఏ నా కొల్వున హిందూ, స్తానీపల్కునకుఁ బేర్మి సంధించుట నౌ
నౌ నని సభ్యసమాజము, నానాభంగుల నుతించె నన్నావేళన్. 4

క. మధురంబుగ రాజ(ప్రతి, నిధిసభలో దేశభాష నెగయుట కిదియే
(ప్రధమనిదర్శన మనె న, వ్విధముం గని యేను లెస్స వెలవెలనైతిన్. 5

క. నానన్ గుడిచితి మనగతి, యీనీచస్థితికి వచ్చెనే యనుకొంటిన్
మానించిరె వెలివైచిరె, నానుడువున్ దొర లటంచు నలఁగుడువడితిన్. 6

గీ. ఇంతకంటెను దార్కాణ మేమివలయు, నక్కటా! భారతీయహైన్యము వెలార్ప
మననుడుల్ రెండుమూఁ డన్నమాత్ర కిన్ని, మెప్పులా? యెట్లుమఱతునిమ్మేళనంబు. 7

వ. అది యట్టు లుండె - నయ్యవసరమునం దేను సం(గ్రామసదస్సునం బాలుగొంటకుఁ గల యాశయమ్ము లివి యనియు, నాగామికాలికవాంఛ లిట్టివనియు నేలుబడివారికిం (బజలకుఁ దెల్లమిసేఁత సముచితంబని తలంచితిఁ - గదుంగడు (శమించి దిల్లీశ్వరున కొక దీర్ఘలేక సంతరించితి - నందు 8

క. ఆలముపట్లం గూర్చిన, యోలగమున లోకమాన్యుఁ డుండమి సరదా
ర్లాలీసోదరు లుండమి, నాలో దుఃఖమ్ము పొంగినది యని యంటిన్. 9

క. భారతజనతా హృదయ, ద్వారము తెఱచితిని సమరతం(త్రోద్ధతముల్
మూరిన మహమ్మదీయుల, కోరిక లీదృశము లంచుఁ గూర్చితి నర్థిన్. 10

క. ఈకమ్మను (బకటించుట, కీకొనుఁడా యంటిఁ గరిపురీం(ద్రుఁడు హర్ష
శ్రీకలితోక్తులఁ దన యుర, రీకృతి నందించె వెలువరించితి రచనన్. 11

ఆ. కొలువు ముగిసినంత వెలలె సిమ్లాశైల, శృంగవాసమునకు ఛేమ్సుఫర్డు
లెస్సవిలువ యున్న లేఖమ్ము నిద్దాని, నంచె కప్పగించి యనుపనైతి. 12

గీ. వీనికిని వానికిని గాక వెలఁదివాని, కిచ్చి యుత్తర మిది పుచ్చ నిచ్చవడితి
దీనబాంధవుఁడాంఁడ్రూసు తెలిపె నేఁటి,పనియొనర్పంగ 'నైర్లండు'పాత్రుఁడనుచు. 13

గీ. అమ్మతాచార్యుఁడీకమ్మ యర్హ మనుచు,మదికిఁదోఁచిన మన్నింతు మాటననియె
నవలఁ బరికించి సముచితంబని వచించి, కదలె రెవ రెండు సిమ్లానగమ్ముదెసకు. 14

క. నిసిపయనం బిది వేసట, నొసఁగున్ రెండవతరాన నోదక చనుఁడీ
వసు విత్తు నంటి నడితర, మసుఖం బిడదని గమించె నతఁ డాశ్రేణిన్. 15

వ. ఈతనిసౌజన్యంబు న న్నెంతేని వలపించె – నిట్టిపుణ్యపురుషునికేలం బెట్టి పంపిన లేఖ నాతలంచినట్ల లెస్స యొదవించె–నాదారి 'సుగమం బగుట కిది కారణం బయ్యె – నిఁక నారెండవకర్జంబు కయ్యంబునకు వలయుబలఁగముం గూర్చుట కదా! – నా కీబికిరంబు ఖేదామండలమునం గాక యిం కెందు దొరకు! – ననుచరులం ద్రిక్క మున్ముం దెవరి నర్థింతుఁ – గావున 16

క. ఖేదా చేరినయంతన, ప్రోడలతో వల్లభాది బుధవర్యులతోఁ
గూడి సమస్యం దదవితిఁ, బాడిం గని యనికిఁదోడుపడుఁడా! యంటిన్. 17

క. నామార్గమునకుఁ గొందఱు, వైముఖ్యము చూపి రెన్ని వల్కినఁ బ్రజ సం
గ్రామమ్ముదెసకు వచ్చునె, యేమో యని కొంద ఱాడి రితవరు లగుచున్. 18

ఆ. నెయ్యమింతలేదు నేఁబిల్చుప్రజలకు, దొరతనమ్మువారి కరసిచూడ
మఱవరైరితమ్ము నుతిచియాడిన యధి, కృతులఁ గాఁపువార లింతదనుక. 19

వ. ఔఁ గాక – నాపని యేను మొదలుపెట్టితి – వెన్వెంటన బ్రజపాహృదయమ్ము తేటపడె – ఖేదాసత్యాగ్రహమునం దమబండ్లఁ దేరకుఁదేర యొసంగినవారు నేఁడు మాకు బాడిగకేని బండి కట్టరైరి – కాని యింతమాత్రమున మే ముస్సురనక కాలి నడక నాశ్రయించి యేమందురో యన్నశంకంజేసి యెవ్వరిం గూడు వేడక తినుబండముల మూటలు మోసికొనుచు యాత్ర సాగించితిమి– పోయిన తావులందెల్ల సభలు కూర్చితిమి – ప్రజలారచ్చలకు వచ్చెడివారు – కాని 20

క దండునఁ జేరుట కొకఁడో, రెండో పే ర్లొసఁగువా "రరిం దిట్టుయున్
దుండగ మంటిరి కత్తులు, కొండని మాకిపుడు సెప్పఁ గొంకరుమీరల్. 21

ఆ. ఇంగిలీసువార లీదేశమున కేమి, యొఱఁగబెట్టి రేమిగరువ మిచ్చి
రాదుకొం డటంచు నీదినమ్మున మమ్ముఁ, బొగడవారి కెట్లు మొగముచెల్లు" . 22

వ. ఇట్టి యనుయోగశరంబులు మాపై వందలు వేలు పఱుపువారు – వారి కుచితోక్తులు సెప్పుచు నొల్లంబోక మాపని మేము సేయంజేయఁ గొన్నాళ్ళకది పండఁ బాఱెఁ –

దొలిదళముం బంపిన వెన్క మాబాట చక్కంబడునని యేను దలంచితి - గడించిన మూఁకకుం దా వెచ్చుట నని యధికారుల నడిగితి - వారు. 23

క. ఢిల్లీ సభకుం బ్రతిగా, నెల్లదఁ గూర్చిరి సదస్సు లీదృశ మాపా
ధిల్లె గుజరాతునం దొకఁ, డల్లదొరల్ నన్నుఁ బిల్చి రాకొల్పునకున్. 24

క. అనుయాయులతో సభకుం, జని చిత్తము చిత్తమను హసాదను రవళుల్
నినుపారిన తద్రంగము, గని ఢిల్లీగోష్ఠి మఱవఁగంటిని సరగన్. 25

క. దిగ్రమింగితి నీబన్నము, తగుమాటలు వల్కితిని సదస్యులమ్రోలన్
మొగమోదక దొరలదెసన్, నెగయించితి నొందు రెండు నిశితతరోక్తుల్. 26

క. దురమునఁ జేరందగు నను, కరపత్రము నచ్చువైచి గఱువల కిడితిన్
దొరలకుఁ దద్రచనంబున, దొరలినవాక్యములు కొన్ని దుష్టము లయ్యెన్. 27

వ. వానిసారం బిచట వ్రాయంబోలు నని తలంతు. 28

ఆ. "తెల్లవారు భారతీయులఁ గుదియించు, శాసనములు పెక్కు చేసినారు
సకల మొక్కయెత్తు జాతిచేతికటారి, ముక్క లాఁగుచట్ట మొక్కయెత్తు. 29

క. ఆయుధశాసనపీడం, ద్రోయింపఁగ శస్త్రశాస్త్రదోషజ్ఞతమై
శ్రేయఃపుంజము వడయఁగ, నీయది బంగారుగడియ హిందూమహికిన్. 30

క. సామాన్యప్రజ లీపెను, బామున దొరతనమువారిబాసట యైనన్
బ్రామెడుసందియము న్విడి, ప్రామిడిశరశాసనంబు పాతురు వారల్. 31

వ. నాయీపల్కుల నధికారి వ్రేలుపెట్టిచూపిమన కభిప్రాయభేదమ్ము లిట్లున్నను మీ రీకొల్వున కేతెంచుటంజేసి యేను దనిసితి -ననుడు నానేర్చినయుచితో క్తుల నామాటలం దిరపఱుచుకొంటి - మఱియు ఢిల్లీశ్వరున కే నంపినకమ్మ తెలుఁగుసైత మిచటం బ్రకటింతు. 32

క. "కదనసభం బాల్గొంటకు, మొదటం బుయిలోడితిని మిముం గని మీర
న్నది విన్నపదంపడి నా,మదిఁగలసందేహమెల్ల మఱుపడె నధిపా! 33

గీ. ఆసభకు లోకమాన్య మహమ్మదాలి, నలబిసెంటెను బిల్వమి నస్మదాత్మ
కలఁగె మెఱవడి యెంతేని గలరు వీరు, వీరిపల్కున కీనాఁట విలువ హెచ్చు. 34

క. మీ రియ్యెడఁ బొరపడితిరి, దారిం దప్పితి రటంచుఁ దలచెద నైనన్
గూరినవిపత్తి లే దీ,తీరుసభల్ పెక్కువుట్టు దేశాన నిఁకన్. 35

ఆ. వారి నపుడు పిల్వవచ్చును దత్సహా,యతను బడయవచ్చు నాలమునకు
నెడఁదలందు నెంత యెడమడు గున్నఁ బో,నాడఁ జనదు మీర లట్టివారి. 36

వ. పరిస్థితు లిట్లున్నకతన మున్ముందు కలనికిం దోడుపడ నొల్లనైతిఁ–గొలువునం దీర్మానము నగ్గించినవెన్కఁ దనివిగంటి – నిపుడు నాచాటిన తలఁపులకుం దా మగు నందురేని యావెంటన సమరకార్యంబు తలఁదాల్చి తిరుగుదు – మఱియు నాంగ్లరాజ్యంబున సమగ్రాధికారముగల పాలివారమై యుంట కేమాసపడి యుంటిమి – కానఁ దద్రాజ్య మిడుమలం బడినతఱి దాని కండయగుట మా ధర్మువు – నేఁ డాయేలుబడి నాదుకొన్న యెడ మాకోర్కులు వైళంబ యీడేఱు నని తలంతుము – తాము మాకొసంగు సంస్కరణములు కాంగ్రెసు ముస్లింలీగులకుఁ దుష్టిం గూర్చునని ప్రజలు విశ్వసించిరి – యీనమ్మికంజేసియ నేఁడీకొలువునం బ్రజానాయకులు పాల్గొని నిండుమనమ్మున మీవిజయమ్ము వలచిరి – కయ్య మున్నంతదనుక భారతీయులు స్వరాజ్యమను పల్కు సైతము వెలువరింపకుందున ట్లేను గష్టింతు – నోపికయున్నవారి నందఱ నాలమ్ము దెసకుం ద్రిప్పుదు – దీనంజేసి నాదేశీయులు సామ్రాజ్యమునం దుదాత్తపదము నంద నేర్తురు–రంగువేర్మియు, దేశ భేదంబును దీనం దెగటాఱు–వెండియు నీనాఁడు 37

క. పలువురు విద్యాధికు లీ, కలనికి విముఖులుగ నుంట కనఁబడు నగరం
బులఁ బల్లెలవా రాడిన, పలుకుం దలఁదాల్చుచుంద్రు ప్రజలానతిగన్. 38

క. ఏ నిచటికి వచ్చినకొలె, మానక హోలికులతోడిమైత్రిని గంటిన్
బానిసము దుస్సహం బను,పూనిక నున్నారు వారు బోధాన్వితులై. 39

వ. దొరతనమువా రొక గడువు నిర్ణయించి యానాఁటి కీనాఁటికి స్వరాజ్యము నీవలయు నని నిశ్చయించినకాంగ్రెసునం దేను బాల్గొంటి – నిది దుష్కర మ్మనియు నెఱుంగుదుఁ – గాని 40

గీ. భారతీయులు సంతృప్తిపడ రయా! స్వ,తంత్రభావమ్ము వెలయు పెత్తనము లేక
యెన్ని వెతలైన సైరింతు రెంతలేసి, తేగములకైన వా ర్వెనుదీయ రిందు 41

గీ. ఆంగ్ల సామ్రాజ్యలక్ష్మికి నావహిల్లు, నార్తి వోకార్చుపొంటె నేఁ దంతలేసి
చాగముల కోహటిల్లనిజనులుసైత, మున్నవా రెందుఁగన్న హిందూర్వియందు. 42

క. కావునఁ గలనికి వలసిన, సేవకులం గూర్తుఁగాని సిరి నార్జింపన్
లావరిని గాను దొలుతన, యీవసుమతి యొసఁగె బలిమి కిందనిధనమున్. 43

వ. ఏ నెట్టి విడుపునకేని దెగించుటం జేసి యీసమరసభానిర్ణయంబు నగ్గించితిఁ–గాని నేఁడు మాకుంగల పెత్తన మెయ్యది? – మున్ముందు మాకోర్కు లీడేఱునన్న నమ్మికంబట్టి యే మిపు డీసాయంబున కొగ్గవలసె – మాయాస లాఱడిపడ్డ నాఁడు మాకు మీదెసంగల యాదర మెల్లందొలఁగు – మీ రన్యోన్యకలహంబులు వల దన్నమాట కధికారుల దుండగము సైఁపుండని యర్థమయ్యెనని మా కట్టితాల్మి వదయరానిది–మఱియు 44

గీ. పట్టుపట్టి నిరంకుశప్రభుతఁ జూపు, నధికృతులదౌష్ట్య మోర్వ నాకలవియగునె
హెచ్చరింపుఁడు ప్రజలను రెచ్చఁగొట్టఁ గాదు మన్నింపుఁడని యధికారిజనుల. 45

ఆ. చాంపరానురైతుసంఘంబు తడవులఁ, బట్టి కుడుచునిడుమ నెట్టివైచి
దేశమునకుఁ దేటతెల్ల చేసితిఁ దెల్ల, వారివలచు ధర్మవైభవంబు. 46

క. సత్యముకై దుఃఖంబుల, నత్యయముల నోర్చుబల్మి యబ్బినచో భూ
పత్యధికార మసార మ, నిత్యంబని ప్రజలు పెద్దనేర్చిరి ఖేదన్. 47

వ. ప్రజ లింతకుమున్ను రాచతిక మన్ననుడిని విన్నంతన కినిసి తిట్టువారు - కాని నేఁ డాకింక వీరియెడం గనఁజాల - సాత్త్వికనిరోధమున కేలుబడివా రాఁకవెట్టమింజేసి ప్రజాభిప్రాయం బిఁక ననాదృతంబుకా దనునమ్మిక వీరికింబలిసె - నిట్టియనుభవములం బరికింపఁ జంపారణ్యఘూర్జరంబుల నాయొనర్చినచేఁత లనికిం దోడ్పడినవని చెప్పంజను - వెండియు 48

క. వదులుమ! యీసత్యాగ్రహ, కదనం బని మీరు నాకుఁ గట్టడసేయన్
మొదలిడుచో నది యూర్పక, బ్రతుకంగా వలయు నన్నప న్పిదుట యగున్. 49

ఆ. కత్తిబలిమి నూఁది కా కాత్మశక్తిచే, నహితు నోర్వవలయు నన్నపాడి
ప్రజకు నేర్పు నాతపస్సు పండిన జగ, త్త్రయము నెదిరి భారతము జయించు. 50

ఆ. అగుట నెల్లయెడల నవమతి నాపత్తి, సైఁపవలయు నన్న సారనీతి
నరనరమ్మునందు నామేన జీర్ణింపఁ జూచుచుంటి నాత్మ నాఁచుచుంటి. 51

క. ఈనీతికి రందని ప్రజ,కే నెపుడుం దెలుపుచుంటి నెది నెఱపిన ని
ద్దానిమహత్త్వము చాటుట, కే నెఱపుచునుంటి సత్యమిది యనుకొంటిన్. 52

వ. ఇంక నొక్కవిషయముం బేర్కొని యీకమ్మను ముగింతు - మహమ్మదీయ రాజ్యంబుల కెట్టి చెట్టయుం గావింపమని మాటయిచ్చునట్లు మీ రాంగ్లమంత్రుల నొక్కవలయు - ముసల్మానుల కెల్లర కీవేదన కలదని మీకునుం దెలియు - నేను హిందువనై వారి ముప్పుల నొప్పరికింపఁజాల-వారిదిగులు హిందువులకుం దిగుల-ముస్లిము రాజ్యము లకుం గల చనవుల న్మనుచుటయు నచటి పుణ్యక్షేత్రముల గౌరవించుటయు, భారతీ యులు వలచు స్వాతంత్ర్యము నొసంగుటయు సామ్రాజ్య శ్రేయమ్మున కత్యం తావశ్యక ములు - నా కాంగ్ల జాతిపట్లం గల గారవము మిక్కుటం బగుట నీలేఖ మీకనుపుచుంటి -నాంగ్లేయులయట్ల భారతీయులుం దమరాచతికమ్మునెడ విశ్వాస మూనునట్లు సేఁత నావాంఛ యని వక్కాణింతు". 53



# 28 మరణశయ్య

క. సైనికయత్నమునం దన,మేనంగల తిమ్మఁదనము మెల్లన జాఱెన్
హాని యెఱింగియు నెక్కుడు,గా నమలితి నపుడు సెనగకాయలపప్పున్. 1

క. అతిసారవ్యాధి సము, ద్గతమయ్యె నసద్దతోడఁ గడపితిఁ గొన్నా
ళ్ళతిరిక్తమయ్యె రోగము, మతి సమ్మతి సేయ దపుడు మం దంటుకొనన్. 2

క. ఈరుగ్ణస్థితి కగపడి, చేరితి నాశ్రమము; నుపవసించితి నొకనాఁ
డేరుపడెఁగొంతతిన్నన, వారక మఱిరెండు సేయవలచితిఁ బస్తుల్. 3

క. అట్టితఱిఁ బబ్బ మెదియో, పుట్టె 'నుపాసంబ కాని బోనము నేఁడున్
ముట్ట, నని సతికిఁ జెప్పితిఁ, గట్టా మఱపించె నన్నుఁ గస్తురి తుదకున్. 4

వ. ఆకాలమం దేను బయస్సు నుజ్జనచేసి బ్రతుకుచుంటిఁ - బాలోకందకాక తజ్జన్యంబులగు నాజ్య తక్రంబులు సైతము నా కపుడు నిషిద్ధంబులు - కాన సర్పిస్సునకు మాఱుగాఁ దైలముంజేర్చి గోధూమభక్ష్య మొండు నాకై యిల్లాలు సిద్ధపరిచె - నా కింపితంబగు మినుపకట్టుం గాఁచె - నాపెకోర్కిం దీర్చుటయు, నాల్కకుం దనివిగూర్చుటయు, నొడలిం గాచుకొంటయు నాకర్తవ్యంబులని తలంచితిఁ - గాని దుర్విధి తఱివేచియుండె - నంత 5

క. ఆపోవుదనుకఁ దింటి న,పూపమ్ములు; జమునికడకుఁ బోయెను లేఖం;
బేపారిన యతిసారము, వే పరువెత్తించె నన్ను వేమఱు వెలికిన్. 6

క. ఈదుర్భరదశలో నడి, యాదునకుం జేరవలసె నర్కక్రోసెఁడు ద
వ్వైదామడగాఁ జని పెం,పేద సబర్మతిని రైలు నెక్కినవాఁడన్. 7

ఆ. దారిలో నహమ్మదాబాదునంచెకు, వచ్చి నన్నుఁ గలిసె వల్లభుండు
కడుపునొవ్వి నన్నుఁ గవ్వించె నప్పుడా, యలఁత నప్పటేలు తెలిసెఁగాని. 8

ఆ. ప్రాణగొడ్డమైన యీనొప్పిచంద మా, వల్లభునకు లాఁతివారలకును
జెప్పనొల్లనైతిఁ జేరితి నడియాదు, ఘట్టమునకుఁ దెగులు మిట్టిపడఁగ. 9

వ. అచటి కే నున్నయనాథాశ్రమము పాదక్రోశముదవ్వునంద కలదు - కాని క్షణక్షణం బెసరేఁగు నొగులునంజేసి యసురుసురై బసం గదిసితి - నా కపుడు మాటిమాటికిం బెరటి కేగవలయునన్న శంక వొడమసాగె - నిఁక నిగ్రహము తగదని రోగమ్ముతెఱఁ గెల్లరకుం దెలిపి మంచమెక్కితి - దొడ్డికిం జనలేక పోయితి-నుల్ల మెంతసిగ్గిల్లుచున్నను గత్యంతరము గానక పురీషపాత్రంబు తెప్పించితి - ఫూల్‌చందు మించువోలెం బేరము దీసి దానిం గొనితెచ్చె - నెచ్చెలి కాఱెల్ల రొల్లంబోయిన మొగంబుల నన్ను బలసిరి -

వీరికి నాదెసంగల యర్మిలి కొలందివెట్టరానిది - కాని వీరు నావేదనం బోఁద్రోలఁ గలరా? - పైపెచ్చు నా నేమమ్ములు కడుంగడు బెట్టిదమ్ములు - వీరియుత్తలపాటుం దనపట్టుదల పెద్దసేయం దొడఁగె - వెజ్జుం దెత్తుమని నెయ్యురు బతిమాల వలదని యే నంటిఁ - జేసినదోసమ్మునకుం గుదుమటయ మందని బోధించితి - నాచందముం గొందలముతో వారు సైరించిరి - తెల్లవాఱులోపల నాకు నలువదిమాఱులు శక్రుదార్తి సంధిల్లె - నంత నోగిరంబు వదలితి - నది వలయునన్నయిచ్ఛయుం దొలఁగె. 10

ఆ. ఇన్నినాళ్లఁ గోలె నినుపముక్కంబోని, దని తలంచుచున్న యస్మదంగ
మకట! మట్టికంటె నధరమై చూచుచుం, జూచుచుండ బల్మిసురిఁగిపోయె. 11

క. నావేదన విని సాయము, గావింపఁగ వెజ్జు 'కానుగా' చనుదెంచెన్.
ద్రావుఁడు మందిచ్చెద నని, వావిరిగా వేఁడెఁ గాని వలదని యంటిన్. 12

వ. అతఁడు సూదిమందుం బ్రయోగింతు నీకొందురా? యనుడు నదియు వర్జనీయంబ యంటి - నేదో రసికయని తప్ప నప్పటి కది యోషధీసార మగుటం గాన - నా యీయెఱుంగమి పరిహాసపాత్రంబ యగు - నిట్లు చికిత్సపట్ల వైముఖ్యముం బూనితిఁ గాని రోగమ్ము నాఁగనేరనైతి - నలయికంజేసి వేఁకికిం జిక్కితి - నది నన్ను సంధిలోని కీడ్చెఁ బదంపడి 13

క. తత్తరపడి మిత్రులు పరు, వెత్తిరి నల్లదకుఁ గీర్తి నెసలారు భిష
క్సత్తములం దెచ్చిరి వా, రెత్తెఱఁగునఁ జక్కఁబఱుతు రీ జగమొండిన్. 14

క. ఏ నిట్లు మరణశయ్యా, ధీనుఁడనై యున్నవార్త తెలిసినయంతన్
మాననిసంతాపముతో, మానినితో వచ్చె ధనికమణి యంబాలాల్. 15

గీ. న న్నతఁ డహమ్మదాబాదునగరిఁ జేర్చి, రమణమునఁ దన యతిథిగేహమున నిల్పి
వేసరక పరిచర్య గావించె నాకుఁ, గాన నీదృక్ష మధుర నిష్కామసేవ. 16

ఆ. అతఁడు తెప్పవాల్ప కస్మదారోగ్యమ్ము వలచి యెంతయెంత నలఁగుచున్న
నాశ్రమోర్వి దెసకు నరిగె మద్దృష్టి కా,దనక పంపె సెట్టి యటకునన్ను. 17

క. అచ్చట మూల్గుచునుండఁగ, వచ్చెన్ జర్మని 'జితోస్మి' వల్కినవార్తల్
నిచ్చలు రణకార్యంబునఁ,జొచ్చిల్లుట వోక శాంతిచొప్పదె నెదకున్. 18

గీ. తొట్టివైద్యమ్ముచేఁ దెగుల్మట్టుపడియెఁ, గాని సత్తువరాదయ్యె మేని; కాప్తు
లపుడు నీకు బయస్సు వర్జ్యమ్ము గాన, మాంసరసమున కీకొంట మంచి దనిరి. 19

ఆ. కోడిగ్రుడ్లు మెక్కఁగూడదా యని మిత్రుఁ, డొక్కడడిగె శాస్త్రమొప్పు ననుచ
నెంద తెంద తెన్నిహితములు సెప్పిన, మెచ్చనైతి నెఱచి మ్రింగనైతి. 20

వ. ఆయుర్వేదాదిశాస్త్రములంబట్టి యేను భోజ్యాభోజ్యనిశ్చయంబు గావింపనొల్ల – నాతిండి నామనుగడవోలె నాయిచ్ఛ ననుసరించియుండు – నదియు నిదియుం దిని జీవింపఁ దగు నన్న దురాశ నాకెన్నఁడుం బొడమదాయె – నాయాలుబిడ్డల కే నేర్పరించిన పాడి నాపట్లం జెల్లదని యెట్లు తలంతు – నయ్యది యట్లుండె. 21

గీ. ఇంత బెడిదంపుఁదెగులున కేను మున్ను, పట్టుపడనైతి నేఁటియీచెట్ట నాదు
ధర్మనిష్ఠఁ బరీక్షింపఁ దలఁచి వలచి, వచ్చిన యలభ్యయోగమ్ము వలెఁ బొసంగె. 22

క. ఈనొవ్వునందు నొకరే,యే నిల జీవించు టరిది యింక ననుకొంటిన్
నానాభయదాకృతిమైఁ గానంబడె మిత్తి నాదుకన్నులయెదుటన్. 23

క. అనసూయను రావించితిఁ, జనుదెంచెఁ బటేలు వైద్యసత్తముఁ డేతెం
చెను బరికించెను వెఱపున, మునుఁగం బనిలేదు లేదు ముదుఁగకుఁ డనియెన్. 24

క. అతఁ డెంతదిటము సెప్పిన, బ్రతికెదవని మన్ననమ్ము పల్కుటకోడెన్
గతియించె న్నిశయంతయు, శతపత్రహితుండు పూర్వశైలము నెక్కెన్. 25

క. జీవింతునన్న నమ్మక, మావంతయు నాకు నొదవదయ్యెను గీతా
శ్రీవచనశ్రవణంబునఁ, ద్రోవందగు గడియలన్న త్రోవం బడితిన్. 26

క. కనుబల్మియు నచేవయు, వినుశక్తియు జాఱె బ్రదుకు వెగటుగఁ దోఁచెన్
దనమేనికొఱకు నెయ్యరు, పెనువేసటపడుట నాధి పెరిఁగెను నాకున్. 27

వ. ఏ నివ్విధంబునం జావురాకకై వేచియున్నతఱి భిషఙ్మణి 'తలవల్కు' రొకవింత మానిసిం దోడితెచ్చె – నతఁడు కేల్కరు నాఁజను మహారాష్ట్రుఁడు – వైద్య కలాశాలయం దతఁడు చదువెల్ల నేర్చెఁ – గాని పట్టముం బడయఁడయ్యె – నతని మంచుగడ్డవైద్యమున కే నియ్యకొంటిఁ – దచ్చికిత్స నన్ను మృత్యువునకు దవిష్ఠుఁ గావించె – దాన నామేనికి న్మదికి నించుక తేటవాటిల్లె – మఱియు 28

క. ఆఁకలి రెపరెపలాడెను, నా కించుక నడువఁదగ్గ నలు వేర్పడియెన్
మీ కిపుడు గ్రుడ్లు తోడ్పడుఁ, జేకొనుఁడని వెజ్జు హితముసెప్పఁ దొడంగెన్. 29

ఆ. పాలవోలె గ్రుడ్డు పాపమ్ములేని ప, దార్థ; మంద మెఱచియగుట కల్ల
యెల్లకోశమునకుఁ బిల్లపుట్టదు సుఁడీ, బిడ్డరాని కోడిగ్రుడ్డు గొనుఁడు. 30

వ. నిర్జీవంబులగు డింభములు విపణివీథిం బడయవచ్చు–వానిం దినుట నింద్యము కానేర దని కేల్కరు లెస్సబోధించెఁ – గాని యతనిపల్కున కేను లోపడనైతి – నిపు డున్నబల్మి నాపనులకుం జాలు ననుకొంటి. 31

## 29 రౌలట్టు చట్టము - నాధర్మసంకటము

క. ఆరోగ్య మందుటకు 'మా, ధేరా' నుచితోర్వియని మదీయులు తెల్పన్
మాఱాడక యే నమ్మిహిఁ, జేరితి నొకవార మధివసించితి నచటన్. 1

క. ఆనీరు మంద మగుటం, గానంబడదయ్యె లగ్గు, కదలితి నంతన్
నానొవ్వ దవ్వసేయం, బూనెను శంకరుఁడు మిత్రపుంగవుఁ డర్థిన్. 2

వ. నాఁడతిసారవేగమ్మున మత్పురీషద్వారంబు చేవచెడి గాయపడి మలోత్సర్జనవేళం బెల్లు బాధించుఁ - గాన బోనముం దిన జంకుచుంటి - శంకరలాలపుడు చికిత్సకు 'దలాలుం' బిలిచె - న వ్వైజ్ఞునకుం గలగ్రహణశక్తి కే నబ్బురంపడితి - నతఁడు పాలం గ్రోలకున్న మీమేను చక్కంబడ దనియు లోహపాషాణములకుం జెందిన సూదిమందులుసైత మక్కఱపడు ననియుంబల్కఁ బయస్సు ముట్టంజాల నని యే నంటి - మీశపథస్వరూపం బేమని దలాలు ప్రశ్నించె - "గోమహిషులకు 'ఫూకా' ప్రయోగించి దుగ్ధంబు నోడిగించుట విని దానిం గాదని రోసితి - వెండియుం బాలు మానిసికిఁ దిండికా దని నమ్మితి - నగుటంజేసి పోసనము నాకు వర్జనీయం బయ్యె''నని యేను వక్కాణించితి. 3

ఆ. మేఁకపాలు ద్రావ మేకొనినం బాప, మేమిపుట్టు ననియె నింతి యపుడు
చాలుఁజాలు మీ కజాక్షీరమని దలా, లందుకొనియె నాపెయన్నమాట. 4

క. ఏ నపుడు మెత్తఁబాఱితి, మానని సత్యాగ్రహోభిమానముకతనన్
మేనిపయిఁ దీపిగొంటిని, బూనినసమయంబు వీటిఁబుచ్చితి నంతన్. 5

క. శపనాక్షరములు మనిచితి,శపథాత్మం జంపుకొంటి జనునకు దుగ్ధం
బెపుడును సహజాన్నము గా, దపనేయమ యన్నబుద్ధి యదఁగనినాకున్. 6

ఆ. మేఁకపాలు సైత మేకరణింబాన, పాత్రమగును? ధర్మపథమునెల్ల
నెఱిఁగినట్టివాఁడనే యయ్యు నీనాఁడు, జాతినాఁడ బాస మీఱినాఁడ. 7

క. సత్యార్చకుఁ డిబ్బంగిని, సత్యాగ్రహసంగర ప్రచాలనదీక్షన్
మృత్యువును ద్రోయవలె ననె,సత్యమునకు మచ్చదెచ్చుసాహస మూనెన్. 8

క. ఈపుండు నింతదనుకన్, మాపుట కే నోపనైతి మాపును రేపున్.
దాపమ్మునఁబడి క్రోలుదుఁ, బాపం బనుకొంచు మేఁకపాలం గదరే! 9

వ. ఐనను బ్రజకుం బరిచర్య గావింపవలయు నన్న మహాసూక్ష్మమగు వలపు నన్నుం బాయకున్నయది - యహింసాదృష్టిమైఁ గావించు ఖాద్యాఖాద్యపరీక్ష నా కామోద వినోదములం గూర్చు - నీచూపునం జూడ నజాక్షీరంబు నా కలమట నీఁజాలదు -

కాని సత్యదృష్టిం దిలకింప నార్తి నాపాదించు - నహింసకంటె సత్యంబ నా కెక్కు డెఱుకపడు నని తోచెడిని - సత్యముం బాసిననాఁ డహింసాబంధము నూడ్వ నేరఁ - గావించిన బాసయందలి శబ్దార్థ భావార్థముల నాదరించుటయె సత్యవ్రతంబు నాఁ జను - నిపుడేను భావార్థముం ద్రోసివైచితి - నిది సర్వదా మనశ్శల్యమై నన్నుఁ గాఱియపెట్టు చుండెడిని - మఱియు. 10

గీ. పాలుత్రావుట కే నిష్టపడిన వెన్క, వైద్యుడు దలాలు మన్మలద్వారసీమఁ
జలిపె శస్త్రచికిత్స నవ్వలనిపీడ, యవ్వలఁ దొలంగ నడయాడునలవు గంటి. 11

సీ. పదపడి పత్రికల్ పరియింపసాగిన, నాకంటఁ బడెనొకనాఁడు రౌల
టుపసంఘు మిచ్చినయపకృష్టనిర్ణయం; బది భారతీయప్రజాళినోరు
గట్టి జన్మస్వామ్యఘాతుకమై ధర్మ, దూరమై ఘోరమై పౌరగౌర
వాపహమై యుంట నదలితిఁ బోరికై, యంతసాయము సేయ నింతపెద్ద
గీ. కట్నము నొసంగిరా యధికారు లనుచు, వెల్లఁబాఱితి శంకరవల్లభాదు
లేమికర్తవ్యమనుడుఁ దీర్పిది ప్రభుత్వ, శాసనమయైన మాఱొడ్డఁజను నటంటి. 12

క. పదుగుం డనుచరు లబ్బినఁ, గదనము సాగింత మేను గదలన్ మెదలన్
జదురుండను గామి నుల్లం, బదవదపడుచున్న దన్నలా! యని యంటిన్. 13

వ. ఈ విచారఫలంబుగా నస్మన్మిత్రులం బిలిచి యొకగోష్ఠి గూర్చితి - హార్నిమన్ సరోజినీ దేవిమున్నగువా రిరువం డ్రాసభకు వచ్చిరి - దానం బ్రమాణపత్రము రచితం బాయె - నం దెల్లవారు వ్రాలుగావించిరి - నాఁటి రాజకీయసంస్థలు సత్యాగ్రహముం బోని నూతనాస్త్రముం బూనిక దుర్లభంబని భావించి సత్యాగ్రహసభ నా నొకసమితి నెలకొల్పితి - బొంబాయివారి దెక్కు డగుటంజేసి దీనికార్యస్థానంబు నన్నగరంబునంద యునిచితిఁ బలువురీప్రతినపై సంతకము చేయందొడఁగిరి - దీనిమనుగడ న్వెనువెంటన వెల్వరించు పత్రిక లవతరింపసాగె - నెల్ల తావులం దీసభ లావిర్భవించె - నిది ఖేదాసమరమున్ గుర్తునకుఁ దెచ్చె - నీసమితి కేన పెద్దనైతి - నిందలిసభ్యులు కొంద ఱిందు గుజ్జరిబాస వల దనిరి - సత్యాహింసలు తగవనిరి - కాని పెక్కండ్రు నా తెలుగు నీకొనుటంజేసి యే నాసమైఁ బని కొగ్గినవాఁడనైతి. 14



# 30 అద్భుతమగు హరతాళము

క. రౌలటుసమితి నివేదన, మాలరి యని యేము చాటునవసరమున భూ
పాలకవర్గమువా రిది, మేలిది యని పొగడ నుద్యమించిరి దెసలన్. 1

గీ. దీని నొకశాసనంబుగాఁ దీర్చి వెల్ల,డించి రధికారు లిందలి మంచిచెడ్డ
లరయునాఁ డేను హస్తిన కరిగి కేంద్ర, శాసనసమజ్యఁ గూర్చుంటి సాక్షివోలె. 2

క. ఈచట్టము నింద్యం బని, నీచం బని శాస్త్రినిలిచి నిప్పులుచెరిగెన్
లోచనములు వాల్పక ధీ, వాచస్పతి యతనిధాటి వైస్రాయి కనెన్. 3

గీ. అతని కావెట్ట సోఁకి ధర్మానురక్తి,వాదము నసుకొంటిఁ గాని నాపడినతలఁపు
రిత్తయైచనెఁ దెలిసి నిద్రించునాతఁ, డెన్ని బాకాలు మొరయుఁగా కేలలేచు. 4

క. అంతయు ముగించి పై కీ, తంతున్ జరిపిరి దొరల్; కథాక్రమ మది యా
వంతునఁ దిరపడఁగా ది,గ్దంతులు డీకొనియు నేమిగాంచు ఫలంబున్. 5

క. ఏనును ఢిల్లీశుని గని, నానాధర్మములు వినిచినాఁడను మీ రీ
యానం బటిపిన నితఁ డెదు, రౌనంటిని గాని సర్వమాఱడివోయెన్. 6

వ. ననువంటిద్రాబ యూఁదినబూర యా రాజప్రతినిధిచెవి కెక్కునా? -కానిమ్ము చూతమని నాపని కే నొగ్గితి - నానాఁడు మేనిచేవయెల్లం దొలఁగి యేను బైనంబు సేయ, రచ్చలో నిలువ, నెలుఁగెత్తి పలుక న్వలంతిని గాక మూలుగుచుంటి - నిట్లయ్యుఁ జెన్నపురివారి పిలుపు వాటింపం దెగితి - నాంధ్రపత్రికాపొత్తునంజేసి తెలుఁగు వారిపై నఱవలపై నాకు వలసినంతచనవు కలదు - కాన దక్షిణాపథము నా సొంతయిల్లుగాఁ దోఁచు - నీనమ్మిక కింతదనుక నవగ్రహమ్ము పుట్టదయ్యె - హిందూపత్రికాసంపాదకులు కస్తూరిరంగయ్య గారు నేఁడు నన్నాకారణచేసిరి - వీరి వెనుక రాజగోపాలాచార్యులుం గలరని యవ్వల నెఱింగితి - నాచార్యుల యెఱుకువ నాకపుడ మొదలయ్యె - నయ్యంగారుమున్నగు చెలికాండ్ర కోర్కిపై వారు సేలముం బాసి పాడిపని సాగింప మద్రపురికి నేతెంచిరి - ప్రజాసేవ కదియనుకూల రంగ మని తలంచి-వారియిల్లు నావిడిదల యయ్యె - నది యయ్యం గారిది - కాన నేను గస్తూరివారి వింద ననియ తలంచితిఁ - గాని దేశాయి నా ప్రమాదముఁ దప్పించె-నాచార్యు లావేళ నాకు దవ్వుల నుండువారు - కాని మహా దేవుఁడమ్మేటిం బరికించితత్పరిచితిం బడయఁదగు నని నా కెఱింగించె-నంత 7

గీ. రాజగోపాలు నెఱుఁగ నారడముపడితి, మదినిగల శంక లీమేటియెదుట నిడితి
నెల్లి రౌలటుచట్టంబు వెల్లివిరియ, శాంతిమై దాని నెట్లోర్వఁజను నటంటి. 8

ఆ. త్రోసివేయఁదగిన శాసనముల్ మఱి, యేవి యేవియంటి నింతలోన
రంగబుధునిపిల్పునం గూడి రాసీమఁ, బేరుగన్న పెద్దపెద్దలెల్ల. 9

గీ. ఉత్తమజ్ఞానరాశి నా నొప్పు విజయ, రాఘవాచార్యు లాసభారంగమునకు
వన్నెదెచ్చిరి వాదంబు లెన్నియేని, నడిచినవి శేముషీపిశునమ్ము లందు. 10

గీ. అన్న! సత్యాగ్రహస్రష్ట వైననీవు, దాని చిన పెద్ద నేమముల్ త్రచ్చిత్రచ్చి
విపులతరలక్షణంబు గావింపు మనుచు, రాఘవులు కోరి రత్యాదరమున నన్ను. 11

వ. అది నాచదురునకు మించినపని కదా! యని యేను విన్నవించితి – మాచర్చలిట్లుండ రౌలటుశాసనము సమగ్రమై యేలుబడి వారిపత్రికం బ్రకటిత మాయె – దానిం గన్నరేయి నుల్లంబు కలఁగి నా కరనిద్దురయ లభించె – నం దీచట్టముం బ్రతిఘటింప హరతాళముం బ్రకాశపఱుపవలయు నన్నకలవచ్చె తఱువాత నీగాథ రాజగోపాలా చార్యుల కెఱిఁగించితి – వెండియు సత్యాగ్రహంబు నా ధర్మ సమరంబు దాని నాత్మ నైర్మల్యంబుతో మొదలిడుట లగ్గు – హృదయశుద్ధికిం బస్తు మూలంబు – కాన భారతీయు లందఱుం దమనిత్యకృత్యంబులఁ గట్టిపెట్టి యొకనాఁడుపవస్తముం బూన వలయుం – నిందు దేశంబెల్ల నెట్లున్నను బొంబాయి మద్రాసు బిహారు సింధురాష్ట్రములు కామక పాల్గొను నని విశ్వసింతు – ననవుడు నాచార్యు లగు ననిరి – వారి మిత్రులు సైతము దీని కంగీకరించిరి – పదంపడి వేయితొమ్మన్నూట పందొమ్మిదవయేఁటియే ప్రియలు నాఱవదినంబు హరతాళంబునకు నేమించి లోకమునకుం జాటితి – మొదట నిది మార్చిముప్పదియవనాఁటి కని ప్రకటించి కారణాతంరముల నవ్వలికి మార్చితి. 12

క. ఓహో! భారతమునయం, దీ హరతాలంబు వెలసె నింటింట నెవం
దూహింపఁగల్గెము న్నీ,మోహర మిటు దర్శనీయముగ నగు నంచున్. 13



# 31 ఆరోజులు–1

క. ఇంచుక దక్షిణభారత, సంచారము నిర్వహించి శంకరలా ల
ర్థించుట హరతాళము సా, గించుటకుం జనితి బెండగిలి బొంబయికిన్. 1

వ. గడువుం దిద్దుట తెలియమింజేసి మార్చిముప్పదియవనాఁటన కార్యక్రమం బిది ఢిల్లీ నగరంబునఁ బూర్తియయ్యె – నవ్వీట నజమల్ఖాను శ్రద్ధానందులపల్కుం బ్రజలు పూలదండంబోలెఁ దలఁదాల్తురు – వా రెన్నఁడే నిట్టిహరతాళ మొనరింపరైరి – మఱియు నప్పురము 2

క. హిందువులు ముసల్మానులు, నందఱు నేకీభవించి రప్పుడు శ్రద్ధా
నందుని జుమామసీదున, కుందోడ్కొని చని తురుష్కకోవిదవర్యుల్. 3

క. ఆసంయమిచేత నుప, న్యాసము చేయించి రచటి యధికారులకీ
యాసత్తిని గనినంతన, యీసేర్పడె ధర్మదృష్టియెల్ల నశించెన్. 4

క. మెరవడివోయెడి ప్రజపైఁ, గఱకరులై పెక్కుగుండ్లు కాల్చిరి పౌరుల్
మరణించిరి కొందఱు కొం, దఱమేనులు గాయపడియె దయనీయముగన్. 5

క. రావలయు న్వెనువెంటన, యీ వని యతిరాజు తంతినిచ్చెను దనకున్
మీవాఁడను బొంబయిపని, కావల నేతెంతు సైఁపుఁడని యే నంటిన్. 6

వ. ఢిల్లీయల్లరివంటిద లాహోరునం దమృతసరమునంబొటమరించెఁ-గిచలూ సత్యపాలురు వేవేగ నమృతసరముం జేరుఁడని నాకు వార్త నంపిరి - హస్తినకు వచ్చినతతి మిమ్ము దర్శింతునని వారి కెఱుకచేసితి - నింతలో సుముహూర్తంబు దాసె - నసంఖ్యాకులు బొంబాయిపౌరు లాదినంబున 7

క. రేపాడి నిద్రమేల్కొని, చౌపాటికిఁ జేరి సింధుజలమున స్నాన
వ్యాపారము దీరిచి దీ, క్షాపరవశులై సవిత్రిగానోద్యతులై. 8

గీ. వచ్చుచుండిరి రాకురుద్వారమునకు, నెలఁతలున్ ముస్లిములు నందుఁగలరు పెక్కు
రొకమసీదున భాషింపుడో యటంచు, ననుముసల్మాను లర్థించినారు నాఁడు. 9

వ. ఏనును సరోజినీదేవియు నందు మాటాడినవెన్క విరలదాసజేరాజణి యాప్రజయెల్ల మాతృసేవపట్ల హిందూమహమ్మదీయమైత్రిపట్ల బాసగావించునట్లు సేయుండని నన్నుఁ గోరెనంత కక్కుఱితిపడి శపథంబు సేయింప నాకిచ్చవొడమదయ్యెఁ-గావుటంజేసి. 10

గీ. లోఁతు లెఱుంగక ప్రతినలు, సేఁతం గొఱయేమి బాసచేసినవా రా
రీతిం దప్పక నిలవలె, నేతీఱమి యైన మిత్తి యెత్తి కసరినన్. 11

క. ఈచందపు శపథమ్మును, సైఁచుట కీకొన్నవారు చౌపాటికడన్
వేచి నిలందగు నెల్లి స, మీచీనాచారతర్షమేదురబుద్ధుల్. 12

వ. అని జేరాజణికిం దెలిపితి - నంత నగరంబున హరతాళ మద్వితీయంబుగా సాగె - నపు దుప్పుచట్టమును ధిక్కరించితిమి - నిషిద్ధగ్రంథముల ముద్రించి విక్రయించితిమి - వీన హిందూస్వరాజ్యము సర్వోదయము నాఁ దనరు నారచనములుం గలవు - స్వయంసేవకు లీకృతుల నమ్మందొడఁగిరి - యేనును సరోజినీదేవియుసైత మిప్పనికిం బూనితిమి - వెనువెంటన ముద్రితగ్రంథములెల్ల విలువంబడె - వెల నాల్గణా లైనను

బదులు పాతిక లిచ్చి ప్రజ లాపుస్తకములం గొనిరి – వచ్చిన ధన మీసమరంబునకు వెచ్చంపడె – మఱియు 13

క. ఈపొత్తములం గొనువా, రోపవలెన్ రేపుబంది నుంటకు నంటిన్
లోపించెను బ్రజ కాభయ, మూఁపది పోనాడె నెట్టియొప్పమి నైనన్. 14

క. మఱునాఁడు ప్రతిజ్ఞలకై, జరిగినసభ కలఁతి యలఁతి జన మేతెంచెన్
బరమార్థ మెఱిఁగె విర్గలు, వెఱఁగున్ వెనుఁబాటు సంభవింపదు నాకున్. 15

వ. ఉద్రేకజనకంబు లగుకేకలదెసం గాక లోకమున కుపకరించుపనులపట్లఁ బ్రజ కుత్సాహమ్ము లేమి యే నెన్నఁడో కంటిఁ–గాన నాఁ దరుదెంచిన పది పంద్రెండుమందిని గని యుస్సురనక ప్రతినతెఱఁగెల్లవారికి వివరించితి – నాఁటి నిశయంద నేను బాంచాలమునకు బెండగిల్లితి – నెనిమిదవతేదినాఁడు మధురాఘట్టంబున ధూమశకటంబు నిల్చె – నపుడు గిద్వాని నన్నుం గదిసి 16

క. అన్నా! యేల్బడివారలు, నిన్నిపుడే నిల్వరింత నిశ్చిత మాయెన్
నన్ను నియమింపుఁ దక్కఱ, యున్నపనుల్ నిర్వహింతు నోదక యనియెన్. 17

క. ఆతనికిన్ దఱివచ్చిన, చూతములెమ్మంటి ముందుచోటికి శకటం
బేతేరఁ దొడఁగె నన్మ, చ్చేతము భావ్యర్థచింతచే నలయంగన్. 18

క. 'పలవల్' ఘట్టము దవుద, వ్వల నుండఁగ నన్నుఁగదిసెఁ బోలిసువాఁడే
నలవడియె ముహూర్తం బని, యెలమిం గనుచుండ నాతఁడిదె నుత్తరువున్. 19

క. "పాంచాలమునకు మీ రే,తెంచుట కే మిపుదు సమ్మతింప మశాంతిం
బెంచును భవత్ప్రవేశము, సంచలితస్వాంత మచటిజన మీవేళన్" 20

వ. ఇట్టియానతి నతం డొసఁగి దిగ్గుందన నమృతసరమ్మున కే నల్లరిం బెంప నేగు వాఁడం గాను – దాని నడఁగింపన చనుచుంటి – నచటిప్రజానాయకు లిప్పనికి నన్నాకారణచేసిరి – కాన మీపనుపుం బాటింపఁజాల – నని యే నాడితి – నింతలో నంచె సమీపించె – నావెంట వచ్చుమహాదేవునకు వలయుమాటలు సెప్పితి – నోరిమిం బాయఁజన దంటి – నంత నధికారులు పలవల్ఘట్టమున నన్ను డింపి బొంబాయిదెసకు మరలించిరి – నావెంట నొకయుద్యోగి వచ్చి మెరీన్ లైన్సు కడ నన్ను విడిచి యిఁక మీకు విముక్తి యనియె – నేను రేవాశంకరునిల్లు చేరితి – నచ్చెలికాఁడు. 21

క. అన్నా! నినుఁ బట్టినకథ, విన్నంతన వీటఁ గినుక విజ్జెఁ బ్రజాసం
పన్నమగు పాయధుని కడఁ, బెన్నల్లరి సాగునన్న భీతి జనించున్. 22

క. ఆగందరగోళము గని,సాగిరి పోలీసు లటకు సన్నలు పెద్దల్;
సాగరమువోలె నగరం, బీగడియన్ గుబ్బటిల్లు నే మేర్పడునో. 23

క. అని పల్కువేళ సోదరి, యనసూయాదేవి వచ్చె నత్తర మదరన్
జనతను నిల్పుట దుశ్శక, మనంత మది మిమ్ముఁ జూడ కావో దనియెన్. 24

క. తడ వోర్వరాని దని యే, వెడలితి నన్గన్నయంత వెల్లువపోలెన్
గడుకొనెఁ బౌరులసంతస, మడరె జయధ్వనులు భువియు నభ్రము నద్రువన్. 25

క. రాహుత్తు లపుడు రాఁ బ్రజ, లోహట మిసుమంత లేక యుగ్రశిలాసం
దోహమున వారి ముంచిరి, నాహృదయక్షోణి బ్రెస్సి నలినలి కాఁగన్. 26

క. నిగ్రహము వలయుఁ జన దీ, యాగ్రహ మని చేతులెత్తి యర్థించితి నా
వాగ్రవ మాలింపక సౌ, ధాగ్రంబుల నిలిచి విసరి రక్కట! ఱప్పల్. 27

వ. అంత మెఱవణిం గోటతట్టునకుఁ జనసీక యాశ్వికులు దాని కభిముఖులై లెస్స పెనఁ
గంజాగిరి – వా రెంత యోలాకుపడిన నేమి? – కొలంది సెప్పరాని యాప్రజా ప్రవాహము
వారిం బాయవఱిచి పురోగమింపం దొడఁగె–నపుడు నా కైనను మాటదక్కదని తోఁచెఁ
– బదంపడి రక్షకభటాధికారి 28

క. జనతతి నటునిటు రొప్పఁగఁ, దనవారలఁ బనిచె నంత దయవిడి సాదుల్
మనుజులపైఁ దమయెక్కిన, పెనుమావులఁబఱపి వెఱపుపెంచిరి మూఁకన్. 29

క. శరవేగమున హుమాయులు, పరువెత్తుచునుండెఁ బ్రజకు బరిసెలు తగులన్
దురగఖురహతులపాలై, పరివిగ్నంబై జనమ్ము పతిచెన్ విరిసెన్. 30

క. ఎటు వోవుటకుం దోఁపమిఁ, గటకటఁబడెఁ బ్రజయు నాశ్వికప్రకరంబున్
ద్రుటిలో బీభత్సరసా, ర్భటి రేఁగి పురంబు కదనరంగము నెనసెన్. 31

వ. రాహుత్తులదుండగ మిట్లు పొంపిరివోవుటం గని యేను సైరింపనోడి దానితెఱఁ గెల్ల
వెల్లడింప నున్నతాధికారి కార్యాలయంబున కరిగితి. 32



## 32 ఆరోజులు-2

క. దొరమాలె నెక్కఁదొడఁగితిఁ, గరవాలము బూని సైనికగ్రామణు లా
తెరువునఁ బదపదమునఁ దోఁ, చిరి సమరచ్ఛాయ లెగసి చిందులుత్రొక్కన్. 1

క. అధికారిం గని జరిగిన, కథనెల్ల వెలార్చి పాడిగా దిది యంటిన్
బ్రథమ ప్రయత్న మంతయు, వృథయై యిటు లయ్యెనని 'గ్రిఫి' త్తతఁ డనియెన్. 2

క. ప్రజలు వెనుదీయలే దని, గిజగిజగొనఁ బెన్పటాణిగిట్టలతోడన్
గజిబిజిగాఁ ద్రొక్కింతురె, నిజ మారసి కనుఁ డటంచు నే నపుడంటిన్. 3

వ. అంత నమ్మేటి 'మీరిట్లు నాఁజెల్లదు – మీయుపదేశంబునం జేసి ప్రజ లెట్టిచేఁత లకుం బాల్పడుదు రది మాక లెస్సతెలియు – నేము తొలుతొల్తన మేల్కొన మేని కదుంగడుఁ జేటు వాటిల్లు – నపు డీమూఁక మీ కేనిలోఁగదని యెఱుంగుఁడు – శాస నోల్లంఘనము ప్రజలకుం దేలికపని – కాని శాంతిం బాదుకొల్పుట వీరి కక్కజంబగు చేఁత – మీసిద్ధాంతము లుత్తమంబుల – యైనను లోకంబు వానిమర్మ మెఱుంగఁ జాలదు – దానిప్రకృతియ దానికి నొజ్జ యనవుడు 4

క. మీకఱదల నే నిచ్చుట, నీకొన; లోకమ్ము కోర దెన్నఁడు రణమున్
బ్రాకటశాంతియ నిరతము, నాకాంక్షయొనర్చు నోర్చు నదియని యంటిన్. 5

ఆ. ప్రజలు మీపథమ్ము పాటింపరేని మీ, రపుడొనర్చు టేమి యనె గ్రిఫిత్తు
నాకు నెన్నఁ దట్టినమ్మిక వొదము నా, నాఁడ దురము నిల్పువాఁడ నంటి. 6

వ. అంత నయ్యధికారిపుంగవుఁడు 7

క. మీ రించుక శాంతించిన, భారతదేశంబు నేఁడు పాటించు దురా
చారమ్ములెల్ల c దెలియును, మూరెన్ బెనువెత్తి యిపుడు మూల న్మూలన్. 8

ఆ. అమృతసరమునం దహమ్మదాబాదున, నాఁగరానిసివము రేఁగె నేఁడు
తక్కుతావులందు నిక్కినయాగడ, మెంత కలదొ తెలియ నింతదనుక. 9

క. తెగనతికి రచ్చ టచ్చుట, నెగ పేర్పడఁదంతితీఁగ లీప్రొద్దు పజల్
తగవునఁ బరికింపఁగ నీ,యగడెల్లను యుష్మదీయ మని వాక్రుచ్చెన్. 10

వ. పదంపడి యేను "నాప్రతిభూత్వ మున్నయెడం బొదమినపాపంబు నాతలం దాల్పక మాన – నహమ్మదాబాదునం దవగడము రేఁగెనాఁ దనకు విస్మయ విషాదంబు లుదయించెడి – నమృతసరమ్మున కేను బూఁటవడం జాలఁ – బాంచాల మున కే నెప్పుడుం జన్నవాఁడఁగాను – దత్రత్యులందఱు నా కపరిచితులు – కాని 11

క. ఏలుబడివారు న న్నా, నేలకుఁ జననిచ్చిరేని నిరుపమశాంతిం
బాలించియుందు నచ్చుట, బోలనిపని కొగ్గి, దొరలు పొరపడి రిందున్. 12

క. ననుఁ బట్టుకొన్నవార్తను, వినినంతన జనత రోషవివశం బయ్యెన్
జనునిది చనదిది యను తె,ల్విని గోల్పడి మెచ్చరానివిధమున రెచ్చెన్" 13

క. అని పల్కుదు నతఁ డేవో, వినిపించె నదంగదాయె వేతిమి మాకున్
జనులను గూర్చెదఁదీర్చెద, ననుమతి నిండని గ్రిఫిత్తు నాడితిఁ జనితిన్. 14

క. గొప్పసభ జరిగె వీటన్, జెప్పితిఁ బౌరులకు సత్యశీలురబాటన్
దప్పక శాంతి వహించుట, కొప్పనిచో నన్ను వదలు టొ ప్పని యంటిన్. 15

ఆ. అపుడ వార్తవచ్చె ననసూయ కహమదా, బాదు తప్పుదారి పట్టె ననియు
నచటికూలివార లాగ్రహావిష్టులై, చెట్టచెట్టపనులు చేసి రనియు. 16

క. అనసూయ చెఱంబడె నని, యనృతకథం జాటె నొక్కఁ డానగరమునన్
జను లింక రేఁగిరి మూఁగిరి, తునిమిరి రాహుత్తు నొకని దుష్టాశయులై. 17

వ. ఈ దుర్వార్త విన్నంతన యే నహమ్మదాబాదునకుఁ బరువెత్తితి - విశేషము లెఱింగితి - నడియాదునం బొగబండినిబడగొట్టుజతనమ్ములు నడిచె - వీరమగామునం దొక ప్రభుత్వాధికారి చంపంబడె - సైనికశాసన మానగరంబునం బ్రయుక్త మాయెఁ - బ్రజలు వెఱచఱచిరి - పాపఫలంబు వడ్డితోఁబడసిరి - నే నధికారి చెంతకుం జనితి - నతఁడు 18

క. కస్సుమని బుస్సుమని య,ర్చిస్సులు వెలలింపఁ బ్రజలుచేసిన యవమా
గస్సునకు నుస్సురని యే, లెస్స నిదానించి మూదలించితిఁ దగవున్. 19

క. దారుణసైనికశాసన, మోరువ రీప్రజలు దాని నుడిఁగింపుఁడు నా
నేరిమి నియ్యెడ శాంతిం, గూరుతు నొకసభకు నియ్యకొనుఁడా యంటిన్. 20

ఆ. అతఁడు సమ్మతింప నాశ్రమక్షోణికిఁ, బిలిచినాఁడఁ బిన్నపెద్దవాంద్ర
జంకులేక వారు సల్పినదోసమ్ము, లేర్పరించినాఁడ నోర్పుతోడ. 21

క. ఇన్నాళ్ళఁగోలె నెవ్వరి, యున్నతి నర్థించి యలఁత నొందితి వారల్
మన్నింపరాని దారికిఁ, జన్నారని సిగ్గుపడితి జాలింబడితిన్. 22

క. నావా రొనర్చుతప్పున, నావంతు న్గలదటన్న నాయము గంటిన్
భావించితి నీమైలకు, మోవందగు నిల్లిప్రేఁగు మూనా ళ్ళనుచున్. 23

వ. ఒక్కనాఁడు మీరుం బస్తు పాటింపుఁడని ప్రజలం గోరితిఁ - జేసినపాపంబు నంగీక రింపుఁడని కర్తలకుం దెలిపితి - నేరముల మన్నింపుఁడని రాచరికమువారి వేఁడితి- నమ్మఱుసటినాఁడ సైనికశాసన ముపసంహృతంబాయె-నంతఁ బురప్రముఖులు కొంద తేతెంచి సత్యాగ్రహము నాఁపందగునని నన్నర్థింప లోకమున కహింస వసపోవనంతవట్టు దానిం బ్రయోగింపమి లగ్గని యేన తేల్చుకొంటి నంటి - నా పల్కు వారి నలరించెఁ గాని కొందఱునెయ్యుర కసంతృప్తి గూర్చె - సత్యాగ్రహమున కహింస యనివార్యంబగు నియమ మైననాఁడు సమష్టిశాసనోల్లంఘనము కొనసాగనేరదని వీరివాదంబు - కాని నాయనుచరులై నన్ను నమ్మించినవారుసైత మహింస నాదరింపరేని సత్యాగ్రహము నెట్లు సాగింతు? 24

# 33 కొండంత తప్పు

గీ. అహమదాబాదుపని పూర్తియైనయంతఁ, జేరుకొన్నాఁడ నడియాదుసీమ కపుడు
కంటి నందందు సాగినకఱుకుఁజేఁత, లుల్ల ముడికిల్లి పఱియలై తల్లడిల్ల. 1

ఆ. అదను రాకముంద మది పరిపక్వంబు, కాకముంద పశుత పోకముంద
యేలువారిముదల నెదరింపుమని ప్రజ, కానవెట్టి దోషి నైతి నేను. 2

వ. నాయొనర్చిన యీదోషము సామాన్యము కాదనియు నది కొండంత తప్పనియు నిచట లెస్స యెఱింగి – సభలో దాని నంగీకరించితి – నిట్లియ్యకోలు పరిహాస పాత్రంబ – కాని నాకిది పశ్చాత్తాపము గల్గింపదయ్యె– నేనికంబోని పెఱలదోస మావంతయనియు నావంబోని మననేరము కొండంత యనియుం గనఁగల్గిననాఁడ మనము సత్యాగ్రహుల మని చెప్పనోర్తు – హిమాద్రివంటి యీనాప్రమాద మెట్టిదో పరికింతము – చట్టముం ద్రోయవలచువాఁడు దానిదెస హృదయపూర్వక వినయముం జూపఁదగు – నంగీకృతిం బ్రకటింపవలయుఁ – బ్రాయికంబుగా మనము దండమునకు వెఱచి శాసనము ననుసరింతు – మది ప్రధానముగా నీతికిం జెందియుండ – దెట్లందురేని చట్ట ముండుఁ గాక లేకపోవుఁగాక సజ్జనుండెవఁడును ద్రుచ్చిమి కొగ్గఁడు – ద్రొక్కుడుబండి కంధకారమ్మున దివ్య వలయునన్న యాన నాతండ మీఱు – మీఱితిఁగదా యని వగవంబోఁడు – నీ వీనేమముం బాటింపుమని యెవఁడేని హితమ్ము వల్క నెంతసాధువేని తన్నియమంబు వాలింపఁడు – కాని యిట్టికట్టడ యేర్పడ్డ నాఁడు దాని నుల్లంఘించిన శిక్షయొదవు నన్న వెఱ తోఁచునేని వాఁ డాశిక్షం బడయమికి మాత్రమ బండికి దీవియం గట్టు – నీ నియమానుసరణంబునకు శిక్షాభయంబ హేతువు – కాని సత్యాగ్రహి సమాజమునకుంజెందిన యెల్ల యాజ్ఞల నెఱింగి వాని మన్నించుట తన కృత్యంబని యిచ్ఛమై నాదరించు – నిట్టివానికిఁ జట్టములబాగోగు లెఱుంగునేర్పు చేకూరు – నపుడ వానికిం గొన్ని యెడల శాసనం బతిక్రమింపఁ దగుపెత్తనము లభించు– నీ చనవు రాకముంద చట్టముం దాఁటుఁడని యే నంటి – నిదియ నాయొనర్చినతప్పు– నాదృష్టి కిది కొండంతగాఁ గన్పట్టె – ఖేదామండలమునం దదుగుమోపినంతన ముందటి సత్యాగ్రహమునం గలదోసమెల్ల నాబుద్ధికిం దగిలె – నింత తెల్లమైయున్న యీలోపంబు నెట్లువిస్మరించితినో యని వగచితిఁ – గావున 3

క. ఎల్లరుఁ దలపడి చట్టము, నుల్లంఘించుటకు మున్ను యుక్తపథంబుల్
తెల్లమొనరించి వారల, యుల్లము సవరించువర్గ మొక్కటివలయున్. 4

క. సత్యాగ్రహలక్షణముల, నత్యర్థ మెఱింగి యుండనగు నిది; ప్రజకున్
నిత్యము సుగతిం జూపుచు, నుత్యంబగు సేవఁజేయ నూల్కొనవలయున్. 5

గీ. అని తలంచుచు బొంబాయి కపుడుచేరి, చెచ్చెరం గూర్చితిని స్వయంసేవలకులను
శాంతిరణధర్మమర్మముల్ చక్క నుడువ, బయలుపఱిచితిఁ జినచిన్నపత్రికలను. 6

క. ఏ నిట్లు పెనఁగులాడితిఁ, గాని జనాసక్తి యిందుఁ గనఁబడదాయెన్
సైనికసంఖ్యయు నదిరా! నానాఁటికిఁ దీసికట్టు నా సన్నగిలెన్. 7



## 34 నవజీవన్ - యంగిండియా

క. నాశక్తి ధారవోయుచు, దేశంబున శాంతినింపఁ దివిరెడితఱి వ
క్రాశయులై ప్రజలన్ ధర,ణీశులు దండింపసాగి రెగ పేర్పడఁగన్. 1

క. బెడిదం బిది పంజాబునఁ, గుడియెడమల రేఁగె నాయకులు చెఱసాలం
బడి రిఁక సైనికశాసన, మదరెన్ సరిక్రొత్తకోర్టు లట నట వెలసెన్. 2

క. నిందితునిపల్కుతో నతఁ, దండించినసాక్షి యిచ్చునాధారముతో
నిందుఁ బనిలేదు తీర్పరి,నంది యనన్ నంది పంది నాఁబంది యగున్. 3

క. పొట్టలతోఁ బ్రాఁకించిరి, కట్టిఁడి సైనికులు వెలఁదుకల మగవాంఢ్రన్
గట్టా! యమృతసరమ్మునఁ, బుట్టినదుండగము సెప్పఁబో లజ్జయగున్. 4

క. జలియన్‌వాలాబాగునఁ, జెల రేఁగినహింస నెల్లసీమలు తెగడెన్
దులగా దది యాహింసకుఁ, దలఁగెఁ బ్రజామాన మిచట దైత్యులకతనన్. 5

ఆ. మిన్ను మీఁదఁబడిన వెన్నిక రమ్ము పాం, చాలమునకు జంపు సలుపఁబోకు
మన్నవార్త నాకు నంద ఢిల్లీపతి, యాజ్ఞ కపుడ కమ్మ నంపినాఁడ. 6

ఆ. రిత్తవోయె నాదునుత్తర మావెన్కఁ, దంతినిడితి నదియు నంతెయయ్యె
నేమిసేఁత వలయు నిపుడని యెంతేని, గలఁగినాఁడఁ బెద్ద నలఁగినాఁడ. 7

వ. సరకారువారియానతి లేక పాంచాలమం దడుగుమోపుటంజేసి శాసనోల్లంఘన మొనర్చితి
నన్న తృప్తితక్క నా కొండుమే లెద్దియుం గూరదు - నేఁ దానేల శాంతికి మొగమువాచి
యుండె - నచటి యధికారులకు నాదిర్వానడవడి యొజ్జబంతియయ్యె - నిట్టితఱి
నేను జట్టముంద్రోయుట చిచ్చులో నేయివోఁతయగుఁ - గాన 8

క. చెలు లెంతవేఁడుకొన్నను, బొల మది చేరంగలేక పొక్కునఁ బడితిన్
బలుమఱు వినఁబడు నచ్చటి,కొల నారసి పండ్లు కొఱికికొనుచుంటి నిటన్. 9

వ. అయ్యవసరంబున 10

ఆ. ఏనిపల్కుచేవఁ గ్రానికల్‌పత్రిక, కద్వితీయగరిమ మావహిల్లె
నిచ్చసేయు నోర్మి నిచ్చలు నేఁడు స, త్యాగ్రహంబు నిల్పుమనియె నెతఁడు. 11

క. ఆశాంతికాముకుని సుజ, నాశాస్య చరిత్రు మిత్రు హార్నిమనున్ బ్ర
ధ్వీశులు నిర్బంధించిరి, దేశాంతరమునకుఁ బంపఁ దెగఁబడి రకటా! 12

క. ఆపిమ్మట నాతనిపని, నాపైఁ బడెఁ గాని యేను నలఁగకమున్నే
భూపాలురు తత్పత్రిక, నాఁపిరి చీఁకట్లుపెరిఁగె నవ్విషయమునన్. 13

వ. క్రానికల్‌సంచాలకు లగు సుమర్ సోబానీ శంకరలాల్ బాంకరులపాల యంగిండియా యను వారపత్రిక యొండు కలదు – దానిం బరిగ్రహించి ప్రకటింప నన్నానెయ్యు రర్థించిరి – క్రానికలు లేమింజేసి వారమునం దది రెండువిడుతలు వెదలించుట లెస్స యనిరి – వారితలఁపు నాకుం దృష్టి నొదవించె – యంగిండియాను జేకొంటి – నది యింగ్లీషునం బొడము – దానిం జదువుట గ్రామీణులకు నందనిపని – నాకుం బ్రధానమైన కార్యరంగము ఘూర్జరభూమి – యచటివారికి నాబాట లెఱిఁగింప గుజ్జరి వలయు – నిందులా లవు డీబాస నొకమాసపత్రికం బ్రచురించు – నదియ నవజీవను – నా కదియు నర్పితంబాయె – దానిని వారపత్రికం జేసితి – నింతలోఁ గ్రానిక లాఁకం బాసె – యంగిండియా మరల వారపత్రిక యయ్యె – నవజీవనహమ్మదాబాదు నుండి వెడలునది – కాన యంగిడియానుసైత మచటికి మార్చితి – నచ్చుఁగూటమును గొంటి – నిది లేని పత్రికపెక్కు చిక్కులం బడు – నీరెంటి నాదరువుగాఁ గొని యోపినంత వట్టు సత్యాగ్రహధర్మముం బ్రజకు నేర్ప సాగితి. 14

క. పత్రికలివి లోకాదర, పాత్రములై నడువ శాంతిఁ బడసితి; వీనన్
మాత్రలకుఁ బాత్రలకు నే, మాత్రయుఁ జో టీక మేలిమార్గము గొంటిన్. 15



# 35 పంజాబులో

క. నారాష్ట్రమునం దియ్యెడ, మూరినచెట్టలకు నీవమూలం బని నన్
దూఱెను మైకేలొడయరు, నోరుండిన నెట్టులైన నుడువఁగవచ్చున్. 1

క. సైనికశాసనమునఁ బడి, నానాహైన్యములు మోసి నలిఁగెడి మా యీ
దీనత నీ విడుభిక్షమ, నా నోదర యమృతసరమునం గల యువలున్. 2

గీ. ఈవు సత్యాగ్రహము నాఁగవేని దయ్య, రట్లు మముఁగాల్చువాఁడుకాఁ దనిరి కొంద
ఱిపుడు పంజాబునకు వత్తువేని నిన్ను, హతుని గావింతు రని కొంద ఱనిరి కినుక. 3

ఆ. దాసు మోతిలాలు తైయబు జయకరు, మదనమోహనుండు మతియుఁ దాను
సభ్యులైతి ముల్ల సమితిని వెవ్వేఖ, కదలు గంటి మార్తగాథ లెఱుఁగ. 14

ఆ. పూర్వరంగమెల్లఁ బూర్తిగావించుట, కేన వెడలువాఁడ నెల్లయెడల
కప్పటియును సాక్ష్య మార్జనచేసితి౽, బెక్కుచోట్ల నలంత లెక్కగొనక. 15

క. నెంజిలి యిది పరికించుచుఁ బంజాబును లెస్సయెఱుఁగు భాగ్యమ్మును గం
టిం జెలియం(ద్రురతోదను, మంజులమగు నెఱక చిక్కి మన్మన మలరెన్. 16

ఆ. యుగయుగాలనెయ్య మొండొరులకుఁ బాదు, నిలిచియున్నయట్ల పొలిచెఁ దృష్టి
చన్నచోటికెల్లఁ జానలు న న్నాద,రింపవచ్చి రపుడు గుంపు లగుచు. 17

క. ఉడుగరగాఁ దమకదురున, వడికిన విచ్చల సొసంగి వనితలు నన్నుం
గదు మెప్పించిరి వారల, పుడమిన్ ఖద్దరు పెరుంగుఁబో యనుకొంటిన్. 18

క. పల్లీ పత్తనముల సం, ధిల్లినకదగండ్ల నరయఁ దివిరినకొలఁదిన్
దెల్లమియయ్యే దొరల్ పెను, వల్లడి పుట్టించి (ప్రజల వాడ్చి రటంచున్. 19

క. నాదిర్షాదొరతనమున, కీదొరతనమునకు వేర్మి యే మనుకొంటిన్
ఖేదించితి సిగ్గిల్లితి, నాదేశం బింతయడఁగెనా యనుకొంటిన్. 20

క. పాంచాల మెల్లసీమల, మించెను బాలించువారిమే లెంచునెడన్
గొంచక రణభూముల క,ర్పించె నసంఖ్యాత యోద్ధృవీరచ్ఛటలన్. 21

క. ఏతాదృక్షము దేశము, నీతెఱఁగునఁ బరిభవించి రేల్బడివా రీ
చేంతకు నాఁడున్ నేఁడును, హేతువు గనలేక విస్మయించెద మివులన్. 22

క. అత్తతి నేము గడించిన, వృత్తాంతమునెల్ల నుచితవిధిఁ దీర్చి నెఱా
పొత్త మొనర్చితి దబ్బఱ, పొ త్తిసుమంతేని రాని పోకదతోదన్. 23

ఆ. కాంచవలయు దానిఁ బాంచాలమునకుఁ జే,కుతినహింస నెఱుఁగఁ గోరువార
లతిశయోక్తిలేని కృతియిది యిందలి, మాటమాటకుం (బమాణ మిడితి. 24

వ. సేకరించినవాఙ్మూలములు వానిభాగములుం గాక మాసొంతకైత యిందు లేదని చెప్ప
నోర్తు – సంశయాస్పదమగు సాక్ష్య మెద్దియు దీనం జేరదయ్యె – సత్యమ్ము నెట్టయెదుటఁ
జూచుచుం గూర్చినయీ(గ్రంధముం గన్నవా రాంగ్లేయులు తమ యేలుబడిం దిరపఱుచు
కొంట కెంతలేసి రాకాసితనంబులకే నోహటిల్లరని తలం(తు. 25



# 36 బదులునకు బదులా?

క. దయ్యరు పాంచాలంబును, దయ్యించిన తెలుఁగు నరయుటం దలనిడి యే
నయ్యాయి జనపదంబుల, కొయ్యం జనువేళ మిత్రు లూర్జస్వీమణుల్. 1

వ. అసఫాలీప్రభృతులు హస్తినం గూడనున్న హిందూమహమ్మదీయ పరిషత్తునకు నన్నాకారణ చేసిరి-ఖిలాఫత్తుబెడఁదయు, గోరక్షయు నందు విచార్యాంశంబు లనియు, నది సౌరభే యీసమస్యం దీర్పఁదగిన యదననియు న ప్పిలుపునం గలదు - సభకు రాఁజూతుఁ గాని ఖిలాపత్తును, ధేనురక్షణమును జతచేసి యొకదాని కొకటి మాఱుగాఁ జర్చించుట సముచితంబు కాదని యహ్వానసంఘమువారికి మున్ముందు కమ్మ నంపి పదంపడి యేను. 2

క. కరినగరంబున కేగితి, గఱువలు పెక్కండ్రు సభకుఁగా వచ్చిరి స
చ్చరితులు శ్రద్ధానందులు, నరుదెంచిరి మాతృసేవనాధీనమతుల్. 3

ఆ. తొలుత నమ్మనీషితో గవీసంరక్ష,గుఱిచి మనవిచేసికొన్నవాఁడ
నౌను సభకు దీని నవ్వలిదానిఁగాఁ, జేఁత లెస్సయనియె నాతపస్వి. 4

గీ. కొలువునకుఁ దెచ్చియిది పదుగుండ్రచెవిని,వైవు మనియె; హకిమ్‌సాహె బీవు సెప్పు
నుడువు నీకొందు నని నాకు నిడియె బల్మి, వేచితిం బరిషత్సమావేశమునకు. 5

వ. గుణదోషములం బట్టి యీరెండు సమస్యల వెవ్వేఱుగా నరయిక పాడి యని నాతలంపు - ఖిలాఫత్తువాదము ధర్మ్య మైననాఁడు రాచతిఱకంపువా రద్దాని కెగ్గొనిననాఁడు హిందువులు ముస్లిముల కండయై నిల్వ వలయు - నాలం గోయమి దీని కంటింపఁ జనదు - హిందువు లీమాఱుమేలు వలవంగాదు - మఱియు నీ నాఁడు. 6

క. హిందువులార! ఖిలాఫతు, కుందు నివారింపఁ బూనుకొందురయే నా
వుం దినుట విడుతునని ప, ల్కం దగదు మహమ్మదీయగణ మని తలఁతున్. 7

ఆ. ఇరుగుపొరుగువారు హిందువులని వారి,తలఁపుఁ బెద్దసేఁత ధర్మ వనియు
నెఱిఁగి ముసలమాను లీతిండి నిచ్చతోఁ, ద్రోవవలయు మఱచిపోవవలయు. 8

క. ఇది తన కాచర్యం బని,మదిఁ దోచెనయేని ముసలమాను ఖిలాఫ
త్తది చక్కఁబఱుప హైందవుఁ, డొదవినఁ గాకున్న మొదవు నోముట వలయున్. 9

వ. కాన నీసంయుక్తసభవారికి ఖిలాఫత్తుం ద్రచ్చు టొకండ యాచరితవ్య మని నమ్మితి - నాయాశయంబునకు సభాస్తారులెల్లరు నురరీకృతిం జూటిరి - గోసమస్య సదస్సున కెక్కదయ్యెఁ - గాని మౌలానా యబ్దుల్‌బారీ తనప్రసంగంబున ముస్లిముల నుద్దేశించి యిట్లనియె. 10

క. ఓయన్నలార! హైందవు, లీయెడ నెట్లున్న వారియిరుగున నుంటన్
ద్రోయవలె మనము గోవధ, మా యయ్యలచిత్తవృత్తి కనుకూలముగన్. 11

క. ఇట్టిపరిణామ మేర్పడఁ, బట్టి ముసల్మాను లావుపలలముఁ గేలన్
ముట్టక పెన్నొ ట్టిడుకొ, న్న ట్టుండి రొకప్పు డార్యు లభినందింపన్. 12

వ. మఱియు నీఖిలాఫత్తు దుండగమునకుఁ బాంచాలదురంతముల జోడింపఁ దగునని సభాసదులు కొంద ఱూద నద్దాని కే నెదురైతిఁ - బంజాబుసమస్య స్థానిక మగుటంజేసి సమరశాంత్యుత్సవములం బాల్గొనఁదగునా యన్నపాడిం బరికించు తఱి నది మనదృష్టికి రాఁ గాదనియు రణసంధిసూత్రములంబట్టి యవతరించిన ఖిలాఫత్తునకు దానిం జత పఱిచిననాఁ డీసభ్యులు బెడిదంబగు నెఱుంగమికిఁ బూఁట కాఁపు లౌట వలయు ననియు నే నంటి–నావాదమునకుం గొల్వువారిమైకోలు చుల్కం జేపడియె–వెండియు 13

ఆ. హస్తినగరసభకు హజరత్ మొహానియు, వచ్చె నతఁడు తీవ్రవాదనిరతి
నెల్లయెడల నాకు నెదురయ్యె; నిచ్చలు, నట్ల యుండె నతని యరుగుత్రోవ. 14

క. హిందువులు ముసల్మానులు, నందఱుఁ బరదేశవస్త్ర మాదృతిగావిం
పం దగ దనుచర్చ సభా, మందిరమున రా నతండు మాఱై నిలిచెన్. 15

ఆ. ఇంగిలీసువార లీఖిలాఫత్తున, కుచిత మైనతీర్పు నొసఁగరేని
గడఁగి యెల్లవగలఁ గసితీర్చుకొనఁదగు, నన్నదృష్టి నాతఁడున్నవాఁడు. 16

ఆ. కాన సీమవలన నీనేలకుం డిగు,నెల్లవస్తులను బహిష్కరింప
వలయునంచుఁ బెద్దవా దొనరించి గ,గ్గోలుపఱిచె నపుడు కొల్వునెల్ల. 17

క. వస్తువులనెల్ల మానుట, దుస్తరము నయుక్త; మేల తొందర వినుఁడీ
దుస్తుల వెలివేఁతయ కదు, శస్తంబని యేను లెస్సచాటితి రచ్చన్. 18

వ. నా యహింసాధర్మము సైతముసభాసదుల కెఱుకువకావించితి – నపుడు మౌలానా హజరత్ మొహానీధోరణి విన్న సభ్యులామోదసూచకధ్వానంబుల నాకసంబగల్చిరి – కాన నాబూర యెవరిచెవి కెక్కునా యని జంకితిఁ గాని నా కర్తవ్య మేను బాలింపవలయుఁ గదా యని నాతలఁపు లావిష్కరింపం దెగితి – నావాదంబు నోలగంబెల్ల శ్రద్ధధానమై వినియె – నంత 19

క. పరిహాస్యక్రియ లేటికి, మఱవకుఁ డీగాంధి సెప్పుమాట లటంచున్
గఱువలు సభ్యులు నిలఁబడి, తిరపఱిచిరి పెక్కు రస్మదీయాశయముల్., 20

ఆ. లేరు సీమసరకు లేని సదస్యు లా, కొలువునాల్గు దెసలఁ గలయఁజూడ
గొడుగొ కలమొ గొలుసొ గడియారమో యెదో, కానవచ్చు నెల్లవానిపజ్జ. 21

క. ఏలా ప్రతిపాదకులును, బాలింపని నిర్ణయం బపాత్రము; దీనన్
మే లేమివాదము నని ధీ,శాలులు సత్యంబు నెఱుఁగఁజాలిరి సభ్యుల్. 22

క. అంత హజరత్ మొహానీ, కొంత తెలిసి సీమదు స్తాకొండ విడిచి ని
శ్చింత నిలఁజాల మింకొక, వింతపనిన్ మాకుఁ జూపవే యని నుడివెన్. 23

వ. అది తెల్లవారికి వెట్టపుట్టింపవలయు ననియుం బల్క నతనికోర్కి సముచితంబని నాకుం దోఁచె - విదేశవస్త్రములం ద్రోఁత వెన్వెంటన సాగదనియు నచ్చమగు ముదుకబట్టం దీర్చునేర్పు మన కెడయైనవిద్దె యనియు సీమదుస్తులం బాయ మరబట్ట నాశ్రయించుట నిరర్థకం బగుపని యనియు నప్పు డూహించితి - మౌలానా వలచిన క్రొత్తవస్తువుం బరికించితి - దానిపేరు హిందీపల్కునం గాని యురుదుబాసం గాని వెలువరింపలేమికి సిగ్గిల్లి తుట్టతుదకు 'నాన్-కో-ఆపరేష'నని యింగిలీసునం దెలిపితి - నీ పదంబు నీ యోలగంబునంద తొలుసారిగాఁ బ్రయోగించితి-రాచతీకమువా రొసంగిన బిరుదములు వీడుటయు వారికొలువుం బాయుటయు వారికి సాయంబు సేయకుంటయు నాయీ సూత్రమున కర్థమని సభవారి కెఱిఁగించితి - దొరతనమ్ము నెదిరించిక త్తిగట్టుట నింద్యంబని చాటితిఁ-బదంపడి కొన్నాళ్ళదనుక నీ క్రొత్తపల్కునకుఁ బ్రచారము రాదయ్యె - నీ శబ్ద మీ సభాకార్యక్రమమునఁ దాత్కాలిక విస్మృతిం బడసెఁ - గావుటంజేసియ వెనువెంట నమృతసరమునం గూడిన కాంగ్రెసునం దే నేలుబడివారికి సాహాయ్య మొనరింపవలయు నన్న నిర్ణయంబు నంగీకరించితి-వారు హిందూ ముస్లిము సమస్యల నుచితరీతిఁ బరిష్కరింతు రనియు నట్టితతి నిరోధ మనావశ్యకం బనియు నమ్మి యట్లు గావించితి. 24



# 37 అమృతసరముకాంగ్రెసు

గీ. నామమాత్ర విచారణా నాటకంబు, జరిపి పాంచాల వీరసంచయముపాలి
మందిరముచేసి రథికృతుల్ బందిగమును, ఖడ్గరాజ్యంబు సాగించు కాలమందు. 1

క. ఇది ఘోరం బిది దుర్భర, మిది నింద్య మటంచు దేశ మెంతయు నార్వన్
బెదరి దొరల్ బందాలను, వదలిరి కాంగ్రెసుమహస్సు వచ్చెడి వేళన్. 2

క. హరికృష్ణలాలు మున్నగు,బిరుదులు చెఱఁబాసి మిత్రబృందము గునియన్
బరిషత్తుకంటెమును తమ,ధరణికి వచ్చిరి జగద్ధితవ్రతనిఘ్నుల్. 3

గీ. అమృతసరమున మాతృసేవానుర క్త,లలితమై కాంగ్రె సిది సాగులగ్నమందు
బందిగము వీడి వచ్చి రస్పందశౌర్య, వాటు లాలీసగర్భ్యు లిమ్మేటిసభకు. 4

క. ఓహో! జయ జయ పదకో,లాహలములు పొంగె నపు; దలభ్యానంద
శ్రీహత్తి చటులవీచీ, వ్యూహోద్యజ్జలధి యయ్యె నోలగమెల్లన్. 5

క. దినదినమును వేల్వేలుగ,ధనమును బండించు సభికతావైభవమున్
దృణముంబలె విడిపంజా,బున నిల్చె నెవండు వీరపురుషాగ్రియుఁడై 6

క. ఆమోతిలాలునెహ్రూ, ధీమన్మణి నేఁటిసభ నతీవోపాయ
శ్రీమీఱ నేలె భిక్షు, స్వాములు పిల్చిరి సదంబు శ్రద్ధానందుల్. 7

క. ఇందనుక లాఁతిసీమల, కుం దరలినభారతీయు కుడిచెడివెతలే
హిందీపల్కునఁ గాంగ్రెసు, నం దెల్పెడివాఁడ వినయనమ్రుఁడ నగుచున్. 8

క. ఆపని యొక్కఁడ నేఁడున్, నాపాలి దటంచు వచ్చినాఁడను సభకున్
మోపెను భగవానుఁడు నా, యోపికకున్ మించువ్రేఁగు నోడక తుదకున్. 9

గీ. ఏలుబడివారు మనపాలి కీఁదలంచు, నవ్యసంస్కరణంబు లానాఁడ వెలసెఁ
బెదవి విఱిచిరి పిన్నలు పెద్ద లేత, దాకృతిన్ నేతిబీఱతో నన్వయించి. 10

ఆ. ప్రజలకొల్వులోనఁ బండిన బాలగం, గాధరుండు వంగయోధ చిత్త
రంజనుఁడు 'ససేమిరా' యన్నదిక్కున, వక్కణింపఁ దగినవార లైరి. 11

క. మాలవ్యా తాటస్థ్యము, పాలించెఁ గొఱంత లెన్నిపదు లుండును గా
కేలినవా రిడుచనవుల, నాలంబించుటయ కర్జమని యేఁ గంటిన్. 12

వ. పూజనీయుండగు మదనమోహను కుఱంగట నాఁటిరాజకీయ పరిస్థితులం దడవితి - నగ్రజుంబలె నగ్గఱువ నా కెల్లవర్గంబులవారి తలపోఁత లెఱుకువచేసె - మహా సభం బొడము సంస్కరణచర్చం బాలువడయం జెల్లు నని యే నప్పు డూహించితిఁ - బాంచాలమునఁ బ్రవర్తిల్లిన హింసం బరికించుదళమునం దే నొకండ నగుటంజేసియు ఖిలాఫత్తుం జక్కఁబఱుచునారటం బేచినవాఁడనై యుంటను దొరతనమువారతో నాఁడు నాకక్కఱయుండె - వెండియు మాంటేగు మన భూమికిఁ జెల్మికాఁ డనియు నతఁడు మనవారిం గికురింపఁ డనియు నానమ్మిక యాలీసోదరు లత్తఱి బంధవిముక్తు లగుటయు నొక మేలిమార్పని యే నెంచితి - నిట్టియెడఁ గ్రొత్తచనవుల నీకో లుచితంబని నాకుఁదోచెఁ - గాని దాసుమున్నగు మహామహులు వీనిం ద్రోవఁ బూనుటంజేసి నెఱజోదులగు వీరి కొడ్డారింప జంకి 13

క. కటకటఁబడితి సభన్ విడి, యెటయేనిం బోక వోలదే యనుకొంటిన్
జిటచిటమను హృత్తాపము, నట నేకాంతమున సంసదధ్యక్షునకున్. 14

క. మాలవ్యాకుం దెల్పితిఁ, జాలుం జాలును బలారె! సాహస మిచ్చో
నేలయ్య! తప్పఁగ్రుంకుట, యేలిద మిది యనిరి పెద్ద లిద్దఱు నెమ్మిన్. 15

గీ. హరికిషన్‌లాలుచెవి కెక్కె నస్మదీయ, వేదనాగాథ మెలమెల్ల వెదలి వెదలి
వలదు నీ వాలముంగోరవలదుమివుల, నదలుఁబాంచాలమీవార్తకనియెనతఁడు. 16

శా. దాసుం జూచితి లోకమాన్యునికడన్ దర్శించితిన్ వెన్క జి
న్నాసాహేబుతలం పెఱింగితిని బన్నం బెంతయున్ సైఁచితిన్
మాసిద్ధాంతము లెల్ల నేకముఖమౌ మార్గంబు కన్పట్ట కా
యాసంబందితి దారియేమి యని పెల్లారాటముం జెందితిన్. 17

వ. అంతమదనమోహనునకు దాసి మాచిత్తంబు లేకీభవింపవయ్యె - నానిర్ణయంబు చర్చకు వచ్చునేని సభాసదులసమ్మతులం గొంట తప్పదు - ప్రేక్షకులం బ్రతిభువుల న్వింగడించుట కడిందిచేఁత - యెల్లరుం జేతులెత్తిన నేమిపొడి? - యని మొఱపెట్టుతతి మఱికిషన్ లాలు నా పల్కునందుకొని 18

గీ. పూఁటకాఁపుల నస్యుల నోటలేక, సంవిభాగింతు నీకేల సంశయంబు
తద్భరంబెల్ల నాతలఁ దాల్చువాఁడ నపసరిల్లక నిల్వు మీ వని వచించె. 19

ఆ. గుండె కుదురుకొల్పు కొంటిఁ దీర్మానంబు, సంతరించి యిడితి సభ్యులెదుట
నన్నుఁ దొదరి రపుడు జిన్నా జగద్ధిత, వ్యూహవేది మదనమోహనుండు. 20

క. ప్రత్యర్థులకున్ మాకును, మత్యంతర మంతిమాణుమాత్రమ యైనన్
వాత్యవలె వార లేచిరి, యత్యంతము నలఁగి రోర్మియట్టదు గూఁగన్. 21

క. ఒకవంక నుపన్యాసము, లొకయెద నైక్యప్రయత్న ముడుగక నడువన్
రకరకముల కమ్మలు నా, యకులనడుమ సాగుచున్న వయ్యాదెసలన్. 22

క. ఇరువాఁగుల సంధింపం, బొరిఁబొరిఁ గష్టించు మదనమోహనుఁ; దంతన్
జిఱుమార్పున కీకొని యీ, యుఱవడిఁ దప్పింపు మని మృదూక్తి స్ఫూర్తిన్. 23

క. న న్నాఁగెను జయరాముఁడు, తిన్ననిదని తోఁచె నతనితీరుపు నాకున్
మన్నింపఁదగిన సూచన, కన్నాఁడ నటంటి బాలగంగాధరుతోన్. 24

క. ఆయయ్య చిత్తరంజనుఁ, డీయకొనన్ నిలువరింపనే నని వినిచెన్
దీయంజూపులజిగి దా, సాయెదఁ బఱఁగించె నెయ్యుఁడగు 'పాలు'పయిన్. 25

వ. మాలవీయుం దపుడు దిటముం బదసి దేశబంధువునోట నౌలె మ్మన్ననుడుగు వెలువదక మున్న కొలువఁ గలయందిలకించి యయ్యలార! పొత్తుకుదిరె - నిఁక మీ రెలర్ప వచ్చు-నని యెలుఁగెత్తి చాటెఁ-బదంపడి కరతాళరవంబు దివంబు నగల్చె - గంభీర వదనంబులు విరియంబాఱె - నీ తీఱుకతన నాపూఁట మిక్కుటంబాయె. 26



# 38 కాం(గ్రెసుపొత్తు

వ. ఏ నమృతసరమునం జాగిన కాం(గ్రెసుచర్చలం గోరు వదయుట తన్మహాసభ తోడి నిక్కపుంబొత్తు నాకు మొలతెంచుట యని తలంతు - నింతకుము న్నస్మదీయంబులు భక్తి గౌరవంబు లప్పనచేసికొనం గోరియ జాతీయమహాసభల కేగెడి వాఁడ - నాఫ్రికా భారతీయసమస్యంబోని నాసొంతపని వినా కాం(గ్రెస్సుపని యెద్దియు నాపాల లేదని తొల్లి భావించితి-నది వలయు నన్న వలపేనిం దన కొదవదాయెఁ-గాని యీనాఁడు 1

క. నే నలయక పాంచాల, క్షోణికిఁ గావించుకొల్పుచొప్పది కాం(గ్రెస్
లో నెఱసరు లగువారికి, మానితశీలురకు లోకమాన్యాదులకున్. 2

ఆ. తనివి గూర్చె నన్నుతత్త్వంబు గంటి న,గ్గఱువ లాంతరంగిక(ప్రసక్తి
పుట్టినపుడు నన్ను నెట్టన రావింపఁ గడఁగి రాదరింపఁ దొడఁగి రిచ్చ. 3

క. జాతీయ మహాసదమున,కా తతిఁ గృత్యమ్ము ల(గ్రియమ్ములు రెం; డా
చేఁతల కేఁజాలుదుఁ దత్, (ప్రీతియు మచ్చిత్తవీధిఁ బింపిసలాడున్ 4

క. జలియన్‌వాలాబాగునఁ, గొలకుం గనులైన సైనికులకాల్పులకున్
బలి యైనవారిచిన్నియ, నిలుపుట యిం దొకటి యంచు నిశ్చితమాయెన్. 5

క. ఈపనికి నైదులక్షల, రూపాయలు వలయు; జాగరూకతమైఁద
(దూపమ్ముదిద్దు (వేఁకము, నాపై సభవారు మోపినా రవ్వేళన్. 6

ఆ. (ప్రజల కుపకరించుపనులకై వలసిన, వసువు సంతరించువారిలోన
మదనమోహనుండు మొదటివాఁ డైన నా, దిట్ట కేను దీసికట్టు గాను. 7

క. నేటాలు భారతీయుల, వేఁటాడువిపత్తి నెదిరి విదళించుతతిన్
బాటవ మిది నాసొమ్మని, తేటపడెం గాని యొండు తెలిపెద నిచటన్. 8

క. మాలవ్యాకైవడి భూ, పాలురలక్షలు గడించుపని కే నెపుడుం
జాఁల జాఁడీ! యైనను బాం,చాలంబున కిట నరేం(ద్రసంపద యేలా? 9

ఆ. అగుట నర్థమొసఁగుఁ డయ్యా! యటంచుఁ(బ్రా,ర్థనమొనర్చినాఁడఁ(బ్రజలగుఱిచి
రూక లపుడ వచ్చి దూఁకెను వేల్వేలు, చాలుఁజాలు నన్నమేలు గంటి. 10

క. ఇత్తతి బొంబయిపౌరుల, విత్తమ తద్దయు లభించె వితరణవిద్యా
వేత్తలు జగచ్ఛివంకర, వృత్తులు నగు వీరిపెంపు వినుతింపఁదగున్. 11

వ. లోక మిట్లాదరించి పంచినధనంబు నేఁటికే నట్ల యున్నయది-దీనిని వెచ్చించు పట్ల సంకట మొకం దేరుపడియె - హిందువులయు సిక్కులయు మహమ్మదీయులయు

నస్పృక్ప్వారములం దోఁగి పరిపూతమైన జలియన్‌వాలాబాగుగడ్డపై స్మృత్యంక మెట్టిది నిర్మింపఁదగు నన్ననిర్ణయము కదుంగడు గడ్డుసమస్యయాయె-నేఁడీముత్తెగలయం దేరెండు కోవల కేని పొత్తు సున్న-యింక నాకు వసపోయిన రెండవ నేర్పు రచనాకౌశల మని విన్నవింతు - నిదియు భారతజాతీయమహాసభకు నేఁ దొదవుననని తలంచితి. 12

క. మితశబ్దంబుల వినయ, చ్యుతి యించుక లేని బాస నొసపరిగ్రాఁతల్
జతపఱుపంగల నేనని, మతిమన్మందనులు లోకమాన్యప్రముఖుల్. 13

క. మున్నె యెఱింగిరి నా కీ, విన్నాణము మెల్ల మెల్ల విరియంబాఱెన్
దిన్నన యిది లోకమునకు, న న్నాదరణీయుఁ జేసినది నా నోర్తున్. 14

క. గోపాలకృష్ణుఁ డెవుడో, చూపినసూత్రములు కాంగ్రెసున కిందనుకన్
ద్రోపాడరాని విధులై, దీపించును దెరువుసూవుదివ్వెలవోలెన్. 15

క. ఈనాఁ డేతన్మండలి, పూనినకర్జములు మూఁడింబోవుటకతనన్
గానంబడియెను గోకులుఁ, డానాఁడు రచించుచట్ట మసదై సభకున్. 16

క. ఈసూత్రము వర్జ్యం బని,యాసూత్రము నిట్లు మార్చు టగునని ప్రజ్ఞా
భాసురు లేఁటేఁట నుప,న్యాసములు కురింప నొగ్గినా రీగోష్ఠిన్. 17

గీ. ఆఱుగాలంబు వలయు కార్యములు నడుచు,నేమ మదిలేదు వచ్చునొగాము లరయు
కట్టడలు లేవు సభకుఁ బ్రెగ్గడలు మూవు, రుండెదరు గాని పరికింప నొకఁడె మంత్రి. 18

క. అతఁ డైన నెల్లవేళలఁ, జతురతమైఁ బనులు దిద్దఁ జాలనివాఁ; డీ
గతి నుండునయ్యగారు స,మితి కార్యాలయము నెట్టిమెయి సాగించున్. 19

క. రానున్న చిక్కు లెవ్విధిఁ గానంగలఁ డెన్నుకొన్నకార్యము నే చం
దాన నడిపించుఁ బ్రజ కీ, మానిసిచేఁ గీదృశంబు మంగళ మబ్బున్. 20

గీ. నేల యీనినచందాన నాలుగైదు,లక్షలప్రజల్ మహాసభన్ వీక్షసేయ
నేగుదెంతురు ప్రతిభువు లింద అన్న,పద్ధతి హుళక్కి యిఁక నెట్లు బండి దొర్లు. 21

ఆ. వచ్చి పీఁటవెట్టువా రెల్లఁ బ్రతినిధు, లగుట కద్దు వొడమ దర్ధ మిడిన;
మేర కానిపింప దీరాష్ట్రమున కింత, మంది పూఁటకాఁపు లుందు రనుచు. 22

వ. కాంగ్రెస్ కార్యప్రణాళిక యి ట్లుండుటంబట్టి దీనిసంస్కరణ మావశ్యకం బని మహారథుల కెల్లరకుం దోఁచె - నపుడీవిషయ మన్నిటికిన్ ముంగలిదై నిల్చె - నానాఁడు లోకమాన్య దేశబంధువులు ప్రజానాయకులయం దగ్రిములు - వారి బాసట యుండునేని మహాసభా నియమములం దీర్తు నని యే నాడి పనిగ్రేఁగుం దలఁదాల్చితిఁ - గాని బాలగంగాధర

చిత్తరంజను లీచేఁతలోఁ బాల్గొనఁదగ్గ విడుమర లేనివా రని యెఱుంగుదు - నగుటంజేసి మీనమ్మినవారి నిరుగుంద్ర నా కండగా నిం దని బలుమానుసుల వారి నర్థించితి - నేతదుపసంగమునం దీ ముప్పురుత్రిక్క లాఁతివా రుండం గాదని విన్న వించితి - వారు నాపల్కులం బెద్ద చేసి తమపక్షమునఁ గేల్కర్ సేన్ మహాశయుల నిర్ణయించిరి - కాని 23

క. ఈ ముగ్గురు తీర్పరు లొక, ధామంబున నిల్చి పాడి తర్కింపర; లే
ఖామూలమునఁ బరస్పర, ధీమార్గము లెఱిఁగి యెఱిఁగి తేటిరి తుదకున్. 24

క. ఎడమడువు లేనినడవన్, వెడలెను మాతీర్పు; దీనివెనుకల దేశం
బడు గిడిననాఁడు దాస్యము, సుడివడి కూలున్, స్వరాజ్యశోభలు వాలున్. 25

క. ఈకట్టడ నిర్మించుట, కీకొన్నదినంబు తొట్టి యేనల కాంగ్రెస్
లోకమ్ముతోడఁ బదుగుం, బేకయుబలె జద్దుపెంచి పెనఁగొన్నాఁడన్. 26



# 39 ఖాదీపుట్టువు

వ. వేయుఁ దొమ్మన్నూట యెన్మిదవయేఁటిదనుక రాట్నము మగ్గము నాయెఱుంగని కొఱముట్లు నాఁ జనుఁ - గాని రాటనమునంజేసి భారతీయుల లేవడి మటుమాయం బగునని యేను 'హిందూస్వరాజ్యము'నం దదవితి - మనగద్దం బెక్కు రాఁకటి చిచ్చు నార్పుకోఁజాలక జాలింబడి మడియుచుందు - రిట్టియిక్కట్టు నరికట్టువెర వేయది కానంబడు నాయదియ బానిసమునుసైత మదఁగార్చు నని తద్గ్రంధమునఁ బలుక రించితి - వేయితొమ్మన్నూట పదునైదవయేఁట నే నాఫ్రికా నుజ్జన చేసి మాతృభూమిం జేరితి - నపుడుసైత మీయంత్రమునీగడం గాన - సబర్మతీ సత్యాగ్రహాశ్రమ నిర్మాణ మైనపదంపడి కొన్ని మగ్గముల నేర్పరించితిమి - కాని 1

క. వాణీయంత్రము నార్చెడి, నాణెము మాపాల లేమి నలఁగితి; మేనాఁ
దే నిట్టిచేతిపనులం, గానముగద వ్రాఁత కూఁత కర్జము తక్కన్. 2

ఆ. అగుట వాపకృత్య మలవఱుపన్ దంతు, వాయుఁడొక్కరుండు వలసె నపుడు
వెదకి తెచ్చితిమి కువిందు; నతండు మా కెఱుకపఱిచె నేఁతమఱుఁ గొకింత. 3

క. ఎవరెట్లొప్పరికించినఁ, దవులూద్వక మగనలాలు తంటాలువడెన్
సవరనిపనివాఁ డయ్యెను, జవ మేర్పడ వలువ లల్లఁ జాలెన్ గ్రాలెన్. 4

గీ. అతఁడు చదు రొప్ప సత్యాగ్రహాశ్రమమున, నెల్లరన్ మగ్గరులఁ జేసె మెల్ల మెల్ల
నవల మాతాల్చుకోకల నాశ్రమమున, నేయఁదగు నన్నకోరిక నెగసె మాకు. 5

గీ. అంత మరలోనఁ బొడమినయట్టిచీర, మాని మరనూలితోఁ జేతిమగ్గమందుఁ
దీర్చి నేసినవస్త్రంబ ధృతికి నర్హ, మని తలంచితి మేకాశయంబు వెలయ. 6

వ. ఈ నిర్ణయంబునంజేసి మా కెన్నేనివిషయము లవగతంబు లాయె - నేతఁరుల మన్గదయు వారినిర్మించు నంబరములయు నూలిన్ విలుచుపట్ల వా రనుభవించు నవస్థలయు నచ్చేరమునందలి రవళియు రాను రాను శాలికుల యధమర్ణతాది సంకటములయు రహస్యము లన్నియు మాయెఱుకకు నందె - నిట్టిదశలో మాకక్కఱ యగు దుస్తు లన్నింటిం గ్రన్నక్రన్నన సంతరింప నేరము - కాన ముమ్ముందు మాబట్టల సాలీంద్ర చెంతం గ్రయింపఁ దలఁచితిమి - కాని సాలియలకడ నొండె వణిక్కులకడ నొండె దేశీయమగు యాంత్రికతంతువుతో నేసిన జిలుఁగువల్వలుండవు - వానికి సీమనూ లాదరువు - మన మరలవలన సనసన్ననిపోఁగు బయల్పడం జాలదు - రవంత ముదురుగా నుండుఁగాక మనమరనూలి నాదరింపంజనునని నిశ్చయించి తిరుగందిరుగ 'మానేసిన చీరలనెల్లం గొందురేని నాఁటిమరదారమున బట్ట లల్లుదు' మని కొందఱు కువిందు లాడిరి - వల్లె యని మే మంటిమి - నాఁ డిట్లు మరనూలిబట్టం బెద్దచేసి వాడుచు దాని నాదరింపుఁ డని చెలికాంద్రకుం దెలుపుచుఁ దంతుయంత్రములవారి కేము యదృచ్ఛా ప్రచారకుల మైతిమి - దీనంజేసి వారిపని తెఱంగులు బవంతములు దురాశలు మాకుం దెల్లమియయ్యెఁ - దమదారముం గాక నేఁతను సైతము ప్రజలిచ్చ గింప వలయు నని వారితలంపు - చేనేతఁగాంద్రకు వారికావించుబాసట యిచ్చమైఁ జేయునది కాదని నుడువంబోలు. 7

క. ఇక్కథనెల్లఁ గనన్ మన, కక్కఱయగు నూలు మనమ యలయక వడుకం
జక్కఁబడుఁ జిక్కు లన్నియుఁ, దక్కుఁ బరాధీనజీవితం బని తోఁచెన్. 8

క. మన తంతుయంత్రములకున్, మన వాణీయంత్రములకు మన మాప్తులమై
యొనలేని లేమి నలఁదురు, జనులకు ల గ్గేమిసేయఁజాలుదు మిచటన్. 9

ఆ. అని తలంచి యచ్చటచ్చటఁ గంటిమి, కాని రాటనంబు గానమైతి
మొక్కఁడేని మాకుఁ జిక్కఁడ యానాఁడు, రహటకృత్యభారవహన చణుఁడు. 10

క. ఒకనాఁడు కాళిదా సను,వకీలు రాటమును జక్క వడుకంగల నా
తుక నోర్తఁదెచ్చి యీ వెలఁ,దికి నేరిమి గలదు పోఁగుదీయుట ననియెన్. 11

ఆ. ఆ కెశిక్ష వదయ నభినవజ్ఞానస, మార్జనాభియుక్తు నాశ్రమస్థు
నొకనిఁ బనిచినార మూరక చనుదెంచె, నతఁడు తద్వివేక మందలేక. 12

క. కాల మిటు లుఱుకుచుండఁగ, నాలో నారటము దినదినర్ధం బయ్యేన్
మాలగ్ని నరయ వచ్చెడి, బాలురకున్ వృద్ధులకును బాయక దీనిన్. 13

ఆ. వెల్లడించి గోలవెట్టఁ దొడంగితిఁ, గాని జాడ వినుచుఘనులు లేర
వడుకుచేఁత యాడువారిసొ మ్మగుట న, వ్వార చెప్పవలయు వారకీలు. 14

వ. ఇట్లుండ వేయితొమ్మన్నూట పదునేడవయేఁట ఘూర్జరులు నన్ను శిక్షాపరిషదధ్యక్షుఁ గావించి భరుకచ్ఛమునకుం గొనిచనిరి – నా కావీట గంగాబాయి నాఁబరఁగు నారీమణి కానంబడె – నాపెవిశ్వస్త – కొలంది నిదరాని తెగువ కామె పుట్టినిల్లు – చదువుసందెల కాయమ్మ దౌదవ్వుల నుండెఁ – గాని విదుషీమతల్లిక లాకె సాహసముం గానరు – గంగమ్మ కంటరానితన మొంటదు–కడజాతిమానుసులం గూడిమాడి యాబిద నిర్భీకమై వారి కూడెముం జలుపు – వెండియు. 15

క. అవెలఁదిపాల రొక్కము, కావలసినయంత కలదు కాని సుఖంబుల్
భావింప దాకె యెపుడును, లా వెంతయుఁ దనరు నప్పొలంతుక మేనన్. 16

క. ముక్కాఁకలుదీఱిన యీా, యక్క మదిన్ జంకుగొంకు లరయక యెటకే
నెక్కటియై చను వార్వము, నెక్కి సవారీలుకొట్టు నిగ్గనిచేవన్. 17

గీ. గోధరా కేగినప్పుడు కుదిరె నాకుఁ, బరిచయం బీనెలంతతో బాధ మగుచుఁ
జెప్పికొన్నాఁడ నీసాధ్విచెంతనాదు, నెడఁదఁ గారించు రాట్నంపుగొడవ నెల్ల. 18

క. దమయంతి నిషధవసుధా, రమణుం గనఁ జన్నయట్లు రాట్నము నెమకన్
గమనింతు ననియె గంగమ, సమయించెన్ ననుఁ గలంపఁ జాగినవ్రేఁగున్. 19



# 40 దొరకినది

క. గుజరీ నాలుగుదెసలం, దజరాభినివేశనిఘ్నయై గంగమ నా
గజిబిజి దీర్పం దిరిగెను,బ్రజ లెపుడో త్రోసి మఱఁగుపఱిచిన బిసకున్ 1

క. ఆపె తుద కెట్టెటో బీ, జాపురమున రాట్న మున్నసవ్వడి పట్టెన్
నాపాలిటి పండువుగా, నాపుణ్యచరిత్ర నాకు నాకథ నంపెన్. 2

క. బీజాపురమునఁ బ్రాఁబడి, బూఁజునఁ బడి మచ్చు లెక్కి పొలుపఱి దేశ
శ్రీజనకము లగురాట్నము, లేఁజెల్ల! కృశించుచుండె నింటింటఁ గడున్. 3

క. అచ్చటివా రేకుల నిడి,వచ్చినదారంబు విలుచువా రేర్పడినన్
ముచ్చటపడి నూల్దీయుట,కిచ్చం జూపిరి మదాత్మ యువతాళింపన్. 4

వ. కాని దూదిం జక్కంబఱిచి యేకులు గావించుట మాకుఁ గడిఁదికర్జం బాయె - స్వర్గీయున కుమర్ సోబాని కీయిదుమన్ దెలుప నమ్మేటి తనమరన్ వానిని దీర్చి పనుపం బూఁటవడియెఁ - బదంపడి. 5

క. ఏకులకట్టలు గంగ క, నేకంబులు సేర్చుచుంటి మిఁక నూల్వారల్
మాకడకు వారవారము, దూఁక మొదల్కొనియె వెండిదుత్తలవోలెన్. 6

క. మగ్గములు సాఁచి నూలికి, నిగ్గులు సవరించి బట్టనేసితి మంతన్
బగ్గెకు నెంతపెనంగిన, నగ్గువయై మిగులు దార మాయైగదులన్. 7

ఆ. రహటలక్ష్మి దొరకె రమణీయతంతువు, చిక్కె నేఁత వలసె నిక్కె వలువ
యింతవట్టు లెస్సయే కాని యూరక, సెట్టి యొసఁగు నేకు లెట్టుగొందు. 8

క. సొమ్ముం గొని పంపుట కా, యుమ్మర్‌సోబానియుల్ల మొల్లద యెన్నా
ళ్లిమ్మయిని దేరసొమ్మున, కు మ్మది నీకొల్ప నేర్తుఁ గుందినపాడిన్. 9

క. ఐనను మరయేకుల కే, నౌనను టుచితంబె యట్టు లగుచో మరనూ
లేనెఱి నింద్యం బగు మన, యీనేలన్ దొంటివారి కీయంత్రంబుల్. 10

క. ఏకులను దీర్చి యిచ్చెనె, లేకున్న న వెట్లు సంధిలెన్ దాతలనాఁ;
డీకైవడి నాయెడలో, రేకెత్తిన దపుడు తర్కరీతి దళంబై. 11

ఆ. తుదకు వ్రాసినాఁడ దూదేకువానికై, కదఁగు మనుచు గంగకడకుఁ గమ్మ
వెదకి వెదకి పెట్టె వెలఁది తత్కార్మకు, దిక్కులేక వగచు బక్కవాని. 12

క. ఆపేద నెలకు ముప్పది, రూపాయలజీత మడుగ రొక్కం బిది యా
క్షేపార్హము కా దంటిని, జూఁపెను విల్ల తఁడు తీయసందడి విరియన్. 13

ఆ. పింజ విరియ నేకి పుంజపుంజమ్ముల, నేర్పరించె వాఁడు నేర్పు మెఱయఁ
బిన్నపిన్న వాండ్రఁ బిలిచి గంగాబాయి, చిట్టిచిట్టియేకు చుట్టఁజేసె. 14

వ. అంత నేను బింజాభిక్షమున కయ్యాతావులకుం బయనించితి - 'యశవంతప్రసాద దేశాయి' మాకు వలయు కార్పాసము నంపం బూఁటవడియె - నుత్త మశీల గంగాబాయి చేపట్టిన యీమేలి చేఁత యిట్లు తామరతంపర యయ్యె - బీజాపురమునం దీయు దారము వలువఁగాఁ దీర్ప నయ్మమ్మ పెక్కండ్రు సాలెల రావించె - నివ్విధంబున బీజాపురపుఖాదీ యావద్భారతమునం గీర్తి నార్జించె - నిట్లీ కేంద్రమునం గద్దరుబట్ట వెల్లివిరియం జాగ నాశ్రమమునం బెక్కురాట్నములు కుదురుకొనియె - మఱియు. 15

ఆ. మగనలాలు తనసమర్థత నొదవించి, మేటిమార్పు దెచ్చె రాటమునకుఁ
బెల్లు రాట్నములు కదుళ్ళను దకిలీలు, నాశ్రమోర్వియంద యవతరించె. 16

గీ. అపుడు మా నేయుఖాదీకి నైనవెచ్చ, మరయఁ బదునేడణాలఁ జేకుతెగజంబు
ముదుకగా నున్న వెల యెంతమూరియున్న, విలిచిరిద్దానిఁ జెలికాండ్రు వేడ్క మెఱసి. 17

క. ఏ నొకతతి బొంబయినగ, రానం బడియుంటిఁ దెగులు రా వందురుచున్
మే నెటు లుండిన ఖద్దరు, పూనిక విడనైతి నిద్రపోవుచునున్నన్. 18

క. ఇరువురు చిక్కిరి నా కా, పురమున రాట్నమ్ము నార్చుపొలఁతులు; వారల్
విరచించునూలు కొంటిని, ధరలోనిరహస్య మెఱుఁగఁ దత్కాలమునన్. 19

క. ఆపిమ్మట గంగమ బీ,జాపురి నిడువిలువఁ దెలిసి చానలు వీరల్
టోపీపెట్టిరి నా కని, వాపోయితి వారినూలు వల దనుకొంటిన్. 20

వ. ఆయమ్మలు మానా మ్మించుక నంజినను రమాబాయికి నవంతికకు శంకరలాల్ బాంకరుతల్లి వసుమతీదేవికి రాట్నపుంబని మప్పుటంజేసి వీరివలని నష్టికంటె లబ్ధిహెచ్చని తలంచి - నానిల్చునోవరిలో నపుడీసాధ్వు లాడించు రాటనములరవళి మధురమధురం బుగా మొరయం దొడఁగె - న న్నలయించు తెగులుం బాఱఁ ద్రోలుపట్ల నీరాటమునకుం బా లున్నది సవివక్కాణించుట యతిశయో క్తి యనం బెల్లదు - రోగముం దొలఁప మానసిక పరిణామం బొకసాధనం బనుట నిజమ - వెండియు. 21

ఆ. మాకు వలయు చేతియేకులు బొంబాయి, పురినిసైత మపుడు పుట్టకుంట
దెసలుచూచు నాకు వసపడె సెజ్జల, దూది నేకి బ్రదుకు పేద యొకఁడు. 22

క. ఏకులను దీర్ప నాతం, డీకొనుడున్ బేరమాడ కిచ్చితిఁ గూలిన్.
మాకదురు లాడె నాడెము, పైకొనఁగ రమాదిసతులు వడికిరి నూలిన్. 23

క. అపుదేర్పడుదారముతో, జపమాలలు కట్టి యమ్మ సాగితి మిత్రుల్
సుపవిత్రులైనవైష్ణవు, లుపక్రమించిరి కొనన్ మహోత్సాహమునన్. 24

గీ. నడిపె రాట్నాలసాల నానడక మెచ్చి, బంబయిపురమ్మున శివాజిభాయి నాఁడు
దేశభక్తులుదారులై తెచ్చి యిచ్చు, విత్త మిప్పట్ల నెం తేని వెచ్చపడియె. 25

ఆ. అది నిరర్థకవ్యయంబు కా దని జగం,బునకు వెల్లడింతు వినయ మార
నెఱుకపడియె మాకు నిప్పనిలో రాట్న,మగ్గపఱుచులగ్గ లగ్గములగ, 26

గీ. ఏను మరనూలిదోవతి నూని తిరుగు,సమయ మయ్యది; రాట్నపుంజావు లపుడు
వెలసినవి గాని వైశాల్య మలఁతి యగుట, నట్టలుగ నుంట నొంటనివయ్యె నాకు. 27

క. ఖద్దరు కానిది యానాఁడెద్దియు నామేన నిల్వ నెద మాతొడ్డెన్
దద్దయు గలఁగితిఁ బన్నా, పెద్దతికం బున్న వలువ బిఱబిఱఁబడయన్. 28

వ. అంత నొకచందులో నైదుజేనల విరివిడిగల పంచెలం బంపవేని చాల నోలాకు పదుదు
నని గంగాబాయికిం గమ్మ వ్రాసితి-నా సాధ్వి తొలుతన్ బెదరియు దిటముం బాయక
నాపెట్టినగడువు దాఁటకమున్న యిర్వది రెండువీసముల పఱపు గల యంతరీయముల
నందించి న న్నేఁచులేవడిం ద్రోసివైచె - నావెన్క సోదరుఁడు లక్ష్మణదాసు లారీ యను
పల్లెకుం జని వాపవృత్తిలో సడిసన్నయాలుమగల గంగారాముల నంత్యకులజుల నాశ్ర
మోర్వికిం జేర్చి వారిచే విస్తృతిసంపన్నములగు వల్వల నేయించె - మఱియును 29

క. ఖద్దరు మిక్కిల్లుట కీ, యిద్దఱు గావించుసేవ కెనలే; దదిరా!
నిద్దుర యెఱుఁగక మగ్గపు, విద్దెం బెక్కంద్రఁ దీర్చి వేర్చిరి వీరల్. 30

ఆ. చదువు లేదు కాని సంస్కార మురవుగాఁ, గలదు రాముఁ డేలుగంగపాల
నేఁత నేయుపట్ల నీతల్లివీనులుం, గనులు నొందు వినుట కనుట మఱచు. 31



## 41 ఒక సంవాదము

వ. 'స్వదేశీ'ప్రచారంబు నా రహటవస్త్రవ్యాప్తి సాగుచున్న తొలునాళ్లలో నేఁత మరలవారిచూ
పేతదుద్యమము దెసకుం బఱఁగె- వారిపరామరిస లెసరేఁగం దొడఁగె -నవ్వణిజులయం
దుమర్‌సోబాని దిట్ట నాఁజను-నతఁడు తన యనుభూతి రహస్యములు నా కెఱిఁ
గించుటయ కాక తక్కు బేహారుల తలఁపులు సైత ముగ్గ డించుచుండె - నెల్లబచ్చులం
దొక్కొరునివాదం బితని నాకర్షించె-న న్నితఁ డాసాహుకుఱంగటి కొకనాఁడు చేర్చుదు
న పుణ్యాజీవుఁడు నన్నుం గని 1

సీ. వంగరాష్ట్రమ్మును వ్రచ్చుట కేల్చడి, వారు పూనిననాఁడు వాడవాడఁ
జెలరేఁగినది స్వదేశీనినాదము; నీవ,స్రష్టవు కా వీప్రచారమునకు
నిది జనించినవేళ నీగడ్డఁ గల నేఁత, మరలనోములు పండి సిరులు నిండె
నపుడు వల్వలవిల్వ నాకసంబున కెత్తి, టక్కరిపన్నికల్ పెక్కు పన్ని

గీ. కోటు లార్జించినార; మీగుట్టు నీకుఁ దెలియునె? ట్లన నౌనౌను దిగులు వొదమ
వింటి నీవార్త ము న్నని యంటి నంత, నాతఁ డి ట్లాడె నావంత భీతి లేక. 2

క. ఏలా వగచెద వన్నా!, యీలోకము నుద్ధరింతుమే బేరులమై?
మాలాభ మెంత చేపదు, వీలుండునొ యంత వదయ వెనుఁబడ మెపుడున్. 3

క. కొనుబడి హెచ్చుకొలందిని, బెనుపగు వస్తుక్రయంబు; పెనఁగియు నెవ్వం
డణఁపంగలఁ డుత్పత్తిని, ఘనుఁ డెవ్వం డాఁక పెట్టఁగలఁ డమ్మకమున్. 4

గీ. తమయొనర్చెడి గోలకతాన లాఁతి, వలువ లీనేలకున్ రాక నిలిచినప్పు
డిచటిమరబట్టవెల రెచ్చు హెచ్చుననుచు, వంగదేశీయు లూహింపవలదెసెపుమ. 5

మ. అనుడున్ జెల్లరె! వంగసోదరులు నాయట్లే మతిభ్రష్టులై
మనబేహారు లుదారబుద్ధు లని నమ్మం జూచిరే కాని వా
రనృతం బీకొని సీమవల్వ నిది దేశ్యంబంచు నిర్లజ్జులై
జనసంఘమ్మున కమ్మనేర్తు రని యెంచంబోవ రెప్పట్టునన్. 6

క. ఏ నిట్లు పల్క వర్తకుఁ, డౌ నీ వొకపిచ్చివాఁడ వని యెంచియ ని
న్నీనాఁడు హెచ్చరింపం, బూనిక నిట సేర్చినాఁడఁబో! దవ్వయినన్. 7

క. నీవును బోళాబంగా, ళీవలె నిత్తళిని బిత్తళిన్ దుల్యముగా
భావించి పప్పులోఁ గాల్, వైవకు నేరిమి గడింపవలయున్ బనులన్. 8

వ. ఇ ట్లాడినపదంపడి తనయంత్రశాలం దీర్చువల్వల మచ్చుముక్కల నాముం దిడి యివి
పనికి మాలిన దారమునం బొడమెఁ – గావున నగ్గువగా నమ్మంబడు – నాసేతుశీతాచల
మెల్లవీడుల కంపంబడు – మా కన్నితావులం బూఁటకాపులున్నారు – నీవును నీవారుం
గనియెఱుంగనిభూముల నీపలుకురవళిసైత మావేశింపని సీమల మాకు బేహారపుంబొత్తు
కలదు – దలారులం గ్రొత్తవాంద్ర నేమించునక్కఱ కానంబడదు – మఱియు మనప్రజల
కున్ వలయుపాటిబట్ట మనగడ్డం బుట్టుట కల్ల యని యెఱుంగు – మగుటం జేసి
నీకావించు స్వదేశీప్రచారమునం దొలుతొల్త వస్తూత్పత్తి పాటింపఁ దగ్గది – పుట్టుకయు
మేల్మియు దళముకొన్ననాఁ దలవోకగా లాఁతినేలవలువలరాక నిలువంబడు – సరకు
పొంగి పొర్లవలె నన్నఁ నేఁత మరలసంఖ్య పొంపిరివోవం దగు – నిప్పునికి నీ వంగ
వించుట సముచితంబు– మాప్రశంస లానాఁడు నీకు వలసినన్ని లభించు–నావుడు. 9

క. ఏ ని ట్లాడితి, "నయ్యా! యీనేలన్ వలువపుట్టు హేరాళంబై
జేనెండేనియు నవ్య, క్షోణీవసనంబు మనవసుంధర డిగ్గన్. 10

క. చన దని మీ చెప్పినప, ల్కును మెచ్చెదఁ గాని మరలకున్ బ్రతిభువనై
మనఁజాల, వీనికతన్, మనభూమికి నెగ్గుగాక మతి ల గ్గగునే. 11

క. నే నెంత పెనఁగులాటకుఁ, బూనినఁ గొన్నాళ్ళు సాగుఁబో! మీయాటల్
మాననివిశ్వాసం బీ, మానిసికిం గలదు రహటమార్గముపట్లన్. 12

క. అ ట్లేల యందురా వఱు, వట్లం బడి కుములు నాఁడువారల పెం జీఁ
కట్ల మొగంబుల వారల, పా ట్లాఱుప నేతు ముదుకబట్టల చేఁతన్. 13

క. పడఁతులచే దారంబును, వడికించెదఁ బేదసాలెవాండ్రుదురచేతన్
నడిపించెద మగ్గంబుల, దొడిగించెద నెల్లవారితోడం గదరున్. 14

ఆ. ఎంతవట్టు కోర్కి యీదేఱునో మును ముంద చెప్పఁజాల; మొన్న మొన్న
రాట్నమునకు విఘ్నరాజార్చ నెఱపితి, నైన నిది ఫలించు నని తలంతు. 15

వ. నా యీయుద్యమంబునం జేసి యీనేల కె గ్గేమియుం బాటిల్లదనుట నిర్వివాదాంశము – ఖద్దరువలువ యెంత వొడమిన నది మనయుత్పత్తికిం దోడ యగు–నుత్పత్తి ననుస రించి లబ్ధియు నుండుఁ–గావున రాట్నముం ద్రిప్పుట నిరర్థకం బని మీ రన్నమాట మన్నింపనేర – మీ తెరువున మీరు పయనింపుఁడు – రాటన మీ యాంత్రికయుగమునం దొదవునో యొదవదో యన్నవిషయము నవలం బరికింతు – నేది యెట్లున్న నేమి – యేను సర్వదా మీయభ్యుదయంబు వలతు." 16



# 42 అసహకారము

క. ఏచందంబున ఖాదీ, యేచినదో తద్విశేష మిం దనఁజాలన్
నాచేసినట్టిచేఁతల, సూచించుట తక్క నొండు చొప్పద దిచటన్. 1

క. ఆకథల నూఁచముట్టుగ, వాకొన నొక్కొకటి భాగవతమంత యగున్
నా కిట సత్యాన్వేషణ, మేకము పాటింపఁదగిన కృత్యంబు కదా! 2

వ. సత్యముం బరికించుపట్ల నొకపనివెన్క నింకొకచేఁత యె ట్లలవోకగాఁ బొడతెంచె నద్దాని నుడువుటయు నాతలంపు – కావున సహకారంబునుగుఱిచి యించుక వివరించుట కిది యదనుగా నెంతు – నీనాఁ డలీసోదరులు ఖిలాఫత్తుదెసఁ దీవ్రప్రచార మొనరించు వారైరి – మహమ్మదీయు లహింసాశాంతుల నెంతదనుకఁ బాటింప నోర్తు రని యే నబ్దుల్‌బారీ మున్నగు నులేమాలకడఁ జర్చించితిఁ – దాత్కాలికమ్మగు నొదవుబడిపొంటె నొకమేరవఱకు నీధర్మువులం బూన నిస్లాము ముస్లిముల కాఁకచెప్ప దనియు నవధరించిన యహింసావ్రతము నధఃకరింపఁ బోలదనియు నప్పండితులు తేల్చిరి – పదంపడి ప్రయాగమునంగూడిన ఖిలాఫత్తు మహాసభం దర్జనభర్జనము లైనపిదప నసహకారనిర్ణయ మూరీకృతం బయ్యెఁ – నసహకారము శాంతిసంపన్నము దుశ్శకము నవి హకీంసాహెబు సందియంపడియెఁ – గాని కొన్నాళ్ళలో న య్యన్నసంశయము నివృత్తం బాయె – నవ్వల నమ్మేటి మనసార దేశమున కూడిగం బొనరించె – నీజతనంబున కీసాహె బొనరించినబాసట విలువకట్టరానిది – తదనంతరంబ 3

గీ. రాజకీయసదస్సు ఘూర్జరమునందుఁ, బొసఁగ నద్దానఁ జేర్చితి నసహకార
నిర్ణయం; బది పరిషత్తు నర్ణవంబు, వోలె ఘూర్ణిల్లఁజేసె గగ్గోలు రేఁపి. 4

క. ఈ తీర్మానము భారత,జాతీయసదస్సుముద్ర సాధింపనినాఁ
డేతాదృక్షసమజ్యల, కేతేరంజెల్ల దనిరి యెద్రిచిన పెద్దల్. 5

క. చెల్లునని రాష్ట్రసభ కిట,నిల్లిగ్గులఁ దోఁగుబెడఁద యే లని కాంగ్రెస్
తల్లికి మనముందదుగునఁ, బె ల్లగునని యేను విన్నవించితి రచ్చన్. 6

క. అంతట సభ్యులు బహుధా, చింతించిరి పూర్వపక్షసిద్ధాంతములన్
శాంతిమెయిం దీర్చిరి నా,వంతునకేపెక్కుమంది వచ్చిరి తుదకున్. 7

క. వల్లభుఁడు రాష్ట్రపరిష,ద్వల్లభుఁ దబ్బాసు గాసిపడి సహకారం
బొల్లని యీనిర్ణయమును, జెల్లించిరి సేవనప్రసిద్ధుల్ శుద్ధుల్. 8

వ. ఏత న్నిశ్చయమునందలి మేలుగీళ్లు పరికింప వేయితొమ్మన్నూట యిర్వదియవ సెప్టెం బరునెలం గాళీఘట్టమున లాలాలజపతిరాయి పెద్దతికమున భారతజాతీయ మహాసభా ప్రత్యేకసమావేశ మావహిల్లె – నిందుల కుదాత్తసౌకర్యము లనేక మేర్పడియె – బంబయి వలన ఖిలాఫత్తువారియుఁ గాంగ్రెసువారియు వెవ్వేఱు పొగబండ్లు వెడలెఁ – బ్రతినిధు లయు దిదృక్షువులయు నొత్తడి యేరాళమై కలకత్తానగర ముఱ్ఱట్లూఁగఁజూచె – మౌలానా సౌకతాలీకోర్కిపై ధూమశకటమునందేను సాహాయ్యనిరాకరణ నిర్ణయ ప్రథమాకృతిం దీర్చితి – నగ్గడియదనుక నాప్రాసిన చిత్తుతీర్మానముల శాంతిమ యేతి శబ్దప్రయోగ మొనరింపనైతి నని పల్కంజనుఁ – గాని నా వెలువరించు నుపన్యాసములం బెక్కింట దీని సంధించితి – నీ నిరోధమునకుం జెందినపదజాల మస్మదీయాంతరంగమునం దింతవట్టు పాదుకొనకుండె – మహమ్మదీయులుమాత్రము యిరవుపడ్డ రచ్చలం దీ శాంతిమయంబను సంస్కృతశబ్దమున కెనయగు నురుదూనుడిం బ్రకటింప నోదు చుంటి – నగుటంజేసి మౌలానా యజాదు నేనాశ్రయించుదు నమ్మనీషి మూర్ధన్యుఁడు 'బా–అమన్' అను నుడుగుం దనకుఁబ్రసాదించె మఱియు నసహాకారమునకుం బ్రతి 'తర్క్ – ఈ – మవాలత్' అని బోధించె – ని ట్లేను సాహాయ్యనిరాకర ణోద్యమమున కనుకూలించు పరిభాష నురుదూ హిందీ గుజ్జరిబాసలం బరిశీలించుతతి జాతీయమహా సభ కసహాకారనిర్ణయముం దీర్చుపని నాపాలి దాయె – దాని మొదటిచిత్తులో శాంత్యర్థ వాచి యగుమాట చేరదయ్యె – నట్టిప్రాయసము నాపెట్టె నేతెంచు సౌకతాలీ కొసంగి రేప్రొద్దునం బొరపాటు నెఱింగితిఁ–దీర్మాన మచ్చుపడకముంద యీతప్పుం దొలఁచి ప్రకటింపు మని యాలీకడకు దేశాయితో వర్తమాన మంపితిఁ – గాని తత్పూర్వము సలోపముగా నది ముద్రిత మ్మాయె – నాఁటిమాపునంద విషయనిర్ణాయకసభ కూడఁ గలదు – కాన నవ్వేళ రాకముందె ముద్రితపత్రములం దెల్ల నుల్ల శాంతిమయ శబ్దముం జేర్చుట వలసె – సంస్కృతమైన చిత్తుతో మున్ముం దేను సిద్ధపడకున్ననాఁ డెన్నేని చిక్కులు నాపాలివైయుండెడివి – కాని 9

మం. చిత్తు రచ్చను జయించిననాఁడు గాక, యగునొకో పందు వి ల్లలికినంతటన
నానిర్ణయము నభినందించువార, లీసభాసదులలో నెంద ఱున్నారొ

యెదిరించి నిలుచువా రెంద ఱున్నారొ, యధ్యక్షుఁ డేవారి కనుకూలుఁ డౌనొ
యేమి కానున్నదో యెఱుఁగ నింతేని, విదుషీమణి బిసెంటు విద్వత్ప్రపంచ
మండనంబై వెల్గు మాలవీయుండు, దేశబాంధవుఁడు మోతీలాలు విజయ
రాఘవాచార్య పురస్సరుల్ వృద్ధ, వీరు లందఱు నేఁడు విడిసి యున్నారు
శూరు లందఱు నేఁడు చొచ్చి యున్నారు, ధీరు లందఱు నేఁడు తెరలుచున్నారు. 10

సీ. పాంచాలమునకు నేల్బడివా రొనర్చిన, పాపకృత్యము చక్కబడుటకొఱకె
ముస్లిముల్ వెట్టలో మునుఁగ ఖలీఫాకుఁ, గూర్చినబన్నముల్ కూలుకొఱకె
సహకారవిముఖ మౌ సరణి గమ్యం బని, యాదెడితీర్మాన మస్మదీయ
మాచార్యులకుఁ బేదదై చప్పచప్పని, దై యసంతృప్తికి నాలవాల
గీ. మగుట నద్దాని కిద్దాని కని వచింప, నేల ఘోరాపచార మీనేలకున్ స్వ
రాజ్య మీకుంట కానఁ దద్రాజ్యమునకె, వలయు నీయద్దు భారతీయులకు ననిరి. 11

క. మోతీలా లాచార్యుల, నీతిన్ గొనియాడె నంత నెఱజోదుల వా
గ్రీతిన్ స్వరాజ్యపద మిడి, నాతీర్మానమును మార్చినాఁడను సరగన్. 12

ఆ. నిశిత దీర్ఘ చర్చ నిండినపిమ్మట, నస్మదీయనిర్ణయంబు నెగ్గె
మోతిలాలు మొట్టమొదటివాఁడై నిలం,బడియె నాఁటి తర్కపద్యలోన. 13

క. తీర్మానము సముచిత మని, యోర్మిం బాయక సద స్సహో యన మారం
దోర్మలు నటింప నబ్బుధుఁ, దర్మిలిఁ బల్కినవచస్సు లవి నే మఱవన్. 14

గీ. అమ్మహామహుచిత్తంబు ననుసరించి, సవరణల్ కొన్ని వెలసె నిశ్చయమునందుఁ
జిత్తరంజనుమెప్పు లార్జించుపొంటె, మిగుల గాసిల్లె నమ్మేటిమగఁడు నాఁడు. 15

క. దాసునకు నిరాకృతియెడ, నాసక్తి జనించెఁ గాని యద్దానిఁ బ్రజల్
మోసెదరా భీరుత్వముఁ, ద్రోసెదరా యన్నశంక తొడరెన్ దడమై. 16

క. లాలా లజపతిరాయలు, నీలోకార్చకుఁడు సంశయింపక తమ యీ
కోలుం జూపిరి నాదెస, మే లెంచిరి నాగపురసమీచీనసభన్. 17

గీ. బాలగంగాధరుండు నాఁ డోలగమున, లేమిఁ గనినంత నాదుఃఖ మాముకొనియె
నుత్తమశ్లోకుఁ డాయొజ్జ యుండునేని, కొంకు విడి నాకు దీవనల్ కురియువాఁడు. 18

గీ. లోకమాన్యుఁడు నాబాట కాఁకసెప్పుఁ, గాక నాపాల నది తుష్టికరమ కరము
తన్మనీషి వెలార్చు వాదమునఁజేసి, నేర్చికొనువాఁడఁ బ్రన్ననినేర్మి కొంత. 19

క. మాకున్ మతభేదమ్ములు, రేకెత్తును గాని వానిరీతులు మధురల్
మాకూర్మి యుత్కటం బని, లోకస్తుతుఁ డతఁడు నిచ్చలుం దలఁపించున్. 20

గీ. అకట! యీపల్కులను వ్రాయునపుడు నాదు, ముంగడందోఁచు గురుని కన్మూయుచాయ
వార్తయిది మిత్రుఁడౌ పటవర్ధనుండు, నాచెవిం జేర్చె వగగూర్చె నడికిరేయి. 21

క. నాకేదెము తెగి పడె నను, వా కష్టుద వెడలె నాదువాత నవశమై
నాకెలఁకులఁ గల సహచరు, లాకులతన్ మునిఁగి రుగ్ర మాపద యనుచున్. 22

వ. సాహాయ్యనిరాకర ణోద్యమం బపు దపుడ రూపుకట్టుటంజేసి దాని కోజస్తేజోదాయకం బగు నాశాసన మక్కర్మయోగీంద్రువలనం బాఱుతెంచు నని యెదురుతెన్నులుసూచు నేను దుద కి ట్లైతి - బాలగంగాధరుఁడు సజీవుఁడై యుండునేని యీనిరోధముపట్ల నమ్మహామహునాశయం బెట్లుండు నయ్యది దైవంబ యెఱుఁగుఁ - గాని యానాఁడు కాళీఘట్టమునందలి యెల్లగుండియపైఁ గొండవ్రాలె ననంజను - జాతీయచరితం దలయెత్తిన క్లిష్టదశ నమ్మేటియుపదేశంబు దేశమునకుం గఱ వగుట యందఱకుం గుందు గూర్చె. 23



# 43 నాగపురమున

క. కొలఁది యిదరానిపజతో, వెలగల కాంగ్రెస్సు చిలువవీటన్ వెలసెన్
గలకత్తానిర్ణయ మది, బలపడు నీ నాగపురసభారంగమునన్. 1

క. ప్రతిభూసంఖ్యకు నాఁ డొక, మితి లేనికతాన మాతృమేది న్యార్తి
క్షతిఁ గోరుచు విచ్చేసిరి, వితతాత్ములు పదియునాల్గువేల సదస్యుల్. 2

క. లాలాలజపతిపల్కున, కొలెమ్మని దాసుమాట కాదర మిడి వి
ద్యాలయములతీర్మానము, పోలన్ సవరించి రచ్చపొంగులు గంటిన్. 3

వ. కొట్టకొసకు వాదప్రతివాదంబులు ఉడిగినవెన్క నహింసాబద్ధమగు సాహాయ్యనిరాకరణ నిర్ణయం బెల్లర యురరీకృతిం బడసె - నేతన్మహాసభకు విజయరాఘవాచార్యు లధ్యక్ష పాదులై నిల్చిరి - నిరాకరణప్రస్తావ మైనపదంపడి కాంగ్రెసునియమావళిన్ దిద్దుటె ట్లనుచర్చ యారబ్ధమాయె - నిప్పట్ల నా కావించినచిత్తుఁ బరిషత్తుముం దునిచితి - మహాసభకుఁ బదునైదు వందల ప్రతిభువు లున్నం జాలునని యేను సూచింప నిర్ణేతృ మండలి యాఱువేలమంది వలయునని తేల్చె-నిది ముంజూపులేనిపని యని యానాఁ డేను భావించితి - నీతలంపు నేఁటికే నట్లయున్నయది - మంది హెచ్చుటంజేసి కార్యక్రమంబు చక్కసాగునని, ప్రజాస్వామ్య మపుడు సార్థకం బగుననియూహించుట భ్రాంతి యని పల్క నోర్తు - స్వయంసృష్టులగు ప్రతినిధు లాఱువే లుంటకంటె నుదారాశ యులు ప్రజాధికారధూర్వహులు, లక్ష్యభూతులు నగు వారు పదేనువంద లున్న నాఁడు ప్రజాతంత్ర మవిచ్ఛిన్నముగా సాగు - దానిం బూనుటకుఁ బ్రజలయం

దొరిమయు నాత్మగౌరవమును, స్వతంత్రతయు నేర్పాటు వలయు - నుత్తమాచారులు,
సత్యారాధకు లగువార తమపూఁటకాఁపులుగా నుండునట్లు దేశీయులు కనుగల్గి యునికి
వలయు - సంఖ్యా వ్యామోహ మున్నదే నాఁటివే లనుగిఁతగియం బనియేమి - యెన్ని
వేలకైనం దా వొసఁగ వచ్చు - నయ్యది యట్లుండె. 4

మ. జాతీయపరిషత్తు సాగించుపనుల, దేశంబునకు స్వేచ్ఛ దెచ్చుట యొకటి
పెత్తనం బబ్బినపిదప నిప్పుడమి, సామ్రాజ్యభాగమై సరితూఁగవచ్చు
వలయుచో వేర్పడవచ్చు నెప్డేని, నేమ మీరీతి నిర్ణీతమై యుండ
మదనమోహనుడు ధీమన్మౌళి నేఁడు, సర్వస్వతంత్రత చనదు నాఁ దొడఁగె
నతనికి జిన్నా సహాయుఁడై నిలిచె, నొక రిద్దతే దీని కొప్పిరి గాని
ప్రతినిధుల్ పెక్కు రీబాట కాదనిరి, సత్యంబు వదలకు శాంతి గోల్పోక
సాధింపఁదగు స్వరాజ్యము నన్నసూత్ర, మక్కఱలేదు పొ మ్మని రంతఁ గొంద
ఱాధార మీధర్మ మనియె నోలగము, హిందువుల్ ముస్లిము లేకీభవింప
మాలమాదిగలపై మన్ననఁ జూప, రహటలక్ష్మి సమర్చాదీక్షఁబూనఁ
దగువిధుల్ వెడలె నత్తఱి మహాసభను, నిర్భరోత్సాహమ్ము నిండెఁ గొల్వునను. 5

క. ఆగంటనుండి కాంగ్రెసు, లోఁ గలహిందువులు ధర్మలుబ్ధాశయులై
సాగిరి జనపదములకున్, మూఁగిరి యస్పృశ్యతాసముద్ధతి నార్పన్. 6

క. ఆనాఁటినుండి రాటపు, గానంబులు పెంచి నించి కాంగ్రెసువారల్
దీనులకుం గొటగొటమను, ప్రాణంబులు నిల్పి రాష్ట్రబంధువు లగుచున్. 7

గీ. ఆగడియనుండి తోడుపా టాఁగి ప్రభుతఁ, గేరడింపఁగఁ దెగిరి కాంగ్రెస్సువారు
తిరుగుపా టిది తనకు నుద్దీప్తి నొసఁగ, ముమ్మరించె ఖిలాఫత్తుమొగ్గరంబు. 8

క. హిందువులకు ముస్లిములకుఁ, బొందిక లానాఁడు మూరిఁబోయెను గాంగ్రెస్
సంధించినపనులం దభి, నందింపఁగఁ దగిన దిది యనంగలవాఁడన్. 9



# స్వస్తి

గీ. ఏతదాత్మకథాసృష్టి కిపుడు నేను, స్వస్తి పల్కుముహూర్త మాసన్న మయ్యె
నస్మదీయను జీవనయాత్ర నింక, నన్యు లెఱుఁగనిగాథ కాసంత లేదు. 1

వ. అదియుం గాక వేయితొమ్మన్నూట యిరువదియొందగు వత్సరముందొట్టి కాంగ్రెసు పెద్దలతో నోతప్రోతమ్ముగాఁ బెనఁగంబడి యేను బ్రజాసేవ గావించినవాఁడ-నాఁటం గోలె నాబ్రతుకునందలి దేలేశ మందుకొన్నఁ దన్మహారథులతోడి పొత్తు వెలార్చుట తప్పనిపనియగు - దానిచేరిక లేనిమ్రాయసము యథార్థరచన కాఁజాలదు - కాంగ్రెసు నాయకులకుం దనకు నేర్పడ్డచుట్టతికము లింతవట్టు బ్రాఁబడవాయె - శ్రద్ధానందస్వామి చిత్తరంజనుదాసు లాలాలజపతిరాయి హకీంసాహెబు మన కీనాఁడు దవ్వయినను భగవ దనుకంపకతనం బ్రజానేతలు పెక్కండ్రు కలరు - జాతీయమహాసభా చరిత్రమునఁ బరిణామమ్ములు పెల్లు వాటిల్లినమాట నిక్కంబ-కాని యని యింతదనుకఁదిరపడవయ్యె నేదేండ్ల నుండి నా కావించు ప్రధానప్రయోగము లన్నియు నేతన్మహాపరిష త్పక్షము నన ప్రవర్తిల్లెఁ - గానఁ దద్విశేషములం దెలుపునెడ నాకును గఱువలకును గల బాంధవముం బ్రకటింపఁదగు - నౌచిత్యమును బాటించి దీనిజోలి కిపు డే నేగ నొల్ల - వెండియు నేఁడు కావించుప్రయోగము లస్మద్దృష్టిలో సిద్ధాంతములు కాఁజాలవు - కావుటంజేసి 2

క. ఈకృతి నిఁక విరమించుట, నాకృత్యం బని తలంచినాఁడను బయనం
బాఁకట్టఁదగుఁ జుమా యని, నాకల మెచరింప సాగినది పలుమాఱున్. 3

క. ఇన్నాళ్ళనుండి మత్కథ, మన్నించి పఠించు బుద్ధిమంతులతో నేఁ
దన్నలు! సెలవిం డిఁక నను, చు న్నుదువుట కేను మిగుల స్రుక్కంబడుదున్. 4

క. వెలకట్టరాని దని నా, తలఁపునకున్ మత్ప్రయోగతతి కన్పట్టున్
దెలివిన్ వానియథార్థము, పలికితినో లేదొ యంతుపట్టదు నాకున్. 5

క. తెరచాటునఁ బెట్టక నా, పరికించినగుట్టు బట్టబయ లగురీతిన్
విరచించినాఁడ నేత, చ్చరితం బని పల్కనోర్తు సవినయఫణితిన్. 6

క. ఏతెరువున నేరూపునఁ, జూతున్ సత్యమును దానిచొ ప్పంతయు నేఁ
డాతెరువున నారూపున, నేతత్కృతిఁ బల్క నుత్సహించితి సతమున్. 7

గీ. సత్యమునకు నహింస కాసక్తు లగుదు, రన్నవిశ్వాస మొదవుట నస్మదీయ
మీప్రయోగచరిత్రంబునిడితి నాదు, చదువరులముందు మచ్చిత్తశాంతి వెరుఁగ. 8

వ. సత్యంబ కాక లోకంబు నేలువేల్పు వేఱొండు కలదని వక్కాణింప నాయనుభూతి సైఁపంజాలదు - దానిం గాన వలచువాని కహింసయ రాచబాట యని యీపొత్తమునం దెల్లపొరటయు నిర్ధరింప నేరనినాఁడు నాకావించినచేఁత యిది రిత్తకురిత్త యని యెంతు - నాజతనంబెల్ల నాఅడియగుంగాక నానిర్ణయం బట్లు కాఁబోవ - దింత చెప్పితిఁ గాని నాపరమవ్రతం బగునహింస నేఁటిదనుకఁ బరిపాకముం బడయక సమగ్రంబు గాక యున్నయది - కాన 9

క. ఇన్నాళ్ళంగొలెనెన్నో, జన్నంబుల నుగ్రతరతపస్సుల నా క
న్గొన్నయది సత్యభాస్కరు, సన్ననివె ల్గొకఁడ యనెద జగమునవ్రోలన్. 10

ఆ. ఏమి సెప్పువాఁడ నీసత్యఖద్యోతు, వెలువరించు వెలఁదివెలుఁగుఁగూర్చి
మనకు గోచరించుమార్తాండు లొకలక్ష, కూడుకొన్న దాని కీడు గారు. 11

గీ. నరుఁ దహింసాతపశ్చర్య విరిసి పండి, నపుడె సంపూర్ణసత్యంబు నంద నేర్చుఁ
బెద్దకాలంబు వెదకినపిదపసైత, మిట్లు వాక్రుత్తు నభిమాన మింత లేక. 12

ఆ. ఎల్లయెడల నిండి యేపారు సత్యనా,రాయణుని గనంగ నాస్థ యున్నఁ
దన్ను గారవించుకొన్నట్ల ప్రేమింప, వలయు సర్వభూతముల జనుండు. 13

మ. సత్యసందర్శ నాసక్తి పైకొన్న, మనుజుండు విశ్వంపుమనుగడలోని
యేరంగమునకైన నెడమొగం బిడఁడు, దవ్వులన్ నిలువఁ డేదారికినైన
నగుటన రాజకీయక్షేత్రమునకు, నన్ను నాకర్షించినది సత్యభక్తి. 14

క. మతమునకు రాజనీతికి, శ్రుతికలియ దటంచుఁ గొందఱు వచించెద రా
గతిఁ బల్కువారికిన్ మత, మతి శూన్యం బనెదఁ గొంకుమానెద నిచటన్. 15

ఆ. మదివెలందిలేని మనిసి తన్నుంబలె, నితరభూతముల సమీక్ష కోదు
నది కొఱంతపద్దయతఁ దహింసాఖరం, బూనలేఁడు ముక్తి గానలేఁడు. 16

వ. ఆత్మనైర్మల్యంబు నా జీవితరంగమునం దెల్ల దెసలుం బ్రసన్నము లగుట యని వక్కాణింతు - నేవాని కీపావిత్ర్యము సమగ్రంబుగా నొదవు వానివెలుఁగునంజేసి పరిసరము లన్నియుం గామక పరిశుద్ధమ్ములగుఁ - గాన నివ్వెలంది తెమ్మెరవోలె సర్వవ్యాపి యనం జను - నీశుద్ధిమార్గ మేటవాలుగా లేక యేదూకమ్ము నట్లు నిట్టనిలువుగా నుండ నధిరోహణం బంతలంతల వసపదం జాలదు-నైర్మల్యముం బడయవలె నన్న మనోవాక్కాయముల నిర్వికారత గుబాళింప వలయు - రాగద్వేషాదిద్వంద్వముల కవ్వల నిలువం గలనేర్పు చేపడ వలయు - నెన్నాళ్ళ నుండి యెంతబెడిదంబుగా శ్రమించిన నేమి యిందనుక నాకుం ద్రికరణశుద్ధి నిండారలే దని యెఱుంగుదు - నగుటంజేసియు

లోకంబు న న్నభినందించుపట్ల నుత్సాహముం బడవక నొగులుం గుదుతు - మఱియు **17**

క. కత్తులతోఁ బోరాడి జ,గత్తును లోఁగొనుటకంటెఁ గట్టరిది కదా
చిత్తమును మానిసి నిజా,యత్తముఁ గావించుకొంట యని భావింతున్. **18**

క. మాతృమహీమండలమున, కేతెంచినవెన్కనైత మే సిగ్గిలుదున్
నాతెలియనివికృతులు మ,చ్చేతస్సున దాఁగియున్న చిన్నెలు కనుచున్. **19**

క. అగుఁగాక పిఱికితనమున, కగపడకున్నాఁడ సంతతాభ్యాసమునన్
దెగకుండెనె విభ్రాంతులు, మగతన మంతంత హెచ్చి మల్లడిపెట్టన్. **20**

క. నిక్కంబు నొరయుపనిలో, నెక్కుడు తనిసనితిఁ గాని హేరాళాగ్నుల్
క్రక్కెడితెరు వున్నది ముం, దక్కతనన్ శూన్యభావ మది హెచ్చవలెన్. **21**

ఆ. ఎన్నిమెఱుఁగు లున్న నన్నిటికంటె నే, నలఁతివాఁడ నన్న తెలివి నరున
కబ్బ దెంతదాఁక నందాఁక వానికిఁ, జిక్కఁబోదు ముక్తి దక్కఁబోదు. **22**

క. ఈ వినయప్రాప్తికిఁ బర,మావధి నాఁ దగు నహింస; యవ్వినయము లే
కేవాఁడును ముక్తుఁడుగాఁ, డీవాకున కనుభవంబ హేతూద్ధ మగున్. **23**

క. ఏతాదృ గ్వినయమునకు, జోతలు చెల్లింతు నిట్టిసుగుణము నేలన్
జూతునుజగదాదృతి; నీ, చేంత నిఁకన్ నిలిపి స్వస్తిసెప్పెద నెలమిన్. **24**



క. నీపల్కులు విశ్వతమో
దీపంబు లఖండసత్యధీ రూపంబుల్
నాపల్కుల నిడి నేఁటికి
బాపూజీ! శాంతిపట్టభద్రుఁడ నైతిన్.

ఉ. ముప్పదియేండ్ల నుండి తృణమో కణమో తినుచున్నవాఁడ నో
యప్ప! భవద్వచోవిభవ; మన్యుఁ డెఱుంగకపోవుఁ గాక యీ
యప్పు భరింపరానిబరువై నిను నచ్చుపుఁ డెల్లబాస నీ
చొప్పునఁ దీర్చుకొందు ఋణశుద్ధి కిదే సరిపుచ్చుకొందువా?

ఉ. కా దని పట్టుపట్టెదవుగాక మదిన్ నెఱవేర్పులేని యీ
పేద నిరంతరోగపరిపీడల దస్సి నలంతి ప్రాయపుం
బాదులుసైతమున్ గదలఁబాఱి నతం డెది సేయనోపుఁ దం
డ్రీ! దయఁజూడు మిప్పటి కిదే పదివేలుగ; దోయిలించెదన్.

వికృతి పుష్య బ 3 శుక్రవారము
1951 జనవరి 26

అభినవతిక్కన
తుమ్మల సీతారామమూర్తిచౌదరి